కొందఱు వర్తకులకు తమ కమసాలి యాతడనియెఱుగుట సాధ్యము కాదని వాదింతురు. అది పొరబాటు. వాడుకపడియున్నవారికంటె వర్తకులకు జ్ఞాపకశక్తి యెక్కువగలదని వారు తెలిసికొనవలెను. ఈ తరగరులకు కమీషను, యితరసెలవులు మీరే భరించుకోవలెను. కాని వర్తకులు ఇయ్యరు. కాబట్టి ఇట్టి మోసగాండ్రగు వర్తకుల మోసమునకు మీరు లోబడకుండ చూచుకొనుడు. మీకు యితరుల దాక్షిణ్యము లేకయే మిగుల లాభముగా వజ్రములను కొనుట కొకమార్గము గలదు. ఒక్కటే ఖరారువెలకు విక్రయించు వర్తకునియొద్దనే కొనుట మీకు చాలలాభకరము. మీసామర్థ్యము నక్కడచూప నవసరములేదు. ఇట్లుకాక బేరము చేసికొనవచ్చునని తలచితిరేని అదృష్టవశమున నెప్పుడైన ఒకసారి లాభకారి అయినను చాలమాఱులు మీరు మోసపోయి నష్టమును పొందుట నిశ్చయము. ఖరారువెలకు అమ్మువారియొద్ద తంత్రములు, టక్కులు, మోసములు లేనేలేవు. అందఱికి ఒక్కటేవెల. ఎవరయిన సులభముగా కొనవచ్చును. మీ యిరుగుపొరుగువారు యిచ్చువెలనే మీరును యీయవలసియుండును. కొంచమైనను వ్యత్యాసములేదు. మీరు నేరుగానే వచ్చి కొనవచ్చును. తరగరులకు శ్రమనిచ్చి సొమ్మును ఖర్చుపెట్టుకొన నక్కరలేదు. ఇట్లు చేయుటచే నిశ్చయముగ మీకు లాభము గలుగును. ఇట్టివర్తకు లెవరో తెలియునా?

## మెస్సర్సు సురాజ్‌మల్ లల్లూభాయి కంపెనీవారే.

వజ్రములకు ఒక్కటే వెలను చెప్పెదురు. వీరు వజ్రవ్యాపారమున మోసము చేయరు. ఆకంపెనీవారు మేమే. మీరు మీకు కావలసిన మాదిరి నగలను, వానికై మీరు వెచ్చింపదలచిన మొత్తమును మాకు తెలిపిన చాలును. మీరు యిచ్చెడి మొత్తమునకు యెంత మేలైనవస్తువులను పొందవచ్చునో అంత మేలైనదానిని, మాయొద్ద పొందగలరనుట సత్యము. దయచేసి పై కనుపరచిన విషయమును చదివి గ్రహించి తరువాత మీకు యెక్కడ నమ్మక ముండునో అక్కడ వజ్రములను కొనవచ్చును.

# సురాజ్‌మల్ లల్లుభాయి అండు కంపెని

## ప్రధాన వజ్రవర్తకులు

| బొంబాయి | కలకత్తా | రంగూన్ |
|---|---|---|
| 225, కాల్బదేవిరోడ్డు. | థాకోర్‌లాల్ హీరాలాల్ కంపెని. | 14, మొగల్ వీథి. |

12. లాల్‌బజారు,

మెర్కంటైల్ బిల్డింగ్సు.

**113, ఆదియప్పనాయక వీథి,** (సావుకారుపేట, తపాలాఫీసుదగ్గర) **మదరాసు.**

శ్రీ

# ప్రస్తావన

శ్లో. ఓన్నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే, నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీమన్మహాదేవుని యాజ్ఞానుసారముగను ప్రవర్తమానంబైన మహాప్రవృత్తియందు క్షణకాలమునందైనను విశ్వమునందు ప్రవర్తమానంబగుచున్న ప్రవృత్తి సంభావనమును చేయుట దుస్తరము. బ్రహ్మాండభాండ భరితములైన గోళములు, గ్రహనక్షత్ర తారాగణములు, మహాభూతములు, చరాచరములు, పంచవింశతి తత్త్వములు విశ్వకల్యాణమునం దాత్మానంద సాధనమును నిరంతరము బోధించుచున్నవి. నిత్యనైమిత్తికవిషయములందు నయితము విశ్వకల్యాణమును సందర్శించుచు బ్రహ్మానందమును బడయుటయే జీవితపరమార్థము. మమకారాహంకారములు విశ్వకల్యాణసందర్శనమునకు ప్రతిబంధకములై బ్రహ్మానందానుభవమును దుర్లభముచేయుచున్నవి. మమకారాహంకారములు ప్రవృత్తికనంతములైన ప్రాకారావరణములను గల్పించుచు దివ్యకల్యాణసందర్శనమును దుర్లభము చేయుచున్నవి. జీవితలక్ష్య మనిత్యములైన ప్రాకారావరణములందు లగ్నమై నిత్యమైన పరమార్థసందర్శనమునందు లగ్నముగాకున్నది. స్వప్రయోజనారాధనపరాయణత్వము స్వకపోలకల్పితములైన ప్రాకారావరణములను విశాలముచేయుచు పరమార్థసందర్శనమును సంకుచితము చేయుచున్నది. స్వార్థారాధనబద్ధమైన మానవలక్ష్యము సంరంభసంక్షోభములకు మూలమై విశ్వకల్యాణసందర్శనమునందు లగ్నముగాకున్నది. వ్యక్తులు, కుటుంబములు, కులములు, సంఘములు, జాతులు స్వార్థారాధనపరత్వమును బూనుటవలనను విశ్వకల్యాణసందర్శనము దుర్లభముగనున్నది. భాగ్యారాధనాయత్తమైన పాశ్చాత్యబలప్రాబల్యము ప్రపంచమును లయావస్థకు బలవంతముగ నాకర్షించుచున్నది. ఈమహాపరివర్తనసమయమునందు సకలజనులును, జాతులును విశ్వకల్యాణమునకు గాంధిమహాత్ముని యుపదేశానుసారముగ నాత్మోద్ధరణసాధనమును బూని పరమార్థమును బడయుదురుగాత!

* * * *

శ్రీపరమేశ్వరాజ్ఞానుసారముగను కాలచక్రమునందొకయేడు గతించినది. సృష్ట్యాది ౧,౯౫,౫౮,౮౫,౦౨౬ సంవత్సరములు గతించినవి. కలియుగాది ౫౦౨౬ వర్షములు ముగిసినవి. ప్రభవాదివత్సరములు ౫౮ నిండినవి. ఇకారాంతవర్షసప్తకమున తుదిసంవత్సరమగు రక్తాక్షి సంవత్సరమును గతించినది. గత సప్తకవర్షసంజాతఫలమైన క్రోధన సంవత్సర మారంభమైనది. మహాసంక్షోభారిష్టములకు మూలములైన గుడివర్షములందు దైవానుగ్రహము వలనను రక్తాక్షివర్షము సౌమ్యముగను ముగిసినది. క్రోధనసంవత్సర మారంభమైనది. ఇకారాంతవర్షములందు కాళయుక్తికి శుక్రుడు, సిద్ధార్థికి కుజుడు, రౌద్రికి రవి, దుర్మతికి శని, దుందుభికి బుధుడు, రుధిరోద్గారికి సూర్యుడు, రక్తాక్షికి శనియును నేలికలై ప్రపంచప్రవృత్తియందు మహాసంక్షోభమును గలుగజేయుచున్న విధమును గతవర్షముల వృత్తాంతము విశదము చేయుచున్నది. గతవర్షఫలసంజాతమైన క్రోధనసంవత్సరము సహజశీలమును వదలి సౌమ్యస్వభావమును గలిగి లోకకల్యాణమున కనుకూలపడుటకు భగవదనుగ్రహము గలుగును గాత!

* * * *

క్రోధనసంవత్సర ఫలమును కాలగర్భము ప్రసవింపగలదు. క్రోధనసంవత్సరమునకు బుధుడు రాజు, నీరసాధిపతి, పరీక్షకుడు; ఫలము: మధ్యవృష్టి, రాజకోపము, అపరసస్యాభివృద్ధి, వాయుప్రకోపనము, ధాన్యాభివృద్ధి, రత్నవృద్ధి, పరీక్షాసౌఖ్యము, ప్రజలకన్యోన్యమైత్రి; చంద్రుడు మంత్రి,

క్రోధన సంవత్సరము

గ్రామపాలకుడు; ఫలము: సువృష్టి, సస్యసమృద్ధి, చోరహీనత్వము, ప్రభువుల సత్యపాలనము, వృక్షఫలసమృద్ధి; సూర్యుడు సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, దైవజ్ఞాధిపతి; ఫలము; ప్రభువుల కన్యోన్యవైరము, జలరహిత మేఘములు, రక్తధాన్యసమృద్ధి, అనర్ఘము, అల్పవృష్టి, క్షుద్బాధ, రాజులకన్యోన్యకోపము, మహాభయము, స్వల్పవర్షము, రక్తధాన్యసమృద్ధి, విప్రుల కర్మాచరణము, రక్తభూఫలసమృద్ధి; గురువు సస్యాధిపతి, పురోహితుడు; ఫలము: యవ, గోధుమ, చణక, ఫలవృద్ధి, పీతధాత్రీఫలాభివృద్ధి, ప్రజారోగ్యము, గోక్షీరసమృద్ధి; కుజుడు ధాన్యాధిపతి; ఫలము: శూకధాన్యాభివృద్ధి, రక్తభూమి సాఫల్యము; శని రసాధిపతి; ఫలము: మధ్యవృష్టి, సస్యమాంద్యము, రసక్షయము. పశుపాలకుడు బలరాముడు; ఫలము: సస్యతృణసమృద్ధి, సువృష్టి, మధ్యదేశమునందు సుభిక్షము. సంక్రాంతిపురుషుని అజవాహనారోహణ ఫలము: తృణాది సర్వసస్యాభివృద్ధి.

క్రోధనసంవత్సర సామాన్యఫలము:—

శ్లో. క్రోధనాబ్దే మధ్యవృష్టిః పూర్వసస్యం నతు క్వచిత్,
సంపూర్ణ మితరం సస్యం సర్వే క్రోధపరా జనాః.

పరమేశ్వరుడు క్రోధనాబ్దమునందు బుధరాజ్యాధికారమునందు ప్రపంచమునకు శాంతిసౌఖ్యములను ప్రసాదించి రక్షించుట కనుగ్రహించుగాత!

భగవదనుగ్రహము వలనను ఆంధ్రమహాజనుల యాదరణ సహాయమువలనను క్రోధన సంవత్సరాది సంచికను సకాలమున నాంధ్రలోకమునకు సమర్పింపగలిగినందులకు వందనంబు లర్పించుచున్నారము. క్రోధనసంవత్సరాది సంచికతో పదునాలుసంవత్సరాది సంచికల నాంధ్రలోకమునకు సమర్పింపగలిగితిమి. ఆంధ్రపత్రికలును, సంవత్సరాది సంచికలును దేశపరిస్థితులకు దగినరీతిని క్రమవికాసమును బొంది స్వధర్మనిర్వాహణమును శేయుచున్న విధమును పత్రికా సంచికల సింహావలోకనము విశదము చేయుచున్నది. ఈ క్రోధనసంచికయందు ముద్రితమైన వ్యాసము లీవిషయమును పరిస్ఫుటము చేయుచున్నవి. శ్రీయుత సత్తెనపల్లి హనుమంతరావు గారు సంవత్సరాది సంచికలనుగురించివ్రాసినవ్యాసము ముఖ్యముగా సీవిషయమును విశదముచేయుచున్నది. వంగ హృదయమును కలవరపఱచినవంగరాష్ట్ర విభజనము భారతహృదయమునందు ప్రబోధోదయమును గలుగజేసినవిధమును దేశచరిత్ర అనంతవిధములను చాటుచున్నది. రుష్యా, జపాను రాజ్యములసంరంభమునందు జపాను విజయములో నాసియాఖండ ప్రబోధ ముదయించినది. ఆసియా భారతీయ ప్రబోధములతో ప్రపంచచరిత్రమునందు నవయుగారంభము గలిగినది. పాశ్చాత్య బాహుబలాతిశయమునందు విశ్వాసమంతరించినది. ప్రాచ్యదేశములం దాత్మవిశ్వాసము ప్రతిష్ఠితమైనది. పశుబలమునందు పాశ్చాత్యులకు ప్రాచ్యులు వెనుకబడని విధమును జపానువిజయములు విశదముచేసి ఆసియాఖండవాసులందు ప్రబోధమును ప్రజ్వలింపజేసినది. పాశ్చాత్యులు వ్యాపింపజేసిన సమ్మోహము నడలుట కారంభించినది. ఆసియాఖండరాజ్యములందు ప్రతిఘటన ముదయించినది. ఆ ప్రతిఘటన స్వభావప్రభావములు కాన్స్టాంటినోపిలునుండి పెకింగు వఱకునుగల దేశములందు వికసించినవిధమును నాయా దేశములచరిత్రములు చెప్పకను చెప్పుచున్నవి. ఆసియా దేశపు ప్రబోధముతో నారంభమైన ప్రాచ్యదేశముల ప్రతిఘటనము భరతఖండమునందును నుదయించినది. ఐరోపామహాసంగ్రామ మాసియాఖండ ప్రబోధమున కుత్తేజనమును గలుగజేసి ప్రతిఘటనశీలము నుద్ధరించినది.

భరతవర్ష ప్రతిఘటనము ప్రపంచమునకు పరిపాటియైన పశుబల ప్రదర్శనమునందుగాకను భారతీయ సంస్కారమునకు సహజమైన ఆత్మబలప్రదర్శనమునందు వ్యక్తము చేయబడినది. వంగవిభజనోపసంహారమునకు భారతీయులు స్వదేశస్వధర్మవ్రతదీక్ష నవలంబించిరి. వంగవిభజన సమయమునందు 1907 సంవత్సరమునం దారంభమైన స్వదేశోద్యమము వర్తమానకాలమునందు స్వధర్మోద్యమమునందు బరిణమించినది. విదేశవస్త్ర బహిష్కారము ఖద్దరు వస్త్రనిర్మాణ ధారణమునందు బరిణమించినది. సాధారణసంవత్సరముతో నారంభ

స్వదేశోద్యమము

మైన సంవత్సరాదిసంచిక లీ చరిత్రము వికసించిన విధమును విశదము చేయుచున్నవి. గత సంచికలవలె క్రోధన సంవత్సరాది సంచికయును ప్రజాహృదయము నందు రక్తాక్షిసంవత్సరమునందు బర్యాప్తములైన భావ విషయాదులను పరిస్ఫుటము చేయుటకు ప్రయత్నించిన విధమును నీసంచికయందు ప్రచురితములైన పద్యములు, వ్యాసములు, చిత్రపటములు ప్రమాణములుగ నున్నవి. భారతజాతీయజీవితమునందు రక్తాక్షిసంవత్సర చరిత్రము ప్రముఖతను వహింపగలదు.

**చిత్రపటములు**

గాంధీమహాత్ముని విమోచనమును, స్వాస్థ్యమును రాజ్యాంగజీవనమునం దాశాంకురములను పల్లవింపజేసినవి. బెల్గామునందుగూడిన 39 వ భారతజాతీయమహాసభకు మహాత్ముడు సభాధిపత్యమును వహించి యపూర్వమైన ధర్మసంబోధనమును జేయగలిగెను. భారతజాతీయమహాసభ సమావేశమైన విజయనగరము నలంకరించిన సింహద్వారము క్రోధనసంవత్సరాది సంచికకు ముఖపటముగను ముద్రింపబడినది. విజయనగరసింహద్వారము భారత హృదయ సంస్కారా దర్శములను విశదముచేయుచున్నదీ. విజయనగర ద్వారమునందు కళానైపుణ్యము, భావగాంభీర్యము, సంభావనాచాతుర్యము సువ్యక్తములగుచు భారతహృదయాశయములు ప్రత్యక్షము లగుచున్నవి. సభాధిపత్యము వహించిన పుణ్యమూర్తియైన గాంధిమహాత్ముని పటమును విజయనగరపటములును ముద్రితములైనవి. వివిధసభలకు సభాధిపత్యమును వహించినవారల పటములును సమావేశముల పటములును, ఇతరపటములును గలవు. గత సంవత్సరవృత్తాంతమునకు సంబంధించిన సభల పటములును, వ్యక్తులపటములును, మందిరాదుల పటములును ముద్రింపబడినవి.

**వ్యాసములు**

క్రోధనసంవత్సర సంచికయందు ప్రచురించబడిన వ్యాసములు ప్రజాహృదయము నావరించిన భాషాభిమానమును, భావపరివర్తనమును, స్వాతంత్ర్యేచ్ఛను వెల్లడిచేయుచున్నవి. గాంధీమహాత్ముని యుత్తమమైన యధ్యక్షోపన్యాసమును, మహాసభల తీర్మానములును సంచికయందు ప్రధానస్థానము నలంకరించినవి. రాజకీయ సాంఘిక మత నైతిక వాఙ్మయవిమర్శన పరిశోధనాదులకు సంబంధించిన వ్యాసములు ప్రత్యేకశీర్షికలయందు చేర్చబడి ముద్రింపబడినవి. వ్యాసములను పరిశీలించి విడదీసి ముద్రించుటయందు ప్రతియేటను గలిగెడి యాటంకము లీయేడునందును గలిగినవి. భాషాభిమానులును, పండితులును మా ప్రార్థనను గైకొని వ్యాసములనువ్రాసి సంవత్సరాది సంచికను సకాలమున ప్రచురించుటకు దోడ్పడినందులకు వందనము లర్పించుచున్నాము. వ్యాసములు సకాలమునకు చేరకపోవుటవలనను, విషయవిభజమును, వ్యాసప్రకటనమును దుర్లభములైనందులకు చింతిల్లుచు వ్యాసకర్తలను మన్నింపగోరుచున్నాము. సంచికను పుష్యమాసాంతమునందు ముద్రించుట కుపక్రమించి మాఘ ఫాల్గుణమాసాంతములందు ముగించుటయందుగల సాధక బాధకము లనుభవజ్ఞులైన విజ్ఞులకు విదితములు.

**కృతజ్ఞత**

మహాసంకల్పమును జేసి కార్యముల నారంభించుటయును, సామాన్యఫలములను బడయుటయును సామాన్య విషయముగ నున్నది. మనోరథము లనవరతము పుట్టుచు కాలగర్భమునందు లీనములగుచుండును. పరమేశ్వర ప్రసాదితములైన యవకాశములను యథాశక్తిని వినియోగించి ప్రపంచావృతములైన ధర్మకర్మజ్ఞాన యోగసాధనంబులను మానవకల్యాణమునకుగాను నేకస్థలమునందు జేర్చుటయు సంవత్సరాది సంచికలను బ్రచురించుటకుపరమ ప్రయోజనము. ఈ ప్రయోజనమును సార్థకముచేయుటకు వ్యాసములను వ్రాసియును, చిత్రపటములను బంపియును, నితరవిధములను సహాయముచేసియును, దోడ్పడిన మహాజనులకు వందనసహస్రంబుల నర్పించుచున్నాము. చేరినవ్యాసముల నన్నిటిని సమయస్థలాభావముల వలనను ప్రకటింపజాలనందులకు వ్యాసకర్తలను మన్నింపవేడుచున్నారము. భారతిపత్రికయును వ్యాసముల నిర్ణయామోదములకు గారణభూతమైనది. వ్యాసము జనోపయోగకరమై వ్యాసకర్తయభీష్టమును సఫలముచేయుటకు భారతియందును, సంవత్సరాది సంచికయందును ప్రచురించుటయందుగల సాధకబాధక

నిర్ణయింపవలసిన బాధ్యతగలిగినది. ఇట్టి సందిగ్ధపరిస్థితులందు వ్యాసములను ప్రకటించుటయందు గలిగిన లోపములను వ్యాసకర్తలు మన్నించెదరు గాకయని విశ్వసించుచున్నాము. గతకాల సంచితానుభవ మఱియు సంవత్సరాదిసంచికను సంకల్పానుసారముగను బ్రచురించుట కీశ్వరానుగ్రహమునువేడుచు నాంధ్రమహాజనులకు ధన్యవాదముల నర్పించుచున్నాము.

## ప్రపంచ ప్రవృత్తి

ఘోరమైన ఐరోపామహా సంగ్రామము ప్రత్యక్షముగ బ్రదర్శించిన దుఃఖానుభవము శ్మశానవైరాగ్యముగ బరిణమించినది. యుద్ధాంతమునందు సంధిసమయమునందు విల్సనుమహాశయుడు ప్రతిపాదించిన శాంతిసూత్రములు దగ్ధాక్షరములైనవి. యూరోపు రాజ్యములందు వైషమ్యములు, వైరములు, స్పర్ధలు దినదిన ప్రవర్ధమానములగుచున్నవి. వ్యక్తులు, సంఘములు, జాతులు పరస్పరవైషమ్యముబూని మహాసంక్షోభమును గలుగజేయుచున్నవి. శ్రీమంతులు కోటీశ్వరులై భోగారాధనమును జేయుచున్నను సామాన్యులు పనిపాటులులేకను అన్నవస్త్రములకై పరితపించుచున్నారు. శ్రీమంతులకును సామాన్యులకును, భూస్వాములకును రయితులకును, ధనస్వాములకును కార్మికులకును, నఖండమైన సంరంభము వ్యాప్తమగుచున్నది. యూరపుసందేరాజ్యమునందును సమాశీలనమును, శాంతిస్వభావమును గలుగలేదు. ముఖ్యముగ మహాసంగ్రామమునందు లాభనష్టములను బడసిన మహారాజ్యములకు వివేకోదయము గలుగకుండుట భావిదౌర్భాగ్యోదయమునకు నిదర్శనముగ నున్నది. జర్మనుదేశము సంగ్రామమునకు మూలకారణమైనను స్థిరశాంతిస్థాపనమునకును, మానవకల్యాణమునకును సుమార్గమైనను, ఫ్రాంసు గ్రేటుబ్రిటనులందలి రాజ్యాధికారులకు కార్పణ్యమే ప్రధానమై సంక్షోభాంకురములు వికసించుచున్నవి. నష్టపరిహార ద్రవ్యసమర్పణ సాధనములను నిర్ణయించుటయందు గతసంవత్సరమునందు గలిగిన సంయోగమునయిత మీదాయే దంతరించినది. జర్మనీయందు స్థిరప్రభుత్వము దుర్లభమైనది. ప్రజలు దివారాత్రములు పనిచేయుచున్నను దేశసంపదలు నష్టపరిహారార్థము వినియోగపడుచు నన్నవస్త్రములులేక కృశించుచున్నారు. శ్రీమంతులు, నిరుపేదలు భోగారాధనపరాయణులై పతితులగుచున్న విధమును వార్తలు తెలుపుచున్నవి. జర్మనీదేశము గతసంవత్సరమునందు ఫ్రాంసు, గ్రేటుబ్రిటను మొదలగు రాజ్యములకు నష్టపరిహారార్థమునకు గాను 27,27,68,150 నవరనులను సమర్పించినను నాదేశములకు సంతృప్తి గలుగకున్నది. ఆరాజ్యముల దృష్టియంతయును ధనగ్రహణమునందు లగ్నమైయున్నది. గతసంవత్సరము కార్మిక ప్రభుత్వ మవలంబించిన సామదానతంత్రము లాప్రభుత్వ పతనముతో నంతరించినవి. కార్మికప్రభుత్వము శాంతిస్థాపనమునకును విశ్వాస ప్రతిపత్తి వ్యాపనమునకును చేసిన ప్రయత్నము లన్నియును కన్సర్వేటివు ప్రభుత్వము విఫలముచేసినది. జర్మనీయందు సాంఘిక విప్లవము జరుగుచున్నవిధమును స్థిరములేని ప్రభుత్వములు విశదముచేయుచున్నవి. ఫ్రాంసుదేశమున కీవిప్లవము వర్తమానకాలమునందు రుచ్యముగనున్నను భావికాలమునందు మహాప్రతిబంధకముగ బరిణమించుటయును లోకసంక్షోభమునకు గారణమగుటయును సంభవములు. సాంఘికవిప్లవము మహాతరంగములుగను పొంగిపొరలునపుడా మహాప్రవాహమును రుష్యారాజ్యమునందువలె నితరరాజ్యములందును నరికట్టుట యసంభవమగును.

రుష్యారాజ్యమునందు సాంఘిక పరివర్తనము స్థిరప్రతిష్ఠను బడసినది. లెనినుమహాశయుడు గతించినను సోవిటు ప్రతిష్ఠాపనలకు చలనము గలుగకను వికసించుచున్న విధమును ప్రేక్షకులు చాటుచున్నారు.

రుష్యా పరివర్తనము

రుష్యాయందు వర్తమానసమయమునం దితరరాజ్యములందు భూధన విద్యామతస్వాములకు గల ప్రాబల్యమంతరించినది. యూరపు దేశములు 150 ఏండ్ల సంరంభసంక్షోభ పరంపరలందు స్థాపించిన వ్యక్తిస్వాతంత్ర్యము రుష్యాయం దంతరించినది. రాజ్యము ప్రజాపోషణభార మాజన్మాంతము నిర్వహించుటకు సమకట్టినది. బాల్యమునందు ప్రజలవిద్యాసంవర్ధన భారమును వయస్సునందు వ్యవసాయ నిర్ణయభారమును,

వార్ధక్యమునందు సంరక్షణభారమును రాజ్యము నిర్వహించుటకు బూనుకొనినది. గుణకర్మవిభాగములను విసర్జించి మానవ సముదాయము నేకగుణకర్మముద్రాంకితము గనుజేయుటకు బూనినది. ఆహారవిహారాదులయందును, విద్యావిధానములందును, వివాహసంస్కారములందును, కులీనసామాన్యభేదములును, పండిత పామరభేదమును, శ్రీమంత దారిద్ర్యభేదమును విసర్జించి మానవసమానత్వమును స్థాపించుటకు విశ్వప్రయత్నములను జేయుచున్న విధమును రుష్యా చరిత్రము విశదము చేయుచున్నది. ఈ ప్రయత్నముల ఫలమును భావికాలము నిర్ణయింపవలసి యున్నది. కానివర్తమాన సమయమునందు రుష్యాపరివర్తనము ఫ్రాంసు, గ్రేటుబ్రిటను రాజ్యాధికారుల ప్రతిఘటనమునకు మూలమై యూరపునందు సంక్షోభవ్యాపనమునకు సాధనముగనున్నది. కార్మికపక్షము రుష్యారాజ్యముతో చేసిన సంధినియమములను కన్సర్వేటివుప్రభుత్వము నిరాకరించి శాంతిస్థాపనమును దుస్తరము చేసినది. రుష్యాయందలి ఆహారపదార్థములు కుళ్లిపోవుచున్నవి. ప్రజలకవసరములైన వస్త్రాదినిర్మాణపదార్థములు దుర్లభములై సంపద్వినిమయము లేకను ప్రజలు కృశించుచున్నారు. ఫ్రాంసు, గ్రేటుబ్రిటను రాజ్యములందు ప్రజలకాహారపదార్థములు దుర్లభములై, నిర్మాణపదార్థములకు వినిమయము దుర్లభమై ప్రజలు పనిపాటులు లేకను పరితపించుచున్న విధమును దేశపరిస్థితులు వేయిముఖములను బోధించుచున్నవి. ఈసందిగ్ధపరిస్థితులందు యూరపురాజ్యములందు శాంతిస్థాపనము దుర్లభమగుటయందు వైపరీత్య మేమియును గనుపడదు. రుష్యా రాజ్యమునందైనను సాంఘిక విప్లవోద్యమము పశుబలమూలమైన సైనిక బలసాధనమున జరుగుచున్నది. కాని మానవబలమూలమైన ధర్మబలసాధనమునను సాగుటలేదని రుష్యా దేశపరిస్థితులు వేయినోళ్ల జాటుచున్నవి. రుష్యాయందు నిరంకుశభూయిష్ఠమైన జారుప్రభుత్వము పతనమై ప్రజాధికార భూయిష్ఠమైన సోవిట్ ప్రభుత్వము స్థాపితమైనను పరమానర్థములకుమూలమైన సైన్యవ్యయభారము ప్రజాపీడనమును లోకసంక్షోభమును యథాప్రకారము చేయుచున్నది. మహాసంగ్రామమునకును ప్రపంచసంక్షోభమునకును దుర్భరమైనపన్నులకును దుర్వ్యయమునకును మూలమైన సైన్యవిధానము వ్యాప్తమునం దున్నంతకాలమును రుష్యాయందే ప్రభుత్వవిధానము ప్రబలినను రుష్యాకును యూరపునకును ప్రపంచమునకును తరణోపాయము దుర్లభము. ప్రపంచమునం దంతటను సోవిటుధర్మమును స్థాపించుటకు రుష్యాప్రభుత్వము చేయుచున్న విశ్వప్రయత్నములు పరమానర్థములకుమూలముగాగలవిధమును గతానుభవము విశదముచేయుచున్నను వర్తమానసమయమునం దావిధానమునె యారాధించుట భావిదుఃఖపరిణామమును సూచించుచున్నది. సోవిటుప్రభుత్వము దారిద్ర్యము ననుభవించుచున్నను 6,00,000 సైనికులను వందల వైమానికులను బోషించుచు సంక్షోభమార్గము నవలంబించుట విపరీత ధర్మముగ నున్నది.

ఫ్రాన్సు

ఫ్రాన్సుదేశము యూరపురాజ్యములందు దారాశయములను వ్యాపింపజేసిన ప్రతిష్ఠను గణించినటులు యూరపుదేశములందు సైన్యబలవ్యాపనమునకు నయితము మార్గదర్శకమైనది. పదునాల్గవ లూయి నెపోలియనుల సంగ్రామప్రస్థానములను తలంచినపుడు విషాదము సహాజముగ గలుగుచుండును. సంగ్రామము ముగిసిపదేండ్లయినను నిర్బంధసైనిక శిక్షణ మంతరింపలేదు. ఫ్రాన్సునందు 5,00,000 సుశిక్షితులైన సైనికులుగలరు. అనేకములైన విమానదళములు, మరఫిరంగులు, యుద్ధమునకు సిద్ధముగ నున్నవి. ఫ్రాన్సుహృదయము సంపూర్ణముగను సైన్యబలమునందులగ్నమైసంక్షోభమార్గము నవలంబించుచున్నది.జర్మనీఫ్రాన్సునకునష్టపరిహారార్థము8, 62,30,050 నవరనులను సమర్పించినది. అయినను ఫ్రాన్సు తృష్ణ తీరునని నమ్ముట కవకాశములు లేవు. ఫ్రాన్సు యుద్ధానంతరము సకలవిధములను నభివృద్ధిమార్గమునుబడసి బాగుపడుచున్నను జర్మను భయముమాత్రము బాధించుచున్నది. ఫ్రాన్సు దేశమున కితరలాభములు గలుగుచున్నను ప్రజోత్పత్తి మాత్రము క్షీణించుచు భావిపరిణామ మంధకారబంధురముగ నున్నది. హెర్రియటుగారి యధికార నిర్వ

హణమునందు ప్రాన్సునిగ్రహమును విశ్వాసమును పూపుల శుభావహముగ నున్నది.

**జర్మనీ**

జర్మనుల దురాశ దుఃఖమునకు గారణంబైనది. సంగ్రామానంతరము నష్టపరిహారార్థ మితరరాజ్యములకు 27,27,68,150 సవరనులను జర్మని చెల్లించినది. డావెసురిపోర్టు ననుసరించి యుద్ధముల సవరనులను జర్మనీ చెల్లించవలసియున్నది. ఈతరమునందు జర్మని కోలుకొనునని నమ్ముటకవకాశములు గనుపింపవు. జర్మను లహోరాత్రములు పనిచేయుచున్నను జీవయాత్రను గడుపుటయే దుస్తరముగ నున్నది. దేశపరిస్థితు లధ్వాన్నముగ నున్నను జర్మనుల నావహించిన సైన్యాడంబరము మాత్రము యథాప్రకారముగ రాజ్యముచేయుచున్నది. దేశమునందు స్థిరప్రభుత్వము దుర్లభమై సంఘవిప్లవము జరుగుచున్న విధమును నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. జర్మనుల కష్టస్థితియందు సోవిటులమార్గము శరణ్యమైన విచిత్రముండదు.

**గ్రేటుబ్రిటను**

యూరపురాజ్యముల నావరించిన లోకమునందు సంక్షోభదావానలమును వ్యాపింపజేసిన భూతృష్ణ, ధనతృష్ణ, వ్యాపారతృష్ణ బ్రిటీషుసామ్రాజ్య నీతిధర్మమునందు ప్రత్యక్షముగ గోచరంబగుచు సామ్రాజ్యాభిమాన దుర్నయ ఫలమును విశదము చేయుచున్నది. భూతృష్ణాపూరణమునకు వ్యక్తులకు వలె జాతులకును మితిమేరలు లేవు. యుద్ధానంతరము బ్రిటీషు సామ్రాజ్య వైశాల్యము పెరిగి సామ్రాజ్య నిర్వహణము క్లిష్టమైనది. సంగ్రామము సామ్రాజ్యము నందంతటను ప్రజాప్రబోధమున కుత్తేజమును గలుగజేసినది. ఆపత్సమయమునందు బ్రిటీషు రాజ్యాధికారులుచేసిన ప్రతిజ్ఞలన్నియును గట్టెక్కిన తరువాతను నిరర్థకములైనవి. అధినివేశ రాజ్యములందును స్వాధీన రాజ్యములందును గ్రేటుబ్రిటనుపకును సామ్రాజ్యాంతర్భాగములకును మనస్తాపములు వర్ధిలి విశ్వాసమునకు భంగము గలిగినది. బ్రిటీషురాజ్యాధికారు లధినివేశరాజ్యముల పట్లను సామదానసాధనముల నుపయోగించినను స్వాధీనరాజ్యముల పట్లను భేదదండ విధానము నవలంబించి విశ్వాసరాహిత్యమును వృద్ధిచేసిరి. ఆరంభమునందు కొంతసానుభూతి యుండినను క్రమముగను సానుభూతియంతరించి నిర్దాక్షిణ్యము ప్రవర్ధమానమగుచున్న విధమును ఈజిప్టు ఇరాకు హిందూదేశముల నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. భగవంతుడు ప్రసాదించిన స్వాతంత్ర్యసౌఖ్యమును, నాశనముచేసి మానవులను దాసానుదాసులను జేయుటకు బలవంతులును, ధనవంతులును, తంత్రజ్ఞులును, విద్యావంతులును పన్నెడి పన్నాగములకును కుతంత్రములకును నిర్బంధములకును దౌర్జన్యములకును ధర్మసూత్రములకును జ్ఞానధనబలకోశములం దాద్యంతములు గనుపడవు. రాజ్యాంధకారము మానవస్వభావమును నాశనముచేసి రాక్షసస్వభావమును వృద్ధిచేయుట కధికార నిర్వహణమునకు విపరీత ఫలముగ నున్నది. ధర్మసంరక్షణ వ్యాజమునను మహానుభావులు లోకమునకు జేయుచున్న యధర్మ పరంపరలు స్థిరప్రతిష్ఠను బడయుట ధర్మపతనమును విశదము చేయుచున్నది. సామ్రాజ్యాభిమానము లోకమునందు గలుగజేయుచున్న సంక్షోభ మనుభవైకవేద్యమై రాగద్వేషములను వర్ధిలజేయుచున్నను ధర్మజ్ఞానోదయము గలుగకుండుట సంతాపకరము. మహాసామ్రాజ్యాధిపత్యము ననుభవించుచున్న గ్రేటుబ్రిటను స్థితి శుభకరముగ నున్నను సామ్రాజ్యాధిపత్యమె కష్టములకు గారణముగ నున్నది. భాగ్యభోగాధికారముల కభ్యస్తమైన ప్రజలకు ధర్మానుష్ఠానము దుర్లభముగ నున్నది.

గ్రేటుబ్రిటను సంపదలతో తులతూగుచున్నను ప్రజలు పనిపాటులులేకను పరితపించుచున్నారు. గ్రేటుబ్రిటను సంపన్నత్వమునందు ప్రధానస్థానము నలంకరించుచున్నది. గతసంవత్సరమునందు రాజ్యాదాయము 83,71,69,000 సవరనులు. ఇతర రాజ్యములు 600,00,000 సవరనులును, జర్మని 140,00,00,000 సవరనులును బాకిపడియున్నవి. గ్రేటుబ్రిటను అమెరికా సంయుక్త రాష్ట్రములకు 100,00,00,000 బాకియున్నను గ్రేటుబ్రిటను స్థితి బాగుగనున్నది. దేశమిట్టి శుభస్థితి

యందున్నను 20,00,000 ప్రజలు పనిపాటులులేకను కష్టపడుచున్నారు. నిరంతరము దారిద్ర్యమునందు మునిగి తేలుచున్న భరతవర్షమున కిట్టిస్థితి విచిత్రముగ గనుపడినను మహాసామ్రాజ్యాధిపత్యమునకిది సహజఫలముగనున్నది. పరదేశాధిపత్యమును పరదేశవాణిజ్యమును పరిశ్రమలును జీవనోపాధియైన దేశమునకిది సహజస్థితియైయున్నది. ప్రతిక్రియనస్వహస్తము లందున్నను సామ్రాజ్యాభిమానుల దృష్టిమాత్రము పరదేశములమీదను ప్రసరించుచుండుట సామ్రాజ్యాధిపత్యమునకు ఫలముగనున్నది. దేశపరిస్థితు లిటులున్నను గతసంవత్సరమునందు మద్యపానమునకై 30,75,00,000 సవరనులు మనుజునకు 7 సవరనులువంతున వినియోగపడినవి. భోగాధికార పరాయణులై భాగ్యబలవంతుల స్వాధీనమునందున్న దేశములకు విమోచనము దుస్తరము.

స్వదేశపరదేశములం దాశాంకురములను గలుగజేసిన కార్మికప్రభుత్వము స్వల్పకాలమే జీవించినది.

కన్సర్వేటివు ప్రభుత్వము

సామ్రాజ్యాధిపత్యమున కాధారభూతములైన విద్యాధనబలముల ప్రాబల్యము పరిస్ఫుటమై కార్మిక ప్రభుత్వమునునోడించినది. కార్మిక ప్రభుత్వము వణగద్రొక్కుటకు లిబరలు పక్షము ప్రతిపక్షులైన కన్సర్వేటివు పక్షముతో గలిసి యాత్మహత్యను జేసికొనినది. కన్సర్వేటివుపక్షము సంపూర్ణవిజయమును బొందినది. కన్సర్వేటివుపక్ష విజయముతో బ్రిటిషురాజ్యాధికారులకు పరిపాటియైన సామ్రాజ్యాభిమానమునకును పరాధీన జాతుల నిర్బంధమునకును మహోదయము గలిగినది. గతించిన నాలుగుమాసములందును బ్రిటీషు రాజ్యాధికారులు ఈజిప్టున ఇరాకు ఇండియాలపట్ల జూపుచున్న దండనీతి బ్రిటిషు రాజ్యాధికారులకు పరిపాటియైన రాజ్యనీతిని విశదము చేయుచున్నది. బ్రిటిషు ప్రజలును రాజ్యాధికారులును పరాధీన రాజ్యముల నిర్బంధములకు దోడ్పడగల విధమునను విమోచనమునకు దోడ్పడరనియును పరాధీనరాజ్యముల తరణోపాయము స్వహస్తములందె కలదనియును బ్రిటీషురాజ్యాంగ వ్యవహారములును పరాధీనరాజ్యాంగ వ్యవహారములును విశదముచేయుచున్నవి.

భరతఖండము

భరతవర్షము సనాతనంబైన మానవసభ్యత్వమును 33 కోట్ల ప్రజలను మహాసంపదలను గలిగి యుండియును దుర్భరదుఃఖము ననుభవింపుచున్న విధమును దేశవ్యవహారములు వేయిముఖములను దెలుపుచున్నవి. భారతీయుల భక్తివిశ్వాసములకు ప్రసాదితమైన మాంటుఫర్డు సంస్కరణశాసనము యాదవకులముసలముగను బరిణమించుచున్నది. సంస్కరణములు బంధనమునకను కూలించుచున్న విధమునను విమోచనమునకు వినియోగపడకున్నవి. నాయకు లీపరమరహస్యము నయిదేండ్ల యనుభవానంతరమున గ్రహించినను ప్రాజ్ఞులీరహస్యము నారంభమునందే గ్రహించి దేశమునకు తరణోపాయమును నిర్ణయించిరి. దేశమోక్షమునకు ప్రపంచమునకుపరిపాటియైన పశుబలమును ప్రయోగించుటకు నిరాయుధులైన భారతీయుల కవకాశములులేవు. నిరాయుధు లాయుధపాణులను నెదుర్కొని విజయములను బడయుటకు దైవధర్మములు సాధనములుగ నుండగలవు. దైవధర్మారాధనమున కనన్యమైన భక్తి సోపానమైయున్నది. సంసారబంధవిమోచనమునకు భగవద్భక్తివలె దేశదాస్యవిమోచనమునకు దేశభక్తియె పరమసాధనముగనున్నది. సంకల్పసిద్ధులును త్యాగపరాయణులును నైన గాంధిమహాత్ముని వంటి దేశభక్తులు దేశమోక్షమునకును ప్రపంచోద్ధరణమునకు సాధకులై ధన్యవాదములకును దైవకృపకును బాత్రులగుచు శాశ్వత ప్రతిష్ఠ నధిష్ఠించుచున్నారు.

పవిత్రమైన దేశభక్తిపరిహాస పాత్రమైనవిధమును యూరపురాజ్య తంత్రములు విశదము చేయుచున్నవి.

దేశభక్తి

ఏయుపాయముచేతనైనను నస్థిరములైన స్వదేశప్రయోజనములను స్వజాతీయలాభములను గాపాడినవారు పరమదుర్మార్గులైనను దేశభక్తాగ్రేసరులుగను బరిగణింపబడుచు సన్మానపాత్రులగుచున్నారు. బ్రిటిషు ప్రముఖులు క్రూరుడైన డయరుసేనానికి సమర్పించిన ఖడ్గకనకములు రాజ్యధర్మలక్ష్యమునకు నిదర్శనములు. శ్వేతజాతులు శ్వేతేతరజాతులపట్లను జూపుచున్న దుర్నయపరంపరలను సత్కార్యములనుగను

సమర్థించుట యాచారమైనది. పాలకవర్గమునందు పెద్ద ద్రోహులు హత్యలు శ్లాఘాపాత్రములై దేశభక్తిరూపమునుదాల్చి సన్మాన పాత్రములైనవి. పాలితవర్గమునందు చిన్ని నేరములు స్వాతంత్ర్యభావప్రకటనము రాజద్రోహ రూపమునుదాల్చి దండనార్హములైనవి. పాలకవర్గ ముగ్గుపోసినేర్పిన భావములను పాలితవర్గమునకును నలవడినది. భరతఖండమునందు పరిశుద్ధమైన రాజకీయజీవనము దుర్లభమైనది. ప్రభుత్వోద్యోగ నిర్వహణమె ప్రజాహితజీవన లక్ష్యముగ నేర్పడినది. శ్వేతము ఖులనావహించిన యధికారాభిమానము భారతీయులను ద్విగుణీకృతముగ నావహించినది. విద్యావంతులదృష్టియంతయును నున్నతాధికార పరిగ్రహణమునందు లగ్నమైనది. నిరంకుశప్రభువర్గ ముద్యోగదానములతో భారతీయులను దాసులను జేయుటయందు దక్షత్వమునుబడసినది. దేశారాధనపరాయణులకు సువర్ణశృంఖలబంధనముల్లంఘనీయమైనది. ఉద్యోగములు ధనము గౌరవము సమ్మోహజనకములై ధర్మచ్యుతిని గలుగజేయుట సహజము. మహానుభావులైన గోపాలకృష్ణ గోకలే, బాలగంగాధరతిలకు సమ్మోహమునందు బడకపోయినను సమ్మోహసంలగ్నము భారతరాజ్యాంగజీవనమునందు సహజధర్మమైనది. అధికార నిర్వహణమె పరమావధిగను బరిణమించినది. ఉద్యోగవాంఛ లేకను రాజ్యాంగజీవనము దుస్తరమైనది. ఉద్యోగ స్వీకారముతో మహామహులకు సయితము భ్రమరకీటక పరిణామము సంప్రాప్తమగుచున్నది. పరాధీనజాతులకు స్వాతంత్ర్యజాతులకుగల రాజ్యాంగజీవనము గలుగజాలదు. గతించిన నలువదేండ్ల యనుభవమును నీసత్యమును విశదముచేయుచున్నది. పూర్వానుభవ మెటులున్నను మోంటుఫర్డు సంస్కరణముల యనుభవమైనను గుణపాఠము నేర్పదగియున్నది. కాని భారత సంస్కారమునకు గుణపాఠమును గ్రహింపదగిన సామర్థ్యము గలుగకున్నది. రాజ్యాంగమునం దేర్పడిన జడత్వము భారతజాతీయ జీవితమునందంతటను గలిగినది.

భారతోపాఖ్యానములందు జడ భరతోపాఖ్యాన మమూల్యముగ నున్నది. జడ భరతోపాఖ్యానము

**భారత జడత్వము**

మహాతత్త్వోపదేశమున కేర్పడినను వర్తమాన జడత్వోపాఖ్యానము యథార్థముగను జడత్వస్థితిని దెలుపుచున్నది. సనాతనమైన, ధర్మబద్ధమైన, మహత్తరమైన, జ్ఞానవిలసితమైన భారతజాతి దుర్దశపాలగుట పురాకృత కర్మఫలముగ నున్నది. బ్రిటీషు పరిపాలనము భారతజాతీయ జీవకళలను శుష్కింపజేసినది. ప్రజాపోషణమునకు సాధనములైన సకలాంగములందును పరావలంబన మేర్పడినది. ముప్పదికోట్ల ప్రజలకు మాతృభూమిని సంరక్షించుట కర్హతలేదు. దేశాదాయ వ్యయమును నిర్ణయించుట కవకాశములులేవు. సహజమైన విద్యోపార్జనమును జేయుటకు హక్కులేదు. అవసరమైన పరిశ్రమలను సంరక్షించుట కధికారములేదు. న్యాయమైన భావములను వ్యక్తముచేయుటకు స్వతంత్రములేదు. కర్మేంద్రియములకును జ్ఞానేంద్రియములకును వికలత్వము గలిగినది. సకలాంగములందును నగ్ని మాంద్యమె ప్రవేశించినది. నాడుల బలము క్షీణించినది. చైతన్యము క్షీణించుచు జడత్వము ప్రబలుచున్నది. ఈదుస్తంత్రమునంతయును నిస్సహాయులైన భారతీయులె కీలుబొమ్మలవలె నడుపుచు పరావలంబనులై యానందించుచున్నారు. అధికారాందోళికలయం దుత్సవవిగ్రహములవలె నూరేగుచు సంతసించుచున్నారు. రాజ్యాంగములందును విద్యావిధానమునందును వ్యాపారసాధనములందును న్యాయనిర్వహణమునందును సైన్య వ్యవస్థలయందును నేమి సంస్కరణములు గలిగినను భారతీయులు కీలుబొమ్మలవలె మెలగవలసియుందురు. మోంటుఫర్డు సంస్కరణములు ప్రసాదించిన రాజ్యాంగ సంస్థాపనలన్నియును నీసత్యమును విశదము చేసినను ప్రజానాయకులకు జ్ఞానోదయము గలుగకుండుట సంతాపకరము.

మోంటుఫర్డువిధానమును నిరంకుశప్రభుత్వమాశీర్వదించుటయే దాని నిస్సారతకు నిదర్శనము. నిరంకుశాధికారము యథేచ్ఛగా విహరించుచున్నంతవరకును సంస్కరణ శాసనములను ప్రసాదించుటకుపాలకవర్గమున కభ్యం

**ద్వంద్వ ప్రభుత్వము**

# ఇవాన్సు లైమ్సు అండు గ్లిసరైను

## శిరోజములు అతిత్వరలో బాగుగా స్వాభావికముగానే పెరుగుటకు తోడ్పడును.

జిడ్డుగానుండు శిరోజములకు దుమ్ము, మసక తగిలిన అంటువ్యాధితప్పక కలుగును. ఇది మీ పుర్రెను మిక్కిలి ఆరోగ్యముగాను, చల్లగానునుంచి, శిరోజములను అత్యద్భుతముగా పెరుగుటకు తోడ్పడును. ఇది పురమాషీగా శిరోజముల అభివృద్ధి కొరకే తయారు చేయబడినది. శిరోజములను శుభ్రముగాను, చల్లదనముగాను, ఆరోగ్యముగానుయుంచి, స్వాభావికముగానే శిరోజములుగా పెంచును. ఒకదఫా దీనిని వాడినవారు మరల ఎన్నడును దీనినేవిడువక ఉపయోగింతురను నమ్మకము మాకు గలదు. దీనిని వాడినట్టివారు అడుగకయే వేనకు వేలు యోగ్యతా పత్రికలను పంపియున్నారు. గాన ప్రతియొక్కరును దీనిని తప్పక పరీక్షించి, దీనివలన గలుగు గుణములను పొందగోరెదము. మీరు దీనిని ఉదయముపూట వాడిన, దినమంతయు మీశిరోజములు అందముగాను, నునుపుగాను నిగనిగలాడుచుండును.




ప్రతి బుడ్డిపైనను ఎఱ్ఱని శీలు ఉండుటనుగమనింపుడు.

పూర్తి వివరములకు ఈ దిగువ విలాసమునకు వ్రాయకోరెదము.

మద్రాసు డిపో:—

**ఏ. ఎస్. ఆర్. మూర్తి అండు సన్సు,**

9, పోప్‌హామ్సు బ్రాడ్వే, మద్రాసు.

వ్యాసకర్త్రి: శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు



వ్యాసము: "స్వారాజ్యసంపాదనమందు స్త్రీల విధ్యుక్తధర్మము"

వ్యాసకర్త: శ్రీ విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు



వ్యాసము: "ఆంధ్రపదముల యర్థవైచిత్రి"

వ్యాసకర్త: శ్రీ ఉమ్రా అలీషా కవిగారు



వ్యాసము: "కవిత్వము"

వ్యాసకర్త: శ్రీయుత కవికొండల వేంకటరావుగారు, బి.ఏ.,బి.యల్.



వ్యాసము: "గ్రంథరచనము"

వ్యాసకర్త: శ్రీయుత బాలకృష్ణశాస్త్రిగారు



వ్యాసము: "క్రోధన"

వ్యాసకర్త: కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు



వ్యాసము: "ఆంధ్రవాఙ్మయపరిణామము"

వ్యాసకర్త: శ్రీ బండారు తమ్మయ్యగారు



వ్యాసము: "శివరాత్రిమాహాత్మ్యము"

వ్యాసకర్త: శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రి గారు



వ్యాసము: "సత్యాగ్రహి"

వ్యాసకర్త: శ్రీ మండలేముల వేంకటశాస్త్రి గారు



వ్యాసము: "భీష్మప్రశంస"

వ్యాసకర్త: శ్రీ పోణూరి రామచంద్రరావు గారు, బి.ఏ.,



వ్యాసములు: "జీర్ణవస్త్రములు; మధుమాసగీతములు"

వ్యాసకర్త: శ్రీ నిడుదవోలు వేంకటరమణ గారు, బి. ఏ.,



వ్యాసము: "శంకరాదిత్య ప్రశంస"

వ్యాసకర్త: శ్రీ సోమంచి సూర్యనారాయణశర్మ గారు



వ్యాసము: "పంక్తి రథము"

వ్యాసకర్త: శ్రీ రొణిదవ బాలకృష్ణయ్య గారు



వ్యాసము: "శబరీ నిరీక్షణము"

వ్యాసకర్త: శ్రీ నేమాన సూర్యప్రకాశకవి గారు



వ్యాసము: "వనలక్ష్మి వసంతవిలాసము"

వ్యాసకర్త: శ్రీ యడ్లపాటి వెంకటసుబ్బారావు గారు



వ్యాసము: "రామాయణ నీతిసారము"

వ్యాసకర్త: శ్రీ దోమా వేంకటస్వామిగుప్త గారు



వ్యాసము: "మాలపిల్ల"

వ్యాసకర్త: శ్రీ రావు వెంకట రావు గారు



వ్యాసము: "మేఘసందేశము"

వ్యాసకర్త: చింతలపూడి శేషగిరిరావు గారు



వ్యాసము: "కనుపర్తి అబ్బయామాత్యుడు"

వ్యాసకర్త: శ్రీపాద జోగిసోమయాజులుగారు(చేతపుస్తకమున్న వారు)  వ్యాసకర్త: శ్రీ కోనిదన వెంకటనారాయణగారు  వ్యాసకర్త: శ్రీ కొంతి శ్రీపతిశాస్త్రిగారు  వ్యాసకర్త: శ్రీ పూడిపెద్ది వెంకటరమణయ్యగారు



వ్యాసము: "కృష్ణుడు"

వ్యాసకర్త: శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు (కుర్చీలలో నడుమనున్న వారు)



వ్యాసము: "కవిబ్రహ్మ"

వ్యాసకర్త: శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారు





వ్యాసము: "పుట్టి పెరుగుచునుంటినీభువనమందు" వ్యాసము: "గాలిపటము"

వ్యాసకర్త: శ్రీదుర్గమహంతి సీతారామశర్మగారు(కుడివైపునున్న వారు)



వ్యాసము: "ప్రత్యక్షము"



వ్యాసము "పూవులతోట"



వ్యాసము: "ద్వావింశతి శ్రుతిపథకము"

తరములుండవు. నిరంకుశాధికారమున కేయాటంకము గలిగినను ప్రతిబంధకములు నీడవలె నంటియుండి బహిర్గతము లగుచుండును. మడ్డిమనుకమిటి సమక్షమున సాక్ష్యమునిచ్చిన మంత్రులు వారినిస్సహాయతను విశదము చేసిరి. ద్వంద్వప్రభుత్వమును నిరర్థక మనియును ననర్థదాయక మనియును నేకగ్రీవముగను భారతీయులు ఖండించిరి. ఓలివియరు ప్రభువు మోంటుఫర్డు విధానము నామోదించిన వారెవరును గనుపడలేదని తెలియబల్కెను. సామ్రాజ్యశాసన సభకును రాష్ట్రీయ సభలకును నిరంకుశత్వమును ప్రతిఘటించుటకు శక్తి సామర్థ్యములు లేవని గతించిన అయిదేండ్ల యనుభవమును ముఖ్యముగను గత వర్షానుభవము విశదముచేసినది. శాసన సభలు బడ్జెటులను నిరాకరించినను, మంత్రులను నిరసించినను, తిరస్కరించినను, శాసనములను, నిర్మించినను, నిరర్థకమని గతవర్తమాన సంవత్సరములందు సామ్రాజ్యమధ్యరాష్ట్ర వంగశాసనసభల వ్యవహారములు ఋజువుచేయుచున్నవి. లిట్టను ప్రభువువలె భేదోపాయము నవలంబించియును యథేచ్ఛగ బ్రవర్తించియును నిరంకుశవర్గము విజయమును బడయుగలదు. సంస్కరణ శాసనమునందు సవరణలను మడ్డిమనుకమిటి రిపోర్టు ననుసరించి చేసినను దేశావసరములకు నిరుపయోగమని యనుభవము విశదముచేయుచున్నది. స్వరాజ్యము లేకను దేశారిష్టములను తొలగించుట కవకాశములు లేవని విశదమైనను శాసనసభల సమ్మోహము పదవుల సమ్మోహము భారతనాయకులను బాధించుచున్న విధమును వివిధములైన రాజ్యాంగపక్షముల వ్యవహారములు విశదము చేయుచున్నవి.

భారత రాజ్యాంగ పక్షములు

స్వపరిపాలనముగల దేశములందు రాజ్యాంగమునందు భిన్నభావములుగల పక్షములుండుటయును భిన్న ధర్మములను సమర్థించుటయును దేశక్షేమమునకు ప్రయోజనకరము. పరాధీనమైన రాజ్యాంగములందు సకలపక్షములకును పరరాజ్య నీతిపోషణ మలంఘనీయమైన ధర్మమైయున్నది. ఏపక్షము పరదేశనీతి కధికతరమైన పోషణము నొసంగునో ఆపక్షము పలుకుబడి గలిగి వర్ధిల్లును. స్వాతంత్ర్యముగల పక్షావలంబనులును నధికార వ్యామోహితులై యధికారావరణమునందు జేరుచుందురు. లిబరలుపక్షచరిత్రము స్వదేశప్రముఖులు నిరంకుశప్రభుత్వమునకు నిర్బంధవిధానమునకు బోషణమొసంగెడి విధమును విశదముచేసినది. మితవాదప్రముఖులు 40,000 దేశభక్తులను నిర్బంధించుటకు వారి యధికారమును వినియోగించిరి. ఇండిపెండెంటు పక్షము స్వరాజ్యపక్షమును ప్రతిఘటించుటకు ప్రభుత్వముతో నేకీభవించుచున్నది. సామ్రాజ్యశాసనసభయందు జిన్నాగారి పక్షము స్వరాజ్యపక్షమును ప్రతిఘటించిన విధమును జిన్నా నెహ్రూల పరస్పర దూషణమును వివిధ పక్షముల దౌర్బల్యమును విశదముచేసినవి. మధ్యరాష్ట్రములందును, వంగరాష్ట్రములందును, స్వరాజ్యపక్షమునందును, హిందూమహమ్మదీయులందును, గలిగిన విభేదములును రాజ్యాంగపక్షములవిభేదమును విశదము చేసినవి. అధికారజ్యోతి సభ్యులను శలభములరీతిని నాకర్షించుచు ధర్మనాశనమును జేయుచున్నది. స్వరాజ్యపక్షమునకు ప్రతిష్టంభనతంత్రము దుర్లభమైనది. నిరంకుశాధికారవర్గబలము క్రమముగను వృద్ధినిబొందుచు శాసనసభల దౌర్బల్యమును పరావలంబన ప్రాబల్యమును సువ్యక్తములైనవి. వర్తమాన సందిగ్ధసమయమునం దన్నిపక్షములకును కర్తవ్య మవ్యక్తముగ నున్నది. ప్రభుత్వమును ప్రతిఘటించుట కసహాయోద్యమమునకు గల నైతికబలమును గాంధిమహాత్మునకుగల దూరదృష్టియును ననుభవైకవేద్యములైనవి. నిరంకుశప్రభుత్వమును ప్రతిఘటించుటకు దేశమునం దేకపక్ష ప్రయోగమున కవకాశము గలదుగాని, భిన్నపక్ష ప్రయోగముల కవకాశము లేదని విశదమైనది. నిరంకుశప్రభుత్వమును ప్రతిఘటించుటకు ప్రజాశక్తిని వ్యక్తముచేయవలసిన యవసరము గలిగినది. ప్రజాశక్తి ప్రభావ మసహాయోద్యమముచ్చస్థితియం దున్నపుడు విశదమైనది. ప్రజాశక్తిని నిర్భయముగను వ్యక్తముచేయుటకు భారతజాతీయమహాసభ 39 ఏండ్లనుండియును జేయుచున్నపని ప్రజాహృదయము

నాకర్షించినది. గాంధిమహాత్ముడు రాజ్యాంగరంగము నందు ప్రవేశించిన తరువాతను భారతజాతీయమహాసభ నూతనశక్తిని గలిగి విజృంభించినది. కాంగ్రెసునందు స్వరాజ్యపక్ష మేర్పడిన తరువాతను కాంగ్రెసుశక్తి కొంత తగ్గినను నేటికిని స్వరాజ్యసంపాదనమునకు కాంగ్రెసునకు గలశక్తి సామర్థ్యము లితరసంస్థలకు లేవని దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు స్వరాజ్య సంపాదనమునకు కంకణమును గట్టుకొని కాంగ్రెసు వ్యవహారములను నడుపుచు కాంగ్రెసు ప్రతిభను దేశమునందంతటను వ్యాపింపజేసెను. గాంధిమహాత్ముడు నిర్ణయించినరీతిని కాంగ్రెసు ప్రతిభను వృద్ధిచేసి స్వరాజ్యమును బడయుట భారతీయులకు పవిత్రమైన ధర్మము గనున్నది.

కాంగ్రెసు మహాసభ

అసహాయోద్యమారంభముతో కాంగ్రెసు చరిత్ర యందు నూతనశక ముదయించినది. కాంగ్రెసు వ్యవహారములందు తీర్మానములబదులు కార్యములు ప్రబలుట కుపక్రమించినవి. ప్రజల దృష్టిని గాంధిమహాత్ముడు రాటముల మీదను ఖద్దరుమీదను లగ్నముచేసి స్వరాజ్య సంస్మరణమును దేశమునందంతటను ప్రతిధ్వనిల్ల జేసెను. రాటములు స్వరాజ్యగానమును జేయుచు, ఖద్దరు స్వరాజ్యస్వరూపమును జూపుచు ప్రజాహృదయమునందు ప్రత్యక్షముచేసినది. స్వరాజ్యాందోళనమునకు గలిగిన యంతరాయములు చరిత్రాంశములు. స్వరాజ్యపక్ష ప్రతిభుటనము ప్రజాదృష్టిని నిర్మాణమార్గమునుండి శాసనసభలకు మరల్చినది. మాటలయందు నిర్మాణవిధానముపట్ల రెండుపక్షములును నుత్సాహము చూపినను కార్యములందు మాటల కనురూపమైన ప్రయోజనము గలుగలేదు. గాంధిమహాత్ముని విమోచనానంతరము నిర్మాణ విధాన వ్యాపనమునకు మహాత్ముడు చూపుచున్న లక్ష్యము వివిధసభలయందు విశదమైనది. అహమదాబాదు కాంగ్రెసుకమిటి సమావేశమునందు గాంధిమహాత్ముడు విజయమును బొందియును స్వరాజ్యపక్ష ప్రాబల్యమును గ్రహించి తనతీర్మానము నుపసంహరించుకొనెను, స్వరాజ్యనాయకులైన దాసునెహ్రూగారులపట్ల మహాత్మునకు గల గౌరవమును వంగనిర్బంధశాసనము బలపరచినది. కాంగ్రెసునం దేర్పడిన రెండుభాగముల సంయోగమును సమకూర్చుటకు దాసుగాంధిగారలకు కలకత్తాయందొక యొడంబడిక జరిగినది. ఆయొడంబడికనె బెల్గామునందు గూడిన జాతీయమహాసభ యామోదించినది. (క్రోధనసం॥ 64 పుట.) ఈతీర్మానమునకు కాంగ్రెసు సభ్యత్వమునకు సొమ్మునకు బదులు నూలును చందాగా నుండుట ప్రయోజన మేర్పడినది. గాంధిమహాత్ముడు స్వరాజ్యపక్షము ఖద్దరునందు లక్ష్యమును నిలుపునని సంతసించెను. స్వరాజ్యపక్షముమహాత్మునిబలముగలదనియానందించినది. స్వరాజ్యపక్షమునకు మహాత్ముని యాశీర్వాదము ప్రయోజన కరమైనటులు ఖద్దరునకు స్వరాజ్యపక్షామోదము ప్రయోజనకరముగా లేదు. స్వరాజ్యపక్షలక్ష్యము శాసనసభల యందు లగ్నమగుచున్న విధమునను నిర్మాణవిధానము నందు లగ్నముగాకున్నది. ఈవిషమపరిస్థితులు క్రమాభివృద్ధిని బొందుచున్నవి. కాంగ్రెసు ప్రచారకులు క్రమముగను జీవన సాధనమునకు వృత్తుల నేర్పరచుకొనుచు పూర్వాశ్రమములను జేరుచున్నారు. ఖద్దరు ప్రచారము మహాత్ముడు తలచినటులు వృద్ధిని బొందుట లేదు. శేషించిన ప్రచారకులకు భావికర్తవ్యము దుర్బోధముగ నున్నది. కాని నిర్మాణ విధానమును సఫలము చేయుట కన్నిపక్షములవారును పనిచేయుట కవకాశము లున్నను తగినరీతిని పని జరుగకుండుటకు గారణము పరావలంబన ఫలమైన మాంద్యమై యుండనోపును. గాంధిమహాత్ముని కార్యపరత్వము భారతీయుల కాదర్శప్రాయమై వారి నావహించిన సమ్మోహమును నడలించి స్వరాజ్యప్రస్థానమును జేయుటకు మహోపకారమును జేయుచున్నది.

గాంధిమహాత్ముడు

(శ్రీ)రామనామస్మరణము వలె గాంధినామస్మరణము సుఖదాయకముగ నున్నది. ప్రపంచమునం దంతటను గాంధినామసంకీర్తనము చేయబడుచున్నది. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పార్శీలు, బౌద్ధులు, జైనులు, గాంధిసంస్మరణము చేయుచు తరింప గోరుచున్నారు. సుప్ర

సిద్ధులైన పీఠాధిపతులు మఠాధిపతులు తత్త్వజ్ఞులు చక్రవర్తులు, మహారాజులు, కోటీశ్వరులు, మహాకవులు, గాయకులు, కళాకోవిదులు, లోకమునందు విరాజిల్లుచున్నను మహాత్ముని నామము దిగంతములందు మారుమ్రోగుచున్నది. లోకప్రియులై లోకకల్యాణమున కాత్మసమర్పణము చేసిన మహానుభావులను ప్రజలు తాము తరించుటకు సంస్మరింతురుగాని మహానుభావులు పొందగల గౌరవలాభములు లేవు. శ్రీ కృష్ణభగవానులు స్వవిషయమై ప్రియభక్తుడైన విజయున కుపదేశించిన ధర్మార్థము గాంధిమహాత్మునిపట్లను యథార్థముగను నన్వయించుచున్నది.

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి.

ఆత్మసమర్పణముచేసిన గాంధిమహాత్ముడు పొందగల ప్రయోజనము గాని పొందదగిన ప్రయోజనము గాని లేకపోయినను భారతకల్యాణమున కనవరతము కర్మయోగాభ్యాసమును జేయుచు భారతీయులకు తరణోపాయమును జూపుచున్నాడు. మహాత్ముని ప్రేమస్వభావము, సత్యవ్రతము, త్యాగశీలము, కర్మయోగము మహాత్ముని లోకప్రియుని జేయుచు విజయధ్యానములు సహజముగను బుట్టుచున్నవి. పవిత్రమూర్తియైన గాంధిమహాత్ముడు భారతరాజ్యాంగరంగమునందు ప్రవేశించి రాజ్యాంగ సంరంభమున కపూర్వమైన ధర్మబలమును గలుగజేసి ధర్మమార్గమునను స్వరాజ్యస్థాపనమును సాధ్యముచేయ గలిగెను. "స్వరాజ్యము శాంతియుత ధర్మసాధనముల మూలమునను పొందుట భారతజాతీయమహాసభాశయ" మను సిద్ధాంతమును ప్రతిపాదించి భారతకల్యాణమునకును స్వరాజ్యసంకల్పసిద్ధికిని శాంతిమార్గమును వ్యక్తము చేసి నిజమైన మాహాత్మ్యమును ప్రపంచమునకు ప్రత్యక్షముచేసి పూజాపాత్రతను బడసెను.

అసహాయోద్యమము

అసహాయోద్యమము కాంగ్రెసు చరిత్రమునందే కాకను ప్రపంచ రాజ్యాంగ సంరంభములందు ధర్మయుగారంభమును ప్రతిష్ఠించినది. సంకల్పసిద్ధికి హేయమైన పరిపాటియైన పరపీడన మార్గమునుగాకను దివ్యమైన త్యాగమార్గమును గాంధిమహాత్ముడు స్వీయాచరణసాధనమునను సువ్యక్తముచేసెను. ద్వేషస్థానమునను ప్రేమను, భోగస్థానమునను త్యాగమును, హింసాస్థానమునను అహింసను ప్రతిష్ఠించి లోకకల్యాణసాధనమును విశదము చేసెను. గాంధిమహాత్ముడు పరులపాపకార్యములను తన పాపకార్యములనుగను పరులదుఃఖమును తనదుఃఖమునుగను పరులసుఖమును తనసుఖముగను గ్రహించి దైవయోగమును వ్యక్తముచేసెను. పామరుల దౌర్జన్యములకును హిందూ మహమ్మదీయ సంయోగమునకును ప్రాయశ్చిత్తమునకుగాను గాంధిమహాత్ముడు చేసిన కఠినోపవాసములు వారిత్యాగ దయాశీలములను విశదము చేయుచున్నవి. దివ్యవిభూతులైన ధర్మసంయోగమును అధర్మవియోగమును నిత్యజీవనమునందు సాధ్యముచేసి అసహాయయోగ ప్రభావమును గాంధిమహాత్ముడు లోకమునకు వ్యక్తముచేసెను. ఉద్యమము క్షీణించుటకు గారణ మారాధకుల లోపముగాని యుద్యమలోపము గాదు. లోకోత్తముడైన గాంధిమహాత్ముడు బ్రహ్మత్వమును వహించి బెల్గాము కాంగ్రెసును జయప్రదముగను నడిపి కాంగ్రెసు చరిత్రమునందు నూతన ఘట్టమును వ్యక్తముచేసెను.

బెల్గాము కాంగ్రెసు

విజయనగరమునందు కర్ణాటకరాష్ట్రమునందు గాంధిమహాత్ముని యధ్యక్షత క్రిందను జయప్రదముగను ముగిసిన 39-వ కాంగ్రెసు విజయనగర వైభవమును సంస్మరింపజేసినది. గాంధిమహాత్ముని యుపదేశము భావరూపములందు నూతనరూపమును దాల్చినది. మహాత్ముని కార్యనిర్వాహణ సామర్థ్యము, విషయపరిజ్ఞానము, నిగ్రహానుగ్రహశీలము, మందహాసభావము నియమితకాలమునను కాంగ్రెసువ్యవహారక్రమమును ముగించుటకు దోడ్పడినవి. బెల్గాము కాంగ్రెసుసభ్యత్వమునకు నూలుచందాను నిర్ణయించి విద్యాధనాభిమానములకు గల ప్రముఖతను తగ్గించి కర్మయోగమునకుగల ప్రయోజనమును స్ఫుటము చేసినది. నూలుచందా నియమము సభ్యత్వనియమమునందు మహాపరివర్తనమును గలుగజేయుచు యథార్థమైన

ప్రజాసభ్యత్వమును స్థాపింపగలదు. ప్రజలకుగల యథార్థమైన స్వరాజ్యాభిమానమును సువ్యక్తము చేయుటకు నూలుచందా పరీక్షగ నున్నది. స్వరాజ్యసంపాదన మన్ని పక్షములకును కామితార్థముగ నున్నది. కామితార్థ విషయమునను భేదాభిప్రాయములు లేకపోయినను సాధన విధానమునందును, కాలపరిమితియందును, స్వరాజ్యస్వరూప స్వభావములందును భేదాభిప్రాయములు గలవు. మితవాదులు స్వాతంత్ర్యవాదులు కన్వెన్షనువాదులు స్వరాజ్యవాదులు బహిష్కారవాదులు భిన్నములైన సాధనములను నారాధించుచు స్వరాజ్యస్థాపనమును గోరుచున్నారు. మితవాదపక్ష దంతము పరాధీనరాజ్యాంగములందు భ్రమరకీటన్యాయముగను పరిణామము సంప్రాప్తమగునని విశదము చేసినది. స్వతంత్రపక్షోదంతము నీధర్మమునే విశదము చేయుచున్నది. స్వరాజ్యపక్ష వ్యవహారములును సఫలమునే విశదముచేయుచున్నవి. సర్. నరసింహేశ్వరశర్మగారును, జిన్నాగారును, నటేశముగారును, చేసిన ప్రసంగములు సంశయాత్ములనైనను నమ్మింప జాలియున్నవి. దేశము స్వాతంత్ర్యమును బడయుటకును, స్వరాజ్యమును బడయుటకును నిర్మాణ కార్యవిధానమే శరణ్యముగనున్నది. హిందూ మహమ్మదీయ సమ్మేళనమును అస్పృశ్యతా నివారణమును ఖద్దరు వ్యాపనమును స్వరాజ్యసౌధ నిర్మాణమునకు సాధనములు. ఈసాధనములకు మూలాధారములు అహింసా సత్యధర్మములు. గాంధిమహాత్ముడు ప్రేమ త్యాగసత్యముల నారాధించుచు దిగ్విజయమును జేయుచు స్వరాజ్యానందము ననుభవించుచున్నాడు. భారతీయులు బెల్గాము కాంగ్రెసు వేదికయందును నితర సందర్భములందును మహాత్ముడుచేసిన యుపదేశములను శిరసావహించి స్వరాజ్యవ్రతమును స్వీకరించి స్వధర్మ నిర్వహణమునుజేసి కృతార్థు లగుదురు గాత!

**బ్రిటీషు ప్రభుత్వము**

భారతీయులు భేదాభిప్రాయములను గలిగి యంతః కలహములనుబూని ద్వేషరోషావేశమును గలిగి స్వధర్మ పరాఙ్ముఖు లగుచుండగను నిరంకుశ ప్రభుత్వము వజ్రాయుధమునుబూని వజ్రపాశబంధనములను దృఢతరముచేయుచున్నది. వంగ నిర్బంధశాసనమును శాసనసభలు తిరస్కరించినను రాజప్రతినిధియును పార్లమెంటును నిర్బంధశాసనము నామోదించినవి. లీకమిషను రిపోర్టును శాసనసభ తిరస్కరించినను నిరంకుశప్రభుత్వము యథేచ్ఛగను అమలునందు పెట్టుచున్నది. మీదు మిక్కిలి పౌరసేవోద్యోగుల వేతనములను సంస్కరణశాసనప్రయోగమునుండి విడదీయుటకు పార్లమెంటొక శాసనముచేయ బూనుకొనినది. సైన్యవ్యయము ప్రతిబంధకము లేకను యథాప్రకారము జరుగుచున్నది. సేనాధ్యక్షుడు సైన్యమును భారతీయమయముచేయుట కవకాశములు లేవని స్పష్టముచేసెను. మడ్డిమను రిపోర్టు రాజ్యాంగ సంస్కరణములను సవరించుట కవకాశములు లేవని విశదముచేసినది. సామ్రాజ్య శాసనసభకు నూలుసుంకమును తీసివేయుటకుగాని, నిర్బంధశాసనమును మడ్డిమను రిపోర్టును చర్చించుటకుగాని యవకాశము లేదని వ్యవహారములు విశదము చేసినవి. సంస్కరణములు నిరర్థకములనియును, ద్వంద్వప్రభుత్వము దురారాధ్యమనియును విశదమైనది. కార్మిక ప్రభుత్వనిర్గమనమును, కన్సర్వేటివు ప్రభుత్వ ప్రవేశమును నిరంకుశ ప్రభుత్వమున కపారమైన బలమునొసంగినది. కార్యరంగము డిల్లీనుండి లండనుకు మారినది. నిరంకుశవర్గమును పోషించుటకు కన్సర్వేటివు పక్షము విశ్వప్రయత్నమును జేయుచున్నది. ఈవిషమదశయందు భారతనాయకులు బాలురరీతిని తిరస్కారధిక్కారములకు బూనుకొనుట విచిత్రముగ నున్నది. ప్రజానాయకులు గాంధిమహాత్మునివలె త్యాగపరాయణులై దేశప్రయోజనములను పాటించుచు నిర్మాణకార్యవిధానమునందు వారిదృష్టిని లగ్నముచేసి ఆత్మబలసంపన్నులై స్వరాజ్యసిద్ధిని బడయుదురు గాత!

**ఆంధ్ర రాష్ట్రము**

చెన్నరాష్ట్రమునందు నామరూపములు లేకను నల్లలాడుచున్న యాంధ్రరాష్ట్రమునకు కాంగ్రెసు వ్యవస్థలయందు భగవదనుగ్రహమువలనను వ్యక్తిత్వము గలిగినది. కాంగ్రెసు వ్యవహార నిర్వహణమునకుగాను భరతఖండమును భాషాప్రయుక్త రాష్ట్రములుగను విభజించుటవలనను గలిగెడి

ప్రయోజనమును కాంగ్రెసు వ్యవహారములు సూత్ర రూపమునను వ్యక్తము చేయుచున్నవి. రాజ్యాంగములందు గాంధిమహాత్ముని విశాలదృష్టికి భాషాప్రయుక్త రాష్ట్ర విభజనము నిదర్శనముగ నున్నది. మాంటుఫర్డు సంస్కరణ నివేదికయును, శాసనమును, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణావసరమును గ్రహించి సాధనములను సూచించినను అధికార దేవతలును, దేవతార్చకులును, పరివారమును స్వప్రయోజనారాధకులై దేశాభ్యుదయమున [illegible]త్యంతావశ్యకమైన విషయముపట్లను నిరాదరణమును జూపి యాంధ్ర దేశాభ్యుదయమునకు స్వధర్మనిర్వహణమును జేయజాలకుండిరి. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమున కధికారులు పూనుకొనినను బూనుకొనక పోయినను భారత రాజ్యాంగములందు ఆంధ్ర రాష్ట్ర నామము స్థిర ప్రతిష్ఠను బడసినది. కాంగ్రెసు వ్యవహారములం దాంధ్ర రాష్ట్ర నిర్మాణమువలనను ఆంధ్ర రాష్ట్రమునకును భారతభూమికిని గలిగిన ప్రయోజనమును గణించిన నాలుగేండ్ల వ్యవహారములును సువర్ణాక్షరములను లిఖించినవి. ఇపుడైనను నధికార దేవతలు కన్నులనువిప్పి దేశక్షేమమున కాంధ్ర రాష్ట్రనిర్మాణమున కుపక్రమించి వారి యుద్యోగదశను సార్థకముచేసి స్వధర్మనిర్వహణమునకు బూనుకొనియెదరు గాక!

ఉదారస్వభావముగల యాంధ్రులు అసహాయోద్యమ నిర్వహణమునందు ముందంజవేసి యాంధ్ర దేశ ప్రతిష్ఠను భారత దేశమునం దంతటను వ్యాపింపజేసిరి. ఖద్దరు నిర్మాణమునం దాంధ్ర దేశ మగ్రగణ్యముగ నున్నది. ఆంధ్ర దేశఖద్దరు సన్నదనమునకును, మనుగడకును, ప్రశస్తిని బడసినది. వేలకొలది నిరుపేదలకు జీవనోపాధినిగల్పించినది. లక్షలకొలదిరూప్యములుసంప్రాప్తమైనవి. ఖద్దరుధారణము గౌరవచిహ్నమైనది. శుభాశుభ కార్యములందు ఖద్దరువాడుక పరిపాటియైనది. ఖద్దరు వ్యాపనము గాంధిమహాత్ముడు చాటుచున్న ప్రయోజనములను సమకూర్చునను విశ్వాసము ప్రజాహృదయమునందు గలిగినది. అస్పృశ్యతా నివారణమునం దాంధ్ర దేశము ముందంజవేసినది. శ్రీకృష్ణాశ్రమము, ఆనందనికేతనము, పినాకినీ సత్యాగ్రహాశ్రమము, గౌతమీ సత్యాగ్రహాశ్రమము మొదలగు నాశ్రమములు నిర్మాణవిధానమును జేయుచు దేశోద్ధరణమును జేయుచున్నవి. జాతీయ విద్యాలయములు విజ్ఞానాంకురములను వికసింప జేయుచున్నవి. స్వరాజ్య కార్యాలయములు స్వాతంత్ర్య ధ్వజమును స్థాపించుచున్నవి. ప్రజలు తిలకుస్వరాజ్యనిధికిని గాంధిపూజానిధికిని కానుకలను సమర్పించి స్వరాజ్యాభిమానమును విశదముచేసిరి. నిర్బంధములను స్వీకరించి స్వరాజ్యానుతాపమునుస్ఫుటముచేసిరి. వృత్తులనువిసర్జించి త్యాగప్రభావమును సువిదితము చేసిరి. ప్రజలు స్వయంసహాయమునను ప్రభుత్వప్రతిఘటన మున్నను. జేయగల మహాత్కార్యముల నాంధ్ర రాష్ట్ర జాతీయోపసంఘ వ్యవహారములు విశదముచేసినవి. ఈసత్యము మంత్రిపుంగవులును వారియనుచరులును గ్రహించి కార్యసాధనమునకు బూనుకొనుట సమంజసము.

ఆంధ్రుల కార్యభారము

అసహాయోద్యమారంభమునుండియును స్వరాజ్య సంరంభమునం దాంధ్రులు నిర్వహించుచున్న కార్యభారము వర్తమానసందిగ్ధ స్థితియందు వారు నిర్వహించవలసిన కార్యభారమును ద్విగుణీకృతము చేయుచున్నది. ఆంధ్ర దేశమునందును కాంగ్రెసు స్వరాజ్యపక్షవిభేదములును సాంఘిక ప్రాతినిధ్య విభేదములును తలయెత్తినను నీవిభేదములును తీవ్రరూపమును దాల్చకను దేశకల్యాణమునకు భిన్నాభిప్రాయములు గలవారు కలిసిపనిచేయుట శుభసూచకముగ నున్నది. భేదాభిప్రాయము లున్నను నిర్భయముగను వారివారి మతానుసారముగను దేశారాధనమును జేయవలసిన యవసరముగలిగినది. భారత దేశము నావరించిన విషాదావస్థ యాంధ్ర దేశమును నయితమావరించినది. శాసనోల్లంఘనాదికమైన యుద్రేక కార్యముల కవకాశములు లేవు. ప్రచారకులు నిరుత్సాహపరాయణులై, కాంగ్రెసు కార్యములను విసర్జించుటకు బూనుచున్నారు. నిలిచియున్న ప్రచారకులైనను పోషణ సాధనములు లేకను విషాదమును బొందుచున్నారు. నిరుత్సాహపూరితమైనను కాంగ్రెసు

జ్యోతిని గాపాడుటకు నిర్మాణవిధానమె శరణ్యముగ నున్నది. ఖద్దరునిర్మాణమున కాంధ్రదేశమునకుగల యవకాశములను వినియోగించుట కన్నిపక్షములకును నవకాశములు గలవు. ఆయవకాశములను గాంధిమహాత్ముడు నిరంతరము కోరునటులు బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును, కాంగ్రెసుపక్షమువారును, స్వరాజ్యపక్షమువారును, జస్టిసుపక్షమువారును, శ్రీమంతులును, నిరుపేదలును వినియోగించి స్వధర్మ నిర్వహణమును జేసి కృతార్థులగుదురు గాక! కాంగ్రెసు వ్యవహారములం దాంధ్రదేశ ప్రతిష్ఠను గాపాడుటకు నూలుచందా దేశసంస్కారమునకు దగిన పరప్రసాదముగ నున్నది. దేశారాధనపరాయణు లందరును నూలుచందాలసాధనమునను వేలకొలది సభ్యులను జేర్చి కాంగ్రెసు ప్రతిభను, ప్రజాసంకల్పమును సువ్యక్తము చేసి త్యాగమూర్తియైన మహాత్ముని సంకల్పమును సఫలముచేసి స్వరాజ్యసిద్ధిని, స్వరాజ్యానుభవమును బడయుటకు పరమేశ్వరు డనుగ్రహించుగాక! క్రోధనసంవత్సరమునందు పరమేశ్వరానుగ్రహమునను సత్యదయాధర్మములు వర్ధిలి సమస్తలోకములు శాంతిసుఖములను బడయును గాక!



# చరకాష్టకము

మంగిపూడి వేంకటశర్మగారు

చరకము విడుచుటతోనే
వరకము సిద్ధించె భరతవర్షంబున కా
చరకము విడుచుట బలునా
గరకమె నరకమ్ముగాక గాంధిమహాత్మా! ౧

చక్రము నిజము సుదర్శన
చక్రము లేములనుదోల చకితంబగు భూ
చక్రము చక్రము నతిదీ
ర్ఘాక్రమమున గొల్తుమేని గాంధిమహాత్మా! ౨

రాటము నిత్యశ్రీలక
రాటము స్థిరశాంతిసీమ జనజేసెడు ధా
రాటము రాటముపై తమి
గాటమగుం గాక మాకు గాంధిమహాత్మా! 3

రాటమ్మును నమ్మిన పో
రాటమ్ము లడంగు మదికి శ్రమదెచ్చెడు నా
రాటమ్ములు తొలగు నిరా
ఘాటమ్మగు జీవితంబు గాంధిమహాత్మా! ౪

రాటము చంచలబుద్ధిచ
పేటము భవదావశిఖి కృపీటము సంప
త్స్ఫాటము సుఖతరగిరిశృం
గాటము గృహిణులకుగాదె గాంధిమహాత్మా! ౫

* * *

కుదురుగ స్వరాజ్యలక్ష్మిని
కుదురుకొనం జేయునట్టి కుదురై తగుమేల్
చదు రెందుగలదు రాటపు
కదు రొక్కటె కలదుగాక గాంధిమహాత్మా! ౬

కదురును కవ్వము నాడిన
కొదవాదవునె కరవె కరవగును సత్యము గా
కదు రెపుడు నిలిచె నప్పుడె
కదిరెను దేశమున కరవు గాంధిమహాత్మా! ౭

# క్రోధన

బుర్రా బాలకృష్ణశాస్త్రిగారు

దుష్టవార్షిక సప్తకా నిష్ట వికృత
ఫలరసాస్వాదనము చేయఁ గలిగినాము
పటునిరంకుశ గంభీర భావ మిళిత
హుంకృతుల నల్లనల్లన నోర్చినాము
సకల నిర్బంధ వైద్యుతి జ్వాలలందు
నరికి ముక్కాకలం దీరి దెరలినాము
భయద ఝంఝానిలాహత ప్రళయములకు
నైన సిగపూవు వాడక యలరినాము
క్రోధనా! ఏమి యీపయిఁ గూర్పఁగలవు?
సత్యఫలమునకయి చేయి చాఁచుచుంట

ధర్మపథమునకయి యడ్గు దప్పకుంట
బంధవాగురఁ ద్రెంపఁగాఁ బర్వుచుంట
ముక్త్యమృత పానకాంక్షను బోవుచుంట
దుఃఖములయందుఁ బ్రేమయే దొప్పఁదోగు
బాధలందు విలాసముల్ పట్టువడును
కాలపురుషుఁడు క్రోధసంక్రాంతుఁడగుటఁ
క్రోధమయముగఁ బ్రకృతిని గూర్చెదనని
యన్నమాత్రాన నుంతయు నడల మేము
క్రోధనుని నాయకత్వంబు కొలఁదికొలఁది
ముందె చవిచూచియుంటి, మాబుద్బుదంబు
తత్క్షణవినాశి, కార్యసంస్థాయి కాదు
కాని యొక్కటి మాత్రము కానఁబడును
క్రోధనా! నాయకుఁడవౌట కొదువమైన
యంకములు వేగమే పూర్తియగును; నిజము
సిద్ధఫలములు వెంటనే చేతఁబడును
క్రోధనా! యిట్టి హుంకృతి కూడదుగద!
ఒక్కసంగతి జ్ఞాపక ముంచుకొనుము
క్రోధనాస్వాదనము మాకుఁ గ్రొత్తకాదు

క్రోధనయనంబు నీకును గ్రొత్తకాదు
క్రోధమార్తాండతైక్ష్ణ్యంబుఁ గ్రొత్తకాదు
క్రోధనవ్యర్థతయుఁ గూడఁ గ్రొత్తకాదు
కర్షమాత్రంబు నిల్చి, యాపైని పష్టి
ప్రళయములతుది నొకపరి తలనుచూపి
క్షణిక జీవనమైన నీశక్తి మాకుఁ
దెలియనిది కాదు నీవల్ల గలుగుఫలము
తిననిదియుఁ గాదు ఇఁక సిగ్గు గొనుట తగును
క్రోధనా! పట్టిహుంకృతుల్ రోఁతగాదె!
అల్లదే చూడు, మామహాత్మాచ్ఛశక్తి

భూరినీరంధ్ర నిబిడాంధకారపటముఁ
జించి చెండాడి యభినవశ్రీలతోడ
నుదయభానుండు రోదసి నూఁపియూఁపి
పూర్వసంరుద్ధ కిరణ సమూహఝురులఁ
గడల జ్ఞానామృతమయంబుగా నొనర్చె
నైకమత్యద్యుతుల్ లోన నలమికొనియె
శాంతివారిధి భంగనిశ్చలితమయ్యె
ధర్మసూత్రమ్ము పశుబంధన మొనర్చె
పెద్దలు'తథాస్తు'నుచు నిడ్డై వెడలినారు
ముక్తికాంతకుఁ దలఁబ్రాలు పోయవలసె
పూర్ణబోధక తూర్యముల్ మ్రోగుచుండె
కాలపురుషుఁడు విజయశంఖంబు నొత్తె

ప్రకృతి రమ స్వాగతోక్తులఁ బల్కుచుండె
యుదయ శాంతియుఁ బెండ్లిపెద్దలుగ నిల్చె
దివ్యమంత్రంబు లాశీర్వదించుచుండె
దైవమా! యని యిఁకఁదలదాఁచుకొనక

క్రోధనా! నీకు ముందంజ కూడదుగద!

నూతనశకంబు నవ్యసంతోతిశయము
నైకమత్యంబు సత్యంబు నవల నివలఁ
గాయ శాంతిసముద్రమార్గంబునందు
ఘనవినిర్మలసిద్ధసంకల్పమందు
ప్రబలధార్మిక వాతావరణమునందు
నవనవోన్మేష దివ్యసన్నాహ మూని
చటులసాత్వికయుక్తవిజ్ఞాన మూని
బహుళబోధకసూత్రసంబద్ధ మగుచు
కార్యతరణి విలాసక గమనములను
గనుఁడు! మోహనమూర్తి చుక్కానిద్రిప్ప
విశ్వసాంక్రామికాశలు వెంటనంటు
అంతలో నాశయము మారె; నంతకంత
కేమిచిత్రంబు! నాక యదృశ్యమయ్యె;
అందు నమృత ప్రవాహంబు లలమికొనియె
సాత్వికేకాగ్ర నిర్మలచ్ఛటలు గ్రమ్మె
షడ్గుణైశ్వర్య విభవముల్ చాలఁ గల్గె
అమృతమయమైన కర్మచంద్రాకృతి యదె!!
ఆసుధామయ మందస్మితాకృతి యదె!!

స్వచ్ఛనిస్తుల నిశ్చలప్రభలు గ్రమ్మె
జగము లానందమయములై చాలవెల్గె
ఇంకఁ దానెందుగలదు? నీవేమిచేతు?
క్రోధనా! వట్టిహుంకృతి కూడదింక.

ధర్మసందేహములు గల్గుతరుణమందు
నీవు చాలఁగ బుసకొట్టినావు నిజము
బుసయొకా దట్లు గర్జించుస్ఫూర్తి తగును
కాని ప్రస్తుత నిర్మలజ్ఞానలలిత
కాలపురుషవిహారకగతులవలన
ధర్మసంస్థాపనంపు వాతములు వీచె
ప్రకృతి కైక్యానుసంధానపటిమ గల్గె
ఏకఫలకాంక్ష భేదంబులెల్ల నవిసె
అక్షయుని సింహనాదంబు లాక్రమించె
కరుణఁ జేదోడువాదోడుగా మెలంగి
నవయుగాదికి శంకువు నాటుమీవె
కీర్తిచరితంబు వ్రాయ దిగ్భిత్తులందు
క్రోధనా! శాంతి హుంకృతి గొమ్ము రమ్ము.

*    *    *    *    *    *    *    *    *    *

సాక్షి మంగపతి రావుగారు

కాళయుక్తినై, సిద్ధార్థగరిమ నొంది, రౌద్రత వహించి, దుర్మతిఁ గ్రాలి, విజయ
దుందుభిని మ్రోయఁజేసియు, దుండగమున, నంతటను రుధిరోద్గారివై తనర్చి,
యంతటను దృప్తిఁగనక రక్తాక్షివగుచు, నిలిచినంతట భీతిల్లి తలఁకి నామె?
వడివికారాంతవర్ష సప్తకముఁ గడచె, నింక నీవైనఁ జేయునదేమి చెపుమ!!
నీవుమాత్రము స్థిరముగా నిలువఁ గలవె?, క్రోధనా! యిట్టిబింకంబు కూడ దింక
శాంతభావంబుఁ బూనుట సరణి, యైన, నిను క్షయమొనర్చి యక్షయ నిలువదొక్కొ!

మ. ధర నాకెందును సాటి యేరనుచు నిస్తంద్రప్రభావంబుతోఁ
గరముల్ గన్నను మిన్నుఁ గానక మహాకార్పణ్యసంయుక్త
నిర్భరభావంబున సంచరించి చన నారక్తాక్షి రక్తాక్షియై
పోరి నీవేమియశంబుఁ గాంచెదవొ యిప్డుల్ గానమే క్రోధనా !!

చ. ఇలఁ గలియాది నిప్పటికి నెందఱుక్రోధనులైరి నీవు వా
రలవలెఁ గాక యిద్ధరఁ జిరంబుగనుందువె? యక్షయంపున
ల్లలితచరిత్రతల్ పొసఁగ దారుణభంగిని నిట్టిపేరుఁ దా
ల్చి లలిఁ జరించిరేల్ సుజనశేఖరు లెంతయుఁ దిట్ట నెన్నినా
ళ్ళిల మనఁజాలెదీవు? తగ దీక్రియ నీకుఁ దలంపఁ గ్రోధనా !!

చామకూర భాష్యకార్లు రావు గారు



Sjt.
Chamakura Bhashyakarlu Rao Garu

కీ. శే. దామెర్ల రామారావు గారు, సుప్రసిద్ధాంధ్రచిత్రకారుడు



Late Damerla Rama Rao Garu

శ్రీయుత వరదా వెంకటరత్నం గారు



Sjt. Varadı Venkataratnam Garu

కీ. శే. సత్యవోలు గున్నేశ్వరరావు గారు, రాజమహేంద్రవరము



Late Satyavolu Gunneswara Rao Garu, Rajamundry

శ్రీయుత వడ్డాది సీతారామాంజనేయులు గారు



Sjt. Vaddadi Sitharamanjareyulu Garu

మదరాసు గవర్నరుగారికి రాయబార మంపుకొనిన గంజాముజిల్లాలోని జమీందారులు
కుడినుండి ఎడమకు: కల్లికోట, ధారాకోట, పర్లాకిమిడి, మందసా, చీకటి జమీందారులు



Zamindar representatives of Ganjam District

ముప్పదితొమ్మిదవ భారతజాతీయమహాసభా మంటప సింహద్వారము, బెల్గాము

(వెలుపలివైపు)



(Outer View)

(లోవైపు)



(Inner View)

Main Entrance of the Congress Pandal

The 39th Indian National Congress, Belgaum

ఆంధ్రపత్రిక - సంవత్సరాదిసంచిక

ముప్పదితొమ్మిదవ భారతజాతీయమహాసభ, బెల్గాము

మంటప మధ్యమున వేదికపైనుండి మహాత్ము డుపన్యసించుట



Mahatma on Rostrum, Addressing the Congress

ప్రతినిధుల స్నానపానాదులకై గావించిన నీటివసతులు



Water conveniences at the camps of the Delegates

The 39th Indian National Congress, Belgaum

# ౩౯-వ భారత జాతీయ మహాసభ - బెల్గాము

## మహాత్ముని అధ్యక్షోపన్యాసము

హితులారా,

విూరు నాకు నేడొసంగిన గౌరవభారమును వహించుటకు, యెంతయో సందేహముమీఁద నేను పూనుకొంటిని. ఈయేడీ యపూర్వగౌరవము, దక్షిణాఫ్రికాలోను, కెనియాలోను అత్యద్భుతముగ పనిజేసిన, శ్రీమతి సరోజనీదేవికి దక్కియుండవలసినది. కాని అట్లు జరుగలేదు. బాహ్యాంతరపరిస్థితులను బట్టి నే నీభారమును వహించుట కొప్పుకొనవలసినయవసరము కలిగినది. మీరు నా కొసగిన యీ యున్నతపదవిని చక్కగా నిర్వహించుటకు మీసహాయము నా కుండునని నే నెరుగుదును.

మొదట, యీ సంవత్సరము మరణించిన బీయమ్మ, సర్ అస్తోష్‌ముఖర్జీ, భూపేంద్రనాథ బోసు, డాక్టరు సుబ్రహ్మణ్యయ్యర్, దాల్ బహదర్‌గిరి, దక్షిణాఫ్రికాలో మరణించిన రుస్తుంజీ, పి. కే. నాయుడుగార్ల మరణములకై చింతించుచు వారి కుటుంబములకు సగౌరవముగా సానుభూతి చూపుచున్నాను.

### ఇంతవరకు జరిగిన చరిత్ర

1920 సెప్టెంబరునుంచి జాతీయమహాసభ స్వబలమును వృద్ధిపరచుకొనుట ప్రారంభించెను. తీర్మానములద్వారా యిబ్బందులను తొలగించవలయునని ప్రభుత్వమును కోరుట మానుకొనెను. ప్రస్తుత ప్రభుత్వవిధానమువలన లాభమేమియు లేదని యట్లు చేయవలసివచ్చినది. భారతదేశమందలి మహమ్మదీయుల కవిశ్వాసము కలిగించుటతోనే, ప్రభుత్వము వారిపై ప్రజలనమ్మకము పోవుట ప్రారంభించెను. ఇది ప్రభుత్వముపై ప్రజావిశ్వాసమునకు మొదటి ఘాత. కౌలట్టుశాసనము, ఓడ్వయరు పరిపాలనము వీటి ఫలితములైన జలియన్‌వాలా బాగు దురంతములు ప్రజలు కనులు తెరచునట్లు చేసిన ప్రభుత్వ విధాన నిజస్వరూపమును గోచరింపజేసినవి. అప్పుడే యీ ప్రభుత్వవిధానము ప్రజలపైననే సహాయమున కాధారపడియున్న దని గ్రహింపబడినది. ఆసహాయమును ప్రజలు తెలిసి చేయుచున్నారో, తెలియక చేయుచున్నారో, యిష్టముతో చేయుచున్నారో, లేక అయిష్టముతో చేయుచున్నారో, ఎట్లైనను ప్రజల సహాయమే యీ ప్రభుత్వవిధానమున కండయని గ్రహింపబడినది. అందుచే యీ విధానమును మార్చుటకు, లేదా నశింపజేయుటకై సహాయనిరాకరణము చేయుటకు నిశ్చయించుకొంటిమి. 1920 లో కలకత్తా అవసరజాతీయసభలో, బిరుదులు, న్యాయస్థానములు, ప్రభుత్వ పాఠశాలలు, శాసనసభలు, విదేశవస్త్రములు, బహిష్కరించుటకు తీర్మానించితిమి. ఈ బహిష్కారములకు సంబంధించిన పక్షములవా రందులకు పూనుకొనిరి. బహిష్కారము చేయలేనివారు, చేయుట కిష్టపడనివారు జాతీయసభనుండి తప్పుకొనిరి. ఇపుడు సహాయనిరాకరణోద్యమ విచిత్రజీవితమును వివరించుటకు నేను తలపలేదు. ఒకబహిష్కారముగూడ సంపూర్ణము కాకపోయినను, ఏయేసంస్థను బహిష్కరించుటకు తలచితిమో ఆసంస్థలపై గల గౌరవము నిస్సందేహముగా తగ్గిపోయినది.

అన్నిటికంటెను ముఖ్యమైనది హింసాబహిష్కారము. ఒకప్పు డిది సంపూర్ణవిజయము బడసినను కొంతకాలమున కహింసాతత్త్వము రక్తనాళములందు చొరక చర్మమునుమాత్రమే స్పృశించినదని తెలిసికొంటిమి. వేరు ఆధారములేక తప్పనిసరియై అహింస కొప్పుకొనిరిగాని మనఃపూర్తిగా ధైర్యముగా అహింస నొప్పుకొనలేదని గ్రహించితిమి. సహాయనిరాకరణము చేయనివారిపై అసహనము

తో డీకొనుటచే నిది వెల్లడియైనది. ఈ యసహనము గూడ నొకవిధమైన సూక్ష్మహింసయే యగును. ఈగొప్పలోప మున్నప్పటికిని, అహింసాప్రచారము పశుబలమును వినియోగించుట నాపివేసినదనియు, అహింసాప్రచారము లేకపోయినచో, అహింసాయుతసహాయనిరాకరణము లేకున్నచో, తప్పక పశుబలము నుపయోగించెడివారనియు, నేను ధైర్యముగా చెప్పుచున్నాను.

అంతే కాక, దౌర్జన్యరాహిత్యసహాయ నిరాకరణము ప్రజలకు తమనిజబలమును గ్రహించునట్లు చేసినదని నేను పూర్ణముగ విశ్వసించుచున్నాను. బాధానుభవముచే ప్రజలయందు దాగియున్న నైజశక్తి నది వెల్లడించినది. ఇంకొకవిధాన మేదియు కలుగజేయజాలని ప్రబోధమును ప్రజలలో నది కలుగజేసినది.

దౌర్జన్య రాహిత్య సహాయ నిరాకరణము స్వరాజ్యమును తేకున్నను, బహిష్కరింపవలెనని యత్నించిన సంస్థ లింకనుజీవించుచున్నను, శోచనీయఫలితము లందుచే కలిగినను, అది రాజకీయ మోక్షమును తెచ్చు సాధనముగా నిప్పుడు లేకున్నను, అదిపనిచేసినంతవరకు దానివిజయము మనలను స్వరాజ్యమునకు దాపుగాజేర్చినదని నేను సవినయముగా తెలుపుచున్నాను. ఒకకార్యమునకై బాధననుభవించుశక్తియే ఆ కార్యమును సిద్ధింపజేయుటలో పొరపాటుండదు.

## మజిలీ

కాని యిపుడు మనము మజిలీ చేయవలసిన స్థితిలోనున్నాము. వ్యక్తులుకొందరు సహాయనిరాకరణమునందుపూర్ణవిశ్వాసము గల్గియున్నను, దానికింతవరకును సంబంధించిన అధిక సంఖ్యాకులు దానియందు విశ్వాసమును కోల్పోయిరి. న్యాయవాదులెందరో వృత్తినిమరల స్వీకరించిరి, వృత్తిని వదలిపెట్టినందులకు కొందరిపుడు చింతించుచున్నారు. శాసనసభల బహిష్కరించినవారు మరల శాసనసభల కెక్కిరి. శాసనసభా ప్రవేశవాదుల సంఖ్య హెచ్చుదలలోనున్నది. వందలకొలది విద్యార్థులు, బాలబాలికలు, పాఠశాలలను బహిష్కరించి చింతించి మరల పాఠశాలల దూరుచున్నారు. వీరినందఱిని మరల చేర్చుకొనుటకు ప్రభుత్వపాఠశాలలో తావులేకున్నదని నాకు తెలియుచున్నది. విదేశవస్త్రబహిష్కరణము మాత్ర మిపుడు మిగిలియున్నది. ఇట్టి పరిస్థితులలో ఈ బహిష్కారములు జాతీయకార్యక్రమమునందుంచి పనిచేయలేము.

ఇట్లు చేయనెంచినచో కొన్నిపక్షములవారు తప్పక జాతీయసభనుంచి విడివడుదురు. అసహాయవాదులు జాతీయసభలోనుండి, యితరపక్షముల బయటనుంచుట అసంభావ్యము. ఒకపక్షముతో నొకరు జోక్యముకల్పించుకొనక యీ రెండుపక్షములును జాతీయమహాసభలో నుండితీరవలయును. హిందూమహమ్మదీయసమస్య కేది యవసరమో అదియే వివిధరాజకీయపక్షములకు గూడ యవసరము. ఒకరి నొకరు సహించవలయును. ఒకరి నొకరు నమ్మించి తమపక్షమున చేర్చుకొనుటకు కాలమున కెదురుచూడవలయును. అంతేకాదు, మనమింకను ముందున కంజవేసి యిదివరకీసభలో నుండుట మానుకొనిన మితవాదులను గూడ చేర్చికొందము. అసహాయోద్యమము నాపివేసినపుడు వారు జాతీయసభకు బయటనుండుటకు కారణములేదు. అందుచే జాతీయసభాసభ్యులే ముందడుగిడి వారల నాహ్వానించి వారీసభలో చేరుటకు సౌలభ్యమును గలిగించవలయును.

ఇపుడు నేను స్వరాజ్యపక్షమువారితో నెందులకు ఒడంబడిక చేసికొంటినో మీరు, గ్రహింపగల్గుదురు.

## విదేశవస్త్రబహిష్కారము

ఒక బహిష్కార మిప్పుడు మిగిలియున్నదని మీకు తెలియును. ఒక ఆంగ్లేయస్నేహితుని భావమునందుగల గౌరవముచే బహిష్కార మనుమాట తీసివేసి విదేశవస్త్రములను తిరస్కరించుటయని మార్చితిని. బహిష్కార మను మాటయం దొకవిధమగు అసౌరభ్యము నిస్సందేహముగ గలదు. అందు ద్వేషము అంతర్గతమై యున్నది. కాని నేను ఆమాటను అట్టి భావముతో వాడలేదు.

బహిష్కారము ఒక్క ఆంగ్లవస్త్రములకే కాక విదేశవస్త్రము లన్నిటికిని సంబంధించియున్నది. ఈ బహిష్కారము కేవలము హక్కేగాక ధర్మవిధియు నైయున్నది. హిందూదేశమునందలి నదులలోని నీటికి బదులు పరదేశములనుండి దిగుమతిని జేసిననీటిని బహిష్కరించుట ఎట్టి విధియో పరదేశవస్త్ర బహిష్కారమును చేయుట గూడ అట్టి విధియే. ఇది అప్రస్తుతము.

స్వరాజ్యవాదులతో జరిగిన యొడంబడిక విదేశవస్త్ర బహిష్కరణమును మాత్ర ముంచి నొక్కిచెప్పుచున్నది. హింసావిధానమునకు మారుగ ఇదియేమంచివిధాన మని నాకు తోచుచున్నది. వ్యక్తిదూషణము, ఉద్రేకమును గలిగించుట, అబద్ధమాడుట, అపాయము గలిగించుట, హత్యచేయుట, ఇవి హింసాచిహ్నములు. అప్రకారముగనే మర్యాద, ఒకరికి నొప్పిగలుగకుండ జేయుట, సత్యము మొదలగునవి అహింసాచిహ్నములు. అందుచే విదేశవస్త్ర బహిష్కరణము అహింసకు చిహ్నమని నేను తలంచుచున్నాను. తిరుగుబాటొక నేరము. నేరముచేయుటచే బయటనుంచి ఒత్తిడిగలుగును. ఈయొత్తిడి ఒకవిధమగు క్రోధముమూలమునను, దుర్భావముల మూలమునను కలుగుచున్నది. కాని అహింసతో గూడినపనులు హింసతో గూడినపనులకన్న ఎక్కువయొత్తిడిని గలిగించును. ఏలనన అహింస, సౌమనస్యము, మంచితనమువలన జనించును. విదేశవస్త్రబహిష్కరణమట్టియొత్తిడినిగలిగించుచున్నది. లాంకషైరునుంచి దిగుమతియగుబట్ట లన్నిచోటులనుండి వచ్చుబట్టకన్న హెచ్చుగనున్నది. అదియునుగాక దిగుమతి యగు సరకులందెల్ల వస్త్రములే ముఖ్యస్థానము నాక్రమించుచున్నవి. పిదప పంచదార హెచ్చుగ దిగుమతిచేయబడుచున్నది. ఆంగ్లదేశముయొక్క కృషికి లాంకషైరు కేంద్రస్థానము. హిందూదేశముతో లాంకషైరుకుగలవ్యాపారముపై ఆంగ్లదేశ మాధారపడియున్నది. హిందూదేశము రైతును, అతనికి అధనముగానున్న వ్యాసంగము నుండి తప్పించి కొంతవర కాతని సోమరినిగజేసి ఆతని నాశనమునకు కారణభూతమైనదీలాంకషైరు వ్యాపారమే. ఆతడు జీవింపదలచినచో విదేశవస్త్ర బహిష్కరణము తప్పక ఉండితీరవలెను. ఇట్లుచేయుటకు విదేశవస్త్రమును బహిష్కరించుటయే కాక ఆరైతులకుగల విరామకాలమునందు రాటముపై నూలువడికి తన గ్రామమునందున్న నేతగాండ్రచేత బట్టనేయించుకొని ఆఖద్దరు వస్త్రములను తాను ధరించి విదేశవస్త్రమును కొనుటకు వెచ్చించు డబ్బును నిలువజేసికొనునట్లు చేయుటయగును. ఇటు లొనర్చినచో నీతడు హిందూదేశమందు తయారగు మరబట్టనుగూడ కొన నావశ్యకముండదు. వడుకుట, నేయుట, ఖద్దరు ధరించుట వీనిమూలమున రైతునకు డబ్బు నిలువయుండుటయేకాక, అతనిని అత్యుత్తమమగు సాంఘికసేవకునిగ నొనరించుచున్నది. ఇదియే విదేశవస్త్రబహిష్కరణమునందుగల పరమరహస్యము. గ్రామస్థులతో మనకు పరిచయము గలిగించునదిదియే. వారికి రాజకీయ విజ్ఞానమును బోధించి స్వయంసహాయులుగ నొనర్చునదిదియే. సహకారసంఘములకన్నను తదితరము లగు గ్రామోద్ధరణ నిర్మాణములకన్నను ఖద్దరునిర్మాణమే శ్రేయస్కరమైనది. ఆంగ్లదేశముగలిగించు నీచమగుఆశకు లోబడకుండ జేసి అత్యుత్తమమగు రాజకీయ ఫలితములతో తులదూగ జేయుజాలునది యీఖద్దరు నిర్మాణమే. లాంకషైరు వర్తకమును నేను నీచమని చెప్పుచున్నాను. ఏలయన ఆవర్తకము లక్షలకొలదిగనున్న హిందూదేశ ప్రజల నాశనముపై నాధారపడి యభివృద్ధిజెందుచున్నది. ఒక నీచమగు పని మరియొక నైచ్యమునకు త్రోవజూపునటుల ఈ నీచమగు ఆంగ్లవర్తకము తక్కిన నీచకార్యముల నన్నిటిని చేయించుచున్నదని రుజువు పరుపబడినది. ఆంగ్లదేశము కల్గించు యీదుర్భ్రమనుండి భారతీయులు స్వయంసహాయముచే తప్పించుకొనిన, భారతదేశమున కది శ్రేయస్కరమగును. అదియే ప్రపంచమునం దన్నిటికంటెను గొప్పశక్తితోనున్న ఆంగ్లదేశమునకును, అంతేకాక మానవులందరకును గూడ శ్రేయస్కరమే.

ఖర్చునుబట్టి యుత్పత్తియుండునను సంశమును నేనంగీకరింపజాలను. ఒకప్పుడు అస్వాభావికముగ నీతిహీనులగు విక్రయదారులు గలిగించు తొందరలను

బట్టి ఖర్చుండును. ఒకజాతివ్యక్తులవలెనే కొన్ని నైతికశాసనములకు కట్టుబడియున్నచో అప్పుడా జాతి తనసహాయము నాకాంక్షించువారి క్షేమమును అరయవలసి యుండును. త్రాగుట అభ్యాసమైనవారికి మత్తుపదార్థముల నందించుచున్నచో నాజాతి నైచ్యమునకు పాల్పడి గొప్పదోషము నొనరించుచున్నదని చెప్పవచ్చును. మత్తుపదార్థములను గూర్చి ఏమిచెప్పితిమో అదియే ధాన్యమునకు బట్టలకుగూడ వర్తించును. అటులవర్తింపనిచో ధాన్యము బట్టలను దెప్పించుకొను ఆదేశమునందు వ్యవసాయము వస్త్రపరిశ్రమలు నశించి సోమరితనము దారిద్ర్యము సంభవించును. ఈరెండు గుణములును మత్తుకన్న మనిషియొక్క దేహాత్మలను ఎక్కువగ పాడుచేయును. ఇట్లధోగతిపాలగుటగూడ నొకవిధమగు నుద్రేకమేకాని ఇది తలక్రిందులుగనుండి దాని ఫలితములం దెక్కువ హానికరముగ పరిణమించును. ఇట్లుండుటకు కారణము మనము సోమరితనము, దారిద్ర్యము వీనియొక్క దుర్గుణములను నీచముగ గణింపకుండుటయే.

### ఆంగ్లదేశముయొక్క విధి

హిందూదేశముయొక్క కళ్యాణమును వాంఛించి తన ఎగుమతులను నియమప్రకారము పంపుట ఆంగ్లదేశముయొక్క విధి. అటులే తన దిగుమతులను నియమప్రకారము రాబట్టుకొనుట హిందూదేశమునకు క్షేమకరమును, విధియు నైయున్నది. నైతికసూత్రములను లక్ష్యపెట్టని ఆర్థిక సిద్ధాంతములు న్యాయవిరహితములు. అహింసా విధానమును ఆర్థికసిద్ధాంతములందు చొప్పించుటలోగల యర్థము అంతర్జాతీయ వర్తకవ్యవహారములందు నైతికసూత్రములయొక్క ప్రాధాన్యమును గనుపరచుటయే. హిందూదేశముయొక్క ప్రయత్నముల మూలమున అంతర్జాతీయ సంబంధములు నైతికసూత్రములపై నాధారపడియుండునటుల జేయుటయే నాయాశయము. జనసామాన్యము అహింసను ఆచరింతురని నేను నిరాశ చెందనవసరము లేదు. మానవస్వభావ మెప్పుడును క్షీణతనే కోరుచుండునని నేను విశ్వసింపను. వడుకుట, ఖద్దరు ధరించుట మూలమున గావించు విదేశవస్త్రబహిష్కరణము రాజకీయ రంగములం దత్యుత్తమ ఫలితములను సమకూర్చుటయేకాక హిందూదేశమునందుగల నిర్భాగ్యులను మగవారైనను సరే, ఆడువారైననుసరే వారిబలమును వారు గ్రహించునటుల జేసి తమ మాతృదేశముయొక్క స్వేచ్ఛాసంరంభమునందు భాగస్వాములుగ నుండునటుల జేయగలుగును.

### విదేశవస్త్రబహిష్కరణమా,
### లేక ఆంగ్లవస్త్రబహిష్కరణమా ?

ద్వేషస్వభావ మటుండ ఆంగ్లవస్త్రబహిష్కరణముయొక్క--కాదు-ఆంగ్ల వస్తుబహిష్కరణముయొక్క నష్టములను నిరూపించు టిప్పు డావశ్యకము. ఆంగ్ల వస్తుబహిష్కరణమును గూర్చి పలువురు దేశాభిమానులు ముచ్చటించి యున్నారు హిందూదేశ క్షేమము మదియందుంచుకొని ఆ బహిష్కరణమును గూర్చి నే మాటలాడుచున్నాను. ఆంగ్లవస్తువు లన్నియు మనకు హాని గలిగింప జాలవు. కొన్ని ఆంగ్లగ్రంథములు మనకు ఆధ్యాత్మికవిజ్ఞానలాభములను పొందుటకు సహాయపడును. వస్త్రములను గూర్చి ఒక ఆంగ్లవస్త్రములు మాత్రమే మనకు హానిగలిగించునని తలంపజనదు. విదేశీయవస్త్రములన్నియు, అంతేకాక, కొంతవరకు మనమరలపై తయారగు బట్టలుగూడ మనకు హానిగలిగించును. వడుకుట ఖద్దరుధరించుట మూలమున గలిగిన బహిష్కరణముయొక్క ఫలితములు ఒక్క ఆంగ్లదేశవస్త్రములను ప్రత్యేకముగ బహిష్కరించుటవలన గలుగజాలవు. అందుచే విదేశీయవస్త్రములనే బహిష్కరించు టావశ్యకము. ఈ బహిష్కారము నొక అపరాధముగా నెంచరాదు. భారతజాతి జీవించవలయునన్న విదేశవస్త్రబహిష్కరణ మత్యవసరము.

### సందేహ నివృత్తి

రాటము ఉద్రేకమును గలుగజేయు దనియు, వడుకుట ఆడువారిపని యనియు, రాటముపై పని చేయుట పూర్వకాలమునకు మరలుటయనియు,

యంత్రనిర్మాణమునకై నలుపు శాస్త్రపరిశోధన జ్ఞానమునకు రాట మొక ఆటంకము కానేరదనియు విమర్శకులు వాదించుచున్నారు. కాని నా యభిప్రాయము ప్రకారము హిందూదేశమునకు వలయునది కట్టిపరిశ్రమయే గాని ఉద్రేకముగాదు. లక్షల కొలది ప్రజలకు కట్టిపరిశ్రమయే ఒకవిధమగు ఉద్రేకము. అదియే ఉద్రేకమునుగలిగించు పరమౌషధము. రాటముపై మనము తగినంతకృషి నలుపలేదు. అసలు రాటమునుగూర్చి మనము పూర్తిగ ఆలోచించలేదు. మాటిమాటికి తామామోదించిన తీర్మానములను అఖిల భారతజాతీయోప సంఘసభ్యులు తామే ఆచరింప జాలకున్నారు. మనలో అధికసంఖ్యాకులు రాటమునందు విశ్వాసము లేకుండ నున్నారు. ఇట్టి పరిస్థితులలో ఉద్రేకము గలిగించుశక్తి రాటమునకు లేకపోవుటచే రాటము నిరుపయోగమని చెప్పుట న్యాయముగాదు. అది ఆడువారికి తగిన పనియనిచెప్పుట నిజపరిస్థితులను గ్రహింపకుండుట యగును. అసంఖ్యాకములగు రాటముల సముదాయమే యంత్రములు. యంత్రములు పురుషులచే నడుపబడుచున్నవి. పురుషులయొక్క యోగ్యతకుతగని పరిశ్రమలు కొన్నికలవను తలంచు మూర్ఖతనుండి తెప్పరిల్లుకాలము వచ్చినది. మామూలుస్థితిగతులందు రాటముపై స్త్రీలే పరిశ్రమ చేయవచ్చును. కాని ఇకముందుకొందరుపురుషులుగూడ ఎప్పుడును రాటముపై పనిజేయుచు దానిని గృహపరిశ్రమగ అభివృద్ధిలోనికి దేవలసి యున్నారు. ఇంతవరకును రాటముపై జరిగినకృషి పురుషుల సహాయము లేకుండ జరిగియుండెడిది గాదు. మనలో కొంతమంది రాత్రింబగళ్లు దానిని గూర్చి యాలోచింప కున్నచో నీ యభివృద్ధి గలిగి యుండెడిదిగాదు.

## యంత్రములు

యంత్రములగూర్చి గాంధిగారి యభిప్రాయములని ఇదివరకు నాపై యారోపింపబడినవి యిప్పుడు మీ మనసులోనుంచి పారద్రోలుదురుగాక. ప్రపంచమమున అహింసను దేశీయులెల్లరునుఒప్పుకొనునట్లు చేయుటకు ఎంతప్రయత్నించుచున్నానో యంత్రనిర్మాణమునుగూర్చి అంతకంటె ఎక్కువ ప్రయత్నము చేయుటలేదు. రాటమే ఒకవిధమగుచిత్రయంత్రము. ఈరాటమును గనుగొనిన మహానుభావునకు ప్రతిదినమును నేను వందనము లాచరించుచున్నాను. 15,00 మైళ్లు వెడల్పు గలిగి, 1900 మైళ్లనిడుపు గలిగిన విస్తీర్ణప్రదేశమునందు వేలకొలదిగనున్న గృహములందు ఆకలిబాధలేకుండ జేసినహిందూదేశపు యీ ఒక్కగృహపరిశ్రమనుగూడ కావలయునని, దురుద్దేశముతో నాశనముచేయుటకు నే నెంత మాత్రమును సమ్మతింపజాలను.

## నూలుచందా

రాటమనిన నాకీపిచ్చియెందులకో మీరిపుడు గ్రహింపగలరు. దానిని చందాగా ఏర్పాటుచేయుటకెందులకు సాహసించితినో, స్వరాజ్యపక్షము తరఫున దేశబంధుదాసు, పండిత మోతీలాలునెహూౄగార్లు దానినెందుల కంగీకరించిరో, యిపుడు మీరు వింతపడకుండనే గ్రహింపగల్గియుందురు. నా యిష్టమువచ్చినట్లు నన్ను చేయనిచ్చినచో, నూలువడుకుట కంగీకరింపనివారు, అన్నిసమయములందును ఖద్దరును ధరింపజాలనివారు, ఒక్కరుగూడ జాతీయసభాసభ్యులపట్టికయం దుండజాలరు. ఏదియెట్లున్నను స్వరాజ్యపక్షమువారు దీని కంగీరించినందులకు వారికి నేను కృతజ్ఞుడను. అందులోగలమార్పు బలహీనతను సూచించుచున్నది. అంతేకాక అవిశ్వాసమునుగూడ సూచించునుగాని యిదే యొకవిధముగా గొప్పప్రయత్నమునకు తోడ్పడగలుగునని నావిశ్వాసము. ఇందు సంపూర్ణమైన నమ్మకము గలవారందరకిని యిది మంచిఫలముల నొసగు ప్రయత్నముల చేయుటకు అవకాశము నిచ్చుచున్నది.

## వేరుసందేశ మేమియులేదు

భారతీయులకు రాటమువడుకుడని చెప్పుట కన్న వేరుసందేశమును దేనిని నేనీయజాలను. అందుచే రాటమునుగురించి నేనింతగ జెప్పుచున్నాను. న్యాయములును, శాంతియుతములును నగు మార్గములచేస్వరాజ్యము సంపాదింపవలయు ననిన వడుకుట కన్న మంచియుపాయ మింకొకటి నాకు తెలియదు. నే నింతకుముందు చెప్పినటుల హింసకుబదులు రాటమును భారతీయులందరును ఒప్పుకొనవచ్చును. శాసనోల్లంఘనము నాకు పరమసమ్మతము. విదేశవస్త్ర

బహిష్కరణమునందు మనము జయము బడయువరకును శాసనోల్లంఘనముద్వారా స్వరాజ్యమును బడయుట దుస్సాధ్యము. రాటమునుగూర్చిన నా యభిప్రాయములు మీకు సమ్మతము కావేని జాతీయ మహాసభకు నేనేల నిప్పుడయోజకుడ నగు మార్గదర్శకుడుగ నుండవలెనో మీరే సులభముగ దెలిసికొనగల్గుదురు. రాటమునందుగల మాహాత్మ్యమును మీరు సరిగ గుర్తింపనిచో జాతీయాభివృద్ధికి నేనొక గొప్ప యాటంకమని కొందరు స్నేహితు లనుకొనునటుల మీరుగూడ తలంపవచ్చును.

నేను చెప్పినది మీ మనసులకు నచ్చనిచో, మీ యాలోచనల కనుకూలముగ నుండనిచో మీరు నానాయకత్వమును నిరసింపకుండుట మీవిధిని మీరు గుర్తింపలేదని వెల్లడియగును. “మేము ఒప్పుకొనము” అని వ్యతిరేకముగా చెప్పుటకు ధైర్యముగాని చొరవగాని మనకులేదని పిల్లింగుడను ప్రభువుచెప్పినట్లు మరలనిక నెప్పుడును నెవరును చెప్పకుండునటుల జేయుడు. నా సూచనయందు మీకు నమ్మకము లేనిచో దానిని మీరు ధైర్యముతో నిరసించుటయే స్వరాజ్యసంపాదనయం దొకసోపాన మగును.

### హిందూమహమ్మదీయ సఖ్యత

హిందూ మహమ్మదీయసఖ్యత రాటముకన్న తీసిపోవునదిగాదు. అది మన ప్రాణవాయువు. స్వరాజ్యసంపాదన కిది యావశ్యకమని దాదాపుగ నెల్లరును ఏకగ్రీవముగ నొప్పుకొనుటచే ఈ విషయమై మీ కాలము నెక్కువ వృథపుచ్చదలచుకొనలేదు. ‘దాదాపుగ’ అని ఏల ఉపయోగించితి ననగా కొందరు హిందువులు మహమ్మదీయులును ప్రత్యేకముగ హిందూరాజ్యముగలభారత దేశముగాని, పూర్ణముగ మహమ్మదీయ ప్రభుత్వముగల భారతదేశముగాని లేకున్నచో ప్రస్తుతపరిస్థితులలోవలె ఆంగ్ల దేశముపై ఆధారపడి యుండుటయే మంచిదని తలంచుచున్నారు. అదృష్టవశమున వారిసంఖ్య చాల తక్కువగ నున్నది.

ప్రస్తుత వైషమ్యములు తాత్కాలిక క్రోధముచే గలిగినవనియు, ఇవిపోయి స్థిరస్నేహమేర్పడుననియు, మౌలానా షౌకతాలీగారికి గల యూహాలే నాకునుగలవు. ఇంతవరకును నిదురించుచున్న ప్రజలందు అసహాయోద్యమము, దానికిపూర్వము మహమ్మదీయులతో సమానముగ హిందువులు గూడ సంరంభము జరిపిన ఖిలాఫత్ ఉద్యమము అన్నిపక్షములకును, ప్రజలందరకును నూతనమగు స్వయం జ్ఞానమును గలుగజేసెను. అసహాయోద్యమము విజృంభణమున నున్నపుడు నిరుత్సాహపడిన కొందరు అసహాయోద్యమమిపుడు తగ్గుదలలో నుండుటచే అవకాశమును గల్పించుకొని మూఢమత విశ్వాసములచే స్వమతస్వార్థపరత్వముచేతను కలహములకు అవకాశములను గలుగజేయుచున్నారు. వీనిచేగలిగిన ఫలితములు రెండుసంవత్సరముల నుంచియు జరుగుచున్న చరిత్రయందు వ్రాయబడియున్నవి. మతమనుమిషచే చాల అన్యాయములు జరిగినవి. మతమను పేరుతో అల్పవిషయములన్నియు కొండంతలుగ జేయబడినవి. స్వమత విశ్వాసోన్మాదులు తమహక్కులకు అణుమాత్రము భంగము రాగూడదని తలచుచున్నారు. రాజకీయ, ఆర్థికవిషయము లనుమిషచే వైషమ్యములు పెంపుజేయబడుచున్నవి. కోహాటులో ఈదురంతములు మిన్నుముట్టినవి. అచటి స్థానికప్రభుత్వమువారి అలక్ష్యముచే నీఘోరము మరింత వృద్ధియైనది. అట్టి ఘోరమునకు కారణముల నారసి తప్పులు ఫలానివారివియని నేను నిర్ణయింపదలచుకొనలేదు. అట్లు చేయుదమనినను తగినసామగ్రి నాయొద్దలేదు. ప్రాణములురక్షించుకొనుటకు హిందువులుపారిపోయిరని చెప్పిన జాలును. కోహాటులో మహమ్మదీయులసంఖ్య మిక్కుటముగ గలదు. పారతంత్ర్యప్రభుత్వముక్రింద నెంతవరకు సాధ్యమగునో అంతటి రాజకీయాధికారమును గలిగియున్నారు. అందుచే అధికసంఖ్యాకులైయున్నవారిమధ్య హిందువులక్షేమమున కేమాత్రమును భంగము గలుగకుండునటుల జూచుట వారివిధి. అచట హిందువులు అధిక సంఖ్యాకులుగ నుండినచో వారెట్లుందురో ఇపుడుగూడ అటులనే వీరుండవలెను. పారిపోయిన హిందువులను తిరిగి కోహాటునకు సురక్షితముగ తీసికొని వచ్చువరకును కోహాటుమహమ్మదీయులు విశ్రాంతి జెందరాదు. ప్రభుత్వమువారు పన్నిన చిక్కు

నందు తగుల్కొనక తమ ప్రాణములకును, ఆస్తులకును సంపూర్ణముగ క్షేమముగలుగునను నమ్మకము కుదురునంతవరకును కోహాటు మహమ్మదీయులువచ్చి వీరిని దోచుక్కొనిపోవువరకును, హిందువులు కోహాటునకు పోకుండుటకు నిశ్చయము చేసికొందురుగాక!

మహమ్మదీయు లెంత యధిక సంఖ్యాకులుగ నున్నను వారు హిందువులను తమవలెనే చూచుకొనుచు వారిని స్నేహితులుగ భావించిన హిందువులు వారిమధ్య నివసింపగలుగుదురు. హిందువులే యధిక సంఖ్యాకులుగనుండినచో మహమ్మదీయులు కూడ హిందువులయొక్క స్నేహభావముపైనే యాధారపడి నివసింపగలుగుదురు. దొంగలు తోడుమోతుల నుంచి, ప్రభుత్వము రక్షింపగలదు. కాని స్వరాజ్యప్రభుత్వమైనను ఒక మతమువారు ఇంకొక మతమువారిని బహిష్కరింపదలచినచో నేమియు చేయజాలదు. ప్రభుత్వములు అసాధారణ పరిస్థితులందు అక్కరకువచ్చును. కాని వైషమ్యములు సామాన్యమైపోయినపుడు అది దేశీయపరస్పరసంగ్రామమై (Civil war) ఏదోయొకపక్షమునెగ్గువరకది జరుగుచునేయుండును. ప్రస్తుతము మన ప్రభుత్వము పరాయిదగుటచే మన మెంతరముకలిసినను మనలనుండి రక్షించుకొనుటకు శక్తిగలిగియున్నది. అది మారు వేషముతోనున్న సైనిక ప్రభుత్వము. ఈమత వైషమ్యముల నాపుటకు ఈప్రభుత్వము తలపెట్టినచో అట్లు చేయుటకు దానికి శక్తిగలదు. ఏ స్వరాజ్యప్రభుత్వ మైనను ప్రజాసమ్మతముగు ప్రభుత్వముగ నుండదలచుకొనినపుడు యుద్ధమునే పరమావధి గగలిగియుండజాలదు. స్వరాజ్యప్రభుత్వ మనగా హిందువులు, మహమ్మదీయులు తదితరులు గలసి సఖ్యముతో మంచిభావములతో స్థాపించిన ప్రభుత్వమని నాయర్థము. స్వరాజ్యము కావలెననినచో హిందువులును, మహమ్మదీయులును వారి విభేదములను మృదువుగ స్నేహభావములతో పరిష్కరించుకొనవలెను.

ఢిల్లీలో జరిగిన ఐకమత్య సమావేశము మత వైషమ్యములనుదొలగించుమార్గమును సూచించినది. వివిధనాయకులమహాసభవారు నిర్ణయించినఉపసంఘము హిందూమహమ్మదీయులలోరాజకీయవిభేదములను తొలగించుసూచనల చేయుటకే కాక అన్నిపక్షములు, అన్నికులములు, అన్ని జాతులవారికి, అన్నిమతములవారికిని గలవిభేదములనుతొలగించుటకుగల నిర్ణయములను జేయువలయునని కోరబడినది. సాధ్యమైనంతత్వరలోజాతిమత వైషమ్యములను తొలగించుటయే మనగమ్యస్థానమై యుండవలయును. జాతిమత ప్రాతినిధ్య ముండరాదు. ఎన్నికదారులు గుణాగుణములనుబట్టియే పక్షపాతములేక ప్రతినిధుల నెన్నుకొనవలయును. అర్హులైనట్టి పురుషులు, స్త్రీలును, సేవచేయుచుండవలెను. జాతివిద్వేషములును, ప్రత్యేకాభిమానములును విస్మరణీయములగు కాలము వచ్చువరకును అధికసంఖ్యాకులభావములను సంశయించు స్వల్పసంఖ్యాకులకు స్వాతంత్ర్యమీయవలెను. అధికసంఖ్యాకులు స్వార్థత్యాగుల ఆదర్శమును జూపవలెను.

## అస్పృశ్యత

స్వరాజ్యమునకు అస్పృశ్యత మరియొక ఆటంకము. స్వరాజ్యమునకు హిందూమహమ్మదీయమైత్రి చేకూరుట ఎంత యావశ్యకమో, ఈ అస్పృశ్యత తొలగుట అంత యావశ్యకము. ఈ సమస్యముఖ్యముగహిందువులకు సంబంధించినది. వారు నిమ్నజాతులకు స్వాతంత్ర్యమును సమకూర్చువరకును స్వరాజ్యమును పరిగ్రహింపరాదు. నిమ్నజాతులను అణగద్రొక్కుటవలన వారును అణగారిపోయిరి. హిందూస్థానమునందు ఆదినివాసులను ఆర్యదండయాత్రికులు, ఆంగ్లదండయాత్రికులవలెనే, అంతకన్న నీచముగ కూడ హింసించిరని చరిత్రకారులు మనకు చెప్పెదరు. అట్లైనయెడల మనము అస్పృశ్యులను తరగతిని కలుగజేసినందులకు మనకీనాని సత్వము తగినశిక్షయే యనవలయును. ఈ కళంకమును ఎంతత్వరగా తొలగించిన మనకు—హిందువులకు—అంత మంచిది. కాని అస్పృశ్యత భగవన్నిర్మాణమని పురోహితులు చెప్పెదరు. హిందూమతమునుగూర్చి నాకును కొంత తెలియును. పురోహితులు చెప్పినది తప్పని నేను గట్టిగ చెప్పగలను. భగవంతుడు మానవాళిలో కొందరను, అస్పృశ్యులుగా విభాగించెననుట అసత్యము. కాంగ్రెసు

సభ్యులైన హిందువులు సాధ్యమైనంత త్వరలో ఈఅడ్డును కొట్టివేయవలయును. వైకం సత్యాగ్రహులు మనకు దారిచూపుచున్నారు. వారు శాంత దృఢమనస్కులై సంగ్రామమును జరుపుచున్నారు. వారలకు ధైర్యస్థైర్యవిశ్వాసములు గలవు. ఏయుద్యమమునందైనను ఈ గుణపుంజ మున్నయెడల అయ్యది తప్పక విజయముకాంచును.

రాజకీయ లాభమునకై ఈకాలమున నిమ్న జాతులను, మోసపుచ్చుట యనునది, హిందూ సోదరులకు తగదని నేను హెచ్చరించుచున్నాను. హిందువులు, హిందూ మతమందు అస్పృశ్యతను తొలగించునట్టి తపస్సు చేయవలసియున్నది. పవిత్రత గాంచవలసినది అస్పృశ్యులుగారు; ఉన్నత జాతివారే. అస్పృశ్యతయందు ప్రత్యేకదుర్గుణ మేమియు లేదు. అపరిశుద్ధముగాని, మురికిగాని లేదు. మనము ఉన్నత జాతివారము. ధూర్తులమై మన తప్పులను మనము తెలిసికొనక మనము అణగద్రొక్కియుంచిన సోదరుల తప్పులను పెద్దచేయుచున్నాము. దేశములవలెనే మతములుకూడా సర్వసమానత్వమును గలిగియున్నవి. భగవంతుని ప్రసాదానుగ్రహములు ఏదో ఒక దేశమునకుగాని మతమునకుగాని ప్రత్యేకపు హక్కులు కాజాలవు. ఆ భగవంతుని సేవించి ప్రతివారును వాసిని బడయుచుందురు. అన్యాయ, అసత్య, దౌర్జన్యములను విశ్వసించు దేశముగాని, మతముగాని ప్రపంచమున నామరూపములు లేకుండబోవును. భగవంతుడు తేజోమూర్తి, అంధకారమయుడు కాడు. భగవంతుడు ప్రేమమూర్తి, ద్వేషి కాడు. భగవంతుడు సత్యమూర్తి, అసత్యమూర్తి కాడు. భగవంతుడే మహామహుడు. మనము ఆయనచే సృజింపబడినవారము; ధూళితో సమానులము. అట్టి మనము నిమ్నస్థానమందున్న భగవత్సృష్టిని నమ్రతతో గౌరవింపవలయును. సుదాముడు చిరిగినగుడ్డపీలికలతో నున్నను అన్యులను భావింపమిచే శ్రీకృష్ణ దాతిథ్యమునందెను. మతమునకు త్యాగమునకును మూలము ప్రేమ యనియు, ఈ క్షణభంగుర దేహము స్వార్థమునకును, అధర్మమునకును మూలమనియును, తులసీదాసు చెప్పుచున్నాడు. మనము స్వరాజ్యమును పొందినను పొందకున్నను, హిందువులు వేదములందలి తత్త్వమును పునరుద్ధరించి, కార్యాచరణలో పెట్టుటకుముందు తాము పునీతులు కావలయును.

## స్వ రా జ్య వి ధా న ము

అయితే, ఈరాటము, హిందూమహమ్మదీయమైత్రి, అస్పృశ్యతా నివారణము, ఒక ఆదర్శమును చేరు సాధనములుమాత్రమే. ఆదర్శ మేదో మనకు తెలియదు. నాకు సాధనములు తెలిసిన చాలును. నాజీవితతత్త్వమునందు సాధనములును, ఆదర్శములును ఒక్కటిగనే కాన్పించెను. కాని ప్రజలకు ఆదర్శ మేదియో సరిగా తెలియవలెనని, బాబు భగవాన్‌దాసు దృఢముగ కోరినందువలన నేనును అందుల కియ్యకొంటిని. భారతదేశము కోరి సంరంభము చేయుచున్న స్వరాజ్యవిధానము తన్నిర్వచనమును పూర్తిగ తెలిసికొనవలెనని, ఆయన కోరెను. సర్వపక్షమహాసభచే నిర్మింపబడిన ఉపసంఘమునకు ఈపని నంటగట్టితిని. ఆయుపసంఘము వారు, అన్ని పక్షములకు అంగీకారవిధానమును తయారుచేయుదు రని నమ్మెదను. వారు పర్యాలోచించుటకై నేను ఈక్రింది యంశములను సూచించెదను :—

(1) ఎన్నుకొను అధికారము ఉండుటకు ఆస్తి హోదానుబట్టి కాక కాంగ్రెసు సభ్యత్వమునకు సూచింపబడినటువంటి కాయకష్టమేదో పరతుగ నుండవలెను. ఆస్తి విద్యలవలన ఇచ్చినహక్కు పరీక్షించిచూడగా పనికిరానిదై పోయెను. కాయకష్టము, కోరువారికి ప్రభుత్వమునందు పాల్గొనుటకును, దాని క్షేమము నాలోచించుటకును అవకాశమిచ్చుచున్నది.

(2) శాంతి సమయములందు ఆస్తిని, ప్రాణమును రక్షించుకొనుటకు సరిపోవునటుల వినాశకరమగు సైనికవ్యయము తగ్గింపవలెను.

(3) న్యాయపరిపాలనమునకు ఖర్చు తగ్గవలెను. అందులకు చివర అప్పీలుకోర్టు లండనులో గాక ఢిల్లీలో ఉండవలెను. సివిల్‌దావాలలో తగాదాలన్నియు పంచాయతుల తీర్మాన

కెప్టను బి. శ్రీనివాసమూర్తి,
ఆయుర్వేదమహాసభాధ్యక్షులు



Captain B. Srinivasa Murthi

సర్ శంకరన్ నాయరు,
భారతసంస్కరణమహాసభాధ్యక్షులు



Sir Sankaran Nair

బాబు పీయూషకాంతి ఘోషు,
భారత ఆధ్యాత్మికమహాసభాధ్యక్షులు



Sjt. Babu Piyushakanti Ghosh

పండిత మదనమోహనమాలవ్యా,
భారత హిందూమహాసభాధ్యక్షులు



Pandit Madan Mohan Malavya

శ్రీయుత డి. కె. భరద్వాజ, ప్రచారణశాఖాధికారి,
అఖిలభారత గ్రంథాలయమహాసభా సమ్మేళన
సంఘాధ్యక్షులు



Sjt. D. K. Bharadwaj

డాక్టరు కిచులూ,
అఖిలభారత ఖిలాఫత్ మహాసభాధ్యక్షులు



Doctor Kichlu

శ్రీయుత బాబు రాజేంద్రప్రసాదు,
స్వదేశవస్తు ఖద్దరుప్రదర్శనోత్సవ ప్రారంభకులు



Sjt. Babu Rajendraprasad

శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి,
అఖిలభారత విద్యార్థిమహాసభా అస్పృశ్యతామహాసభాధ్యక్షులు



Sjt. Cattamanchi Ramalinga Reddy

శ్రీయుత ఏ. రామస్వామి మొదలియారు
అ. భా. బ్రాహ్మణేతర మహాసభాధ్యక్షులు



A. Ramaswamy Mudaliyar

శ్రీయుత గంగాధర బాలకృష్ణ దేశపాండే,
అ. భా. జాతీయమహాసభాహ్వానసంఘాధ్యక్షులు



Sjt. Gangadhara Balakrishna Desapandai

దేశబంధు చిత్తరంజనదాసు,
అఖిల భారత గ్రంథాలయ మహాసభాధ్యక్షులు



Desabandhu C. R. Das

మునకు ఒప్పుకొనునటుల కక్షిదారులను ఒప్పింపవలెను. పెద్దపెద్దమోసములు, అన్యాయములు చేసిన కేసులలో తప్ప పంచాయతుల తీర్పు లే కాయము కావలెను. మధ్య కోర్టు లేమియు ఉండరాదు. కేసుల నడుపుటంతయు అంతయు స్వల్పము చేయవలెను. మనము ఆంగ్లవిధానమును బానిసలముగా అనుసరించితిమి. పలునరాజ్యములందు కక్షిదారులు తమ కేసులలో తామే వాదించుకొనునటుల న్యాయవిధానము స్వల్పముచేయు ఉద్యమము గలదు.

(4) మద్యములు, మత్తుద్రవ్యములనుండి ఆదాయము అసలు లేకుండచేయవలెను.

(5) సివిల్, మిలిటరీ ఉద్యోగుల జీవితములు, దేశముయొక్క స్థితిగతులను బట్టి తగ్గింపవలెను.

(6) రాష్ట్రములను, భాషల ననుసరించి విభజించి ప్రతిరాష్ట్రమును పరిపాలనాభివృద్ధి గాంచుటకు వీలగునటుల సంపూర్ణస్వాతంత్ర్య మీయవలయును.

(7) విదేశీయులకిచ్చిన హక్కులన్నిటినిగూర్చి విచారించుటకు ఒక సంఘమును నియమింపవలెను. ఆవిచారణసంఘము తీర్మానములకు లోనై యుండునటుల న్యాయరీతముగ విదేశీయుల హక్కులకు సంపూర్ణరక్షణ మొసంగవలెను.

(8) కేంద్రప్రభుత్వమునుండి ఎట్టి ఆటంకము కలుగకుండ భారత సంస్థానాధీశులహోదాకు సంపూర్ణరక్షణ మొసంగవలెను. అయితే ఈసంస్థానము నందలి పౌరులు పీనల్ కోడుక్రింద నేరములు చేయకున్నయెడల స్వపరిపాలన మనుభవించు భారత దేశమందు నివాసపుహక్కునుకలిగియుండవచ్చును.

(9) నిరంకుశాధికారము లన్నిటిని రద్దుచేయవలెను.

(10) సర్వోన్నతమైన ఉద్యోగము, అందులకు తగిన వారందరికిని యియ్యవచ్చును. సివిల్, మిలిటరీసర్వీసుల పరీక్షలు భారతదేశమందేజరుగవలెను.

(11) అన్యోన్యసహన ముండునటుల అన్నిమతములకు సంపూర్ణస్వాతంత్ర్య మొసంగవలెను.

(12) రాష్ట్రీయ ప్రభుత్వములందును, శాసనసభలందును, న్యాయస్థానములందును, ఆయారాష్ట్రముల దేశభాషనే ఉపయోగింపవచ్చును. చివర అప్పీలు కోరులో ప్రీవీకౌన్సిలునందు హిందూస్థాని యుండవలెను. లిపి దేవనాగరముగాని, పారసీకముగాని యుండవలెను. కేంద్రప్రభుత్వమందును, కేంద్రశాసనసభయందును, హిందూస్థానియే వాడవలెను. రాజ్యతంత్రమునందు దేశదేశములతో ఉత్తరప్రత్యుత్తరములు ఆంగ్లమునందు జరుపవచ్చును.

పైన తెలిపినవానిలో నాకు తోచినటుల స్వరాజ్యమునకు కావలసినవి కొన్ని చెప్పితిని. ఈ నాభావములు మీకు విపరీతములుగతోచి నవ్వరని నమ్మెదను. నేను చెప్పినపనులను, పరిగ్రహించుటకుగాని చేయుటకుగాని నేడు మనకు శక్తి లేకపోవచ్చును. పోనీ! అందులకు యిష్టమైనగలదా? అట్టి కోరికనైనను కృషిచేసెదము. స్వరాజ్యవిధానమును చిత్తు తయారు చేయుటకు నిర్మింపబడిన సంఘము ఈ విపరీతపు సూచనల యెడల యితరవ్యక్తులు పంపు సూచనలయెడలకంటె ఎక్కువ దృష్టిని వినియోగింప నక్కరలేదని నేను చెప్పుచున్నాను. ఈ నాభావములను ఎక్కుడువ్యాప్తి గాంచవలయుననియే ఈ ఉపన్యాసమునందు చేర్చితిని.

స్వాతంత్ర్యము

పైన వివరించిన విధానమునుబట్టి చూడ బ్రిటిషు సంబంధమును సమానగౌరవ షరతులపై నుంచుకొనునటుల నూహింప వచ్చును. కాని కాంగ్రెసుసభ్యులు కొందరు బ్రిటనుతో సంబంధము లేకుండ సంపూర్ణస్వాతంత్ర్యము కావలెనని కోరువారున్నారని నాకు తెలియును. వారు సమాన భాగస్వాములుగాకూడ నుండ నొల్లరు. బ్రిటిషు ప్రభుత్వమువారు చెప్పినటులచేసి సమానత్వమునకు మనకు తోడ్పడునెడల బ్రిటిషు సంబంధము పూర్తిగ వదలుకొనుదానికంటె అదియే ఎక్కువ విజయముగాంచును. కాబట్టి నేను సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యమునకే ప్రయత్నించెదను. కాని బ్రిటను తప్పిదమువలన వేరగుట ఆవశ్యకమైనయెడల నేనందుల కేమాత్రమును వెనుదీయను. అట్లు వేరు

చేయుభారమును నేను బ్రిటిషుప్రజలమీదనె పడవేసెదను. ఈకాలమున సంపూర్ణస్వతంత్ర దేశములు ఒకటితో నొకటి యుద్ధముచేసికొనక ఒకదానిపై నొకటి ఆధారపడి మిత్రబృందముగ నుండవలెనని విజ్ఞానులు కోరెదరు. అట్టి ఫలితము చేకూరుట కెంతకాలమో కావచ్చును. అట్టిఘనత మన దేశమునకే రావలయునని నేను కోరను. కాని మనము స్వతంత్రముగ నుండుటకన్న పరస్పర మాధారపడియుండు స్వాతంత్ర్యమునకు సిద్ధముగ నున్నామని తెలుపుటలో విశేషముగాని అసాధ్యముగాని నా కేమియు కాన్పించుటలేదు. భారత దేశముతో సంబంధమేమియు లేదని చెప్పవలసిన భారము బ్రిటనుమీదనే యుండవలెను. స్వాతంత్ర్యము మాకు కలదని చెప్పుకొనకుండ సంపూర్ణ స్వాతంత్ర్యముతో నుండుశక్తిని నేను కోరెదను. బ్రిటను భారతదేశమునకు, సామ్రాజ్యమునందు సంపూర్ణ సమానత్వ మొసంగినను, నేను తయారుచేయు నేవిధానమైనను మైత్రిపై ఆధారపడి యుండునుగాని, అట్లు మైత్రిలేని స్వాతంత్ర్యమును అంగీకరింపను. కావున ప్రతిదానికిని స్వాతంత్ర్యము కావలెనని కాంగ్రెసు సభ్యులు పట్టుపట్టవద్దని నేను కోరుచున్నాను. ఇందేమియు అసాధ్యమున్నదని కాదు కాని బ్రిటనుచేసిన ప్రతిజ్ఞ లన్నిటికిని ప్రతికూలముగ తన యధీనములోనే యుంచవలెనను ఉద్దేశ్యము తెలుపువరకును ఇది బొత్తిగ నావశ్యకము లేదని నాతలంపు.

## స్వరాజ్యపక్షము

ఇంతవరకును నేను ఒడంబడికయందలి విషములనున్ను, దానినుండి బయలుదేరు సంగతులను చర్చించితిని. స్వరాజ్యపక్షమున కొసంగిన సమానత్వపుహోదానుగూర్చి యెక్కువ యేమియు జెప్పనవసరములేదు. ఆపక్షమునుగూర్చి యేమియు జెప్పుట యిష్టములేదు. కారణము అర్హత లేదని గాదుగాని శాసనసభాప్రవేశమును గూర్చి ఆ పక్షాభిప్రాయములలో నేను పాల్గొనజాలను. కాని నేను కాంగ్రెసులోనుండి దానిని నడుపవలసియే యుండు నెడల ఉన్న సంగతులనున్నట్లు గుర్తింపవలెను. కాంగ్రెసు నుండి విడిపోవుటగాని, యీ అధ్యక్షగౌరవమును తిరస్కరించుటగాని సులభమే. కాని అట్లు గాలేదు. దేశముయొక్క క్షేమమును గమనించియే యిందు కియ్యకొంటిని. స్వరాజ్యపక్షము అధిక సంఖ్యాకముగ లేకున్నను కాంగ్రెసునందు బలముగ నభివృద్ధిగాంచుచున్న స్వల్పసంఖ్యాకపక్షమై యున్నది. దేశములో దానియొక్క హోదానుబట్టి కాంగ్రెసునందు విభాగముచేయుట నా కిష్టములేదు. అందుచేత నాఅంతరాత్మకు భిన్నముగ లేనంతవరకును, ఆపక్షముయొక్క షరతులకు నేనంగీకరింపక తప్పదయ్యెను. ఆషరతులు కారణరహితము లని నాకు దోచుట లేదు. స్వరాజ్యపక్షమువారు కాంగ్రెసు పేర తమవిధానమును నడుపగోరెదరు. బహిష్కారపక్షమువారు వారి విధానమునకు బద్ధులుగాకుండ అట్లు జరుపుకొనుమార్గము నాలోచింపవలెను. ఇందుల కొకమార్గమున వారు తమవిధానమును నిర్ణయించుకొని నిర్వహించుకొనుటకు ఆర్థికవ్యవహారబాధ్యతలు వారివి వారికి వదలిపెట్టుట. కాంగ్రెసు కొంత బాధ్యత పాల్గొనకుండ ఆవిధానమును నడుపజాలదు. నేనుగాని, యేబహిష్కారపక్షసభ్యుడుగాని ఆబాధ్యతవహింపజాలము. అందువలన నేనా విధాననిర్మాణమునందు పాల్గొనజాలను. అందును మనస్సునకు నచ్చకుండ నిర్మించుట యసాధ్యము. విశ్వాసమెందుగలదో మనసుకూడ అక్కడకే పోవును. శాసనసభాకార్యక్రమవిషయమున కాంగ్రెసు పేరు నుపయోగించుకొనుటకు స్వరాజ్యపక్షమునకు సంపూర్ణాధికారము నొసంగుటవలన కాంగ్రెసు నందు జేరవలె ననుకొనిన యితరపక్షములవారిస్థితి వెగటుగనుండునని నాకు దెలియును. కాని అదితప్పని సరిగ నాకుదోచుచున్నది. స్వరాజ్యపక్షము తనకు గల అనుకూలమును అర్పణచేయజాలదు. అయినను ఆపక్ష మేలాభములు గోరినను స్వతంత్రమునకు గాక దేశమునకే కదా. అన్నిపక్షములవారికి అది ఒక్కటే ఆశయుండగలదు. కావున యితరులుకూడ కాంగ్రెసునందు జేరి దేశముయొక్క రాజకీయములకు మార్గము నీయుటకు పనిచేసెదరని నేను నమ్మెదను. డాక్టరు బెసెంటు దీనికి మార్గదర్శకురా లయ్యెను. ఆమె యింకను యెన్నియోపనులు చేసెడిదేకాని

కాంగ్రెసులోనికివచ్చిపనిచేసి యెన్నికదారులను తన యభిప్రాయమునకు ద్రిప్పవలెనను అభిలాషగలదు. బహిష్కారపక్షమువారు ఒడంబడికకై యెట్టిసంశయము లేకుండ సమ్మతుల నీయవచ్చును. అన్నిపక్షములవారును గలసి పనిచేయవలసిన దేశీయకార్యక్రమము ఖద్దరు, హిందూమహమ్మదీయ మైత్రి, హిందువులు అస్పృశ్యతను దొలగించుట, మైయున్నది. ఇదిమాత్రము వారు కోరుటలేదా?

### సంఘసంస్కరణమేనా?

ఈ కార్యవిధానముతో కాంగ్రెసు సంఘసంస్కరణసంస్థగమాత్రము మారునని సూచింపబడెను. నేను అందు ఏకీభవింపజాలను. స్వరాజ్యమునకు ముఖ్యముగ కావలసిన ప్రతికార్యమందు సంఘసంస్కారముకన్న ఎక్కువైనదిగనున్నది. ఆ పనిని కాంగ్రెసే కావింపవలెను. కాంగ్రెసు, సర్వకాలమును ఈపనినే చేయవలెనని యెవ్వరును సూచింపలేదు. కాని వచ్చే సంవత్సరము మాత్రము నిర్మాణకార్యమునకే లేదా నేను యింకొకరీతిని వర్ణించినటుల అంతరభివృద్ధికే కాంగ్రెసుపని చేయవలెనని సూచింపబడెను.

కాంగ్రెసు చేయవలసిననిర్మాణ కార్యక్రమాంశము లింతటితో ఒడంబడికయందు పూర్తిగ దెలుపలేదు. నేను జెప్పబోవునవి మిగుల ముఖ్యమైనవి. కాని వానియందు వివాదముల కవకాశము లేకపోవుటచేతను, పై దెల్పిన మూడంశములవలె నవి స్వరాజ్యమునకు కేవల మంత ముఖ్యము గాక పోవుటచేతను ఒడంబడికయందు దెలుపమైతిమి.

### జాతీయ పాఠశాలలు

అట్టిది జాతీయవిద్యాలయముల పోషించుటొకటి. ఖద్దరుతరువాత జాతీయవిద్యాలయములు నడుపుటయే విజయవంత మయ్యెనని ప్రజలకు దెలియక పోవచ్చును. ఏమాత్రము విద్యార్థులు మిగిలినప్పటికిని వీనిని వదలిపెట్టరాదు. రాష్ట్రములన్నియును అందలి కళాశాలలను పాఠశాలలను నిలువబెట్టుకొనుట గౌరవాంశమైయున్నది. అట్లుగాకున్న యెడల వానిని పోషించి బలపరచుటకు యెక్కువ ప్రయత్నములు చేయవలెను. చాలరాష్ట్రములందు జాతీయపాఠశాలలును కళాశాలలును గలవు. గుజరాతులో జాతీయవిశ్వవిద్యాలయము గలదు. దానికి సంవత్సరమునకు ఒకలక్ష ధనము కర్చగును. దానిక్రింద 3 కళాశాలలును 70 పాఠశాలలును, 9 వేలమంది విద్యార్థులును గలరు. అహమ్మదాబాదులో దానికి భూమిదొరకెను. భవనముల కప్పుడే రూ205323 కర్చైనవి. దేశమంతట ససహాయ మవలంబించిన విద్యార్థులే సందడి లేకుండ మంచిపనిని జేసిరి. ఇం దద్భుతధీరత్యాగముగలదు. లౌకికదృష్టితో జూచినయెడల వారికి ప్రతిభతో వెలుంగు నదృష్టముతో జూచినయెడల వారు పోయినదనుకొను దానికన్న యెక్కువ గల్చిరని చెప్పవలయును. వారు పాఠశాలలను కళాశాలలను వదలినది పంజాబులో వానిద్వారానే యువకుల నవమానపరచుటచేతనే. మన బానిసత్వపుగొలుసులో మొదటిలంకె యీ విద్యాలయములందే నిర్మితమైనది. వానికి ప్రతిసమానములగు జాతీయవిద్యాలయములు పోషణ యెంతతక్కువగనున్నను స్వాతంత్ర్యసాధనములను నిర్మించుచున్నవి. ఇకముం దాస అంతయును యీ జాతీయవిద్యాలయములందు జదువు బాల బాలికలపై నుండును. కావున రాష్ట్రాదాయములనుండి ముందు వీనిని పోషించుటకు వ్యయముచేయవలెనని నేను కోరుచున్నాను. కాని యీ విద్యాలయములు నిజముగ జాతీయముగనుండవలెనన్న హిందూ మహమ్మదీయ మైత్రి నభివృద్ధిచేయు సంఘములుగ నుండవలెను. హిందూ బాలబాలికలు అస్పృశ్యత మతమునకు గళంక మనియు, మానవాళికి ఘోరనేరమనియు దెలుసుకొనునటుల చేయవలెను. ఈ పాఠశాలలందు నూలువడుకువారలకును నేతగాండ్రకును దగిన శిక్షణ యొసంగవలెను. కాంగ్రెసుకు రాటమునందును ఖద్దరునందును పటుత్వము గలదని విశ్వాసముండునెడల యీ విద్యాలయములు రాటముయొక్క శాస్త్రమును సిద్ధముచేయునని తలంపవచ్చును. అవి ఖద్దరు నిర్మాణమునకు ఫ్యాక్టరీలుగ కూడనుండవలెను. దీనికర్థము బాలబాలికలకు మిగిలిన చదువు అక్కరలేదని కాదు. కాని చేతిపను

లును మనోవృత్తియును తోడుగ నడుచుచుండవలెను. జాతీయ పాఠశాలయొక్కగాని, కళాశాలయొక్కగాని ప్రయోజనమును ఆధిక్యమును అందలి విద్యార్థుల పాండిత్యమునుబట్టికాక జాతీయగుణబలమునుబట్టియు, దూదేకువిల్లంబు, రాటము, మగ్గము పనిచేయుటలో పట్టుదలయు,వీనిని బట్టియుండును. ఏజాతీయపాఠశాలగాని, కళాశాలగాని మూసివేయుట నాకిష్టమేలేదు, అయితే హిందువులు కాని బాలురను చేర్చుకొనకను, అస్పృశ్యులను రానీయకుండను. ఏకులుచేయుట వడుకుట ముఖ్య శిక్షణములుగ నేర్పనటువంటియు జాతీయపాఠశాలలను మూసివేయుటకు నే నెట్టి ఆటంకమును దెలుపను. పాఠశాలవాకిట బల్లమీద 'జాతీయ' యని యుండుటతోను, దానికి ప్రభుత్వసహాయము నేమియు లేకుండుటతోను, సంతోషించు రోజులుపోయినవి. మరియొక విషయముగలదు. జాతీయపాఠశాలలనేకములందు దేశభాషలును హిందూస్థానియు అలక్ష్యముచేయబడుచున్నటుల గాన్పించుచున్నది. దేశభాషలలో గాని, హిందుస్థానీలో గాని విద్య గరపుట నావశ్యకత నింకను ఉపాధ్యాయులు చాలమంది తెలియకున్నారు. శ్రీయుత గంగాధరరావుగారు జాతీయవిద్యాప్రచారకులను సమావేశపరచి నేను చెల్పినయంశము లన్నిటిని చర్చించి విద్యాకర్తవ్యముల గూర్చి ఆలోచించెదరని వినుటకు సంతోషమగుచున్నది.

### ఉద్యోగములను వదలిన అసహాయవాదులు

దేశసేవకొఱకువృత్తినివదలుకొనిన న్యాయవాదులు, ఉపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులు మొదలగువారినిగూర్చి చెప్పుట కిదియేతగినచోటు. సంసారమునుగడపుకొనుట కష్టమైనవారుచాలమందిగలరు. వారలకు దేశము సహాయముచేయవలసినదే. ఖద్దరుబోర్డు, జాతీయపాఠశాలలు, కళాశాలలు, కష్టపడిపనిచేసి తగినఅలవెన్సునుమాత్రముదీసికొనువారికి అవకాశము గలుగజేయవచ్చును. దేశసేవచేయునపుడు ప్రతిఫల మపేక్షింపగూడదనుభావము నాకు దోచుచున్నది.అందు ప్రతిఫలములేకుండ సేవచేయు కోరిక యుండుట ప్రశంసనీయమే కాని అందరును అట్లు చేయజాలరు. ప్రతిపనివానికిని ప్రతిఫలమియ్యవలసినదే. ఏదేశమునందుగాని ప్రతిఫలము పుచ్చుకొనకుండ పనిచేయువారలు వేలకొలదిమంది దొరకరు. కావున దేశభక్తుడు దేశసేవ చేయుచు అందులకు కొంతబత్తెము దీసికొనుట ఉచితమనుభావము అభివృద్ధియగునటుల జేయవలెను.

### మత్తుపదార్థములు

దేశమునకు ముఖ్యమైన మరొక విషయము కల్లు నల్లమందువ్యాపారమునకు సంబంధించినది. 1921లో దేశమంతటను వ్యాపించిన మద్యనిషేధ ప్రచారము దౌర్జన్యరహితముగ సాగియుండినయెడల ఇప్పటి కెంతయో అభివృద్ధి జరిగియుండెడిది. దురదృష్టవశమున చాటుగనో బహిరంగముగనో దౌర్జన్యరూపము దాల్చెను. అందుచేత మద్యనిషేధ ప్రచారము నాపివేయవలసి వచ్చెను. దానితో మరల యథాప్రకారము కల్లు, నల్లమందు దుకాణములు విరివి గాజొచ్చెను. కాని మద్యనిషేధకార్యము పూర్తిగ జావలేదని వినుట మీకు సంతోషముగ నుండవచ్చును. ఇందుల కింకను చాలమంది శాంతముగ పనిచేయుచునే యున్నారు. ఐనను మనము స్వరాజ్యప్రాప్తియగువరకు ఈదురాచారము బొత్తిగా నశింపజేయజాలమని గ్రహింపవలెను. ఈయధర్మాదాయముతో మనపిల్లలకుచదువు చెప్పుచున్నారని గర్వపడ నవసరమేమియును లేదు. శాసనసభలందు ప్రవేశించిన కాంగ్రెసు సభ్యులు, విద్య నభివృద్ధి చేయవీలులేకపోయినను యీ ఆదాయము పూర్తిగ లేకుండజేసినయెడల వారిని నేను క్షమించెదను. మిలిటరీ ఖర్చును తగ్గింపవలె నని వారు పట్టుపట్టినయెడల నిట్టి దేమియును జరుగదు.

### బెంగాలు నిర్బంధములు

ఇంతవరకును లోలోపలకుల్లు సంతను చెప్పితిని. ఇకను బైటికుళ్లను జెప్పెదను. ఇందు మనపాలకులు చేయుపనులు ముఖ్యముగ మన యాదర్శమున కడ్డుదగులుచున్నవి. 'మన మిష్టమున్నయెడల వానిని మన ప్రయోజనములకే మార్చుకొనవచ్చును. లేదా వానికి లొంగినష్టపడవచ్చును. ఈమధ్యనే పాలకులు చేసినపని బెంగాలు నిర్బంధములు. సర్వాపక్ష

మహాసభ దానిని పూర్తిగ ఖండించెను. ఈ దెబ్బ బెంగాలు స్వరాజ్యపక్షముమీద నని ఆ సభవారు కొంతసందేహముతో జెప్పిరి. కాని నా కట్టిదేమియును లేదు. నేను కలకత్తాకు పోయినపుడు వివిధాభిప్రాయములవారితో మాట్లాడగా యీ దెబ్బ స్వరాజ్యపక్షమువారిమీదనే యను నిశ్చయము గల్గెను. పిదప లిట్టనురీడింగు ప్రభువుల ఉపన్యాసములవలన యీ అభిప్రాయము దృఢపడెను. వారిసమర్థన మేమియును నచ్చుటలేదు. అట్టి సమర్థనము ప్రజాభిప్రాయమన్న లెక్కలేని భారత దేశమువంటి చోటనే సాధ్యమగును. లిట్టనుప్రభువు విడుదలజేయుటకు బెట్టిన షరతులు మనవిజ్ఞానమునకు చాల అవమానకరములుగ నున్నవి. ఆ పరిస్థితులలో ఆర్డినెన్సును 1818 రెగ్యులేషనును ప్రయోగింపవలసివచ్చెనని ప్రభువు లనుటలో అపవాదము చేయుచున్నారు. జాతీయవాద మేమనగా;

1. వారుచెప్పినట్టి పరిస్థితు లున్నటుల నిర్ధారణయే కాలేదు.

2. ఒకవేళ అట్టిపరిస్థితులున్నను నివారణోపాయము, రోగమునకుచేయుచికిత్సకన్నను రోగమే మేలనిపించునట్లున్నది.

3. ఆపరిస్థితులలో పనిచేయుటకు సాధారణ న్యాయసూత్రములే చాలును.

4. ఒకవేళ అసాధారణచర్య అవసరమైనను తామే సృష్టించిన శాసనసభ యంగీకారమునైనను బొందియుండవలసినది.

ప్రభువుల ఉపన్యాసములం దీ విషయములనలే కాన్పించవు. ప్రభుత్వమువారెన్నియో నిరాధారపు దండనములగావించునపుడు ఆయనుభవము గల దేశము, వానిని దైవవాక్కుగ నమ్మజాలదు. ఆ ప్రభువులుచెప్పు మాటలను అసత్యము లనియేకాక అవి కళంకపూరితములై వెలువడినవని పలుమారు తెలిసికొనియుండుటవలన మనము నమ్మమని వారికి దెలియును. కావున వారుచేయు హామీలు ప్రజలను హాస్యాస్పదులజేయుటయే. ఈఉపన్యాసములుచూడ మీయిష్ట మేమిచేసినను సరేయని సవాలుచేసినట్లున్నది. కాని మనము అసహనముతో క్రోధము జెందరాదు. నిర్బంధములుమనలనులొంగకుండ జేసినయెడల స్వరాజ్యము త్వరలోరాగలదు. ఏలనన: ఉపద్రవమెంతగల్గినను స్వార్థత్యాగమును ధైర్యమును గలుగజేయును. నిజమైన మానవుడుగాని దేశముగాని నిర్బంధమువలన, బంగారు నిప్పుతో శుద్ధియగునటుల మారును. 1921లో మనము శాసనోల్లంఘనరూపమున నిర్బంధమునకు ప్రత్యుత్తర మిచ్చితిమి. ప్రభుత్వమువారేమిచేసికొన్నను సరే యంటిమి. కాని యిప్పుడు మనగడ్డి మనము తినవలసివచ్చినది. మనము శాసనోల్లంఘనమునకు సిద్ధముగ లేము. అందుకు సిద్ధము గావచ్చును. శాసనోల్లంఘనమునకు సిద్ధమనగా శిక్షణము, ఆత్మనిగ్రహము, అహింస, సత్యాగ్రహము, దైవనిర్ణీతధర్మములకును, మానవనిర్ణీతధర్మములకును విధేయతతోనుండుట ముఖ్యము గనలవడవలెను. దురదృష్టవశమున మనకు ఇందులకు తగినటుల శిక్షణముగాని ఆత్మనిగ్రహముగానిలేదు. మనయందు దౌర్జన్యము గలదు. లేదందుమా నిగ్రహముతో పోరాడగల హింసాశక్తి లేదు. కావలసినంత కూడిక లేదు. ఇకను మనము విధేయతతోనుండుట, భగవంతునకుగాని మానవునకుగాని, నిర్బంధముమీద నైయున్నది. హిందూమహమ్మదీయులమధ్య రోజును అట్టి ధర్మమునకు భంగముగలుగుచున్నటుల జూచుచున్నాము. శాసనోల్లంఘనమునకిది తగినవాతావరణముగాదు. పరాధీనస్థితిలో నణగియున్నవారికిది యొక్కటియే అసమాన ఘోరాస్త్రము. ఇక దౌర్జన్యమే విధి. అందులకు వాతావరణమున్నటుల గాన్పించుచున్నది. అందులకు మనహిందూ మహమ్మదీయ పోరాటములందు శిక్ష గాంచుచున్నాము. దౌర్జన్యమువలన వచ్చునని నమ్మువారు యిట్లు జరుగుపోరాటముల జూచి సంతోషింపవచ్చును. కాని ఆదౌర్జన్యధర్మమునందు నమ్మకము గలవారికి 'మీరు భారతాభివృద్ధికి ఆటంకము గలుగ జేయుచున్నారు' అనిచెప్పెదను. అన్నములేకమాడు లక్షలకొలదిమందియెడ మీకేమైన దయయుండునెడల మిత్రభావముండునెడల మీ దౌర్జన్యము వలన వారి కేమియు లాభములేదని తెలిసికొనుడు.

మీ రెవరినైతే పదభ్రష్టులజేయ దలచుకొన్నారో వారు మీకంటె నెక్కువ కట్టుదిట్టములు గల్గి సిద్ధముగ నున్నారు. మీరు మీ ప్రాణములను లక్ష్యముచేయకపోవచ్చును. కాని దేశమునకై ప్రాణములవిడువ గోరికలేనివారిమాట ఆలోచింపకుండ నుండరాదు. ఈప్రభుత్వము ఆత్మరక్షణకు జలియన్వాలాబాగువంటి హత్యల కిష్టపడునని మీకు దెలియును. ఇతర దేశములమాట యెట్లున్నను ఈదేశములో దౌర్జన్యము వృద్ధియగు నవకాశము లేదు. భారతదేశము అహింసకు పరమస్థానమైయున్నది. మీరు అహింసకై మీప్రాణములను త్యాగముచేయుటవలన జీవితములను మంచిరీతిని గడపుట గాదా?

నేను దౌర్జన్యవిప్లవకారులకు జేయు విజ్ఞప్తి గూడ, దౌర్జన్యయుతమగు అరాజకప్రభుత్వమునకు జేయుదానివలెనే నిష్ఫలమని నాకు దెలియును.

కావున మనము నివారణోపాయము గనుగొని దౌర్జన్యమునకన్న పటుతరసాధన మింకొకటి గలదని ప్రభుత్వమునకును దౌర్జన్యవిప్లవకారులకును దెలియునటుల జెప్పవలెను.

నిర్బంధవిధాన మొక రోగచిహ్నము

ఈనిర్బంధవిధానము ఒకదీర్ఘ జాడ్యమునకు గల చిహ్నమని నేను తలంచెదను. ఐరోపీయాధికారమును, ఆసియా లొంగియుండుటయు దీనికి సిద్ధాంతము. నల్లవారు, తెల్లవారు అనికూడ ఒక్కొక్కసారి యందురు. 'శ్వేతముఖునికాడి శ్వేతముఖుని భార' మని కిప్లింగు తప్పుజెప్పెను. మలయద్వీపకల్పమున (Peninsula) తాత్కాలికముగా నను కొనిన వర్ణాటంక మిప్పుడు దాదాపు శాశ్వతమయ్యెను. మారిషియసులో భారతీయకార్మికులునిరాటంకము గపనిచేయవలెను. కెన్యాఐరోపీయనులు నచట నదివరకేహక్కు యేర్పరచుకొనియున్న భారతీయులపై తోటయజమానులకు నధికారమును చలాయించెదరు. దక్షిణాఫ్రికాయూనియను, వెనుకటి బాధ్యతల నన్నిటిని లెక్కచేయక తరిమివేయగల్గినచో ప్రతిభారతీయుని తరిమివేయును. ఈ అన్నిచోట్లను భారతప్రభుత్వమును, సామ్రాజ్యప్రభుత్వమును నిస్సహాయముగ లేవు. కాని అచట నివాసమేర్పరచుకొనిన భారతీయుల రక్షణకై వారు తగినశ్రద్ధ పుచ్చుకొనుట కిష్టములేకున్నారు. భారతప్రభుత్వమువారు తామే నియమించిన ఫిజీవిచారణసంఘుని వేదికను ప్రచురించు మర్యాదనైన పాటింపకపోయిరి.

అకాలీల అత్యంతస్వేచ్ఛాభావమును అణచుటకు జేసిన ప్రయత్నము యీ రోగమునకే చిహ్నము. వారు ప్రాణపదముగ దలంచిన యుద్యమమునకై తమనెత్తురును నీటివలె ప్రవహింపజేసిరి. వారు తప్పుచేసియుండవచ్చును. ఒకవేళ అట్లుచేసిన యెడల అందు వారే తమరక్తమును ప్రవహింపజేసిరి కాని యితరుల కెవ్వరికిని హానిచేయలేదు. నాన్హానా సాహెబు, గురుకాబాగు, జెయిటోలు వారు ధైర్యముతో కష్టము లనుభవించి దేశమునకై ప్రాణములర్పించిన విషయమును విశదముజేయును. కాని పంజాబుగవర్నరు అకాలీలను అణచివేయ కంకణము గట్టుకొన్నటుల జెప్పుదురు.

నిర్బంధమువలన బర్మాదేశీయుల ప్రాణము గూడ అణగిపోవుచున్నటుల వినుదుము.

ఈజిప్టుస్థితి మనకంటె ఎక్కువగ నేమియు లేదు. ఎవరో వెఱ్ఱియెత్తిన ఒక ఈజిప్టుదేశీయుడు బ్రిటీషు ఆఫీసరును చంపెను. ఇది నిజముగా ఘోర నేరమే. అందులకు జేసినశిక్షగూడ ఘోరమైన నేరమే కాక మానవజాతికెండ గొప్ప దురంతము జేయుటగును. ఈజిప్టుకు దీనితో తనకు లభించినదానినంతయు కోలుపోయెను. ఎవరో ఒకరుచేసిన తప్పునకు ఈజిప్టుదేశ మంతయును నిర్దయతో శిక్షింపబడెను. ఈ హత్యయెడ ఈజిప్టుదేశీయులు సానుభూతి జూపవచ్చును. కాని బీభత్సములేకుండ దేశలాభములను రక్షింప శక్తిగల దేశముగూడ నిట్లు బీభత్సమును ప్రయోగించుటన్యాయమా?

కాబట్టి బెంగాలులో నిర్బంధవిధానము ఆశ్చర్యకరమైన విషయము కాదు. అట్టిది అప్పుడప్పుడు ఏదో ఒకరూపమున యేరాష్ట్రములోనో ఒకచోట మనకు స్వతంత్రమువచ్చువరకును జరుగుచునేయుండును.

## అంగీకారావసరము

కావున కాంగ్రెసు ఏ వైన వాంఛితముల గోరుటకు ముందు అందుకు బలముగ దానియందలి విశ్వాసమునకు దగినటుల అంగీకారము నొసంగవలెను. అట్టిదానిని సిద్ధముచేయుటకు ముందు మనము హిందువులము, మహమ్మదీయులము, క్రైస్తవులము, సిక్కులము, పార్శీలము ఏకము గావలయును. అట్లే స్వరాజ్యపక్షము, బహిష్కారపక్షము, మితవాదులు, హోంరూలుపక్షము, ముస్లింలీగువారు, ఇతరులు అందరును ఏకము గావలయును. అందరమును ఐకకంఠ్యముగ మాట్లాడగల్గి మనమనస్సును మనము దెలిసికొనునెడల బాగుగనే యుండును. విదేశవస్త్రమును మనదేశములోనికి రాకుండ జేయగలశక్తిని విజృంభింప జేసినయెడల మంచిదే. అప్పుడు మనము స్వీకరణమునకు సిద్ధముగ నుందుము.

## నా విశ్వాసము

ఇకను నావిశ్వాసమేమియో జెప్పెదను. నేను కాంగ్రెసుసభ్యుడనై కాంగ్రెసును పటుత్వముగ నుంచుటకుగాను, దేశము సిద్ధముగ లేకపోవుటవలన అసహాయోద్యమమును ప్రస్తుతము విరమింపగోరెదను. కాని నేనుమాత్రము ప్రభుత్వ మావిధముగనే యుండ అట్లుచేయను; చేయజాలను. ఇది నావిషయమున అనుష్ఠానయోగ్యవిధానముగనేకాక చిరవిశ్వాసవిషయముగనున్నది. అసహాయోద్యమము శాసనోల్లంఘనము రెండును సత్యాగ్రహవృక్షము యొక్క భిన్నశాఖలే. అది నాకు కల్పద్రుమమువంటిది. సత్యాగ్రహమనగా సత్యాన్వేషణమే. భగవంతుడే సత్యము. ఆసత్యమును అహింస యను జ్యోతి నాకు ప్రకటింపజేయును. స్వరాజ్యము నాకు ఆసత్యములో భాగముగ గాన్పించుచున్నది. ఈ సత్యాగ్రహము దక్షిణాఫ్రికాలోగాని, ఖేడాలోగాని, చాంపరానులోగాని మరెక్కడనుగాని నిష్ప్రయోజనముగా లేదు. ఇందు దౌర్జన్యముగాని ద్వేషముగాని లేదు. కావున నేను ఆంగ్లేయుని ద్వేషింపను. ద్వేషింపజాలను. వారికాడిని నేను భరింపనుజాలను. భారతదేశమునందు బ్రిటిషువారు తమమార్గములను సంస్థలను ప్రవేశపెట్టజేయు అపవిత్రకార్యములను ప్రతిఘటించి ప్రాణముపోవువరకును పోరాడెదను. ఇందులకు నాకు అహింసయే సాధనము. ఆంగ్లపాలకులతో అహింసాసంరంభము జేయుటకు భారతదేశమునకు సామర్థ్యము గలదని నేను నమ్మెదను. ఈపరీక్ష అపజయము గాంచలేదు. అది విజయమే గాంచెనుగాని అనుకొనినంతగా లేదు. నాకేమియు నిరాశ గల్గుటలేదు. కొద్దికాలములోనే భారతదేశము స్వస్థానమును చేరగలదని నాకు నమ్మకము గలదు. అందుకైనను సత్యాగ్రహమే మార్గము. ఇప్పుడు అసహాయోద్యమమును విరమించుటగూడ ఈ పరీక్షలో భాగమే. నేను తయారుజేసిన విధానము సఫలమగునెడల అసహాయోద్యమమును మరల ప్రారంభింపనక్కరలేదు. ఈకార్యవిధానమపజయము గాంచునెడల దౌర్జన్యరహితమైన అసహాయోద్యమము కాంగ్రెసుద్వారా గాని ప్రత్యేకముగాగాని ప్రారంభింపవలయును. సత్యాగ్రహమెప్పటికిని అపజయముగాంచదనియు, సత్యమును నిరూపించుటకు ఒక్క సత్యాగ్రహినైనను చాలుననియు నే ననేకపర్యాయములు చెప్పియుంటిని. మన మందరమును సంపూర్ణ సత్యాగ్రహులమగుటకు ప్రయత్నము జేసెదముగాక! ఈప్రయత్నమునకు మనలో నిమ్నస్థితియందున్నవారుగాంచని సుగుణమునేమియు గాంచనక్కరలేదు. ఏలననగా సత్యాగ్రహము మనలో నున్న భావవిశేషమే. అయ్యది మనలో నందరలోను గలదు. స్వరాజ్యమువలెనే అది మనజన్మస్వత్వము. మనము దానిని దెలిసికొందముగాక.

# తీర్మానములు

## 1. పరామర్శలు

శ్రీఅమ్మ, సర్ అశుతోషముఖర్జీ, సర్ అశుతోష చౌదరీ, భూపేంద్రనాథ బాసు, డా. సుబ్రహ్మణ్యయ్యరు, రాయ బహాదురు సిరి, గోవింద వెంకటేశయాల్జీ, వామనరావు మహాశిరు, టి. వి. గోపాలస్వామి మొదల్యారు, సి. వి. వి. శివముగార్లును, దక్షిణఆఫ్రికాలో రస్తుంజీ జీవన్జీరూస్తుంజీ, పి. కె. నాయుడుగార్లును మరణించినందులకు విచారించుచు, వారి కుటుంబములకు కాంగ్రెసుసభవారు సానుభూతి దెలుపుచున్నారు.

## 2. కలకత్తా ఒడంబడిక నూలుచందా

(1) మహాత్మా గాంధిగారికిని, స్వరాజ్యపక్షము తరపున దేశబంధు, సి. ఆర్. దాసు, పండిత మోతీలాలు నెహ్రూగారికిని జరిగిన ఒడంబడికను కాంగ్రెసుసభ అంగీకరించుచున్నది.

(2) ఆ ఒడంబడికవలన కాంగ్రెసులోని రెండు తెగలవారికి ఐక్యత కుదురుననియు, యితర రాజకీయ సంస్థల సభ్యులు కాంగ్రెసులో చేరుటకు వీలగుననియు సభవారు తలంచుచున్నారు. నూతన ఆర్డినెన్సు, రేగ్ 1818 రెగ్యులేషను 3 క్రిందను నిర్బంధింపబడిన స్వరాజ్యపక్షమువారిని యితరులను కాంగ్రెసు అభినందించుచున్నది. భారతీయులు తమ పౌరస్వత్వమును స్వేచ్ఛను ప్రకటించుకొను సామర్థ్యము లేనంతకాలము యిట్టి నిర్బంధములు తప్పవనియు, అట్టి సామర్థ్యము ప్రస్తుత స్థితిలో చాలకాలమునుండియు వెనుక బెట్టబడిన విదేశవస్త్ర విసర్జనమువలనగాని రాదనియు, భావించుచున్నది. కావున యీజాతీయాదర్శమును బడయుటకు దేశీయులయందలి ఉత్సాహము కార్యతత్పరతకు చిహ్నముగా నూలువడుకుటను సభ్యత్వపు అర్హతగా చేర్పరచి కాంగ్రెసునందు ప్రతివారిని చేరమని గోరుచున్నది.

(3) పైన దెలిపినదాని ననుకరణీయముగా భారతీయ స్త్రీ పురుషులెల్లరు విదేశవస్త్రముల విసర్జించి చేతితో నూలువడికి చేతితో నేయించిన వస్త్రములనే ధరించవలెను. ఆయాదర్శమును సత్వరముగ నెరవేర్చుటకై కాంగ్రెసు సభ్యులెల్లరు నూలువడుకుట నభివృద్ధిచేసి ఖద్దరు ఉత్పత్తిని, ఖద్దరు విక్రయమును హెచ్చించెదరని కాంగ్రెసు సభవారు దలంచుచున్నారు.

(4) సంస్థానాధీశులును, భారతీయులలో ధనాధికులును, కాంగ్రెసులో ప్రాతినిధ్యములేని యితర రాజకీయసంస్థలసభ్యులును మునిసిపలు స్థానికపంచాయితీ సంఘములవారును, యితరసంఘముల వారును స్వయముగా నుపయోగించుటవల్లను యితరవిధములను నూలువడుకుటను వ్యాపింపజేసి, ఖద్దరుపై ధరలను తగ్గింపగల కళానిపుణులను ప్రోత్సహింపవలెనని దేశీయమహాసభ కోరుచున్నది.

(5) విదేశవస్త్రములు, నూలు వ్యాపారమునందున్న వర్తకులు, దేశశ్రేయము నారసి, విదేశవస్త్రములు నూలు దిగుమతుల మానుకొని ఖద్దరువ్యాపారముచేసి జాతీయగృహపరిశ్రమలకు సహాయముచేయవలెనని దేశీయమహాసభ విన్నవించుచున్నది.

(6) మిల్లులలో ఖద్దరుపేర ముతకగుడ్డ తయారుచేయు భారతదేశమంతు విక్రయించుచున్నటులు తెలియుచున్నది. కావున మిల్లుయజమానులు ఇట్టి అప్రామాణ్యాగారములను మానివేసి భారతదేశమందలి పురాతనగృహపరిశ్రమల నుద్ధరించుటకు ప్రోత్సాహముచేయవలెననియు, కాంగ్రెసుకట్టుబాటులోనికి రానిచోట్లనే తమవస్త్రములను విక్రయించుకొనవలెననియు, యికమీద విదేశపునూలు దిగుమతిచేయ మానుకొనవలెననియు, దేశీయమహాసభ విన్నవించుచున్నది.

(7) హిందూమహమ్మదీయ మతాధికారులను ఇతరమతప్రచారకులను తమతమ సంస్థలయందు సభలయందు ఖద్దరుసందేశమును బోధచేసి విదేశవస్త్రముల విసర్జించుటట్లు సలహా యీయవలెనని దేశీయ మహాసభ విన్నవించుచున్నది.

## 3. కాంగ్రెసు నిర్మాణమునందు మార్పు

(1) 4 వ నిబంధనప్రకారము అనర్హుడుగాని ప్రతివారును రాష్ట్రీయకాంగ్రెసు సంఘముక్రింద నుండు ఏదే ముఖ్యసంస్థయందైన సభ్యుడుగా నుండవచ్చును. రాజకీయ లేక కాంగ్రెసు, పనులయందున్నపుడు చేతితో నూలు తీసి చేతితోనేసిన ఖద్దరు వస్త్రముల ధరింపనివారుగాని, సాలునకు 24,000 గజములు సాపుగా తాను వడికిన నూలునుగాని తాను అస్వస్థతగానున్నను, మరి యేకారణము వలన నైనను ఇతరులచే వడికించిన అంత నూలును చందాగా పంపకుండినను, వారు కాంగ్రెసు సంస్థలయందు సభ్యులు కాజాలరు. ఎవరునుగూడ ఒకేసారి రెండుకాంగ్రెసు సంస్థలలో సభ్యులుగా నుండజాలరు.

(2) సభ్యత్వము జనవరి 1 వ తేదీనుండి, డిశంబరు 31 వ తేదీ వరకు లెక్కచేయబడును. పైనదెలిపిన నూలుచందా ముందుగా గాని, లేకున్న నెలకు 2000 గజములకు తప్పున వాయిదాలపైనగాని పంపవచ్చును. సంవత్సరము మధ్యను చేరు సభ్యులు సాలునకగు చందాయంతయు చెల్లింపవలసి యుండును. (తాత్కాలిక నియమము)—1925 సంవత్సరమునకు మాత్రము సాలునకు చందా 20,000 గజములు, మార్చి 2 వ తేదీలోపుగా అంతయుగాని దా పైన దెలిపినవిధమున వాయిదాలపై గాని చెల్లింపవచ్చును.

(3) వాయిదాలకు సరిగా నూలుచందాలు చెల్లింపజాలకపోయినవారు, కాంగ్రెసుసంస్థలలోని సంఘములకు లేక ఉపసంఘములకు ప్రతినిధుల నెన్నుకొనుటకుగాని, ఎన్నుకొనబడుటకుగాని అట్టి సంస్థలసభలయందు పాల్గొనుటకుగాని అనర్హులగుదురు. వాయిదాకు సరిగా చెల్లింపజాలకుండిన సభ్యులు తిరిగి దానిని తరువాతినెలలో చెల్లించి తన సభ్యత్వపు హక్కును మరల సంపాదించుకొనవచ్చును.



మహాత్మాగాంధి, ఇతరనాయకులు స్వచ్ఛందసేన దళమును తిలకించుట

Mahatmaji and other leaders seeing the Volunteers



జాతీయమహాసభకు విచ్చేసిన మహమ్మదీయ నాయకులు

Moslem Leaders

The 39th Indian National Congress, Belgaum

ఆంధ్రపత్రిక - సంవత్సరాదిసంచిక

ముప్పదితొమ్మిదవ భారతజాతీయ మహాసభ, బెల్గాము

మూడవ అఖిలభారత గ్రంథాలయమహాసభా ప్రతినిధులు



Delegates, The Third All-India Public Libraries Conference

ఖద్దరు-దేశీయ వస్తువుల దుకాణములు



Khaddar and other National Stores

The 39th Indian National Congress, Belgaum

(4) ఈ నిబంధనప్రకారము వచ్చునాలు చందాలెక్కలను ప్రతిరాష్ట్రీయ కాంగ్రెసుసంఘము నెలవారిగా అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యదర్శి కంపుచుండవలెను. వచ్చినసొమ్ములలో 1/10 వ వంతును గాని దానివిలువనుగాని అఖిలభారతజాతీయసంఘమున కంపుచుండ వలెను.

(5) ప్రస్తుతమున్న 6 వ (ఇ) నిబంధనను 86 (బి) నిబంధనను విడిచిపెట్టుడు.

## 4. సరోజినీదేవి సేవను కొనియాడుట

ఈ దేశములందలి భారతీయులవిషయమున నెంతయు సేవజేసి తన వాగ్ధోరణిచే ఐరోపియనుల సానుభూతినిగూడబడసి అచ్చటి భారతీయుల ప్రేమకు పాత్రురాలయిన శ్రీమతి సరోజినీ నాయుడు గారి సేవను దేశీయమహాసభ కొనియాడుచున్నది.

కెన్యానివాసులకై పాటుపడిన నేజి (భారతసేవకసంఘము) బనారసీదాసు చతుర్వేదిగార్లకు గూడ కృతజ్ఞత దెలుపుచున్నది.

## 5. బర్మనులయెడ సానుభూతి

బర్మనుల కష్టదశయందు దేశీయమహాసభ సానుభూతి దెలుపుచున్నది. ప్రస్తుత నిర్బంధములకు వారు లొంగిపోగూడదని కోరుచున్నది.

బర్మాలోని కొందరు భారతీయులు సాంఘిక ప్రాతినిధ్యము కొరకై పాటుపడుచుండుటచే అట్టి ప్రత్యేకభావములుండుట మంచిది గాదు గావున అట్టిహక్కుల గోరరాదని కాంగ్రెసు సలహా నొసగుచున్నది.

## 6. కోహాటు గుల్బర్గాతీర్మానము

"భారతదేశములో అనేకచోట్ల హిందూమహమ్మదీయ విభేదములు పెరిగి అల్లరులు జరుగుచున్నందులకు దేశీయమహాసభ విచారమును దెలుపుచున్నది.

ఈమధ్య కోహాటులో అల్లరులు జరిగి ప్రాణభంగమును ఆస్తి నాశనమును సంభవించుటయేకాక దేవాలయములును గురుద్వారములును నాశనమైనందులకు దేశీయమహాసభ విచారమును దెల్పుచు స్థానికాధికారులు ప్రాణమును ఆస్తిని రక్షించు ప్రధానధర్మమునే నిర్వర్తింపలేకపోయిరని అభిప్రాయపడుచున్నది.

కోహాటునుంచి హిందువులను బలవంతముగ పంపివేసినందులకు దేశీయమహాసభ విచారమును సూచించుచు కోహాటు మహమ్మదీయులు హిందూసోదరుల ప్రాణములను ఆస్తిని రక్షించెదమని అభయ మొసంగి మిత్రులుగను ఇరుగుపొరుగువారిగ లెను వచ్చియుండవలసినదని ఆహ్వానింపవలసినదిగ కోరుచున్నది.

కోహాటు మహమ్మదీయులు సాదరముగ ఆహ్వానించిననే తప్ప అన్యత్ర శరణుచొచ్చిన హిందువులు మరల కోహాటుకు వెళ్లవలదని దేశీయమహాసభ సలహానిచ్చుచున్నది.

హిందువులుగాని మహమ్మదీయులుగాని, భారతప్రభుత్వము విచారణసలిపి కోహాటువివాదముపై ప్రచురించిన విషయములు, నంగీకరింపక ఈ దురంతమునుగూర్చి ఐకమత్యమహాసభ నియమించిన సంఘమో లేక తత్సమానమగు సర్వప్రాతినిధ్యసంఘమో విచారించి నిర్ణయము గావించుపరకును ఎట్టి అభిప్రాయములను దెలుపగూడదని దేశీయమహాసభ సలహా నిచ్చుచున్నది.

గుల్బర్గా అల్లరులలో నష్టపడినవారియెడల దేశీయమహాసభ సంపూర్ణసానుభూతిని దెల్పుచు దేవాలయములను అపవిత్రములుగ జేసిన కార్యములను ఖండించుచున్నది."

## 7. అస్పృశ్యత

హిందువుల యభిప్రాయమునందు అస్పృశ్యతను తొలగించుటను గూర్చి గలిగిన అభివృద్ధికై సంతోసము దెలుపుచు యింకను చాలపని జరుగవలసియున్నది కావున కాంగ్రెసులోని హిందూసభ్యులెల్లరు యింక నెక్కువ పాటుపడవలెనని దేశీయమహాసభ కోరుచున్నది. రాష్ట్రీయకాంగ్రెసు సంఘసభ్యులు నిమ్నజాత్యుద్ధరణమునకై యెక్కువ శ్రద్ధను వినియోగించి వారలను నూతుల దగ్గరకును, దేవాలయములలోనికిని రానిచ్చి, విద్యాభివృద్ధికి వసతు లేర్పరుచవలెనని కోరుచున్నది.

వైకంలో హిందువులలోని ఉన్నతజాతివారికి నిరాఘాటమై తమకు నిషేధింపబడిన బాటలపై నడువ హక్కును సాధించుటకై సత్యాగ్రహమును బూనిన అస్పృశ్యులను, వారి అహింస, ఓర్పు, ధైర్యగుణములకై, అభినందించుచు, తిరువాంకూరు సంస్థానాధీశులు సత్యాగ్రహులు కోరుచున్నదానియందు న్యాయము గలదని గుర్తించి వారికి సత్వరముగ ఉపచారము చేయుదురని దేశీయమహాసభ తలంచుచున్నది.

## 8. విదేశములందలి భారతీయులు

భారతప్రభుత్వమువారును సామ్రాజ్యప్రభుత్వమువారును విదేశములందలి భారతనివాసులను రక్షించెదమని హామీచేసియు అట్లు చేయజాలక పోవుటకును, అచ్చటివారికి కష్టము లధికమగుచున్నందుకు దేశీయమహాసభ చాల విచారమును దెలుపుచున్నది. అచట నివాసమేర్పరచుకొన్న వారియెడల సానుభూతి దెల్పుచు భారతదేశము స్వరాజ్యము బొందువరకును యెట్టిసహాయమును జేయజాలనందుకు విచారించుచున్నది.

నేటాలు రాష్ట్రీయశాసనసభయందుగల ఆర్డినెన్సునకును, అచ్చట స్థిరనివాసులగు భారతీయులు మునిసిపలు ఎన్నికహక్కులను పెక్కేండ్లనుండి నిరాటంకముగా ననుభవించుచున్నను వానిని తొలగించు శాసనమును దక్షిణాఫ్రికా గవర్నరుజనరలుగారు ఖాయపరచి

నందులకును, కాంగ్రెసుసభ సంపూర్ణముగ అసంతృప్తిని దెలుపుచున్నది. ఇట్లు ఎన్నిక హక్కును తొలగించుట అన్యాయమేకాక 1914 సం॥ యూనియను ప్రభుత్వమువారికిని భారతీయులకును జరిగిన ఒడంబడికకును నేటాలు ప్రభుత్వప్రకటనలకును విరుద్ధముగ నున్నది. కెన్యాపరిష్కారము అప్పటి భారతీయులకు న్యాయమైన హక్కులను తొలగించుట తప్ప వేరేమియుగాదని కాంగ్రెసు తలంచుచున్నది.

## 9. జాతీయవిద్యాసంస్థలు

భారతదేశ భావ్యభివృద్ధి నేటియువకులపై నాధారపడియున్నది. కావున రాష్ట్రీయకాంగ్రెసు సంఘములన్నియు యిప్పుడున్న జాతీయ విద్యాసంస్థలన్నియు సజీవముగ నుండునట్లు ద్విగుణీకృతోత్సాహముతో బనిచేయవలెను. ప్రస్తుతమున్నవాటిని స్థిరముగా నుంచవలెననియు, నూతనసంస్థను స్థాపింపవలెననియు కాంగ్రెసుసభ గోరుచున్నను, దేశభాషలద్వారా విద్య నేర్పుట, హిందూమహమ్మదీయ సఖ్యతను ప్రోత్సహించుట, అస్పృశ్యతను తొలగించి అస్పృశ్యులయందు విద్య వ్యాపింపజేయుట, నూలువడుకుట, నేయుట, దేశీయపరిశ్రమలను, ఆత్మసంరక్షణవిధానమును నేర్పుట, యీపనులను చేయని పాఠశాలలును 12 ఏండ్లకు మించిన విద్యార్థులును ఉపాధ్యాయులును ఎల్లరును దినమునకు ½ గంటకాలము నూలువడుకక ఖద్దరుధరింపకుండు పాఠశాలలును జాతీయపాఠశాలలుగా కాంగ్రెసుసభచే గుర్తింపబడవు.

## 10. జాతీయప్రచారము-వేతనములు

జాతీయప్రచారమునకై అర్హులగువారు వేతనములు పుచ్చుకొనుటకు ఇష్టపడకుండుటచే తగినంతమంది దేశారాధకులు లభింపకున్నారు. దేశసేవకొనర్చినపుడు ప్రతిఫలము పుచ్చుకొనుట మర్యాదకు లోపముగాదనియు విశ్వాసముతో పనిచేసినందువలన ప్రతిఫలము పుచ్చుకొనుట గౌరవముగా భావించి దేశాభిమానులగు యౌవనులు స్త్రీపురుషులు గూడ దేశసేవచేయు నుద్దేశమున్నచో దేశసేవనే కోరి చేయవలెననియు దేశీయమహాసభ భావించుచున్నది.

# హిందూమహాసభ తీర్మానములు

## 1. పరామర్శ

తిరువాంకూరు మహారాజాగారు, సర్ అశుతోషముఖర్జీ, సర్ అశుతోషచౌదరీ, భూపేంద్రనాథబాసు, డా॥ సర్ సుబ్రహ్మణ్యయ్యరు- లాలా కన్నయ్యలాలుగార్లు కాలముచేసినందుకీ సభవారు విచారించుచు వారి కుటుంబములకు సానుభూతి దెలుపుచున్నారు.

## 2. స్థానిక హిందూసభలు

ప్రతి జిల్లాయందును తాలూకాయందును హిందూ మహాసభోద్దేశముల నెరవేర్చుటకై శాఖాసంఘములు నేర్పరుపవలెను. హిందువులయందు సాంఘిక మతసంస్కారము ప్రబలజేయుటకును అవసరమగు చోట్ల హిందూసంఘమువారి రాజకీయహక్కులను కాపాడుటకును హిందూ సభలను ప్రతినగరమునందును పల్లెయందును స్థాపింపవలెను.

## 3. ప్రాతతీర్మానములు ఖాయపరచుట

1. హిందూమహాసభ కాశీ, ప్రయాగలందు చేసిన తీర్మానములను యీసభవారు బలపరచుచున్నారు.

2. జాతీయాభివృద్ధికి భంగము రాకుండ అన్నివిషయములందును హిందువులు శక్తిపూర్వకముగ మిగతవారితో సంఘర్షణ లేకుండ పనిచేయవలెను;

3. బ్రహ్మచర్యాశ్రమవిధానము ననుసరించుచు బాలబాలికలకు మత విజ్ఞానవిద్యల బోధించవలెను;

4. ఏమైననుసరే బాలికలకు 12 సంవత్సరములు బాలురకు 18 యేండ్లు రానిదే వివాహము చేయగూడదు;

5. శాంతిని నెలకొల్పుటకు యత్నించు మిగత సేవాదళములతో కలిసి పనిచేయుటకు హిందూసభ తరఫున సేవాదళముల నిర్మించవలెను;

6. దేవనాగరలిపితో హిందీ నభ్యసింపవలెను;

7. సక్రమముగా మతధర్మములను రక్షింపవలెను;

8. ఖద్దరువ్యాప్తికై ముఖ్యముగా కృషిఫలములు స్వదేశీవస్తువుల నాదరింపవలయును;

9. మతసూత్రముల బోధించుటకు మంటపముల నిర్మింపవలయును;

10. నిమ్నజాతుల యభివృద్ధి కన్నివిధములను తోడ్పడుచు వారిని ఆలయములలోనికిని, ప్రజోపయోగమునకై యున్న చెరువులు, బావులు, పాఠశాలలు వీటికన్నిటికిని రానీయవలెను; అట్లు లేనిచో వారికి ప్రత్యేకముగా ఆలయములు బావులు కట్టించవలెను; ఉత్సవసమయములందు, తీర్థయాత్రలప్పుడు, వివాహములందు, నావలపై ప్రయాణముచేయునపుడు, యుద్ధమప్పుడు, ఇతర సమయములందును వారిని, అభ్యంతరపెట్టగూడదని శాస్త్రప్రమాణము లున్నవి; అను తీర్మానము లామోదింపబడెను.

## 4. హిందూ మహమ్మదీయ సమస్య

ఈ దిగువ పేర్కొనబడిన వారిని రాజ్యాంగ విధానసంస్కరణలకు సంబంధించినంతవరకు హిందూమహమ్మదీయ సమస్యలను పరిష్కరించుటకుగాను ఒక ఉపసంఘముగా నియమింపవలెను.

పంజాబు:—లాలా లజపతిరాయి, లాలా హన్సరాజ, రాజా నరేంద్రనాథుగార్లు.

సం॥ రాష్ట్రములు:—గా॥ రాజా సర్ రాంపాలుసింగు, సి. వై. చింతామణి గా॥ లాలా సుఖబీరసింగుగార్లు.

బీహారు:—రా. బ. ద్వారకనాథు, రాజేంద్రప్రసాదుగార్లు.

వంగ:—రాయి యతీంద్రనాథచౌదరీ, బ్రజేంద్రకిశోరరాయి చౌదరీగార్లు.

మధ్యరాష్ట్రి:—డా॥ మూంజీ, ఎం. ఎస్. ఆనీగార్లు.

మహారాష్ట్రి:—ఎన్. సి. కెల్కారు, ఆర్. పి. కరేండికరు గార్లు.

మదరాసు:—ఎస్. సత్యమూర్తి, టి. ప్రకాశం. సి. ఆర్. రెడ్డి గార్లు.

బొంబాయి:—ఎం. ఆర్. జయకరు, డి. వి. బెల్వి, రాజా గోవిందలాలుగార్లు.

గుజరాతు:—డా॥ సుమంత, బి. మెహతాగార్లు.

సింధు:—జయరామదాసు, దౌలతరాముగార్లు.

ఈసంఘమునకు లాలా లజపతిరాయిగారధ్యక్షులు.

ఈ సంఘమువారి ఖర్చులకై రూ 5,000 ధాయము జేయవలెను.

## 5. నేపాలు స్వాతంత్ర్యము

నేపాలు దేశమునకు బ్రిటీషు ప్రభుత్వమువారు స్వాతంత్ర్యమిచ్చినందులకు హిందూమహాసభవారు సంతసమును దెలుపుచున్నారు. నేపాలుమహారాజాగారు తమరాజ్యమున బానిసత్వమును తొలగింపనెంచినందులకు అభినందించుచున్నారు.

## 6. కోహాటు దురంతములు

(1) సెప్టంబరు 9 వ తేదీనను అటుపిమ్మటను కోహాటులో హిందూసిక్కు సోదరులకు స్థానిక మహమ్మదీయులచేతను సరిహద్దుజాతుల మహమ్మదీయులచేతను కలిగిన ప్రబలనష్టమునకును 875 హిందూ గృహములను అంగడులను కాల్చివేయబడినందులకును యీసభవారు చాల విచారించుచున్నారు. చాలను దేవాలయములు గురుద్వారములును ధ్వంసముచేయబడుటచే హిందూసిక్కు సోదరులచ్చోటు విడిచి రావల్సిండియున్నగు స్థలాంతరములకు బోయి శరణుచొచ్చిరి.

(2) స్థానికాధికారులకు యీదురంతము జరుగునని ముందుగా దెలిసినను, అచ్చటి కంటోనుమెంటునుండి కొలదిమంది సైనికుల సహాయమున దీనిని వారణచేయ గలిగియున్నను అటు లక్ష్యపెట్టించి దుండగీడుల పట్టుకొనలేక అల్లరి వాచజాలక పోయినందులకు చింతిలుచున్నారు.

(3) ఇదివర కెన్నడును జరుగనంతటి దురంతములు జరిగినను యిండ్లువాకిళ్లు విడిచి పటాపంచలై పారిపోయి 4 నెలలనుండి స్వమత స్థల సానుభూతిపై బ్రతుకుచు 8000 కు పైగా హిందువులు పరితపించుచున్నను సరిహద్దు రాష్ట్రముల ప్రభుత్వమువారు సానుభూతిచూపనందులకు యింతవరకు, హిందూమహమ్మదీయులమధ్య రాజీకుదుర్చలేకుండిన యీప్రభుత్వమువారి అసమర్థతకును, ఈ సభవారెంతయు చింతిలుచున్నారు.

4 హిందువులను విచారింపకయే అసంపూర్ణ సాక్ష్యముల నాధారముజేసికొని కేసువివరములను తెలిపినట్లు ప్రకటించిన అనుభవములేని చిన్నఉద్యోగియగు మేజస్ట్రేటుమాటలను నమ్ముకొని సరిహద్దురాష్ట్రముల ప్రభుత్వమువారును, ఛీఫుకమీషనరుగారును యింతటి అపాయకరమగు విషయమును పరిష్కరింపనెంచినందులకు యీసభవారెంతయు విచారించుచున్నారు.

(5) ఈ విషయమంతయు పరిష్కరించి, హిందువులకు రక్షణయొసంగుటకును, బాధనొంది నష్టపడినవారికి పరిహారమొసంగుటకును ఇట్టి అక్రమకార్యములు యికముందు జరుగకుండ కట్టుదిట్టములు చేయుటకును సూచనల జేయుటకయి ప్రజావిశ్వాసము గల స్వతంత్ర బహిరంగవిచారణచేయుట కొరకు ఉపసంఘమును నియమించుట ఆవశ్యకము.

(6) కోహాటుహిందువులలో ముఖ్యులను కొందరను భయపెట్టి అరెస్టుచేసి సంతృప్తికరమైన షరతులు లేకున్నను మహమ్మదీయులతో రాజీపడవలెనని ప్రభుత్వమువారు నిర్బంధించినట్లును, ఆ సంధియేర్పాటులు నిష్ఫలముకాగానే తిరిగి హిందువులలో ముఖ్యులగువారిని అరెస్టుచేయునటులు ఆజ్ఞాపించినట్లును యీ సభవారికి దెలియుచున్నది. సంధిప్రయత్నములు నిష్ఫలమగుటకు తాము బాధ్యులముకామని హిందూప్రతినిధు లనుచున్నారు. గౌరవనీయులగు యీ హిందువులను 8 నెలలకు పైగా విచారణలేనిది ఖైదుచేయుట భావ్యముకాదు. కాన వెంటనే వారిని జామీనుపై విడిచి వారికేసులు పంజాబుకు మార్చవలెనని యీ సభవారు గోరుచున్నారు.

(7) కోహాటులో నష్టకష్టములకు పాలయినవారందరికి యీ సభవారు సానుభూతి దెలుపుచున్నారు. అట్లు సానుభూతి దెలుపువారెల్లరు వెంటనే హిందూమహాసభతరఫున ప్రారంభించబడు కోహాటుసహాయనిధికి తమకుదోచిన ధనసహాయమునుజేసి, పంజాబు నేషనలుబ్యాంకునకుగాని, సెంట్రలుబ్యాంకునకుగాని చెల్లింపవలెనని యీ సభవారు గోరుచున్నారు.

## 7. గుల్బర్గా దురంతములు

గుల్బర్గాలో మహమ్మదీయులు హిందూదేవాలయములను బుద్ధిపూర్వకముగ కూల్చినందులకు చింతించుచున్నారు. వాటినన్నింటిని తిరిగి కట్టించుటకును యిట్టి అక్రమము లికముందు జరుగకుండచేయుటకును నైజాము ప్రభుత్వమువారు తగిన చర్యదీసికొనెదరని యీ సభవారు నమ్ముచున్నారు.

## 8. వైకం సత్యాగ్రహము

మనస్వమతస్థులలో తక్కువజాతివారు వైకములో కొన్ని బహిరంగములగు బాటలందు నడచుస్వేచ్ఛకలిగియుండుటకై సత్యాగ్రహము

చేయవలసివచ్చినందులకు యీ సభవారు ఖేదపడుచున్నారు. వారి యెడల సంపూర్ణ సానుభూతి దెలుపుచున్నారు. వైష్ణవగ్రంథముల ననుసరించియు, ఆచార్యులబోధల ననుసరించియు మతశ్రేయము వారయు పూర్వాచారపరాయణులందరు, అట్టినిషేధమును తొలగింపవలెనని తిరువాన్కూరు దర్బారును కోరుటకుగాను తమకు సహాయపడవలెనని యీసభవారు వేడుచున్నారు. ఇప్పుడు నిషేధింపబడుచున్న హిందూ అధమజాతులవారే అన్యమతమును స్వీకరించినచో అట్టి వారిని ఆవీధుల వెంట రానిచ్చుచుండగను, యితరమతములవారిని రానిచ్చుచుండగను, వీరినేల ఆటంక పరచవలెననియును, యిదివర కెట్టి అధికారమున్నను యిప్పటి నూతనపరిస్థితులబట్టియైన అట్టినిషేధమును తొలగింపవలెనని యును మహారాణీగారిని యీసభవారు గోరుచున్నారు.

### 9. బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదము

బ్రాహ్మణబ్రాహ్మణేతరులమధ్య కొన్నిప్రాంతములందు గలిగిన విచారకరమగు విభేదములకయి యీ సభవారు మిగుల పరితపించుచున్నారు. హిందూసంఘములోని వారికందరికిని సకలసాహిత్యచరిత్ర వేదాంతములకు సంబంధించిన సంబంధమే కలదు. వానికి గల భేదాంశములకన్న ఐకమత్యాంశము లెక్కుడు బలమయినవి. కావున వారు నిజమైన భ్రాతృభావమున మెలగి అన్యోన్యవాంఛలను గుర్తెరింగి సమకూర్చుకొని సహాయపడుచు సంతసించుచుండవలెను.

హిందూసంఘములో పలుతెగల నాయకులు గలసి పరస్పర అపోహలను తొలగించి అన్యోన్య ప్రశంసాభావమును గౌరవమును పెంపొందించి ముఖ్యముగా మనసాంఘిక విషయములందు సంఘాభివృద్ధికై పాటుపడవలెనని యీసభవారు గోరుచున్నారు.

## రాత్రి

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారు

మానవులయును స్త్రీలయు మానసములు
తలఁచి చూడంగఁ జంద్రకాంతములో! యేమొ!
కానిచోఁ జంద్రుఁ డుదయింపఁగానె యేల
ద్రుతములై రసవాహినీభృతము లగును.

అరుణకాంతుల రతనాలహారములను
గాంచనద్యుతివసనముల్ కొక్కలంపి
ముందుముందుగ, రాగవిస్ఫూర్తి గదుర
రాత్రికాంతను గూడఁ జంద్రముఁడు వెడలె.

తన్నిశాకాంత యాంధ్యవక్త్రమును బట్టి
చంద్రుఁ డాత్మకరంబుల సరవి లాఁగ
నబలయాట నేమియును జేయంగలేక
చిఱునగవు మల్లెపూఁడాలు తెరను డాఁగె.

పొదుపుగుబ్బలిపై నుండి పడమటిమల
పైకి వ్యోమవిమానంబు పైని రాత్రి
యువతితోడ వాహ్యాళిసేయును గడింది
దినదినంబును జంద్రుండు మనసుపుట్టి.

రతివధూమణిఁ దనదు సారథిగఁ బూని
చంద్రికాస్యందనంబును సంతరించి
శాతనారాచములఁ బట్టి చేత మరుఁడు
సకలలోకజిగీషతోఁ జనుచునుండె.

సుమపరీమళముల శరీరమునఁ దాల్చి
మోహనౌషధసముదాయమును గ్రహించి
వాడవాడలఁ దిరుగాడ బయలుదేరె
మానినులకోసమయి మందమారుతుండు.

మోహనులఁగూడఁ దేఁకువ మోహపుచ్చి
యాత్మలావణ్యమున, మహాహర్షమునను
గట్టిగా వారికంఠముల్ కౌఁగిలించి
వక్షములఁ బొల్చుచుండెఁ బుష్పములసరులు.

పాలవలె మధురంబులై స్వచ్ఛములగు
దంపతుల మానసములు తత్కాలమందుఁ
బ్రణయమానంబు వేఁడిమి పట్టి కాఁగి
మీఁగడం గట్టె సమ్మదాభోగ మనఁగ.

ఒకట బహిరంగముగఁ గాంచి పకపకనగు
నొకటఁ గిటికీలలోఁ జూచి వికవిక నగు
నొకట శశిచాటుగాఁ గని కికకిక నగు
బొమ్మలను శయనించు దంపతులయునికి.

నిదుర లేకుంటఁ దిరుగుట నిలువ కొకట
నలసటం బొంది యేమొ! శుభ్రాంశువొప్పెఁ
దైలశూన్యప్రదీపంబువోలెఁ గాంతి
క్రమముగాఁ దగ్గి తెలవాఱుసమయమందు.

# మాంటేగు మహాశయునకును హిందూదేశమునకును గల సంబంధము

మోచర్ల రామకృష్ణయ్య గారు, బి. ఏ.

మాంటేగు మహాశయుఁడు పరలోకగతుఁడయ్యెను గదా! హైందవు లతనిమరణమునకై విచారగ్రస్తులై యుండుటకుఁ గారణము లనేకము లున్నవి. హిందూదేశమున కతఁ డేమి యుపకారములొనరించెను? శ్రీమంతుఁడై జనించి, విశేష శేముషీయుక్తుఁడని పేరెన్నికఁగాంచి, యాంగ్లసాంఘికజీవనమున నున్నతస్థానము నలంకరించుననియు, నాంగ్లజనాభివృద్ధికిఁ దోడ్పడుననియుఁ దలంపఁబడిన 'మాంటేగు'నకును, దాను మున్నెన్నఁడు నెఱుంగని దరిద్రదేవతాపీడితులగు భారతీయ జనసామాన్యమునకు నేటిసంబంధము గలదు? మతముచేతనా యూదుఁడు. జాతిచేతనా శ్వేతముఖుఁడు. అతని మరణవార్త భారతీయుల కేల విలాపకారణమాయెను? అతఁడు మనభారతీయ ప్రభుత్వమునందు (Reforms) కొన్ని సంస్కరణములను బ్రవేశపెట్టినది వాస్తవమే; అయిన నాసంస్కరణములు భారతీయులకు మొదట సంతోషజనకములుగావు. దేశీయమహాజనసభ (National Congress) మూలమున సంస్కరణములు "అసంపూర్తిమైనవనియు, అసంతృప్తికరములనియు, ఆశాభంగజనకము లనియు" భారతీయులు వారిమనోగతమును వెల్లడించిరి. ఆంగ్లేయులు సైతము సంస్కర్తయగు మాంటేగును దూషించిరి. వారిదృక్పథమున నీసంస్కరణములు ఆంగ్లసామ్రాజ్యాభివృద్ధికి వినాశదాయకములై యొప్పారెను. ఆంగ్లేయుఁడుగా నుద్భవించి, యాంగ్లేయులక్షేమమున కితఁడు వినాశకారియాయెనని పలువురు ఆంగ్లేయు లితని నిందించిరి. స్వదేశీయులచే నీతఁడు దూషింపఁబడెననియూ, వారతని నసూయచే భావించిరనియూ హైందవు లతనియెడ స్నేహభావమును జూపవలసినది? ప్రేమగౌరవము లావిర్భవించునది యిట్టి కారణములఁబట్టియా?

మాంటేగు మహాశయుఁడు విశ్వభ్రాతృత్వమును జగన్మిత్రత్వమును గలిగిన లోకపూజ్యులలో నొకఁడు. అతనిదేశీయులే కొందరు అతనికి స్వదేశాభిమానముతప్ప మరియితరదేశములన్నిటియందును అభిమానము మిక్కుటమని నుడివెడివారు. ఒకవిధముగా నదియే వాస్తవము ప్రపంచమున మానవులకు స్వదేశాభిమానముండుట సహజమే. స్వదేశముపైగల యభిమానప్రేమలు పొంగిపొరలి వెల్లివిరిసి యితరదేశములపైనను, యితరదేశీయులయెడలను జూపఁబడుట ప్రతిసామాన్య పురుషునకు శక్యమైనవిషయము కాదు. దైవిక, ఆధ్యాత్మిక శక్తులచే బలవంతులైనవారుతప్ప అట్టిజగన్మిత్రత్వమును సంపాదింపనేరరు. అట్టి దివ్యతత్వము కొంత మాంటేగుమహాశయునకున్నదని చెప్పుట అతిశయోక్తి కానేరదు. అతఁడు తన జీవితమున సంపూర్తిగావించినపని అతివిశాలమైనది కాకపోవచ్చును. తాను ముగించఁదలచిన కార్యములకు సాధనసంపద తానే యొనఁగూర్చుకొనియెను. తాను జేయఁబూనిన కార్యములకుఁ గొన్ని సరిహద్దులు దైవమే యేర్పఱిచెను. చేసిన, ఆసరిహద్దులలోనే తాను దనకార్యముల నొనరింపవలసి యుండెను. అట్లు కానిచో నాతఁ డూరకుండి యుండవలసినవాఁడయ్యెను. తనధైర్యమపారమగుటచే నాతఁడు తాను నిర్దేశించుకొనిన కార్యములను సఫలముచేయుటకు సంసిద్ధుఁడయ్యెను. ఆమహాశయునితో గాఢమైత్రినలుప నవకాశముకలిగిన "సిన్హా" ప్రభువు (Lord Sinha) మాంటేగువిషయమై ప్రశంసించుచు నిట్లు వాక్రుచ్చియున్నాఁడు. "నేనాతని నెరిగియుండినంతమట్టుకు, హిందూదేశమును 'మాంటేగు' కంటె గాఢతరముగఁ బ్రేమించిన హైందవుఁ డెవ్వఁడు నుండఁడనని తలచుచున్నాఁడను. హిందూదేశమునకుఁ గానతఁడు పార్లమెంటుచే నిప్పించిన సంస్కరణములవిష

యమై యేమైనఁ జెప్పెదురుగాక. ఒక్కవిలక్షణమగు సందర్భమునుమాత్రము నేను నొక్కివక్కాణించఁగలను. వాని ముఖ్యోద్దేశము హైందవులను స్వపరిపాలకులుగాఁ జేయుటయే!" ఈవిధమున మాంటేగును వానియభిమతములను నిరూపించిన 'సిన్హా' ప్రభువువాక్యములు సమంజసములుగావా ?

మాంటేగు మహాశయుఁడు ప్రప్రథమమున హిందూదేశమును సందర్శింప వచ్చినపుడు కొంతమంది హైందవప్రముఖుల నతఁడు సంవీక్షించి వారితో సంభాషించెను. అట్టిప్రముఖులలో "బాబుమోతీలాల్ ఘోష్" అనునతఁడొకఁడు. మాంటేగుగా రాపురుషవర్యునితో సంభాషించుచు తనమనస్సునందుఁగల సంస్కరణములను గుఱించి సూక్ష్మముగా నతనికిఁ దెలియఁబలికెను. బాగుగ నదివిని బాబుగా రతనికొక చిన్నకథను జెప్పిరి. పాపమొక శ్రోత్రియుఁడు. చాలదూరము నడచివచ్చి యానసంజాత గురుశ్రమచే నడకచందము మందగిలి స్రుక్కి ఆకలిదప్పులచే సొలయుచుండెనట. ఆతనికేయెడ నాహారము దొరకలేదట. కట్టకడకతఁడు మార్గము వెంబడి శూద్రుఁ డొకఁడు వంటచేయుచుండఁ జూచెనట. బ్రాహ్మణుఁడు! అందును శ్రోత్రియుఁడు! (ఇప్పటిబ్రాహ్మణులైన నేమియు నందియపడరు.) ఆతఁడు శూద్రునిచేఁ బచనము సేయఁబడిన యన్నముగనుక వెనుకాడెను. అయినను క్షుత్పిపాసలు అత్యధికములుగనుండి ప్రాణాపాయము దెచ్చునట్లుండెను. అందువలన నాభూసురుఁడు శూద్రుని దరిసి "మిత్రమా! ప్రాణము లాకలిచేఁ బైకెగయుచున్నవి. ఒంటరిపాటున నున్నాను. నను రక్షింతువే!" అని ప్రార్థించెను. శూద్రుఁ డంత బ్రాహ్మణుని బిలిచి తనవెంబడిఁ గూర్చుండనియమించి యొక్కకబళ మాతని కిచ్చెను. బ్రాహ్మణుఁ డాత్రముతో దాని నారగించెను. తదనంతరము బ్రాహ్మణుఁడు శూద్రుని మరికొంతయన్నమునకై వేఁడ నాతెరువరి "పోపోవయ్యా పిచ్చిబాపనోఁడ! ఇంకాయెవరుపెడతారు నీపొట్టకు! మీాయయ్య నాదగ్గ రేమన్న మూటగట్టి పడేసిపోయిండాయేం? చాల్చాలు పో!" అని గద్దించెనట. బుద్ధిజాడ్యజనితోన్మాదుఁడగు నాశ్రోత్రియుఁ డంతట "అయ్యో! దేవుఁడా! వ్రతము చెడినను సుఖమైన దక్కవలయుగదా! కులముజెడితిని పొట్టనిండలేదే!" అని యార్తనినాదములు సల్పెనట. ఈకథ నాలించి మాంటేగుమహాశయుఁడు మందహాసవికసితవదనుఁడై "మోతీబాబూ! నే నాశూద్రునియంత క్రూరకర్ముఁడనా! ఈకబళమును గ్రహింపుము. వెనుక తృప్తి పఱతును" అని ప్రత్యుత్తర మిచ్చెనట.

మాంటేగుమహాశయుఁడే మరికొంతకాల మతని పదవియందుండిన హైందవుల మహదాశయముల సఫలీకృతము చేసియుండెడివాఁడనుట నిస్సంశయము. కాని "తానొకటితలఁచిన దైవముమఱియొకటితలఁచునుగదా!" భారతీయాభివృద్ధికై యతఁడొనర్చిన మహత్ప్రయత్నమువలన నతనికిఁ బ్రాప్తించిన లాభములెవ్వి? తనమహాధికారపదవి నతఁడు కోల్పోయెను. తుదకుఁ దన జీవికనే భగ్నీకృతము చేసికొనియెను. తనసహాధికారుల సలహాను బొందకయే మాంటేగుమహాశయుఁ డొక గొప్ప కార్యమునకుఁ దనయనుమతి యొసంగెను. ముసల్మాను ప్రముఖులు హిందూదేశమున, "సెవర్సు" సమాధానసందర్భమునఁ జేయుచుండిన కలవరమువలన తత్సమాధానమును, బునర్నిర్ణయము చేయవలసినదని రాజప్రతినిధి (Viceroy) గారంపిన లేఖను బ్రచురింపవలసినదని మాంటేగు తన సహసభ్యుల యనుమతిలేకయే యాదేశించెను. "కర్జను" ప్రభువు తన పక్షమువారితోఁగలసి మాంటేగుయొక్కచర్యను నిరసించుచు మాటలాడెను. "లాయడుజార్జి" స్వస్థానాభిమానియై మాంటేగును బహిష్కరించుటకు సందేహింపనివాఁ డయ్యెను. హిందూదేశపు తాత్కాలికపు టుపద్రవస్థితిని బ్రచురించుట అసంగతమే యయియుండవచ్చును; ఇంగితమునకు లోపమైనదిగా నుండుననియే యెంచుఁడు. రాజ్యాంగవిధానమున నట్లుండునేమో! కాని మాంటేగుగారి సంస్కరణవిధానమునకంటె నీయలౌకిక ప్రచురణయే (Indiscreet publication) ఆమహాపురుషుని హైందవులకుఁ బ్రేమపాత్రునిగాఁ జేసెను. ఆపురుషుని యసామాన్య మేధాశక్తియు, నశేషమనీషోజ్జ్వలతయు, నతని పేరుప్రతిష్ఠలను, అప్రా

కృతధనాఢ్యతయుఁ నామహామహునికి, నఖిలసామ్రాజ్య పదవీసంపత్తులయం దగ్రస్థానమైన యమాత్యశేఖరత్వమును లభింపఁజేయ వలంతులైయుండెను. అనతికాలములోనే ఆపదవి నతఁడు వహించియుండెడివాఁడు. కాని యాస్వార్థత్యాగి భారతీయస్వతంత్రార్జనోద్యోగరంగమున నిజోద్యమవేదికపై తనసర్వస్వమును ధారవోసెను. ఆంగ్ల హిందూదేశములఁ దమ దివ్యధర్మములను పసిండి బంధములచే బంధించు మహాపురుషులలో మాంటేగు మహాశయుఁ డొక్కఁడని నిస్సంశయముగా నుడువవచ్చును. అల్పదృగ్గాములగు నాంగ్లేయులు—అట్టివారే కదా బహుళసంఖ్యాకులు — హిందూదేశమునకును ఇంగ్లాండునకునుగల పరస్పర మిత్రధర్మతంతువులఁ దెగఁగొట్టుటకై సకలవిధములఁ బ్రయత్నించుచున్నారు. వారిప్రయత్నము లనతికాలములలో నఫలములగునేమో యెఱుఁగఁజాలకున్నాము. ఎట్లయినను భారతీయులుమాత్రము శ్రీమాంటేగుమహాశయునిబోటి ఆంగ్ల శిఖామణుల చరిత్రమును కృతజ్ఞతతో స్మరించుచుందురుగాత!

ఆపురుషవరేణ్యుఁడు సజీవుఁడైయున్నపుడు అతనికిఁ జెందవలసిన ప్రశంసను మన మాతని కొసంగినవారము కాము. ఇప్పుడుమాత్ర మాధీరగుణచంద్రుని, యుదారమార్గాదర్శకుని, ఆతనికిఁ దగిన ప్రేమ గౌరవపురస్సరముగా నభినందించునపుడు నలుబదియైదువత్సరముల ప్రాయమునందే పరహితార్థానురక్తియను దివ్యమంత్రమును స్మరించుచుఁ బరలోకగతుఁడైన పురుషపుంగవునికై మన సానుభూతిని బ్రకటించుచు విరమించెదము.

# సత్యాగ్రహి

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

జ్వలితుఁడయ్యును దీపమ్ముభాతి విమల
తరప్రకాశమ్ముఁ బఱపి యంధత నడంచు
చాల నలఁగియు గోరంటవోలె మిగుల
ఘాతకునిపైన రాగమ్ము గనుపఱచును

వెలుచఁ గ్రుల్లి కృశించియు బీజమటులఁ
బరుల కెప్పుడు సుస్వాదుఫలము లొసఁగు
కడిఁదిఁ బీడించినను నిక్షుఖండమటులు
విమల మిష్టరసం బిచ్చు పీడకునకు

హృదయము జయించుటను జగంబెల్ల గెలుచు
ఆత్మబలిదానమునను ద్రోహము హరించు
చెఱఁ బ్రవేశించి స్వాతంత్ర్యగరిమఁ బడయు
పూలమాలకుఁబలె మహామోదమునను

ఉచ్చత్రాళ్లకుఁ దనమెడ నొసఁగుచుండు
ఆకసం బూడిపడఁజేయు నవనియందు
అవని నాకసముగఁజేయు నద్భుతముగ
బళిర! సత్యాగ్రహుని ప్రభావప్రవృద్ధి
చర్మచక్షువులకు నగోచరము సుమ్ము.

# మధుమాసగీతము

పోడూరి రామచంద్ర రావు గారు, బి. ఏ.

౧

కంటె! లేగులాబీరంగుగంట లవిగో!
సుందరీబృందసహితయా మందగమన,
అలరతీదేవి వచ్చెడునదనునందు
వేచియుండిన మొగ్గల విచ్చి, మేలు
కొల్పుచున్నవి వత్సరసుందరదన;
నదె వసంతకాలోచితమైన మధుర
కోకిలాలాపముల కనుకూలగతిని
సహజగాంధర్వగానంబు సల్పుచుండె
హాయిగా నాభరద్వాజ మచట నిలచి;
శీతలాంభఃకణప్రపూరితసమీరుఁ
డెల్లెడల మందగతి జరియించి పుష్ప
సౌరభంబును వెదజల్లి సౌఖ్యమొసఁగె.

౨

వటమహీరుహాచ్ఛాదితతటములందు,
చల్లనౌ నీడ నొసఁగునశ్వత్థవృక్ష
శాఖికాచ్ఛాదిత ప్రదేశములయందు,
రంగదుత్తుంగ లహరీమృదంగనాద
సంయుతాహ్లాదకరనదీసైకతముల,
నన్నుగూడి వసించి యానలువ రాణి
(సహజస్వేచ్ఛానుకూలితాసన మునందు)
ఓజసల్పెడుగావుత! ఉర్వి నరుల
యనుచితానంద పారవశ్యతను గూర్చి
పతితులై, నీచులైన, గర్వితులఁగూర్చి.

౩

కష్టజీవుల కిప్పుడే గలిగె శాంతి,
పనిని జాలించి శ్రమవాపికొనుచు నుండ్రి;
అల్లదే విను! జనసమూహంబునుండి
వీచువీచికలందున వినఁగవచ్చు
నట్టి యపవాదు తనరెడునట్టి తెఱఁగు;
బాలప్రాయంపు బంభరప్రకర మదిగో
మధురమధురసాస్వాదనోన్మత్త మగుచు
సాంధ్యరాగంపుటీరెండ జవముతోడ
నెగురుచున్నవి; యందందుఁ నింక గొన్ని,
చిత్తములయందు కోర్కెలీరెత్తుచుండ,
సదమలహిమాంబుపూరనిర్ఝరిణులందు,
నీదుచున్నవి, మరికొన్ని యింపుగులుకు
వన్నెవన్నెలపక్షుముల్ కన్నుఁగవకు
విందుసేయఁగ రవి కెంతొ వేడ్కగూర్చు!

౪

ధీరులైనట్టి జ్ఞానులదృష్టి కిదియె
మానవుని 'జీవపందెంపు' మహితసరణి.
ప్రాకువారును, పరుగెత్తువారు తాము,
మొదలుపెట్టినచోటనే ముగియుచుంద్రు
కార్యవాదులు, నుల్లాసకార్యరతులు
జీవితావకాశము కండకావరమున
వివిధభంగులఁ దిరుగాడి వెచ్చఁబుచ్చి
'ఆపద' కరాభిఘాతచే నణఁగిపోయి,
లేక, 'జర'చేత వివశులై లేవలేక,
స్వీయ 'నృత్యవిలాసముల్' విడిచిపుచ్చి,
స్వాస్థ్యమును గాంత్రు తుదకు భూస్థాపనమున.

౫

అల్ల కేళీవినోదులు మెల్లగాను
నన్ను వీక్షించి కులుకుచు నున్నకరణిఁ
దోఁచుచున్నది నావీనుదోయి కిట్లు:
"ఓవృథానీతిపాఠక! ఒంటిఈగ!
చెప్పగదవోసి, నీగతి చెప్పుమింక!
ఒక్కతెయు నిన్నుఁ గూడదు ఉజ్జ్వలాంగి,
లేదుగద రాగసంయుతమోదకలన,
జూపగలవొక్క వస్త్రముల్ సొగసుగలవి"
శీఘ్రగమనంబుతో నీదుజీవితంపుఁ
బ్రాయ మదీరెక్కలం దేలిపోవఁగాదె?
పశ్చిమాంబుధిఁ గ్రుంకె నీభానుఁడపుడె,
నీదు 'ఆమని' యింతలో నిండుకొనియె,
మేము క్రీడింతు మామని మించ నపుడె."



# గ్రామ జీవనము

కోన వెంకటరాయశర్మ గారు

ప్రపంచము నంతంతకును నూతనాచారములను నూతనదృక్పథమును నూతనజీవనమును గాంచుచున్నది. దినదినము ప్రపంచపరిస్థితులు విభిన్నరీతుల మార్పుఁజెందుచు నెల్లరను విభ్రమముఁ గొల్పుచున్నవి. అందు మూలమున భావిస్థితి యిదమిత్థమని నిర్ణయించుట సుసాధ్యము కాకున్నది. వెనుకటి మన ప్రధానమంత్రియగు లాయడు జార్జిగారు నుడివినట్లుల ననేకశతాబ్దములలో మనుజుఁడు సల్పిన వృద్ధి యొక దినములో లభించు కాలమేతెంచినది. తదనుగుణముగ మానవుల భావప్రపంచము నందు మనోవేగముతోఁ బ్రపంచపరివర్తనము జరుగుచున్నది. ఇంతవఱకును స్వార్థపరత్వమును ఆధిభౌతిక భావమును బరివ్యాప్తములై మానవ సౌఖ్యమునకుఁ గంటకప్రాయము లగుచున్నవను సత్యమును పాశ్చాత్యులు గుర్తింపఁగలిగిరి. ఆధ్యాత్మిక నాగరక విజృంభణమునవే మనకు మోక్షము కలుగునని యెల్లరును దృఢముగ విశ్వసించుచున్నారు. ౧౯౪౦ సంవత్సరారంభమున నాంగ్లసామ్రాజ్యమంత్రులు పంపిన సందేశమునందీభావములు సువ్యక్తములగుచున్నవి. ఆధ్యాత్మిక భౌతిక సంరంభమున నెల్లప్పుడును నాధ్యాత్మిక శక్తికే విజయము గలుగును. ధనతృష్ణ రాజ్యతృష్ణ ఇవియే మానవకల్యాణమునకు వైరపురుషులై యనాదినుండియు హింసకు హేతుభూతములై స్వర్గతుల్యమగు ప్రపంచమును రక్తసిక్తముఁ గావించి రోదన ధ్వానములతో నింపుచున్నది. ౧౯వ శతాబ్దమున నైరోపాఖండమున నెల్లెడల వ్యాపించియున్న జాతీయతాభావము లిందుకుఁ గారణములు. సంఘవ్యక్తులెల్లను సహోదరులవలె వాత్సల్యముతో మెలంగుట స్వాభావికము. కాని పాశ్చాత్యదేశస్థితిగతు లిట్టి ప్రవృత్తి పరిస్థితులకు భంగముఁగలిగించినవి. అచ్చట మొదటినుండియు నేకజాతికిఁ జెందినవారే యేకప్రదేశమున నివసించుచుండుటచే భారతదేశమునందువలెఁ గ్లిష్టసమస్యలెవ్వియు నుద్భవింపలేదు. కావున మనవలె విశాలదృష్టి లేక స్వీయజాత్యభిమానము స్వార్థప్రియత్వము హెచ్చినవి. మఱియును వారి చుట్టుప్రక్కల బలసంపన్నులగు సంగ్రామాభిలాషులగు నన్యజాతులు వసించుచుండుటచే నిరంతర మాత్మసంరక్షణమునకు సన్నద్ధులగుచుండుట వారి కత్యంతావశ్యకమయ్యెను. ఇందు మూలమున వారు స్వీయప్రాబల్యమునకును నితరజాతుల క్షీణతకును గృషిసల్పవలసి వచ్చినది. ద్రవ్యార్జనాకుతూహలము మెండయినది. అన్యోన్యవైమనస్యము లధికమైనవి. ఈస్థితిగతులలో జీవితసారమనందగు పరస్పర ప్రేమభావము లుద్భవించు టెట్లు కాఁగలవు? ఇట్టి జాతీయత మానవుని యౌన్నత్యమునకుఁ దోడ్పడునా? ఎదుటివారు బలవంతులైన నిది సహింపఁజాలరు. ఎల్లప్పుడు నితరులు తనకు లోఁబడియుండవలె ననియే తలంపు. అందుచేఁ బ్రపంచమంతటను భ్రాతృభావములకు బదులు శత్రుభావములు ప్రబలియున్నవి. క్రొత్తగఁ బలపడుచున్న జపానుదేశముగూడ పాశ్చాత్య జాతీయతా భావానుసరణముగనే వర్తింపక తప్పదు. మీ రిట్లేల స్వీయ సంప్రదాయవిరుద్ధముగఁ బాశ్చాత్య జాతీయత ననుకరించెదరని ప్రశ్నింపఁగా నొకజపానీయుఁ డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అట్టి జాతులు ప్రబలముగ నున్నంతకాలమును మాయాధ్యాత్మిక జీవనౌన్నత్యమును బెంపొందించుకొనుట కవకాశము లేదు. దౌష్ట్యవినాశమునకు మేమే దుష్టులము కావలసివచ్చుచున్నది. ఆధునిక ప్రపంచమునఁ బశుబలముకన్న సాధనాంతరము లేదు." ఇదియే పాశ్చాత్యజాతీయతా ఫలితము. రవీంద్రనాథుఁడు వ్రాసినట్లుల "ఈ జాతీయత అన్యోన్యభయదాయకముగ నున్నది. ఇందుచేఁ గ్రూరకృత్యములవిన లజ్జాభయములు వీడిపోయినవి. అసత్యము లాత్మశ్లాఘ నందన కారకములైనవి. త్రికరణశుద్ధిగఁ జేయఁబడిన వాగ్దానములు హాస్యాస్పదములైనవి. ఈ ధూమయంత్రము లన్నియు నన్యోన్యసంరక్షణార్థ మొకచోట నైక్యతఁ జెందినఁ జెందవచ్చును. కాని యీ యంత్ర సమ్మేళనముచే నాత్మయు దైవమును గౌరవింపఁబడుదురా?" ఈ ప్రశ్నకు నైరోపా మహాసంగ్రామమే ప్రత్యుత్తరము. ఈ ఘోర యుద్ధ మైరోపాఖండము నంతను విధ్వంసముఁ గావించుచుండఁ బాశ్చాత్యైశ్వర్యమును పాశ్చాత్య నాగరకతయు శతఘ్ని జ్వాలలలో మిలితములై ఆకసమున కెగయుచుండఁ బ్రతిజీవియు నామమాత్రావశిష్టమై నశించుచుండ, అక్కటా! ఆఖండమున కిట్టి దుర్గతి సంప్రాప్తించుట కేమి పాప మొనరించినదని మన మానసమునకు స్ఫురింపకపోదు. రవీంద్రుఁడు తెలిపినట్లుల నింతకాలము మఱియు దన నైతిక జీవనమును నిర్లక్ష్యముఁజేసి తనహృదయమును పాషాణప్రాయముగ నొనరించుకొనుటచే నాదేశమున కీదురవస్థ ఘటించినదనుట నిర్వివాదాంశము. సంగ్రామమువలన ననేక ఘోరవిపత్తులు వాటిల్లినను దానివలని లాభములు లేకపోలేదు. పాశ్చాత్యనాగరక నిజస్వభావము వెల్లడియైనది. పాశ్చాత్యు లాత్మపరిశోధనముఁ జేసికొనుట కిది పురికొల్పినది. స్వీయనాగరకము వెడలఁ బశ్చిమఖండవాసులకే రోత పుట్టినది. స్వార్థపరత్వమే జీవిత పరమావధి కాదను సత్యము నచ్చునట్లు వారికి గుణపాఠము నేర్పినది. మానవజాతికంతకును సౌఖ్యసంధాయకమగు విధానాన్వేషణమునకు వారి మానసములఁ ద్రిప్పినది. ప్రపంచమందలి సర్వజాతులును బరస్పరవైరములు మాని నిర్భయముగ స్వయంవికాసము నొందుట కేర్పాటులు జరుగుచున్నవి. ఇదియే కడపటి సంగ్రామముగఁ జేసి యిఁకముందు యుద్ధము లంతరించునట్లు కట్టుదిట్టములు

జరుగుచున్నది. అల్ప అధిక రాజ్యములకును పాలక పాలితదేశములకును విభేదము రూపుమాయుచున్నది. ఈ భావమును గార్యాచరణయోగ్యము లగుటకు స్వయంనిర్ణయసూత్రానుగుణ్యముగ బాలిత దేశములకు రాజ్యాంగ నిర్మాణమును బ్రసాదింప వలెనని నిర్వచితమైనది. అన్ని ప్రదేశములందును నిజమగు ప్రజాస్వామ్య భావములు పరివ్యాప్తము లగుచున్నవి. వ్యక్తిస్వాతంత్ర్యము సంఘ స్వాతంత్ర్యము దేశస్వాతంత్ర్యము ప్రతిచోటను బెరుగుచున్నవి.

## భా ర త దే శ ము

ఇట్టి స్వాతంత్ర్యతరంగములు భారతదేశ తీరమునఁ గూడ మిగుల నుద్వేగముతోఁ గొట్టుకొనుచు దేశమునంతను నావరించినవి. న్యాయ స్వాతంత్ర్య సంరక్షణార్థము శార్మణ్యజాతి నణఁచుటకుఁ బరాసు మున్నగు రణరంగముల యందు భారతసైనికులు అప్రతిమాన పరాక్రమముతో సమర మొనరించి మిత్రమండలి విజయమునకుఁ దోడ్పడిరి. భారతదేశ మందున్న ప్రతిపల్లెయందును గూడ ధనిక దరిద్ర విభేదము లేక సంగ్రామమునకు ౨౦౦ కోట్ల రూపాయల నొసంగి యుండిరి. ఈ రీతిగ ధనమును ౧౮ కోట్ల మనుష్యబలమును నొసఁగి మన మాతృదేశము కాటకాదిబాధల ననుభవించియైనను స్వార్థత్యాగ బుద్ధితో సామ్రాజ్య సంరక్షణ మొనరించి విధ్యుక్త ధర్మమును నిర్వర్తించినది. కాని కష్టమునకుఁ దగిన ఫలితము లేదాయె! శస్త్రదేశములకు లోఁబడియున్న అల్పజాతుల కనువర్తింపఁ జేయఁబడిన స్వయం నిర్ణయ సూత్రము మనకు గగనకుసుమమైనది. కాని ప్రపంచ మందంతటను వ్యాపించి యున్న స్వాతంత్ర్య శక్తులు విజృంభించుచున్నవి. ధర్మసూత్రములకు నిరోధము కలిగిన కొలఁదియు వ్యాపనము వృద్ధి యగుట సహజము. దేశీయుల న్యాయసమ్మతాదర్శములను సంతృప్తి పఱచుటకు బదులు అధికారులు కఠినశాసన ప్రయోగముల నవలంబింపఁ జొచ్చిరి. అనేక యువకులును యువతులును విమోచనమునం దాశలేక కారాగృహములలో గ్రుస్సుచున్నారు. న్యాయస్థానములందు విచారింపకయే ప్రభుత్వమువారు తామనుమానించినవారి నీరీతిని నిర్బంధముల పాలుగావించుచున్నారు. శ్రీ సార్వభౌముని ప్రకటనము వలన నైనను రాజకీయ నిర్బంధితు లందఱికిని ప్రభుత్వమువారు విమోచనముఁ గల్పింప కుండుట విచారకరము. మఱియు తమవశమునయున్న యీ కఠినశాసనాయుధములు చాలక ప్రభుత్వమువారు రౌలతు శాసనమను నూతనాస్త్రమును దయారుచేయఁ జొచ్చినప్పుడు ప్రతి భారతీయుఁడును అట్టి న్యాయశాసనమునకుఁ బ్రతికూలభావమును వెల్లడించెను. ఇట్లు ఏకగ్రీవముగ ప్రబల ప్రాతికూల్య భావమును దృఢీకరించి యీ శాసనము నిర్మితమయ్యెను. మానవుని సహజస్వత్వముల నంతరింపఁజేయు నీ క్రూర శాసన నిర్మూలనమునకు గాంధిమహాత్ముఁడు సత్యాగ్రహ వ్రతము నవలంబించెను. అటుపిమ్మటఁ బాంచాల దేశమునందును నితర ప్రదేశములలోను జరిగిన ఘోరకృత్యములు మీకెల్లఱకుఁ దెలిసియే యున్నవి. వాని నిట వివరించుటకు నోరాడకున్నది. నాగరక ప్రపంచమున నిట్టి యనాగరక విధానము అవలంబింపఁబడి మానవులను బశుతుల్యులుగ భావించుట భుజబల ప్రయోగ మొనరించు మానవజాతి కంతకును లజ్జాకరమని నుడివిన చాలును. కాని నిరోధతంత్రముచే నేజాతియు స్వాతంత్ర్యేచ్ఛను గోల్పోవలేదు. అందువలనను స్వాతంత్ర్యాభిలాష హెచ్చి స్వాతంత్ర్యలబ్ధి సులభసాధ్య మగుచున్నది. భారతీయులకుఁగల స్వాతంత్ర్యావశ్యకత అందువలనను తేటపడినది. ఎక్కుడు కష్టపరంపరల ననుభవించిన అమృతసరములోనే ౧౯౧౯ సంవత్సరమున జాతీయమహాసభ సమకూడుటవలన నీ నిర్బంధవిధానము విఫలమైనదని స్పష్టముకాఁగలదు. ఇక నొక విషయము. ఒకవంకఁ గఠినశాసనప్రయోగము. మఱియొకవంక సంస్కరణ ప్రసాదము. ఈ పద్ధతి మన ప్రభువులకుఁ బరిపాటియైనది. ఈ సమయమున నది నిష్ప్రయోజన మైనదని వారెఱుంగునట్టి స్థితిగతులు మారినవి. ఎల్లర మానసములును దుర్భరమగు కడగండ్ల ననుభవించిన దేశీయులమీఁదనే కేంద్రీకృతము లైనవిగాని సంస్కరణములపై నెవరును గుతూహలముగాని యుత్సాహముగాని చూపుటలేదు. ప్రజలు తమ నిజస్థితి గతులు గుర్తించుటయే యిందులకుఁ గారణము. వేలకొలఁది రైతులుగల భారతజాతీయ మహాసభ యీ రాజ్యాంగ సంస్కరణములు అసంతృప్తి కరములును అశాభంగకరములును బ్రయోజన రహితములును నైయున్నవని యభిప్రాయమునిచ్చెను. కలకత్తానగరమున ౧౯౨౦ సంవత్సరము సెప్టెంబరు ౮వ తేదిని ప్రత్యేక జాతీయ మహాసభ సంస్కరణములను విసర్జింప గలసినదిగా నభిప్రాయ మొసంగెను. ఈసందర్భమున నొకప్రశ్న బయలుదేరఁ గలదు. మనకు స్వరాజ్యమేల కావలయును? మన మాసంస్కరణముల నేల విసర్జింపవలయును? ఏల వాంఛింపవలయును? దారిద్ర్యాది కారణము లెటులున్నను ఇందుల కొక మంచి హేతువు గలదు. ఆనంద కుమారస్వామి తెలిపినటుల "మానవసేవయే మన జాతీయతయొక్క పరమావధి. రాజకీయ ఆధ్యాత్మిక విషయము లందు మనము పాశ్చాత్యనాగరకము క్రింద నున్నంత కాలమును మనము మానవసేవఁ జేయుట దుస్సాధ్యము. కాన ఆత్మస్వాతంత్ర్య లబ్ధికై కృషిసల్పుట మనవిధ్యుక్త ధర్మము." ఈవిధమగు నైతిక దాస్యముచే మనజాతీయాత్మవికాసమున కవకాశము కలుగకున్నది. విదేశ ప్రభుత్వము ప్రజలను బాధ్యతావిరహితులఁ గావించుట వలన మనయందుఁ గార్యోత్సాహమును స్వాతంత్ర్యాభిలాషయు నశించుచున్నది. కావున ఆంగ్లప్రభుత్వమువలన మనకెన్ని లాభములు చేకూరినను అది మనలను నిరంతరము పాలించుచుండుట మన యాశయము కాదు. ౧౯౨౦ సంవత్సరము డిసంబరులో జరిగిన నాగపురపు జాతీయ మహాసభ సామ్రాజ్యస్థ స్వ ప రి పా ల న ము గా ని సామ్రాజ్యేతర స్వపరిపాలనముగాని మన మ భి ల షిం చు చుం టి మని శాసించినది. ఇంతకుఁ బూర్వము ప్ర భు త్వ ము వా రు మనయాశయము న్యాయ సమ్మతమని యంగీకరించి త దా శ య ల బ్ధి కై ప్రథమాంతరముగ నీరాజ్యాంగసంస్కరణముల నొసఁగి యున్నారు. అవి ప్రథమాంతరముగ లేకున్నను దశాంతరముగ నైన నున్నవాయను విషయము మాత్రము సంశయాస్పదము. ఎట్లున్నను నాగపుర జాతీయమహాసభ మన

హి సంస్కారములను త్రోసిపుచ్చ వలయునని శాసించినది. అనేక వేల యేండ్ల విదేశపాలనమునకు మనము లోఁబడియుండుటఁ దటస్థించినను అనేకదండయాత్రలకు లోనై యనేక యిడుమల ననుభవించినను అతి ప్రాచీన పాలనాయంత్రే నిర్మాణమింకను విషమ పరిస్థితుల నలక్ష్యము చేసి నిలచి యుండుట ఆశ్చర్యజనకముగ నుండక పోదు. ప్రాచీన నాగరకమును ప్రాచీనసంప్రదాయములను ప్రాచీన ప్రతిష్ఠాపనలను పల్లెలయందింకను నామమాత్రము కాలేదు. అందు మూలముననే భారతభూమిని పల్లెలయందు సురక్షితమై యున్నదని తలంచుట కవకాశము కలుగుచున్నది.

ప్రజాస్వామ్యము మన దేశమున కిదివఱకుండె నని నేను సూచించి యుంటిని. అది యెట్లని మీకు సందియము కలుగవచ్చును. మనసంఘ మునకుఁ బాశ్చాత్య సంఘములందువలె వ్యక్తి ప్రధానాంగము కాదు. కుటుంబమే ప్రధానాంగము. అందుచే సర్వవిషయములను వ్యక్త్యభి ప్రాయానుసారముగఁ గాక కుటుంబమునందలి వివిధవ్యక్తుల యభి ప్రాయములను బట్టి నిర్వహింపఁ బడుచుండును. పాశ్చాత్యదేశమునఁ బ్రభుత్వమే వ్యక్తి కవసరమగు పనులఁ జేయును. ఆరోగ్యవిహీనుఁ డైన యొకని నాతనికిఁ దగిన యుపాధిఁ గల్పించును. వృద్ధుఁడైనచో నుచితముగ భోజనాదికముల నొసంగును. తలిదండ్రులు లేని బిడ్డలను అనాథశరణాలయములలో సంరక్షించును. ఈవిధముగ సర్వకార్యము లను బ్రభుత్వమే నెఱవేర్చ వలసియున్నది. కుమారుఁడు పెద్దవాఁడైన పిదపఁ దలిదండ్రులను వీడి వేఱుగఁ గాపురముఁ జేయును. అందుచే నాతఁడు వృద్ధులగు మాతాపితల సంరక్షణము నరయఁజాలఁడు. వారిని ప్రభుత్వము రక్షించును. ఈపద్ధతివలన వ్యక్తిస్వాతంత్ర్యము హెచ్చి సంఘమున భిన్నాశయములు బయలుదేరి సంఘజీవనమున కెంతయు హాని కలుగఁజేయు చున్నది. తండ్రి యాదర్శము వేఱు. కుమారుని యాదర్శము వేఱు. భార్య యాదర్శము వేఱు. స్త్రీక్షేమము వేఱు. పురు షుని క్షేమము వేఱు. ఎవరి క్షేమము కొఱకు వారే ప్రయత్నింపవల యును గాని యితరుల క్షేమము కొఱ కెవరును బ్రయత్నింపరు. తుదకు బిచ్చగాండ్రనుగూడ ప్రభుత్వమువారే భరింపవలసి వచ్చుచున్నది. మన హిందూసంఘమున నన్నను పాశ్చాత్యదేశములయందుఁ బ్రభుత్వము చేయు ధర్మమును కుటుంబమే నిర్వహించుచున్నది. ఒక కుటుంబ ములో ననేకులు నివసించి పరస్పర సాహాయ్యముచే స్వీయధర్మముల నెఱవేర్చుచున్నారు. అందఱకును కుటుంబ సంరక్షణమే యాదర్శము గాని వ్యక్తిక్షేమము గాదు. ఇందుమూలమున ముసలితనమునఁ దలిదండ్రు లను బ్రభుత్వ రక్షణమునకు విడనాడు దురవస్థ మనకుఁ గలుగలేదు. ప్రభుత్వమువారి యుపకారవేతనములు మనకవసరము లేకపోవుచున్నది. ఒకవేళ అవి యున్నను వానిపొందు వారిసంఖ్య బహు స్వల్పముగ నున్నది. అట్టివారినందఱిని కుటుంబమే పోషించుచున్నది. అనాథలగు శిశువులకుఁ గుటుంబమే శరణ్యమగుచున్నది. కుడువఁగూడులేక కట్ట గుడ్డలేక దుర్భరదారిద్ర్యము ననుభవించుచున్న బిచ్చగాండ్రను కుటుం బమే రక్షించుచున్నది. ఈతీరున పరస్పర సహకారభావములను పోష వాత్సల్యమును మనసంఘమునఁ బెంపొందుచున్నవి. కాని యాత్మవిర హితమగు స్వార్థపరత్వము మనపై రాజ్యము చేయుటలేదు. కాలవశ మున నవి క్రమముగ నశించుచుండుట విచారజనకము. కాని యివి యింకను బూర్తిగ నశింపలేదు. పల్లెలయందివి మిగుల నుత్కృష్టదశ యందుఁ గానవచ్చుచుండుటచే వానిని పునరుద్ధరించి దేశోన్నత్యమున కుపకరించున ట్లొనరించుట సులభమని తోఁచుచున్నది. కాని మన సంఘ విమర్శకులు హిందూసంఘమునఁ గుటుంబ యజమానియే సర్వాధికారము గలిగి నిరంకుశవర్తనుఁడై యున్నాఁడనియు, నందుచే సమిష్టికుటుంబము స్వాతంత్ర్యభావ విరుద్ధమనియు, వాదించుచున్నారు. మనసంఘ నిజస్థితి నెఱింగిన వారెవరు నీరీతిని మాటాడరు. దురభిప్రాయప్రేరితమగు విమ ర్శనమునకు విలువయుండదు. సానుభూతి పూర్వకమగు విమర్శనముగాని ఖండనముగాని లాభదాయకము. ప్రతిప్రజాస్వామ్యమునకును నొక నాయకుఁడుండును. లేనిచోఁ గార్యనిర్వహణము దుర్లభము. ప్రజా స్వామ్యప్రదేశములగు నాధునిక ప్రపంచమునఁగూడ నిట్టిస్థితి తప్పదు. సంపూర్ణప్రజాస్వామ్యముఁ బొందిన అమెరికాదేశమున నొక యధ్యక్షుఁ డున్నాఁడు. ప్రజాస్వామ్యమునకుఁ బుట్టినిల్లనఁదగు నాంగ్లదేశమునఁ గూడ ప్రధానమంత్రియొకఁడు సర్వకార్యములను నిర్వహించుచుండును. ఇట్టి యేకవ్యక్తి నిరంకుశమునకును బ్రజాస్వామ్యమునకును భేదమేమి యని మీరు ప్రశ్నింపవచ్చును. వ్యక్తి నిరంకుశపాలనమున నాతఁడు తన యిచ్చవచ్చినట్లు వర్తించును. ఇతరుల యభిప్రాయములనుగాని యితరుల క్షేమమునుగాని యాతఁడు సరకుసేయఁడు. ప్రజాస్వామ్య మున నన్నచో నాయకుఁడు తన ప్రజల యభిప్రాయముల ననుసరించి వర్తింపవలెనుగాని తన యిష్టప్రకారము ప్రవర్తింప వీలులేదు. ఈతఁడు ప్రజాభిప్రాయమున కెన్నఁడు భిన్నముగ వర్తించునో యప్పుడే ప్రజ లాతనిఁ బదభ్రష్టుని గావింతురు. హిందూకుటుంబ మీతీరున నేర్పడియున్నది. రోమక కుటుంబమునందువలెఁ గుటుంబయజమానునకుఁ గుటుంబము నందలి వ్యక్తులను ఇచ్చవచ్చినరీతిని మరణశిక్షపాలుచేయుటకుఁగాని నిరంతరదాస్యముక్రింద నుంచుటకుఁగాని మనసంఘమున నధికారము లేదు. హిందూకుటుంబయజమాని తనవారి సలహాలేనిదే యేపనియుఁ జేయఁడు. ఆవిధముగ నిరంకుశవర్తనముఁ గావించినయెడల బంధువులును సంఘమును నతని నధిక్షేపించి యాతనిని సరియగు మార్గమునకుఁ గొని తెత్తురు. రోమకులయందువలె నీతఁడు తన జీవితకాలమంతయు దన యధి కారమును జెల్లింపక కుమారుఁడు పెరిగి పెద్దవాఁడైనతోడనే కుటుంబ భార మాతని కప్పగించి దైవారాధనముతోఁ గాలముఁ గడపును. ఇది వానప్రస్థాశ్రమమువలన స్పష్టము కాఁగలదు. ఈతని వర్తనము కుటుం బములోనివారి యధికసంఖ్యాకుల యభిప్రాయమునుబట్టియుండును. మఱియుఁ గుటుంబములో నొకరికొకరు దాసులను భావములు లేవు. ఎల్లఱును ధర్మమును నిర్వహింపవలయుననియే యభిలషింతురుగాని యధికారమును జెల్లింపవలయునని తలంపరు. పిన్నలకు పెద్దల శుశ్రూ షయుఁ బెద్దలకు మానవసేవయుఁ బరమధర్మములు. మానవసేవకువలయు శిక్షణమే సదా హిందూగృహమున జరుగుచుండును. సేవను దాస్యమను

జనుల సమర్థశక్తి లోపమునే నిందింపవలసియున్నది. ఈవిధముగ హిందూకుటుంబము ప్రభుత్వమునకు దోహదమును ప్రభుత్వభారమును నిర్వహింపుచున్నదే కాని ప్రభుత్వమునకు గుదిబండవలె నుండలేదు. ప్రభుత్వము గూడ కుటుంబమువలెనే యున్నది. రామాయణాది యితిహాసములను బట్టియు, రాధాకుముద ముఖర్జీ మున్నగు ఆధునికులు చేసిన పరిశోధనములను బట్టియు, మన దేశమున సంపూర్ణ ప్రజాస్వామ్యము వ్యాపించి యుండెనని నిస్సంశయపూర్వకముగ నిరూపింపవచ్చును. కాని యందలి వివరము లనవసరములను నుద్దేశ్యముతోఁ దత్ఫలితములను మాత్రమే యిటఁ బొందుపఱచెదను. భారతదేశమున ప్రాచీనకాలమున సంపూర్ణప్రజాస్వామ్యము ప్రబలియుండెను. ప్రస్తుత పార్లమెంటుసభల లోవలెఁ ప్రజాప్రతినిధులు రాజ్యాంగయంత్రమును నడిపించు నాచారము అప్పుడు లేనేలేదు. ఆకాలమునఁ ప్రతివాఁడును ప్రజాసంఘమున నుండవలసినవాఁడు. తన సమ్మతిని ప్రత్యక్షముగనిచ్చి రాజ్యపాలనమును నడిపింపవలసినవాఁడు. రాజు సాధారణముగ నేకవంశమునుండియే వచ్చుచున్నను ఆతని నామోదించు నధికారము ప్రజలకే గలదు. అసమర్థుఁడగు రాజును దొలఁగించుటకుఁ ప్రజలు సమావేశమైనట్లుఁ బెక్కు నిదర్శనములు పురాణములందుఁ గానవచ్చుచున్నవి. యువరాజును జేయునపుడు గూడ రాజు ప్రజలను రావించి వారి యనుమతిఁ గైకొనుచుండును. పన్నులను వేయుటకును దీసివేయుటకును రాజు వారిని సంప్రతించుచుండెను. వారు రాజును ప్రత్యక్షముగ సందర్శించి కష్టసుఖములను దెలుపుకొనుట కనువుగ[illegible]యుండెను. ఇఁక రాజ్యపాలనము మంత్రులసహాయమున జరుగుచుండెను. మంత్రులెల్లరును ప్రజావిశ్వాసమునకుఁ బాత్రులైనవారే. వివిధవృత్తులవారును మంత్రివర్గమునన్నట్లు నిదర్శనములు గలవు. హిందూధర్మసంరక్షణవ్రతధారియగు శివాజీమహారాజుగూడ అష్టప్రధానపద్ధతి నవలంబించెను. ఈరీతిగ రాజు ప్రజాభిప్రాయమున మంత్రుల యభిప్రాయమునకును, దనతోడి రాజుల యభిప్రాయములకును, బద్ధుఁడై రాజ్యమును బాలించుచుండ నాతని నిరంకుశవర్తనుఁడని యనుటకు నోరెట్లాడెనో నే నూహింపఁజాలను. అట్లయినయెడల శ్రీరామచంద్రునివంటి నిరంకుశవర్తనుల సెంకతినైనను మనము భరింపఁగలము. ఇఁక రాజులేమియులేని యెటువంటి ప్రజాస్వామ్యప్రభుత్వము లనేకములు మనదేశమున నున్నట్లు రాధాకుముదముఖర్జీగారు వ్రాయుచున్నారు.

అలగ్జాండరు దండయాత్రా సమయమున నిచ్చట ప్రజాస్వామ్యము లత్యున్నతదశయందుండెననియు నవియే యాతనికిఁ ప్రబలవిరోధమును గల్గించి యాతనికి లోఁబడక స్వాతంత్ర్యరక్షణముఁ గావించుకొనెననియుఁ దెలియుచున్నది. బౌద్ధయుగమున నివి బాగుగ వ్యాపించియుండెను. తూర్పుయిండియా వర్తకసంఘమువారు మనదేశమునకు వచ్చినపుడుగూడ ననేకసంవత్సరములవఱకుఁ ప్రజాస్వామ్యపాలనమునాక్రమింపఁ ప్రదేశములు మనదేశమునన్నవనువార్త మన కెల్లఱకు నాశ్చర్యము కలిగింపకపోదు. ఈరీతిగఁ ప్రజాస్వామ్య మనేక శతాబ్దములు పరాధీనతయందున్నను దనవ్యక్తిత్వమును నిలుపుకొనుట అత్యాశ్చర్యజనకము. ఇట్టి సంప్రదాయములలోఁ బుట్టిపెరిగి హైందవులయ్యు న్యాయమూర్తిపదవి నలంకరించియు, విద్యాధికులయ్యుఁ, గుమారస్వామి శాస్త్రిగారు కాలకుసంఘనివేదికమున భారతదేశము ప్రజాస్వామ్యము నెఱుంగక యెల్లపుడు నిరంకుశపాలనము క్రిందనే యున్నదని యెట్లు నుడువ సాహసించిరో యూహించుట దుష్కరము. ప్రాచీనకాలమున పల్లెలయందలి గ్రామసంఘములు సంపూర్ణ వికాసమునందియుండెను. గ్రామములో నెల్లరు నొకసంఘముగఁ గూడి యాయాస్థలములలోని విషయములను బరిష్కరించుచుండిరి. ఇప్పటికిని ఆచిహ్నములు సంపూర్ణముగ నశింపలేదు. గ్రామపెద్దలని యిప్పుడు వ్యవహరింపఁబడువారు ఆకాలపు గ్రామప్రజాస్వామ్యపు నాయకులని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇప్పటికిని వారికిఁ బల్లెలయందుఁగల గౌరవమునుబట్టియు నెవరేవిషయమునైనను వారితో సంప్రదింపకుండగనే చేయకపోవుటచేతను ప్రాచీనకాలమునఁ ప్రజానాయకుల కెంతటి యున్నతస్థాన మొసంగఁబడెనో తెలుపఁగలదు. మఱియు గ్రామమున నున్నవారందఱికి నెల్లపుడును సర్వకార్యములను నెఱవేర్చుటకుఁదగిన తీరిక లేకుండుటచేతను జీవనోపాధికై ప్రయత్నించుకొనవలసి యుండుటచేతను సంఖ్యాబాహుళ్య మున్నయెడల నేపనినిఁ ద్వరితముగఁ జేయుటకును వీలుకలుగదు గావునను నూరివారందఱును గార్యనిర్వాహక యోగ్యమైన చిన్న యుపసంఘము నెన్నుకొను ఆచారము ప్రారంభమైనది. ఇదియే గ్రామపంచాయతీ యొక్క పుట్టుకకుఁ గారణము. ఇవి యిప్పటికిని నిలచియున్నను వానివలనఁ దగినంతలాభము కలుగకున్నది. ఆపల్లెయందలి తగవులను వారు తీర్చుచుండిరి. వారి సత్యమునకు వలయు నేర్పాటులఁ గావించుచుండిరి. తమయూరికి సంబంధించిన సర్వకార్యములను నిర్వహించుచుండిరనుట యతిశయోక్తి కానేరదు. మా పల్లెయందింకను నామమాత్రము గాకయున్న ఈ ప్రజాస్వామ్య ప్రతిష్ఠాపనములను బునరుద్ధరించుటకు మా బాధ్యత యీ సమయమున ద్విగుణీకృతమగుచున్నది. పల్లెలయందుఁ బాశ్చాత్య నాగరకత వ్యాపింపకుండుటచేఁ బట్టణములందువలె గ్రామజనుల కెట్టి క్లిష్టసమస్యలును జనింపలేదు. కావున వారి ప్రయత్నములు నిరాఘాటముగఁ గొనసాగఁగలవు. సంఘజీవన సంఘపోషణార్థము వలయు నుపకరణములన్నియు గ్రామస్థులకుఁ గలవు. విద్యను గళలను బత్రికలను దేహదార్ఢ్యమును బెంపొందించుటకు గ్రామస్థుల కెక్కుడవకాశములు గలవు. ఈవిషయమున వీరికితరులపై నాధారపడి యుండ నవసరము లేదు. దీనినిఁగూర్చి ముందుఁ గొంతవివరముగఁ దెలుపుదును. జాతిమతవిభేదములు పట్టణములందువలె నాంగ్లవిద్యాధికుల యందువలె పల్లెలయందుఁ గానరావు. ఎల్లెడలను సోదరవాత్సల్యము రాజ్యము చేయుచున్నవి. స్త్రీస్వాతంత్ర్య సమస్య విషమరూపముఁ దాల్చుటకవకాశములులేవు. ఏలనన నగరములందు కంటె నిచ్చట స్త్రీలకు సర్వవిషయములందు నెక్కుడు స్వాతంత్ర్య ముండుటయే యిందులకుఁ గారణము. ఇంతటితో మిన్నకుండ వలయునని నాయభిప్రాయము కాదుగాని యిట్టి స్వాతంత్ర్యము నాంగ్లవిద్యాధికులు తమ స్త్రీలకొసఁగి

పిదపఁ దక్కినదానికై యాందోళనముఁ జేయవలసినదని సూచించుటకై యిట్లు వ్రాసితిని. ఇట్టి విషయములు అనేకములు కలవుగాని గ్రంథవిస్తరభీతిచేఁ బ్రధానములగు వానినిమాత్రమే తెలిపి సంక్షిప్తీకరించితిని.

ఇంతవఱకును దెలిపినదానినిబట్టి స్వరాజ్యసమితులు (Home Rule Leagues) విశేషాందోళనముఁ జేసి ప్రజాప్రబోధ మొనరించుటకై యేర్పడియున్నవనియు నిప్పుడా బాధ్యతకుఁ దోడుగఁ బరిపాలనానిర్వహణముఁ గావించునట్లు వాటివర్తనమును మార్పు చేయవలయుననియు దేలుచున్నదిగదా? అదియే నా నిశ్చితాభిప్రాయము. ప్రాచీనకాలమునందువలెఁ బల్లెలను గ్రామసంఘములను అన్ని విషయములలోను బ్రభుత్వమునుబోలియుండవలెను. ప్రతిపల్లెయు నొకచిన్న ప్రభుత్వమువలె నేర్పడవలయును. స్థానికవిషయములను నిర్వహించుచుండవలయును. పల్లెయందు నివసించువారెల్లరును జాతిమతాది విభేదములులేక ఆసంఘమునందు సభ్యులుగ నుండవలయును. అట్టివిశాలసంఘమును బ్రజాసంఘమనుటెంతయు సముచితమని నా యభిప్రాయము. ఈ ప్రజాసంఘమునందు సభ్యులుగనున్నవారు చందాలనీయనక్కరలేదు. గ్రామమునకంతకును సంబంధించిన సాధారణవ్యవహారములఁగూర్చి యోచించుటకు వీరు నెలకొకపర్యాయము సమావేశమగుచుండవలయును. పదునెనిమిది సంవత్సరముల వయసుకుఁ బైనున్నవారెల్లరును ఇందు సభ్యులు. వీరొక యధ్యక్షునెన్నుకొని యాతనిమూలమున స్వీకరింపఁ దలపఁబడినరీతిని కార్యక్రమమును నడిపింపవచ్చును. గ్రామమునకంతకును సంబంధించిన శాసనముల నీ ప్రజాసంఘమే నిర్మింపవలయును. ఇఁక రెండవవిషయము. గ్రామమునకు సంబంధించిన పరిపాలనమును జేయుట కింతటి మహాసభ అసమర్థము. ఎల్లఱును అందులకు సమర్థులు కాకపోవచ్చును. గ్రామవ్యవహారముల నీవిధముగ విభజింపవలయును:

౧ రాజకీయము—స్థానికస్వపరిపాలనము.
౨ విద్య—సారస్వతము.
౩ మతము—
౪ సంఘసేవ—సంఘసంస్కరణము.
౫ ఆర్థికము—పరిశ్రమలు

(ఈ మూఁడువిషయములను గూర్చి విపులముగ వ్రాసిన చిత్తుప్రతి కనుపించనందున మిగిలిన విషయములఁజర్చింపవలసి వచ్చినది.)

ఈశాఖలఁగూర్చి వేర్వేఱఁ జర్చించుటకుఁ బూర్వము పాలనాయంత్రవిధానమును ముగించెదను. ఒక్కొక్కశాఖ యొక్క సంఘము యొక్క యాజమాన్యముక్రింద నుండవలయును. సంఘమున మువ్వురు సభ్యులకన్న నెక్కువమందియుండరాదు. వీరిని బ్రజాసంఘమెన్నుకొనవలయును. వీరును అధ్యక్షుఁడును ఒకసంవత్సరకాలముండవలయును. ఈ సంఘములయందు సమర్థులగువారిని నియమించునట్లు యేర్పాటుచేయవలయును. ఈ యైదు ఉపసంఘములును దమలోనుండి తమతమ అధ్యక్షుల నెన్నుకొనును. వీరిని మంత్రులని పిలువవచ్చును. కాని వీని యెన్నికను బ్రజాసంఘము మామోదింపవలయును. ఈ యైదుగురును మంత్రివర్గము క్రిందఁజేరి మొత్తముమీఁదఁ బాలనమునంతయు జరుపవలయును. వీరిలో నొకయధ్యక్షు నెన్నుకొని పనులను నడుపవలయును. ఆతఁడే ప్రజాసంఘము కధ్యక్షుఁడుగఁగూడ నుండుట మంచిది. ఈరీతిని ఒకటి రెండు సంవత్సరములు పనులు జరుగునెడల భారతీయులకు సంపూర్ణ స్వరాజ్యమును బ్రజాస్వామ్యమును అలవడఁ గలవని నేను నిస్సంశయముగఁ జెప్పఁగలను. ప్రజాప్రబోధము సులభముగ జరుగును. నిర్బంధోచిత ప్రారంభవిద్య అనేక వత్సరములలో నొసంగఁగల లాభమును ఈవిధాన మొకటి రెండు సంవత్సరములలోఁ గలుగఁ గలదని నా దృఢ విశ్వాసము. ఈవిధానమును ఛాయగఁ దెలిపినాను. విపుల విషయముల నన్నిటి నిట వివరించుటకుఁ గాలవ్యవధి చాలక పోవుటయే కారణము. ఆవిధానమును ముందుఁ దెలుపుదును. దీనికిని గాంధి మహాత్ముని నిర్మాణ కార్యక్రమమునకును భేదములేదు. ఒకటి రెండు విషయములఁ జెప్పి ముగింతును.

సంఘసేవ:—ఈ శాఖాకార్యనిర్వహణమే మిగులఁ గష్టతరమైనది. మన రాజకీయ జీవనము వృద్ధిఁజెందిన కొలఁది నీశాఖయొక్క ప్రాముఖ్యము స్పష్టముకాఁగలదు. అనేకసంఘసమస్యలను వీరు పరిష్కరింపవలసి యున్నది. స్త్రీ స్వాతంత్ర్య సమస్య అందొకటి. ధనిక దారిద్ర్యసమస్య మఱియొకటి. యజమాని కూలీల సమస్య వేఱొకటి. యింక నొకటి నిమ్నజాతులసమస్య. ఈరీతిగ ననేక క్లిష్టసమస్యలనెల్లను సంతృప్తికరముగ నిర్ణయించుభారము వీరిపైఁగలదు. వీని నన్నిఁటినిఁ గూర్చి యిపుడు చర్చించుట దుర్లభము గావున మూఁడవ సమస్యను గూర్చిమాత్ర మించుక వివరించెదను. ప్రపంచ మందంతటను కూలీలు తమ యజమానుల లోభత్వముచే శ్రమకుఁదగిన ఫలితముఁగానక అనేకకష్టముల నందుచున్నారు. దినమంతయుఁ బనిచేసినను వారి కుటుంబ పోషణమునకుఁ దగినంత ఆదాయము లభింపకున్నయది. యజమానులు కర్మాగారములలోఁ గూలీలను వారి శరీరములు నలిగిపోవునట్లుఁ బనిచేయించి యందలి లాభముతోఁ గోటీశ్వరులై సుఖించుచున్నారు. పని మానివేయుదమనిన పొట్ట జరుగుట కష్టము. యజమాను లెన్నిదినములైనను బనిచేయింపకుండ నుండఁగలరు. ఈ స్థితిగతులు మొదటఁ బాశ్చాత్యదేశములలో జనించినవి. అచ్చటి పారిశ్రామిక విధానము నవలంబించిన తరువాత మనదేశమునఁ గూడ నవి కానవచ్చుచున్నవి. అందుచే సమ్మెకట్టు ప్రారంభమైనది. చెన్నపురి, బొంబాయి, మున్నగు నగరములలోఁ గూడఁ గూలీలు పని మానివేసిరనియుఁ జాల గడబిడలు జరిగినవనియు మీరు వినియున్నారు. ఒక దినము పని మానివేసినచోఁ గూడు లభింపకుండుటచేఁ గూలీలందఱును సంఘముల క్రింద చేర్పడి యొకనిధిని స్థాపించి సమ్మెకట్టు కాలమున ఆనిధినుండి ధనమును గైకొనుచుండిరి. అందుచే యజమానులు బలము తగ్గిపోయి కూలీలకోర్కెలను సఫలపఱుప నారంభించిరి. పల్లెలయందు గూడ నీదుస్థితి లేకపోలేదుగాని పరిస్థితులిట్టి విషమరూపముఁ దాల్పలేదు. ఇచ్చట సాధారణముగఁ గూలిచే జీవనముచేసికొనువారికి వ్యవసాయపుఁబనులే ముఖ్యాధారములు. అవి సంవత్సరమెల్ల నుండవు. ఉన్న సమయములందైనను గూలీలకిచ్చుకూలి అత్యల్పముగనున్నదని యంగీకరింపక తప్పదు. దానితోఁ గూలివాని కుటుంబపోషణము దుర్లభమని

మీకుఁ దెలియును. ఈ కఱవుకాలమున ఆకష్టము పదిరెట్లధికమైనదని యెల్లరకు స్పష్టమే. కాని మీరుమాత్రము కూలిని హెచ్చింపరు. ఇది మీతప్పుకాదు. మానవప్రకృతి. ప్రతిగ్రామమునందును రెండుపూటలఁ గడుపునిండ భోజనమెఱుఁగని వారి సంఖ్యను దీసికొనినయెడల నూటికి నది జనసంఖ్యయందు ¾ వంతున నుండకతప్పదు. ఇదియేనా సంఘసౌఖ్యము! ఇట్టిస్థితిగతులలో దోపిడులు దొంగతనము హానీలు జరిగినందుల కాశ్చర్యమేల? ఈ పరిస్థితు లిఁకఁ గొంతకాలమున్నయెడల కూలీల సంఘము లేర్పడి సమ్మెకట్టులు ప్రారంభించి సుఖప్రదములైన పల్లెలఁ గష్టములపాలగుట తప్పదు. మీరు కోరినరీతిని స్వపరిపాలనమును బ్రసాదింపకపోవుటచేతనేకదా మీరు కాంగ్రెసుసంఘములను స్థాపించి యాందోళనముఁ జేయుచున్నారు? మీకు లోఁబడియున్న కూలీలుమాత్రము అట్టిభావములఁ గలిగియుండరా? ఈస్థితినిఁ దొలఁగించుటకుఁదగిన యేర్పాటులఁ జేయవలయును. కూలిని ప్రస్తుతపు ధరల కనుగుణ్యముగ వృద్ధిఁజేయవలయును. కూలిఁజేయుగంటలను దగ్గింపవలయును. సేవాసంఘమువారు ప్రతిస్థలమునకుఁబోయి యెల్లరకుఁ దగిన భోజనము లభించెనో లేదో కనుఁగొనవలయును. తిండిలేనివారి కాహారమొసంగవలయును. ప్రతిగ్రామమునను సత్రముల నేర్పఱచి యుచితముగ భోజనముల నొసంగవలయును. ఈతీరున గ్రామములోనున్న వారెల్లరును సుఖముగా నుండునట్లు కృషిసల్పుటకన్న మానవజీవితమున సుఖదాయకమగు కార్యమేముండును? నిమ్నజాతుల సమస్యఁగూడఁ బరిష్కరింపకపోయినచో నదికూడ ముమ్ముందు తీవ్రరూపముఁ దాల్పక తప్పదు. మద్యపాన నిషేధసంఘముల నేర్పఱచి గ్రామములో నెవ్వరును మద్యపానము చేయకుండునట్లుఁ బ్రయత్నింపవలయును. ప్రజాసంఘము ఈవిషయమున నొకశాసనమును గావించినయెడల సంఘాభిప్రాయ విరుద్ధముగా నెవ్వరును వర్తింపఁజాలరు. ప్రతిచోటను జననముల సంఖ్య హెచ్చింపఁబడకుండుటయు, మరణముల సంఖ్య హెచ్చుచుండుటయు, శోచనీయముగనున్నది. అనేకవ్యాధులు వ్యాపించుచున్నవి. పల్లెలయం దెంతమాత్రము వైద్యసహాయము లేకయున్నది. కావున నొక ఆయుర్వేదవైద్యుని సమర్థుఁడగువానిని ప్రతిగ్రామమునందుమంచి గ్రామస్థుల ఆరోగ్యము వారిచేఁ బరీక్ష చేయించుచుండవలయును. అతిబాల్యవివాహములు కట్నములు మున్నగువానిని ఖండింపను నీశాఖవారు సంఘసంస్కరణమునకుఁ దోడ్పడవలయును. ఈ రీతిగ ననేకసాంఘికవిషయములను సకాలమున నీశాఖవారు పరిష్కరింపవలయును.

ఆర్థికము:— భారతదేశమున వ్యవసాయమే అధిక సంఖ్యాకుల ప్రధానవృత్తి. వ్యవసాయదారుల యైశ్వర్యముమీఁదనే దేశౌన్నత్యమాధారపడియున్నది. ప్రస్తుతము మనదేశమున నీస్థితి సంతృప్తికరముగ లేదు. వ్యవసాయదారు లీకాలమునఁగూడ ప్రాచీనపద్ధతులనే యవలంబించి పనిచేయుచుండుటచే మనభూములు తగినంత పంట నిచ్చుటలేదు. వీరు ఆధునికపద్ధతుల నవలంబింపవలెను. అమెరికా మున్నగు దేశములలోని భూము లీపద్ధతుల ననుసరించుటవలన మామూలుకంటె ౫ రెట్లు ౧౦ రెట్లు పంటపండుచున్నది. మన వ్యవసాయదారుల కీవిషయములఁ గూర్చి బోధించుట కొక వ్యవసాయమున సమర్థుఁడగువానిని రప్పింపవలయును. వ్యవసాయదారుల కుమారులకు వ్యవసాయ పాఠశాలలను ప్రతిగ్రామమున నేర్పఱుపవలయును. రైతులలో ననేకులకుఁ బెట్టుబడికి ధనములేక సాహుకారులవలలోఁబడి యిల్లువాకిళ్లు నమ్ముకొనవలసివచ్చుచున్నది. ఇందులకుఁ బరపతి సంఘములను స్థాపించి రైతులకు ఋణము లిప్పింపవలయును. తరువాత చేతి పరిశ్రమయున్నది. పారిశ్రామిక విషయములందు మనము చాల వెనుకఁబడియున్నాము. సర్ శంకరన్నాయరుగా రీవిషయమును గూర్చి యీవిధముగఁ దెలిపియుండిరి.

"భారతదేశము పూర్వము వస్తువుల నెగుమతిచేయు ప్రదేశముల మిగులఁ జేర్పఁబడియున్నదనియు, నిచ్చటనుండిన ధనమువలనఁ దూర్పు ఇండియా కంపెనీవారు (కుంఫిణీవారు) ఇచ్చటికివచ్చిరనియు, మనకుఁ దెలిసియేయున్నది. సిపాయి తిరుగుబాటునకుఁ బూర్వము ఈ దేశమునందు నిరుత్సాహము చేతను, ఆంగ్లదేశమున నపరిమితములగు సుంకములను విధించుటచేతను, భారతదేశపుఁ బరిశ్రమలు బుద్ధిపూర్వకముగ వినాశమొందింపఁబడినవి. అందు మూలమున వ్యవసాయమునకును బరిశ్రమలకును నిలయమైన భారతదేశము కేవల వ్యవసాయదేశముగ మారినది. ఆంగ్లవాణిజ్యక్షేమమునకై భారతవాణిజ్యక్షేమము నేటివఱకు లోఁబఱుపఁబడియుండినది. ఈదేశపు ప్రకృతి సాధనసంపత్తిని విదేశలాభమునకే ఉపకరించునట్లు చేయుటయు నాంగ్లదేశపు వస్తువు లీదేశమునఁ బ్రవేశపెట్టఁబడుటయుఁ దటస్థించుచున్నది. కావున నిదివఱకే జనసామాన్యమున జీవనోపాధినిఁ గలిగింపలేకున్న వ్యవసాయవృత్తియొక్క భారము పరిశ్రమలు కొంతవఱకుఁ దగ్గించుటకు మారుగ చేతిలోని పనిలేనివా రిదివఱకు భూమిపైఁబనిచేయుచున్న కూలీలతోఁ బోటీకివచ్చుటయుఁ దటస్థించుచున్నది." పరిశ్రమలలో నేతపరిశ్రమయందు మనదేశీయు లసమానసామర్థ్యమును గడించియుండిరి. కాని నాయరుగారు తెలిపిన కారణములవలన నది క్రమముగ నశించినది. నేతవస్త్రములను ధరించువారే లేరైరి. ఇందులకు గాంధిమహాత్ముఁడు స్వదేశీవ్రత మవలంబింపవలసినదని దేశీయుల కుపదేశించుచున్నాఁడు. తన సత్యాగ్రహాశ్రమమున నెల్లరకును మగ్గములనిచ్చి నేతపని నేర్పుచున్నాఁడు. తాను స్వయముగ నేయుచున్నాఁడు. ప్రతిభారతీయుఁడును వస్త్రములకై తాను వడుకుటను నేర్చినచో మన పారిశ్రామికదాస్యము తొలఁగిపోవునని హితముఁ జెప్పుచున్నాఁడు. పల్లెలయందు నేతపనివాండ్లను రప్పించి ఆగ్రామమునకుఁదగినవస్త్రములను వారిచేతనే నేయించి వానినే ఆగ్రామవాస్తవ్యులు ధరించినయెడల గాంధిమహాత్ముని యాశయము సఫలీకృతము కాఁగలదు. ప్రతిగృహమునందును జాతిభేదములేక నూలు వడకు పనిని స్త్రీలు నేర్చుకొని పురుషులకుఁ దోడ్పడవలయును. ఇంకను పల్లెలయం దీయాచారము పూర్తిగా నశింపలేదు. ఈవిధముగనే కమ్మరము, వడ్రంగము, మొదలగు వృత్తులను గ్రామవాసులు పోషింపవలయును. విలువయగు గనులున్న ప్రదేశములలో వాని నితరులకమ్మకయుండ గ్రామప్రజలే వానిని త్రవ్వించి అంతటి లాభమును బడయవలయును.

న్యాయశాఖ:— ఇఁక నొక ప్రధానవిషయముమాత్రము మిగిలియున్నది. న్యాయశాఖానిర్వహణమునుగూర్చి నే నింతవఱకేమియు సూచింపలేదు. పల్లెలయందలి రైతులే కోర్టులకుఁ బోషకులని నిశ్చయముగఁ జెప్పనగును. పట్టుదలలకు వ్యాజ్యములను జేసి దారిద్ర్యదశకు వచ్చినవారల ననేకులను మనము కన్నారఁ గాంచుచున్నారము. కోర్టు వ్యవహారములలో మనకు జూదమునకన్న నెక్కువ ఉత్సాహమును బట్టుదలయుఁ గానవచ్చుచున్నవి. ప్రతిగ్రామములోను అందున్న ప్రజలు తమ తగాదాలను దమలోనే పరిష్కరించుకొనుట అవసరము. కోర్టులకుఁబోయి అన్యాయము జరిగినను ఊరకుందురుగాని యూరివారు చెప్పిన న్యాయము మనకు రుచింపదు. పంచాయతీల నేర్పఱచి గ్రామములోని తగవులను ఎంతపెద్దతగవులయినను మనలోమనమే నిర్ణయించుకొనుట మనకును గ్రామమునకు మనభావిసంతతివారికిని మనదేశమునకును నెంతో శ్రేయోదాయకము. గ్రామవాసులును రైతులును బాడగుచుండ న్యాయవాదులు ధనవంతులగుచుండుట నాకెంతయు విషాదకరముగనున్నది. ఇందుల కేర్పఱుపఁబడు పంచాయతీ యిదివఱకుఁ దెలుపబడిన గ్రామపంచాయతికి భిన్నముగ నుండుటమంచిది. లేనిచోఁ గార్యభారమధికమగును. కావున గ్రామములో నైదుగురి నెన్నుకొని వారి మూలమున నీ కలహములను బరిష్కరించుకొనుఁడు. ఆసంఘమున న్యాయశాస్త్రమును దెలిసినవా రొకరు కూడనుండుట అవసరము. మనలో నైకమత్యమున్నయెడల నన్నియుఁ జక్కఁబడఁగలవు.

ధనము:— ఈకార్యభారమును నిర్వహించుటకు ధనము కావలయును. అదియంతయు నెక్కడనుండి వచ్చునని యీరడుగవచ్చును; కాని యీ వ్యయము నాలుగైదుసంవత్సరములవఱకుండును. తరువాత వ్యయమంతగా నవసరము లేదు. కొంతకాలమువఱకు నీభారములోఁ గొంత భాగము ధనికులు భరింపవలయును. ప్రభుత్వమువారు యూనియనుల నేర్పఱచియు నితరవిధములుగఁ బన్నులను విధించినపుడు మనము వాటి నిచ్చుచుందుము. మనంతటమనమే పన్నులను విధించుకొనినచో నెవ్వలును ఇవ్వరు. ఈ భావము తొలఁగవలయును. గ్రామస్థులెల్లలును గ్రామపాలనమునకుఁ గొంత పన్నునిచ్చుచుండవలయును.

౨. ధనికులు విరాళముల నొసఁగి తమతోడివారి సౌఖ్యమునకుఁ దోడ్పడుచుండవలయును.

3. గ్రామమందలి దేవాలయములయొక్క యీనాములను బ్రజాపరముచేసి అర్చకునకు జీతము నేర్పఱచి ఆ ధనమును బ్రజాక్షేమమునకు వినియోగింపవలయును. ౪. పర్వదినములలో గ్రామనిధికి జందాలను వసూలుచేయుచుండవలయును. మొత్తముమీఁద నీవిషయ మాయాగ్రామప్రత్యేకపరిస్థితులపై నాధారపడియుండును.

## ఉపసంహారము

నాకుఁదోచినవిధమునఁ గొన్నిభావములను క్లుప్తముగఁ దెలియఁ బఱచితిని. విపుల విషయనిర్ణయము ముందు జరుగవచ్చును. కాని యీయంత్రము నిర్విఘ్నముగ నడచుటకు గ్రామవాసులయందు స్వార్థత్యాగమును సహకారభావములును బరస్పర సహనమును అత్యవసరములు. హిందూబౌద్ధ మహమ్మదీయ క్రైస్తవాది మతముల కన్యోన్యసహనము అలవడిన యీదేశమున వివిధజాతులు సోదరభావములతో మెలఁగుచున్న మన పవిత్రభూమియందు స్వీయధర్మానుగుణ్యములగు నిట్టి యుదారభావము లుత్పన్నములు కాఁగలవని నాకు దృఢనమ్మకము కలదు. ఎల్లఱకు నేకాశయమే గలదు. ఎల్లఱును స్వరాజ్యమునే యభిలషించుచున్నారు. ఎల్లఱకును భారతదేశమే మాతృభూమి. ఎల్లఱును ఏకోదరులే! ఇట్టితఱి భిన్నభావములకెడ మీయరాదు. మన కార్యములందును భావములందును వర్తనమందును భారతదేశాదర్శములే భారతీయుల గౌరవమే ప్రస్ఫుటమగుచుండవలయును. జాతీయాత్మగౌరవము నిలచినపుడు స్వరాజ్యము లభ్యమైనదని చెప్పనగును. సర్వేశ్వరుఁడు సమయమునకుఁదగిన కార్యశూరతను ఉత్సాహమును బ్రసాదించుఁగాకయని ప్రార్థించుచున్నాను.

# పోతన

(తిరుగుబోతు)

"కుప్పించి యెగసిన కుండలంబులకాంతి", చిత్రించు మాయాంధ్రశిల్పి వీవు
"హాసలీలానిద్ర" లందూహాలను బెంచు, విజ్ఞానరాజ్యకవీంద్రుడీవు
"లలితరసాల పల్లవఖాది," కోయిల, నడకించు ఆంధ్రగాయకుడవీవు
"పొడిచిన, గొట్టిన," బహుట నటించిన, నవభావకవితాంధ్ర నటుడవీవు

గీ. ప్రకృతి సౌందర్యశోభాస్వభావపటిమ, కొల్లగా బోధజేసినగురుడ వీవు
భాగవతమానసాంతర్విరాగదృష్టి, తన్మయత్వంబు గన్న వేదాంతి వీవు.

శా. దారిద్ర్యాంబుధి నీదినాడవు స్వతంత్రప్రాజ్ఞభోవీథి నం
తో రాజిల్లితి రాజరీతి గుణవిద్యుచ్ఛక్తిలేశప్రభన్
రారాజున్ హారిబంటుం జేసితి యశోభ్రాజిష్ణు శ్రీనాథు "ఖం
గారున్" పొందగజేసి తాత్మబలదివ్యజ్యానినాదంబునన్.

గీ. పసిడిరేకుల తళుకుల ప్రతిఫలించు, బాలభానుని కరముల ప్రజ్వలించు
పుట్టతేనియసోనలపారలుచుండు, పట్టుపీతాంబరంబుల పరుగులిడును,
నీదుచూపులు తలపులు నీపలుకులు, నీదువలపులు ఆంధ్రావనీకవీంద్ర!

గీ. శారదావల్లకీస్వరశాంతిగీతి, నాలకించి మహాజ్ఞాన మందినావు
జ్ఞానకాంతి ప్రసారవిస్తారమునను, చీల్చితివి శారదను ముంచు చీకటులను.

సీ. మేఘోదయంబున మినమిన పురివిచ్చి, నృత్యం బొనర్చెడి నెమ్మివోలె
పౌర్ణిమచంద్రికల్ ప్రసరించగనె నింగి, కరుగ పైకెగయు సాగరమువోలె
సూర్యోదయంబైన సొగసుగా రేకుల, సడలించుకొను జలజంబువోలె
చిరకాలవిరహాసంశ్లేషణసుఖముచే, పొంగిపోవెడి లలితాంగివోలె
భవదమృతనామకీర్తనోత్సవమునందు, పరవశత్వంబునొంది, భావముల డింది
మించి యాత్మార్పణంబు గావించుకొందు, పుట్టుకవిరాజ! బమ్మెర పోతరాజ!

ముప్పదితొమ్మిదవ భారతజాతీయమహాసభ, బెల్గాము



ఆరోగ్యశాఖా కార్యకర్తలు Sanitary Workers



ఆహ్వానసంఘము - సభను జయప్రదముగా జరిపినవారు Reception committee & other workers who made the Congress'a success

The 39th Indian National Congress, Belgaum

ముప్పదితొమ్మిదవ భారతజాతీయమహాసభ, బెల్గాము

స్వయం సేవాయువతీ బృందము



The Lady Volunteers

The 39th Indian National Congress, Belgaum

# అసహాయోద్యమ చరిత్ర

పేరి చినవరహాలు గారు

ఈ యుద్యమము మహాత్మాగాంధిగారిచే 1920సం॥ న ప్రతిపాదింపబడెను. దీనికి ఖిలాఫతుఅన్యాయము, పంజాబుదురంతములు, సంస్కరణములయొక్క అసంపూర్ణతయు పోషణకారణములుగ చెప్పబడెను. సత్వరస్వరాజ్యసిద్ధికి యీదౌర్జన్యరహితసహాయనిరాకరణ మొక్కటే ప్రధానసాధనమని తీర్మానింపబడెను. ఈ తీర్మానము, మొదట 1920 సం॥ సెప్టెంబరు నాల్గవ తేదీని కలకత్తాలో, శ్రీయుత లాలాలజపతిరాయిగారి అధ్యక్షతనుగూడిన ప్రత్యేక దేశీయమహాసభలో ఆమోదింపబడెను. అనేక ప్రతికూలపరిస్థితులలో, నాగపురము మహాసభలో బలపరుపబడెను.

ఈఉద్యమము అహింస, త్యాగము, సత్యము అను మూడింటిపై నాధారపడియున్నది. శాసనసభలను కోర్టులను బహిష్కరించుట, న్యాయవాదులు వృత్తిని విసర్జించుట, విద్యార్థులు ప్రభుత్వ, లేక ప్రభుత్వసంబంధ పాఠశాలలనువదలుట, బిరుదులనునిరాకరించుట, ప్రభుత్వపు దర్బారులు విందులు మున్నగువాటికి దేశీయులు వెళ్లకుండుట, విదేశవస్త్రములను విసర్జించి, వాటిస్థానే ఖద్దరును ప్రోత్సహించి ధరించుట మున్నగునవి ఉద్యమము యొక్క ప్రధానాంగములు. మహాత్ముడు దౌర్జన్యరాహిత్యము, హిందుమహమ్మదీయ సిక్కు పార్సీ సమ్మేళనము, అస్పృశ్యతానివారణము, ఖద్దరుఅభివృద్ధి యను నాల్గింటిని స్వరాజ్యముయొక్క ప్రధాన సోపానములుగా పేర్కొని యున్నాడు. ఇట్టి కార్యక్రమముతో కూడిన యీఉద్యమము 1920 డిశంబరు నాగపురమహాసభయందు సర్వజనాంగీకారమయ్యెను.

1921 సం॥ మార్చి 31, ఏప్రిల్ 1 తేదీలందు బెజవాడలో అఖిలభారత కాంగ్రెసుసంఘసభ కూడి, జూన్ మాసాంతములోపున కాంగ్రెసు క్రీడున కంగీకరించినట్టియు, పావులాచందా చెల్లించునట్టియు సభ్యులను కోటిమందిని చేర్చుటకును, తిలకుస్వరాజ్యనిధికి కోటిరూపాయలు వసూలు చేయుటకును, దేశమంతటను 20 లక్షల రాట్నములను స్థాపించుటకును తీర్మానించినది. గడువుదాటకముందే తీర్మానము రూపము జెందెను. పైతీర్మానముల ననుసరించి 2000 న్యాయవాదులు వృత్తులవదలిరి. అనేక వేలమంది విద్యార్థులు పాఠశాలల విడచిరి. కుప్పలుకుప్పలుగా విదేశవస్త్రములు దహించబడెను. మూలబడిన రాటములు పైకివచ్చెను. ముతకగుడ్డలు మల్లులాయెను. కాంగ్రెసున కుపశాఖలుగా రాష్ట్రీయసంఘములు, జిల్లా సంఘములు, గ్రామసంఘములు మున్నగున వనేకములు నిర్మింపబడెను. నియమబద్ధములగు స్వచ్ఛందసేవాదళములు స్థాపింపబడెను. ఇట్లుద్యమము తీవ్రవేగముతో ప్రజ్వలించుచుండెను.

అట్టిసమయమున, వేలకువేలు ప్రచారకులు, నాయకులు, వాలంటీరులు, 144, 108 మున్నగు సెక్షనుల క్రిందను, రాజద్రోహసభాశాసనము మున్నగు శాసనముల క్రిందను అరెస్టుకాబడి శిక్షలపాలైరి. ఒకవంక శాసనోల్లంఘనోత్సాహముతోడను, వేరొకవంక శ్రీ యువరాజాగమనము, ఆసమయమున హరతాళములు, అందు నాయకుల నిర్బంధములు, విదేశవస్త్ర మద్యవిక్రయశాలల వద్ద గస్తీలలో వాలంటీర్ల నిర్బంధములు మున్నగువాటితోడను ఉద్యమ మున్నతదశయందుండెను. ఆసంవత్సరము అహమదాబాదులో జరుగవలసిన దేశీయమహాసభకు నధ్యక్షుడుగా నెన్నుకొనబడిన, దేశబంధు దాసుగారు సకుటుంబముగా నిర్బంధింపబడి, భార్యాసోదరీ లిరువురుమాత్రము విముక్తులైరి. తండ్రి కుమారులు శిక్ష బొందిరి.

ఆవత్సరము హకీంఅజ్మలుఖాన్‌గారి అధ్యక్షతను అహమదాబాదులో సమావేశమైన మహాసభలో, శాసనోల్లంఘనమున కనుజ్ఞ ఈయబడెను. గాంధిగారు, బార్డోలీ తాలూకాను, స్వయముగా శాసనోల్లంఘనమునకు సిద్ధపరచి, నడిపింప బూనుకొని, తన్ను, దేశమంతయు, సమయమునుబట్టి అనుసరింపవలసినదిగా హెచ్చరించెను. ఈమధ్య, కొన్ని రాజీరాయబారములు జరుపబడెను. 1922 జనవరిలో జరిగినపార్టీలసభలో, మాలవ్యా జిన్నాగార్ల కోరికపైని, గాంధిగారు తనశాసనోల్లంఘన ప్రయత్నములను, జనవరి 31 వరకు నాపుట కంగీకరించిరి. కాని విధివశముచే రాజీప్రయత్నములు ఫలించలేదు. మహాత్ముడు తన బార్డోలీకార్యక్రమమునుగురించి శ్రీ వైస్రాయిగారికి ఫిబ్రవరు 4 వ యొకజాబు వ్రాసెను. ఇట్లు సర్వసన్నాహమొనర్చి తన కార్యమును ప్రారంభింపబోవు సమయమున, దురదృష్టవశమున చౌరీ చౌరా దురంతములు సంప్రాప్తించెను.

దక్షిణఇండియాయందును, యువరాజాగమన సందర్భమున బొంబాయియందును తటస్థించిన దౌర్జన్యములకే పరితపించియు యుపవసించియు ఉన్న మహాత్ముడు, యీదురాగతముల కన్నిటికి దానే బాధ్యుడనని మహావేదనను బొందెను. వెంటనే బార్డోలీలో కాంగ్రెసు కార్యసంఘమునుగూర్చి శాసనోల్లంఘన ప్రయత్నములనేకాక గస్తీ వ్యక్తి శాసనోల్లంఘనము మున్నగు వాటి నన్నిటిని దేశమందంతటను నిల్పివేయునట్లు తీర్మానించెను. దాన మహాత్ముడు చిన్నలయొక్కయు పెద్దలయొక్కయు ననేక తీవ్రవిమర్శనములకు పాత్రుడాయెను. తుదకు వేటికి చలించని మహాత్ముడు మహమ్మదీయ మిత్రులసంతుష్టికై కొన్ని యాడంబరవాక్యములతో గూడిన తీర్మానమును ఢిల్లీలోగూడిన అ. భా. కాం. సంఘసభలో నంగీకరించెను. అదియె మహాత్ముని నిర్బంధమునకు కారణమాయెననుసంగతి యందరకు నిటీవల విశదమే. ఆసభలలోనే నిర్మాణకార్యక్రమ మేర్పరుపబడెను. ఇందు పైమెరుగులు, ఉత్సాహములు లేనందున దేశము కొంచెము నిరుత్సాహము జెందెను. దీనిని దేశ మనుసరించుచో నీపాటి గమ్యస్థానమును సమీపించియుందుము. ఇంతలో మహాత్ముడు నిర్బంధింపబడుటయు ఆరు సం॥ల విడిఖైదు బొందుటయుఁ దటస్థించెను. ఇది 1922 మార్చి సమాచారము. దీనితో నుద్యమమునకు క్రొత్తదశ ప్రారంభమాయెను. ప్రచారము తగ్గిపోయెను. కాంగ్రెసు సంఘములు సభ్యులు లేక శిథిలము కాజొచ్చెను. దేశీయులగతి 'కాపరిలేని గొఱ్ఱెలచంద'మాయె. జైలుకుబోవుచు మహాత్ము డుపదేశించిన ఖద్దరుమంత్రమును దేశము మరువజొచ్చెను. నెహ్రూ మున్నగు నాయకులు విడుదలబొంది రంగమున బ్రవేశించిరి. అంత శాసనోల్లంఘనావకాశముల బరిశీలించుటకు యిప్పటి దుస్థితికి కారణమైన శాసనోల్లంఘన సంఘమొకటి లక్నోలో అ. భా. కాం. సంఘముచే నిర్మింపబడెను. ఆసంఘము దేశమంతయు పర్యటనము సల్పి తుదకు వివాదాస్పదమును అప్రస్తుతము నగు శాసనసభా ప్రవేశసమస్యను లేవదీసెను. సంఘసభ్యులగు హకీంజీ నెహ్రూ పటేలుగార్లు ప్రవేశమును కస్తూరి రంగయ్యంగారు రాజగోపాలాచారి అన్సారిగార్లు బహిష్కారమును సమర్థింప దొడగిరి. దాసుగారుకూడా విడుదలయై ప్రవేశపక్షమును బలపరచిరి. అదివరకే మధ్యమహారాష్ట్రములలో నంకురించియున్న యీ సమస్యకు మరింతబలము చేకూరెను.

ఆ సంవత్సరము (1922) న దేశీయమహాసభ గయలో దాసుగారి అధ్యక్షతను జరిగెను. అందు పూర్వపక్షసిద్ధాంతములు జరిగి బహిష్కారపక్షమునకు విజయము కలిగెను. ప్రవేశపక్షమునకుజెందిన దాసుగారు తమ అధ్యక్షపీఠమునకు రాజీనామా నొసంగిరి. వారినాయకత్వముక్రింద ప్రవేశపక్షము వారు 'స్వరాజ్యపక్ష'మను పేరుతో నొకపక్షముగా నేర్పడిరి. బహిష్కారపక్షమునకు శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులుగారు నాయకత్వము వహించిరి. ఇక వివాదములు ప్రారంభమాయెను. కాంగ్రెసుకార్యక్రమము స్తంభించిపోయెను.

ఉభయపక్షములమధ్య మధ్యవర్తిపక్ష మొకటి రాజీకై తంటాలుపడుచుండెను. వంగరాష్ట్ర నాయకులగు మౌలానా అబ్దుల్‌కలాం అజదుగారు కారాగారవిముక్తులు కాగానే రాజీకై తమ యావచ్ఛక్తిని ధారవోయ దొడంగిరి. ఇందుకై అ. భా. కాం. సంఘము అలహాబాదు, బొంబాయి, నాగపురము, విశాఖపట్టణములలో కూడి తుదకు 15-9-23 న, రాజీకారకులగు అజదుగారి అధ్యక్షతను ఢిల్లీలో అవసరమహాసభ కూడుటకు తీర్మానించిరి. ఇన్నిచిక్కులమధ్యను దేశము అకాలీ, నాగపూర్ పతాక, బోర్సదు మున్నగు సత్యాగ్రహ సంరంభములందు విజయము గాంచుచునే యుండెను.

ఇంతలో లోకవిఖ్యాతులగు ఆలీసోదరులు మున్నగు నాయకులుకూడ విడుదలయై కార్యరంగమున జేరిరి. ఢిల్లీలో నుభయపక్షములు యేదో యొకవిధముగ సమాధానపడినవి. దానిపై స్వరాజ్యపక్షమువారు గత యెన్నికలందు సామ్రాజ్యశాసనసభలోను వంగరాష్ట్ర సభలోను గొంతమట్టుకును మధ్యరాష్ట్రములో పూర్తిగాను యితరరాష్ట్రములలో స్వల్పముగాను విజయము గాంచిరి. సమాధానము శాశ్వతఫలకారిగాక తిరిగి కాకినాడ దేశీయమహాసభనాటికి వివాదలు తలయెత్తెను. కాని మౌలానా మహమ్మదాలీగారి సామర్థ్యవిశేషముచే ఢిల్లీ సమాధానము తుదకు స్థిరపరుపబడెను. కాని మాంద్యస్థితి తొలగదాయెను.

స్వరాజ్యపక్షవిజయములో 'సంస్కరణముల యొక్క నిస్సారము పూర్తిగా వెల్లడియగుట, వెర్కొనదగియున్నది. మధ్యరాష్ట్ర శాసనసభ రద్దుపరుపబడి పరిపాలనా కార్యనిర్వాహకవర్గము (Executive Council) వారి హస్తగతమాయెను. వంగరాష్ట్రమునగూడ ఫలితమదియేయైనను కొద్దిరోజులలో శాసనసభ ప్రస్తుత నిర్బంధముల చర్చించుటకై కూడనున్నదట. ఇతర రాష్ట్రీయసభలందును స్వల్పసంఖ్యాకులగు స్వరాజ్య పక్షము వారు జాతీయవాదులసహాయముతో ప్రాకులాడుచున్నారు. కేంద్రశాసనసభలోగూడ జాతీయవాదుల సహాయముతోడనె కొంతవరకు విజయమును బొందుచున్నారు.

1924 సంవత్సరము ప్రవేశించెను. మహాత్ముడు జైలుకువెళ్లి రెండువత్సరములు కావొచ్చెను. తీవ్రవ్యాధికి లోనైనను దైవకృపచే భారతీయుల కృతజ్ఞతకు పాత్రులగు కల్నలు మాడకుగారి చికిత్సచే మహాత్ముడు మృత్యుముఖమునుండి బయల్వెడలెను. అతరుణముననే నిర్బంధవిముక్తి గాంచెను. దేశము స్వాతంత్ర్యము గాంచి తన్ను విడిపించుననుకొనెను. అట్లు జరుగకుండుటచే యరవాడ జైలుదాటి యంతకంటె విశాలమగు జైలులోనికి వచ్చినట్లు చింతించెను. జూహూ విశ్రాంతిలో నాయకులందరితోడను సంప్రతించెను. స్వస్థశరీరుడై పరిస్థితుల నాలోకించెను. మాంద్యము నాలోకించెను. వెంటనె వాక్శూరుల కార్యశూరుల గావించుటకై అహమదాబాదులో అ. భా. కాం. సంఘమును సమకూర్చి నూలు చందా పంచబహిష్కార పునరుద్ధరణము మున్నగు తీర్మానముల ప్రతిపాదించెను. అందలి చర్చలను, నాయకులయుపన్యాసములను సభ్యులచర్యలను మహాత్ముడాలోకించి తనతీర్మానములు వోట్లచే నెగ్గినను స్వబలములోని ప్రాతికూల్యము కనబడుటచే మిక్కిలి చింతించి దేశీయులలో తగినవిశ్వాసము కలుగువరకు వివాదము లంతమొందుటకై తన కార్యక్రమములోని ఖద్దరు హిందూ మహమ్మదీయమైత్రి అస్పృశ్యతానివారణము అను మూడింటిని నిలిపియుంచి మిగతవాటి నాపివేయ సమకట్టెను.

మహాత్ముడు కార్యరంగమునుండి తొలగి నిర్బంధితుడుకాగానే మహాత్మునిచే నిర్మింపబడిన ఐకమత్య సౌధములు బిగటబారజొచ్చెను. ఉద్యమమున కాధారభూతములగు అహింసా త్యాగసత్యములకే భంగము కలుగజొచ్చెను. హిందూ మహమ్మదీయ లొకవంకను, మితవాద జాతీయవాదు లొకవంకను, శాసనసభాప్రవేశ బహిష్కారవాదు లొకవంకను, స్పృశ్యాస్పృశ్యు లొకవంకను తగవులాడుచుండ ఉద్యమము సాగుటెట్లు?

మహాత్ముడు యెంతవారించినను యెంతబోధించినను వినక సర్వదా పోరాటములే వృత్తిగాగల తుంటరులచే ప్రేరేపింపబడిన షహారాన్పూరు కోహాటు మున్నగుస్థలముల యందలి ఘోర హిందూ (మహమ్మదీయ) పోరాటములకు తీవ్రమగు మనోవేదనను జెంది యిందు బాధితులగు అమాయిక ప్రజల బాధలకు తానే బాధ్యుడనని అందుకు ప్రాయశ్చిత్తముగా ఢిల్లీలో మహమ్మదాలీగారి యింట నతిథిగానుండి 21 రోజుల ఘోర ఉపవాస దీక్షకు 17-9-24 న బూనుకొనెను.

ఈవార్త జపాను భూకంపముకంటె హెచ్చు వడితో ఆసేతుహిమాచలపర్యంతము నొక్కరోజులో కలవరపెట్టెను. దాని ఫలితముగా ఢిల్లీలో శ్రీయుత పండిత మోతీలాల్ నెహ్రూగారి అధ్యక్షత క్రింద నానామత సభ 26 సెప్టెంబరున కూడెను. వారమురోజులవరకు జరిగెను. ఆసభకు అన్ని రాజకీయములవారు సమస్త మతముల నాయకులు గురువులు తుదకు హిందూదేశస్థ ఆంగ్లమత ప్రధానగురువులగు మెట్రోపాలిటన్ గారు కూడ ఐకమత్యమును సమకూర్చుటకై విచ్చేసిరి. ఐకమత్యసూత్రముల నిర్మించిరి. జాతీయ పంచాయితీ యేర్పరుపబడెను. అందలి తీర్మానముల స్థలవిస్తర భీతిచే వ్రాయ బూనుకొనలేదు. మహాత్ముని ప్రాశన దినము (8-10-24) దేశమంతటిచే నైకమత్యదినముగా నెంచబడెను. ఆదినము శ్రీ ఇండియామంత్రిగారి యొక్కయు వైస్రాయిగారి యొక్కయు యితర గవర్నర్ల మతగురువుల (Bishops) యొక్కయు సానుభూతి నందెను. ఇంతటితో కలహనివారణ గాకపోయినను ఐకమత్యమునకు దృఢమగు పునాదు లేర్పడెననుటకు సందియము లేదు. ఐకమత్యావసరము గుర్తింపబడెను. 'మానవ హృదయమునుంచి పతితుడైన భగవంతుని తిరిగి మానవహృదయపీఠమున నిల్పుటకు' తా నుపవసింపవలెనని మహాత్ముడు తెలిపినవాక్యము లమూల్యములు. యథార్థములు.

సురక్షితముగా దేశీయుల భాగ్యవశముచే మహాత్ముడు దీక్షను గడపెను. చిత్తశాంతిని కొంతవరకు పొందెను. దేశమందలి—ప్రధానముగా మాతృసంస్థయగు కాంగ్రెసునందలి—విభేదము బోగొట్టనిది పూర్తిగా చిత్తశాంతి గుదురు టెట్లు? ఈ ఐకమత్యావసరము అనిబిసెంటుగారికికూడ తోచెను. అదియు శుభప్రదమె. ఐకమత్యము కొరకై యామె గాంధిగారి సంక్షిప్త కార్యక్రమమున కంగీకరించెను. ఇతర రాజకీయపక్షములలో గూడ కొంతకదలిక బుట్టెను. ముఖ్యముగా కలకత్తాలో స్వరాజ్యపక్షమువారికిన్ని గాంధిగారికిన్ని సమాధానము కుదిరి యొకసమిష్టిప్రకటనను చేసిరి. ఇదియే గాంధి-దాసు ఒడంబడిక.

అందర నిట్లేకముఖమునకు దెచ్చిన ముఖ్యపరిస్థితుల గమనించవలసి యున్నది. ఇట్టిస్థితికి బెంగాలు నిర్బంధములే ముఖ్యకారణముగా సూచింపబడెను. కలకత్తాలో 1818 రెగ్యులేషను 24 ఆర్డినెన్సుల క్రింద ప్రముఖులగు శాసనసభ్యులు పత్రికలు ప్రొఫెసరులు మున్నగువారు 76 మంది నిర్బంధింపబడిరి. అందు వంగదేశ స్వరాజ్యపక్ష నాయకులు ముగ్గురు కలరు. అత్యంత మితవాదులున్ను అత్యంత ప్రభుత్వసన్నిహితులు నగు శ్రీయుత చింతామణి రై. ఆ. శాస్త్రి మున్నగువారు కూడా యీ నిర్బంధవిధానమును నిరసించుటయే అందలి యథార్థస్థితిని వెల్లడిచేయుచున్నది. ఎట్లైననేమి యీ పరిస్థితు లన్నిపక్షములందును ఐక్యభావమును కలుగచేసినవి. అందుకు మనము కృతజ్ఞులము. గాంధి-దాసు ఒడంబడికయు దానిఫలితమే.

ఈ ఒడంబడికను స్థిరపరచుటకున్ను అన్ని రాజకీయపక్షములను కాంగ్రెసువేదికకు జేర్చుటకు గల యవకాశముల జర్చించుటకున్ను బొంబాయియందు మౌలానా మహమ్మదాలీగారి యాహ్వానముపై కాంగ్రెసునంఘసభయు నానారాజకీయనాయక మహాసభయు గత నవంబరు 20, 21, 22 తేదీలలో సమావేశమయ్యెను. గాంధి-దాసు ఒడంబడిక యంగీకరింపబడెను. నాయక మహాసభకు మితవాద జాతీయవాద హోంరూలులీగు, స్వతంత్ర, జస్టిసు, స్వరాజ్య, కాంగ్రెసు ఖిలాఫతు, మస్లింలీగు మున్నగు సమస్తరాజకీయపక్షముల ప్రతి

నిధులు, నాయకులు హాజరైరి. వంగరాష్ట్ర నిర్బంధములు పూర్తిగా ఖండింపబడెను. అన్ని పక్షముల ప్రతినిధులు గల ఐకమత్యావకాశముల సమకూర్చెడి ఐకమత్యోప సంఘమొకటి నిర్మింపబడెను. ఆసంఘమును మార్చి (1925) నెలాఖరులోపున తనరిపోర్టును ప్రచురించును. దానిపై 25 యేప్రెలు 15 తేదీని తిరిగి నాయకసభజరిగి యేదోయొక నిర్ధారణ చేయును. దేశభావిస్థితి దానిపై నాధారపడి యుండును.

కాంగ్రెసు ఆదర్శము (Creed) విషయమై వివాద సూచన లగపడుచున్నవి. మితవాద జస్టిసు మున్నగు పక్షములవారు ఆదర్శమును (Creed) సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యముగా మార్ప నభిలషింతురు. ఇదివరకే స్వరాజ్యమనగా 'సంపూర్ణ స్వాతంత్ర్య' మని ప్రకటింప వలసినదని కాంగ్రెసువారు కొందరు కోరుచున్నారు. వారిసంఖ్య దినదిన ప్రవర్ధమానమగుచున్నది. మహాత్ముడు అన్ని రాజకీయపక్షములకు స్థానముగల యాదర్శమును నాగపుర మహాసభలో నిర్ణయించెను. అట్టి యాదర్శమును యిప్పుడు మితవాదుల సంతుష్టికై మార్ప బూనుచో యిప్పటి యుత్సాహమును కార్యదీక్షయు గల్గినట్టి 'సంపూర్ణస్వాతంత్ర్య' పక్షము వేరగుట నిశ్చయము. అప్పు డైకమత్యఫలము సున్న. మహాత్ముడు చెప్పినటుల ప్రస్తుత విశాలాదర్శమే శ్రేష్ఠతమము. ఐకమత్యోపసంఘమునకు నిదియొక ప్రధానసమస్య. తరువాత సర్వాంగీకారము బొందిన ఖద్దరుసమస్య గలదు. ఈస్థితిలో నెట్టినిర్ధారణ చేయబడునో? ఎట్టి ఐకమత్యము సమకూడునో ? దేశ మాతురతను బొందుట సహజము.

ఈవిధముగా అసహాయోద్యమమందలి బహిష్కారములు నిలిపివేయబడినవి. ఉద్యమజనకు డగు మహాత్మునికంటె ప్రయోగోపసంహార సమయముల నెరుంగువారు లేరు. కాంగ్రెసులో బహిష్కారము లాపివేయబడినను వ్యక్తు లెంతమాత్రము వాటిని విడనాడ నవసరములేదని మహాత్ముడే సెలవిచ్చియుండెను. తగు నవకాశములు లభించగానే ఉద్యమము తిరిగి మహావేగముతో బయలుదేరి విజయముగాంచును. అన్ని తరగతులలోను పల్లెలలోను కాంగ్రెసు రాజకీయములం దభిరుచిని జ్ఞానమును గలుగచేసిన దీయుద్యమమే. మల్లుల వెంబడి పరుగిడు యువకుల మళ్లించి దేశీయపరిశ్రమల నుద్ధరించిన దీయుద్యమమే. సేవావాంఛను దొలగించి స్వాతంత్ర్యభావమును గలిగించిన దీయుద్యమమే. డాంబికమును రూపుమాపి బీదల కన్నవస్త్రముల నొసంగినదియు నిదియే. అహింసా తత్త్వమును బోధించినదియు నిదియే. భౌతికదృష్టినుంచి ఆధ్యాత్మిక మార్గమును బోధించినదియు నీయుద్యమమే. దేశావసరములనుబట్టి తాత్కాలికముగ విరమించబడినను ఉద్యమముయొక్క ఆధ్యాత్మికతత్వము నిలిచియే యున్నది. అది మరువ దగినది కాదు.

# సంకీర్తనము

## శ్రీ. సూర్యనారాయణ శర్మగారు

ఎన్నేనివిధంబులఁ బరు లెన్ననిమ్ము చెన్నటులై
నిన్నేనమ్మితి గాంధీ నిరుపమగుణరత్నకంధి॥ ఎ॥
ఆపన్నులఁ బ్రోవగ ని-ర్వ్యాపారులనుం గావఁగ
తాపసిజనచక్రవర్తి - ధరలో నవతారమెత్తి॥ తె॥
రాగద్వేషములఁ గోసి - భోగము లన్నిటిని బాసి
సాగరగంభీర! కర్మయోగంబును బోధ సేసి॥ తె॥
విన్నాఁడను నీనామము - వీనులార నీసామము
కన్నులార నీరూపము-గాంచినఁ బోవదె పాపము॥ ఎ॥
ఎప్పటికిని నీదుమాట - తప్పదనుచు పాటపాటఁ
దిప్ప లనుభవించునాఁట-దెలియనగును సుకవిబాట॥ ఎ॥
వింత భవజ్జీవితంబు - వినయగుణాసు సేవితంబు
సంతస్సంభావితంబు - సంతతనత దైవతంబు॥ ఎ॥
పరమతపోబలసమేత - వరమణిరత్నఖనివ్రాత (?)
భరతమాతబంధము లెడఁ-బాయుత నీకరుణచేత॥ ఎ॥
క్రూరదారుణాహంకృతిఁ - గూల్చుమహోదారాకృతి
కారణజన్మునిఁ గని మతి-సూరన నేఁడయ్యె సుకృతి॥ ఎ॥

# స్వరాజ్య సంపాదనయందు స్త్రీల విధ్యుక్తధర్మము

శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

స్వరాజ్యమన నేమి? చాలమందికి స్వరాజ్యమన నేమియో తెలియనే తెలియదు. కొంతమందికి తెలిసినను దానిని తప్పులుగ నిర్వచించెదరు. ఈ రకపు మనుష్యులు చాలమంది కలరు. మనము స్వరాజ్యము ఎందుకొరకు అడుగుచున్నాము? స్వరాజ్యమును బడయుటకు మనము తగియున్నామా, లేదా? ఏవిధముగ దీనిని బడయవలయును? ఎవరియొద్దనుండి దీనిని బడయవలయును? ఏ ప్రయత్నము చేసి మనము యీ మహాయత్నమును కొనసాగింప వలయును? ఈ యూహలన్నియు ప్రజలమనస్సుల తట్టుచుండును. మనల నేలుచున్న వారు మనజాతివారు కారు. ఆంగ్లేయగవర్నమెంటు మంచిదా చెడ్డదాయనుమాట అటుంచుడు. ఇప్పుడు మనము యోచించునది స్వరాజ్య పరరాజ్యముల విషయమైయున్నది. పూర్వము హైందవ దేశమున చాలరాజ్యము లుండెడివి. కొన్ని రాజ్యములలో మహమ్మదీయులు మరికొన్నింట రసపుత్రులు యింక కొన్నింట హిందువులు తదితరచోట్ల మహారాష్ట్రులు రాజ్యము నొనరించుచుండిరి. ఇవియన్నియు మంచివా చెడ్డవా అను విషయమై మనము పిమ్మట యోచింతము. ఈ రాజ్యములన్నియు అస్తమించిన పిమ్మట బ్రిటిషు ప్రభుత్వము నెలకొల్పబడినది.

ఆరాజ్యము లెట్లు అస్తమించినవో చరిత్రకారులు మనకు తెలుపనే తెలిపియున్నారు. ఇప్పటి పరిపాలనక్రమమును విచారింతము. ఆంగ్లదేశపు కాలేజిలయందు చదువుకొన్న కొందరు యువకులు హిందూదేశమునకు బంపబడుచున్నారు. వారివల్లనె రాజ్యక్రమము నడపబడుచున్నది. చక్రవర్తిత్వము అనునది ఒకపదము. చక్రవర్తియనువాడు వ్యక్తి. ఈ పరిపాలనమంతయు సాగించుచున్నది చక్రవర్తికాదు. ఏదేశమైనను సరియే యేదోఒక విధమైన రాజ్యాంగమును రాజును లేక కొనసాగుట దుర్లభము. ఏదేశమున రాజుండడో యేదేశమున ప్రతినిధిసభవారు నిష్కల్మష హృదయములతో రాజ్యాంగమును నడపరో అట్టిదేశమున బుద్ధిమంతు డుండరాదని మహాభారతము నుడువుచున్నది. అట్టిస్థలముల ప్రజల ఆస్తికి భద్రములేదు. ఏసమయమున స్త్రీలమానము లపహరింపబడునో తెలియరాదు. రాజులేని రాజ్యమునందు దోపిడులు బందిపోటులు విస్తారము జరుగుచుండును. అందుచేత యేదో యొక విధమైన గవర్నమెంటు ఉండియే తీరవలయును. కృతయుగములో రాజే ఉండెడివాడు కాడు. అప్పటి ప్రజలు ధర్మబుద్ధి కలవారై రాజులేకుండగనే యొకరికొకరు పరోపకార చింతతో నుండెడివారు. కాని చరిత్ర యుద్భవించినది మొదలు రాజుగాని రాజ్యాంగముగాని లేకుండ జరిగిన దేశములేదు. కనుక ఏదోఒకవిధమైన ప్రభుత్వముండియే తీరవలయును. పూర్తిగా ప్రజలు అందరును కలిసి ప్రభుత్వముగుట దుర్లభము. అందువల్లనే రెండువిదములగు రాజ్యాంగములు కలిసి యొక ప్రభుత్వమగుచున్నది. ఒకటి సలహా చెప్పు ప్రజాప్రతినిధిసభ. రెండవది దాని నమలులో నుంచు రాజ్యప్రభుత్వము. ఈ రెండు రాజ్యాంగములు కలిసియే ఒకదేశమును పరిపాలించుచున్నవి. ఆంగ్లేయులు హిందూదేశమునుండి వెడలిపో నక్కరలేదు. ఆంగ్లదేశస్థుల క్రిందనే ఆంగ్లజాతిక్రిందనే మనము మన హక్కులను సంపాదించుకొనవలయును. ఆంగ్లదేశస్థుల క్రింద మనహక్కులను బడయుట రాజద్రోహము కానేరదు. హిందూదేశ రాజ్యాంగవిషయముల నాలోచించవలసినవా రెవరు? మన దేశము నెటుల పరిపాలించవలయునో మనము తెలుపగలుగుదుము. ఇంగ్లండు దేశమున చక్రవర్తి యున్నాడు. రాజ్యాంగవిషయములలో నెట్టితప్పును జేయరాదని యొక నియమము కలదు. చక్రవర్తి యెప్పు

డును తప్పను జేయనేచాలడు. ఎందుకనిన అతనికున్న అధికారము నామమాత్రము. అతనికున్న అధికారమంతయు ప్రధానమంత్రి యెట్లు చెప్పిన అట్లు చేయవలసినదే. అచ్చటి రాజ్యాంగమును నడుపువారు వేరు; రాజు వేరు. రాజు యెల్లప్పుడును ఒకడే. మంత్రులు ప్రతి అయిదేండ్లకు ఒకరు మారుచుందురు. ఈ మంత్రుల యొక్క పరిపాలనను యెవరైన విమర్శించినచో అది రాజద్రోహమగునా? ఇంగ్లండులోనిది ప్రతినిత్యము జరుగుచునే యుండును. ఎప్పుడు ప్రజలకు మంత్రులకు సంఘర్షణవచ్చునో అప్పుడెల్ల మంత్రులు రాజీనామా యిచ్చుచునే యుందురు. అంతమాత్రమున రాజున కేమి నష్టము ? మన స్వరాజ్యయత్నముకూడ నట్టిదే. మన హిందూదేశమును ఎవరు పరిపాలించుచున్నారు? చక్రవర్తి వచ్చి పరిపాలించుచున్నాడా? ఒకవేళ ఆతడు వచ్చినయెడల దేవతామూర్తి నూరేగించినట్లు ఊరేగించి ప్రజలు భక్తిని కనబరచవలసినదే. అది మనవిధి. అయితే ప్రభుత్వ మెవ్వరివల్ల నడపబడుచున్నది? ప్రభుత్వ సేవకులవల్ల నడపబడుచున్నది. మన హిందూదేశ ప్రభుత్వమును కొనసాగించు చున్న ముఖ్య సేవకుని పేరు స్టేటు సెక్రటరీ. అతనిక్రింద వైస్రాయి, గవర్నరు, కలెక్టరు, పటేలు, పోలీసు మొదలగు ఉద్యోగస్థులవల్ల ప్రభుత్వము నడపబడుచున్నది, 'నేడీ కలెక్టరు మాకక్కరలేదు. మరియొక కలెక్టరు కావలసియున్నది.' అని కోరిన అది రాజద్రోహ మగునా? 'ఈ గవర్నరు అక్కరలేదు; మరియొకగవర్నరు కావలయు' ననిన రాజద్రోహ మగునా? ఎవరును దీనిని రాజద్రోహమని యుండలేదు. స్టేటుసెక్రటరీ యెవరి సేవకుడో మనము కూడా ఆచక్రవర్తి ప్రజలమై యున్నాము. 'ఈ స్టేటు సెక్రటరీ మన కక్కరలేదు. యీ వైస్రాయి మన కక్కరలే'దని తీర్మానములు తయారుచేసినచో అది రాజద్రోహ మగునా? కాజాలదు; కాదు. అటులనే మనమిప్పుడు కోశాధికారమున ఉన్నవారిని తప్పించి ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధులకు కోశాధికార మిమ్మని యడుగుచున్నాము. ఇదియే స్వరాజ్యము. అని తిలకుమహారాజు నహమ్మదాబాదు నగరమున నుపన్యసించుచు నుడివెను.

అట్టి స్వరాజ్యమును బడయుటకు గాంధి మహాత్ముడు సహాయనిరాకరణమును ప్రారంభించెను. దేశమున ననేకమంది తమకు తోచినరీతిని సాయపడుచున్నారు. ఇట్టిస్థితియందు భారతస్త్రీల కర్తవ్య మేమి అని మనము యోచింపవలయున్నది.

సహాయ నిరాకరణ తత్త్వమును పూర్తిగ బోధపరచుకొన్నవారు ఆంగ్లేయులను ద్వేషింపజాలరు. సహాయ నిరాకరణతత్త్వమున ద్వేషమునకు స్థానమే లేదు. ప్రేమచేతనే పాలకుల మనసు త్రిప్పుకొన బ్రయత్నింపవలయును. అహింస దీనికి ముఖ్యప్రాణము. అహింస పిమ్మట ఖద్దరు దానిస్థాన మాక్రమించుచున్నది. ప్రతియేటను ప్రవాహమువలె దేశమునుండి పోవుచున్న అపారధనము ఖద్దరువలన నాపబడును. కావున ప్రస్తుత పరిస్థితులలో ప్రతిస్త్రీయును రాట్నచక్రమును చేపట్టవలయును. శ్రద్ధతో నూలు వడకవలయును. ఏనాడింటింటను రాట్నలక్ష్మి వెలయునో, ఏనాడు హైందవ నారీమణులు ఖద్దరు తప్ప నొండు ధరింపరో నాడు దేశము సుభిక్షమగును. దేశము స్వరాజ్యమును పొందగలుగును. పురుషుల కన్న స్త్రీల కెక్కుడుకాలము తీరుబడి యుండును. ఆ తీరుబడిసమయముల నెల్ల రాట్నమునకై వినియోగించినచో భారతమాతకు దారిద్ర్యము బాపినవారగుదురు.

పురుషుడు ధనసంపాదనాసక్తుడగుటచే ఆతనికి సాధారణముగా తీరికయే యుండదు. స్త్రీకన్నో యట్లు కాదు. దినమున కథమము మూడుగంటలైన స్త్రీకి వ్యవధి యుండితీరును. అట్టిసమయమున నూలువడకినయెడల నెంత బాగుండును? ప్రతియింటను అటులనే చేయుచో మహాత్మునిమన మెంత ఆనందమయమగును! మహాత్ముడు ఇరువదియొక్కదినములు ఉపవసించి మృత్యుముఖమున బడనున్నచో నయితము రాట్నమును వడకుట మానలేదు. మనము వడకినబట్ట మనము గట్టుకొన్నచో మనకెంత హాయిగనుండును! అదియునుగాక ఇంట వడకిన నూలుతో నేయబడిన బట్ట చాలకాలము మనును. చాలమంది పిల్లలు గలవారు తమకు వడకుటకు తీరుబడి

లేనియెడల తుదకు ఖద్దరుబట్టనైన కట్టినయెడల ఎందరో బీదవాండ్రకు అన్నము కల్పించిన వారగుదురు. పాశ్చాత్య వాసనలు, పాశ్చాత్యమోహము మనకు కండ కండకును బట్టుటచే మనవారు ఫ్యాక్టరీలను స్థాపించుచున్నారు. పాటకజనము వానియందుపనిచేయవలసియున్నది. వానియందు స్త్రీపురుషులు పనిచేయుచుందురు. ఫ్యాక్టరీలకేగు స్త్రీలు అనేకకారణములవలన తమ మానమును గోల్పోవలసి వచ్చుచున్నది. రాట్నమన్ననో యింట గూర్చుండు ఘోషాస్త్రీలకు సయితము అన్న మిడజాలియున్నది. కదురు కవ్వము దిరుగుచున్న కాటక ముండదు. సుప్రసిద్ధ రసాయనిక శాస్త్రపరిశోధకుడగు ప్రఫుల్లచంద్రుడు కాటకస్థలములయం దీరాట్నము ప్రవేశపెట్టి పెక్కుమంది దీనవనితల కన్నమును గల్పించినాడు. రాట్నము దారిద్ర్య మహాభూతము పాలిటి విష్ణుచక్రము. ఇట్టి సమయమున ప్రతిహైందవ వనితయును రాట్నమును చేపట్టి తనవిధి నెరవేర్పుగాత.

# చంద్రప్రశంస

వెలగపూడి దానయ్య చౌదరిగారు

(గీతమాలిక)

చందమామ! తారావళి సార్వభౌమ!
యమలగుణధామ! ధవళధామాభిరామ!
వెల్లఁదనముగ జగమెల్ల వెలుఁగఁజేసి
చలువలను గ్రుమ్మరించెడి జాణవీవు
పేదవాఁడు ధనాఢ్యుఁడ న్భేద ముడిగి
సమత వెన్నెలఁ బఱపెడి జాణవీవు
కష్టసుఖముల భేదంబుఁ గనుట మాని
సస్యములఁ బెంపఁజూచెడి జాణవీవు
దివ్వియే లేక చీఁకటి దేవులాడు
దీనజనములపాలిటి దివ్వె వీవు
దుఃఖసాగరమునఁబడి తూలిపోవు
నరుల నానందమునఁ దేల్చు నావవీవు
రేల దొంగలుసొచ్చి హరింపకుండఁ
బరుల ద్రవ్యంబుఁ గాపాడు బంటవీవు
నిన్నుఁ గనువారలకునెల్ల నెమ్మితోడ
ఘనతరానంద మొసఁగూర్చు ఘనుఁడవీవు
కీర్తిశామ! కృపాధామ! కినిసి నిన్ను
నీకు నీవె ప్రకాశింప నేర వనుచు
నెలనెలకు వృద్ధియును క్షయం బెలయుదనుచు
రేలఁ దస్కరుఁబోలి చరింతువనుచుఁ
జోరు లనిశంబు దూషించుచుందు రనుచుఁ
బద్మములచేత నిరసింపఁబడు దటంచుఁ
దివిరి విరహులఁబట్టి వేధింతు వనుచు
నెందఱో యన్నివిధముల నెంచుచుంద్రు
వారిపల్కులు సర్వంబు వాస్తవములె
యగును; గాని నే నారీతి ననఁగఁబోను
జగతి స్వాభావికంబుగా జనులయందు
దోషచయ మెట్టివారికిం దోఁచుచుండు
నెట్టిదోషంబు లేనివాఁ డీశుఁడొకఁడె
కానదానికి నేమాయెఁగాని చంద్ర!
యెన్నఁగావచ్చు విధుఁడని నిన్ను జగతి,—

# అసహాయోద్యమము—పూర్వోత్తర భాగములు

భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

మనరాజకీయ జీవితమునందును, అదేవిధమున మనజాతీయజీవితమునందును, ఒకశకము ముగియవచ్చుచున్నది. ముగిసినదనియేకూడ చెప్పవచ్చును. గతనాలుగుసంవత్సరములయందును దేశమునందెల్ల గలిగినప్రబోధమేమి, నెలకొల్పబడిన ఉజ్జీవమేమి, మనచరిత్రయందు నిస్సందేహముగ నొకశకముగ నెంచబడదగును. నాలుగుసంవత్సరములక్రిందట అప్పటికి ప్రపంచమునందంతయు అపూర్వమైన సాంఘిక, రాజకీయ పునర్నిర్మాణకార్యక్రమమును మన ముపక్రమించితిమి. మనకు అట్టికార్యక్రమనిర్వర్తనమువలన జయముగెంటనే చేకూరగలదనువిశ్వాసము మనము గలిగియున్నట్లు ఇప్పుడు నొక్కిచెప్పనూలేము, చెప్పకపోనూలేము. ఏయుద్యమమైనను లక్ష్యములేక పనిచేయదుగదా! దానికి పరమావధి యుండవలెను. అట్టిపరమావధిని చేరుటయే జయమనిపించుకొనును. కాని అఖండమైనసామ్రాజ్యమును ఒక్కసంవత్సరములో కలక్రిందులు చేయగలమని ఏయుద్యమకారకులును చెప్పజాలరు. అందుచే కొంతజయము మనము పొందవలెననుఆశ మనకుండియున్నను, పరిపూర్ణజయము మనకు లభింపలేదని విచారపడవలదు. మన ముద్దేశించిన ఈజయమును ఇంకనైన మనము పొందితిమా! నైతికప్రపంచమునందు కానిమ్ము, భౌతికప్రపంచమునకానిమ్ము—అన్నియుద్ధములందును, సేనానిఒక్కడే ధ్వజమును ఎత్తుటకుగాని దింపుటకుగాని సమర్థుడు. అయినను ఒక్కసారి యుద్ధము విరమింపబడినపిమ్మట, పూర్వచరిత్రనంతను నొక్కసారి దృష్టిలో నుంచుకొని, అందలిలోటుపాటులను పరిగణించుకొనుటకు ప్రతిభటునకును అధికారము గలదు.

## మొదటిలోపములు

ఈ చరిత్రయొక్క వివిధాధ్యాయములను పరిశీలింపగ ప్రతిదశయందును కొన్నితప్పటడుగులు పడినట్లు స్పష్టమగుచున్నది. వీనిని గ్రహింపవలెననిన ప్రారంభమునకు పోవలెను. అసహాయోద్యమము ఉపక్రమింపబడినపుడు ఉద్యమస్థాపకుని మనస్సునందు కొన్ని ప్రత్యేకపుఉద్దేశము లుండియుండెను. ప్రజలు వీనిని గ్రహించి వానిసిద్ధికొఱకు పనిచేయవలెనని ఆయన తాత్పర్యము. 1920 వ సం. ఏప్రిల్ తొమ్మిదవ తేదీని, గాంధిమహాత్ముడు ఈ నిరంకుశ ప్రభుత్వమునకు మనము సహాయముచేయవలదని నిర్ధారణ చేసినపుడు, పంజాబు హత్యలకు పరిహారము నొందవలెననియు ఖిలాఫతుద్రోహము సరిపుచ్చబడవలెననియు మాత్రమే, ఆయన ఉద్దేశించి యుండెను. కలకత్తాలో గావింబడిన ప్రత్యేకపు తీర్మానమునందు మొట్టమొదటనీవిషయము సూచింపబడియున్నది. కాని నూర్లకొలది పోయినప్రాణములను పునరుద్ధారణ చేయజాలనట్టియు, వేలకొలది వైకల్యమునొందిన అంగములను బాగుచేయజాలనట్టియు ఇట్టి పరమావధి ప్రజలకు నచ్చలేదు. గాంధిగారి కాపుటాక్రింద చేరవలెనని అనేకులు సంకల్పించినను దొరతనమువారి క్షమాపణమాత్రమే ఇంత యుద్యమమునకు ఫలముగ గోరుట వారికి సంతృప్తిని గలిగింపకపోయెను. ఇంక ఖిలాఫతువిషయమై ఎక్కడనో ఖుస్తుంతునియా (కాన్స్టాంటి నోపిల్) లో మనము జయముపొందవలెననుట జనులకు అర్థముగాలేదు. అందుచే స్వరాజ్యస్థాపనమే లక్ష్యముగ నుండవలెనని జనులు గోరగ గాంధిమహాత్ముడు, అయిష్టముగ నందుల కంగీకరించి నాగపురమునందు తీర్మానమును విపులముచేసెను; కాని లక్ష్యసిద్ధికై వినియోగింప వలసిన సాధనములను ఎక్కువ ఖచితము గావించెను. కలకత్తాయందు విదేశవస్త్ర విసర్జనము మాత్రమె నిరూపింపబడియుండ నాగపురమునందు ఖద్దరులోనికి కాంగ్రెసుయొక్క దృష్టి మరలింపబడి కాంగ్రెసుకార్యక్రమముచుట్టును దౌర్జన్యరాహిత్యమనుగిరి గీయబడెను. ఇట్లు 1920 వ సంవత్సరము డిశంబరులో నాగపురమునందు స్వరాజ్యసిద్ధికొఱకే అసహాయోద్యమము నవలంబింపవలె ననెడుదాసు ప్రభృతులకు లొంగిపోయినట్లు కనుపించుచు ఖద్దరు దౌర్జన్యరాహిత్యము లను రెండు నిర్బంధములను దేశీయమహాసభచే నంగీకరింపజేసి ఒకచేతితో కళ్లెమును సళ్లించినట్లు కనుపించుచు రెండవచేతితో కళ్లెమును బిగించెను.

## రెండవ అధ్యాయము

అంతట రెండవఅధ్యాయము 1921- జూలైలో ఆరంభించి అప్పటికే ఖద్దరు జనులదృష్టి నేకాక మనంబులను గూడ ఆకర్షింపసాగెను. ఇరువదిలక్షలరాట్నములు నూటపదిహేనులక్షల రూపాయిలు, అరువదిలక్షల సభ్యులు-స్వరాజ్యస్థాపన కింతకన్న నేమికావలెను! ఇంతియకాక అసహాయోద్యమము కేవలము దొరతనమువారిపై దాడి వెడలుటమాత్రముకాక సంఘమును పునర్నిర్మాణము గావించుకొనుట యనుతత్వము జనుల కలవడి, 'అస్పృశ్యతానివారణయనియు మద్యపాననిషేధమనియు జనులు వివిధములగు సదుద్యమములను సాగించుచుండిరి. జూలైమాసమునకు సక్రమముగ నాచరణలోనికి రావలసిన విషయము రాట్నములయనంతరము మగ్నమైయుండ, దీనినిగూర్చి విశేషము శ్రద్ధజరిగియుండక, అప్పటికప్పుడే శాసనోల్లంఘనమనుశబ్దము కాంగ్రెసుమంటపములందెల్ల ప్రతిధ్వనించుచుండెను. శాసనోల్లంఘనఘోష మొట్టమొదట 1921వ సం. మార్చిమాసమునందే బెజవాడలో జరిగినసభలో వినబడి, పిమ్మట సంయుక్తరాష్ట్రములోని హర్దాయిజిల్లాయొక్కయు ఆంధ్రదేశములోని గుంటూరుమండలముయొక్కయు ప్రోత్సాహముచే, ఆసంవత్సరము జూలైమాసములో బొంబాయినగరమునందు తీవ్రముగుచర్చనీయాంశ

మగుచు, కట్టకడపటను కాంగ్రెసువారిచే చెన్నపురము, తీర్మానరూపకముగ సంకల్పింపబడని, మద్యపానపుటంగళ్లవద్ద గస్తీవేయుట మున్నగు రూపముల దాల్చినయుత్సాహమునైన ఆమోదింపవలసిన యావశ్యకతను గల్పించి, భారతప్రపంచమునంతను సంక్షోభపరుప దొడంగెను. అంతట ప్రజలయభినివేశముచేతను నభీష్టముచేతను నింకను నిలుపుదలచేయబడుచున్న శాసనోల్లంఘనము 1921- నవంబరుమాసమునందు దొరతనమువారిచర్యలచే అనివార్యమయ్యెను. యువరాజుగారు మన దేశమునకురావలదని మనమెన్నిసార్లు ఎన్ని విధముల ప్రతిఘటించినను, అధికారవర్గమువారు గమనింపక, ఆయన తమపరిపాలనకు చేయూతనిచ్చునటుల, ఆయననిచ్చటకు రప్పించి, కాంగ్రెసును సందిగ్ధావస్థలోనికి దెచ్చిరి. ప్రజలు ఆయనకు స్వాగతములియ్యవలెనా, లేక యుపేక్ష చేయవలెనా? వారిరాకను సందర్భించిన కార్యములనెల్ల బహిష్కరించుటతప్ప కాంగ్రెసువారికి గత్యంతరములేక బొంబాయి కలకత్తా మద్రాసు నగరములయందెల్ల పరిపూర్ణబహిష్కారము అవలంబింపబడెను. అదివరకే దౌర్జన్యరాహిత్యతత్త్వము ఏకారణముచేతనైననేమి, మాలిగాం, మాటియాలి, అలిగర్, మున్నగుకొన్ని ప్రదేశములందు భంగపడి బొంబాయిలో యువరాజుగారిరాకసందర్భమున అనగా 1921వ సం. నవంబరు17వ తేదిని జరిగిన హత్యలవలనను అల్లరులవలనను, గాంధిమహాత్ముడు నాలుగుదినములు ఉపవాసముచేయవలసిన యావశ్యకమును గల్పించెను. అంతకు 12రోజుల పూర్వమే డిల్లీనగరమునందు జరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీసభయందు శాసనోల్లంఘనము నిశ్చయింపబడి - అందుకుగాను ఎట్టినిర్ణయము లుండవలెనో ఖచితముగ వివరింపబడియుండెను. వ్యష్ట్యుల్లంఘనముచేయు ప్రతిమనుష్యుడును నూలు వడుకగలిగియుండవలెననియు దౌర్జన్యరాహిత్యనియమము వాచా కర్మణా ఆచరింపవలెననియు సమిష్టిశాసనోల్లంఘనమునకు నూటికిఅరువదికి తక్కువకాకుండ ఆప్రాంతమునం దుత్పత్తియైన ఖద్దరును కట్టవలెననియు ఆప్రాంతమున మద్యపానమును అస్పృశ్యతయు తీసివేయబడి జాతీయవిద్య వ్యాపకమునం దుండవలెననియు డిల్లీ తీర్మానము నిరూపించి యుండె ప్రజలయొక్క ఉత్సాహ మెంతవరకును అధికారతిరస్కారమునకై యత్నించుచుండెను. కాని నిర్మాణకార్యక్రమమునందు కార్యరూపము దాల్చియుండలేదు. అసహాయోద్యమమునందు సవినయశాసనతిరస్కారము ఉన్నదా లేదాయను విషయము చర్చనీయాంశమై యుండుటయేకాక చర్చనీయాంశమని బొంబాయి, బెజవాడ సభలయందుకూడ అంగీకరింపబడియుండె కాంగ్రెసువారి ప్రత్యేకపు అనుమతిలేకయే సమిష్టిశాసనోల్లంఘనమునకు మూర్తీభావమైన పన్నులనిరాకరణము 1922 వ సంవత్స రారంభమున అవలంబింపబడి దేశమునంతను తల్లడిల్ల జేసినది.

నాగపూరు తీర్మానమునందు "గవర్నమెంటుతో స్వచ్ఛంద సాంగత్యము" మొదలు "పన్నులనిరాకరణము"వరకు అసహాయతత్త్వమును నవలంబింపవలెనని నిర్ణయింపబడినమాట నిజమే. కాని యీ చివరను ఆ చివరను చెప్పినవిధులకు మధ్య అనేకతరగతులను, దశలను, సోపానములను దాటవలసియుండెను. ఇట్లు గవర్నమెంటు ఉద్యోగస్థుల అభిమానము సంపాదించి పోలీసువారిని సిపాయీలను గవర్నమెంటుసేవ చేయకుండ నిరుత్సాహపరచుట చివరకు పన్నులనిచ్చుట మానివేసి దొరతనమువారిని వశీకరణ చేసుకొనవలెనని అసహాయోద్యమపుతీర్మానముయొక్క భావము. ఇందు ననుసరించి "పోలీసువారికి సిపాయిలకు, ప్రజలకును దినదినాభివృద్ధిచెందుచున్న మైత్రిని గమనించుచు వారలు తమపైయుద్యోగుల ఉత్తరవుల ననుసరించుటకొరకు తమదేశమును ధర్మమును వెనుకకు దొక్కుటకు తిరస్కరింతురుగాకయనిమాత్రమే నాగపూరుతీర్మానమునందు సూచింపబడెను. ఒక్క కరాచీపట్నమునందు జరిగిన ఖిలాఫత్ మహాసభయందుమాత్రము అలీసోదరులు ఈతీర్మానముయొక్క అంతరార్థమును గ్రహించి సిపాయీలు, గవర్నమెంటును పనిచేయరాదని ఉత్సాహపరచును తీర్మానము గావించిరి. వీరు 1921 వ సంవత్సరం సెప్టెంబరున పట్టుబడినమీదట అక్టోబరుమాసములో దేశమునం దింతటను 20,30 వేల వేదికలపైనుండి ఈఘోషయే ప్రతిధ్వనించుచుండెను. ఇట్లు వ్యక్తిశాసనోల్లంఘనము అనివార్యమై 1921 వ సంవత్సరం నవంబరునందు గాంధిమహాత్ముడు తనయొక్క అభినివేశముచేతను, నూతనమార్గమును, ఉపక్రమించుటకు బదులు ఉపక్రమింపబడిన నూతనమార్గమునకు సత్యము, దౌర్జన్యరాహిత్యము, అను సరిహద్దులు ఏర్పాటుచేయవలసివచ్చినవా డయ్యెను. ఇట్లు నాగపూరుతీర్మానమునందు నిరూపింపబడిన దౌర్జన్యరాహిత్యము "వాచా కర్మణా" అని మాత్రమే నిర్వచింపబడియుండ డిల్లీయందు "ఉద్దేశత్యా", కూడాయని నిర్బంధింపబడియుండెను. మరియు డిల్లీయందు శాసనోల్లంఘకుడు స్వయముగా వడకడము నేర్చుకొన్నవాడై యుండవలెననియు, నిరంతరము వడుకునూలుబట్టనే ధరించుటకు పూనుకొనియుండవలెననియు, తనయొక్క ప్రవర్తనయందు అస్పృశ్యతను భారతజాతీయతకు కళంకమని భావించువాడుగా నుండవలెననియు కట్టుదిట్టములు చేయబడినవి.

తరువాతి అధ్యాయము భావగర్భితమై యున్నను కొద్దికాలమును మాత్రమే, ఆవరించుకొనియున్నది. అహమ్మదాబాదు కాంగ్రెసుకు ముందు ఒకపక్షముదినములును, కాంగ్రెసుజరిగిన వారమురోజులును,— ఈ ఇరువదిరెండురోజులలో చారిత్రకాంశములైన చర్యలు జరిగియుండినమాట మనమంత రెరుగుదుము. రీడింగుప్రభువునకు, గాంధిగారికిని జరిగినసంధిరాయబారములలో "గాంధిపొరబడి పాడుచేసె" నని దాసుగారు చెన్నపట్టణమునందు చెప్పినమాట దేశమునంతను కలవరపరచెను. ఒకవేళ గాంధిగారు రీడింగుగారిషరతుల నంగీకరించి 20-వ డిశంబరు 1921 సంవత్సరపు ఏర్పాట్లప్రకారము రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు ఒప్పుకొనుచు, ఫత్వాకైదీలయొక్క విడుదలను, కల్లుఅంగళ్లవద్ద గస్తీలకు అనుమతిని కోరనియెడల రౌండుటేబిలుకాన్ఫరెన్సు జరిగియుండెడిదే. సమయస్ఫూర్తిపరుడైన ఆంగ్లేయుడు యువరాజుగారి పర్యటనకాలమును శాంతముగ గడుపుకొని ఎప్పటియాట ఆడుచు, కడపటసంధిప్రయత్నములను భంగపరచెడివాడే. ఇట్టిశిథిలప్రయత్నము జాతీయోద్యమమునకు మంచిపునాది అయ్యెడిదే; కాని గాంధి యుక్తిపరుడు కాడు. యుద్ధములోని సేనాని కాడు. స్వల్పకాలములో ప్రజలకు జయముచేకూరిన దను విశ్వాసము కలిగించి వారి మనములను

రంజింపజేయుటచే వారిని వశీకరణచేసికొనవలెనను ఊహాపోహలుకలవాడుకాడు. ఆయన తాను స్వయముగ బార్డోలీ, ఆనంద్, తాలూకాలయందుచేయబూనిన శాసనోల్లంఘనప్రయత్నములచే సత్యము దౌర్జన్యరాహిత్యము అనురెండుధర్మములయొక్క జయమును స్థాపింపదలచినవాడు. ఈయనకు ప్రజలయందుగలవిశ్వాసము మెండు. మేలిగాను, షేటీయార్, ఆలీఘుర్, బొంబాయి, మద్రాసు, ధార్వారు మున్నగుప్రాంతములయందు చూపబడిన దౌర్జన్యము ఈయనమనస్సును వైకల్యము పొందింపలేదు. కాని చౌరిచౌరాయందు అగ్నిహోత్రమునందు కాల్చివేయబడిన 22 పోలీసువారియొక్క మరణముచే ఈయనకు భావవిప్లవము గలిగి ఆది అయిన ఆరురోజులకుబార్డోలీ తీర్మానము మూలమున 1922 సంవత్సరము ఫిబ్రేవరు 12 వ తేదీని అసహాయోద్యమగతిని గాంధిగారు మరలింపజేసిరి.

ఇంతవరకును గాంధిగారి నిర్బంధములో అంత్యమైన చరిత్రను మూడుఅధ్యాయములుగా విభజించి తెలియపరచితిమి. నాలుగవఅధ్యాయము ఉద్యమముయొక్క అధోగతికిసంబంధించినది. గాంధిగారునిర్బంధింపబడిన రెండు సంవత్సరముల కాలమునందును జరిగెనవిషయములు ప్రజలు మరచియుండరు. దేశముయొక్క విముక్తికొరకు నిర్మింపబడనైయున్న సౌధమును తలపెట్టిన మహాశిల్పి మాయమైనవెంటనే అల్పులగు వడ్రంగులు, కమ్మరులు, కాసీలు కలిసి ఒకరిపనిని ఒకరును అందరును శిల్పియొక్క పనిని శిథిలపరచిరి. సౌధముయొక్క పునాది అదివరకే దుర్బలమై యుండుటచే సౌధముకూడ అచిరకాలములో కృంగిపోయెను. తమయొక్క సౌఖ్యములను త్యజించిన భాగ్యవంతులు చిరకాలము కష్టములను సహించలేకపోయిరి. వృత్తులను మానుకొనిన మధ్యతరగతి మనుష్యులు క్షుత్పిపాసలచే పీడితులు కాదొడంగిరి. విశ్వాసపూరితులగు పేదవారు భక్తిని గోల్పోయిరి. అందరి మనంబులయందును సందేహము పొడసూపెను. నాగపూరు తీర్మానమునందు అసహాయోద్యమముయొక్క జయమునకు ప్రజలలో పరిపూర్ణ పరస్పర సహాయభావమును, హిందూమహమ్మదీయ మైత్రియు ఆవశ్యకమని సూచించియుండ అందులకు విరుద్ధముగ ప్రజలలో తమలో తమకు అసహాయోద్యమము జనింప ప్రారంభమయ్యెను. ఎట్టివైమనస్యములు 1920-21 సంవత్సరములందు కాంగ్రెసుచే నిర్మూలముచేయ యత్నింపబడెనో అట్టి వైమనస్యములను కాంగ్రెసు పేరటనే 1924 వ సంవత్సరములో స్థాపింపబడెను. ప్రజలయొక్క ఆదరణచే గాంధి మొదటలో జయముపొందియుండ వారియొక్క అవిశ్వాసముచే గాంధి పరాజితుడయ్యెను. అట్టిసందర్భమున గాంధి తనయొక్క పరాజయమును అనావశ్యకపు పటాటోపములచే గప్పిపెట్టక సత్యమును వెలిబుచ్చి ప్రజలు అసహాయోద్యమపు తత్త్వమును గ్రహింపలేదనియు ఆయుద్యమమిప్పుడు నడువజాలదనియు, దాసు, నెహ్రూప్రభృతులకు వారి అభిమతములప్రకారము ప్రవర్తించుటకు పరిపూర్ణముగు అనుమతి నొసంగవలెననియు దేశమునకు సలహాయిచ్చియున్నారు. ఢిల్లీలో జరిగిన కౌన్సిలు తీర్మానము కాకినాడలో ఆమోదింపబడి బెల్గాంలో బలపరుపబడినది. ఇంకా కాన్పూరులో ఏమిజరుగనైయున్నదో మన మూహింపజాలము. శాసనసభలయందు నిర్బంధముగ ఎల్లరును ప్రవేశింపవలసినది కాంగ్రెసు తీర్మానించినచో మనము విస్మయము పొందనక్కరలేదు. కాని, ఉద్యమము ప్రారంభించిన నాలుగుసంవత్సరములకు తిరిగి నిర్మాణకార్యక్రమమును పూని అసహాయోద్యమముయొక్క పునాదులను బలపరుపవలయునని దేశము కనుపెట్టినది. ఇందుచే మనఉద్యమము జయము పొందలేదని మనము నిరుత్సాహపడవలసిన పనిలేదు. ఇంతవరకు అసహాయోద్యమముయొక్క అపజయములనే వర్ణించియుంటిమి. ఉద్యమముయొక్క జయములనుకూడ మనము గమనించవలసి యున్నది.

ఒకవ్యక్తియొక్కగాని, ఒకజాతియొక్కగాని, భాగ్యభోగ్యములు ఇంతకుహీనముగ నున్నచో నీచదశయందున్నవనియు, ఇంతకు ఉచ్చదశయందున్నచో ఉత్కృష్టదశయందున్నవనియు లోకులు భావించుట యాచారము. ఇది ముఖ్యముగ నూతనోద్యమములకు వర్తించును. ఏయుద్యమమయిన సెలయేటిఉత్పత్తిస్థానమువలె సన్ననిప్రవాహముగ ప్రారంభించి అతివేగముతో ప్రవహించుచు రానురాను శాఖాసమ్మేళనముచే మహానదిగా పరిణమించురీతిని వర్ధిల్లునపుడు ఆయుద్యమము బహుజనులమనంబుల నాకర్షించుటయేకాక వారియామోదమును మెప్పునుగూడ పొందగలదు. భాగ్యవంతునికే ఇంకను ధనము చేకూరినట్లు జయమార్గమునందున్న ఉద్యమమునకు విజయము దినదినప్రవర్ధమానముగ నుండును. కాని ఒక్కసారి దుర్గము మరలినచో భాగ్యమంతయు నసిపోయి పేదరికమెట్లుఅబ్బునో అటులనే విజయము సమసి పరాజయము వాటిల్లును. ఏజనులు శిలాగ్రమునుండి లోయలలోనికి దుమికియు అగ్నిహోత్ర ప్రవేశము నొనర్చియు తమ త్యాగశీలమును చాటించిరో వారలే కాలపరివర్తనమునందు విశ్వాసమును, ఉత్సాహమును గోల్పోయి అభివృద్ధికంతకును, శత్రువైన "సందేహ"మను గొప్పపెనుభూతమునోట బడుదురు. సందేహముచే నిరాశజనించును. ఏఆదర్శములు మనలను ఈభౌతికప్రపంచకమునుండి లేవనెత్తి భావప్రపంచకమునందు ఓలలాడించెనో అవి స్వప్నతుల్యములుగ కనుపించి మనలోని యల్పత్వమును పైకిలాగ మొదలిడును. మనపతనము మనకు తెలియకుండనే విధిప్రేరితమైన మనయపజయము నగాగ్రములనుండి లోకమునకు వెల్లడింపబడును. ఇదియే విధాతయొక్క వ్రాతయని మనస్సును సమాధానపరచుకొని మనయొక్క సహజమైనట్టి జడత్వములోనికిని, మాంద్యములోనికిని, స్వార్థములోనికిని మనము తిరిగి, ప్రవేశింతుము. భారతవర్షము తాను ఈనాలుగుసంవత్సరములను తనఎదుట నుంచుకున్న ఆదర్శమును పొందియుండలేదను ఆత్మనిందయందు కాలము గడుపుచున్నది. 1921 వ సంవత్సరమునందు ఒకసంవత్సరములో స్వరాజ్యస్థాపనము చేయవలెనను నిశ్చయము ప్రజలను ఆవేశపరిచియుండెను. కాని ఈప్రపంచమునందు మనశక్తికిని మనఅవగాహనకునుమించిన గొప్పశక్తులు గలవు. వానిబలముచే మనము లక్ష్యసిద్ధి పొందజాలక పోవుట తటస్థించినది. "ఇంకను తరుణము రాలేదు" అను ఊతపదము అధికారవర్గమువారియొక్క సామాన్యమంత్రము అయియున్నది. మనకుమాత్రము అది కేవలము విషముకాక జాతీయఉద్యమమును సక్రమమార్గమునందుంచు మంత్రముగ పరిణమించుచున్నది. మనము పొందిన గొప్పవిజయము మనము గత మూడుసంవత్సరములలో జయించిన విషయములలోకన్న మనము ఓటుచెందిన విషయములలోనే ఎక్కువగ ఇమిడియున్నదనుమాట నిస్సంశయము. నిజముగ రాంసే మాక్డొనాల్డు మంత్రి ఇటీవల వ్రాసినరీతిని "అపజయమువంటి ఆనందదాయకమగు అనుభవము మరియొకటిలేదు." ఎందుచేతననగా అపజయము వచ్చినవెంటనే దానికారణములను గనిపెట్ట మనము యత్నింతుము. మనగృహమును మనము సర్దుబాటుచేసికొందుము. మనభటుల క్రమవరుసను మనము తిరిగి మార్చుకొందుము. మనసేనానియొక్క అప్రతిహత అధికారము స్థాపింపకొన యత్నింతుము. ఎంతవరకు యుద్ధవిరామము గౌరవహీనముగు సంధికి మార్గము కాకుండ నుండునో ఎంతకాలము క్రొత్తపోరాటమునకది సన్నాహముగ నుండునో అంతకాలము మన పూర్వప్రయత్నములు అపజయము గలిగింపజాలవు. నిజమైన జయమునకు వలయు

యత్న ప్రమాణము కనుపెట్టునట్లు చేయుటయే అపజయముయొక్క ఉద్దేశమును అర్థమును అయియున్నదని మనము గ్రహింపవలెను. అపజయపరంపరలే జయమని నిర్వచించినచో నది అతివ్యాప్తిదోషమునకులోనుగాదు.

అసహాయోద్యమము కొఱకు మహాత్యాగములు గావించినవారికి ఇట్టి హేతువాదమువలన సంతృప్తి గలుగకపోవచ్చును. ఆత్యాగములను లోకవిదితము లగుటచే నిచ్చట వర్ణింప నావశ్యకములేదు. కాని కేవలము వేదాంతమార్గము ననుసరించి మాత్రమే మనము గావించిన ప్రయత్నముల కంతకు ఫలితము గలిగినదని మనము సంతసింపవలసినదాయనుసంశయమును మనము తీర్పవలసియున్నది. అంతేకాదు. ప్రాపంచిక ప్రమాణములనుబట్టిచూడ మనకుచేకూరినజయము ఎన్నదగినది. కాని ఇంతకంటె ప్రజలు నైతికసందర్భములను, భావములందును పొందినజయము పెక్కుమడుంగులు జాతీయతా నిర్మాణమునకు సహాయభూతముగ నుండుననుటకు సందియములేదు. ప్రజల దృక్కోణములు పూర్తిగ మార్పుచెందినవి. జయాపజయములకు ప్రమాణములుగూడ పరివర్తనము పొందినవి. ఇటీవలివరకు జాతీయతయనగ, రాజ్యాంగమునందు అధికారసంపాదనమనియు, ఉన్నతోద్యోగ స్వీకారమనియు ప్రజలు తలంచుచున్నమాట వాస్తవము. కాబట్టి రాజకీయాభిలాషలును, ఆదర్శములును స్వతస్సిద్ధముగ సంకుచితములై యుండుటయేకాక, కొద్దిపాటి ఆంగ్లవిద్యావంతులగు భారతీయులకే కట్టుబాటైయుండెను. ఈపరిస్థితులిప్పుడు మారినవి. ఇప్పుడు స్వరాజ్యమనగ ప్రజాసామాన్యము యొక్క జన్మహక్కు అని నిరూపింపబడినది. ఓటునిచ్చు ప్రతివాడును సభ్యర్థికన్న గొప్పవాడనని గ్రహించుచున్నాడు. రాజకీయవాతావరణమునందు ధనముయొక్క యల్పత్వము స్థిరపరుపబడినది. జాతియొక్క నైసర్గికమగు శక్తిసామర్థ్యములును, లోపములును కనిపెట్టబడినవి. ఇప్పుడు భారతజాతియంతయు తనపాదములమీద తానునిల్చుకొని తనజీవితమును తాను వర్ధిల్లజేసికొనవలెనని నిశ్చయమును పొందినది. ఇట్టి భావప్రాబల్యముచే పూర్వపుఆడంబరములును, పటాటోపములును సమసి పైదుస్తులకన్న లోపలిశీలమే ప్రధానమనువిషయము రాజకీయవాతావరణమును సంచలింపచేయుచున్నది. పదిసంవత్సరములనాటి విద్యార్థికిని పేరునకును, ఇప్పటివారికినిగల తారతమ్యమును ఎవరు కనిపెట్టజాలకుందురు.

ఇవంతయు కంటికి కనుపించుభౌతికవిధానములయందు గల్గిన మార్పు. ఇంక మానసికనైతిక ప్రపంచమునందు గావింపబడిన మార్పులు మనము గమనించినచో నవి అద్భుతముగ గాన్పించును. మనయొక్క మేధాశక్తి విశేషముచే మనము స్వరాజ్యము స్థాపించుకొనగలమనికాని పొందగలమనికాని ఇదివరకు మనకుండియున్న భావము ఇప్పుడు నిర్మూలము చేయబడినది. ఇది తానేషానాటిమాట. ఇప్పుడు మనము రాజకీయపోరాటము చతురంగపు ఆటవంటిదని తలంచుచు, మనము చేయవలసినదంతయు కాయలను గదుపుటయే అని, సంతుష్టి పొందుచుంటిమి. ఈవిధము ఆట కట్టింపచేయగలమని వెర్రికోహపాలయితిమి కాని, పదిసంవత్సరముల కాలము ఆఉపాయమనుసరించి జాతీయోద్యమమును మనము నడిపినపిమ్మట, మననైతికబలముచేతనే స్వరాజ్యమును స్థాపించుకొనవలసియున్నదను తత్వమును గ్రహించియున్నాము. కాని ఈనూతన ఆదర్శమునందు ప్రజలకు గలిగినవిశ్వాసము దుర్బలతను జెంది, పూర్వపుసంకుచితాభిప్రాయములకు తిరిగి వారలోనైనారు. కడపటకు తిరిగి చతురంగపునీతికై మనము ఆధారపడుచు 'మహా' అనిచెప్పుటకైన మనకు శక్తికలిగినచో సంతుష్టిచెందవచ్చునని కొనుచున్నాము.

అసహాయోద్యమముయొక్క విజయము నైతికసంబంధమైనదనియు ఆధ్యాత్మికసంబంధమైనదనియు చెప్పునప్పుడు కొందరికి యిది అతిశయోక్తియని సందియము పొడచూపవచ్చును. దీని యర్థము ఏమన అధికారకాంక్షతోను ఉద్యోగకాంక్షతోనుకూడిన రాజకీయములు పరిశుద్ధము కావింపబడి ఉన్నతాదర్శప్రేరితములైనవని చెప్పవచ్చును. ఇందువలన సామాన్యఅసహాయవాది కోటి ప్రచారకులకన్న ఎక్కువ నీతిమంతుడనికాని విజ్ఞాయతి కలవాడనికాని ఎవరును చెప్పజాలరు. అసహాయవాదులలోపములు అనేకములు. వీనిలో ముఖ్యమైనది, అహంకారము. మనము జయము పొందకుండుటకు కారణములుకూడ నివియె. మనలో మనము పోటీపడక ఒకరిలోనొకరు సకాలమున తోడ్పడినచో వీరుచూపినయపూర్వ త్యాగమునకు ఎక్కువ సంతృప్తికరమగు ఫలము లభించెడిది. బాలురుపట్టపరీక్షయం దుత్తీర్ణులగుటకు రెండుమాసములుముందు తమలక్ష్యమును త్యజించి అసహాయప్రవాహమునందు తేలసాగిరి. న్యాయవాదులు తాము వర్ధిల్లనైయున్న వృత్తులను వదలివేసి లేమిని దారిద్ర్యమునుస్వీకరించిరి. గవర్నమెంటు ఉద్యోగములను వదలినవారిసంఖ్య అల్పమైనది కాదు. ఇంకవల్లడిలేకయే న్యాయస్థాన బహిష్కారావలంబనముచే ధనము పోగొట్టుకొని లోలో నిక్కట్లుపడినవారిబాధలు వారికే తెలియును. ఇంక కారాగారవాసములు కావించిన 30000 మందినిగూర్చి ముచ్చటించుట కిది తరుణముకాదు. ముచ్చటింపనావశ్యకమును లేదు.

ఇట్టిమహనీయుల నావేశపరచిన ఆదర్శములెట్టివి? ఒక్క క్షణములో భారతజాతీయతా జీవితలక్షణములన్నియు మారిపోయినవి. భారతవర్షము మరియొక సామ్రాజ్యములో నుండ నెంతమాత్రము నంగీకరింపదు. ఇంతేకాక తాను విముక్తిచెందిన పిమ్మట సామ్రాజ్యతత్వమును ఎన్నటికిని అవలంబింపదు. పాశ్చాత్యదేశములను పెనుభూతములై పీడించుచున్న సైనికపారిశ్రామిక విధానములను వానికి మూలాధారమైన పోటీభావమును నిర్మూలముచేసి భారతజాతియందేకాక అంతర్జాతీయధర్మముగ పరస్పరమైత్రిని సహాయమును స్థాపింప యత్నించుచున్నాము. సభ్యతకు లక్షణములు గృహపరిశ్రమలు ఏజాతికైన వ్యక్తత గలదన్న ఆజాతికి సంబంధించిన నేతగాడు, కమ్మరి, కుమ్మరి, కాసి, విశ్వకర్మ, మొదలైన ప్రాచీనవిద్యావంతులే ఆజాతికిని అసభ్యతకును వ్యక్తతను కలిగించువారని యర్థము. మిల్లుల యజమానులుగాని ఫ్యాక్టరీలను కట్టువారుగాని, ఫిరంగులను పోతపోయువారుగాని మందుగుండుసామానును చేయువారుగాని సభ్యతకు వ్యక్తత నొసంగజాలరు. అంతవరకేల? సభ్యతనే సృష్టింపలేరు. కావున భారతదేశముయొక్క యభిమానమును శుద్ధరుపైప్రకు వరలించి నామనినఅర్థము. ఈదేశముయొక్క ఆర్థికనిస్సహాయత్వమును తొలగించి అన్నవస్త్రములులేని ప్రజలకు తిండిగుడ్డ యిచ్చుచున్నామనియె కాదు. ఈదేశముయొక్క ప్రాచీనతను పునరుద్ధారణచేయుచు పాశ్చాత్యదేశములకు మార్గదర్శకులమైనాము. ఇట్లు జాతీయతాసిద్ధికొరకై కాక అంతర్జాతీయతాసిద్ధికొరకుకూడ మనము తోడ్పడుచున్నాము. స్విట్జర్లెండు అమెరికాదేశములలోని తత్వవేత్తలు గాంధిమహాత్ముని సంస్తరించు కారణ మిదియె. మతములు పొచ్చినట్టియు, జనమాన్యచరితులు పుట్టినట్టియు, ఈ ప్రాచీనదేశమునందు సత్యమును పునస్థాపన చేయుటకు గాంధిమహాత్ముడు చేసిన యత్నములయొక్క అర్థముకూడ నిదియె. నిన్న మొన్నటివరకు భారతవర్షము మతావేశముచే రాజకీయమును మరచినదని మనయందు నిందమోపబడియుండెను. అట్టిదేశము ఈరోజున రాజకీయసందర్భములను ఆధ్యాత్మిక తుల్యముగ గావించినందులకు సభ్యతనొందిన యెల్లప్రపంచముయొక్కయు మెప్పునకు పాత్రమైనది.

# చెన్నరాజధాని విషయములు

సింగంపల్లి వేంకటాద్రి గారు

చెన్నరాజధానికి చెన్నరాష్ట్రమనియు, ఫోర్టుసెంటు జార్జి రాజధాని అనియు, మదరాసు ప్రెసిడెన్సీ అనియు అందురు. ఇది హిందూదేశములో దక్షిణ భాగమున విస్తరించి యున్నది. 950 మైళ్లు పొడవును, 450 మైళ్లు వెడల్పును కలిగియున్నది. ప్రాగ్దక్షిణ పశ్చిమభాగములందు హిందూమహాసముద్రము చేతను, ఉత్తర భాగమున మైసూరు, హైద్రాబాదు మొదలుగాగల రాజ్యభాగముల చేతను చుట్టబడియున్నది. ప్రాక్పశ్చిమతీరముల వంటి గొప్ప పర్వతశాఖలు రెండు వ్యాపించియున్నవి. ఈరెండును నీలగిరులయొద్ద కరస్పర్శన మొనర్చుకొనుచున్నవి. రాజధానిలో ఉష్ణస్థితి వర్షపతనము యీపర్వతశాఖల వ్యాప్తిపైన నాధారపడియున్నవి. పడమటితీర భూములందు ఏటేట 150 అంగుళముల వర్షమును, తూర్పుతీరభూములందు 50 అంగుళముల వర్షమును, లోభాగములందు 23 అంగుళముల వర్షమును కురియుచుండును. తూర్పుతీరమున తరుచుగా తుపానులు వచ్చుచుండును. గోదావరి, కృష్ణ, కావేరి నదులు ముఖ్యములైనవి. గోదావరి 898 మైళ్లును, కృష్ణ 800, కావేరి 472 మైళ్లును పొడవున ప్రవహించుచున్నవి.

తూర్పుతీరభూములందివి గొప్పముఖద్వారము (డెల్టాలు) ఏర్పరచికొనుచున్నవి. ఇవిగాక ఉత్తరపినాకిని, పాలేరు, దక్షిణ పినాకిని, వైఘు, తామ్రపర్ణి నదులు మరికొన్ని గలవు. వరి, జొన్నలు, కంబు, రాగి, ప్రత్తి, చమురుగింజలు, మిరపకాయలు, పొగాకు, చెఱకు, అరటి, తమలపాకులు, కాఫీ, తేయాకు, రబ్బరు, సింకోనా, సుగంధ ద్రవ్యములు విశేషముగ పండును. వేరుసెనగ యిటీవల విపరీతముగ వద్ధివృద్ధి జెందుచున్నది, ఫలజాతులలో కొబ్బెర, పోక, చింత, మామిడి ముఖ్యమైనవి. పడమటితీరమున లక్షలకొలది ఏకరముల కొబ్బరితోటలు గలవు.

## అడవులు

రాజధానిలో 20000 చ. మైళ్ల విస్తీర్ణముగల అడవులు గలవు. ఇవిగాక తిరువాన్కూరు, కొచ్చిన్ మొదలుగాగల స్వదేశరాజ్యములలోను, జయపురం వెంకటగిరి మొదలగు జమీనులలోను మరికొన్ని అడవులుగలవు. రమారమి 48 లక్షల రూపాయల ఆదాయము ప్రభుత్వమునకు రాగలదు.

## కాఫీ, తేయాకు, రబ్బరు, ఏలకులు తోటలు

చెన్నరాజధానిలో మొత్తముమీద కాఫీ, తేయాకు, రబ్బరు, ఏలకులతోటలు 850 గలవు. వీటిలో మిగుల పెద్దతోట విస్తీర్ణము 4,800 ఏకరములు, మిగుల చిన్నతోట విస్తీర్ణము 20 ఏకరములు. ఇందు మించుగా యిన్నియు విదేశీయులవే. ఈతోటలపై సాలునకు మొత్తముమీద 450 లక్షల రూపాయలు వచ్చును.

## స్వదేశ రాజ్యములు

రాజధానిలో తిరువాన్కూరు, కొచ్చిన్, పుదుకోట్టై, బంగనపల్లి, సాండూరు అను 5 స్వదేశరాజ్యములుగలవు. వీటిలో నాల్గవది మహమ్మదీయప్రభువుచేతను, మిగిలినవి హిందూ ప్రభువులచేతను పరిపాలింప బడుచున్నవి. వీటిలో మిగులపెద్దది తిరువాన్కూరు. దీని విస్తీర్ణము 7625 చ. మైళ్లు. జనసంఖ్య 4006, 602. వీటిలో మిగుల చిన్నది సాండూరు. విస్తీర్ణము 160 చ. మైళ్లు. జనసంఖ్య 11665. ఇయ్యది బళ్లారిజిల్లాలో గలదు.

## రాజ్యమందలి భాగములు

రాజధానిలో నున్న స్వదేశరాజ్యములుపోగా శేషించిన భాగమంతయు 26 జిల్లాలుగ విభజింపబడియున్నది. చెన్నపట్టణము ప్రత్యేకముగ ఒకజిల్లాగ పరిగణింపబడుచున్నది. జిల్లాలన్నిటిలో మిగులపెద్దది విశాఖపట్టణపుజిల్లా. విస్తీర్ణము 16805 చ. మైళ్లు. జనసంఖ్య 3192229. మిగులచిన్నది (మదరాసుగాక) నీలగిరిజిల్లా. విస్తీర్ణము 982 చ. మైళ్లు. జనసంఖ్య 126519. రాజధాని మొత్తము విస్తీర్ణము 142260 చ. మైళ్లు. రాజధాని యంతటిలో 52 డివిజన్లును 109 తాలూకాలును, 40 జమీందారీ, ఏజన్సీ డివిజన్లును, 1027 రెవిన్యూ ఫిర్కాలును, 35291 రయితువారీ ఈనాము గ్రామములును, 574 యూనియన్లును గలవు.

## జనసంఖ్య-భాషలు-మతములు

స్వదేశరాజ్యములతో కలిపి చెన్నరాజధాని మొత్తపు జనసంఖ్య 42794155. 1911 సం॥ లెక్కతో పోల్చిచూడ 1000 కి 11 చొప్పున అభివృద్ధి గన్పట్టుచున్నది. పురుషులు 21100158 స్త్రీలు 21693997 పురుషులకంటె స్త్రీలు 593839 అధికముగ గలరు. జనులలో 100 కి 89 చొప్పున హిందువులును, 7 మహమ్మదీయులును, 3 క్రైస్తవులును, 1 అన్యులును గలరు. 1911 జనాభా లెక్కతో పోల్చిచూడ హిందువులలో 100 కి 2 చొప్పునను, మహమ్మదీయులలో నూటికి 4 చొప్పునను, క్రైస్తవులలో నూటికి 14 చొప్పునను అభివృద్ధిగలదు. హిందువులలో 100 కి 4 బ్రాహ్మణులును, 17 గురు నిమ్నజాతులవారును గలరు. జనసమ్మర్ద విషయములో హిందూదేశములో చెన్నరాజధాని, బంగాళము, ఐక్యమాగాణములు, బీహార్ & ఒరిస్సా రాజ్యముల తరువాత నాల్గవస్థానము వహించు

చున్నది. రాజధానిలోగల పురుషులలో 100 కి 44 వివాహితులును, స్త్రీలలో 100 కి 43 వివాహితులును గలరు. వివాహమైన పురుషులలో 100 కి 4 చొప్పున భార్యాహీనులును, స్త్రీలలో 100 కి 19 మంది విధవరాండ్రును గలరు. పురుషులలో పునరుద్వాహ పద్ధతి యుండుటయే యింత వ్యత్యాసమునకుగల కారణము. 1911 సంవత్సరము జనాభాలెక్కతో పోల్చిచూడ పట్టణవాసుల సంఖ్య 100 కి 12 చొప్పున హెచ్చినది. పల్లెజనులు పట్టణములకు మూగుచున్నారు.

## వలసపోవుట

హిందూదేశములోని యితరరాజ్యములకు వలసపోయినవారి సంఖ్య 917000. విదేశములకు వలసపోయినవారి సంఖ్య 814000. చెన్నరాజధానిలోగల అన్యులు 21000. ఎంత వ్యత్యాసమో చూడుడు! విదేశములకు వలసపోయినవారిలో 100 కి 55 గురు సింహళమునకు బోయియుండిరి.

## వృత్తులు

రాజధానిలో 100 కి 71 మంది వ్యవసాయమువలనను, 13 మంది పరిశ్రమలవలనను, 10 మంది యితరపనుల వలనను, 6 వ్యాపారమువలనను జీవనము చేయుచున్నారు. మొత్తముమీద జనులలో 100 కి 49 మంది పాటుపడువారును, 51 మంది కుడిచి తిని కూర్చుండువారును గలరు.

## చేతిమగ్గము

చెన్నరాజధానిలోగల చేతిమగ్గముల మొత్తము. 169403 జిల్లాలన్నిటిలో గుంటూరు, ఉత్తరఆర్కాటు, తిన్నవెల్లి, సేలము, చెంగల్పట్టు, నెల్లూరు జిల్లాలలో ఒక్కొక దానియందు 10000 కంటె అధికముగ గలవు. వీటిలో గుంటూరు అగ్రస్థానము వహించుచున్నది.

## వర్తక-వ్యాపారస్థితి

1922-1923 సంవత్సరములో రాజధానియందు 804580000 రూపాయల వర్తకము జరిగియుండెను. దిగుమతి వ్యాపారముకంటె ఎగుమతి వ్యాపారమువలన 2060000 రూపాయలు ఆదాయము వచ్చెను. అనగా మొత్తముమీద ఒక్కొకమనిషికి వ్యాపారమువలన వచ్చిన ఆదాయము 0-1-6 అని చెప్పవచ్చును. 1922-23 లో చెన్నరాజధానినుండి మాత్రమే 391537 పశువులు విదేశస్థులకు విక్రయింపబడి విదేశములకు గొంపోవబడెను. ఇక వ్యవసాయ మభివృద్ధి చెందుటెటుల? 14234 టన్నుల తోళ్లు, చర్మములు ఎగుమతి యాయెను. పశుసంఖ్య ఎంత విపరీతముగ క్షీణించుచున్నది! 1653322 టన్నుల వడ్లు బియ్యము ఎగుమతిచేయ బడెను. కఱవుబాధ తప్పుటెట్లు? దిగుమతివస్తువులలో ముఖ్యమైనవి నూలువస్త్రములు, లోహములు, యంత్ర సామగ్రులు మొదలుగాగలవి. 1922-23 లో యునైటెడ్ కింగ్డమ్‌నుండి మాత్రమే 820 లక్షల రూపాయల వస్త్రములు దిగుమతి యాయెను. 147 లక్షల రూపాయల నూలు దిగుమతి యయ్యెను. 1921-22 లో 242 లక్షల రూపాయల నూలువస్త్రములు దిగుమతి యాయెను. దిగుమతి సరకులలో పట్టు అగ్గిపెట్టెలు తప్ప తక్కినవన్నియు విశేషముగ ముప్పాతిక మువ్వీసము యునైటెడ్ కింగ్డమ్ నుండియే వచ్చుచున్నవి. బ్రిటిష్‌వస్తు బహిష్కార మెటుల కొనసాగగలదో దురూహ్యము. కాబట్టియే మహాత్ముడు సమ్మతింపకుండెను.

## విద్యా విషయములు

కళాశాలలు:—మొదటితరగతి కళాశాలలు (Art Colleges) 19, రెండవతరగతి కళాశాలలు 31 యును గలవు. వీటిలో స్త్రీలకు చెందిన మొదటితరగతి కళాశాలలు 2 ను, రెండవతరగతి కళాశాలలు 4 ను గలవు. కళాశాలలో 10 మాత్రమే ప్రభుత్వమువారిచే స్వయముగ పోషింపబడి పాలింపబడుచున్నవి. ఇవిగాక వ్యవసాయ కళాశాల 1, ఎంజనీరింగు కళాశాల 1, ఫారెస్టు కళాశాల 1, న్యాయశాస్త్ర బోధకకళాశాలలు 2, వైద్యకళాశాల 1, బోధనాభ్యాసక కళాశాలలు 5, స్త్రీవైద్య విద్యాలయము 1, వైద్య విద్యాలయములు 6, స్త్రీబోధనాభ్యాసక కళాశాల (ప్రత్యేకము) 1, పశువైద్య కళాశాల 1, యునుగలవు. వీటిలో 8 మాత్రమే ప్రభుత్వముచే పోషింపబడుచున్నవి.

ఉన్నతవిద్యాలయములు:—సెకండరీస్కూళ్లలో 34 ప్రభుత్వమువారిచేతను, 199 స్థానికసంస్థలచేతను, మిగిలినవి ప్రయివేటు సంస్థలచేతను పాలింపబడుచున్నవి.

ప్రాథమిక విద్యాలయములు:—771 ప్రభుత్వమువారిచేతను, 10341 స్థానికసంస్థలచేతను మిగిలినవి యితర సంస్థలచేతను నడుపబడుచున్నవి. 84 బోధనాభ్యాసక విద్యాలయములు ప్రభుత్వాధారణమున నడుపబడుచున్నవి.

ఇవిగాక మరికొన్ని పరిశ్రమ విద్యాలయములు గలవు. విద్యాశాఖ దేశస్థుడగు మంత్రి యాధీనముననున్నను విద్యావ్యాప్తి యెంత మాత్రము సంతృప్తికరముగ లేదు. విద్యాశాఖకై యీసంవత్సరము ప్రత్యేకింపబడిన ధనము 16681600 మాత్రమే. ఇది అత్యల్పము. దేశాభ్యున్నతి విద్యావ్యాప్తిపైనను, విద్యావిధానముపైనను ఆధారపడియుండును.

## గ్రంథ నిలయములు

రాజధానిలో పేరొందిన గ్రంథనిలయములు 117 గలవు. ఇవిగాక కళాశాలలకు, విద్యాలయములకు, న్యాయవాది సంఘములకు చెందిన మరికొన్ని గ్రంథాలయములు గలవు. ప్రఖ్యాతగ్రంథనిలయములు:—(1) తంజావూరునందలి తంజావూరు మహారాజాశరభోజి సరస్వతీమహాల్ గ్రంథాలయము. ఇయ్యది 16 వ శతాబ్దమున స్థాపింపబడెను. 4525 ఆంగ్ల, ఫ్రెంచి, జర్మన్, గ్రీక్ గ్రంథములును, 572 సంస్కృతగ్రంథములును, 28000 తాళపత్ర గ్రంథములును, 3562 దేశభాషాగ్రంథములును గలవు. ప్రపంచమునంగల గ్రంథాలయములలో మిగుల పెద్దదిఅనియు ముఖ్యతమమైనదనియు ఒకపాశ్చాత్యుడభిప్రాయమిడెను. మీమ్మట మదరాసునందలి సారస్వతసంఘ గ్రంథనిలయము, సర్వకళాశాల గ్రంథాలయము, కన్నెమరలైబ్రరి, రాణ్మహేంద్రవరమునందలి గౌతమీ గ్రంథనిలయము మిగుల గొప్పవి. కడపటిదానియందు 16000 గ్రంథములు గలవు.

## పత్రికలు

చెన్న నగరమునుండి హిందు, స్వరాజ్య, జస్టిస్, న్యూఇండియా, మదరాసు మెయిల్, డైలి ఎక్స్ప్రెస్, టు-డె అను ఆంగ్ల దైనిక పత్రికలు 7 ను, 151 దైనిక, వార, పక్ష, మాస ఆంగ్లదేశభాషాపత్రికలును వెలువడుచున్నవి. వీటిలో ఆంధ్రపత్రిక, స్వదేశమిత్రన్, ఇండియన్ రివ్యూ అనునవి సుప్రసిద్ధములు. రాజధానిలోని నానాభాగములనుండి 213 దైనిక, వార, పక్ష, మాసపత్రికలు వెలువడుచున్నవి. వీటిలో విశేషభాగము దేశభాషలందు ప్రకటితమగుచున్నవి. మలబారు జిల్లానుండి 29, చెంగల్పట్టు జిల్లానుండి 20, గుంటూరు జిల్లానుండి 18 యును పత్రికలు వెలువడుచున్నవి. మొత్తముమీద రాజధానినుండి 163 పత్రికలు ఆంగ్లమునను, 100 తమిళమునను, 68 మాత్రము ఆంధ్రమునను, 83 మళయాళమునను, 36 కన్నడమునను, 20 ఉర్దూభాషయందును, 4 ఓఢ్రమునను, 109 పలుభాషలయందును వెలువడుచున్నవి. ఆంధ్రులు ఆంధ్రేతరులకంటె పత్రికాపఠనమున వెనుకబడి యున్నారనుటకు లజ్జయగుచున్నది. మళయాళములో పత్రికా ప్రచురణ మెక్కుడుగ గలదు. మళయాళములో బోల్చిచూడ ఆంధ్రమున కనీసము 400 పత్రికలైనను వెలువడవలసి యుండును. ఆంధ్రు లికనైనను మేల్కాంచెదరుగాక!

## రాజకీయసంస్థలు

రాజకీయసంస్థలలో మదరాసుమహాజనసభ, గోకలేక్లబ్, నేషనల్ హోంరూల్ లీగు, మదరాసు లిబరల్ లీగు, సౌత్ ఇండియన్ లిబరల్ ఫెడరేషన్, (జస్టిస్‌పార్టి) 1921 క్లబ్ ముఖ్యమైనవి. వీటిలో మదరాసుమహాజనసభ 1884 సంవత్సరమున స్థాపింపబడెను.

## రాజకీయేతరసంస్థలు-సంస్థాపనములు

మత సాంఘిక సారస్వత శాస్త్రీయాది సంఘములు మొత్తముమీద 135 గలవు. వీటిలో భారత స్త్రీమండలి, ద్రవిడమహాజనసభ, ఆంధ్రమహాజనసభ, రామకృష్ణమిషన్, ఆంధ్రసాహిత్యపరిషత్సంఘము, ఇండియన్ క్రైస్తవసంఘము, హైందవయువజన సంఘము, దివ్యజ్ఞాన సమాజము మిగుల ముఖ్యమైనవి.

## రాజధానియందలి రైలుమార్గములు-రోడ్లు

రైల్వేలు:—ఈ సందర్భమున హిందూదేశమందలి రైల్వేలను గురించి యించుక తెలియబరచుట యుక్తము. హిందూదేశమున మొత్తముమీద 37266 మైళ్ల పొడవున రైలుమార్గములు గలవు. చిన్న చిన్న రైలుమార్గములు మొత్తముమీద 928 మైళ్ల పొడవున నిర్మాణముక్రింద నున్నవి. 1921-1922 లో రైల్వేలమీదవచ్చిన ఆదాయము 9289 లక్షల రూప్యములు. ఈ సంవత్సరమున రైల్వేలలో పనిచేయువారిసంఖ్య 754478. వీరిలో 735789 హిందూదేశస్థులు.

ప్రమాదములు:—1922-1923 సంవత్సరములో రైళ్ల ప్రమాదములవలన మృత్యువువాత బడినవారు 3121 మంది, గాయములు పొందినది 3069. ఏటేటను యిట్టిప్రమాదములు జరుగుచునే యుండును.

మదరాసు రైల్వేలు:—2.- (1) ది మదరాసు అండు సదరన్ మరాటా రైల్వే. మొత్తమునిడివి (1921-1922) 3040 మైళ్లు. నికరాదాయము 272 లక్షలు. (2) ది సౌత్ ఇండియన్ రైల్వే. నిడివి 1878 మైళ్లు. నికరాదాయము 162 లక్షలు.

రోడ్లు:—ట్రంక్ రోడ్లు అనగా ఒకజిల్లానుండి మరియొకజిల్లాకు పోవునట్టివి. ఇవి మొత్తముమీద 20 గలవు. వీటిమొత్తపునిడివి 4179 మైళ్లు. ట్రంక్ రోడ్లలో మిగుల నిడుపైనది ది గ్రేట్ నార్తరన్ ట్రంక్ రోడ్డు. దీనినిడివి 683½ మైళ్లు. ఇయ్యది చెన్నపట్టణమునుండి రంభమీదుగా ఉత్తరదేశమునకు బోవును.

బ్రాంచిరోడ్లు:—అనగా ఒక జిల్లాలోనే నానాభాగములను కలుపునట్టివి. ఇట్టివి 625 గలవు. మొత్తమునిడివి 16334 మైళ్లు. సేలముజిల్లాలో ఎక్కుడుగ గలవు. మొత్తముసంఖ్య 59.

## ప్రభుత్వపు ఏర్పాటులు

కౌన్సిల్ ఆఫ్ స్టేటు:—ఇందులోగల 33 ఎన్నిక సభ్యులలో 5 గురు మాత్రము చెన్న రాజధానినుండి ఎన్నుకొనబడుదురు. వీరిలో మహమ్మదీయేతరులు 4 గురు. మహమ్మదీయులు 1 నుందురు.

లెజిస్లేటివ్ అసంబ్లి:—అసంబ్లీలోగల 103 ఎన్నికసభ్యులలో 16 గురు మాత్రము మనరాజధాని నుండి ఎన్నుకొన బడుదురు. 16 గురులో 10 మంది మహమ్మదీయేతరులును, 3 మహమ్మదీయులును, 1 యిరోపియనుడు, 1 భూస్వాముల ప్రతినిధి, 1 ఇండియన్ వర్తక సంఘముల ప్రతినిధిగను ఉందురు.

లెజిస్లేటివ్ కౌన్సిల్:—(రాష్ట్రీయశాసననిర్మాణసభ) లో 98 గురు ఎన్నికసభ్యులును (ప్రజాప్రతినిధులు) 29 గురు ప్రభుత్వ నియమితసభ్యులును ఉందురు. ప్రభుత్వ నియమితసభ్యులలో 19 గురు ప్రభుత్వోద్యోగులుగను, 6 గురు నిమ్నజాతుల ప్రత్యేకప్రతినిధులుగను ఉందురు. 98 ప్రజాప్రతినిధులలో 65 గురు మహమ్మదీయేతర ప్రతినిధులుగను, 13 గురు మహమ్మదీయులుగను, 5 ఇండియన్ క్రైస్తవులుగను, 1 యిరోపియను, 1 ఆంగ్లో హైందవుడును, 12 గురు ప్రత్యేక సంస్థలనుండి ఎన్నుకొనబడినవారును ఉందురు. సాంఘిక ప్రాతినిధ్యము పోయినగాని సంఘీభావము కుదురజాలదు. రాజధానిలో స్టేటుకౌన్సిల్ సభ్యులకు సమ్మతు లొసంగగలవారు 2290మందియును అసంబ్లీ సమ్మతు లిచ్చువారు 258864 గురును గలరు. లెజిస్లేటివ్ కౌన్సిల్ ఓటర్లు 1283923 గురు గలరు. వీరిలో స్త్రీలు 89329. మొత్తముమీద ప్రజాప్రాతినిధ్యము అత్యల్పముగ నున్నది.

## గవర్నమెంటు

గవర్నరు:—రాష్ట్రాధిపతి. ఇతనికి సలహోయిచ్చునట్టి సంఘములు 2- (1) కాబినెట్, (2) లెజిస్లేటివ్ కౌన్సిల్.

(1) కాబినెట్ (మంత్రాంగము) లో 7 గురుగలరు. వీరిలో 4 గురు కార్యనిర్వాహకసభ్యులు, 3 మంత్రులు. కార్యనిర్వాహకసభ్యులలో 2 యిరోపియనులు, 1 హిందువు, 1 మహమ్మదీయుడును గలరు. మంత్రులు ముగ్గురు హిందువులు.

ప్రభుత్వముఖ్య(శాఖా)కార్యదర్శులలో 7గురును ఐరోపియనులే.
శాసన సభాధ్యక్షుడు—హిందువే.
రెవిన్యూబోర్డు మెంబర్లు ముగ్గురు ఐరోపియనులు.
ఉన్నత న్యాయస్థానమునందలి న్యాయమూర్తులు 14 గురు. వీరిలో 6 గురు మాత్రము హైందవులు. వీరిలో 2 ఆంధ్రులు.
ప్రధానశాఖలముఖ్యోద్యోగులలో 1 రు మాత్రము హైందవుడు.
26 గురు మండలాధికారులలో 5 గురు మాత్రము హైందవులు. వీరిలో 2 మహమ్మదీయులు, 1 రు ఆంధ్రులును గలరు.

## రాష్ట్ర-ప్రభుత్వాదాయ-వ్యయములు (1923-1924)

| | |
|---|---|
| భూమిశిస్తు | 747 లక్షల 35 వేలు |
| ఎక్సైజు (మత్తుపదార్థములు) | 520 లక్షల 44 వేలు |
| స్టాంపులు | 228 లక్షల 83 వేలు |
| ఫారెస్టు (అటవి) | 52 లక్షల 35 వేలు |
| రెజిస్ట్రేషన్ | 36 లక్షల 32 వేలు |
| ఇతరపన్నులవలన | 73 లక్షల 26 వేలు |

మొత్తమున వచ్చు ఆదాయము 1658 లక్షల 55 వేలు రూపాయలు. వ్యయము-1639 లక్షల 58 వేలు-ఇందులో కేంద్రప్రభుత్వమునకు మాత్రమే చెల్లించినది 348 లక్షలు-పోగా నిలువ మొత్తములో 199 లక్షల 93 వేలు రూపాయలు పోలీసుశాఖకై వ్యయపరుపబడుచున్నది. విద్యాశాఖకు ప్రత్యేకింప బడినది 168 లక్షల 28 వేలు. అనగా విద్యకంటె పోలీసుకు 31 లక్షల 65 వేలు రూపాయ లధికముగ వ్యయపరుప బడుచున్నది. నిజముగ దేశమును పీల్చి పిప్పిచేయుచున్నవి, సైనిక పోలీసు సివిల్ శాఖలే.

రాష్ట్రప్రభుత్వమునకుగాక కేంద్రప్రభుత్వమునకు రాబడి ఉప్పు పన్నులు వగైరాలు మూలమున ఎంతెనో చెల్లించుచున్నాము.

కేంద్ర ప్రభుత్వమునకు రాష్ట్రములు చెల్లించు కప్పములలో చెన్నరాష్ట్రమే అత్యధికముగ చెల్లించుచున్నది. 100 కి $35\frac{1}{2}$ వంతు ఒక చెన్నరాష్ట్రమే చెల్లించుట కడుంగడు శోచనీయము.

## వైద్యాలయములు

చెన్నరాజధానిలో తగినన్ని వైద్యాలయములులేవు; మొత్తము మీద 757 వైద్యాలయములు గలవు. వీటిలో 523 స్థానిక సంస్థల చేతను 59 ప్రత్యేక సంస్థలచేతను నెలకొల్ప బడియున్నవి. ప్రజోపయోగమునకై ప్రభుత్వమువారిచే నెలకొల్పబడినవి 48 మాత్రమే గలవు. మొత్తముమీదమనిషి 1కి 26 పైసలుమాత్రము వ్యయపరుపబడుచున్నది. ప్రజారోగ్యమునకై ప్రభుత్వము తగినశ్రద్ధ జూపుచుండుటలేదు.

## న్యాయస్థానములు.

సివిల్ దావాలు:—1922 సంవత్సరమున 530538 సివిల్ దావాలు దాఖలు చేయబడెను. చెన్నవగర వాస్తవ్యులలో 30 మందికి 1 దావా చొప్పునను రాష్ట్రవాసులలో 80 మందికి 1 దావా చొప్పునను వేయబడెనని తేలుచున్నది. వ్యాజ్యెములసంఖ్య మలబారునందెక్కుడుగను, బళ్లారినందు మిగుల తక్కువగను ఉన్నవి. ప్రస్తుతము 25 జిల్లాకోర్టులును, 35 సబ్‌కోర్టులును, 164 మునిసిఫ్ కోర్టులును, మరికొన్ని న్యాయస్థానములును, 527 పంచాయతీ కోర్టులును గలవు.

క్రిమినల్ నేరములు:—960 క్రిమినల్ న్యాయస్థానములు గలవు. ఇవిగాక హానరరి మేజస్ట్రేటు కోర్టులును, అసిస్టెంటు సెషన్స్ జడ్జికోర్టులును, 7 ఫస్టుక్లాసుబెంచికోర్టులును, 527 పంచాయతి కోర్టులును గలవు. ఇవిగాక మరికొన్నిగలవు. మొత్తముమీద 305042 క్రిమినల్ నేరములు తేబడెను. 210147 నేరస్థులపై శిక్షలు విధింపబడెను. వీరిలో 191 మంది మరణశిక్షకును, 220 మంది ద్వీపాంతరవాసశిక్షకును పాత్రులైరి. జరీమానాలపై 1167000 రూపాయలు ప్రభుత్వ బొక్కసమునకు జేరెను.

## జైళ్లు-కారాగారములు

10 కేంద్రకారాగారములును, 4 డిస్ట్రిక్టు జైళ్లును, అనేక సబ్‌జైళ్లును, మరియు కొన్ని ప్రత్యేక కారాగారములును గలవు. మొత్తముమీద సరాసరి హాజరులెక్కనుబట్టి దినము ఒకటింటికి (1922) 24398 ఖైదీలు గలరు.

## పోలీసు శాఖ

1923-1924 సంవత్సరమున 19879600 రూప్యములు అనగా రమారమి 2 కోట్ల రూపాయలు వ్యయపరుప బడుటకు ప్రత్యేకింప బడెను. 1923 ను బట్టి 29406 పోలీసుయుద్యోగస్థులు గలరు. వీరిలో 23799 కనిస్టేబిల్సును, 3559 హెడ్ కనిస్టేబిల్సులును, 1456 సబ్ ఇనస్పెక్టర్లును, 293 ఇనస్పెక్టరులును, 33 జిల్లా సూపరిన్‌టెన్‌డెంట్లును గలరు. 1922 లో పోలీసువారిచే తేబడిన 5575 నేరములలో 2468 నేరములు మాత్రము ఖాయపరుపబడి శిక్షార్హములయ్యెను. అనగా నేరములలో సగమునకు పైభాగము అక్రమముగ తేబడినవే. ఇట్టి శాఖకు 2 కోట్ల రూపాయలు వ్యయపరుపనేల?

## స్థానిక సంస్థలు

నీలగిరి జిల్లాబోర్డుతప్ప మిగిలిన 24 జిల్లాబోర్డుల అధ్యక్షులు ఉద్యోగేతరులే. వీరిలో 6 గురు మాత్రము ఎన్నుకొనబడినవారుగను మిగిలిన 18 మంది ప్రభుత్వ నియమితులుగను యుండురు. రాజధానిలో 1276 తాలూకాబోర్డులు గలవు. వీటిలో 116 బోర్డులకు మాత్రము అధ్యక్షుల నెన్నుకొనునధికారముగలదు. 526యూనియన్‌బోర్డులుగలవు.

లోకల్‌బోర్డువారిచే 1922-1923 సంవత్సరమున 96 మైళ్లు పొడవుగల రోడ్లు నిర్మింపబడెను. 1 సంస్కృత కళాశాలయు, 159 ఉన్నత విద్యాలయములును 8908 ప్రాథమిక విద్యాలయములును స్థానికసంస్థలచే పోషింపబడుచు వచ్చినవి. 108 ఆస్పత్రులును, 314 డిస్పెన్సరీలును గలవు. విద్యకై 69 లక్షల 38 వేలు రూపాయలును వైద్యాలయములకై 19 లక్షల 2 వ్యయపరుపబడెను. స్థానికసంస్థల ఆదాయము (1922-1923) 329 లక్షల 40 వేలురూప్యములు వ్యయము .............329 లక్షల 9 వేలు రూప్యములు.

## పురపాలక సంఘములు(మునిసిపాలిటీలు)

1922-1923 లో రాజధానిలో 80 పురపాలకసంఘములు గలవు. వీటిలో 73 మాత్రము అధ్యక్షుల నెన్నుకొను నధికారము కలిగి యున్నవి. 1 కళాశాలయు, 40 ఉన్నత విద్యాలయములును, 1139 ప్రాథమిక పాఠశాలలును మునిసిపాలిటీల యాజమాన్యమున గలవు. వీటి మొత్తపు ఆదాయము 125లక్షల 18 వేలు; వ్యయము 121లక్షల85వేలు.

ప్రభుత్వము కంటె స్థానికసంస్థలును పురపాలకసంఘములు ప్రజావిద్యకై ఎక్కుడు శ్రద్ధవహించుచున్నవి.

## ముప్పదితొమ్మిదవ భారతజాతీయమహాసభ, బెల్గాము

మహాత్మాగాంధి మౌలానా మహమ్మదాలిగారలు స్వచ్ఛందసేవకబృందమధ్యమున కేతెంచుట



Mahatmaji with Moulana Mohamad Ali at the parade grounds

మహాత్మాగారును, ఇతరనాయకులును, స్వచ్ఛందసేవకులను తిలకించుట



Mahatmaji and other Leaders among Volunteers

The 39th Indian National Congress, Belgaum

బిజాపూరునందలి గోల్‌గుమట్, బెల్గామునకు ఈశాన్యము పదిమైళ్లదూరమునందున్న ప్రసిద్ధభవనము



Gol Gumat at Bijapur, ten miles-from Belgaum

స్వచ్ఛందసేవకులు, ముప్పదితొమ్మిదవ భారతజాతీయ మహాసభ, బెల్గాము



Volunteers

The 39th Indian National Congress, Belgaum

# కావ్యము: నీతి

దుప్పూరి రామిరెడ్డి గారు

మతము, శాస్త్రము, ధర్మము, లలితకళలు మున్నగునవి వానివాని కుచితమైన రీతుల మానవ శిక్షణమునకుఁ దోడ్పడు సాధనములు. కొన్ని బుద్ధిని ఉత్తేజన మొనరించునవి. మఱికొన్ని హృదయమును పరిపక్వపఱచునవి.

ప్రతియుగమునందును బ్రతిసంఘమునందును కాలమునకంటె ముందు నడచు ప్రతిభావంతులు, విప్లవకారులు, దూరదృష్టి గలవారు కొందఱుద్భవించుచుందురు. అట్టిమహనీయుల భావములు, సృష్టులు, ఆయుగమునకు, ఆ సంఘమునకు ఆదర్శకములుగ నుండును. ఆపురుషపుంగవులు, మార్గదర్శకులు, అస్ఫుటముగను, అవ్యక్తముగ నున్న భావికాలమును మనకన్నులకుఁ బొడకట్టునట్లు చేయఁగల మహిమావంతులు. వారి పలుకుబడివలన మానవసంఘము క్రొత్తక్రొత్తదారులు ద్రొక్కుచుండును. జాతీయత అట్టి యుదారహృదయుల భావసంపర్కముచేత నంతర్జాతీయతగఁ బరిణమించుచుండును. బుద్ధుఁడు, వాల్మీకి, ఏసుక్రీస్తు, మహమ్మదు మున్నగు మహాపురుషులీ తరగతికి సంబంధించినవారు. వారిజీవితమే యొక యుత్కృష్టమైన కావ్యము. వారి ప్రవర్తనమే నీతికి ఆదర్శకము.

ప్రతియుగమునం దొకొక్కభావము ప్రముఖమై యుండును. అది యాధ్యాత్మికమైనను, సాంఘికమైనను' రాజకీయమైనను, లేక మఱి యింకేవిధమైన మానవచర్యకు సంబంధించినదియైననుగావచ్చును. ఆభావములందుఁ బ్రజల యాంతరంగికదృష్టి లగ్నమైయుండును. ఇట్టిభావము సార్వజనీనముగ నుండకతప్పదు. దానిని కవియో, చిత్రకారుఁడో, ప్రవక్తయో, తనసృష్టిమూలమున బయలుపఱచును. మన మెల్లర మానాయకుని ననుసరింతుము. ఎందువలన? మనయందు అస్పష్టములుగను నిగూఢములుగను నున్న భావములను ఆయన వెలిఁబుచ్చును. ప్రజాబాహుళ్యము యొక్క భావములు అతని సృష్టియందు ఆదిశేషావతారము దాల్చి రెండువేలనాలుకలతో మాటలాడుచుండును. ఆయనకును మనకును సహానుభూతి గలదు. కావుననే యా నాయకుఁడు మనల నాకర్షించును. అట్టి మహనీయుల యుద్దేశములు, సంభాషణములు, ప్రవర్తనములు విశ్వశ్రేయమును జేకూర్చుచుండును. ఏది విశ్వశ్రేయము సంపాదింపఁగలదో యది నీతిబాహ్యముగ నుండనేరదు.

లలితకళలు జాతీయజీవితమునందు అంతర్వాహినులై ప్రవహించు భావముల రమణీయాభివ్యక్తులే కావున, వానియందు ముఖ్యములును, సర్వజనాదరణీయములును అగు భావములను ఆకర్షించి శిల్పులు తమ రచనాచమత్కృతివలన వానిని ఆదర్శకములుగ నొనరింతురు. ఇట్లనుటవలన మానవసమాజమును కళలును పరస్పరసాపేక్షకము లని మన మూహింపవలయును. తాత్కాలికములైన భావములు కొన్ని ప్రజలను శిల్పులను ఆకర్షింపవచ్చును. అట్టివి క్షణికములు. కాని, కాలపారంపర్యముగ నొకజాతియందు అస్థిగతమై మజ్జలో నాటుకొనియున్న భావములను మూర్తీభవింపఁ జేయుట జాతీయశిల్ప మనఁబడును. అదియే లోకాదరణపాత్రము. తనవ్యక్తిత్వమును బోఁగొట్టుకొనక చిరంజీవిగ నుండును. తాత్కాలికములైన విజాతీయానుకరణములు మన స్వభావమునకుఁగూడ విజాతీయములే కావున సత్యపటుత్వము కొఱఁతపడి కళాప్రపంచమునందు నిరాదరింపఁబడును.

ప్రాచ్యపాశ్చాత్య శిక్షణమార్గములందుఁ బరస్పర వైరుధ్యము గోచరించుచున్నది. ఒకరికి శాంతియు నిరాడంబరమైన జీవనము ప్రధానము. మఱియొకరికి, తృష్ణ, చిత్తసంక్షోభము, ఆటోపము ముఖ్యము. నేతిచేఁ దడుపఁబడిన అగ్నిహోత్రమువలె భోగము లనుభవింపఁబడుకొలఁది వృద్ధిచెందుచుండుననియు, కావున భోగముల నియతముగ గ్రహింపవలయుననియు నొకరిమతము. భోగముల వీలైనంతవఱకు వృద్ధిపొందించి వాని ననుభవింపనిదే నాగరకత గాదని మఱియొకరి యభిప్రాయము. ప్రాచ్యులకు, జీవితము పరమార్థమును సాధించుటకై యేర్పడిన

యొక్క యుపకరణము. పాశ్చాత్యులకు, జీవితమే యొక్క పరమార్థము. కావున యిట్టి మార్గభేదములు రెండుఖండముల యొక్క లలితకళలయందు సస్థిగతముగ సంకితమై యున్నవి. ప్రాచ్యశిల్పమునందు రూపయాథార్థ్య మంత ముఖ్యముగాదు. ఏలనన, వారి శిల్పము చాలవఱకు సాంకేతికము. సాంకేతికశిల్పమెప్పటికిని కొన్ని శిల్పసమయములకుఁ గట్టువడియుండును. అజంతాగుహాలయందలి రేఖాచిత్రములు ఈతరగతిశిల్పమునకుఁ బ్రబలమైన నిదర్శనములు. మన శిల్పము ధ్యానమూలకము; వారిశిల్పము ప్రకృత్యనుకరణము.

‘కళలయందు రసరామణీయకములె ప్రధానములు, గాని నీతికిని ఆధ్యాత్మికభావములకును నేమి సంబంధము గలదు’ అని కొందఱు విమర్శకులు ప్రశ్నించుచున్నారు. ఇది మనకు నవీనమును విజాతీయమైన సందేహము. ఆస్కార్ వైల్డు (Oscar wilde) అను నొక ఆంగ్లేయవిమర్శకుఁడు * కళలన్నియు నీతిబాహ్యములనియు, నీతి యనునది యేదో కొద్దిపాటి తెలివితేటలుగల వారికేకాని ప్రతిభావంతులకు నీతి యనవసర మనియు, చెప్పియున్నాఁడు. ధర్మశాస్త్రములయందువలె కావ్యములందు నీతిబోధ యనవసరమనుటయే ఆయనయుద్దేశమైనయెడల మేమిరువురము ఏకాభిప్రాయులమే. కాని నీతికిని కావ్యమునకును ఏలాటి సంబంధము లేదని వాదించువారికిని నాకును భిన్నాభిప్రాయము గలదు. ఈవిషయమును గొంచెము చర్చింతము.

కావ్యమందు రామణీయకము ముఖ్యము; తక్కిన గుణములు అందుకు పోషకములుగ నుండవలయును. రామణీయక మనునది ప్రతిభావంతుఁడైన కవియొక్క రచనానైపుణ్యమునకు సంబంధించినది. గుణ మెప్పుడు తనకాలంబమైన వస్తువును ఆశ్రయించియుండునుగాన వస్తుగుణములు రెంటికిని ప్రాధాన్యము గలదు. ఒకవేళ నీతిబాహ్యమైన వస్తువు రమణీయమై యుండినయెడల షేక్స్పియరు (Shakespear) మహాకవి సృజించిన క్లియోపాట్రా (Cleopatra) కన్యవలె మానవలోకమున కుపద్రవము గలుగఁజేయును. శకుంతలవలె అనుభోగ్యము గాదు.

మఱియొక పూర్వపక్షము గలదు. “శిల్పముకొఱకే శిల్పము” (Art for art) అనగా శిల్పమున కేలాటి బాధ్యతలు లేవు. కవి భావోద్రేకమువలనఁ దనకిష్టమైనరీతిని గానము చేయును. అట్లు చేయుట యితరులకొఱకుగాదు; తనసంతోషమునకు. కోకిల కూయుట యెవరిని ఆనందపెట్టుటకొఱకు? ఈవాదము మొట్టమొదట వినుటకు ఇంపుగానే యుండును కాని విమర్శించుకొలఁది యందలి లోపములు బయలుపడును. కోయిలకూతను విని మన మానందించుచున్నాము; నిజమే. దానికూత మధురముగ నుండుటవలనను ఆకూతే మనకు సమ్మత మగుట వలనను మనము సంతోషించుచున్నాము. అది తన కిష్టమువచ్చినట్లు కూయుటవలన గాదు. కాకిగూడ తనకిష్టమువచ్చినట్లు కూయును. దానిని మనమేమాత్ర మాదరించుచున్నాము. అటులనే కవి చేయు గానము మానవసమాజము నుద్ధరించుటకు యోగ్యమైనదిగ నుండుటవలననే గౌరవింపఁబడుచున్నది. ‘నాకు నోరున్నది. తిట్టుటకు చాలమాటలు దెలియును. కావున నేను తిట్టుకొనుచుందును’ అని చెప్పి వీధులవెంబడి తప్పదారి కూఁతలుకూయుచుఁ దిరుగుచుండిన ‘ఆతనికి పిచ్చిపట్టిన’దని పిచ్చివారి యాసుపత్రికి పంపుదుము. సమాజ మెట్లు తనయందలివ్యక్తికి బాధ్యమో, వ్యక్తికూడ సమాజమునకు బాధ్యుఁడు.

కవి యొకమూలఁ గూర్చుండి తనసంతోషముకొఱకు నొక కావ్యము రచియించుకొని దానిని బదిలముగ నింటదాఁచుకొని యుండినయెడల నేలాటి యిబ్బంది లేదు. అట్లుగాక కవిరచనలు వ్యాప్తిలోనికి వచ్చి లోకజీవనముపై నధికారము చేయుచుండును. కావున సందఱికంటెను కవికి బాధ్యత యెక్కువ. ఉత్తమకవి సృష్టియందా కాలపు మానవసంఘమునందలి సముచితభావములు మూర్తీభవించియుండును. ఆతని రచనలందు భవిష్యద్వాణి రహస్యమర్మరరవములతో సంభాషించుచుండును.

మానవజీవితమునకును శిల్పమునకును సహజమైన సంబంధము గలదు. జీవితప్రయోజనము ననుసరించి శిల్పప్రయోజనము గూడ నిర్ణయింపఁబడుచుండును. మన జీవితమును గుఱించి ఓమరుఖయాం (Omarkhayam) అను పారసీకకవి యిట్లు నుడివియున్నాఁడు.

One thing is certain and the rest is lies.
The flower that once has blown for ever dies.

* * * * * * * * * * *

---

* All the arts are immoral. To morals belong the lower and less intelectual sph res. "Intentions"

Many knots unravelled by the road.
But not the knot of human death and fate.
There was a door to which I found no key,
There was a veil past which I could not see.
* * * * * * * * * * *
While you live, drink ; for once dead, you never shall return.

ఓమరుఖయాముకొంచె నించుమించుగా చార్వాక మతస్థుడు. 'వికసించిన పూవు మరల వికసింపఁబోదు. మరణించిన మానవుడు మరల తిరిగి రాఁబోఁడు. ప్రాణముండగనే భోగము లనుభవించెదము. చచ్చినవెనుక యేమగునో ఆవిషయము నాకు తెలియదు. ఆ ముడిని నేనువిప్పఁజాలక పోతి'నని చెప్పె. అట్టివారికి జీవితము భోగమాత్ర ప్రయోజనము. జీవితము ననుసరించి శిల్పము గూడ విషయభోగముల ప్రతిబింబముగ నుండును.

కాని మన విశ్వాసములు వేఱు. ధర్మార్థకామ మోక్షములను నాలుగు పురుషార్థములను మానవజీవితము సాధింపవలయునని మన పెద్దలు నిర్ణయించిరి. వారు ఇహపరముల రెంటికిని సమానగౌరవమును చూపియున్నారు. సన్న్యాస మనునది అతీతధర్మము. లోకసామాన్యము గాదు. ధర్మార్థకామమోక్షములు పరస్పరసాపేక్షములు. కావున మన కవిత్వప్రయోజనము, జీవితాదర్శకము ననుసరించి బ్రహ్మానందసోదరమై సపరనిర్వృతిగ నిర్ణయింపఁబడినది. కావ్యము లనఁగాఁ బసిబిడ్డ లాడుకొనుటకై మన మిచ్చు రంగులబొమ్మలు గావు. అనాగరకతాదోషము పాపుకొనుటకు మేజాబల్లలపైఁ బ్రదర్శింపఁబడు భూషణగ్రంథములనుగా కావ్యములను మన మెప్పుడు తలంపలేదు. మనజీవితమునందు కావ్యములు మిళితమై పోయినవి. ఆర్యసాంఘిక జీవనప్రవాహమునకు రెండుతటములుగనున్న రామాయణ మహాభారతములే యిందులకు దృష్టాంతము. సీత, దమయంతి, సావిత్రి, ద్రౌపది మున్నగు పౌరాణికసతీరత్నములు భారతదేశమునం దెందఱు పతివ్రతల సృజింపలేదు? సంసారమందు నిర్భరదారిద్ర్యమును,కష్టపరంపరలను ననుభవించుచున్న సతీమణులకు, దమయంతి, ద్రౌపది చంద్రమతి మున్నగు నిల్లాండ్రచరిత్రము లెంత యూఱట నొడఁగూర్చి యుండలేదు. ఈ నారీవతంసము లందఱు వ్యాసవాల్మీకి మహాకవుల భావప్రపంచమునఁ బుట్టి పెంపొందిన ఆదర్శకసృష్టులేకదా! అట్టి కవు లెన్నఁటికైన నిర్బాధ్యులగుదురా? వారి రచనలు నీతిబాహ్యము లగునా?

కీట్సు (Keats) అను ఆంగ్లేయకవి (Beauty is truth, truth beauty) అని చెప్పియున్నాఁడు. మన పూర్వికులు సత్యసౌందర్యములకు శ్రేయమునుగూడఁ జేర్చిరి. కావ్యము విశ్వశ్రేయము చేకూర్చునదిగ నుండవలయును. అనీతిదాయకమైన దేదియు లోకకల్యాణము నాపాదింపలేదు.

ఇఁక నీతియననేమి ? దాని నెవరు కల్పించిరి? దానివలనఁ బ్రయోజనమేమి? అను నీవిషయములు మనసున కెక్కనిదే కావ్యములందు నీతి యావశ్యకమా లేదా, యను సందేహమును మనము తీర్చుకొనలేము. నీతి యను పదమును విశాలభావముగలదానిగా నూహించి నే నిచట ప్రయోగించుచున్నాను. దేశకాలపాత్రములకు లోఁబడి నీతులు భిన్నములుగ నుండవచ్చును. ఒకసంఘమువారికి నొకదేశమువారికి ననుకూలమైన నీతులు మఱియొకరికి విరుద్ధముగఁ దోఁపవచ్చును. కాని యిట్టి పరస్పరవిరుద్ధములైన నీతులందు నంతర్వ్యాపియగు నుద్దేశ మొక్కటియే. అదియేదన, మానవజీవితోద్ధరణము,లోకయాత్రాసౌకర్యము. నేనిచటఁ బ్రయోగించిన నీతి అను పదమును దేశకాలపాత్రాచార వ్యవహారములకు వశవర్తి యయి సంకుచితమైన నీతినిగ నర్థము చేసికొనఁగూడదు. అన్ని నీతులకు జన్మకారణమైన యావశ్యకతనుగఁ దలంపవలయును. ఇది జగదేకము.

సంఘసమష్టికిని దదంశమైన వ్యక్తికిని భిన్నభిన్న వ్యక్తులకును గల ప్రవర్తనసామరస్యము, ఆనుగుణ్యము నీతి యనఁబడును. ఈనీతి మానవుల యావశ్యకతను బట్టియు ననుభవము ననుసరించియు, క్రమక్రమముగ రూపము దాల్చి సంఘయంత్రమును నడపుచుండును. ఈనీతులు సకలవిధములైన మానవచర్యలకు సంబంధించి యున్నవి. ఇట్లనుటవలన, విశేషసంఖ్యాకులగు ప్రజల యభిప్రాయము ఘనీభవించి నీతిగను శాసనముగను మాఱును. కాని నీతిశాసనములకుఁ గొంత భేదము గలదు. రాజాధికారముద్ర గలది శాసనము. సంప్రదాయసిద్ధమయి మానవుల భావములను బరిపాలించునది నీతి. నాగరకత హెచ్చుకొలఁది అధికారముద్రాంకితము లగు శాసనములకంటె స్వయమారోపితములగు నీతులే మనుష్యసంఘమును బాలించుచుండును. విరుద్ధశాసనమునకు లొంగియుండుట దాస్యమైనను స్వయంకృతనియమమునకు వశవర్తియై యుండుట స్వాతంత్ర్యమనఁబడును.

నీతులును శాసనములును(స్వయంకృతములైనను, పరకృతము లైనను) సంఘమును శాసింపనియెడల వ్యక్తిస్వాతంత్ర్యము నశించి మానవజాతికిఁ బ్రళయము సంభవించును. కావున నీతి మానవులయం దన్యోన్యప్రవర్తనానుగుణ్యమును బోషించును.

కళలు సాంఘికజీవితముయొక్క యుచ్ఛ్వాసనిశ్వాసముల యాదర్శకలేఖనములని యిదివఱకే తెలిసికొనియుంటిమి. కావున జీవిత మొక వంకనుఁ గళలు వేఱొకవంకనుఁ బ్రవహింప నేరవు. సాధారణజీవితమునందు నేవేవి నీతిబాహ్యములుగను నేవము పుట్టించునవిగ నుండునో అట్టివి కళలయందును నింపుగొలుపవు. అట్లగుటఁ గావ్యమునకును నీతికిని సంబంధ మెట్లు తెగిపోవును?

ధర్మశాస్త్రములు వేఱు; కావ్యములు వేఱు; వానివాని ప్రయోజనములును భిన్నములు. పాలనాదండము చేతఁబట్టుకొని "సత్యంవద" "ధర్మంచర" అని వేదములు శాసించును. కవి "సత్యంవద" అని శాసింపక హరిశ్చంద్రుని సృజించెను. "సత్యమేవజయతి" అను ధర్మవాక్యమునకు హరిశ్చంద్రోపాఖ్యానము లక్ష్యము. ఆకథను జదివినవారికి హరిశ్చంద్రునిపై భక్తిగౌరవములు గలుగకపోవు. మన మెవరిని ఉత్తములని మెచ్చుకొందుమో వారి ననుకరింపవలయుననియో, వారివలెఁ బ్రవర్తింపవలె ననియో, మన మభిలషింతుము. ఈకోరిక మనయందు సహజముగఁ బుట్టును. సత్కావ్యములయందు ఇట్టి యున్నతాశయములను, ఆసలను బ్రేరించు శక్తి గలదు. *బలాత్కారనీతిబోధనమునకుఁ గావ్యము లెన్నఁడును బూనుకొనఁగూడదు. అట్టివి కావ్యములుగాక మనుధర్మశాస్త్రములవంటి స్మృతులుగ మాఱును. కళలయందలి నీతి యంతర్లీనమై యలక్షితముగ మనహృదయముఁ బ్రవేశించును. దాని పదచిహ్నము లదృశ్యములు. ఇట్లు రచియించుట కళానైపుణ్యము.

కావ్య మర్థింపవలసినది రససౌందర్యము లేకదా! అంతర్లీనమైన నీతియైనను వానికెటుల నుపకరించును అను సంశయము కొందఱకుఁ గలుగవచ్చును. నీతిస్పర్శ లేనిదే సౌందర్యము పరిపూర్ణము గాదని నాయుద్దేశము. ఈ దృష్టితో మనము విమర్శింపఁ బూనినయెడల నేదేశముయొక్క యుత్తమశిల్పమునందుఁగాని యనీతిపరత్వముగోచరింపదు. ఒక చిత్రకారుఁడు రమణీయవతియగు కాంతను విగతవస్త్రనుగఁ జిత్రించి మనకుఁ జూపినయెడల ఆసౌందర్యమునంతయు మ్రింగివేయఁగల యసహ్యము పుట్టి మొగము చిట్లించుకొందుము. ఎందువలన? ఆచిత్రపటమునకును జీవితమునందు మన కలవాటుపడియున్న యౌచిత్యమునకును వైరుద్ధ్యము సంభవించినది. అందలి రమ్యత సర్వజనోపభోగ్యమగు నంత లేదు. సభ్యముగ ఇట్టి చిత్రములు ఆహ్లాదమును గలిగించి మనసు నుద్ధరించుటకు మాఱు, ఇంద్రియచాపల్యమును, అసభ్యములగు మనోవికారములను బ్రేరేపించుచుండును. అట్లుచేయుట యుత్తమకళ యొక్క ధర్మముకాదు.

అట్లయినయెడల మానవచర్యలకు సంబంధింపని వనములు, కొండలు, మేఘములు, ఉషస్సులు, సూర్యాస్తమయములు మున్నగు దృశ్యముల ప్రతిలేఖనములు కాంచువారలకు ఆనందము గలిగించునుగదా. అట్టి చిత్రమునందుఁగూడ నీతి అంతర్లీనమై యున్నదా అని కొంద అడుగవచ్చును. అట్టి చిత్రములు అనీతి స్ఫోరకములు గాకుండుటచేతనే వానియందలి రామణీయకమును బ్రతిబంధకము లేక మన మనుభవింతుము. నీతి, సౌందర్యమునకు హేతువు గాదు. పరిపూర్ణతకు ఆవశ్యకమైన యొక యౌచిత్యము.

కావ్యమునందు శిల్పనైపుణ్యము హెచ్చుకొలఁది యందలి కథాభాగమునకుఁ జదువరుల హృదయము నాకర్షించు శక్తియు హెచ్చుచుండును. గుణమెప్పుడు వస్తువు నాశ్రయించియుండును గావున నితరకళల యందువలెనే కావ్యమునందును వస్తుగుణములు రెంటికిని వానివానికిఁ దగిన ప్రాధాన్యము గలదు.

మానవుని ప్రతికోరికకును రెండుదిక్కులు గలవు. మొదటిది వాంఛాపరిపూర్తి; రెండవది తజ్జనితమైన యుపయుక్తి. ఒక యుదాహరణము: మిఠాయినిఁ జూచినపుడు తినఁ గోరిక పుట్టును. ఇది జిహ్వాచాపల్యము. మనదృష్టి కోరిక తీర్చుకొనుట యందే లగ్నమై

* The office of poetry is not moral instruction, but moral emulation; not doctrine, but inspiration. G.H. Lews
"The inner life of art"

యుండును గాని, దాని యుపయోగమును గుఱించిన తలంపు సాధారణముగఁ గలుగదు. కాని; మనము తలంచినను, తలంపక పోయినను మిఠాయి తినుటవలన రెండులాభములు చేకూఱినవి. ఒకటి : కోరిక తీరుటవలన గలుగు తృప్తి. రెండు : దేహపుష్టి. ఇచ్చట మిఠాయిలోని మాధుర్యము రుచిచూచుటవలన కోరిక తీరినది. ఆ మాధుర్యము, ఆహారవస్తువు నాశ్రయించి యుండుట వలన దేహమునకు బలము కలిగించినది. కాని మాధుర్యముమాత్రము కోరిక తీర్చునదిగ నుండి తదాశ్రయ వస్తువు అనారోగ్యకరమై యుండినయెడల దాని ప్రతిఫలమును మనము తప్పక యనుభవింతుము. ఈ సాదృశ్యమును కావ్యములో రససౌందర్యములకును, కథాభాగమునకును వాని ననుభవించు మానవసమాజమునకును నన్వయించి చూడుఁడు. అంత్యఫలితము మీరే యూహింపఁగలరు.

మానవస్వభావనిర్మాణమునందుఁబరిస్థితులు చాల ముఖ్యము లని మన స్తత్త్వశాస్త్రజ్ఞు లెల్లరు నొప్పుకొన్న విషయమే. కావ్యములం దట్టి పరిస్థితులు గలవు. ఇంద్రియగోచరములగు విషయములు మనల నెట్లు లోఁగొనునో, కావ్యాంతర్గత విషయవర్ణనము గూడ నట్లే మనల వశవర్తులఁ జేసికొనును. కావున కావ్యములతోఁ గవికిఁ గల సంబంధము కన్నను దానిని జదివి యానందించు లోకుల కెక్కుడు సంబంధము గలదు.

మతమును శిల్పమును ఒకపూవులోఁబుట్టిన రెండు రేకులని చెప్పవచ్చును. వానిరెంటికి మిక్కిలి సమీపబాంధవ్యము గలదు. ఒకదాని నొకటి యపేక్షించి యవి యన్యోన్యసహకారమువలన నభివృద్ధి చెందినవి.

వైదికఋషుల భావమును, కవిత్వకల్పనాశక్తియు సమ్మిళితములయి, యందుండి యపూర్వ సృష్టులు బయలుదేరినవి. పౌరాణిక ప్రపంచ మంతయు నిట్టి మతకవిత్వసాంకర్యముయొక్క యద్భుతసృష్టియే కదా! ఇట్టి కల్పనలు లేకున్న మానవజీవిత మెంతసంకుచితముగ నుండి యుండెడిదో!

మతమును, శిల్పమును ఆనంద సాక్షాత్కారమునకై పాటుపడుచున్నవి. గంతవ్య మొకటి; మార్గములు భిన్నములు.

"ఆనందాద్దేవ ఖల్విమాని భూతాని జాయంతి, ఆనందా ద్దేవ జాతాని జీవంతి, ఆనందం ప్రయా న్త్యభి సంవిశంతి."

ఈ భూతసృష్టియంతయు నానందమునుండి యుత్పన్న మగుచున్నది. ఆనందమున వర్ధిల్లుచున్నది. ఆనందము దిక్కునకే ప్రవహించుచున్నది. తుదకా యానందమును బ్రవేశించుచున్నది. శిల్పిసృష్టియు నిట్టిదే. భక్తుఁడును శిల్పియు నేది "సత్యం శివం సుందర"మో దానిని దర్శించుచున్నారు. ఈయంతస్తునందు నిద్దఱికిఁ గల భేదము నశించినది. కవి భక్తుఁడు; భక్తుఁడు కవి, శిల్పము మతము నొక్కటియే యైనది.

మొదటి యనాగరక దశయందు మానవుఁడు పశుప్రాయుఁడై కామ్యసౌఖ్యములతో సంతృప్తిపడియుండును. అంతకు మించిన సంతోషము నతఁ డెఱుఁగఁడు. రెండవ దశయందుఁ బ్రాపంచిక జ్ఞానము కొంత యుదయించి మనోవికృతులు శిక్షితములయి శాస్త్రములు శిల్పములు మున్నగువాని మూలమున నానందముఁ బొందును. మూఁడవదశయందు రానురాను అతని జ్ఞానము విశేషముగ నభివృద్ధి నొంది పూర్వమున కన్న శాశ్వతమైన యానందము నన్వేషింప మొదలిడును. అదియే యమృతానందము.

"ఏకం రూపం బహుధా యః కరోతి ......తమ్ ఆత్మస్థం యేఽను పశ్యంతి ధీరా, తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్.

ఒకరూపమును బహురూపములుగ నెవ్వఁడొనరించు చున్నాఁడో, ఆత్మస్థుఁడైన ఆ పరమాత్మను ఏ ధీరులు దర్శించుచున్నారో వారు శాశ్వతసుఖమును బొందుదురు. అన్యులు పొందరు. * శిల్పము తన యాదర్శకమును గ్రమక్రమముగ మార్చుకొని యెట్టకేలకీశాశ్వత సుఖమును మానవుల కందింపఁగలయంతటి యున్నతపదవి నారోహించినంగాని కృతకృత్యము కానేరదు.

---

* Fine art is not real art till it is in this sense free, and only achieves its highest task, when it has taken its place in the same sphere with religion and philosophy.

> "Hegel's philosophy of fine art"

# ప్రత్యక్షము

దుర్గుమహంతి సీతారామశర్మ గారు

శారదచంద్రికా సాగరాంతరమున, నింపుమీఱఁగ విహరించువేళఁ
పర్వతాగ్రమునుండి ప్రవహించు సెలయేటి, దరులందు హాయిగాఁ దిరుగువేళఁ
పచ్చనివరిచేలపై నాట్యమొనరించు, మొలకతెమ్మెరలతో మెలఁగువేళఁ
బాలభానుమయూఖ పంక్తితోఁ గ్రీడించు, వనధిభంగములఁ గన్గొనెడువేళఁ
చకితహరిణీవిహారవిశాలవిపిన, వీథుల శకుంతగీతము ల్వినెడువేళ
మొగమునందలి ముసిముసి నగవు లలరఁ, బరఁగఁ బ్రత్యక్షమగుచుండెఁ బ్రకృతిలక్ష్మి.

సీ. మలయశైలసమీర చలితశాఖాహస్త, యుగ మెత్తిపిలిచిన ట్లొక్కమాటు
తపనీయసన్నిభ స్తబక స్తనముల వ్రీ, డోద్ధతి మూయున ట్లొక్కమాటు
ప్రమద సంచారసారంగేక్షణంబుల, నోరఁజూపులఁ జూచి యొక్కమాటు
మధుకరగీతికా మహితగానంబున, నాఱడించినయట్టు లొక్కమాటు
లలితశాద్వలహరితచేలమును దాల్చి, హొయలఁ బయ్యెద సవరించు చొక్కమాటు
మొగమునందలిముసిముసి నగవు లలరఁ, బరఁగఁ బ్రత్యక్షమగుచుండెఁ బ్రకృతిలక్ష్మి.

సీ. గంగాస్రవంతీతరంగరంగములందు, లాస్యం బొనర్పఁ దలంచెనేమొ!
మింటఁ గేరుచునుండు మేఘకాంతలతోడ, నయ్యాట లాడఁగాఁ జనెదునేమొ!
వాసంతపికవధూపాధ్యాయయై సుధా, గానంబుఁ గరపఁగాఁ బూనునేమొ!
జలధిగంభీరనిస్వనములోఁ జేరిచి, ప్రణయగీతంబులఁ బాడునేమొ!
శ్యామలాంబరాలంబనక్షత్రహీర, హారములఁ దాల్చి కూర్మిఁ జెన్నారునేమొ!
కాని మందస్మితాననకాంతు లలరఁ, బరఁగఁ బ్రత్యక్షమగుచుండెఁ బ్రకృతిలక్ష్మి.

సీ. చిఱునవ్వువెన్నెల ల్గురిపించె దిచ్చోటఁ, గన్నీటికాల్వలు గార్చె నచట
బిగికౌఁగిలిని బూని పెనఁగె దిచటఁ గ, న్నెత్తిచూచినను గోపించు నచట
కనుసైగచేఁ బొందుఁ గావించె దిచటఁ జే, వట్టి లాగినను వీ ల్పాఱు నచట
రాగసంయుతవై విరాజిల్లె దిచట వి, రాగమే లెస్సని వేఁగె దచటఁ
దనువిలాసంబులను జూపఁ దలఁచె దిచట, వలసి యవకుంఠనము నూని మెలఁగె దచట.
నిట్టిమాయాపథంబు లిం కెవతె యెఱుఁగు, బళి! బళీ! నెఱజాణవే ప్రకృతిలక్ష్మి.

సీ. సంతతాధ్యాత్మిక జ్ఞానాభిమతసమా, వృతులగు పరమయోగీంద్రులైన
మధురభావతరంగ మాలికాతతి నూఁగి, రంజిల్లు సత్కవి రాజులైన
సకలవసుంధరాచక్రపాలనకళా, చతురులై వెల్గురాజన్యులైనఁ
బంచభూతముల సాధించి బంటులుగా నొ, నర్చి మెప్పొందు విజ్ఞానులైనఁ
దావకీనమర్మము లబోధ్యము లటంచు, నిపుణులై పరిశోధింప నేర్వలేక
మోసపోవుచు నున్నారు ముగ్ధులగుచు, బళిర!! కడుమాయలాడివే! ప్రకృతిలక్ష్మి.

# యెంకి పాటలు

పురాణం సూరిశాస్త్రి గారు, బి. ఏ.

మానవప్రతిష్ఠాపనమందు చక్రనేమిక్రమ మగుపడుచుండును. ప్రస్తుతకాలమందు శాస్త్రజ్ఞులు, శాస్త్రపరిశోధకులు, నీతిబోధకులు, కళోపాసకులు, చింతించు సమస్యలు మానవచరిత్రలో బలుమారు తలచూపి, యప్పటి మేధావులచే బరిష్కరింపబడుచు వచ్చినవి. మత నైతిక రాజకీయ సాంఘిక సమస్యాసందర్భములం దెటు లనో అటులనే కళావిషయములందుకూడ కొన్ని సమస్యలే, కొన్ని సంప్రశ్నములే, యభిరుచులే, ప్రపంచము దెల్లెడల గోచరించును. కాలదేశంబుల నొక్కొక్క విధముగ కళాస్వరూపము, వాఙ్మయరీతి, గౌరవ మొందుచుండినను మహామేధావులగు కవులు, శిల్పకులు, అది వరకు వన్నెకెక్కి ప్రస్తుతము వాసిదప్పిన వాఙ్మయరూపములను తేకొని వానిలో నవ్యభావముల బ్రకటించుచుందురు. ఇందుచేత కావ్య రూపములందు పరశవికాసమునకు బదులు ఆవర్తక్రమము లగుపడును. ప్రకృతిశాస్త్రములందును, వీనిపై నాధారపడిన యాయుర్వేదము, ఎంజినీయరింగు, పారిశ్రామిక ప్రయోగవిద్యలు మున్నగువానియం దును, కాలక్రమమున మార్పునొందు శేర్పడి ప్రాచీనరూపము లంతరించు చుండును. మానవ మానసప్రతిష్ఠితంబులగు మత సాంఘిక రాజకీయ నైతిక కళావిషయములు నాగరికతావికాసములో విప్పారుచుండినను వేర్వేరు దేశకాలములలో నివి యొక్కొక్క రూపమున జెన్నొంది నను, వీని ప్రాచీనరూపములు సంపూర్ణముగ నస్తమించవు. ఈనాటి మానవలోకమును బరిశీలించినయెడల నరుడున్న నైవదిమొదలు నేటివరకును బలకరించిన వికాససోపానము లన్నిటిని నిదర్శించు ప్రతి ష్ఠాపన లగుపడును. అభిరుచు లగుపడును. భావము లగుపడును. కావ్య చిత్ర శిల్ప రూపక సంగీతాది లలితకళల వికాససోపానము లన్నియు నీనాడుకూడ సమస్తదేశములలో నిలచియుండి, తద్రూప సంస్కారుల మెప్పువడయుచు, ప్రజానంద మొనగూర్చుచు, వినోద కారులై, జ్ఞానదాయకములై, యుపచరించుచున్నవి. కళాస్వరూప ములు అస్తమించవు. ఇవి, వివిధరకముల మానసవికాసమును, అభి రుచులను, దెలుపునవై వాని ప్రభావమున రూపుదాల్చినవి. మానవ లోకమందు బహురూపములగు సభ్యతలు, సంప్రదాయములు, అభి రుచులు, వ్యక్తమగుచుండును. అందుచే నన్నిరకముల రుచులను, ప్రకృతులను, రంజింపజేయు కళాస్వరూపము లుండవలెను.

కళయొక్క యుద్దేశ్యము మనోరంజనము. ప్రయోజనము; పరమార్థమున రసానందమును గలిగించుట; లౌకికార్థమున పరచింత దీర్చుట; నీతివర్తనమును పోషించుట. ఇవి సత్కళల నిత్యధర్మ ములు. మనోరంజకమగు సౌందర్యమంతయు, మానవు లాహ్లాదించెడి కళలన్నియు, నీతిమయమే, పరతత్వపూరితమే, పరమార్థసాధకమే. కళాస్వరూపము దానిని రచించెడి శిల్పకుల ప్రయోగచాతుర్యము ననుసరించియు, నాతడు సంశోధించు సామాజిక సంస్కారమును బట్టియు వేర్వేరువిధముల నుండవచ్చును. దేహ మనిత్యము. నిత్యమైన కావ్యాంతస్సారము పవిత్రోదారసద్భావశోభితంబై, వెలుగునప్పుడు దాని వెలుపలియునుపు లెట్టివైననేమి! పెద్దయల్లికలలో విచిత్ర బంధ చమత్కారములతో, దుష్కర పదజాలముతో, ప్రకటింప దగు నుత్తమభావములను తేనెలూరెడి తేటపలుకులతో సరసముగ సుబోధకంబుగ వర్ణింపగల ధీయుతులందు లేని వారిని మెచ్చకతీరునా! రససిద్ధులగు కవిగాయక శిల్పకులు, యేరాగమందైనను, వృత్తమం దైనను, శిలావర్ణసాహాయ్యమునమైనను, సమస్తరసభావావస్థల నుద్దీపింప గలిగియున్నారు. శిల్పకుని క్రియానైపుణ్యము వస్తుపరికరము లను, సాధనసౌకర్యములను, అతిక్రమించి సిద్ధధ్వజ మెత్తుచుండును. దీని నెరింగియే మన పెద్దలు 'క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోప కరణే' యని చాటియున్నారు.

కళాప్రపంచ చరిత్రమును పరిశీలించినయెడల కావ్యరూపక నృత్యసంగీతాదులు విద్యాసంస్కారవిహీనులైన ప్రాకృతజనంబుల రసావిష్టప్రలాపములం దుదయించిన ట్లగుపడును. మన దేశవాఙ్మ యమునకు వాల్మీకి యాదికవియనియు, పాశ్చాత్యకావ్యములు హోమరురచనలయం దుదయించెననియు, తెలుగుకవితలు నాగను కాసుని భారతాంధ్రీకరణముతో మొదలిడెననియు, విశ్వసించువారు కలరు. కాని యీ యాదికవుల కావ్యములు అంతకుపూర్వముండిన ప్రాకృతకవికల్పితంబులగు గేయ మాధుర్యమొప్పారు, గ్రామ్యగీతికా బీజములనుండి యుత్పన్నమైనవనుటకు సందియము లేదు. ఆదికవులు చాలవరకు ఆనాటి వాడుక పదములను, సంభాషణరీతులను, అనుసరించి యే రచియించిరి. మహాకవికృతులందు గ్రామ్యసంకాశవైఖరు లనం తముగ నగుపడును. రామాయణములో మిక్కిలి సారభూతముగదోచు 'రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్; అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్.' అను శ్లోకప్రకృతి సామాన్య సంభాష ణక్రమముల నంటియున్నది. ప్రాకృతగీతములలో నగపడు వీరదేవతా కథలు, రసములు, నీతిప్రవృత్తి, రమ్యావస్థాభివర్ణనము, మహాకావ్యము లందు విస్తరింపబడినవి. ప్రాకృతగీతములు ప్రకృతిని, కండ్లారజూచి రసావేశమొంది యథారూపముగ జిత్రించిన హృదయవైశాల్యమును, మనోనైర్మల్యమును, చిత్తశుద్ధిని, రసావేశమును, ప్రకటించును. మహాకవులగు వాల్మీకాదులు ప్రాకృతగీతికా మూర్తికలకు సద్భావముల

కేర్చి రసవత్సందర్భముల బెంచి, చమత్కారముగ జిత్రించి, నీతిని, పరమార్థమును, పరతత్వమును, ధీరోదారస్వభావములను, ఎక్కువ ప్రశంసించిరి. భావభారమునను, రససమృద్ధిని, ఆవేశ పారవశ్యమునను, వీరి ధోరణి కొన్నితావుల నుదారవిచిత్రపదాలంకృతమై కల్పన సంకీర్ణత చేర్పరచెను. వీరు సందర్భోచితముగు సహజపరిభాష నవలంబించిరి కాని, పనినడి నారికేళఫలపాకమునందు కైతలల్ల బూనలేదు. ఈ రహస్యమెఱుంగక తరువాతి కవులు ఆదికావ్యములలోని జటిలగభీర భాగములనే కావ్యాదర్శముగ గైకొని వాని రీతుల నవలంబించిరి. ప్రాకృతకవులు ప్రకృతినే రసభావముల నడబావిగ నెంచి రసావేశ సమృద్ధితో రసప్రధానములగు కావ్యములను గీతములను రచించుచుండిరి. ప్రాబంధికకవులు పూర్వకవికృతుల నాధారపరచుకొని కావ్యప్రపంచన మొనర్చుచుండిరి. ప్రాకృతగీతములు రసప్రధానములు; దేశీయపద సంకలితములు; జాతీయగీతికావైఖరుల ననుకరించునవి. ప్రబంధకావ్యములు, భావప్రధానములై విదేశీయపదజాలమును, విజాతీయవృత్త వైఖరులను, సంకీర్ణకల్పనాచమత్కారములను గల్గియున్నవి. ఇవి రాజపోషితములై పండితాభిమతములై, గ్రంథస్థములై, దేశమందు నిలచియున్నవి. చేటపలుకుల పల్లెటిరుమలీను యాలపాటలు దేశకాలావస్థానుకూలముగ నెప్పటికప్పుడు నవ్యవైఖరుల దాల్చుచు, జనసామాన్యమునకు ప్రధాన జ్ఞానదాయకసాధనములై పరగుచుండెను. వీనికి లౌకికసహాయ మమరకున్నను, స్వకీయరసపాటవముచే గ్రంథస్థ వాఙ్మయముకన్న నెక్కుడు వ్యాపకమొంది, కర్ణాకర్ణిగ జనులందు వ్యాపించుచుండెను. ఇవ్విధముగ ప్రతిదేశమందును రెండు వాఙ్మయ ప్రవాహములు, ప్రభువిద్వత్పోషితమైన లాక్షణికవాఙ్మయము, ప్రజాభిమతమైన ప్రాకృతవాఙ్మయము, స్వతంత్రముగ ప్రవహించుచుండెను. ప్రాకృతగీతములు గ్రంథస్థము కానికతన నంతరించుచుండినవి. కాని యెప్పటికప్పుడు కొందరు విద్వాంసులు, సరసులు, వీని పటిమను గుర్తించి, వీనిని వ్రాసుకొని నిలుపుచువచ్చిరి. కొందరు కవులు వీని ధోరణి ననుకరించి రచించుచుండిరి. శ్రీనాథుని పలనాటి వీరచరితము యిట్టి ప్రాకృతగీతికానుకరణప్రవృత్తిలో, నుదయించె ననుటకు సందియముండదు. కొందఱు రసజ్ఞులు, విమర్శకులు, వీని నభిమానించుచుండిరి. ఇందుచే నిరంతరము లిఖిత వాఙ్మయరూపములనుండి ప్రభవించిన లాక్షణికకవిత్వ మభిమానించువారికిని, ప్రాకృతరసావిష్టగీతికామాధుర్య మభినందించువారికిని, వాగ్వివాదలు జరుగుచుండెను. కాని, ప్రపంచపరిపాలనము రాజాధీనమువ నుండి, యధికారిభావములు మెప్పొందుచుండిన కాలములందు, సారస్వత సందర్భములలోగూడ లక్షణాధికార మెసగుచుండెను. ప్రస్తుత పరిస్థితులలో, సర్వసమత్వము, ప్రజాస్వామ్యము, మానవాదర్శమై పరగుకతన జనసామాన్యమును పెద్దలు గారవించుటయేకాక వారికి రుచించు కావ్యకళాదులనుగూడ నామోదించుచున్నారు. ఇంతకూ యీ వివాదమందలి ముఖ్యాంశము భాషావిషయికముకాదు; వృత్తి సంబంధికాదు. కావ్యము, రసమయమా? భావప్రధానమా? రసభావములు శోభిల్లునెడ ప్రాకృతకావ్యస్వరూపము లామోదింపదగునా? లేక యుదారరసభావప్రదీపనమున కుదారకల్పన వైచిత్ర్యము లవసరమా? అను సమస్యలే ప్రధానమైయున్నవి.

తెలుగుదేశము, ఆధునికకాలస్వభావము ననుసరించి ప్రజాభీష్టమగు కావ్యాదర్శముల గ్రహించుచున్నది. కొందరు రసజ్ఞులు ప్రాకృత గీతముల బ్రచురించుచున్నారు. విమర్శకులు, గ్రామ్యపదప్రయోగమును అభిమానించుచున్నారు. సాహితీసభ్యులు మున్నగు కవులు, కథకులు, లక్షణప్రశంసవంటకరౌ గ్రామ్యరీతులలో రసవత్కావ్యములను చిన్నికథలను గల్పించి వెదచల్లుచున్నారు. లక్షణాభిమానులు కొందరు యెంకిపాటలవంటి పలగాకికైతలు తెలుగుబాసకు ముప్పుదెచ్చునని వెరగొందుచున్నారు. గ్రామ్యగీతము లశ్లీలకథాసందర్భముల జిత్రించి యాంధ్రుల నీతిసత్వముల శెకలించునని కొంద రనుమానపడుచున్నారు. మఱికొందరు, ప్రజానురంజకమగు సారస్వత మాదరణీయమయ్యును, విశ్వత్కవులిట్టి నీచసారస్వత ముత్పత్తిచేయకూడదనియు, గ్రాంథిక వాఙ్మయంబున, యాలపాటల కాసాకార మొసంగకూడదనియు, విన్నవించుచున్నారు. వాఙ్మయప్రవాహముపారధాటీప్రాబల్యమున రసపుష్టిచే పెల్లివిరిసి దేశముల నాక్రమించుచున్నది.

యాలపాటలు నీతిబాహ్యములనియు, ప్రబంధకావ్యములు నీతిభరితములనియు, చెప్పజాలము. బూతుతెలపులు తేటపదములలో గూర్చబడినను, దుష్కరసమాసగర్భితములయ్యును, నింద్యములే యగును. యాలపాటలు సులభముగ వ్యక్తమగుగాన వీనిలోని నీచరసోద్ధతి యెక్కువ హానికరమని వాదింపవచ్చును. కాని, కళాస్వరూపములవలన నీత్యవినీతులు యేర్పడునని నమ్మజాలము. రామాయణము చదివినందున శ్రీరామసద్గుణము లలవడినవారును, రసావిష్టవాఙ్మయ పఠనంబున పోకిరులైనవారును, నాకగుపడరు. జనవాంతర సంస్కారఫలితముగను, యిహలోకసాంగత్యవిశేషమునను, పుట్టుకకు పుట్టెడు బుద్ధులే మానవుల నీతిపాతిత్యములకు గారణమగును. మనుష్యుని సాంఘిక మతనైతిక రాజకీయోద్యమముల లేనీడలు కళాస్వరూపముల వెలిగించవచ్చును. కాని, యివి ప్రత్యేకముగ కళాంశములుకావు. వీనిని పోషించవలసిన బాధ్యత కావ్యములకు లేదు. సౌందర్యనిరూపణమందు కళలు లౌకికమర్యాదల నతిక్రమించి నడచినను వానికి భిన్నముగ వర్తించినను లోపములేదు. అయినను, యెంకిపాటలు మున్నగు నవీనఖండకావ్యములలో విశ్వప్రణయసూత్రము లగుపడునే కాని శిచ్ఛృంగారసూచన లగుపడవు.

వ్యతిరేకవిమర్శకులు చాలవరకు తా మలవడిన కావ్యకళాసంప్రదాయములకు బానిసలై వానినే పరమప్రమాణములుగ నెంచుదురు. విద్య, విషయపరీక్షకు దోడ్పడు సాధనమై యుపచరించవలెనుగాని మనస్స్వాతంత్ర్యమును ద్రుంచు నిర్బంధశృంఖలముగ నాచరించకూడదు. అహంకారాభిమానముల వర్జించి కళాస్వరూపములను వాని ప్రత్యేకసంప్రదాయములలో పరిశీలించి బాహ్యవేషజప్రాగల్భ్యమునకును అంతస్సారపాటవమునకును గల భేద మరసి విమర్శింపవలసి

యుండును. ఇట్టి విశాలావలోకన మేర్పడిన సర్వసములే, రసపిపాసులే, సౌందర్యవిచక్షణులే, రసజ్ఞు లనిపించుకొందురు. వీరే విమర్శక వ్యాపార మవలంబింపదగుదురు.

ప్రాచీనకవులు రసభావపాటవ మేర్పడిన వస్తునిర్దేశములందు కొన్నితావుల శబ్దవైచిత్ర్య ముపయోగించి మెరుపింపజేసిరి. రసవాహిని గతియందు పట్టులలో మీదుమిక్కిలి హృదయావేదనను దెలుపవలసిన సందర్భములందు ప్రసిద్ధకవులందరు గ్రామ్యసంకాశ భాషాప్రయోగము నవలంబించుచుండిరి. నన్నయగారు, రాజసూయాధ్వర విజయసందర్భమున వర్ణించిన 'మదమాతంగతురంగ' పద్యములోని విషయము పేలవమగుటచే పదరత్నవిరచితాలంకారసౌందర్య మేర్పరచి రంజింపజేసెను. పోతన 'కలడందురు దీనులయెడ', 'మన సారథి మనసచివుడు' మున్నగు హృదయవిదారక రసవత్సందర్భములందు సంభాషణవైఖరుల రసవాహకసామర్థ్యమును నిదర్శించెను. గ్రామ్యఫణితు లొసంగెడి ప్రీతిని, ఒలికించెడి జీవకళను, గ్రాంథిక రీతు లేర్పరచజాలవు. 'మాకొలము తల్లిదండ్రు లదిగో యిదిగో యని చూడటారె' యిందుగల సొగసు, మర్మవిదారక స్వదేశ సంస్కృతి, 'నను నిముసంబు గానకయున్న నూరెల్ల నరయుమజ్జనకు డెంతడలునొక్కొ', యను పెద్దన ప్రయోగమందు గానరాదు. పూర్వకవులేమి, నవీనులేమి, గద్యపద్యముల జీవప్రతిష్ఠతతో రచించువారందరు సమకాలికసంభాషణవైఖరులనే యవలంబింతురు. భాషలు తమంతట దాము మిన్నలై యవతరించలేదు. ధీమంతుల భావపారితోషికములచే యెలికలబాసలకు సారస్వతగౌరవ మేర్పడినదికాని పదములకు స్వాభావిక నైచోన్నతులు లేవు. యాలపాటల భాషామర్యాదలను ఆక్షేపించవలసిన కారణ మగుపడదు. వాని కథాసందర్భములు, భావములు, రసస్ఫూర్తి నింతార విప్పిందినచో, వానివలన రసానంద మేర్పడి గుండెలు ఝల్లురని సౌందర్య సాక్షాత్కార మొదవినచో, వాని నొక కావ్యరూపముగ నేల యంగీకరింపకూడదో తెలియకున్నాము.

మర్మములవిడిచి యంతఃకరణతో మాటాడు సందర్భములందు మన ముపయోగించెడి పలుకుతెరవులే మనకు సహజమైనవి. అట్టి పలుకులే వాక్యగతులే వాణీవిలాసములే హృదయమర్మముల దాకి యులరించి, కరగించి విశ్వసనీయముగదోచి యుల్లము నుత్సాహపరచును. మన నిత్యజీవితమునకు సంబంధించని యలంకారచమత్కారము, వ్యాకరణ విశుద్ధత, లాక్షణిక కావ్యఫణితులు, విచిత్రరమణీయములై శిల్పనైపుణ్యసూచకములై యసాధారణకల్పనప్రభావమును జూపవచ్చును. కాని, హృదయమర్మముల గదలించి రసావేశ మేర్పరచజాలవు. ప్రాబంధిక ప్రణయసంభాషణములలో నొక్కటైనను 'నాకు నీకు జోడు అయితే మల్లెపూల తెప్పగట్టి తెప్పమీద తేలిపోదముపదరా' యను గ్రామగీతికతో సర్థగౌరవముందునా, శృంగారమర్యాదలందును, శయ్యామార్దవమందును సెనదైన దగుపడవు. ప్రబంధములలోని రసాడంబరము గుగ్గిలపు మంటవలె మిన్నంటి విప్పారియు గాల్పనేరదు. గ్రామ్యగీతము లత్యంత సుకుమారవాణీవిలాసశోభితములై యాబాలగోపాల మానందించు లలితసౌందర్యమున తెన్నొందుచున్నవి. దేశభాషలందు తెలుగు 'లెస్స.' అందున జనసామాన్య ముపయోగించు వాడుకపలుకు లద్వితీయగీతికామాధుర్యరాసులై తడియారుచుండును. ప్రాకృతాంధ్రము గానానుకూలమైనభాష. భక్తి శృంగారరసములు గేయకావ్యములందు మిక్కిలి రుచించుచుండును. ప్రాకృతజనంబులగీతికలు జాతీయగానవైఖరులలో గూర్పబడి, తమభాషయొక్క సంగీతప్రభావమును సంపూర్ణముగ తెలుపుచున్నను వీనిలో వైదుష్యప్రాగల్భ్యము, విజాతీయ సంపర్కము బొత్తుగ నగుపడదు. ఆంధ్రపదముల తేటసొబగులు ఆంధ్రజాతీయగీతికాక్రమముల లేతకాంతులతో మేళవించి ప్రాకృత జనసైజమగు విస్పష్టరసస్ఫూర్తితో యాలపాటలందు సాక్షాత్కరించును. వీని సొబగరింగి, యుపయోగమెరింగి, నవోన్మేషకరభావవాహకసామర్థ్యమును గుర్తించి, ప్రశంసనీయముగ చక్కని గేయకావ్యము లేర్పరచిన నండూరి సుబ్బారావుగారి నసామాన్య ప్రతిభావిరాజితులుగ నెంచక తీరదు. వీరి 'యెంకిపాటల'లోని గొన్నిటి నీయెడ రసభావ టీకాసమన్వితంబుగ వివరింపనున్నాను.

వలపులాడి, తనచిత్తమంతను ప్రియునకు వశపరచియున్నది లౌకికసంపదలను, ఆభరణాది పారితోషికములను ఆశించుటలేదు. 'పరసుకేమి కావాలి సంతనపిల్లా! నీవు మరమమిడిసి మన సియ్యనాయుడుబావా' ఎంతపవిత్రమైన, అమాయకమైనకోరిక! ప్రియుని ప్రణయమే యపేక్షించుచున్నది. తన కిట్టిలాభము కలుగకుండినను ప్రియుడు, 'సల్లగుండుటయే' వానియాయురారోగ్యసంపదలనే వాంఛించుచున్నది. 'నువ్వు సల్లగుండు పద్దాక నాయుడుబావా' అను వాక్యములలోకన్న 'ఆయుష్మాన్ భవ, విజయీభవ' మున్నగు గీర్వాణాశీర్వాదవాక్యములలో గల రస మగుపడదు. ఇందు సావిత్రితక్క, మరి యేప్రబంధనాయికయు, యెంకికి సరిరాదని చెప్పవచ్చును. యెంకి పలుకులు 'సల్లగుం'డనుటలోనే దాని యపారనిర్హేతుక ప్రేమస్వరూపమును జూపుచున్నది. దాని కడుపుదలుపు లేటపరచుచున్నది. 'ఏడనే నీకాపుర మెల్లుదుపిల్లా! నీ నీడలోనే మేడకడతా నాయుడు బావా!' మనోనాథుని జీవితమున కితరముగ నెంకి వర్తింపనేరదు. వలచిన మగడు స్వతంత్రపౌరుషప్రభావసంపన్నుడగు వాడు. యెంకి, వానితో నైక్యమొందనేరదు. వానిలో జేరజాలదు. కాని వాని ననుసరించి వానిప్రభావమున తనకొందు పద్ధతులలో జీవింపగలదు. మరియు నీడ, వస్తుభ్రాంతి నేర్పరచునుగాని వాస్తవస్థితి కలదికాదు. మానవదేహము, జీవితము, నీడవలె చంచలమై, యనిత్యమై యున్నది. ఇట్టి నీటిబుగ్గను తేనీడను వరించి తనమనోవాక్కాయకర్మముల వశపరచి తదర్పితజీవనయై చరించుటలో నిత్యసద్వస్తువును సాధింపగల యుత్తమప్రణయతత్త్వ మనుభూతమగుచున్నది. ఐహికమైన, సాంసారికమైన ప్రణయప్రశంసలలో వలపుచేతలలో, పరమార్థసాధకంబగు భక్తిసోపానపాదము లేర్పడుచున్నవి. మేడకడతాననుటలో నఖండమైన,

నిత్యమైన పరమైశ్వర్య మనుభవింతురని యర్థము. ఈ దైశ్వర్యానుభూతికి యలౌకిక సాధనములు వేరొండు లేవు. బాల్యకౌమారయౌవన జరావస్థలలో మనకభిముఖమగు వస్తుప్రపంచమే మనల నాకర్షించి సంగసంపర్క మేర్పరచి, రాగద్వేషపూరితుల గావించి, కర్మనిబద్ధుల జేయు లౌకికసందర్భములే, సరియైనరీతిని వాడబడినచో లోతుచూపున జూడబడినచో, నిత్యైశ్వర్యవిభూతు లొసంగగలవు. లోకమంతయు పరమేశ్వరుని నీడ. మన మానవసంకల్పము లిందుననే చెలగాటలాడుచు, మనోరథపరంపరల నూహించి సాధించుకొనుచు, దురాశాదుర్మోహనిబద్ధములై లౌకికసంపదల నరయగలవు. అటుకాక నిస్సంగముగ, నిరపేక్షగ, వర్తించువార లీలోకవిషయములందే పరమైశ్వర్యసాధకంబగు విశుద్ధ ప్రణయశిక్ష నొందగలరు. అనిత్యానిత్యమగు లోకమే మనల కర్మబద్ధుల గావించుటకును, మోక్షసిద్ధుల నొసగుటకును, ఉపయోగించుచున్నది. ఎంకి పరతత్త్వసాయుజ్య మపేక్షించు సాధకజీవము. నాయుడుబావ నిత్యసద్గుణసంపద్విలాసితుడగు పరతత్త్వము. భక్తియోగ రహస్యముల నీ పాటయందు పల్లెటి పలుపురూపులో, నమేయభావగాంభీర్యమును, అమాయక ప్రణయాలాపముననే పొందుపరచి చూపియున్నాడు.

"ఎవక జల్మములోన ఎవరకౌ" నంటి,
సిగ్గొచ్చి నవ్వింది చిలక — నాఎంకి,
........ ......
"ముందు మన కేజన్మముందో లె" యంటి,
తెలతెల్లబోయింది పిల్ల — నాఎంకి,
..............
"ఎన్నాళ్లు మనకీలె యీ సుకము" లంటే,
కంట నీరెట్టింది జంట నాఎంకి"

ప్రాక్తనవాసనాఫలితముగ పతి పత్నీ సుతాదు లేర్పడుచుందురు. మనుష్యుడు కార్యకారణ సంబంధ మరయు హేతువాదములో జీవకోటిని అతిశయించుచున్నాడు. ప్రస్తుత మనుభవించెడి సిరిసంపదలతో, ననుకూలపరిస్థితులతో, యదృచ్ఛాసంప్రాప్తములుగ నెంచి సంతసింతక, నవి భూతభవిష్యత్తులందుకూడ నెటులుండెనో, ఉండబోవునో, యను నాలోచనయందు రమించుచుండును. ఈనాటి ప్రియవస్తువులన్నీ చిరంతనముగ తనదై తనవెంట నెన్నంటివచ్చినదను తలపులో నొక వింతసంతస మొందుచుండును. లౌకికపదప్రముఖు లగువారు తమ యున్నతపదవికి వంశపారంపర్య మేర్పరచుకొనుచుందురు. ఎంకి పూర్వజన్మములోకూడ తన్నెడబాయని యర్ధాంగిగ నుండెనని యామెచే చెప్పించుటయందీ నాయకు డుత్సాహియై యుండవచ్చును. లేక, యిప్పటి ప్రణయప్రసంగములు కార్యరూపమును దాల్చియుండినయెడల 'నేను నీభార్య' నని చెప్పించువేడుక యాతని డెందమున దలయెత్తియుండవచ్చును. ఈతని ప్రశ్నమునకు సూటిగ జవాబీయక 'సిగ్గొచ్చి నవ్వింది చిలక నాఎంకి' యనుటలో పై యర్థమును సూచించుచు వైవాహికక్రియవలన నదివరకు బద్ధులుగ నలను చుండిన ప్రియురాండ్ర కేర్పడు లజ్జను రమ్యముగ సరసముగ జిత్రించియున్నాడు. భార్యసురతవ్యాపారలీలానిధి యుభయులపట్ల నొకింత వెలుపరింపుతో గూడియుండును. వైవాహికధర్మమందు ప్రణయసందర్భములు భక్తివిశ్వాసలజ్జాసమన్వితములై, రసోద్రేక మెరుంగని, బాహాటార్భట మంతరించిన, శాతతకులతో నసుపడుచుండును. జననాంతరసంబంధవశమున పూర్వతపఃఫలముగ, నిహలోకమందు ఎంకి తనమనోనాథుని గూడియుండవచ్చును. భూతస్థితి కార్యకారణసంబంధవిచారణచే కొంతవరకు నిరూపించవచ్చును. కాని, భావిపరిణామ మెటులుండునో? ఇందెవరి సంస్కార మేరీతిగ బరిణమించి భావిజన్మలో నెట్టిరూపము నొసంగునో? ప్రస్తుతానందసంతృప్తిలో పరిచినకష్టముల మరచి, సుఖఫలోపేతములుగ భావించి, సమన్వయించుకొనవచ్చును. కాని భావిస్థితిని యాలోచించునపు డెవ్వని మానసమైన దల్లడిల్లక మానదు. భావిస్థితి తెలియనందుననే వైవాహికదేహవిసర్జనానురూపమగు మరణము భీతావహ మగుచున్నది. భావిజన్మలో యిష్టార్థసిద్ధి గల్గునో గలుగదో యను శంకచే, ఎంకి తెలతెల్ల బోవచ్చు. లేక నాయకుడీ ఐహికసౌఖ్యముల, దేహసంబంధముల, నిరంతరవ్యాప్తి నపేక్షించుచుండ ఎంకి (సాధకురాలు, సంసారపరివర్తనముతో విసిగి వేసారిన జీవుడు సర్వేశ్వరమోక్షోపలబ్ధిని కాంక్షించుచు సంబంధవినాశ మన్వేషించుచు) నాయకు డడిగిన ప్రశ్నమున కచ్చెరువంది వెలవెలబారి యుండవచ్చును. సృష్టిక్రియానిరతుడగు పరమేశ్వరుడు జీవులనెల్ల విశ్వవ్యవహార నిర్వాహక ప్రవృత్తిలో నుండ గోరుచుండును. ముముక్షువులగు సాధకులు సంసారపరివర్తనంబులనుండి తప్పించుకొని విశ్వవ్యాపారములకు దూరముగనుండు నిత్యసంస్థితి నపేక్షించుచుందురు. శ్రీమద్గీతయందు చెప్పినట్టుల, జీవవాహిని యనంతముగ బారుచు 'అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత! అవ్యక్తనిధనాన్యేవ' అనునటులు భూతభవిష్యత్తు లగోచరములై సంశయాస్పదములై నమ్మరానివై భావరూపులై యున్నవి. ఎన్నివిద్దెల గరచినను, విజ్ఞానప్రపంచమెల్ల శోధించి విచారించినను, భూతభవిష్యత్స్వరూపముల దెలియజెప్పినవారు, జీవుని భావిగతు లరసి తేటపరచినవారు, అగుపడరు. అందుచే రేయింబవళ్లు నిష్ప్రయోజనముగ భావిస్థితినిగూర్చి చింతించి, విసుగొంది, దరిగానక విలపించుకన్న వైవాహికముగ వర్తమానపరిస్థితులనే నిత్యముగనమ్మి, ఇహలోకఫలములతో సంతుష్టిచెంది, సదానంద భరితులమై, మన జీవితకాలమును గడుపుటుచితమని సాగరికకవిపుంగవు డభిప్రాయపడుచున్నాడు. రసోన్మాదమొంది నిత్యానందములో చీకుచింతలులేక జీవితకాలమును గడుపవలయునని యోమారుఖయ్యా ముపదేశించుచున్నాడు. అపవిత్రదుర్నీతి ప్రసంగములతో పొద్దు చేసుకొనుమని యీతని యభిప్రాయముకాదు. నిత్యానందపరవశులై, జీవయాత్రలో దాపరించెడి మంచిచెడ్డల నన్నిటిని సుఖానందసంధాయకంబులుగ నన్వయించుకొని, యోగియై, నివసింపవలెనని యీతని తలంపు. కొందరు వేదాంతులు 'ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనమ్' మన్నను భావములతో

'వెలగీవెలగీజ్యోతీ వలసిపోయేటప్పుడు ప్రమిదతో నొకమాట చెప్పి పోయినదా' యను తలంపున నైహికసంబంధము లనిత్యమనియు, నైహికసంసార మొక భ్రాంతియనియు, దీనిలో ముప్పాలమున్నీరు తక్క వేరొండు సుఖమెద్దియు గోచరింపదనియు, 'తస్మాత్ జాగ్రత జాగ్రత' యనుచున్నారు. యెంకికి, వెనుక సంగతి తెలియదు. కాని ప్రస్తుతస్థితినిబట్టి వెనుకసంగతి యూహింపగలదు. భావిగతి యయోమయము. అందుచే ప్రస్తుతస్థితిలోనే వర్తమానజీవన ప్రపంచమందే తన ప్రణయసాధనను, భక్తిప్రేమములను, ప్రవర్తించి పరమానంద మొందవలయుచున్నది. కాని, భక్తిసాధన ప్రవృత్తిలో నున్న జీవుడు నిత్యానందపరవశుడై, ముందువెనుకల మరచి, చిందులాడుచున్నను, దేహసంబంధమున సంప్రాప్తమగు సుఖదుఃఖములకును, కష్టనిష్ఠురములకును, వగవకమానడు. 'యెన్నాళ్ల యీసుఖము' లనియడుగ నిర్గ నిశ్చలసుఖానుభవ మీజగమున దొరకదను సూచనలో సుఖదుఃఖము లీయుపాధిధర్మములనుతలంపులో, 'కంటనీరెట్టింది జంటనాయెంకి.' యీ గీతికారత్నమందు సుబ్బారావుగారు అసదృశ రసవైభవములో నగాధతత్త్వార్థముల దెలిపి, యోగామరుభయ్య మొసంగిన యుపదేశములనే బలపరచియున్నారు. కాని, యీభావములను భావ్యము విచారకరముగ నయోమయముగ వెలువరించియుండ, సుబ్బారావుగారు, మనోహరసుకుమార నిరూపణ మొసంగి యున్నారు. వీరి యెంకిపాటలలో నెలుగొందు తత్త్వార్థములు విశిష్టాద్వైతపరముగ నున్నవనుటకు సందియముండదు. ఇంతియనే కాదు. రూపకల్పన మెచ్చట గలదో జీవాత్మపరమాత్మల సంబంధము తేరయిన కావ్యరూపమును దాల్చినదో, చిత్రశిల్పాదినిరూపణ మొందినదో, అచ్చటనెల్ల విశిష్టాద్వైత భావన క్రమములే యగుపడును. అద్వైతసిద్ధాంత మొక నాస్తికవాదము; విశ్వసౌందర్యమును మూలంట పెకలించు, భక్తినిర్మూలన మొనర్చు శస్త్రవిద్య. భగవద్గీతలు, ఉపనిషత్తులు, వేదాంతసూత్రములు, భాష్యములు మున్నగువానిలో నద్వైతసిద్ధాంతములు రాజిల్లుచుండునుగాని భాగవత రామాయణాది కావ్యములందు జీవుని సాధకుడుగను, వియోగదుఃఖ మనుభవించెడి వలపుకత్తెగను, పరమేశ్వరుని సిద్ధిస్వరూపముగను చిత్రించు విశిష్టాద్వైతమర్యాదలే గోచరించును.

'యెంకిపయన' మను పాటలో 'పడుకుంటే నాకేటో ప్రబువు పుట్టినాడీ కడుపులో పెర్యేసి కలిపేసినాడీ!'

అని యొకచక్కని స్వప్నవృత్తాంతమును ముచ్చటలీన చిత్రించియున్నారు. 'అంపల్లె బొమ్మల్లె, అద్దాలబరిణల్లె సుక్కల్లె నాయెంకి, సురిగిపోయిం దంట' తిరుపతియాత్రలో ఏడుకొండలవాని జాడ బోయెడి పల్లెటియాత్రికుల ప్రయాణసన్నాహ మత్యంతవిలాస యుక్తముగ వర్ణింపబడినది. 'ఆసామీ మీదెన్నో పూనాలాడూకొంటూ, కొండమెక్కాలి' యనుటలో 'అడుగడుగు దణ్ణాలవాడా, ఆపదమొక్కులవాడా' అను భావమును జూపించియు, యెంకన్న చేయవలసిన ఘనకార్యము, 'తేతిరిపగలేల కొప్పెయ్య కంకీని సల్లంగ నూడిమాని సామితో సెప్పాలి' అనుకుంటున్నాడు మన నాయకుడు. ఇది యెంకిస్వభావ సిద్ధముగ నున్నదో చూడండి!

కాని, యీప్రణయపటుత్వము కాలప్రభావమున నొకింత మబ్బుమాసిన ట్లగుపడును. 'పాటఃనుండే యెంకి సటకు రాజేగావ ?' యను పాటలో యెంకికి జబ్బువచ్చినప్పుడు తన విచారమును జూపుచు 'రంగులైన చీరకట్టి, బజారంచురవికతొడిగి, బజారుపాలైతివే రమణి ముద్దులగుమ్మ.' 'బందారుకైలు రెండుకూ, గుంటూరు మాకామెందుకూ, రాధారి చీటిరెండుకూ, పదిమందీ గూడేదెందుకో, అల్లుడా మేనల్లుడా!' మున్నగు జాలికరమగు పాటలలో విలసిల్లు కావ్యధోరణి యగుపడుచున్నది. విరహవేదనలో తన సంచారిభావముల ప్రకటించిన తెరంగు "అకాలపు యెంకి" అనుదానిలో నగుపడును.

మనదేశములో జాతియోద్యమ మారంభించినదిమొదలు సుప్రసిద్ధమగు జాతీయగీతికాఘంటులలో నవ్యభావముల ప్రకటింపసాగిరి. పాశ్చాత్యుల ననుకరించెడి నాటక గీతికాక్రమముల నవలంబించి, యూడు వారి పాటలు ప్రాచీనమనోహర లాలిత్యమును దప్పియున్నను, మేలుకొలుపు, జోల, లాలిపాటలు, దసరాపద్యములు, మున్నగు నచ్చతెనుంగు తెరవుల ననేక రమ్యకావ్యము లుదయించినవి. తరువాత యాలపాటలను మావోంట్లు సాహసించి ప్రచురింపసాగిరి వల్లూరు, జగన్నాథరావుగారు, ప్రాకృతాంధ్రగీత క్రమములలో పెక్కుసంఘసంస్కరణ భావోద్దీపకంబులగు పాటల గల్పించి, గ్రామఫోను సహాయమున ప్రకాశింపజేసియున్నారు. మనదేశములోని యుత్సాహవంతుల మాటనొప్పున కొందరు పండితాగ్రేసరులు, విద్వత్కవులు, యీల పాటల సరసలావణ్య మభినందించియున్నారు. శాస్త్రవాఙ్మయము, భావప్రధానమై ప్రపంచములోని నానాదేశముల విజ్ఞా లోపంగిక యనుభవపారిలోషికము నందికొనుచు, సంస్కృతాంగ్లేయాది విదేశపదజాలముతో, సమర్థింపవలసి యున్నది; కాని, రసప్రధానమగు కావ్యముల కిట్టి యన్యాశ్రయ మనవసరము. మనుష్యుని, రసానుభవముల గమ్మగ, తీయగ, వెలిగించు సుకుమారమనోహర పదజాల మన్నిజాతులకు, జాతీయభావములకును, స్వాభావికముగ నేర్పడియున్నది. ఇట్టి పలుకు విరులతో, స్వతంత్రవికాసమొందిన జాతీయ గీతికా గమకములతో- చక్కని, చల్లని, కైతదండ లల్లవచ్చును. సుబ్బారావుగారి, మార్గదర్శక స్వాతంత్ర్య మభినందించుచు, నిట్టితెరవున నశేష ప్రయత్నములు జరుగదగునని వేడుచున్నాము.

# ఆంధ్ర బాలరామాయణము

ఆదిపూడి సోమనాథరావు గారు

శ్రీ హరిఁదలంచి వాల్మీకిఁ బ్రీతినెంచి
సకలసుకవీంద్రులను మది సంస్మరించి
యాంధ్ర మొనరించి బాలరామాయణమ్ము
సంకితం బిత్తుఁ గైకొనుఁ డాంధ్రులార! ౧

గీ. వేదనిరతుఁ దపోవ్రతు విమలచరితుఁ
జతురవచనవినోదు విజ్ఞానమోదుఁ
బుణ్యు సతిధన్యు నారదమునివరేణ్యు
సత్తపోనిధి వాల్మీకి యడిగె నిట్లు ౨

సీ. సుగుణవారాశియై సొంపుగుల్కెడువాఁడు
వీర్యవంతుఁడయి వెలయువాఁడు
ధర్మమ్ములెల్లను దఱచిచూచినవాఁడు
మేనును మఱవక మెలఁగువాఁడు
అఖిలార్తు లాదవిన నాడితప్పనివాఁడు
దృఢమతిఁ గార్యముల్ దీర్చువాఁడు
పుడమి నెల్లరు మెచ్చ నడవడిగలవాఁడు
కరుణఁ బ్రాణులనెల్ల నరయువాఁడు

గీ. అన్నివిద్దెల నెఱజాణ యైనవాఁడు
ధర్మరతుఁడదత్కుఁడై తనరువాఁడు
ప్రజకుఁ బ్రియదర్శనుండయి వఱలువాఁడు
ప్రస్తుతంబున నెవ్వాఁడు వసుధఁ గలఁడు? 3

సీ. ప్రబలహా నాత్మ ప్రభావంబుచే నొప్పి
పరమయోగీంద్రుఁడై పరఁగువాఁడు
భావంబులోఁ జొచ్చి పాపంబులకు నీడ్చు
క్రోధాదులను జెఱగొన్నవాఁడు
కమనీయతర దేహకాంతిచే నొప్పారి
యాత్మతేజంబుచే నలరువాఁడు
పరు లెంతవృద్ధిని బడయుచునుండినఁ
గడకింతయు నసూయపడనివాఁడు

గీ. అలుక జనియించి యాజిలో నిలిచెనేని
సమరులనునైన గడగడ లాడఁజేయు
ఘనతరంబైన విక్రమక్రమమువాఁడు
ప్రస్తుతంబున నెవ్వాఁడు వసుధఁగలఁడు? ౪

గీ. ఎఱుఁగఁగల నీవె కావున ఋషివరేణ్య!
తెలియఁ గడువేడ్కపడునాకుఁ దెలుపుమనిన
ముజ్జగమెఱుంగునారదముని చెలంగి
వినుము దెల్పెద నని యిట్లు విశదపఱిచె ౫

గీ. నీవువర్ణించిపేర్కొన్న నిఖిలసుగుణ
గణముగలవాఁడు జగమునఁ గలుగు టరుదు
అయిన నిక్ష్వాకుకులజుఁడై యలరువాఁడు
ఖ్యాతుఁ డొక్కఁడు గలఁడు రామాఖ్యుఁడతఁడు. ౬

సీ. బలిసి విశాలమై పరఁగువక్షమువాఁడు
చెల్వుగులుక్కుచునుండు శిరమువాఁడు
ఎంతయుఁ జేవులంటు నెగుబుజమ్ములవాఁడు
వ్రేలి మోకాల్దాఁకు కేలువాఁడు
కంతువిల్ పోలిన కనుబొమల్ గలవాఁడు
డంబుమీఱినలలాటంబువాఁడు
సమముగా నొప్పెడు సర్వాంగములవాఁడు
మిసమిసల్ గల నునుమేనివాఁడు

గీ. అగుపడకయుండు బాహుమూలాస్థివాఁడు
చెన్నుమీఱిన చెక్కిలి చెలఁగువాఁడు
శంఖసుందరకంఠదేశమ్మువాఁడు
తమ్మిరేకుల మించునేత్రములవాఁడు. ౭

సీ. కడుగొప్పవిలుదాల్చి యడరి వైరులగుండె
లవియంగఁ జేయుశౌర్యంబువాఁడు
బహిరంతరింద్రియవర్గంబు నిర్జించి
నిర్మలాత్మకుఁడయి నెగడువాఁడు

వేదధనుర్వేద వేదాంత శాస్త్రార్థ
వేదియై వాగ్మియై వెలయువాఁడు
ధర్మజ్ఞుఁడై తాను ధర్మంబులో నుండి
పరుల ధర్మమునందుఁ బఱపువాఁడు

గీ. మించు ప్రేమను జనులఁ బాలించువాఁడు
ధైర్యమును వీడి ధీరుఁడై తనరువాఁడు
సిరిగలిగి సత్యకీర్తుల మెఱయువాఁడు
చెప్పుటకు బ్రహ్మసముఁడయి యొప్పువాఁడు. ౮

క. అందఱకును బ్రియదర్శనుఁ
డందఱకుం బ్రియుఁడు సాధు వనవరతంబున్
సందర మానదులకువలె
నందఱ కార్యులకు గమ్యుఁడై యతఁడొప్పున్. ౯

సీ. గంభీరగుణమునఁ గడలిఁబోలినవాఁడు
వీర్యంబునను విష్ణువిధమువాఁడు
ధైర్యాన హిమగిరిఁదలఁపుఁగొల్పెడువాఁడు
ఈవిఁ గుబేరుతో నెనయువాఁడు
కోపానఁ బ్రళయాగ్నిఁ దోఁపఁజేసెడువాఁడు
క్షమలోన భూదేవి సాటివాఁడు
సమవర్తనంబున జముఁడనఁ దగువాఁడు
ప్రియదర్శనమున రేఱేనిసముఁడు
గీ. చులుకఁదనమును జ్ఞప్తియుఁ జొరవగల్గు
బుద్ధిచేతను నీతిచేఁ బొదలువాఁడు
ప్రీతిఁ గౌసల్య కెంతయుఁ బెంచువాఁడు
అఖిలశుభలక్షణోపేతుఁ డయినవాఁడు. ౧౦

గీ. ఇట్టినిజమైనవిక్రమ మెసఁగువాని
జనులహితమునె ప్రేమచే సలుపువాని
నుత్తమగుణాళి నెంతయు నొప్పువాని
బ్రియుని రాముని సుతులలోఁ బెద్దవాని. ౧౧

గీ. యౌవరాజ్యాభిషిక్తుఁ జేయంగ నెంచెఁ
బ్రజకుఁ బ్రియమిడ ధశరథ ప్రభువరుండు
పరగుచున్నట్టిసంభ్రమ సరణిఁజూచి
యుర్విపతిసతి కైక దా నోర్వలేక. ౧౨

గీ. చేరి నృపతిని దనకు మున్ జేసియున్న
రెండువాగ్దానముల చేత రెంటి నడిగె
వనమునకు రామునంపెడు వరము నొకటి
భరతుఁ దనసుతు దొరఁజేయు వరమదొకటి. ౧౩

గీ. సత్యమతి రాజుధర్మపాశమ్ము చేతఁ
గట్టువడి రాముఁ బ్రియపుత్త్రుఁ గాన కనుప
వీరుఁ డతఁడేగెఁ గైకకుఁ బ్రియముఁ గూర్ప
జనకునాజ్ఞయుఁ దన ప్రతిజ్ఞయును దీర్ప. ౧౪

గీ. వదలిచను ప్రియు నన్నను వదలలేక
ప్రేమ నెంతయుఁ జూపుచు వెంట నరిగె
వరసుమిత్త్రాంబికానందవర్ధనుండు
లక్ష్మణాఖ్యుండు వినయసల్లక్షణుండు. ౧౫

గీ. చంద్రు వెంబడి రోహిణి చనెడునట్లు
ప్రాణసము విభు రాము వెంబడిని జనియె
సద్గుణోపేత జనకవంశప్రసూత
సత్సతీఖ్యాత దేవ్యంశజాత సీత. ౧౬

గీ. ఎంత మోదవ్వ పౌరులు గొంతదవ్వ
దశరథుఁడు వెంబడింపఁగాఁ దరలితరలి
చేరి రాముప్వురును శృంగిబేరపురము
గంగదరి బోయతేనిదే కాఁపురమ్ము. ౧౭

గీ. అంత సారథి మరలిపో నాజ్ఞ సేసి
ప్రేమఁజూపిన గుహునితోఁ బ్రియము నెఱపి
దాఁటి రాతఁడు సాయంబుఁ దమకొసంగ
సమలజలవృద్ధిఁ బొదలు గంగాదినదులు. ౧౮

గీ. జానకీదేవితోడ లక్ష్మణునితోడ
నడపులం దాటతోఁటలం దటులు దిరిగి
మునిభరద్వాజునాజ్ఞ రాముండు చేరె
చిత్రకూటంబు మునిజనశ్రీకుటుంబు. ౧౯

గీ. ఒప్పమీఱంగ నాకుటి ల్లొకటి గట్టి
యందుఁ గ్రీడించుచుండి రానందముగను
దేవగంధర్వులట్టులు తేజరిల్లు
జానకీరామచంద్రలక్ష్మణులు ముప్వురు. ౨౦

గీ. చిత్రకూటాద్రిపైని వసించుచుండఁ
బుత్రశోకార్తుఁడగుటను బుత్రుమీఁది
దలఁచి వగచుచుఁ జనె స్వర్గధామమునకు
సత్యవిభవుండు దశరథక్ష్మాధవుండు. ౨౧

గీ. అవ్వసిష్ఠాదు లెంతయు నర్థించుచుఁ
బట్టముం గట్టఁ గడఁగిరి భరతునకును
గాని భరతుఁడు రామసేవానురతుఁడు
దాని కొడఁబడ కడవికిఁ దరలిపోయె. ౨౨

గీ. ఆర్యుఁ డతఁడు మహాత్ముని నన్నఁ జేరి
ధర్మము నెఱింగి వర్తించు ధర్మధుర్య!
రాజ్య మిది నీది గైకొమ్ము భ్రాతృవర్య!
యంచుఁ బ్రార్థించె సాష్టాంగ మాచరించె. ౨౩

గీ. కీర్తిబలదానకరుణానువర్తి రాముఁ
డాత్మపితృవాజ్ఞఁ దలఁచి రాజ్యంబు గొనక
తనకు మాఱుగఁ బాదుకల్ దయనొసంగి
భరతు మఱిమఱి సమ్మతిపఱిచి పనిచె. ౨౪

క. తనకోర్కెఁ గనమి భరతుఁడు
చని నందిగ్రామ మగ్రజన్మపావముల్
మనసారఁ గొల్చె రాముఁ
గనుఁగొనఁగా వేచెఁ బ్రజల గరుణఁ బ్రోచెన్. ౨౫

క. అటులంపి భరతు నంతట
నటనుండినఁ దనకుఁ బ్రజల యటమటగలుగున్
దిటమని యాసత్యవ్రతుఁ
డట నుండుటమాని దండకాటవిఁ జొచ్చెన్. ౨౬

క. చొచ్చి మహారణ్యంబున
వచ్చివిరాధాఖ్య నసురు రఘుకులరత్నం
బచ్చేరువఁ జని కనుఁగొనె
నచ్చెరువిడు నతిశుభాంగు నాశరభంగున్. ౨౭

క. కనె రవితేజు సుతీక్ష్ణున్
గనుఁగొనియె నగస్త్యు నతఁడు గరుణ నొసంగన్
గొనె నక్షయశరనిధిఁ బాది
సునిశితఖడ్గంబు నైంద్ర శుభచాపంబున్. ౨౮

క. అంత నగస్త్యభ్రాతన్
గెంత నగునంత వచ్చి చేరి గుములై
కాంతారపుమునులందఱు
సంతసమున రఘుకులాబ్ధిచంద్రునిఁ జూడన్. ౨౯

గీ. అతులచండాగ్నిదీప్తిమండితులు ఋషులు
దండకావాసు లాతనిదండఁ జేరి
రక్కసులఁ గూల్ప నెంతయు నొక్కి తెల్ప
శరణు కరుణాసుధాబ్ధి దాశరథి యొసఁగె. ౩౦

క. అసురజనస్థానంబున
వసియించెడుచుప్పనాతి వాంఛితరూపం
బెసఁగ ధరించెడుటక్కరి
యసమవిరూపంబు నొందె నాతనిచేతన్. ౩౧

గీ. చని జనస్థానమున కది జగడమునకు
నచటిఖరదూషణత్రిశి రాదిదనుజ
నాయకులఁ గొల్పఁగాఁ బదు నాల్గువేల
మేటిరక్కసు లారాము మీఁదఁ బడిరి. ౩౨

గీ. అంత రాముఁడు ఘోరరణాంగణమునఁ
దెక్కచెండాడి యందఱ నుక్కడంచె
బంధువధ విని యాదశకంధరుండు
నిండుకోపభరమ్మున మండిపడియె. ౩౩

గీ. రాము సాధింపఁగా నెంచి రావణుండు
ప్రీతితో సాయపడఁగ మారీచు గోరెఁ
దగదు బలవంతుఁడగ యన్నఁ దలఁపఁడయ్యె
హితులమాటలు కాలచోదితుఁడు వినునె? ౩౪

గీ. రామునాశ్రమభూమికి రావణుండు
చనెను మారీచుతోఁ గూడి సత్వరముగ
మాయచేతను రామలక్ష్మణులఁ గొనుచు
దవ్వులకు నేగ మారీచుఁ డవ్వనమున. ౩౫

గీ. రావణుండును రామునిరాణియైన
యంగనామణి జానకి నపహరించె
నద్భుతంబుగ నొప్పశౌర్యంబుతోడ
నడ్డపడినజటాయువు నట్టె కూల్చె. ౩౬

గీ. పరమపావనసతి సీత పాపిచేతఁ
బడుటకు జటాయు వడ్డము పడి పడుటకు
నుల్లమెంతయు వగఁ గుంది తల్లడిల్ల
రాలఁ గన్నీరు విలపించె రాఘవుండు. ౩౭

గీ. స్వాంతమును గాల్చుచుండు శోకాగ్ని చేత
వహ్ని సంస్కార మొనరించి పక్షిపతికి
రామ వెదకుచుఁ బోయి యారాముఁ డెదుటఁ
గనెఁ గబంధాఖ్య నసురు వికారు ఘోరు. ౩౮

గీ. వాని వధియించి దహియించి స్వర్గ మనిచి
యతఁడు చెప్పినమార్గమ్ము ననుసరించి
శ్రమణి ధర్మానుసారిణి శబరిఁ గాంచి
తన్మహోదారభక్తి కెంతయును మెచ్చె. ౩౯

గీ. అరులఁ దెగటార్ప నేర్పొప్ప నతులభూరి
విక్రమవిహారి సత్పదవీప్రచారి
యమ్మనోహారి పంపాతటమ్ముఁ జేరి
కాంచె హనుమంతు ధీమంతుఁ గాంతిమంతు. ౪౦

క. పావనియగు హనుమంతుఁడు
పావనుఁడగు రాఘవునకుఁ బరమాప్తుఁడు సు
గ్రీవుఁడని చూప నతను
గ్రీవుని నతఁ డాత్మ నెంచెఁ బ్రియమిత్రునిగా. ౪౧

గీ. తనకతను దెల్పి తరువాతఁ దనసతికత
నృపతి వివరింపఁగా విని కపివరుండు
చెలిమి నెఱపంగ నగ్నిసాక్షికముగాఁగ
బాసఁ జేసెను శ్రీరామభద్రుతోడ. ౪౨

గీ. అప్పుఁడగు రామభద్రుతో నార్తుఁడైన
కపివరుఁడు వాలివిద్వేషకారణమును
దెలుప విని వాలిఁ జంపగా నలిచెఁ బ్రతిన
రామచంద్రుండు సత్యపరాక్రముండు. ౪౩

గీ. వాలిబలశౌర్యములనెల్లఁ బ్రస్తుతించి
చాలునే వాలిఁ జంప నృపాలుఁ డంచు
సంశయించుచునుండెను స్వాంతమందు
రామశౌర్యానభిజ్ఞుండు రవిసుతుండు. ౪౪

గీ. కొండవలెనుండు దుందుభిదండిమొదలు
కపివరుఁడు చూప రాముండు గాంచి నవ్వి
యడుగుబొటనవ్రేలిచే నట్టమీటె
నదియుఁ బదియోజనములకు నవలఁ బడియె. ౪౫

గీ. శక్తిమఱిఁ దేటపడ నొక్కశరము నేసెఁ
ద్రుంచి యది సప్తసాలముల్ దూరి గిరిని
నరిగియరిగి రసాతల మంటి మఱలె
సంశయము దీఱె రామప్రశంసమీఱె. ౪౬

గీ. రామచంద్రునితోఁ గపిప్రవరుఁ డలరి
పైఁడికాంతులతనరొడల్ ప్రజ్వరిల్ల
గిరిపరీవృతమైన కిష్కింధఁ జేరి
దశదిశలు మ్రోయ సింహనాదంబు చేసె. ౪౭

గీ. వాలి విని కీలివలె మండిపడుచు నడరి
తార వారింప దాని నోదార్చియార్చి
పిడుగువలె వచ్చి యనుజుపై వడిగ వ్రాలె
లీల నొకకోల రాముండు గూలనేసె. ౪౮

గీ. ఇట్లు మిత్రునిమాట మన్నించి నృమణి
కఱకుటమ్మున వాలిదా శిరముఁ ద్రుంచి
ప్రాజ్యవానరకోటిసామ్రాజ్యమునకుఁ
బ్రభువుగా నిల్పె సుగ్రీవు భవ్యభావు. ౪౯

గీ. ఎల్లవైపులనుండి రప్పించి కపుల
భాగభాగమ్ములుగఁ దీర్చి పతులఁ గూర్చి
వివిధదిశలకు జానకి వెదుకఁ బంపె
రామహితకార్యనిరతుండు రవిసుతుండు. ౫౦

గీ. పక్షికులమణి సంపాతి పలుకువలన
జనకసుత లంకలో నుండు జాడఁ దెలిసి
హనుమ శతయోజనపువార్ధి నట్టదాటి
లంకఁ జేరంగఁ జనె సకలంకధాటి. ౫౧

గీ. రావణుం డేలునానగరమ్మునందు
శోకసంతప్తయగుచు నశోకవనిని
రామునే ధ్యానమొనరించు రామసతిని
భావనిం గని పావని భక్తి నెఱిఁగె. ౫౨

గీ. అమ్మ యిదె రామచంద్రుని యానవాలు
గొమ్మనుచు రామముద్రికఁ గూర్మి నొసఁగె
విభునివృత్తాంత మెల్లను విశదపఱిచెఁ
దీఱఁ ద్వరలోన వెతలంచు నూఱడించె. ౫౩

గీ. వని మహోద్వారమిల డుల్లి పడఁగఁ గూల్చి
కెరలి సేనానులేవురఁ గీటడంచె
మంత్రిపుత్రుల నేడ్వుర మచ్చమాపె
వ్రచ్చి యక్షుని బ్రహ్మాస్త్రబద్ధుఁడయ్యె. ౫౪

గీ. పూజ్య నజు దయ నస్త్రపు ముక్తిఁ గాంచెఁ
గట్టుదనుజుల స్వేచ్ఛగాఁ గట్టనిచ్చెఁ
గాల్చె లంకను సీత నొక్కతెను దప్ప
మఱలె శుభవార్త రామరాణ్మణికిఁ జెప్ప. ౫౫

గీ. నూటిగా వచ్చి యారాముచుట్టుఁ దిరిగి
ముదముతో నమ్మహాత్ముని యెదుట నిల్చి
కంటిసీతమ్మ సీతమ్మఁ గంటి ననుచుఁ
గరములను మోడ్చి తెలిపె సంగతులనెల్ల. ౫౬

గీ. అంత సుగ్రీవుతో రాముఁ డబ్ధిఁ జేరి
యర్కనిభబాణమున వాని నడలఁ జేసెఁ
గడలి నిజరూపమును దాల్చి వడిగఁ దోఁచి
సేతువుం గట్టి దాఁటగాఁ జేరి వేఁడె. ౫౭

గీ. అంత వంతెన నలుచేత నమరఁ జేసి
దానిపై లంకమీఁదికిఁ దరలి నృపతి
యరిబలము నెల్ల నాజిలోఁ దఱిగి పైచి
రావణాసురుపదితలల్ రాలఁగొట్టె ౫౮

గీ. సీత తనుఁ జేర రాముండు సిగ్గుచెంది
ప్రజలముందటఁ దెగడి తిరస్కరించె
నందులకు నోర్వఁజాలక యాసుశీల
యమల తానని ప్రకటింప నగ్నిఁ జొచ్చె. ౫౯

గీ. అగ్నిదేవుఁడు ప్రజలెల్ల నాలకింపఁ
బ్రవిమలాత్మ పతివ్రత పాపరహిత
సీసతీమణి యనితెల్ప నృపుఁ డెఱింగి
సీత నాథన్యచరితను స్వీకరించె. ౬౦

గీ. అమ్మహాకార్యమునకుఁ జరాచరములు
పొదలు ముజ్జగములు దేవమునులగములు
దివ్యసంతోషవార్నిధిఁ దేలియాడె
సమరతలి మెచ్చ రామునిహర్ష మెచ్చె. ౬౧

గీ. దశదిశలనుండి జయజయధ్వనులు చెలఁగ
రామచంద్రుండు లంకాధిరాజ్యమందు
శాశ్వతంబుగ నవ్విభీషణుని నిల్పి
యఖిలచింతలఁ బాసి కృతార్థుఁడయ్యె. ౬౨

గీ. సురలు దనకు నొసంగిన వరమువలన
నాజిఁబడియున్న వానరరాజి లేపి
సఖులతోఁ గూడ దివ్యపుష్పకము నెక్కి
వెడలె రాముఁ డయోధ్యకు వేడ్కమీఱ. ౬౩

గీ. ముని భరద్వాజునాశ్రమ భూమిఁ జేరి
భరతుడరికి సదాచారనిరతుడరికి
దాంతు హనుమంతు సద్గుణవంతు ననిచె
రామచంద్రుండు సత్యపరాక్రముండు. ౬౪

క. మఱిగతకథలను జెప్పుచు
సురుచిరపుష్పకము నెక్కి సుగ్రీవునితో
నరవరుఁడు రామచంద్రుఁడు
వరనందిగ్రామపురము వచ్చి యెలర్చెన్. ౬౫

గీ. జడల నెడలించి శ్రీరామచంద్రుఁ డచట
రమణ మించు నయోధ్యాపురమ్ముఁ జేరి
వైభవం బొప్పగాఁ బట్టభద్రుఁడయ్యె
మరల నిట్టులు సీతను సిరిని బడసె. ౬౬

గీ. సవితృవంశాబ్ధిసంపూర్ణచంద్రుఁడైన
రామచంద్రుండు రాజ్యభారము వహింప
సృష్టియంతయుఁ దుష్టిని బుష్టిఁ గాంచి
శిష్టులందఱుఁ బరమప్రహృష్టులైరి. ౬౭

సీ. సంతోషవంతులై సచ్ఛక్తివంతులై
కడు ధర్మవంతులై క్రాలఁగలరు
ఆరోగ్యయుక్తులై వ్యాధివిముక్తులై
కఱవన్న నెఱుఁగక వఱలఁగలరు

బెల్గాంకోట జంటబురుజులు



జైనదేవాలయము, బెల్గాముకోట



Jain Temple, Fort, Belgaum



Double Eastion, Belgaum Fort

బెల్గాముకోటలో నున్న జైనదేవాలయముయొక్క చిత్రములుచెక్కబడిన లోకప్పు



Carved roof panel, Jain Temple, Belgaum Fort

Travancore

తిరువాంకూరు

రీజెంటు మహారాణిగారు



The M tharani Regent

నూతన మహారాజాగారు



The New Maharaja

మహారాజాగారిచెల్లె



The Junior Rani

The Honorary Lady Magistrates, Madras

చెన్నపురి గౌరవన్యాయాధికారిణులు

యమ్. హెచ్. స్టాంఫర్డు సతి



Mrs. M. H. Stamford

శ్రీమతి వి. పాండురంగరావుగారి సతీమణి



Mrs. V. Panduranga Rao

శ్రీమతి సదాశివయ్యరుగారిసతీమణి



Mrs. Justice Sadasiva Iyer

శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు,
పురపాలక సంఘసభ్యురాలు, కాకినాడ
గోదావరిజిల్లా విద్యాసంఘముయొక్క-
ఉపాధ్యక్షురాలు



Koka Krishnavenamma Garu,
Member of the Municipal Council, Vice
President, Cocanada, District
Educational Committee, Godavary

తమజీవితమునందుఁ దమపుత్రమరణంబు
పురుషులు పడయక పరఁగఁగలరు
పతులను గొల్చెడి పరమపతివ్రతా
తిలకమ్ములై సతుల్ వెలయఁగలరు

గీ. గాలి నాఁకటిచేతను గీలిచేత
జ్వరముచే నీటిచేతఁ దస్కరులచేత
భయము గనకుండఁ బ్రజలెల్లఁ బ్రబలఁగలరు
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు. ౧౯

గీ. విప్రవరులకు నగణిత విత్త మొసఁగి
గోవులన్నను పదివేలకోట్లిచ్చి
బహుసువర్ణాశ్వమేధాళి భక్తిఁ జేసి
బ్రహ్మలోకంబు రాముండు పడయఁగలఁడు. ౨౦

గీ. వందలకొలందిక్షత్రియవంశములకు
మూలపురుషుండు దానయి పొదలఁగలఁడు
నాల్గువర్ణాలవారికి నాథుఁడగుచు
స్వస్వధర్మమ్ములందిడి వఱలఁగలఁడు. ౨౧

గీ. ఇట్లు పదియునొకండు వేలేండ్లు భువిని
రాజ్యమొనరించి కడుఁ బ్రజారంజకముగ
ముదముతో బ్రహ్మలోకంబుఁ బొందఁగలఁడు
సర్వనుతకీర్తి శ్రీరామచంద్రమూర్తి. ౨౨

గీ. అతిపవిత్రతరమ్ము రామాయణమ్ము
అఖిలపాప హరమ్ము రామాయణమ్ము
అమితపుణ్యకరమ్ము రామాయణమ్ము
అమలవేదసమమ్ము రామాయణమ్ము. ౨౩

క. రామాయణమును జదివెడు
నామనుజునిపాప మణుగు నాయువు పెరుఁగున్
గామితసుతపౌత్రాదుల
భూమినిగని యతఁడు స్వర్గపురమున కరుగున్. ౨౪

# దుర్మార్గుఁడు

అష్టావధాని మైసంపాటి హనుమంతరావు గారు

లక్రైల మే బ్రహ్మకునైన నీవగు మహత్వం బెన్న నంతర్గతో
జ్జ్వల దుగ్రజ్వలనాంశుమాలికల వీసంబైన బాహ్యావనీ
స్థలికిన్ గానఁగరాని చందమున డాఁచన్ జాలి పైపైన శీ
తల మందానిలచాలనం బొనరుతే దౌష్ట్యాఖ్య దైత్యాధమా!

మ. ప్రళయాభీలహాలాహలాఖ్య విషపూర్ణం బయ్యుఁ దైపైన క్షీ
ర లవాచ్ఛాదితమైన కుంభమువలెన్ రాజిల్ల, మేషానవో
జ్జ్వల విద్వేష మజేభకుంభదళన ప్రఖ్యాతసింహంబులోఁ
దులలోఁ దూఁగఁగ నీకె ధాత్రిఁ దగురా దుర్మార్గ! దైత్యాధమా!

మ. బలవద్గ్రాహి శరీర మత్స్యక కమఠ వ్యాకీర్ణమై రాజితా
చల సంకాశ హిమాద్రిసందయు చరద్వ్యాళాలమై యొప్పియున్
జెలువారన్ నిజతుంగభంగ కర విక్షేపంబులన్ వాహినీ
బలమేదింపు విషాధినేతవుగదా పాపాత్మ! దుర్మార్గుఁడా!

మ. పులు మేయన్ గను సాధువౌ సురభి తాఁ బోవున్ ధరోపత్యకా
స్థలికిన్; దద్వనకుంజశాద్వలమునన్ దన్విన్ గనన్ గోరుఁ గా
ని లవంబైన గెలుంగనే యునివిత్నన్నిక్షిప్త తీవ్రానలో
జ్జ్వలనంబు బట్టెడ వీవొకండవెకదా భావింప దుర్మార్గుఁడా!

# గ్రంథరచనము

కవికొండల వేంకటరావు గారు, బి. ఏ., బి. యల్.

మనుజుడు తొలుదొల్త మాతృగర్భమందు ఉన్నప్పుడుకంటె జననమందిన వెనుకను, అంతకంటె ప్రాకుచు నింటిలో నాలుగుమూలల సంచరించునప్పుడును, నంతకంటె నడుచుచు పెద్దవాడై నానాటికి ప్రపంచవిస్తీర్ణము నెఱుంగునప్పుడును నెప్పటికప్పుడు క్రొంగ్రొత్త భావముల నేకరించుచుండును. అట్లు నేకరించిన భావసముదయము నెప్పటికప్పుడు వ్యక్తీకరింప నతఁ డుత్సహించుచుండును. భావోదయము వెనువెంట భావప్రకటనము నకై మనస్సు త త్తరించు. ఇయ్యది పసిపిల్లలయందు విస్తారము కనుపట్టు. వితాకుపుట్టిన ఇట్టె కెవ్వుమని ఏడ్తురు. లాలించిన అట్టె పక్కున నవ్వుదురు. ఒక్కొక్కప్పుడచ్చెరువుగ నూరక చూచుచుందురు. ఆ పసిపాపయే కనుక మాటలాడనేర్చునది యగునేని "ఎంతవింత" "అబ్బోరే" అని యనియుండును.

ఈ భావోదయభావప్రకటనములు అనాదినిసర్గములు. ప్రతిభావమును ప్రకటింపబడు. లోలోపలనో బహిరంగముగనో ప్రతిభావమును వెలువడు. ఈ వెలిపుచ్చుటలో ఆదినిగల మానవులొకానొకభావమునొకానొకరీతి నుచ్చరించి క్రమముగ సర్వసామాన్య మగు భాషను ప్రతిపాదించిరి. ఆభాషను క్రమక్రమముగ వినసొంపుగ సంస్కరించిరి. తుట్టతుదకు వెనుక వచ్చిన కొమ్ములు ముందువచ్చిన చెవులకంటె వాడియను సామెతగ భాష యనునది భావప్రకటనమునకు మూలమై అది లేనిచో భావముల కెడములేదో యనునంతటి ప్రాముఖ్యత వడసినది. భాషవల్లనే భావము చిరంజీవియగుట కాస్పదము కలిగినది.

ఇ ట్టి స్థైర్యత వడసిన భాషాభావములకు కట్టుబాటులను శైలిని నొడగూర్చి గద్యపద్యద్విపద పదగీతగేయాదులమర్యాద నెలకొల్పి, విజ్ఞానమో రసమో వెల్లడించునెడ నయ్యది గ్రంథరచన మగుచున్నది.

"గ్రంథరచనమునకును సర్వసామాన్యభాషాభావ ప్రకటనమునకును భేదమేమియు లేదు. సర్వసామాన్య భాషాభావ ప్రకటనమందు లోపలి యుద్దేశ్యము లెట్లు పుట్టునో అట్లే నిసర్గముగ అంతయూతముగ నయ్యవిత గ్రథించబ మనుజుడు బయలుపఱచుచున్నాడు. ఆయుద్దేశ్యము యొక్క స్వతస్సిద్ధసారమునెల్ల నడంచి దాని నొకానొక ఛందోనిబద్ధపంజరంబునం జొనిపి శైలిసంకుచితముగ నొనర్చుట కూడనిపని. మనభావము లెంతగొప్ప వయ్యును సామాన్యభాషనే వెల్లడింపవలయును" అని కొంద అభిప్రాయపడుచున్నారు. మఱికొందఱు "భావము లెందును సర్వసామాన్యములే. భాషయొక్క యుత్కృష్టతనుబట్టి వాటికి గొప్పగలుగుచున్నది." మొగము చందురుఁబోలె నున్నదని యెవ్వ డనలేడు. "నిండు చందురుబోలు నీదు నెమ్మొగము" అని ఛందోబద్ధముగ వ్రాయుటయందు గొప్పకలదని కొంద అభిప్రాయపడుచున్నారు. ఈరెండును కుఱుచవాదములే.

గ్రంథరచనమున నుండవలసిన భావమును భాషయును సర్వసామాన్యభావభాషలనుండి చాలవఱకు భేదించుచున్నది. గ్రంథకర్తయొక్క లేఖనీవేదిక వేఱు. సామాన్యసంభాషణయొక్క వేదిక వేఱు.

ఏగ్రంథమును పరికింపుడు; ఎంత అయ్యది ప్రకృత మయ్యును, ఎంతనిసర్గముపోలె జూపట్టినను, అయ్యది నీభౌతికపు కంటికి కనపడదు. నీచేతులకు తగులదు. నీవు దానిని నోట మ్రింగనేరవు. ఆ సోపానావరోహణము నీవొక మానసికవిమానారూఢుడవైనగాని లభింపదు. నీవు నీమునుముందు నిలుచు నీభార్యతో నర్మాలాపము లాడునపుడు నీ వెంత మనోహరముగ సంబోధించినను నీవు నీ మునుముందు నిలుచు నీభార్యను గోపించునప్పుడు నీ వెంతటి అహంకారముతో దూషించినను, ఆభావప్రకటనములు ఎంతభాషాపరిపూతము లయినను, అవి శాశ్వ

లికములగుగాని గ్రంథరచనములు కానేరవు. ఆ అవస్థను గడచి నీవొకనాటకమును వ్రాయుటకు సంకల్పించుకొని ఏ దుష్యంతుడో శకుంతలను ప్రేమించునప్పుడాడు తరితీపు పల్కులను, శకుంతలను రచ్చనుండి వెడలగొట్టించునప్పు డుబ్బినట్టి రోషపుటుక్తులను వ్రాయుచో అది గ్రంథరచన మగుచున్నది.

గ్రంథరచనమనున దొక ఉద్భిజ్జమువంటిది. సర్వసామాన్య నిత్యపదసంఘట్టిత ధూళిధూసర దుర్గంధయుత మగు భూమిలోనుండి యొక పచ్చని మొలకెట్లు అంకురించి చిగిరించు ఆకుల, పరిమళించు మొగ్గల, నెట్లానందము లోకులకు కలిగించుచున్నదో అట్లే నిరంతరసంసార వ్యసనాయాస పరిస్థితులనుండి చక్కని యూహల స్ఫురింపజేయుచు సద్ధర్మసమారంభములకు త్రోవజూపుచు మనలను కీర్తిశేషులుగ జేయునది గ్రంథరచనము. అది లేనిచో జీవనమునందు కళ లేదు. జీవనమునందు విలువ లేదు.

కావున గ్రంథరచనమునం దేదియెట్లువచ్చిన నట్లు వ్రాయుట వల్లెయనువాద మసంభవము. దాని ఆశయము దాని ఉన్నతి దాని హావభావరసలలితపవనసంస్పర్శనము దాని వికసనామోద ప్రపంచము వేఱు. వేఱు అని సామాన్యజీవనముతో సంబంధము లేనిది కాదు. సామాన్య జీవనముతో సంబంధము కలదని చిత్తము వచ్చినట్లు నడువతగినదియు కాదు.

జీవనపంథ కింద్రియనిగ్రహమెట్టిదో భాషానిగ్రహము భావనిగ్రహమును గ్రంథరచనమున కట్టివి. "నిరంకుశాః కవయః" "రవిగాననిచో కవిగాంచు" అను విశేషణములు భాషానిగ్రహమునందును, భావనిగ్రహమునందును సమున్నతిని గాంచుటలో నిరంకుశులు కవిద్రష్టలని అర్థముగాని మఱియొండు కాదు.

మిక్కిలి చిన్నపదమువాడి అందునుండి విశేష మగుభావమును వెల్లడించుటయు భాషానిగ్రహము. ఒక చిన్నభావమును స్ఫురింపజేసి దానబ్రహ్మాండ రసమును ప్రతిబింబితము సేయుటయు భావనిగ్రహము. పెదపెద్ద సమాసములందును, అలంకారములందును, శ్లేషలందును చమత్కారరచనలందును భాషానిగ్రహము సున్న. మఱియు కొల్లేటి చేదత్రాడులుం బోలెనో భామాకలాపంబుల ఫక్కినో విప్రలంభము మున్నగునవి సముచ్చరింప భావనిగ్రహము హుళక్కి.

పెద్దనార్యుని మనుచరిత్రమున ప్రవరుడొక అమాయక వైదికనిష్ఠాగరిష్ఠుడు. అతని మత్తవ్యామోహాత వరూథినియును చిన్నది. "ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగ గౌఁగిలించి యధరం బాసించె." అంత "హా! శ్రీహరీ! యంచున్ బ్రాహ్మణుఁడోరమిడి తదీయాంసద్వయుం బట్టిపొమ్మంచున్ ద్రోచె." అట్టియెడ ఆ ప్రవరాఖ్యుని సత్వ్రిపరత్నమునుండి నీతిని బోధింపవలెనని వైరాగ్యమును లోకమునకు నూరిపోయవలెనన్న ఎన్ని ఎన్ని పద్యముల నేని గుప్పింపనగును గదా! శాస్త్రచర్చనంతను నచ్చట విప్పి చెప్పవచ్చును గదా! అట్లుగాక లోకమం దెంత వైరాగ్యము మనస్సునకు తట్టవలెనో అంత వైరాగ్యమును పాఠకునకు తట్టునట్లు "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అని అర్థాంతరన్యాసమున అట్టె చెప్పి చెప్పనట్లు కవి చెప్పి వదలివేసినాడు. ఇదియు భావనిగ్రహమునకు దార్కాణము. మఱియును ఆత్రోపువడి లజ్జాపరవశయైన వరూథిని యవస్థ వర్ణింపవలెనన్న భావమెంతవఱకు ఎన్ని సీస పద్యముల, ఎన్ని చంపకమాలల, ఎంతెంత మంజరీద్విపదల చెప్పవచ్చునో ఊహింపుడు. అట్లుకాక "క్రొవ్వు నవరించి యొడల్ దీపింపనతనిజాలచు అఁగోపమునంజూచి గ్రీటుకొనుచుం బలికెఁ" అని చిన్నకందపద్యమున కోపరసమును కురిపించెను. ఇదియు భాషానిగ్రహమునకు తార్కాణము. మహాకవి తిక్కనయొక్క సామర్థ్యమెల్ల ఈభాషా భావనిగ్రహముం దకలదని విమర్శకు లుగ్గడించు చుందురు.

భాషను నిగ్రహించి భావమును నిగ్రహించి గ్రంథరచనమునకు దొరకొన్న వ్రాయున దేమి గ్రంథమేమి నడుచునని అడుగుదురేమో. గ్రంథమునకు విస్తరింపు కలిగించునది అంశము. అంశముయొక్క కల్పనమునందు గ్రంథము పెంపొందుచున్నది. రామునియొక్క కథచే రామాయణము విస్తరించినది. కౌరవ పాండవుల గాథచే భారత మంతపాత్రమైనది. కథాకల్పనమునందు జూపు అంతర్భావయు సూక్ష్మసూక్ష్మ ప్రదర్శనకౌశలమున గ్రంథము వర్ధిల్లుచున్నది.

# కలివిడంబనము

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు

[నీలకంఠ దీక్షితులకృతి కాంధ్రీకరణము]

భయము వలదు వాదిపలుకులు వినరాదు
వినయ మెఱుఁగవలయు విధియు లేదు
వేగ తోఁచినట్లు వాఁగుట యొక్కటే
సభల జయముఁ బొందు సాధనంబు.

ఆ. సిగ్గులేమి వాదిఁ జిన్నపుచ్చుటయును
నడుమనడుమ నవ్వ జడియకునికి
అదనెఱింగి సభల నధికారిఁ బొగడుట
యనెడునైదు జయము నందఁజేయు.

ఆ. మధ్యవర్తి తెల్విమాలినవాఁడైన
గొంతు పగుల నఱచికొనుచు వాది
గెలువవలయు, నతఁడు తెలిసినవాఁడైనఁ
బక్షపాతి యనుచుఁ బలుకవలయు.

గీ. పాఠములు చెప్పి గ్రంథముల్ వ్రాసి యశము
గడన సేయంగ వచ్చునుగాని యతని
కరయ నిజమైన విజ్ఞాన మంతమందు
నేని కలుగునో కలుగదో యెఱుఁగరాదు.

గీ. మూఢమానవు జగమునఁ బొగడువార
లెవ్వ రుందురు? పాప మాహీనబుద్ధి
తన్నుఁదాను నుతించుకోకున్న నతని
చిత్తమున కెన్నఁ డానందసిద్ధి కలుగు?

గీ. వేళ యగుచుండెఁ జదువుఁడు విశదపడును
ముందుముం దిదియని శిష్యులం దఱుముచుఁ
జదువఁ జేసెడునట్టి యాచార్యవరుని
కట్టికృతినైనఁ గాఠిన్య మెఱుకపడునె?

గీ. తెలిసినట్టులు తలయూఁచి తృప్తిపడుట
యగతికత్వమతిశ్రద్ధ యనెడిమూఁడు
గుణము లబ్బును శిష్యులకును నిజంబు
మూర్ఖుఁడైనట్టి యాచార్యపుణ్యమునను.

గీ. ఏచదువునందు మాబుద్ధి యెక్కకున్న
మంత్రవేత్తలమో లేక మహితయోగి
వేషధారులమో కాక వినుతికెక్క
యతులమో యయ్యెదము జీవయాత్ర గడప.

గీ. గర్భవిషయంబునన్ ప్రశ్న కలిగినపుడు
తండ్రి యడిగినఁ గొడుకని తల్లి యడుగఁ
గూఁతురని చెప్ప జ్యోతిషికుండు జగతి
ధనము విజయంబు గాంచును దప్పకుండ.

క. ఆయుర్దాయప్రశ్నము
చేయఁగ దీర్ఘాయు వనుచుఁ జెప్పందగుఁ బూ
ర్ణాయువు పట్టిన సత్కృతి
చేయును మృతుఁడైన మరలఁ గేరం డడుగన్.

క. ధనయోగము నిర్ధనునకు
ధనికునకును మరల గొప్పధనయోగము చె
ప్పనజోస్యులు లోకంబునఁ
గనుచుందురు చిన్నపెద్దకానుక లెపుడున్.

గీ. నాల్గుసాగరములకును నడుమనున్న
ధరణియంతయు వెదకుము మరలమరల
నైన దైవజ్ఞుఁ డుండనియట్టి నేల
లోడితెఁడైనను నీకంటఁ బడదు సుమ్ము.

క. కొందఱు వారంబులు మఱి
కొందఱు నక్షత్రములును గొందఱు గ్రహముల్
పొందుగ నెఱుఁగుదు రీత్రయ
ముం దెలిసినవాఁడు ధరణిఁ బుట్టిన గురుఁడే.

గీ. స్వస్థచిత్తు లరోగు లసాధ్యరోగు
లొక్కదమ్మిడి యీరు వైద్యులకు నెపుడు
దేహచింతారతుండును దీర్ఘరోగి
భాగ్యహేతువు లగుదురు వారి కరయ.

గీ. భయము లేదని ధైర్యంబు పల్కఁబోఁడు
కుదురదంచును భయపెట్టి గొణఁగఁబోఁడు
ప్రాణభయహీనుఁడైన నిరాశుఁడైన
నొసఁగునే రోగి వైద్యున కొక్కరూక.

గీ. మదికిఁ దోఁచినయట్టులు మందొసంగి
కఠినపథ్యంబు చెప్పుట గడుసుఁదనము
కుదిరెనా మందుమంచిది, కుదురకున్నఁ
బథ్యదోషం బటంచును బలుకవచ్చు.

ఆ. ఆదినడుగు వైద్య మారంభ మొనరింప
నడుమ మందుకర్చు నడిగి లాగు
జబ్బుకుదిరినంత సంతుష్టి తీరంగఁ
బారితోషికంబు పడయఁ గోరు.

ఆ. మందు లిచ్చి యిచ్చి మాట దక్కదటంచు
వెజ్జు రోగి విడిచి వెళ్లినంత
నతనియింటియందు నవతరింతురు వాని
జ్ఞాతి మంత్రవేత్త జ్యోతిషికుఁడు.

గీ. తొలుతఁ జెప్పును మంచిమాటలు, నడుమను
గొంచె మిచ్చును, రోగంబు కుదుర
గణనచేయఁడు పిదప రోగంబు కుదురుచుండ
గాని యారోగి వైద్యుమొగంబు గనఁడు.

గీ. భయము దుర్వ్యసనయంబు కార్పణ్యవృత్తి
ద్రోహచింత యసత్యదుస్సాహసములు
తుడిచిపెట్టి వర్ణింతురు కడుపుకూటి
కొక్కటిఁ జేసి కాకవుల్ కాపురుషుని.

క. కారణ మరయక పొగడుట
కారంభింతురు కవీంద్రు లది లేకున్నన్
ఊరక పురపుర లాడును
వారలరసనేంద్రియం బవారితభంగిన్.

గీ. పొగడఁబడినట్టి వానినే పొగడుచుంద్రు
కవులు తద్గుణగణమును గాంచఁబోరు
కనుఁడు తుమ్మెదపురు గెంతఘనగుణంబొ
దానివర్ణన మెన్నిచందాలఁ గలదొ!

క. అరయ నరాభాసుల నె
వ్వారు వర్ణించెదరొ వశ్యవాణిని! వారల్
సురధేనువు దొరకినచో
దొరకొని నాఁగటికిఁ గట్టి దున్నుదు రకటా!

గీ. దారయును దానియక్క యత్తయును మామ
భావ మఱఁదియు ననువేఱు ప్రాణములను
బ్రాణులకు సృజియించెను బ్రహ్మదేవుఁ
డిదియె సృష్టిరహస్యమం చెఱుఁగననుచు.

గీ. మేనయల్లుఁడు నల్లుఁడు మేనమామ
చెలియ వంక చుట్టాలును దెలియకుండ
నింటిలోఁబడి తినుచుందు రెల్లయెడల
గాదెలోఁ దూఱితినునెలుకలనుఁబోలి.

గీ. అల్లునికిఁ గూఁతురు బలంబు, తల్లి బలము
మేనమామకు, మామకు వానిసతికి
భార్య బలమగు, నింటికి వచ్చినట్టి
యతిథికో గృహమేధియే యగు బలంబు.

గీ. శ్యాలకుఁడు బాలుఁడైయుండ నల్లుఁ డెసఁగు
నతఁడు పెరుఁగుచు నుండఁగా నణఁగియుండు
నతఁడు పెద్దయినంతనే యాట సాగ
కల్లుఁ డాత్మగృహంబున కల్ల నరుగు.

గీ. అత్తగారు స్వతంత్రురా లగుట, మామ
గారు పరదేశదీర్ఘసంచారి యగుట,
భార్య పెద్దదియగుటయు బావమఱఁది
బాలుఁడగుటయు నల్లునిభాగ్య మరయ.

గీ. పట్టుపుట్టంబులని వెండిపళ్లెములని
కాసులని పుత్రులకుఁ జేతి కడియములని
యాఁడుఁబుట్టువు పుట్టింటి కరుగుదెంచి
వెళ్లునపుడెల్ల నిల్లెల్ల గుల్లఁజేయు.

గీ. పిల్లలున్నట్టి యిద్దఱు పెండ్లములును
మగఁడు లేనట్టి భగినియు మందిరమునఁ
గలరయేని, యనారత కలహమనెడి
మహిత యోగంబు గృహయజమానులకును.

గీ. తలఁచినంతనె కాలుసేతులు వణంకుఁ
గనఁబడినయంతనే బుద్ధి కలఁతపడును
ఔర! యేమని వర్ణింపనగునో తెలియ
దయ్యె ఋణదాతయనెడి దయ్యంబుచర్య.

గీ. అంతకుండైన మనుజులయంతకాల
మరుగుదెంచెడునంతకు నాఁగియుండుఁ
గాని ఋణదాత కెందును గాలనియమ
మరయరా దంతకునికంటె నతఁడె ఘనుఁడు.

గీ. నోరఁ గోరలు గనరావు ఘోరమగుచుఁ
జేతఁ బాశంబు గనరాదు భీతిగొలుప
నైన నేమి యప్పిచ్చినయయ్యఁ జూడఁ
జిత్తమునఁ దలపాటునఁ దత్తఱిల్లు.

గీ. సంచరింపఁగ శక్తి గల్పించుచుండు
శీతవాతాతపంబులభీతిఁ దొలఁగఁ
జేయు జఠరాగ్ని దీపింపఁజేయుఁ గాన
నరయ నరులకు లేమి దివ్యౌషధంబు.

గీ. లేమిచెంతకు దొంగ పోఁడు, రాఁడు
కొండెగాఁడును, జ్ఞాతులు గూడరారు,
ప్రభువు కన్నెత్తిచూడఁ డాప్రక్కనైనఁ
దత్త్వమరసిన రాజ్యంబు దానిసరియె?

# కవితా ఋణవిముక్తి

శ్రీమాన్ పాతనాయక సూర్యనారాయణ కవి గారు

పటుతర భవ్యకావ్య పరిపాక యశః కలితాంబరచ్ఛవి
స్ఫుటిత దిగంత పర్వకర పూర్ణిమ దా యని పల్కుబోటి య
క్కట నులివెచ్చబొమ్మల గమ్మని చెక్కులు పొక్కఁజేయ నీ
వటమట గ్రాఁగి పేరెడఁద నల్లడునూహల నింతు వేలకో?

హా! తెలిసెన్ గవిప్రవర! యాంధ్రకవీశ్వర లోకమందు నూ
హాతుల కల్పనాతిశయహారి చమత్క్రియ గంటమందు ను
ఱ్ఱూఁతల నూఁచి సర్వకళ లోడికగట్టు ప్రబంధరాజముస్
బ్రాఁతిమెయిన్ సృజించియిడవా? నుడిబోటికి జీవగఱ్ఱగాన్?

పింగళిసింగమా! చదువుపెద్దలపెద్ద! త్వదీయభావమున్
సింగపుఁ బీఠ నత్తమిలి చేసె సరస్వతి కావ్యరాజ్య ము
త్తుంగదశ న్గవీశ్వరుఁడ! తొల్లిటి కైసరు లేని కేని నీ
రంగదపూర్వభావనలు రావవి నిక్కమునూవె? సూరనా!

# ఆంధ్రపదముల యర్థవైచిత్రి

విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారు

ఒకరియభిప్రాయము లొకరికిఁ దెలియుటకై మనుష్యులు కల్పించుకొనిన సువ్యక్తములగు ధ్వనివిశేషములే భాషలని చెప్పఁబడుచున్నవి. ఇట్టిభాషలను గల్పించుకొనక పూర్వము మనుష్యులవో యవ్యక్తములగు ధ్వనులచేఁ దమయాశయముల వెల్లడించుచు నితరుల యాశయములఁ దెలిసికొనుచు మూఁగవారివలె నెట్టెటో లోకయాత్ర నడపుకొనుచుండెడివారని భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. "భాష్యతే అనయేతి భాషా; భాషవ్యక్తాయాంవాచి" స్పష్టముగా మాట్లాడఁబడునది భాషయని దీనియర్థము. దూరమాలోచించినచో నీవ్యుత్పత్తియే పైసిద్ధాంతమును గొంతవఱకు స్థాపింపఁజాలియున్నది. ఇట్టిభాషలు లోకములోఁ బలువిధములుగా వ్యాపించియున్నవి. ఈభాషలు వ్యవహరింపఁబడు దేశముల భేదములనుబట్టియు వీనినివ్యవహరించు జాతులభేదములను బట్టియు లేదా వీనికిగల యేదోయొక యసాధారణ ధర్మమును బట్టియు వీనికి జర్మని, ఇంగ్లీషు, సంస్కృతము, హింది, అఱవము, ఆంధ్రము, కన్నడము, మళయాళము మున్నగు ననేకములగుసంజ్ఞ లేర్పడియున్నవి. ఇట్టివానిలో మనయాంధ్రభాషకూడ నొకటియై యున్నది. దీనిలోని కొన్ని పదములయర్థము కాలక్రమమున నెంతెంతవిచిత్రముగా మార్పునందినదో యావిషయ మొకింతచూపుటయే యిప్పుడు నాకర్తవ్యము.

మనదేశములోఁ జిరకాలమునుండి సంస్కృతభాష వ్యాపించియున్నది. కావుననే యాంధ్రమునకును సంస్కృతమునకును ననేకవిషయములలో సంబంధము హెచ్చుగా నున్నది. ప్రస్తుతకాలమున నాంగ్లభాషాసంబంధముచే రోడ్డు, కార్డు, మనియార్డరు; పులిస్టాపు, (fullstop) కిరస్తానులు, (christians) అఫారము,(halfarm) సబ్బు (soap) (ఇది దేశ్యమని శబ్దరత్నాకరమునఁగలదు. ఉదాహరణ మీయలేదు. ప్రాచీనప్రయోగ మగపడునంతవఱకు నిది (Soap) శబ్దభవమనియే నానిశ్చయము) మున్నగునింగ్లీషుపదము లనేకములు తత్సమరూపమునను తద్భవరూపమునను మనభాషలోనికిఁ జొరఁబడుచున్నట్లే సంస్కృతమునుండి వేలకొలఁది శబ్దములు తెలుఁగులోఁ బ్రవేశించియున్నవి. ఇట్లు ప్రవేశించినవానిలోఁ బ్రాతిపదికములో విశేషముగ మార్పులేకున్నచో నవి తత్సమశబ్దములనియుఁ బ్రాతిపదికము గూడఁ గొంతవఱకు మాఱినచో నయ్యవి తద్భవములనియు లాక్షణికులు వ్యవహరింతురు. ఈరెండుజాతుల శబ్దములలోను నర్థముకూడ మాఱుచుండును. శబ్దముమాఱినను నర్థము మాఱినను నయ్యది సామాన్యముగాఁ బ్రకృతికి సంబంధించినదే యైయుండును. పండితులనక పామరులనక యందఱును నిరంతరముగ దీనిని వ్యవహరించుచుండుటయే యిట్టిమార్పులకుఁ గారణము, అందును పామరజన వ్యవహారమే ముఖ్యకారణ మనఁదగును. ఇట్టి మార్పులు గలుగుచున్న భాషయే సజీవమగు భాషయని చెప్పుట యుక్తము. పైనిఁజూపిన రెండువిధములలోఁ దత్సమపదములయర్థ మెట్లు విపరీతమైనది? అట్టి విపరిణామమునకు సరియగు హేతువేమి? అను విషయము మనకుఁ బ్రకృతాంశము.

1. అవధ్యులు:— సంస్కృతము; అవధ్యాః= చంపఁదగనివారు. తెనుఁగులో నీశబ్దము కుంటివాండ్రు, గ్రుడ్డివాండ్రు మున్నగు నంగవికలులనుమాత్రము బోధించుచున్నది. ఇట్టి యంగవికలులను హింసింపరాదు. కావున వీరి కీపేరు రూఢమైయుండును.

2. అసహ్యము:— సం; అసహ్యమ్ = సహింప శక్యముగానిది "అసహ్యశిరోవేదనా"= తలనొప్పి సహింపనలవిగాక మిక్కుటముగా నున్నదని దీనియర్థము. తెలుఁగులోమాత్రము తలనొప్పి యసహ్యముగా నున్నదని సామాన్యముగా వ్యవహరింపరు. ఏవగింపు, రోఁత యను నర్థమున నీశబ్దమును వాడుదురు. ఇదికూడ సహింపశక్యముగానిదే యగుటచే నిట్టివాడుక వచ్చియుండును. ఉదా= వాని దుశ్చేష్టలు చూచిన కొలఁదిని నాకసహ్యము కలుగుచున్నది. సామాన్యవాచకమిట విశేషపరత్వము.

3. గీర్వాణము:—సం; గీర్వాణాః= దేవతలు. "గీరేవబాణాః యేషాంతే" అని దీని వ్యుత్పత్తి. బాణమువంటి మాటగలవారని దీని భావము. దేవతలు శపించుటకు సమర్థులుగదా! తెనుఁగున నౌద్ధత్యము గర్వమునని దీనియర్థము. పైనిఁజూపినట్లు శాపదానసామర్థ్యమున్నపుడు గొంతనుండి ఔద్ధత్యముండుటగూడ నైసర్గికము గావున నిట్టి యర్థము క్రమముగా వచ్చియుండును. ఉదా= "ఏదో నాలుగుముక్కలు చదువుకొన్నను నంతగీర్వాణము పనికిరాదు".

4. అనుమానము:— సం; అనుమానమ్=ఊహ. ధూమాద్వహ్న్యనుమానమ్= ధూమమును బట్టి వహ్ని గలదని యూహించుట. తెలుఁగున నిట్లుగాక సంశయమను నర్థమున వాడుదురు. లౌకికవ్యవహారమే కాక కవులుగూడ నిట్లే వాడియున్నారు. ఉదా;

చ॥ విలసితధర్మచారిణి వివేకవతీమణి సీత; సుస్వభా<br>
వులు యమలార్భకుల్ కుశలవుల్ గ్రహియింపను వీరి మువ్వురన్<br>
వల దనుమానమొంద నిటువంటి మహాసతిఁ జేరి కల్లలేఁ<br>
బలుకుదునయ్య బొంకినఁ దపంబు ఫలించునటయ్య మానికిన్॥

(ఉత్తరరామాయణము - 8 ఆశ్వా-83 ప.)

పైనిఁజూపినరీతిగా నూహించుటలోఁ గొన్నియెడల సంశయముగూడ కల్పితమై యుండును గాన నిట్టివాడుక వచ్చియుండును.

5. కర్మ:—సం; కర్మ=పని. ఏపనినిబోధించుటకైనను సంస్కృతభాషలో దీనిని ప్రయోగింతురు. కాని తెలుఁగున శ్రాద్ధకర్మనుమాత్రమే బోధించుచున్నది. ఉదా=కర్మచేయుటకు కొడుకు దగ్గఱ లేకపోయెను. సామాన్యవాచికిట విశేషపరత్వము.

6. ఫలహారము:—సం; (ఫలాహారః) ఫలాహారః=ఫలరూపమగు నాహారము. ఏదేని నియమసమయమునం దెల్లపుడును భుజించు నన్నమును విడిచి వేఱొకపదార్థమును దేనిని భుజించినను నయ్యది ఫలహారమనియే తెలుఁగున వ్యవహరింతురు. ఉదా="అమావాస్యనాఁటి రాత్రి శిష్టులు మినపరొట్టెగాని పిండిగాని ఫలహారము చేయుదురు." నియమసమయములందుఁ బంక్తిభోజనములుగా భుజించునవిగావున పీని కిట్టిపేరు వచ్చియుండును.

7. సంభావన:—సం; సంభావనా=గౌరవము, మర్యాద. శుభాశుభములందు బ్రాహ్మణులకుమున్నగువారికిచ్చు స్వల్పధనమని యాంధ్రుల వాడుక. పూర్వకాలమున నేదేని శుభాశుభకర్మములందు విప్రుల యాశీస్సుల గోరువారు యోగ్యులని తమకుఁ దోచినవారి నాహ్వానించి వారికిఁ గొంతధనమిచ్చి గౌరవించి వారి యాశీస్సులు బొందుచుండెడివారు. ఆ సందర్భమునఁ దైయర్థమం దీశబ్దమును వాడుటకు మొదలిడి యుందురు. అప్పటివాడుక గొంతవఱకుఁ బ్రకృత్యర్థ సంబంధమే యనఁదగును.

8. సంతర్పణ:—సం; సంతర్పణమ్=తృప్తిపఱచుట. ఏవిధముననుఁ దృప్తిపఱచిన సందర్భమునకైనను సంస్కృతమున దీనిని వాడుదురు. కాని తెలుఁగున నట్లుగాక యన్నదానముచేఁ దృప్తిపఱచుసందర్భమున మాత్రమే దీనికి వాడుకగలదు. ధనాదులచేఁ దృప్తిగలిగించినను నప్పుడు సంతర్పణచేసిరనువాడుక లేదుగదా! ఈసంతర్పణకు సమారాధనమనియు గొన్నియెడల వ్యవహారముగలదు. వచ్చినవారి నారాధించుటయనఁగా భుజింపఁజేయుటయే యప్పటికర్తవ్యముగావున నీవ్యవహారముగూడ నుపపన్నముగనే యున్నది.

9. ప్రారబ్ధము:—సం; ప్రారబ్ధమ్=పూర్వ మారంభింపఁబడినది. అనఁగాఁ జేయఁబడినది. అది పుణ్యకర్మయుఁ బాపకర్మయుఁగూడఁ గావచ్చును. కాని తెనుఁగులోఁ బూర్వము చేయఁబడిన పాపకర్మయని మాత్రమే యర్థము. కావుననే పాపకర్మఫలములగు కష్టముల నొందునపుడే "వానిప్రారబ్ధమట్లున్నది. ఏమిచేయఁగలము!" అని యందురు. అంతియకాని యొకమనుజుఁడు సుఖియై యానందించుచుండ వాని నభినందింపఁదలంచి "నీప్రారబ్ధము బాగుగానున్న"దని యెవ్వరును బ్రయోగింపరు— (సామాన్యవాచి కిట విశేషపరత్వము.)

10. దాహము:—సం; దాహః= కాలుట, తాపము. తెలుఁగులో నిట్లుగాక తాపోపశాంతిసాధనమగు నీరుమున్నగువానికై వాంఛ మైయున్నది. ఉదా="కొంచెము దాహ మిప్పింపుఁడు" అలసటపుట్టఁదై వచ్చి దప్పిచేఁ బ్రాణావశిష్టుఁడైయున్న మనుజుని యిట్టివాక్యమందలి దాహశబ్దమునకు సంస్కృతములోనియర్థమే దీనికిని గలదనుకొని మఱింత తాపమును గలిగింపుట కెవ్వరును సిద్ధపడుటలేదుగదా! మఱియు నీశబ్దము తాపము, దప్పి యనునర్థమునఁగూడ "వానికి దాహమధికముగానున్నది" మున్నగువాక్యములలో నగపడుచున్నది.

11. ఉచితము:—సం; ఉచితమ్=తగినది. తెనుఁగున ధనమును స్వీకరింపకుండఁగనే యొకవస్తువు నిచ్చినచో నద్దాని నుచితముగానిచ్చి నట్లు వాడుదురు. ఉదా="ఒక్కసారియే డజనువస్తువులకొనువారి కొకవస్తు వుచితముగా నీయఁబడును." ఒక్కసారి పండ్రెండువస్తువులు కొని తనకెంతో లాభముగలిగించినపు డావర్తకుఁడు కొన్నవారి కొకవస్తువును ధనమును స్వీకరింపకుండఁగనే యిచ్చుట యుచితము. అనఁగా న్యాయ్యము. తగినది. కావుననే యుచితశబ్దమున కిట్టివాడుక కలిగినది. "కేటలాగు సుచితముగాఁ బంపఁబడును" అని యిట్లు వార్తాపత్రికలలోఁ గూడ నీశబ్ద మిట్టియర్థమునఁ దఱుచుగా నగపడుచుండును.

12. గగనము:— సం; గగనమ్=ఆకాశము. (శూన్యము) తెనుఁగులో నప్రాప్యము; అసాధ్యమునని దీనియర్థము. ఉదా:— "అతఁడు చేసినట్లు చేయుటయేమి గగనమా?" అనఁగా శూన్యమా?= ప్రపంచమున నెచ్చటనులేనిదా?= (అట్టిదిచేయుట కష్టముగాన) అసాధ్యమా? అను క్రమమున దీనియర్థము విపరిణతమైయుండును. లేదా "ఆకాశమంత [illegible]" మున్నగు కొన్ని యాంధ్రోక్తులలో నాకాశము పెద్దదానిగా భావించుచుండుట గలదు. దానినిబట్టి గగనమా? = పెద్దదా=(పెద్దపనిని సాధించుట కష్టముగాన) అసాధ్యమా? అనునట్లైనను దర్థపరిణామమునకు మార్గము కానోపును. దీనినీయర్థమున రామరాజభూషణకవిగూడఁ బ్రయోగించియున్నాఁడు. "......గగనఘంటాపథ క్రమాశీలన కెంత గగనమయ్యెలతాంగి కాను చరలు..." (వసుచరిత్రము-3 ఆ-99 ప.) ఇట కెంతగగనమయ్యె ననఁగా నెంతపొందరానిదయ్యె నని యర్థము.

13. జిజ్ఞాస:— సం; జిజ్ఞాసా = తెలిసికొనవలయుననుకోరిక. దేనినేని దెలిసికొనఁదలఁచినపుడు హృదయము తదేకచింతనాయత్తమై వ్యాకులమై యుండుట సహజము. ఏదేని కష్టదశలోఁగూడ హృదయ మిట్లేయుండునుగాన నీసామ్యమునుబట్టి జిజ్ఞాసగానున్నదని కష్టసమయమునఁగూడ మనవారు వాడుదురు.

14. దక్షత:— సం; దక్షతా= సామర్థ్యము. "ఈవస్తువులు పొదుపుగా వాడుకొనుటకు మాయింట దక్షతలేదు" అనఁగా మాకు సామర్థ్యములేదనియే దీనికి మొదటియర్థము. ఎందువలన సామర్థ్యము లేదు? పెద్దలెవరును నింటలేకుండుటవలన. కావున సామర్థ్యాభావమునకుఁ బెద్ద లింటలేకుండుట హేతువైనది. ఇట్టి హేతుహేతుమద్భావసంబంధమునుబట్టి కాలక్రమమున దక్షతలేకుండుటయనఁగా నింట వృద్ధులు లేకుండుటయనునర్థము వచ్చినది. ఈరీతిని దక్షతయనఁగా నింటనుండు పెద్దలను నర్థము తేలినది. ఈయర్థమునఁ గవులుఁగూడ నీశబ్దమును వాడియున్నారు.

"దక్షతలేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
లక్షలువచ్చి చేసినయుఁ బలాయనమైచనుఁ గల్లగాదు ప్ర
త్యక్షము............" (భాస్కరశతకము.)

15. కైంకర్యము:—సం; కైఙ్కర్యమ్=భృత్యభావము, శుశ్రూష, సేవ. తెలుఁగున దొంగిలించుటయని యీశబ్దమున కర్థము. విష్ణుభక్తాగ్రేసరులగు తిరుమంగయాళ్వారు పెరుమాళ్లకు నిరంతర (కైంకర్యము) సేవయొనర్చుచు నొకప్పుడు స్వామియంగుళీయకమును హరించినట్లు ప్రసిద్ధి గలదని వైష్ణవసంప్రదాయజ్ఞులు చెప్పుదురు. తత్తిరుమంగయాళ్వారుల చోరప్రక్రియచే కైంకర్యశబ్దమున కపహరణమను నర్థము వచ్చుటలో మూలమైయుండును. మఱియు దేవాలయములందలి యర్చకులు పెక్కుమంది దేవస్థానాధికృతులచేఁ గాని తదితరులచేఁగాని భగవద్వినియోగమునకై యీయఁబడిన వస్తువులను స్వామికి వినియోగింపక తామపహరింతురని దేశములోఁ గింవదంతి గలదు. అది సత్యమో కాదో పెరుమాళ్లు కెఱుక. ఇట్లు వారు వస్త్వపహరణము చేయుచుఁ గైంకర్యము చేయుచున్నారమని చెప్పుదురు. కావున నీమార్గమునఁగూడఁ గైంకర్యమనఁగా దొంగిలించుటయను నర్థమువచ్చుట కవకాశ మగపడుచున్నది. ఉదా=అవల నేను నాలుగువస్తువులుంచితిని. అందు రెండువస్తువులెవరో కైంకర్యము చేసినారు.

16. ఛాందసుఁడు:—సం; ఛాన్దసః = ఛందస్సు తెలిసినవాఁడు. అనఁగా వేద పండితుఁడు. "శ్రోత్రియ చ్ఛాన్దసౌసమౌ" శ్రోత్రియచ్ఛాందసశబ్దములు రెండును బర్యాయములని నామలింగానుశాసనము. తెలుఁగులో నీరెండుశబ్దముల యర్థములకును జాలభేదము గలదు. శ్రోత్రియుఁ డనఁగా సదాచారసంపత్తి శిష్టాగ్రేసరుఁడు. ఛాందసుఁ డనఁగా లోకజ్ఞాన శూన్యుఁడు, మందుఁడు. మన దేశములోఁ జిరకాలమునుండి, యనఁగాఁ గాళిదాసుకాలమునుండియు వేదపండితు లనేకులు నాగరకతా శూన్యులై మౌఢ్యముతో నుండెడివారని "వేదాభ్యాస జడః కథంనువిషయ వ్యావృత్తకౌతూహలః నిర్మాతుంప్రభవేన్మనోహరమిదం రూపం పురాణో మునిః." (వేదాభ్యాసమువలన మాంద్యమలవడిన బ్రహ్మ యిట్టి మనోహరరూపమును సృజింపఁజాలఁడు) అను విక్రమోర్వశీయ వాక్యమువలన మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది. నాఁటికిని నేఁటికిని వేదవేత్తలవిషయమున నీయభిప్రాయమే దేశములో నాటుకొని యున్నది. వేదవేత్తలలోఁ జాలమంది చెప్పినమాటయే పలుమాఱు చెప్పుచుఁ జేసినపనియే పలుమాఱు చేయుచు నిట్లుండుట స్వాభావికము. దీనిని బట్టియే ఛాందసశబ్దము చా(చే)దస్తముగలవారను నర్థమునందు రూఢమైనది. చా(చే)దస్తమను శబ్దమైనను ఛాందసత్వశబ్దభవమే కాని క్రొత్తది గాదు. ఛాందసశబ్దమును పైనిజెప్పిన యర్థములో రామకృష్ణ కవి గూడ వాడియున్నాఁడు.

ఉ. "సారథి ఛాందసుండు బడిసాగదు చక్రయుగంబు...
............తౌనట మాసరియందుఁ దత్పురిన్
జేరులు నవ్వ శంకరుని జేరి గెలనకింకిణీధ్వనిన్"
(పాండురంగ మాహాత్మ్యము-1ఆ-115 ప)

17. ముష్టి:— సం; ముష్టిః= పిడికిలి. దీనికిఁ గ్రమముగా బిచ్చగాండ్రకుఁ బెట్టు పిడికెడుబియ్యమనియు ధాన్యమనియు వాడుక వచ్చినది. లేదా బియ్యముగాని ధాన్యముగాని గలపిడికిలియని యైనను జెప్పవలయును. ముష్టికివచ్చిరి, ముష్టివేసితిని మున్నగువాక్యములలో సంస్కృతమునఁగల పట్టిపిడికిలి యనునర్థము చెప్పుట పొసఁగనేరదు గదా!

18. దండము:— సం; దణ్డః= కఱ్ఱ. ఆంధ్రభాషలో నిది నమస్కార మనునర్థమున వాడఁబడుచున్నది. వినీతుఁడగువాఁడు పెద్దలకు నమస్కరించునపుడు కఱ్ఱవలె భూమిపైని పడవలయు నని నియమము. దీనికే దండప్రణామమని పేరు. దీనినిబట్టి క్రమముగా దండశబ్దమునకు నమస్కార పర్యాయత్వము సిద్ధించినది. ఉదా= "పెద్దలు కనఁబడిన తోడనే దండము పెట్టవలయును." ఈవాక్యములోని దండమనుదానికి సంస్కృతములోని యర్థమే చెప్పినచోఁ బెద్దలు కనఁబడుటకే భయపడవలసియుండును.

19. చిత్తము:—, భాగ్యము:—సం; చిత్తమ్=మనస్సు. తెనుఁగులో నెవరేని యొకవిషయము చెప్పుచున్నపుడు శ్రోతలు 'ఊఁ, ఊఁ,' అని యూఁకొట్టుచు వినువలవాటు గలదు. అట్లు పెద్దలు చెప్పుచున్నచో 'అయ్య, అయ్య' యనుచు విందురు. ఈసందర్భముననే 'చిత్తముచిత్తము' అనియు ననుచుందురు. అది తమ చిత్తములోనున్నట్లే యనఁగాఁ దమ యభిప్రాయము సరియైనదే యని యొప్పుటికప్పు డంగీకరించుచు వినుచుండుసందర్భమే మోయని స్ఫురించుచున్నది. ఇదిగాక పెద్ద లేదేని కార్యము నియోగించినప్పుడు 'చిత్తము' అని యందురు. అనఁగాఁ దమ చిత్తము ననుసరించి తప్పక యాకార్యము నెఱవేర్తు నన్నంత యర్థము దానిలో స్ఫురించుచున్నది.

మఱియు నిట్టి సన్నివేశములలో ననఁగాఁ బెద్దలు ప్రసంగించుచున్నయెడ వైష్ణవులు 'భాగ్యము భాగ్యము'నుచు వినునాచారము గలదు. కటాక్షించి దేవరవారీసంగతి సాయించుట దాసునిభాగ్యము. అనఁగా నదృష్టమను నూహతో నీవాడుక పుట్టియుండును. వీరిలోఁ బ్రపత్తి మిక్కుటముగా నుండును గావునఁ బైవాడుక కిట్టి యభిప్రాయమును గల్పించుట యుపపన్నమని తోఁచుచున్నది.

20. స్వయంపాకము:—సం; స్వయంపాకః=స్వయముగా వండుకొనుట. క్రమముగా నీశబ్దము స్వయముగా వండుకొనుట కిచ్చెడి సామగ్రిని బోధించినది. ఇంకను రానురాను స్వయముగా వండుకొనుటకుఁగాక యింటికిఁ దీసికొనిపోయి విక్రయించుకొనుట కయిననుసరే యొకమనుష్యుఁడు స్వయముగా వండుకొన్నచో సరిపడునట్టిచ్చెడి భోజనసామగ్రికి వాచకమైనది. ఉదా; నేఁడు ద్వాదశిగావున నిద్దఱకు స్వయంపాకము లిచ్చితిమి.

21. ప్రియము:—సం; ప్రియమ్=ఇష్టమయినది. ఏవస్తువైనను బహుమందికి నిష్టమైనపు డందఱును దానినే కోరుట నైసర్గికము. అట్లు పలువురు కోరుచున్న వస్తువునకు విలువ హెచ్చుగుటయు స్వాభావికమే. కావుననే ప్రియమనఁగా హెచ్చుధరగల వస్తువనునర్థము తెలుఁగున రూఢమైనది. "శీతకాల మగుటచేఁగాఁబోలును బజారునఁ గంబళ్లు మిక్కిలి ప్రియముగా నున్నవి."

22 స్వస్తి:—సం; స్వస్తి=మంగళము. తెలుఁగులో స్వస్తి యనఁగాఁ గొండఱువైదికులు రెండుపక్షములుగా విభక్తులయి వేద

ములో నేదోయొక భాగము నందుకొని యొకరివెంబడి నొక రందరి వాక్యముల నేకరువుపెట్టుట యనునర్థము వచ్చినది. శుభకార్యముల లోను మఱికొన్ని యుత్సవాదులలోను వేదమును బఠింప వలయుననియు నయ్యది శుభప్రదమనియు మనవారి సిద్ధాంతము. ఇట్లు వేదమును నవిశ్రాంతముగా నొక్కరే చెప్పుటలో శ్రమయధికమగును గావున న ట్లుభయపక్షములవారు సర్దుకొని చెప్పువాడుక పుట్టియుండును. ఇట్లుచెప్పుట మంగళమునకు హేతు వగుచున్నది. హేతుహేతు మత్తులకు క్రమముగా నభేదాధ్యవసాయము చేసికొని యిట్లు వేదము నేకరువుపెట్టుటనే స్వస్తియని వాడుచున్నారు. లేదా యావేదమంత్రములలోఁ గొన్ని 'మంగళముగాక' యనునర్థముగలవి కూడ నుండును గావున నామంత్రములమూలమున స్వస్తిచెప్పుచున్నా రనువాడుక వచ్చినను రావచ్చును.

23 అన్యోన్యము:— సం; అన్యోన్యమ్= పరస్పరము. ఆంధ్రమునఁ బ్రేమయనునర్థమున దీనిని వాడుదుము. ఉదా= "వారిద్దఱకును నెంతో యన్యోన్యము" ప్రేమయనుభావ మెప్పుడును నొకరిపైనొకరికిఁ బరస్పరము నుండవలసినది గావున నిట్టియర్థమువచ్చుట సమంజసమే యనఁదగును.

24. అవసరము:— సం; అవసరః = సమయము. తెనుఁగులో నావశ్యకత యనునర్థమున వ్యవహరింతురు. ఉదా; "నేను రావలసిన యవసరము లేదు." "ఎవరియవసరము వారిది" ఇత్యాదులలో నవసర శబ్దమునకు సమయార్థకత్వము చెప్పినచో వాక్యార్థము పొసఁగియుండదు. ఆవశ్యకతే యనునర్థమే యిట్టిచోట్ల వక్త్రభిప్రేతమై యుండును. నీకీవస్తువు కావలెనా? నా కవసరము లేదు; అది కావలసినసమయము నాకులేదు= అది కావలసినసమయ మిదికాదనుట. ఇట్టికొన్ని వాక్యము లలో మొట్టమొదట సమయార్థకత్వమేయుండి క్రమముగా నయ్యది యన్వయసారళ్యాపేక్షులగువారిచే నావశ్యకత యనునర్థము గలదిగా మార్పఁబడియుండును.

25. ఆగ్రహము:— సం; ఆగ్రహః= పట్టుదల. "అనేనైవపక్షేణ విజయినా భవితవ్య మితి నాస్మాక మాగ్రహః=" ఈపక్షమే నెగ్గవలయునని మాకేమియుఁ బట్టుదల లేదు. అని సంస్కృతములో దీనివ్యవహారము. ఏదేని యొకవిషయమును బట్టుదలతో వాదించుచున్నపు డా సందర్భమునుబట్టి యాపట్టుదల కోపసమ్మిశ్రితమగుటయుఁ గలదు. దీనిం బట్టియే యాగ్రహమునఁగాఁ గోపమనునర్థము తెనుఁగులో రూఢమైనది. ఉదా= "తప్పుచేసిన భృత్యునిపై రాజున కాగ్రహము జనించును."

26. ఆలయము:— సం; ఆలయః= ఉనికిపట్టు, స్థానము, ఇల్లు గ్రంథాలయము, దేవాలయము, వస్త్రాలయము, కార్యాలయము, హిమాలయము, విద్యాలయము మున్నగు సమాసములలోని యాలయశబ్దమునకు స్థానమనిమాత్రమే యర్థము. రానురా నిది తెనుఁగులో దేవాలయమను విశిష్టార్థమును బోధించుచున్నది. ఉదా: "సాయంకాలము తఱుచుగా నందఱును నాలయమునకు వెళ్లుదురు." కేవలమగు (దేవాది పదసమభివ్యాహారములేని) యాలయశబ్దమునకు సంస్కృతమున నిట్టి విశిష్టార్థ మెచ్చటను గానరాదు.— సామాన్యవాచి కిట విశేషపరత్వము.

27. కుశలము:— సం; కుశల= నేర్పుగల (విశేషణము) కుశలమ్= క్షేమము. "అయమతీవకుశలః=" ఇతఁడు మిగులనేర్పరి.— 'ఉభయకుశలోపరి' లోని కుశలశబ్దము క్షేమార్థకమని యందఱును నెఱుంగుదురు. ఇట్లుండ నాంధ్రభాషలో 'ఇఱుకటము ఇఱుకు,' అనునర్థములో వ్యవహరింపఁబడుచున్నది. ఇది ప్రకృత్యర్థమునకు సంబంధించియున్నట్లు పైకి గోచరించుట లేదు. కాని చిన్నయింటిలోఁ గాపురము సేయువారిని మీకు సదుపాయముగా (వసతిగా)నున్నదా యని ప్రశ్నించినచో "నేదో యందులోనే కుశలముగాఁ గాలక్షేపము చేయుచున్నా ము"ని చెప్పుదురు. స్థలము తక్కువగానున్నపు డింటనుండు వస్తువులను యథేచ్ఛముగా నెచ్చటివానినచ్చట విడువక నేర్పుతో వానినన్నిటిని సరుదుకొనవలసి యుండును. కాఁగా నిఱుకుగానున్న స్థలమున నేర్పుగా నుండవలయు నని తేలినది. ఇట్టి వాక్యములలో 'నిఱుకటము, నేర్పు' అనువాని కిట్టిసంబంధము కలిగియుండుటచేఁ గ్రమముగాఁ గుశలశబ్దము వ్యవహారమున నిఱుకట మనునర్థమునందు రూఢమై యుండునేమో యని తోఁచుచున్నది.

28. పథ్యము:— సం; పథ్యమ్= హితము, మేలుగలిగించునది. "అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః=" అప్పటికి శ్రోత కిష్టముగాకపోయినను భావికాలమున మేలుగలిగించు మాటను జెప్పువాఁడును నట్టిమాట వినువాఁడునుగూడ నరుదుగా నుందురని దీనియర్థము. ఇట్టిది మాటనుగాని కార్యమునుగాని మఱిదేనినైననుగాని భావికాలమున మేలుగలిగించు సర్వమును సంస్కృతములో బోధింపజాలియున్నది. కాలక్రమమున నిట్లన్నిటిని బోధింపక తెనుఁగువ్యవహారమున భావికాలమున మేలుగలిగించు నాహారమునుమాత్రమే బోధించుచున్నది. అదియైనను సామాన్యముగా రోగనివృత్త్యనంతరము రోగికిచ్చు నాహారమునేకాని తదితరుల యాహారమును బోధింపదు. ఏదేని రోగము సంభవించునపుడే యాహారనియమముగాని లేనపుడుగూడ నిత్యము నుండవలసినయానియమము మనవారియభ్యాసములో లేనట్లుగూడ నీశబ్దముయొక్క యర్థవిపరిణామరీతియే సూచింపఁజాలియున్నది. ఉదా= "నిన్ననే పథ్య మిచ్చితిమి"

29. తద్దినము:— సం; తద్దినమ్= (తత్ X దినమ్)= ఆదినము. తెనుఁగులో నీశబ్దము నాబ్దిక మనునర్థమున వాడుదురు. లజ్జాకరమును జుగుప్సాకరమును నమంగళశీలమును నగునర్థముగల శబ్దముల నుచ్చరింపక వానికిఁ గొంచెము సంబంధించిన యేవోపదములను బ్రయోగించుచు నాయర్థమును వ్యక్తీకరించుట మనవారికి స్వభావము. కావుననే (1) యింటిలోఁ బసపు నిండుకొన్నది, (అయిపోయినపుడు) (2) దీపము పెద్దదయినది (ఆఱిపోయినపుడు) (3) మంగళ సూత్రము పెరిగి పోయినది. (తెగిపోయినపుడు) మున్నగువాడుకలు వచ్చినవి. ఇట్లే చనిపోయిన దినమని చెప్పుటకు సంకోచించి 'ఆదినము = చనిపోయిన దినము' అనునర్థము స్ఫురించునట్లు తద్దినమను శబ్దమును వాడుచున్నారు.

30. మంగళసూత్రము:—సం; మఙ్గళసూత్రమ్ - వివాహములో వరుఁడు వధువుయొక్క మెడలోఁగట్టెడు పుస్తెలుగ్రుచ్చిన మంగళకర

ముగు (త్రాడు) సూత్రము. పుస్తె లెప్పుడును నీమంగళసూత్రముతో సంబంధించియే యుండును గావున వీనికిఁగల యవినాభావసంబంధముచే నీరెంటిని నభిన్నములుగా భావించుటవలనఁ గావలయును మంగళసూత్రమనఁగాఁ బుస్తెలను నర్థముగూడ వాడుకలో రూఢమైనది. ఉదా "మంగళసూత్రములు రెండిటికిని నొంచెము సొట్లు (నొక్కులు) పడుటచే బాగుచేయుటకై కంసాలి కిచ్చితి" "ఆరెండు మంగళసూత్రములును నొక్కొక్కటి తులముతులము బంగారముతోఁ దయారయినవి." ఇత్యాదులలో సూత్రమనఁగాఁ ద్రాడనియర్థము చెప్పుట యెంతమాత్రమును బొసఁగి యుండదు.

31. మధుపర్కము:—సం; మధుపర్కః = తేనె, నేయి, పెరుగు, నీరు, చక్కెర యను నీయైదిటిని గలిపి యతిథికిచ్చు మిశ్రిత ద్రవ్యవిశేషము.—కన్యాదాన సమయమున వరునికిఁ గూడ దీనినిచ్చి సత్కరించు నాచారము గలదు. అల్లుని నిట్లు సత్కరించినపిదప నూతనవస్త్రములఁగూడ నిత్తురు. కావునఁ గ్రమముగా నల్లునికిఁ గన్యాదానసమయమున నిచ్చు వస్త్రములని మాత్రమే యిప్పుడు వాడుక కలదు. అతిథిసత్కారస్వరూప మెట్టిదో యట్టిసత్కార మెందుల కావశ్యకమో తెలియని యీకాలమున మధుపర్క శబ్దమునకుఁగల ప్రకృత్యర్థమును మనవారు మఱచుట వింతకాదు. ఇఁక వివాహములో వరునికిఁ బైరీతిని దేనె మున్నగువానిని గలిపియిచ్చు నాచారమున్నను నయ్యది యాతొందరలో నందఱకును దెలియక దానిని సంబంధించి యిచ్చు నూతనవస్త్రములు మాత్రము స్పష్టముగాఁ బ్రేక్షకుల కందఱకును నగపడును కాన మధుపర్కమనఁగా వరునికిచ్చు నూతనవస్త్రములేయను నర్థము నాటుకొన్నది. ఉదా—'అల్లునికి జరీ యంచు ఖద్దరు మధుపర్కములు తెచ్చినారము."

32 అయోమయము:—సం; అయోమయమ్—ఇనుపది.—సర్వసామాన్యముగా మనవారికిఁ దెలిసియున్న ప్రసిద్ధ లోహములలో నినుము మిక్కిలి సాంద్రమై దట్టముగా నుండునది గావున నయ్యది; దుష్ప్రవేశము=చొరరానిది యనునర్థము దీనికిఁ దగియుండును. ఈ యర్థమునుబట్టియే తెనుఁగులో నేదేని దుష్ప్రవేశముగఁగాని యసాధ్యముగఁగాని దుర్బోధముగఁగాని యున్నదని చెప్పవలసి వచ్చినపుడు 'మిక్కిలి యయోమయముగా నున్న'దని యందురు.

33. పూజ్యము:— సం; పూజ్యమ్=పూజింపఁదగినది, (విశేషణము). ఇది తెనుఁగులో శూన్యము (లేనిది) అను నర్థములో వాడఁబడుచున్నది. ఆ బాలునికిఁ దెలివి తేటలుగలవా యని ప్రశ్నించినపు 'వాపిల్లవాఁడు తెలివిలేనివాఁ డయినదో 'నన్నియు నున్నవిగాని తెలివితేటలు మాత్రము పూజ్య'మని సమాధానము చెప్పుదురు. ఈ సందర్భమున, 'తెలివితేటలు మాత్రము సున్న'యనియుఁ జెప్పఁగలరు. ఈ సున్న శబ్దము శూన్యశబ్దభవమే కాని క్రొత్తదిగాదు. కాన దీనింగూర్చి యంతగా విమర్శింపఁబనిలేదు. ఈయర్థము పూజ్యశబ్దమున కెట్లు వచ్చినదో యామార్గముమాత్రము మనస్సునకు సరిగా సరిపడకున్నది. పూజ్యశబ్దమునకు శూన్యమనునర్థము లౌకికవ్యవహారమునందు మాత్రమే కాక గ్రాంథికభాషలోఁగూడ నున్నట్లు;

శా॥ "భక్తుం డెవ్వఁడు ముక్తికై శకపయః పానంబుగావించి ని
ర్వ్యక్తక్లేశకు ముక్తకేశికిఁ గరంబుల్ మోడ్చి పత్యామన
స్సక్తుం గర్గొను వాఁడు గన్నయదివో జన్మంబు పేఁదాల్చియుఁ
ముక్తుండౌఁడు భావికాలజననంబుల్ వానికిం బూజ్యముల్॥

అను పాండురంగ మాహాత్మ్య (2ఆ-155ప) ప్రయోగము చెప్పుచున్నది. కన్నుల నద్దుకొని సంగ్రహింపవలసిన యీశబ్దమును శబ్దరత్నాకర కారులు మఱచి కాఁబోలు విడచినారు. మఱియు దీనికి సున్న యను నర్థము కన్నడభాషలోఁగూడ సురూఢమైయున్నట్లు కర్ణాటకపండితులు చెప్పుదురు. ఇట్టిన్నిరీతుల వ్యాప్తమైయున్న యీయర్థము దీనికి వచ్చుటలో నే దేని మంచిమార్గ ముండితీరవలయును. ఇంకను విమర్శించినఁగాని నిరూపింప వలనుపడదు.

34. దేవతార్చనము:— సం; దేవతార్చనమ్=దేవునిబూజించుట. తెనుఁగున "తాము మాయింటికి దేవతార్చనమునకు దయచేయవలయును." మున్నగు వాక్యములలో దేవతార్చనమనఁగా భోజనమని యర్థము. ఈ వాడుక స్మార్తులలో నధికముగా నుండును. పూర్వము స్మార్తులెల్లరును భోజనమునకు ముందుగా దేవతార్చనముచేసి వెంటనే భోజనము చేయు నభ్యాస ముండెడిది. ఇట్లు భోజనము దేవతార్చనా సమనంతరభావిగావున దేవతార్చన మనఁగా భోజనమను నర్థము రూఢమైనది. అదిగాక యేగృహమందు దేవతార్చనము చేయుదురో యచ్చట నేవండిన పదార్థములను దేవునికి నివేదన చేయవలయుననియు నిట్లు నివేదన చేసిన పదార్థములనే తాముగూడ భుజింపవలయుననియు నియమము గావున నెచ్చట దేవతార్చనము చేయుదురో యచట భోజనము తప్పనేతప్పదు. ఇప్పటి స్మార్తులలోఁ జాలమంది దేవతార్చనావిధానమునైన నెఱుంగకున్నను వెనుకటివాడుకయే యనుస్యూతముగా వచ్చుచుండుటచే నందఱును నీశబ్దమును బైయర్థమున వాడుచున్నారు.

35. భద్రము:— సం; భద్రమ్ = మంగళము. తెనుఁగునది జాగ్రత్తయను నర్థమున వ్యవహరింపఁబడుచున్నది. ఎప్పుడైనను జాగరూకతతో నుండుట శ్రేయస్సునకు, మంగళమునకు హేతువగును. క్రమముగా హేతుహేతుమత్తుల కభేదమును గల్పించుకొనుటచే నిట్టివాడుక వచ్చియుండును. ఉదా—"నేను దిరిగివచ్చువఱకు నింటినద్ద భద్రముగా నుండవలయును."

మనదేశములో సంస్కృతసమములై వ్యవహరింపఁబడుచున్న 'యాంధ్రపదముల యర్థవైచిత్రి'ని స్థాలీపులాకన్యాయమున నిటఁ జూపినాఁడను. ఇంకను సన్న్యాసి, అవస్థ, సంగతి, వర్తమానము, అద్వైతము, సదుపాయము, దురంతము, అభిజాత్యము, ఉద్యోగము, శ్రమ=(ఆశ)మున్నగు నిట్టిశబ్దము లెన్నియో కలవు. పైనిజూపిన శబ్దములన్నిటికిని నర్థవిపరిణామము తెలుఁగులో జరిగినదే కాని సంస్కృతములోనిది గాదు. సంస్కృతములోఁగూడ సామాన్యవాచకములగు పంకజాదిశబ్దములకు విశేషవాచిత్వమును విశేషవాచకములగు తైలాదిశబ్దములకు సామాన్యవాచకత్వమును రూఢమగుటయు నిట్లింకను ననేకరీతుల నర్థము

మాఱియుండుటయు సుప్రసిద్ధము. ఇట్లే దేశ్యాంధ్రములోఁగూడ వాయు సామాన్య వాచియగు 'గాడుపు' శబ్దము వాడుకలో వేఁడి గాలిని మాత్రము బోధించుచున్నది. ఉదా-"ఘాటుపు హెచ్చుగా నున్నది" ఇట శబ్దరూపముగూడఁ గొంత మాఱియున్నది. ఏదైనను హెచ్చుగానున్నదని చెప్పునప్పు డాశబ్దములో వత్తక్షరములను (వర్గ ద్వితీయచతుర్థములను) ప్రయోగించుట మనవారి కలవాటై యున్నది. కనుకనే ఘట్టిగా వర్ణించితిని" "మెత్తగా నలిగిపోయినది" ఇత్యాదులలో వత్తక్షరములు వచ్చినవి. ఇఁక వివాహమగుచున్న వరుని బోధించు పెండ్లికొడుకను పదమును వడుక (వడుగు) పెండ్లికొడుకనియు, గర్భాధానపుఁ బెండ్లికొడుకనియుఁ జివరకు బాలసారె పెండ్లికొడుకనియుఁ గూడ నతివిచిత్రముగా వాడుచున్నారు. ఇట్టిమార్పు లన్నిటికిఁ బ్రవాహరూపమున నుండు వ్యవహారమే కారణము. ఈ మహాప్రవాహమును నివారింప శక్యముగాదు. నివారింప యత్నించుట సమంజసమును గాదు. ఇట్లు మాఱుచున్న శబ్దములను వానియర్థములను గ్రహించుచు దీనినిబట్టి వ్యవహారబలమున నెట్టిదో వాని పరిగ్రాహ్యతను లోకమునకు బోధించుచు నానందించుచుండుట మాత్రమే భాషాతత్త్వజిజ్ఞాసువులకుఁ గర్తవ్యము.

పైనిజూపినవానిలో నర్థములుమాఱినమార్గములను సరిగా గుర్తింపఁజాలక నేనేమేని తబ్బిబ్బుగా నిరూపించియుంటినేమో! అట్టివానిని మాత్సర్యదృష్టితో విచారించి సవరించుభారము పండితులదేయని సవినయముగ విన్నవించుచున్నాఁడను.

"దోషోఽపి గుణతాం యాతి పణ్డితానా మనుగ్రహాత్,
అయః స్వర్ణతామేతి సంస్పర్శా త్స్పర్శవేదినః."

# వియోగ రాధిక

(శ్రీ శేషాద్రిరమణ కవులు)

ధేను పరాగ సంహతులు దిగ్వలయంబుల నాక్రమించె మం
దానిల సంచరజ్జలరుహాకరనవ్య రజశ్చయంబు సం
ధ్యానవకాంతి సంతతులయందు విలీనము గాఁదొడంగె, కృ
ష్ణా! నను బాయ నీకుఁదగునా? యెటు లింక సహింపనేరుతున్.

ఉ. వేణురవావృతంబయిన విశ్వము నేఁడు ప్రశాంతినొంది ని
ద్రాణముగాఁ దనర్చె, మధురాపురి వన్నె దొరంగె, గోపక
శ్రేణిని వీడి యెచ్చటఁ జరించుచునుంటివో! యింకనైన నీ
రాణువ నాదరించుటకు రాఁగదవోయి, కుమార యాదవా!

చ. వలిపెపుఁ జిల్గుదుప్పటపువన్నియ దిక్కులయందుఁ బండువె
న్నెలలను గూర్చుచుండ రమణీయమనోహరవేణుగానముల్
పలుపుచు మామకాంగణమునన్ జరియింపవదేల కృష్ణ! నీ
చెలువముఁ దెల్పు పీకనులుచేసిన దోసముఁ దెల్పరాదొకో!

ఉ. పూచెను తామరల్, కడిమిపూలదుమారము వీవసాగె, సం
ధ్యాచరమారుణప్రభలయందుఁ బ్రపంచము మున్గితేలె, గో
పీచయ మెందునుండెఁ, గనిపింపఁడు కృష్ణుఁ, డటంచు దిక్కులన్
జూచుచునుండె నింకఁ జవిఁజూపఁగరాదొకొ వేణుగానముల్.

చ. తలపయి బర్హిబర్హమును దాల్చి, కరంబున వేణువూని, మై
కలపపుఁదావులం బొలయు కాంచనచేలము జీరువాఁడ నం
దెలుచిఱుగజ్జియల్ మొరయ దేవకి ముందు నటించినట్లు మా
కెలఁకుల నాడఁగాఁ దగదె కృష్ణ! కృతార్థత గల్గునట్లుగన్.



# కవిత్వము

ఉమ్రా అలీషా కవి గారు

కవిత్వము రసావేశము. ప్రేమమయస్వరూపమైన యొక యపురూపమగు పదార్థము. ఇదమిత్థమని నిర్వచించుట కవకాశములేని ప్రణవాత్మకమైన జ్యోతి. అతీంద్రియములగు మహాపదార్థములలో నొకటి. సర్వాంగసుందరమైన దీని నిజస్వరూపమును దెలిసికొనుట మిగుల దుర్ఘటమైనపనియేయైనను కొన్ని వాక్యాభాస, యుక్త్యాభాసములవలన విమర్శించి కొంతవఱకు గ్రహింపవచ్చునని తోచుచున్నది.

మానవుని కంతరంగములగు మహాశక్తులు ప్రకృతిసిద్ధములై స్వభావముగా లభ్యములై యున్నవి. వాని స్వరూపసిద్ధాంతములు వేర్వేరైనను రెండుశక్తులుమాత్ర మన్నిటికన్న నుత్కృష్టములై పరిగణింపఁబడుచున్నవి. అందు మొదటిది వివేకము; రెండవది రసావేశము.

వివేక మనునది సమస్తవస్తువిస్తృతమైన యీ విశ్వమానవ ప్రపంచమును, నిందలి యమూల్యమైన మహాపదార్థములను, వాని గుణాగుణములను వాని యుపయోగానుపయోగములను దెలుసుకొనుటకు, చతుష్షష్టి కళలు కళాప్రదర్శనములు మున్నగునవి సాధించుటకు, సహాయించును.

రసావేశము. ఇది వివేకాదిగుణములతోఁగాని సాధనసాధన విధి విధానములతోఁగాని సంబంధములేని యొక మానసిక పరిణామము-అవస్థాభేదము-అనఁగా కష్టపడుట లేక సంకల్పమాత్రమున సంభవించుపరిస్థితుల వలనఁ జటుక్కున హృదయమార్ద్రమై పోవును. అనఁగా కడగండ్లయందు దుఃఖమును, సుఖమునం దానందమును, నాశ్చర్యమున నిశ్చలత్వమును పొందుచున్నది. దీనిపేరే రసావేశము. (feeling)

ఈ రసము-ఈ రసావేశము-శబ్దములచేఁ బొదగఁబడినప్పుడే కవిత్వమనిపించుకొనుచున్నది. ఇది పశుపక్షి మృగాది తిర్యగ్జంతుసంతతులయందును గనుపడుచున్నది. సింహము గర్జించుటయు, కోయిలల వ్యక్తమధుర ధ్వనులు సేయుటయు, నెమిలి పురివిప్పి యాడుటయు, సీతాకోకపురుగు రెక్కలల్లలార్చి కేళింతలాడుటయు, నిట్లే ప్రకృతియందన్నియో స్వభావచైతన్యము లగుపడుచున్నవి. వాని యన్నిటికన్న మానవుని కధికమగు ధీశక్తిగలదు. అది యవస్థాభేదములం దాతనివాక్కునుండి వివిధములై భావవ్యక్తములై పెక్కుపదజాలములు ప్రణవముతో నైక్యమై అనూచితమైనను శ్వాసవాయువువలె, మహావాతవేగమునంబడి పొర్లి పొర్లి వచ్చు నదీప్రవాహమువలె, వచ్చివేయును. అదే కవిత్వము.

ప్రణవాత్మకమగు శబ్దముల మూలమువనే భావోజ్జీవమై దాని నుండి రసావేశ ముదయించుచున్నది. అదే కవిత్వమని కొందఱు తార్కికులమతము. ఏమనిన శబ్దసమామ్నాయస్వరూపమైన కవిత్వమును విన్న ప్రేక్షకుల హృదయములుగూడ రసార్ద్రములై పొలుపారుచున్నవి. అనఁగా కవి యేరసమం దేభావమును శబ్దములచేఁ జిత్రించినాఁడో ఆ రసమును ఆభావమును ప్రేక్షకులు శ్రోతలు పాఠకులు సైతము పొందుచున్నారు. కావున కవిత్వమునకు మఱియొక నిర్వచనముగూడ కలదు.

మానవభావోదయమైన రసస్వరూపమును శబ్దములచే వెలిఁకిదీయుటయు, దానిని అక్షరముల సంజ్ఞచేఁ జిత్రించి శాశ్వతముగా నిలుపుటకే కవిత్వమని పేరు. "నిలుకడ వలయుఁ గృతికి" అని అప్పకవి.

మఱియుఁ గొందఱు తత్త్వజ్ఞులు సృష్టియందుఁగల యేవస్తువు మానసముపై రసమునుగాని ఆశ్చర్యమునుగాని ఆవేశమునుగాని లేక యేలాటిపరివర్తనము, పరిణామములు, ఉదయింపఁజేసినను అవియన్నియుఁ గవిత్వస్వరూపములే యని తమలోని అవ్యక్తములైన వాగ్ద్వారములనుండి కవిత్వమునే చేయుచున్నవని అనేకవిత్వమని వారివాదము. అనఁగా ఆకాశమునందలి గంధర్వమందిరములు, మేఘమునందలి మెఱుపులు ప్రభాతసమయ శీతవాతము, పక్షులకుహూకలస్వనములు, వసంతవాసరములు, శారదచంద్రికాధవళములైన నిశలు, నవవికసిత సరోజసముదాయము, బంభరగానము మున్నగు విశ్వవస్తు ప్రపంచమంతయు కవిత్వమే. సమస్తము కవిత్వస్వరూపమే. ప్రతివాణియు ప్రతికళయు ప్రతిపదార్థస్వరూపమును ప్రతియవ్యక్తమధురపదార్థమును కవిత్వమే. కవిత్వమునకు బాహ్యమైన యొక పరమాణువైన లేదన్న నింక నది యతిశయోక్తి కానేరదు.

"కవియె విశ్వము విశ్వమే కవి నిజంబు"

కవి ప్రకృతినిజూచిపాడినగీతములుకలిసి కావ్యమనఁబడుచున్నది.

శ్లో. గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ,
గద్యపద్యోభయమయం కావ్యంకావ్యవిదోవిదుః.
"అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ
కావ్యమితి కావ్యసామాన్యలక్షణమ్"
"రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం"
"సగుణాలంకృతీకావ్యం పదార్థౌ దోషవర్జితౌ"

ఇట్లే యెందఱో లాక్షణికులు శబ్దములయందును, అర్థముల యందును దోషములుండకుండుటయు గుణాలంకారయుక్తములైన పద్యములుగాని గద్యములుగాని కావ్యము లనఁబడునని వ్రాసినారు. మఱియుఁ గొందఱు:

శ్లో. శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ, జీవితం వ్యంగ్య వైభవమ్
హారాదివ దలంకారాః తత్ర స్యు రుపమాదయః".

కావ్యమునకు శబ్దార్థములు శరీరము, ధ్వని జీవితము, ఉపమాద్యలంకారములన్నియు హారములు నగలు వంటివి. ఇట్లే మఱికొన్నిగలవు. మఱియు,

శ్లో. రసప్రధానశబ్దార్థా గుణాలంకార వృత్తయః,
రీతయ శ్చేయతీశాస్త్ర ప్రమేయం కావ్యపద్ధతిః.

శాస్త్రము ననుసరించి కావ్యపద్ధతి రసప్రధానములగు శబ్దార్థములు గుణములు అలంకారములు వృత్తులు రీతులతోఁ గూడియున్నది.

శబ్ద సముదాయము-వాచక, లక్ష్యక, వ్యంజకములని మూఁడు విధములు.

అర్థము-వాచ్య, లక్ష్య, వ్యంగ్యములని మూఁడువిధములు.

వృత్తులు - అభిధ, లక్షణ, వ్యంజనములని మూఁడువిధములు. వీనితో శబ్దములు కూడియున్నవి. ఈశబ్దరచనమున కైశికి, ఆరభటి, భారతి, సాత్వతీ అనునాల్గు వృత్తులుగలవు. ఇవి రసావస్థాన సూచకములై యున్నవి. ఇవిగాక వైదర్భి, గౌడి, పాంచాలి, శూరసేని, మాగధి యిత్యాదివృత్తులును గలవు.

శయ్య-పదముల అన్యోన్య మైత్రికి పేరు.

పాకము-అర్థగాంభీర్యమునకు పేరు. ఇది ద్రాక్ష, కదళి, నారికేళము. ఇట్లేమఱికొన్ని.

వ్యంగ్యము-ధ్వనికి పేరు. వీనితో గూడినవే కావ్యములు. ఈకావ్యములలో లాక్షణికమతముల ననుసరించి యనేక భిన్నభిన్న సిద్ధాంతము లేర్పడియున్నవి. ఇవి హృదయమును రంజింపఁజేయునవియును హృదయాకర్షకములును నై యున్నవి. గానము, చిత్రలేఖనము పదార్థవిజ్ఞానము మున్నగునవిగూడ కావ్య కుటుంబములోనివే యని కొందఱి సిద్ధాంతము; కాని వానియన్నిటికన్నను కవిత్వము భిన్నయనియు కవిత్వమువలనఁ గలుగు మానసికానందము అతీంద్రియమైన భావరసపూరపూరితమనియు దాని రసస్థాయికన్న మించిన దింకొకటి లేదనియు చెప్పకతప్పదు.

"పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ,
కోవేత్తి కవితాతత్వం శివోవా వేత్తివానవా."

అను ఆర్య నిర్వచనము మిక్కిలి కొనియాడదగినదై యున్నది.

గానము గానముసేయునప్పుడుండి వినువారికి యానందసంధాయకమై యొప్పుచున్నది.

చిత్రలేఖనమునకు కన్ను లుండకతప్పదు. చిత్రపటము పరిస్ఫుటముగ సాక్షాత్కరించును. పదార్థవిజ్ఞానముగూడ నట్టిదే. కాని కవిత్వమున కీనిబంధనముల (షరతుల)తో నిమిత్తములేదు. మానవుని జ్ఞానేంద్రియములయం దేదిలోటున్నను కవితారస సముద్రమున నోలలాడవచ్చును.

మానస సరస్సునందలి రాజహంసము, పాలకడలిలో వెలువడిన నెలవంక, చెఱకువిల్లున నెక్కుపెట్టిన పంచబాణముల పూవుటమ్ములు, మోహపీడిత గాయములనుండి స్రవించువచ్చు నెత్తురు నుండి వినఁబడు గీతము, మనకట్టెదుట నెట్టి చూపించును. చతుర్దశభువన బ్రహ్మాండము లన్నియు నొక నల్లపూసగా మార్చివేయును. అణువులో నణువై విశ్వరూపమును స్థూలావస్థలోఁ జూపించి హర్షించును.

ప్రియురాలి పలుకులముద్దు చక్కెరముద్దుగాఁబోసినప్పుడు దానిచి పాకమున కిట్టి రెట్టించున్నది. అదియతీంద్రియమైన యానందానుభవము. ఇది కవియొక్కఁడే ప్రపంచమునకుఁ జూపగలవాఁడు. ఇట్టి సన్నివేశ వాని జిహ్వాగ్రమున నున్నది. వాణి వానివాణియై యుండునన్న వింక నేటికొంటేయుండు. ఇంకొకని కీప్రసంగమునందు పాలుగూడుట కర్హతగ లేదు. స్థానములేదు. దానినే నిప్పుడొకింత వివర్ణింపవలసియున్నది.

మానవ మానసికావేశములను రసోదయమగునట్లు వాఙ్మయమునఁ బ్రకాశింపఁజేయుటకే కవిత్వమని యించుమించు నెల్లవార లంగీకరించిన ప్రధానాశయము. అనఁగా ప్రకృతియందలి సూక్ష్మాంశముల నేరియేరి సొగసైన పదము లమర్చవచ్చునోడిగ వానికొక వ్యక్తిత్వము ప్రసాదించి పాఠకులయెదుట సాక్షాత్కరింపఁజేయుటకే యని యర్థము. కావున,

చ. ఉరమున నున్న కుంకుమ మరుజ్జ్వలకోమలకాయపీక్షణా
స్ఫురదరుణాంశుపుంజమని పొంకిరి కన్గవకెంపు భాగ్యబం
ధురసమాజారుణత్వమని నూల్కొన నాడితి నెట్లుదాఁచెదీ
పరిమళవాసనాలహరి పర్వెడుచీన.............

అని నాయికానాయకుల పరస్పరస్వరూపము లెట్లు చిత్రించి నాఁడో చూడుఁడు. ఇట్లెన్నియో వాఙ్మయమున రత్నసన్నిభములై క్రొత్తక్రొత్తములుగ ప్రకాశించుచున్నవి. అవి సంతోషమున హర్షము దుఃఖమున ఖిన్నత ఆయాయవస్థాని శేషములయందు నావేశము నుదయింపఁజేయుచున్నవి. దీనినే కవిత్వమని నుడువవలసియున్నది. కావున కవిత్వ మన్నికళలకన్న నుత్కృష్టమయినదని తేలుచున్నది.

కొందఱు కవిత్వము కేవలము కాలక్షేపముకొఱకై పెట్టుకొను చేష్టయని దీనియం దుదయించు ఫలము శూన్యమని వాదించుచు ప్రకృతిశాస్త్రజ్ఞానమే యన్నిటికన్న నుత్తమమైనదని చెప్పుచున్నారు. కాని ప్రకృతిశాస్త్రజ్ఞానము (Science) అంతఃకరణ చతుష్టయమునం దొక టైన బుద్ధికిమాత్రమే వికాసమును గలిగించి జ్ఞానశక్తి నభివృద్ధి గావించు చున్నది. కవిత్వ మట్టిదిగాదు.

కవిత్వము బుద్ధ్యాది సమస్తేంద్రియములకు వికాసమును తేజస్సు ను ఆనందసంధాయకమైన మహాశక్తిని గలిగించుచున్నది. మఱియు అమృతమునందలి యజరామరత్వమును, మధుపానమునందలి మైకమును, తపస్సునందలి యాధ్యాత్మికశక్తి కుసుమములయందలి రామణీయకమును ఇట్లు ఒకటియేమి, లేకొవిధ జీవమైన యానందశక్తులీకవిత్వమునకే యలవడియున్నవనుటలో నతిశయోక్తి యొకింతయును లేదు.

కొందఱు ఈశక్తి స్వభావసిద్ధమై దృష్టిగోచరముగ ప్రకృతియందును గానమునందును చిత్రలేఖనమునందునుగూడ గలిగియున్నదనియు గానమునకు ఆలాపనము, చిత్రపటమునకు రంగులు తోడైనట్లే, కవిత్వమునకు పదము లావశ్యకములనియు, పదసమారోపణక్రమములైన కవి

త్వములకును, ఉపన్యాసములకు రూపకములకు చారిత్రక కథలకును నంతగా భేదము లేదనియు, ఇవియన్నియు కవిత్వములైనచో పైని పేర్కొనఁబడిన మహదాశయములకు లక్ష్యము కాజాలవనియు వాదింతురు.

కాని, కవిత్వమునుగూర్చి యిదమిత్థమని వచింపనలవిగాదని యిదివఱకే తెలియించితిని. కవిత్వ మనునది యొక రసావేశమైన అనిర్వచనీయమైన పవిత్రపదార్థము. అది పైని పేర్కొనిన యుపన్యాసములు నాటకములు (రూపకములు) చారిత్రక కథావిధానములయందును వచనములయందునుగూడ నిండి నిండారు కొండ మెండుగా నుండవచ్చును. సామాన్యముగా కథలలోనే కవిత్వము కలిసివచ్చుచుండును. ఎంతవఱకు కవిత్వకళ కవకాశము పట్టునో యదియంతయు కథ. కథాభాగమునువిడిచి లేక యనుసరించి కవిత్వము మేఘమునందలి మెఱపువలె తళతళ మెఱయుచు నద్భుతపఱచును. అందులోనే కవియొక్క జీవకళ ప్రకాశ మగుచుండును. దానిచేతనే పాఠకులు రసాబ్ధి నోలలాడెదరు.

చరిత్ర యొకదాని యుదంతమును మాత్రమే ప్రతిపాదింపనదిగా నుండును. అది కావ్యస్వరూపమున కవిచే మార్పఁబడినప్పుడు అందలి పాత్రల నిజస్వరూపములు వాని యుద్రేక పూరపూరితములైన మానసికాంతర పరివర్తనములు వివిధ కళాకలితములై వినూతన తేజో విలసితములై వెలయునట్లు చిత్రించును. అప్పుడా ప్రపంచమును పాఠకుఁడు ప్రత్యక్షముగా వీక్షింప నోపుటయేకాక ఆరసార్ణవమున మునిఁగిపోవుటగూడ తటస్థించును. అనఁగా రసాలముపై కోకిలము పాడుటను చూచి దాని మనోహరకుహూకలస్వనమును విన్నప్పుడు తా జేయానందము ననుభవించినాఁడో ఆయానందము పాఠకుల కలవడు పదములలో నుడువను. అదే పాఠకుల ననుభవింపఁజేయుచుండుట అనివార్యము. దీనికే కవిత్వమని నామాశయము.

పంజరబద్ధమైన ఒక చిలుక నవలోకించి దాని ప్రత్యవయవాంశమును విద్యుత్ప్రసక్తిని బరీక్షించి విద్యుత్ప్రభావమున దానిగూర్చి సభయందుపన్యసింప వచ్చును. కాని యదికవిత్వము గాదు; కథ.

కవిత్వములోఁ గూడ స్వరూప సాక్షాత్కారము గలదు. కవి గూడ స్వరూప సాక్షాత్కారముపై దృష్టి నిలిపియే కవిత్వమును రచించునుకాని ప్రత్యేక స్వరూప నిరూపణమునే యగత్యముగాఁ బెట్టుకొనక అది పాఠకుని హృదయముపై గట్టిరసమును ఎట్టి దయార్ద్రతను నుదయింపఁజేయుట కర్తవ్యముగనో అంతవఱకే దాని నిజస్వరూపమును జిత్రించుట కియ్యకొనును. అది మనుజుని గోచరమై పులకితునిగా జేయును. ఆ రసానుభవము ననుభవింప జేయుటకే కవిత్వమని పేరు. ఉపన్యాసములోఁ గూడ కవిత్వమువంటి రసావేశము స్వరూప సాక్షాత్కారపరత్వము మున్నగు కవితాలక్షణము లప్పుడప్పుడు గోచరించుచుండవచ్చును. కాని కవిత్వమును ఉపన్యాసమును రెండును రెండు వేర్వేఱుకళలు. ఉపన్యాసము ప్రేక్షకుల నలరించుటకై యున్నది. ఉపన్యాసకుఁడు సభ్యుల హావభావములను మానసిక పరిచయములైన అభిప్రాయభేదములను మార్చి తాఱుమాఱు చేసివేయును. వాని యావేశపూరపూరితమయిన వాగ్జాలము, భావగంభీరమైన సిద్ధాంతము, ప్రేక్షకులను నీటనో పాలనో ముంచివేసి తనకు వశంవదులనుగాఁ గావించును. కాని కవికిచిక్కులుటుక్కులతో గూడిన మలీమసములగు శ్రోతలతో పనిలేదు. అతనికి ప్రేక్షకులున్నను లేకున్నను లెక్కలేదు. అతనికన్యులతో ప్రసక్తి లేదు. ఈకాతని కీప్రపంచకముతోడనే సంబంధము లేదు. అతని హృదయమునందుద్రేకమునయించునో దానినొకరి ప్రేక్ష్యము లేకుండఁగనే స్వతంత్రముగా గానముచేసి ఆయా రసస్వరూపములను లెక్కలేనన్నిటిని చిత్రించి తన లేఖినీయమకుంచెతో వింతవింతలగు రంగులుపూసిపూసి మానసఫలకములపై గ్రుద్దిగ్రుద్ది భూనభోంతరాళము మారుమ్రోయునట్లు పాడిపాడి లేచిపోవును. ఆ రసప్రపంచమునకు పాఠకుని యీడ్చికొని పోయి నిలిపివేయును. ఆ భావామృతరసాస్వాదనము సేయించుచు తానొకయూల నవ్వో ఏడ్పో ఆశ్చర్యమో పొందుచు తోచుచుండును.

అది యేకాలమున నేసమయమున నేయవస్థయందైనా కవితను జదివినను ఆ పరివర్తనము పాఠకునకు గలిగించుచునే యుండును. ఇది నిరంతరాయమైన రసనిలయమున కునికి. శిలముకాని వాసిచెడని బీదవోవని వెలతగ్గని జగటుకాని రసమయపదార్థము. అదే కవిత్వము. మాకదే ఉపాస్యము. అదే పరమావధి.

అసలు కవిత్వమునకు వ్యక్తులతో పనిలేదు. కాని కొందఱు శృంగారకవిత్వ రచయితలు సఖ్యుల నుద్దేశించి లేక సంబోధించి నడిపించుచున్నారని చెప్పుదురు. కాని అదియును సవిమర్శముగా వితర్కించి చూచినచో అందును వ్యక్తిప్రసంగ ముండదు. ఆ నాయిక కావ్యనాయికగాని అస్థిమాంసమయవికారమైన మానవశరీర ధారిణియగు వ్యక్తి గాదని వెంటనే తోఁపకపోదు. కొందఱు, కవిత్వము ప్రేక్షకుల రంజింపఁజేయుటకై యేర్పడినదని చెప్పుచు నాటకము లుదాహరణముగాఁ జూపుచున్నారు. కాని నాటకమునందలి పాత్రధారియెదుట యెందఱో ప్రేక్షకులుందురు. వారినా దుద్దేశించి చరించిన లేక పాడిన వానిపాత్ర వపాత్రమై తగులబడినట్లే కవి తన తన్మయతలో తన కవితను రచింపవలసినదే కాని యొకరి విలాసార్థమై యొకరి యావేశమును నుజ్జీవింపఁ జేయుటకై యొకరి నెత్తిఁగొట్టి యొకరి నూరించుటకై రచింపవలసినది గాదు. అటులెవరైన రచించునెడ నది కవితగానేరదు. అందు కవిత్వమున కుండవలసిన జీవకళ యుండఁబోదు. అది కేవలము గంబద్ధమైన చెత్త. వృథా ప్రలాపము.

కవిత్వమేసమయమున నేరసమును సేకరించి సేకరింపబడెనో దానిని శాశ్వతముగా నిలిపి ప్రపంచజనమునకు కానుక సేయుటకే యేర్పడినది. తక్కినవి కేవల ముపన్యాసములు. సారహీనములు.

కవిత్వమునకు ఛందము, కథ (ఇతి వృత్తము అనఁగా ఏవనమో యేకోకిలమో ఏనదియో పూర్వుల యుదంతములో), భావము, రసము రసాత్మకములైన పదములు ధారాశుద్ధిగల శైలి, వరుస, విరుపు, పాకము మఱియు పూర్వోదాహృతములైన లక్షణములన్నియు కవిత్వమున కావశ్యకము లేవా? ఇందులో నేదికొఱవడినను కవిత్వము కానేరదా? అటు

లైన కవిత్వము లక్షణములచే బరివేష్టితమైన నొకమాదిరి భ్రాంతి యున్నది. కావున విజ్ఞులిది కవిత్వమనరు. పై లక్షణములు కవిత్వమున కగత్యమైన నుపకరణము లని మాత్రమే భావింపఁబడు చున్నవి. కాని అవి కవిత్వము కానేరవు.

ఒకకవితత్వజ్ఞుఁ డీలక్షణములకు చిత్రలేఖనమని నిర్వచించినాఁడు. కాని చిత్రలేఖనమువంటి రచనముగూడ కవి కుండవలసినదే. ఏలయన భావము, దానిస్వరూపనిర్ణయము కవిత్వమునకు ప్రధానాంగములు. కొన్ని కవితలందు స్వరూపముండి భావముండదు. కొన్నిటియందు భావముండి స్వరూపముండదు. రెంటియందేది లేకున్నను వెట్టిదే.

కాని స్వరూపము లేని భావములుగల కవిత్వమానందమునకు నిలయము గాకపోదు. ఇట్టి వెన్నిరోకలవు. ఆవిధాన మిప్పటి భావకవిత్వమునఁ జూడదగును. ఇదియే తెలుఁగుకవిత్వ మనవలసియున్నది.

ఈతెలుఁగుకవితలో సంస్కృతశబ్దము లుండఁగూడదని నాయభిప్రాయముగాదు. సంస్కృతభావములు, కవిసమయములు ఉపమానములు మున్నగునవి అనఁగా మోముచంద్రుఁడు కలువకన్ను, బింబాధరోష్ఠము, బాహువృణాళ నాళము మున్నగు సంస్కృతకవుల యలంకారములనే తెలుఁగువారెరువుదీసికొని కావ్యములల్లుచున్నారు. కావున నాదికవి నన్నపార్యుని మొదలు నేటివఱకైన కవులలో నిందుమిందుగా నెల్లరు సంస్కృతకవులని చెప్పవలసినదేగాని తెలుఁగు కవులుగారు. కావుననే వీరితెలుఁగు ప్రబంధములందు సంస్కృతకవులను బట్టులవలె

"లోకాలోకపరీతభూకలయమహా లోకోపకారంబుగా
శ్రీకల్యాణకరోరుకావ్యనియముల్, సిద్ధంబు గావించి సు
శ్లోకుల్ పూజ్యమతుల్ జగద్గురువులై, శోభిల్లుచున్నట్టి వా
ల్మీకివ్యాసమయూరబాణకవికాళీదాసులన్ గొల్చెదన్."

అనివ్రాసి పొగడినారు. కాని పారసీలోని హాఫీజుగాని ఇంగ్లీషులోని షేక్సుపియరును గాని పొగడియుండలేదు. అనఁగా ఆ సంప్రదాయములు లేవనిభావము.

దీనినిఁబట్టిచూడ తెలుఁగుకవిత్వ మింతవఱకెట్లుండునో ఇకమీఁద నెట్లుండవలయునో యిదిమొదలు నిరూపింపవలను గాకున్నది. ఇప్పుడైన ఆంధ్రులవ్యక్తిత్వమును ప్రతిపాదించి, ఆంధ్రులరసస్వరూపము, భావవైరస్యము, కల్పనాశక్తి పరజాతీయ సాంఘిక జీవనముల ప్రత్యక్షమగునట్లు సొగసైన కవితలల్లవలసినభారము ఆంధ్రులపై యుంకనుగలదు. అట్టి జాతీయతానూతనమైన వాఙ్మయము మన తెలుఁగునకెలుపడినప్పుడే గొప్పగౌరవమునకు అస్పదమగును. వంగవాఙ్మయము చేసినపని యిదియే.

# చిన్ననాటి ప్రేమ

కలశపూడి శ్రీశైలము గారు

నన్నుచూడ సిగ్గేల నా వన్నెలాడి ।
కన్నెత్తి మాటాడు కలికీ నాతోడి॥—
నలుగు దిక్కు జేపొద్దు నడిసేటిదోవా ।
పలకరిస్తె బాగోదు పడుసుదాన్ని బావా॥

పుట్టినాస నీమీద పెట్టుకొంటిని నేను ।
యీలాగు మాటాడ యిది న్యాయమా నీకు॥ నన్ను॥

తలుసుకుంటె నీమాట పులకరిస్తది వొళ్లు ।
నాదాన్ని నేకాను ననుకన్నవోరుండ॥ నలు॥

జొన్నసేలు కాసేటి చిన్ననాటిది ప్రేమ ।
మాయమర్మంలేక మనసిచ్చి మాటాడు॥ నన్ను॥
లెక్కలేనిదేవుళ్ల మొక్కుకుంటిని బావ ।
నన్ను నీకివ్వాలి ననుకన్నవోరంచు॥ నలు॥

'ఇండియన్ రివ్యూ' పత్రికా పంచవింశద్వార్షికోత్సవము (సిల్వరుజూబిలి) 24-1.1925, చెన్నపురి



Silver Jubilee of the "Indian Review" at S. I. A. A with Mr. G. A. Natesan, Editor, in the centre

లాలా లజపతిరాయిగారు, 4-1-1925, చెన్నపురి



Lala Lajput Roy, at Madras, 4—1—1925

విఠోబా ఆలయమునందలి రాతితేరు—హంపి



Stone Car in Vitoba Temple at Hampi

అఖిలభారత ప్రాచ్యవిద్వత్పరిషత్తు (మూడవసమావేశము), 1924 వ సంవత్సరము డిసంబరునెల 22 వ తేది, చెన్నపురి



The Third Session of the All-India Oriental Conference at Madras on 22nd December 1921

అఖిలభారత ప్రాచ్యవిద్వత్పరిషత్తువారిచే సమ్మానింపబడిన పండితబృందము - చెన్నపురి



Pandit Delegates honoured at the Third All-India Oriental Conference, Madras

# ఆంధ్ర వాఙ్మయ పరిణామము

కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

మహాకవి కాళిదాసు తన యూహాపోహల నెంతయర్థం బూహించియో కేవల మమత్వైక నిదర్శనంబుగ "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అని నిర్వచించియున్నాఁడు. తత్సూక్తిం బురస్కరించుకొని యయ్యర్థంబు నాంధ్ర వాఙ్మయపరంబుగ నన్వయించ వలనగునా? యని యూహం భావించినను బ్రహ్మసృష్టియె యట్టిదని నొక్కి వక్కాణింపం బడుటం జేసి యించుక వెనుక త్రొక్కుడి ముందు త్రొక్కుడిగనే యున్నది. సామాన్యముగా విశ్వకర్త యెల్లప్పటికిం జేసినంతఁ జేసి తగినంత మనోహరము వెలువరించి యెందో యొక్కట మాత్రము యత్కించిత్తు లోపము సేయుట సహజమని యెల్లరకుం దెల్లంబు. కాల వ్యత్యయముచే నయ్యయ్యవి యించుక భేదము గలిగి యుండినను నాది నుండియు నేటివఱకును బరమేష్ఠి సృష్టివ్యాపారము మాత్ర మొక్క పోల్కిగనే యుండి యుండవచ్చును. అట్లగుటం జేసి యనువాతన కాలమున వాఙ్మయములోనున్న విషయములు పూర్వమునుండి యున్నవేయని సిద్ధాంతము చేయవలయునన్నఁ జరిత్రాంశములు సాక్షివాదములు కాఁగల వనుటకు సందియముండదు. యుగాంతరముల సంపాదితములగు భారత భాగవత రామాయణంబులనేమి తక్కుంగల పురాణాదులయం దేమి దేశప్రస్తావములో వంగవంగకళింగాదులు పేర్కొనుటలో నీదేశము నాంధ్రమని పేర్కొనఁబడుచునే యుండెను. ఛప్పన్న దేశములలో నియ్యదియు నొకటై పేరువడసినదియె. ఆయాయి దేశములలో నాయాయి దేశభాషలె యుండియున్నట్లు లాంధ్రమునను నాంధ్ర భాషయె యున్నదనుటకు వేఱాలోచనము నుండదు. అయిననో నాఁడున్న యాంధ్రభాషకును నేఁడు వాడఁబడుచున్న యాంధ్రభాషకును దారతమ్య మెందున్నా? యన్నను విశేషముండఁబోదు. కాదేని యేకొంచెమో మాత్రము మార్పుండునేమో. అదియు నాయాయిదేశములం దుండు నుచ్చారణభేదమువలనే కలిగియుండును గాని యంతయు మార్పుగా నుండదు. ఇట్టి నాఁటినుండియు నాంధ్రభాష ప్రచారములో నున్నదియే కాని క్రొత్తదిగాదు. కాని యియ్యది మొదటి నుండియు కేవలము సంభాషణ మాత్రైకఫలము గలదియా? లేక పద్య రూపముగఁ బరిణమించి వాఙ్మయ బోధక మయినదియా? ఇటీవలనే దీనికిఁ బద్య పరిణామ మేర్పడినదియా? యని యూహింతము. ఛంద స్స్వరూపము లేనియప్పుడు సంస్కృతములో మహర్షి వాల్మీకి క్రౌంచమిథునములో నొకదాని వధించిన కిరాతుం జూచి పశ్చాత్తాప ముచే నుడివిన మాటలు ఛందోబద్ధములై పరిణమించినందున బ్రహ్మ దేవుఁడు రామాయణము ఛందోబద్ధముగా రచింపుమని యాజ్ఞాపించి యంతర్ధాన మయ్యె నన్న విషయము ఘంటాపథము. దీనిం బట్టిచూడ మహాముని వాల్మీకి 'మానిషాద! ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః' అని భాషింపకమున్న ఛందస్సు లేనట్లుగదా సారాంశము తేలుచున్న యది. అంతకుమున్ను జరుగుచున్న కాలములో నెట్లుండెనో తెలియఁ బడదు. అట్లే యియ్యాంధ్రభాషకును ఛందోమార్గ మెప్పటినుండి కలిగినదాయని నిర్ణయించుటకుఁ దగినంతటి సాహాయ్యము లేదనవచ్చును. భాషోత్పత్తినుండియె యుండవచ్చునని చెప్పుటకును నిదర్శనములు కల వేమో తెలియకున్న యది. పానీప్రకృతము వాఙ్మయమంతయు మూఁడు పాళ్లు శబ్దబ్రహ్మనుండియె యవతరించినట్లుగదా చాటించుచున్నది. అది మొదలె యాంధ్రము పద్యరూపమయినదని యెట్లు చెప్పవగునని ప్రశ్నించు వారలకు శబ్దశాసనుఁడు తనకు మున్నున్న యేయాంధ్ర కవీంద్రులం బేర్కొనె నని యుత్తరవాదు లనుచున్నారు. కవికాలమును నిర్ణయించుటకుఁ బూర్వకవిస్తుతి యనుకరించిచెప్పుట ముఖ్యాంశముగ సాధనిక పీఠికాకారకులమతమయి యున్నదిగదా? కొందఱు,అథర్వణాచార్యాదు లనేకులు కావ్యకర్తలు శబ్దశాసన కర్తలును శబ్దశాసనునికన్న మున్ను భాషాసేవకు లున్నారని చెప్ప నుంకింతురు. గతానుగతికముగా లోక మెంతదూర మొక్క త్రోవ త్రొక్కినను నన్నయాచార్యులె తనకు ముం దటివారల మతముల ఖండించుచుఁ బక్షాంతరీకరించుచు వాఙ్మయమును శాసించుటం జేసి యంతకుఁ బూర్వమందును గవీశ్వరులుండి పద్యరచయిత లయిరని తెలియుచున్నది. కాని కారణమేమో తెలియరాదు. నన్నయ కన్న మున్నున్న కావ్యకర్తల కింతపాటి ప్రాశస్త్యము గలుగక పోయి నది. వాఙ్మయమని యనకముందు భారత కవిత్రయము వారిని మాత్రము ప్రశంసించుచున్నారే కాని వారికిఁ బూర్వులమాట తలంచుట లేనట్టు లాంధ్రలోకమునకు సర్వసాధారణము. నన్నపార్యుఁడు శాసన గ్రంథనిబంధనమునఁ బూర్వాచారము పూర్వ కవిప్రయోగముం బట్టి పక్షాంతరముగా నయ్యయ్యెడలఁ జూపించియున్నాఁడు. అథర్వణా చార్యమతమనియు,కవిభల్లటమతమనియు,హేమాచార్యమత మనియు, మఱికొన్ని తనకుం బూర్వుల మతములను హెచ్చించుచునే పోయెను. ఇట్లు కవిభల్లటాదులమతమని చెప్పుటంజేసి నన్నయార్యునకుఁబూర్వము శబ్దశాసనకర్తలుండియున్నారని నిర్ధారణమయ్యె. ఈశబ్దశాసనకర్తలు శాసనము మాత్రమె చేసియుందురా? లేక శాసనీయం బగు వాఙ్మయం బునుగూడ రచించియుందురా? యని నిర్ణయింతము. గోడలేని చిత్త రువు వ్రాయుట యసంగతము. మఱియు నొకపదార్థమున్నచో తద్గత

ణార్థమయిన పరివార ముండుంగాని పదార్థములేని పరివార ముండినట్లు వాఙ్మయము వారిశాసనములకు నాధారమయియే యుండును. కాని అయ్యది ప్రకృతకాలములో నున్నట్లుగాని, యుండి ప్రచారములో నున్నట్లుగాని కనిపించుటలేదు. ఇట్లగుటకుం గాలబాహుళ్యమే హేతు వగునేమో యని సమాధాన పఱచుకొనక చేయునదియు లేదు. అప్పకవి యందుం దుదాహరణంబుగ నథర్వణాచార్యుల విరాటపర్వమం దని యుదాహరించుచు వచ్చెను. అంతవఱకును నా గ్రంథ ముండి యుండ వచ్చును గాఁబోలు. కాని యిప్పు డాభాగము పైకివచ్చినట్లు లేదు. ఏమయినదో తెలియదు. తాళపత్రగ్రంథస్థమై యున్న దేమో గ్రంథ శోధకమండలివారికిఁ దెలియఁగలదు. ఇట్లూహించుకొలఁదిని నీవాఙ్మ యమునకుఁ బద్యావతార మెన్నఁడని తెలిసికొనుటకు వీరికంటెఁ బూ ర్వులు మఱొకరు. మఱొకరికంటెఁ బూర్వులు వేఱొకరు. వేఱొకరి కన్న నింకొకరు. ఇట్లుపరంపరాప్రాప్తమయియే వచ్చుచున్న దనిచెప్పక తప్పదు. కావున నన్నయకన్న నెంతయో ముందటికాలమునుండియుపద్య రచనగలిగియేయుండవచ్చునని ఫలితార్థము. 13,14వందలఏండ్లనుండియున్న భారతాదులీనాఁటికిని చెక్కుచెదరక యథాపూర్వముగ నుండ నంతకు మున్నున్నయవి యెట్లు రూపుమాసెనో తెలియ శక్యముగాదు. ఆంధ్ర భారతాదు లేమి? యెన్నఁడో యుగాంతరములందలి గ్రంథములు మాత్రమేమిచెడినవి? ఈర్ష్యాపరవశులయి కొందఱు తమయశంబును నిల్పి కొన నుత్కృష్టంబగుదాని నాశముచేసి యున్నను నుండవచ్చునని యూ హించుట యసంభావ్యము కాఁబోదు. చరిత్రకారకులును నిఘంటు నిర్మాతలును దమతమరచియించు పొత్తంబుల 'హరిఃఓమ్' అని నన్న యాదిగనె వ్రాసియుండుటంబట్టి యంతకుఁ బూర్వికుల గ్రంథములు దొరకలేదని దీనితో స్పష్టపడును. పోనీ యెట్టకేలకు శబ్దశాసనునుండియే ప్రధానస్థితికి వచ్చినదనుకొందము. నాఁటినుండి నేఁటివఱకు నెప్పుడెప్పు డెట్లెట్లు భాషాపరిణామము గలిగియుండెనో విచారింతము. శబ్దశాసను సృష్టిమాత్రమున భాషాకుమారి కేవలము బాల్యదశలో నుండియున్నను, శ్రమాజన్యజ్ఞాన మంతమాత్రముగ లేకుండియున్నను గారణస్థానప్రాబ ల్యమునం గాఁబోలుఁ గించిత్ప్రౌఢదశక్కయయి ప్రవరించెను. శబ్ద బ్రహ్మయుఁ దొలుదొల్తనె భాషకేదోషముం బొసంగకుండునట్లు నిర్మా ణింప మొదలిడెను. తర్వాతఁ దనయాజ్ఞను భాషాసేవఁజేసి వాగను శాసనుఁడు ప్రళయమొందినవెంటఁ గొంతవఱకు మఱెవ్వరా జోలికిఁ బోయినట్లు దోఁచదు. ఆమధ్యకాలములో నంతనిశ్శూన్యమయి యున్న దనుట కేమిహేతువో తెలియదు. అట్లయిన తర్వాత సోమయాజిగా రవతరించి మరలఁ బ్రచారములోనికిఁ దెచ్చినట్లుగదా తెలియుచున్న యది. రెండవయవతారపురుషులు సోమయాజిగారును మొదటివారి మతానుసారమునం బోవుచు మఱింత కవితాకుమారికకుఁ జిల్కపల్కు లతిసొంపు గనుపింపఁజేసి పద్యపరిణామము చేసిరి. వారియనంతరము నను నొక్కింత వ్యవధి గలిగినట్లును నాకాలములోను భారతముం గాని తదన్యముగాని విచారించిన వారు లేనట్లే వరుసక్రమమునం జూడఁ బడుచున్నది. అట్లున్నతఱిఁ బ్రబంధపరమేశ్వరుఁ డవతరించి పైయిద్ద తికి నేకమార్గస్థుఁడైయుండెను. ఇప్పటికిని వీరిమువ్వురిమాటయనిన శిలాశాసనమయి సర్వజనీనమయి యాదరింపఁ బడుచున్న దనుటకు య నేనకులకు మాత్రము సందియము వొడమదు. వీరియనంతర కాలము నను విచారించినంతలో మఱికొంతవఱకును బ్రసిద్ధికెక్కినకవితారచన లేకుండి నట్లున్నది. అట్లు రాను రాను గ్రమక్రమ మభ్యుదయాభిముఖము నకుఁ దిరిగినది. నాఁటికిని నింపుమించుగ నాదికవీంద్రులత్రోవ నడచుచు నొక్కొక్కడ నొక్కొకవిశేషము స్పష్టముచేయుచు నూత్న నూత్న కలావిలాసంబుం జేకూర్చిరనుటలో నతిశయోక్తికాదు. 'విరళా నవమార్గ కారిణో బహవో ప్రావృతమార్గయాయినః' అన్నట్లు నడకకుం ద్రోవ యేర్పడిన నందన్ని విచిత్రములు పుట్టించినను బుట్టించవచ్చును. తలు దుగా వల్లే ప్రాథమికకవీంద్రుల నాదర్శముగాఁ గొని యొక్కొక్కడ వారివారి వాచాధోరణీనైపుణిం బ్రకటించియే యున్నారలు. కవితా రచనకుఁ బ్రథమకక్ష్య దాఁటి ద్వితీయకక్ష్యనధిష్ఠించు నప్పటికి యించుక విశేషము లావిర్భవించెను. చిత్రములు గన్పట్టెను. ముందు వారికన్నఁ దామించుక యతిశయముం జూపింపవలయునని వాఙ్మయమువెల్లడింపఁ జేసిరి. అట్టి మహాశయుల నందఱం జేర్కొనుటకు సమయముగాదుగాన స్థాలీపులాకన్యాయము ననుసరించి చూతము. పోతనామాత్యుఁడన్న సహజపాండిత్యుఁడు గాని గురుకులవాసముంజేసి విద్యనార్జించినవాఁడు గాదు. అట్టి భక్తాగ్రేసరుఁడు కవితానుగ్రహీతుఁడై తనశక్తి సామ ర్థ్యము నెల్లయెడల నొక్కచక్కి నమృతంపుసోనవాన గురియునట్లు భాగవతము రచించి వాఙ్మయమునకుఁ బ్రధానసేవకుఁడయి కృతార్థుఁ డయిన పుణ్యపురుషుఁడు. భాగవతేతరగ్రంథములు నేఁటివఱకును బహుకరిచేఁ బహువిధములుగ నానారూపములుగ నొకరికన్న నొకరు మించి యుండవలయునను జిగీషాపరతంత్రత బ్రద్దలుచేయఁబడుచున్నవి. కాని యొక్కరికేనియు నీభాగవత మెనమీఱుటలేదు. ఇందులకుం గారణ మేమయి యుండునని యూహింపవచ్చును. ఆకవి మహాశయుఁ డొనర్చిన యాంధ్రీకరణ పటిష్ఠమె కాని యన్యముగాదు. ఏయంశ మున లోపమని యెవరులు వ్రేల్వెట్టి చూపఁగలరు? భక్తికి నిధానము. శృంగారమునకుఁ బుట్టినిల్లు. విజ్ఞానమునకుఁ బెన్నిధి. నీతికిఁ దావలము. పుణ్యములకుఁ బ్రోవు. ఏయేయంశము లుండవలెనో వానిలో నియ్యది లోపమనుటకుఁ గోటీయక యాభక్తకవి తనపని నెరవేర్చెను. ఈ భాగవత కవీంద్రుని కవితామాధురిమ యనన్యలభ్యమని సారస్వతసేవ కులకును, అసూయా విరహితులకును దోఁపకమానదు. కవి సార్వభౌమ శ్రీనాథుఁడును సారస్వతమున కొక్కచక్కి నలంకారము దెచ్చిపెట్టి యున్నాఁడను నానుడియు వినఁబడుచున్నయది. వీరిమున్నగువారి కాలములోఁ గవితాకన్య యౌవనారంభదశలో నున్నంతటి ప్రశస్తికి వచ్చె. కాని కేవలము స్వాతంత్ర్యదశకు వచ్చినట్లు లేదని పూర్వాపర సందర్భమునఁ గొందఱందురు. అటుపిమ్మట కొంతకాలమునకుఁ బర్యాయముగా వభివృద్ధికి వచ్చుచుఁ గృష్ణరాయల యాస్థానమున సంపూర్ణ స్వాతంత్ర్యము వహించి విచ్చలవిడి ప్రచరించినట్లు తెలియు చున్నది. అన్నట్లు నాఁటికొక క్రొత్తసృష్టి చేయఁబడినట్లే కనఁబడు చున్నది. అప్పటికిని నాదికవీంద్రులజాడ వీడక రెండవవారికన్న మిన్నగ వాఙ్మయాభివృద్ధికి హేతుభూతమగు కవిలోక ముదయించినట్లు

గ్రమ్మఱ నదిచెలి గండలనారప
  రాజును మఱి బొప్పరాజు గంగ
తే. రాజు మొదలగు కవివరుల్ తేజమెసఁగ
  జెప్పి రా గ్రంథములయందె తప్పులొదవెఁ
  గాని పోతనకవీంద్రుని కవితయందు
  లక్షణం బెందుఁ దప్పు నా దక్షహరణ!

అని నిర్దోషముగ నెన్నికొనినాఁడు. దీనింబట్టియూఁ నభిమానము ముఖ్యమయినదని తేటపడును. ఇన్ని చెప్పినతానే

మ. పురుటింటం బసిబిడ్డపందమున నాహోవంగ నాఁడాత్మలో
  మురువొప్పన్ విషదుగ్ధయుక్తపయస్సు ముద్దాడురాకాసి సు
  త్రైలీఁ గిష్టంబుగఁ బాల్ద్రావుమిషచే నిర్దైన్యకాలంబునం
  గరణింగూర్చిన నందపుత్రునలనం బార్యుల్ ధరిత్రీశ్వరుల్.

ఇచ్చట మైత్రి చేసియున్నాఁడు. దీనికేమి సమాధానమో? తాను గూడఁ గుకవియే కావలయునుగదా? విశేషించి తెలిసిచేయుటం జేసి కుకవి శిరోమణియనిగదా చెప్పవలెనని కొందఱిమతము. మఱొక విషయమునకుఁ బోదము. జైమినీ భారతము, హంసవింశతి, ఆముక్తమాల్యద, పంచతంత్రము మున్నగు గ్రంథములలో ననేకస్థలములు వ్యాఖ్యాతలకుం జేతోహరములు కామిఁ గాఁబోలు దోషపక్షమున కీడ్వఁబడుచున్నయవి. చేసుక, పెట్టుక, కూడుక, పట్టుక ఇత్యాదిపదములు భూయిష్ఠముగా లెక్కకువచ్చును. ఇట్టి యసంగత ప్రసంగమును బహుళముగా వారుమాత్ర మేల వాడుదురు? పొరపాటన్న నొకటిరెండు. ఇట్లు గూడ రూపాంతరములు కలవని కాఁబోలు వారియూహ. అగ్రాహ్యము లయిన బహుళముగా వాడుదురా? ఇది తప్పనుటకుఁ దగిన నిరూపణమున కేమేని యాధారములున్నదేమో? చూడఁజూడ ఎవరెవరికెట్లెట్లు లూహాప్రపంచమునకుఁ దోఁచునో వారివారి మతానుసారముగ వ్రాయుటయు మతాంతరమును దూషించుటయుఁ బ్రాచీనమే కాని నవీనము గాదు. ఇందువిషయమై అప్పకవి దేశ్యలక్షణములు నిరూపించుచు

క. జలశయన యాంధ్రదేశ్యంబులు రెండు తెఱంగులయ్యె భువి శుద్ధాంధ్రం, బులు నన్యదేశజాంధ్రం, బులునా............

తే. ఆంధ్రదేశపురస్థాయులైన సకల, జనములకును మఱుంగు దేశంబులేక
తేటతెల్లమిగాఁ బల్కుమాటలెల్ల, నవని శుద్ధాంధ్రదేశ్యంబులనఁగఁబడును.

ఇందుల కుదాహరణంబుగ,

క. పాలును పెరుగును నేయిని, వాలాయంబుట్టెఁ బట్టి పంచుక త్రాగన్,
  తో లెక్కక నీబిడ్డఁడు, జోలీయిఁ కేమున్నదన్న శుద్ధాంధ్రంబుల్.

అని పంచుక, ఎక్కుక, అనునవియు సాంకర్యములేని శుద్ధాంధ్రములని యుక్తమోత్తమముగ నెన్నియున్నాఁడు. ఇక్కడి పంచుక యెక్కుక పదములుగూడ దోషభాక్కులు కావలయును. అప్పుడు శుద్ధాంధ్రములు తప్పులనవలసియుండును. జాతిసాంకర్యములేక పారిశుద్ధ్యముతో నున్నవానికన్న నన్యదేశ్యసాంకర్యము నొందినపదము లింక సాధువులెట్లో యాలోచింపవలయును. చాలమఱికి నిట్టిపదములు వాడుకలో నున్నవనవచ్చును. అట్లగుడు నిర్దుష్టంబులగు గ్రంథములు లెక్కడ నెయ్యవి దొరకును? ఇట్టివి యగ్రాహ్యము లయ్యెనేని యప్పకవి యేల యూరకుండును! విచారింప 'అడుగు ద్రొక్క నేల కాలు కడుగనేల?' యన్న ట్లగుచున్నది. ఇంటిపేరు పసగానున్న ఈ గవిత్వము పసగా నున్న దని పండితకవులచేఁ బేర్కొనఁబడిన చేమకూర వేంకటకవి విజయవిలాసములో క్త్వాంతమునకు ద్రుతమును దగిలించి

ఉ. పున్నమతేలఁ దత్పరము పొంతనె పోశిఖరాళిదాకి వి
  చ్ఛిన్నగతిన్ సుధారసము చింది పయిన్ దిగవార నంతనుం
  డిన్నెల పన్నగిల్లు నది నిక్కముగా దనికేని యూపదా
  ర్వాన్న పసిండిమేడలకు రాఁబనియే మిల సౌధధామముల్.

అని యిట్లు ప్రయోగించియున్నాఁడు. మహాకవి ప్రయుక్తంబగుచు నిది సాధువా? యసాధువా? యని కొందఱు పండితు లడుగుచున్నయది. భక్తాగ్రేసరుఁడును కావ్యకర్తయు దిగ్గజకవియునగు ధూర్జటి కవి కాళహస్తీశ్వరశతకమునఁ బలుతావుల నొక్కొక్కతెంగి ప్రయోగములు చూపియున్నాఁడు. భక్తికవి వాఙ్మయ నిబంధములకును దూరమని యన్నఁ జెప్పొచ్చి విరమించుటయుక్తము. కాని వాఙ్మయవిషయమునకుఁ బోయినచో మాత్రము కొందఱికి నీయాస్థలముల గతియేమి యని యడుగ నవకాశములు గలుగకపోవు. ప్రభావతీ ప్రద్యుమ్నము విజయవిలాసము మున్నగు పొత్తంబుల మిక్కిలి యనుపదమును ద్రుతాంతముగా చేసినారలు. ఇదియేపదము నవీనుఁ డొక్కఁడువాడ నదివిని ముక్కువిరుచువారు, మూతివిరుచువారు, ముఖము చిట్లించువారును గొందఱున్నారు. పూర్వకవి ప్రయుక్తమని గ్రాహ్యమో? యాధునికకవి ప్రచారితమని యగ్రాహ్యమో యెట్లు తెలియఁగలదు? కొందఱో మిక్కిలిన్ అనియును మందునందురు. తిమ్మకవి వాడి యుండఁడు పొరపాటను వారేమయినఁ జేయువారికి ఛందస్సు ప్రతిబంధకముగ నున్నది. (?) విజయవిలాసమున:

ఉ. అభినవ... శుభమతి నేలినందులకు మూలికఁజేసితి వార మిక్కిలిన్
  సభల గణింప......................(పీఠిక 53).

అని మార్చుటను వీలుగాకయే పాఠాంతమున నున్నది. మఱొక దాని విచారింతము. క్త్వార్థమునకు సంధిలేదు అని కంఠోక్తిగా నిరపింపబడినది. క్త్వార్థమనఁగా నసమాపకక్రియ కన్వయము చెప్పుచున్నారు. అసమాపకక్రియ క్త్వాంతమునకును ల్యబంతమునకును నొక్కపోల్కనే యుండును. ఎందేని పూర్వమహాకవులు సంధిఁజేసిన నది క్త్వాంతముగాదు ల్యబంతమని సమాధానము చెప్పుదురు. తమకిష్టమయినచో నెన్ని దారులకైనఁ ద్రిప్పవచ్చును. అంతమాత్రము సామాన్యుఁడే దైన నట సందర్భవ్యతిరేకమలంబునను నేమేమో తోఁచుచుండును. అక్కడ పై యభిప్రాయ మెట్లు పోవునో. బాలవ్యాకరణములో ఏగి ఏగియనుచో సంధిలేదని క్త్వార్థపరముగాఁ జెప్పఁబడెను. అయ్యర్థమున 'గత్వా గత్వా' యని యనుటకు మారు 'నిర్గత్య నిర్గత్య' యని ల్యబంతమును గలదుగదా? కాన సంధిచేయనగునా? అట్లయ్యెనేని దానిని నిరర్థముగఁ జెప్పుటంజేసి యాంధ్రమున నసమాపక్రియకు సంధి గూడదనియే దానియర్థమయి యుండును. ఇట్టి యసమాపక క్రియాసంధు లచ్చటచ్చటఁ గలవు. అనియును వారివారి యూహాపోహలతో అభిమానా నభిమానములఁ బురస్కరించుకొని సాధ్వసాధు

కం. ఉత్తమమగు వంశంబున
నుత్తమకులమున నిరం దను త్తమయశుఁడై
యుత్తమనృపతికిఁ బుట్టుట
నుత్తముఁ డనఁగం బరఁగు నుర్వీపతి మునుల్. (మార్కండేయ)

ఇట్టివి గలవే. యిప్పుడేమి సమాధానము రావచ్చును? ఏదో క్రిందుమీదు చేయఁబడునేమో? కొండొకసందర్భమున నిట్లుండినను సంతసింపవలసి యున్నది రెండని కొందఱి కానందము. మొదటికే మోసమన్నట్లు మఱి కొన్ని చిత్రవిచిత్రము లుదయించుచున్నవి. ఆదరింపఁ బడుచున్నవి. ఇదంతయుఁ గాలమహిమగాని వేఱొకటిగాదు. ఇదమిత్థమని సిద్ధాంతీకరించుటకుఁ దగినవసతుల నొక్కరైనం గల్పించలేదు. కల్పించిరో యెవరికివారే యగుదురుగాని సమష్టిగా నట్టిప్రసంగము చేయఁబడదు. ఈకాలమునఁ గ్రమముగ నిట్టిదశాపరిణామమునకు దిరిగినది. కనుక నెప్పటికేని నేలోటును గల్గకయుండునది యుండదు. అది నేఁడు కాక మొదటి నుండియు నున్నదని చెప్పనొప్పు. అదిగట్లో యింకఁ గొంతమాతము. నన్నయ కవిత్వము తిక్కనకవిత్వమువలెఁ బుష్టి లేదని కొందఱు పేరుపెట్టు చున్నారు. తిక్కన కవిత్వము చదువుటకు ధారాళముగ నడక పడదని మఱికొందఱు లోపమెన్నుదురు. కొందఱు ప్రెగ్గడకవితలోఁ జంద్రునిలోఁ గలంకమున్నట్లు మష్టికి నుగాగమరహితముగ నున్నదని తిన్నఁగ నెన్నుదురు. వేఱొకకొందఱు శ్రీనాథుని నైషధముకన్న శ్రీహర్షుని నైషధమె యన్వయించుననని వ్యంగ్యాభిప్రాయము వెలిపుచ్చుదురు. పోతన కవిత్వములో నన్నిపదేగాని అల్లక్కసేనే యని రేఫ అకారముల దగ్గఱఁబెట్టుకొనెదరు. ఆముక్తమాల్యదలో దుష్టసంధులు చేయఁబడిన వనియుఁ గళిపాకమనియు కొందఱభిప్రాయ పడుదురు. అవియివియన నేల! యొక్కొక్కదాని కొక్కొకపేర్వెట్టనిది లేనేలే దననగును. వారి వారి మతానుసారము దూషణభూషణములు చేయుచుందురు. మఱియుఁ బ్రకృతము ముద్రింపఁబడుచున్న భారతాది గ్రంథములలో బహుళముగ తెలుఁగుమీఁది సాంస్కృతిక పదములకు గసడదవలు వచ్చునట్లు కానవచ్చుచున్నవి. గసడదవల యాగమనమునకు నిత్యనిషేధమై కల్పకములలో 'తెలుఁగుమీఁది సాంస్కృతికపదములకు గసడదవలు రావు' అని నిషేధముగాఁ జెప్పఁబడినదిగదా యిచ్చట గతియేమో యాధారములు దొరకవు. కలవేమో పండితమ్మన్యు లెఱింగింపుటయు లేదు. కనుకనే 'ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః' అను కాళిదాసోక్తి సుష్ఠూక్తమయ్యె.

తే. వెలికి కొందఱి కొందఱి మతముచేత
నైషధంబు రాణించు నట్టివ్రాఁత
గాని నాకేమియుఁ లేమి దీనిచేత
నిందు మన్నించి యార్యుల్ క్షమింత్రుగాత.

# నిత్యసుఖము

పొన్నలూరి నరసింహంగారు

గీ. కామమును క్రోధమును మున్నుగాఁగఁ బ్రబలు
నట్టిశత్రుల నాఱింటి యందుఁ బ్రీతిఁ
జొరక, నిశ్చలచిత్తుఁడౌ పురుషుఁడెపుడుఁ
గాంచు దప్పక నిత్యసుఖంబుఁ బుత్ర!

గీ. ఒరుల భూషణ దూషణల్ సరకుఁగొనక
పరుల దుర్బోధనల్ వినవరుగఁబోక,
పేదసాదులఁ గనిన సంప్రీతిదాన
ధర్మము లొనంగి తనిపెడు ధన్యతముఁడు,
గాంచుఁ దప్పక నిత్యసుఖంబుఁ బుత్ర!

గీ. పరసతిని మాతృదేవతపగిదిఁ జూచి,
పరధనంబులఁ దృణముల భాతిఁ గాంచి
స్థిరమతిని సజ్జనక్షేమ మరయువాఁడు,
గాంచుఁ దప్పక నిత్యసుఖంబుఁ బుత్ర!

గీ. కులము లెంచక, సద్గుణములు గలట్టి
వారిఁ బొడఁగాంచి, సంతోష వార్ధిఁ దేలి,
సత్యమార్గంబుఁ దప్పక, సకలవైభ
వమ్ము లెల్లను, నిత్యసుఖమ్ము నంగ
వనుచుఁ, దలపోయుచుండెడు, మనుజవరుఁడు
గాంచుఁ దప్పక నిత్యసుఖంబుఁ బుత్ర!

గీ. కలిమి గలవాఁడనని ఘోరకార్యములను
జేయక, శరీర మస్థిరంబే యటంచుఁ,
దలచి వర్తించుచుండెడు ధన్యతముఁడు
గాంచుఁ దప్పక నిత్యసుఖంబుఁ బుత్ర!

గీ. సర్వకాలంబులందు నీశ్వరునిఁ గొలిచి,
సర్వభూతంబు లందును సమత మెలఁగి,
సర్వకార్య ఫలంబు నీశ్వరుని కొసఁగు
కలుష రహితుండు నిత్యసుఖంబుఁగాంచు.

యనియే చెప్పవలెను. క్రమక్రమముగా ఇట్టిధ్వనుల కలుగజేయు అవయవములను అవయవభాగములను కొంతవరకు స్వాధీనము చేసికొని శ్రోత్రగ వినినశబ్దముల (ధ్వనుల) నుచ్చరించుటకు సమకట్టును. ఏడెనిమిది మాసములు వచ్చినగాని శిశు విట్లు చేయజాలదు

ఇప్పుడు శిశువు ఎదుటివా రుచ్చరించు మాటలయందలి ధ్వనుల బాగుగ గుర్తించి వాటి నుచ్చరింపయత్నించును. ఇందు సులభసాధ్యములైన ధ్వనులనే పలుమారు ఉచ్చరించవచ్చును. 'తా' 'తా' 'తా' 'తా' అని పలుమా రుచ్చరించుట మన మెరుగుదుము. ఈధ్వనిని చేయగలపిల్ల యూరకున్న సమయములో దానియొద్దకువెళ్లి 'తా' 'తా' అని మన మనిన పిల్ల తిరుగ 'తా' 'తా' అని యెన్నియోసారులు అనును. "మా పిల్ల 'తాత' అని అంటుంది" అని జనులు సాధారణముగా చెప్పు అభిప్రాయముతో అనుట వాడుకకలదు. శిశువు అనినది 'తా' 'తా' ఇంతియే. ఈరెండును కలిపిన 'తాత' అవునని యు, 'తాత' అనుపదము ఒకనామమనియు శిశువు కించెమాత్రమును తెలియదు. 'తా' 'తా' అనునవి శిశువున కేమియు నర్థము నీయవు; కనుక ఏయర్థముతోగాని దానిని శిశువు ప్రయోగించియుండదు.

శిశువులు ధ్వనులచేయునపుడు హల్లులను శక్తికొలది ఒత్తిపలుకుటయు, ఆధ్వనులలో వారిభావములు జొప్పించుటయు కలదు. 'త' అని పలుకుటకు మారు, ఒక్కొక్కసారి 'త్త' అని పలుకుదురు. దాని విని, శిశువు 'అత్త' 'అత్త' యనుచున్నదని దాని అత్తలనుకొని యానందించి ముద్దాడుదురు.

ధ్వనులను వానియర్థము నుద్దేశించిపలుకుటకు పూర్వమే యితరులు పలుకుశబ్దముల యర్థము గ్రహించుశక్తి శిశువున కుండును. శిశువు బుగ్గను ముద్దాడినవెంటనే దానినోటివద్ద మనబుగ్గనుపెట్టి 'ముద్దాడు అమ్మా, ముద్దాడు' అని కొన్నిసారులు నేర్పిన అది ముద్దాడుట నేర్చుకొని, ఇకముందు ఎప్పుడు ముద్దాడుమనినను అది ముద్దాడగలిగి యుండును. 'దాయి' 'దాయి' అని మనము పిలచినపుడు, చేయిచాచి వ్రేళ్లతో తాను పిలువవలెనని మన యభిప్రాయమైనట్లు గ్రహించి తోడనే తానట్లు చేయును. పిల్లలకు మాటలు రాకపూర్వమే 'తారంగం' అమ్మా, తారంగం' 'ఏనుగమ్మా యేనుగ' 'గుమ్మాడమ్మా గుమ్మాడి' అనినపాటలు పాడుచు పిల్లలనాడించుట మన మెరిగినదే. కొంత యలవడినపిమ్మట, ఈ పాటలను ప్రారంభించినతోడనే శిశువులు ఉచితరీతిని ఆడుదురు. మన యుద్దేశములను మనము ఆడుమాటలవలన గ్రహించుశక్తి మాటలు రాకపూర్వమే వారికిగలదు.

కాని శిశువుల గ్రహణశక్తికి మేరగలదు. అందు లోపములును గలవు; అది సంపూర్ణమని చెప్పుట కేమాత్రమును వీలులేదు. గిన్నెతో పాలనుతెచ్చి శిశువుకు పోసినతరువాత గిన్నెనుచూపి 'గిన్నె ఇదిగో' అని చెప్పినపిమ్మటగిన్నె యేదియనిన శిశువుగిన్నెవైపు చూచును. తల్లిచేతిలో గిన్నెయున్నపుడే దానిని శిశువుగుర్తించి మన మడుగుప్రశ్న గ్రహింపగలదు. ఇంకొకరు ఆగిన్నెను చేతబట్టుకొని 'గిన్నె యేదీ' అనిన శిశువు కేమియు తోచదు. అనగా మొదట యేపరిస్థితుల మధ్యను ఒకవస్తువును చూచునో ఆ పరిస్థితుల మూలముననే ఆవస్తువును గ్రహింపగలదు. ఇట్టి పరిస్థితుల సమూహములను బట్టి శిశువు ఇతరవస్తువులనుగూడ గ్రహింపగలదు. మాటలను గ్రహించలేని కాలమున పరిస్థితులనుబట్టి వస్తువులను ఆనవాలు పట్టియుండుసరికి కొంతవరకు శిశువు తనశక్తిని వృద్ధిపరచుకొని యుండును. భాషాజ్ఞానమును సంపాదించుటలో శిశువు ఒకమెట్టు గడచెనని చెప్పవచ్చును.

రెండవమెట్టును జేరినప్పుడు వస్తువు నామమునుగూడ పరిస్థితులతో గలిపి వానినన్నింటిని ఒకేసారి గ్రహించును. ఈపరిస్థితులు సమూహమందేదయిన నొకవేళ లోపించినయెడల శిశువున కింతయో కష్టముగనుండి యది యేడువసాగును. ఇప్పుడు మనము శిశువులకు నేర్పుమాటలను మనము లేనప్పుడును వారిలోవారే ఉచ్చరించుకొందురు. ఇట్లు మనల ననుసరించి మాట్లాడుచు వచ్చిన కొంతకాలమునకు పరిస్థితులతోపాటు అర్థమును గ్రహించుట క్రమముగ మానివేసి శబ్దమును అదినిరూపించు వస్తువుతో గలిపి గ్రహించుసామర్థ్యము వచ్చును. 'దాయి దాయి' అమ్మమ్మ' 'తా, తా' మొదలగు ఒకటియేయక్షరభాగములుగల మాటల నెక్కువ సులభముగా గ్రహింపగలదు. ఈ మాటలచే తెలియబడువానిని చూచుటతోడనే శిశు వామాటల నుచ్చరింపగలిగి యుండును.

తన చుట్టుప్రక్కలనున్న మనుజు లెట్లు మాటలమూలమున భావప్రకటనము చేసి వ్యవహరించుదురో శిశువులు చూచిచూచి వారికి ననుకరణశక్తి ప్రబలి ఆమాటల నుపయోగింప యత్నించుచుందురు. పిల్లి 'మేవ్ మేవ్' అని యరచుట శిశువు నాకర్షించును. తరువాత పిల్లి నెప్పుడు చూచినను 'మేవ్ మేవ్' అని దాని గుర్తించి దానినాపేరుతోనె గ్రహించును. కాని 'పిల్లి, పిల్లి' అని పెద్దవారు ఆజంతువు ననుట గ్రహించి తానును 'పిల్లి' అను మాటను వాడుచుండును. తనయింట నున్నవారు మాటాడుభాషనే శిశువులు అనుసరణచేసెడు అలవాటు చేతను నేర్చుకొందురు. చెవిటిశిశువులిట్లు భాషను వినుటకు శక్తినొంది యుండరు గనుక వారికి భాష యలవడుట మిక్కిలి కష్టము.

ప్రపంచ వ్యవహారములందు భాషయొక్క యావశ్యకతను కనిపెట్టి దాని నెట్లు పూర్వులు వాడుకలోనికి దెచ్చిరో యావిధముననే శిశువును తాను లోకమునందలి వస్తువులను గూర్చి నేర్చుకొనుటకును తన సౌకర్యముల నేర్పరుచు కొనుటలోను, తనకు కావలసినదాని నడిగి తీసుకొనుటకును భాష యావశ్యకమయి యుండును. అవయవములచే చేయు సంజ్ఞలు తృప్తికరముగా నుండవు శిశువునకు, ఒకమూల కొన్ని వస్తువు లున్నవి. అందొకటి శిశువునకు కావలసియుండిన, మాటలురాక పోవుటచే వ్రేలితో ఆదెస దానినిచూపి తలనూపుచు అది తనకు కావలెనని సంజ్ఞచేయును. అప్పుడు శిశువునకు కావలసిన వస్తువు నిచ్చిన సరియే; లేకున్న అది యేడ్చును. ఆమూలనే యున్న వస్తువులలో నొకదానికిబదులు నొకదానిని శిశువునకు చూపవలసియుండును; అందు తాను కోరినవస్తువును చూపినపుడు ఏడ్పును మానును. ఇంత ఆలస్యమును శిశువు సైపలేదు. అందుచే మాటలనేర్చుట దానికెంతయు అవసరము. కొన్ని

మాటలనేర్చినపిల్ల తనకు కావలసినవస్తువును పేరుతో ఒత్తిచెప్పి ముఖ లక్షణములవల్లను దాని సూచించును. అవయవములను శక్తికొలది చూపు టయును కలదు.

వస్తువులపేర్లను కొన్నింటిని నేర్చినప్పటికిని, ఆయావస్తువుల ప్రత్యేకగుణములను లక్షణములను గుర్తింపక, శిశువు, వాని మూలమున తనయందు జనించుభావములతో నేవానిపేర్లకు సంబంధ ముండునను కొనును. 'బెల్లము' అను పేరునేర్చిన పిల్లకు రుచిగల పదార్థమును దేని నిచ్చినను అది బెల్లమేయను ఊహను పొంది ఆ పేరుతోనె వానినెల్ల పిలుచును. తరువాత బెల్లముయొక్కరుచి 'తీపి' అనుపేరు నేర్చినపిమ్మట 'జంతికను' ఇచ్చి దానిని శిశువు తినినతరువాత 'ఇది ఏలాఉంది' అని అడిగిన 'తియ్యగా ఉంది' అనిగాని 'తియ్య, తియ్య' అనిగాని అది చెప్పును. ఇంటిలో 'అప్పచ్చులు' చేసినరోజున సుమారు మూడుసంవత్సరములపిల్ల 'అప్పచ్చి, ఏం!' అని తల్లినడిగినది. ఈరోజు పండుగ అని ఆమె సమాధానము చెప్పెను. మరునటిదినమునుండి 'అప్పచ్చులు' చేసిన ప్రతిదినమునను 'పండుగ, పండుగ' యనుచుండెను. ఇంకొక చిత్రము. తనకు 'అప్పచ్చు'లమీద కోరికగలిగినపుడు 'అమ్మా, పండుగ కాదూ?' అని తల్లిని అడుగుచుండెను. తాను క్రొత్తయంగీని తొడుకొనినపు డెల్ల పండుగదే! తనకు ప్రాద్యముగ నుండునది యెల్ల పండుగదే యయినది! పిల్లిపిల్లలు సంతోషముగా ఆడుకొనుచుండుటచూచి ఎంతో ఆతురతతో ఇంటనున్నవారందరితోను 'చూడు, చూడు, పండుగ' అనిచెప్పి ఎంతో ఆర్భాటము గావించెను!

పదార్థములందు సామాన్యగుణములను, అవి కలిగించుభావములను పిదప బాగుగ గుర్తించి వానిని తరగతులుగ విభజించుశక్తి కలుగును.

ఒకవస్తువుయొక్క ప్రత్యేకలక్షణములనుగూడ గుర్తించి దానిని పేరుతో పిలుచుటకు తగినవిచక్షణశక్తి నెలలుగడచినకొలదిపట్టువడును. తన తండ్రినిచూచి యాతనిగుర్తించి 'నాన్న'యనిపిలుచును. ఏడాదిమాత్రము గడచినపిల్ల ఆకలయినపుడు తన 'బుల్లికంచము'నే తీసి దానిముందర కూర్చొనును. ఇట్లు గుర్తించుశక్తి చాలనపుడు శిశువులు పొరబడు టయును కలదు. పినతండ్రినిచూచి పొరబాటున 'నాన్న' అని పిలచు టయు, ఒక్కొకప్పుడు గలదు. అప్పుడు దగ్గరనున్నవారు 'నాన్న కాదు, 'చిన్నాన్న' అని తప్పును దిద్దుదురు. ఇదేవిధమున మనశిశువులకు బోధించవలెనను ఉద్దేశము లేకయే బోధించుచుందుము; లక్షణము లందు స్వల్పభేదములనుగూడ వారు గుర్తించగలుగుశక్తి నిచ్చుచున్నాము. మొదట శిశువుల నందరిని 'పాపాయి' అనే పిలచును. ఈయవస్థయందు సామాన్యగుణమునే గుర్తించును; పిమ్మట ఆపాపాయి పరిచయయిన పేర్లను తెలుసికొనును. వారియందలి ప్రత్యేకలక్షణములగూడ గుర్తించును.

వివిధవస్తువులందలి ప్రత్యేకలక్షణముల నెఱుగు సామర్థ్యమల వడినతోడనె ఆయా లక్షణములుగల వస్తువుల కన్నింటికిని సంబంధ మూహించి యొక్కతరగతిగా వానిని చేర్చుచుండుటను శిశువు గ్రహించును. ఇట్టిశక్తి కలిగినకొలది శిశువులు పదజాలము ఎక్కువగును. ఇట్టిశక్తి శిశుమానసవృత్తిపై నెంతయో ప్రభావము జూపుచుండును. గులాబీ, మందార, గన్నేరు, నిత్యమల్లి, కేవడార, ఈ పువ్వులన్నియు ఎఱుపువర్ణముగలవనియే వారి యభిప్రాయము. పిమ్మట వీనియందలి భేదముల నేర్చికొందురు. మొదట సాధారణముగా శిశువులు మొగ్గలను, రేకులను, కాడను, తొడిమ-వీనినన్నిటిని పువ్వులనియే యనుకొందురు. లోకానుభవములో ఇతరులతో సంపర్కము గలుగుకొలది వానినన్నిటి వేఱుపరచును; ప్రత్యేకపేర్లను నేర్చికొనును. మనమాడుకొను మాటలను మనప్రక్కనున్న శిశువులు మనకు తెలియకుండగనే నేర్చికొందురు; వానియర్థము స్పష్టముగా తెలియకున్నను పదములతో సంతుష్టి పొందుదురు. ఒకమారు కోపమువచ్చి నౌకరును 'గూస్' అంటిని. శిశువు నాప్రక్కను అప్పుడున్నది కాబోలు. మరియొక అరగంటకు 'గూస్' గూస్, అని ఆశిశువు తనబొమ్మను అనుచుండెను. ఇంతమాత్రమున 'గూస్' అనుపదమున కర్థము శిశువునకు తెలియునని మన మనుకొనగూడదు. అర్థము తెలియకపోయినను సందర్భానుసారముగ వానిని ప్రయోగింతురు శిశువులు; కనుక శిశువులయొద్ద మాట్లాడునపుడు చెడ్డమాటల నెంతమాత్రము ఆడగూడదు.

శిశువులు పదములను పరిచయయినయర్థమున తమ సందర్భమున నుపయోగించుటలో వారిమనస్సు కొన్ని యవస్థలగుండ పోవుచుండ వలెను. మొదట వస్తువును చూచినదాని పేరు స్ఫురించును. ఆపేరును పలుకునపుడు ఆవస్తువుయొక్కరూపము దానిమనసు ఎదుట నుండు నని మనము తలపవచ్చును. 'మ్యావ్' అనుదానిని ఇంటనున్న తెల్లపిల్లి పేరని శిశువు తలంచును; తరువాత ఏరంగుపిల్లికనబడినను 'మ్యావ్' అనును. ముందు 'మ్యావ్' అనుధ్వని శిశువునకు తెలియజేయునది యిప్పుడు మారిపోవును. ఈపదము అలవడినపిమ్మట పిల్లియొక్క యాకారము నెంత మాత్రమును మనస్సునకు తెచ్చికొనకయే దానిసరిగా వాడుచుందురు; పరులువాడిన సులభముగ నిట్టే గ్రహింతురు.

తొలియవస్థలో నొకశిశువు తనకుకనబడిన జంతువుల నన్నియు 'తువ్వాయి' (ఆవు) అని పిలచెడిది. 'తువ్వాయికి' నాల్గుకాళ్లుండును. కనుక నాల్గుకాళ్లున్నవన్నియు 'తువ్వాయి'లు అని శిశువుతలచుటయం దాశ్చర్యమేమియును లేదు. శిశువుయొక్క మానసము పెంపుకొందుటలో నిదియొక యవస్థయని గ్రహింపనగును. శిశువు ఒకపదమును తప్పుగ ప్రయోగించిన 'ఆపదముకాదు ఈపదము' అని దానిని సవరించి నేర్పుచుందుము. మనము వాడుచుండు భాషను వినినకొలదియు పదప్రయోగమునకు దనంతట నదియే శిశువునకు అలవడును. తాను యితరులతో సంపర్కము గలుగకేసికొనకుండలేదు; కనుక ఇతరులు వాడునట్టి పదములవాడుట శిశువున కావశ్యకతయయి యుండును. పరుల పద్ధతుల ననుసరించుస్వైజము శిశువు నెక్కువగనుండుట భాషాజ్ఞాన సంపాదనమందు ఇది తోడ్పడును. ఈకారణముచే శిశువు మిక్కిలి చురుకుగా భాషను నేర్చుకొనగలదు.

ఇట్లు పదములను వాని ప్రయోగమును నేర్చికొనుట శిశువులకు సులభమని తలంపరాదు. వా రెన్నియో పాట్లుపడుదురు. వారి కృషి

యందు విక్కిలి నవ్వుపుట్టించునట్లు వారు పదములను ప్రయోగింతురు. శిశువులు చూచువస్తువు లనేకము లుండును. వా రెరిగినపదములు కొన్ని మాత్రమే. పేరులు తెలియని వస్తువునకును, పేరులు తెలిసిన వస్తువునకును కొంచెము పోలికయున్నను కనిపెట్టి తెలిసియున్న పేరుతో మొదటిదానిని పిలుతురు. "నాన్నా, నేను క్రొత్తపాకినీ (పరికిణీ) తొడుక్కున్నా. నువ్వూ క్రొత్తపాకినీ తొడుక్కో!" అన్నదొకపిల్ల. శిశువు భాషలో అందరు వేసికొనుదుస్తులును 'పాకినీ'లే. పెనసలు, కలము, బలపము, సుద్దకణిక, ఇట్టి వ్రాయుసాధనముల నన్నింటినిఒకేపేరుతో పిలుచును; వానిలో మొదట ఏపేరునేర్చుకొనునో దానిని మిగిలిన వానికిని వర్తింపజేయును. బేడకాసును 'బుల్లి రూపాయి 'పాప రూపాయి' అని పిలిచి, రూపాయికిని బేడకాసునకుగల పరిమాణమునందలి తారతమ్యమును సూచించును. ఒకపిల్ల పేరంటమునకుపోయి చేత పసుపు పెట్టుకువచ్చినది. ఇదియేమి అని దానినడిగిన 'ఇది పేరంటం'అని బదులు చెప్పెను. శిశువు మనస్సునందు పేరంటమునకును, అచ్చటఇచ్చు పసుపునకును, ఎక్కువసంబంధ మున్నట్లు తోచును.

'నిన్న' 'రేపు'; 'పొమట' 'అమ్మట' 'వమ్పట' 'వెల్లుట'; ఇట్టి పదములలో ఒకపదమునకు మాఱు రెండవదాని నుపయోగింతురు శిశువులు. శిశువు ఒకరాతిని ఎత్తవలెనని చూచినది; కాని దానినెత్తలేక పోయెను. వెంటనే దానిని 'మొద్దురాయి'అని విసుగుకొనెను. ఒక నున్నటి రాతిపై తాను కొబ్బరి ఉంగరమును అరుగదీసికొను చుండెడిది. ఆరాయి శిశువుభాషయందు ఉంగరంరాయి' అయ్యెను. ఒకసారి శిశువుకాల్వలో పడవపై ప్రయాణముచేయుట తటస్థించెను; అప్పుడు శిశువు దానిని 'కాలువిల్లు' అని పేరుపెట్టి 'బువ్వగది' 'పడకగది' 'నాన్నకచ్చేరీగది' ఇవి యన్నియేవి!' అని వరుసగా నడిగెను. ఇట్టి పేర్లు ఎంతవరకు ఉచితముగ నుండునో శిశువులతో సంపర్కముగల వారికి తెలియకపోదు. వర్షము కురిసినపిమ్మట కప్పలు బెకబెక లాడుట తరుచు వినినశిశువు వర్షమువచ్చుటచూచి "బెకబెక, బెకబెక. అదిగో" అని తల్లికి చూపిచెప్పెను.

మానవులలోని సంబంధములను అచేతన పదార్థములందును ఆరోపించుదురు. కొందరు శిశువులు ఒకపిల్లకు 'వంకాయి' పేరుమాత్రమే తెలియును. ఒకనాడు సంతనుండి కూరలనుతెచ్చి సావిటిలో మూల పోసి యుంచితిని. ఆపిల్ల కూరలయొద్దకుపోయి పెద్ద అనపకాయలను తీసి గోడకు చేరగిలవేసి నిలువబెట్టెను. దానిప్రక్కను వంకాయను దోసకాయను పెట్టియుంచెను. అప్పుడు నేపిల్ల 'అవియేమిటి అట్లా పెట్టినావు?' అని అడుగగా 'ఇదివంకాయ; ఇదివంకాయ తల్లి, ఇది అమ్మమ్మ' అని వరుసగా వంకాయను, అనపకాయను, దోసకాయను చూపెను. మానవులకుగల బాంధవ్యమును ఇతరజంతువులలోను కల్పించి శిశుగీతములపాడుట మనగృహముల సామాన్యమే. ఇవి శిశువుల కెంతయో సంతోషమును కల్గించును. అందొకటి నిక్కడ వ్రాయుచున్నాను.

కప్ప నీ అప్ప
బల్లి నీ బావ
బొమ్మ నీ అమ్మ
చీమ నీ చెల్లెలు
తొండనీ తోడికోడలు

ఇవి అర్థములేని పాటలయినప్పటికిని [Nonsense Rhymes] పిల్లలకు వీనివలన కలుగు ఉత్సాహమునుబట్టి సారస్వతమందు వీని కుచితమైన స్థానమునకు తగినవి.

తన్ను సంరక్షణచేయు వారందరును తనకు అమ్మవేయని ఒక శిశు వభిప్రాయపడి 'బాయిఅమ్మ' 'బువ్వఅమ్మ' పాలిచ్చు తల్లిని బువ్వపెట్టు పినతల్లని పిలిచెడిది. మేము కాపురమున్న యింటిలో నిక రెండు కుటుంబములవారు కాపురమున్నారు. అందొక కుటుంబము లోని యామె తరుచు శిశువునకు 'అప్పచ్చి' పెట్టుచుండెనేది. ఈమెను శిశువు 'అప్పచ్చి అత్త' అని పిలచెడిది. రెండవకుటుంబములోని యామెకు 'పాపాయి' ఉన్నది; కనుక ఈమెను 'పాపాయత్త' అను నామముంచినది!

ఒకశిశువును నిద్రపుచ్చుటకు దానితల్లి 'గండుపిల్లి వస్తుందమ్మా! నిద్రపో' అని భయపెట్టుచుండెను. ఒకనాడు నేను పొరుగూరునుండి వచ్చినస్నేహితునితో భోజనము చేయుచుండ ఆపిల్లి మారాముచేయగా నేను నాస్నేహితునిచూపి "అదుగో! బూచాడు. అల్లరిచేస్తే ఎత్తుకు పోతాడు" అంటిని. పిల్ల తనపెంకితనమునాపి, "బూచాడా? గండు బూచాడా! అని ప్రశ్నించెను. ఆస్నేహితుడు మాయింట కొన్ని దినములుంట తటస్థించెను; ఇన్నిరోజులును బిడ్డ ఆయనను గండు బూచాడనియే పిలుచుచుండెడి. ఆయన బిడ్డయందు వాత్సల్యము చూపుచుండుటచే యీశబ్దమందలి యర్థము భయంకరము గాక యుత్సాహకరముగా నుండెను. ఇట్లు కొంతకాలముజరుగ మాయింటికి వచ్చుచుండువారిలో కొందరు పెద్దవాండ్రుగూడ ఆయనను ఈనామముతోనే హాస్యమునకై పిలుచుచుండిరి. ఆబిడ్డ తన చెలికాండ్రకు ఈయనను చూపి 'గండుబూచాడు' అని చెప్పెడిది. ఇట్లు భాషను కూర్చుట యందును బిడ్డలు తమ నైపుణ్యమును జూపుచుందురు,

మాటలురాని యిద్దరుశిశువుల నొకచోనుంచిన వారిద్దరును కొన్ని ధ్వనులను గుర్తులుగాజేసికొని వారి యభిప్రాయముల నొండొరులకు దెలుపుచు నాడుకొందురు. మూడునాల్గుసంవత్సరముల పిల్లలయినను వా రాడుకొనునపుడు కొన్నిమాటలకల్పించి వాడుచుందురు; ఆవశ్యకతయే వారిట్లుచేయుటకు కారణమయియుండును. ఇంటనున్న వారు మాట్లాడు భాష నొల్లక కొందరుపిల్లలు మాటలను తమంతటతాము సృష్టిచేతురు.

శిశువులు పదముల నుచ్చరించుటనుగూర్చిన విషయములకొన్నింటి చెప్పవలసియున్నది. శిరము, గొంతుక, వీనియందలి కండరము కదలుటచే ఉచ్చారణ సాధ్యమగుచున్నది. ఏయేకండరములు కదలునో, ఏతీరున అవి యెంతవరకు కదలునో యను అంశములబట్టి ఉచ్చరింపబడు ధ్వని

యుండును. కనుక ఉచ్చారణ క్రమముగ నుండుటకు శిశువునకు ఆయా కండరములు స్వాధీనమున నుండవలెను. శిశువు వానిని స్వాధీనము చేసికొనుటకు కొంతకాలము పట్టును. ఆకారణముననే పదముల నుచ్చరింప గల్గుటకు పూర్వమే వానిని గ్రహింపగలరు. కండరముల సులభముగ కదిల్చుటచే గల్గు ధ్వనులను శిశువు మొదట నుచ్చరించుచుండును. కష్టసాధ్యమని యే ధ్వనినిగాని యుచ్చరింప ప్రయత్నించుట మానకుండును. ర, డ మొదలయిన ధ్వనుల నుచ్చరింపలేదు. శిశువులు త, ప, అనువానినిగూడ పద ప్రారంభమునను న్న వాని పలుకుట కష్టమే. అందుచేతనే 'అత్త','అప్ప' అని సులభమయిన ధ్వనిని ముందుచేర్చి యుచ్చరింతురు. అక్షరముల పలుకుటయందు శిశువులు వేర్వేరురీతుల జూపుదురు. ఒక యక్షరమును పలుకుటలోని కష్టము, దాని ప్రక్క యక్షరముల స్వభావమును బట్టి గూడ నుండును. అక్షరసముదాయమును పదములుగ నుచ్చరించుటలో శిశువు లనేకవిధములుగా పాటుపడుదురు. అక్షరముల వరుసను మార్చుచుందురు; కొన్ని యక్షరముల వదలివేతురు; ఒక్కొకప్పుడు కష్టమైన ధ్వనులకు మారుగ సులభమయిన ధ్వనులను ఉచ్చరింతురు. ఇంకొక విశేషముకూడ గలదు. క్రొత్తపదమును సంపాదించినతోడనే దాని ధ్వనిని బట్టి తామిదివరకెరిగి యున్న పదములతో జేర్చి జ్ఞప్తియం దుంచుకొందురు. శిశువులు నూతనపదమును గ్రహించుశక్తి అందుచేతనే ఇదివరకు పరిచితములైన పద సముదాయమును బట్టి యుండును.

ఈక్రింది పట్టీవలన పైజెప్పిన విషయము లుదాహరింపబడినవి.

| మాట | శిశువు ఉచ్చరించునది |
|---|---|
| లాంతరు | తింతరు |
| రోకలి | లోకలి |
| వెండిగిన్నె | ఎండిగిన్నె |
| తమలపాకు | తాంపాకు |
| కంబళీ | కబ్లీ |
| పటికబెల్లం | కటికబెల్లం |
| అట్ట | అత్త |
| సీసా | చీచా |
| పీట | పీత |
| పుస్తకము | పుత్తకం |
| పులుసు | పుస్సు |
| వేపాకు | యేపాకు |
| పెసలు | పెస్సలు మొ. |

ఒకశిశువు ఉచ్చరించిన మాదిరియే ఇందు కనబరచితిని. శిశువులందరును ఇట్లే ఉచ్చరింతురని చెప్పుటకు వీలులేదు. ఏయీడున శిశువు లిట్లు ఉచ్చరింతురనునది వారివారి పరిస్థితులబట్టియు నైజమును బట్టియు నుండును.

రెండుసంవత్సరములు దాటువరకును శిశువు లంతగ మాటల చేర్చి యుండరు, 20, 80 పదములమాత్ర ముచ్చరింపగలరేమో! మూడునాల్గు సంవత్సరములలో నత్యద్భుత వేగముతో నాల్గయిదువందల మాటలవరకును స్వీకరింతురు. ఎప్పుడును ఒంటరిగ నాడుకొను శిశువు ఎక్కువగ మాటల నేర్చుకొనలేదు. తనకంటె నెక్కువవయసు గలవారితో ఎప్పుడును గూడియుండు శిశువు లతివేగముగ మాటల పట్టుకొందురు. పరిస్థితులనుబట్టియేకాక శిశువుయొక్క ఆరోగ్యము, నేర్చుకొనుటకు కుతూహలము, వస్తువులను వానిగుణములను పరీక్షించుటలో ఆసక్తి, వీనిబట్టి కూడ చాలవరకు ఉండును.

అన్ని భాషాభాగములలోను నామవాచకముల నెక్కువ గ్రహింతురని మనకు సామాన్యముగాగల యభిప్రాయము అనుభవమువలన సరిగాదని తెలియుచున్నది. భాషను నేర్చుకొనుటలో మొదట నామవాచకములతో ప్రారంభించుట శిశువులపట్ల కొంతవరకు నిజమయి యుండవచ్చును; కాని శిశువులకు ఏదేని పనినిచేయుటయం దాసక్తి యెక్కువగుచుండుటచే వారు క్రియాపదములనే ఎక్కువగా నేర్చియుండుట సహజము. ఈలక్షణమే అనుభవమువలనగూడ స్థిరపడుచున్నది. ఇతర భాషాభాగములలో చేరిన పదములను నేర్చుటలోగూడ వానిని క్రియలకు బదులుగనే యుపయోగింతురు. మేడమీదికి తీసుకొనివెళ్లమని యడుగుటకు శిశువు "మీద,మీద" అనుచుండెను. ఇక్కడ "మీద" అనుశబ్దము క్రియవలెనే ఉపయోగింతురు. ప్రతిపదమును, నామవాచకము సహా, శిశువు ఒకపనితో దృఢమైనసంబంధమును గలుగజేసి, క్రియావాచకముగనె దానిభావించి నేర్చికొని తిరుగ నట్లే దాని నుపయోగించును.

వాక్యముచే మనము స్పష్టపరచు అభిప్రాయములను ఒక్కమాటతోనే శిశువు తెలియజేయనెంచును. 'తో', 'తో' అని అనుటలో తన్ను ఉయ్యెలయందుంచి ఊచవలెనని యభిప్రాయము. పిమ్మట రెండు మూడు పదముల జేర్చి తన యుద్దేశమును వెల్లడింపజూచును; ఇందు తన అవయవముచే కొంతసంజ్ఞలగూడ చేయును. "నాన్న, తియ్య, లే" అని కలిపి నాన్న మిఠాయి తే లేదని తల్లితో చెప్పును. చేతులు త్రిప్పుచు శిశువుల యాచరణలు, చిత్తవృత్తులు, వీనిని కొంతవరకు ఎరిగినగాని వారి భాషను తెలిసికొనలేరు. రానురాను వారు అభినయము కట్టిపెట్టి దానికిబదులు మాటలనే ఉపయోగింతురు. వస్తువులయందును, వానిలో వానికి గలసంబంధములను గుర్తెరిగి వానిని విచక్షణచేసి విభజించుటకు శక్తిగలిగినకొలది మాటలను పొందిక చేసి వాక్యరూపమున తమయూహల తెలియజేయుట సాధ్యమగును. వేర్వేరురీతుల సంబంధముల తెలియజేయుటలో వేర్వేరు భాషాభాగముల నుపయోగించి వాక్యమును కూర్పగలుగుచుందురు. వస్తు, క్రియాపరిచయములతో పాటు జ్ఞానాభివృద్ధియు భాషాభివృద్ధియు కలుగును. వ్యాకరణయుక్తముగా పదములవరుసకయి లక్ష్యపెట్టక దానికి క్రియయొక్క యేవిషయములు ముందు తట్టునో వానినే ముందు తెలియపరతురు.

శిశువొక భావమును చెప్పునపుడు దానివ్యతిరేక భావమును గూడ కలిపి ఏకవాక్యమున చెప్పుచుందురు. "నాకిం చక్కిమిఠాయి ఉంది; అమ్మకి లేదు." అన్నది ఒకపిల్ల తండ్రితో. "నాకెన్ని అప్పచ్చులో నీకొకటేయని" చెలికాండ్ర నాక్షేపించె నొకసారి. "తాతకి మీసా

లున్నాయినాకులేవు" అనిచిన్నపిల్లయొకతె తండ్రితోఫిర్యాదుచేసినది. స్త్రీలతోనేచాలసెలలుమెలగినపిల్ల మొగవారితోగూడ 'ఇది ఇయ్యవే, ఇలా రావే' అని మాట్లాడును.

చిన్నపిల్ల కొంతకాలము గడచినపదపగాని తన్నుగూర్చి మాట్లాడునపుడు 'నేను' అనదు; అందరును తన్ను ఎట్లు పిలతురో అట్లే తనను గూర్చి తాను చెప్పును. "చిట్టికి పప్పులు కావాలి" అని అడిగింది చిట్టి యనుపేరుగలపిల్ల. "వాబొమ్మఏదీ?" అనుటకు చిట్టిదిబొమ్మ ఏది?" అనును. "చిట్టిని ఏడుస్తూంది చూడూ;" అని యరచెను; "చిట్టిని ఏడ్పించును చూడూ!" అనుటకుబదులు.

ఒక్కొకప్పుడు వాడుకభాషలో నున్నట్టి పదములను వారం తటవారే కూర్తురు; "వర్షము పోయింది" అందురు "వర్షము వెలసింది" అనుటకు 'నూనె ఒలికిపోయింది అనుటకు' 'పారిపోయింది' అందురు. వాల్లుపారులు పిలచినను తల్లి వినిపించుకొనక పోవుటను చూచి ఒక పిల్ల "నీకు చెవులు కనపడవా?" అని యడిగెను. పొయ్యిమీదనున్న పాత్రమట్టు పొగగమ్ముటను చూచి "బువ్వని పొగ మింగివేస్తూంది" అని తల్లితో యరచిచెప్పెను.

'కండచీమవలె ఈపిల్లకు బెల్లమంటే యిష్టం' అనెను ఇంట్లో ఉన్న తాతగారు శిశువును. ఆదినము మొదలు కొన్నిరోజులవరకు ఆపిల్ల అందరిని 'కండచీమ' యనియే పిలచుచుండెను!

"అయ్యో! మాణిక్యంలాటినూది పారేసావే!" అని తల్లి తన పిల్లపై విసుగుకొనెను. అది జ్ఞప్తియం దుంచుకొని బడిలో ఉపాధ్యాయుడు 'మాణిక్యమును ఎరుగుదురా? అని పిల్లల నడుగగా ఈపిల్ల 'మాణిక్యం నూదిలాగుంటుంది' అని బదులుచెప్పెను.

'కొత్తపల్లి' యన్నగ్రామముపేరు వినగానే ఒకపిల్లవాడు "కొత్తపిల్లి పాతపిల్లి" అని పలుమారు అనసాగెను.

'ఈపప్పులు దీసికెళ్లి పిటితో ఆడుకో' అంది తల్లి ఒకపిల్లను; వెంటనే దానితో కోపముతో "పప్పుల్తో ఆడుకోం! పప్పులుపెట్టి చిన్నమ్మతోటీ వాళ్లతోటీ ఆడుకుంటా" అని తల్లివాక్యమును సవరించెను.

శిశువులతో సెక్కువగా కలుగజేసికొనిన కొలది యిట్టి యుదాహరణ లింకను పొందుపరుప వచ్చును. దీనినిగురించి యాలోచించిన కొలది శిశువులు మనము సామాన్యముగా ననుకొనుపాటి బుద్ధిహీనులను తెలియనివారు కారని తోపకమానదు.

## కృష్ణుఁడు

శ్రీపాద జోగిసోమయాజులు గారు

(గీతము)

పుడమి యదువంశమందునఁ బుట్టినావు
తల్లిదండ్రులబంధముల్ దఱిగినావు
చన్నుగుడుపంగపూతకిన్ జంపినావు
బాలకులలోన బాలుఁడై పరగినావు

కేలగిరియెత్తి వ్రేతల నేలినావు
దోషియైనట్టి కంసునిఁ ద్రుంచినావు
వనిత ద్రౌపది మానంబు మనిపినావు
రణములోన సధర్మము నణఁచినావు

అరయ గీతలు నరునకుఁ గరపినావు
నిన్ను నమ్మినజనుల మన్నించినావు
సత్యధర్మంబు లిలమీఁదఁ జాటినావు
అట్టి, యోకృష్ణ! మము నేలుమయ్య నీవు.

# నన్నయభట్టు భారతములోని యతులు

చిలుకూరి నారాయణరావు గారు, యమ్. ఏ., యల్. టి.

ఛందోగ్రంథాలలో కవిజనాశ్రయము తెనుగున మొదటిది. అందులో పదియతులుమాత్రమే వివరింపబడ్డవి. విన్నకోటపెద్దన్న పన్నెండుయతులు చెప్పినాడు. అనంతుడు ఇరవైనాలుగు చెప్పినాడు. అప్పకవి నలభైఒక్కటివరకూ పెంచినాడు. సులక్షణసారకర్త ముప్పైఒక్కయతులనిచెప్పి ముప్పైఆరు వివరించినాడు. రంగరాట్ఛందస్సులో ఇరవైతొమ్మిదియతు లున్నవి. ఈ యతులను ఒకలక్షణకారునికంటె మరియొకడు పెంచి వ్రాయడముచేత సంఖ్య పెరుగుతూ వచ్చినది. ఆయా యతుల కాయాలక్షణకర్త లేమని పేరుపెట్టినారో ఈ వ్యాసము తుదనున్న పట్టికవల్ల తెలుస్తుంది.

మనవారు అప్పకవీయమును పరమప్రమాణగ్రంథముగా ఎంచుటవల్లను దానిలో యతులసంఖ్య అధికముగా ఉండుటవల్లను, ఆ గ్రంథములో చెప్పబడ్డ యతులెంతవరకూ నన్నయరచించిన భారతభాగములో కనబడతవో ఉదాహరణములతో ఈ క్రింద చూపుతాను.

## I స్వరవళులు

**1 స్వరమైత్రివళులు:—**

ఆది. I. 15. అమలసువర్ణశృంగఖుర-మైకపిలంబుసు.

ఆది. III. 187. అతనికి మఱి భ్రూణహత్య - యగునంద్రు బుధుల్.

**2. స్వరప్రధానవళులు:—**

ఆది. I. 6. లో కాశ్రయుఁ డాదిరాజునిభుఁ - డత్యకలంక చరిత్రసంపదన్.

ఆది. III. 46. లో,కాంచితుఁ డైనవాఁడు నిభి - లాగమ పుంజము సేర్పడ స్విభా,గించి.

**3. లుప్తవిసర్గవళులు:—** వీటికి ఉదాహరణములు కానరావు.

**4. ఋవళి:—**

సభా. II. 11. ఋత్విజుండని విచా- రించి పూజించితే, ద్వైపాయనుం డుండ ధర్మరయూక్తి.

**5. ఋత్వసంబంధవళి:—**

దీని కుదాహరణములు కానరావు.

**6. ఋత్వసామ్యవళి:—**

దీని కుదాహరణములు కానరావు.

**7. వృద్ధివళి:—** దీనికుదాహరణములు కానరావు. (అ - ఐ లకు యతిపడినప్పుడు స్వరమైత్రివళిలో చేరును. ఇ-ఐ లకు యతి కానరాదు.)

## II వ్యంజనాక్షరవిరతులు

**1. ప్రాణివిరామము:—**

ఆది. I. 4. విమలవిచారుఁడు సుమార-విద్యాధరుఁ డు, త్తమ.

**2. వర్గయతులు:—**

ఆది I. 4. వివిధా, గమవిజితశ్రముఁడు తుహిన - కరుఁ డురుకాంతిన్.

ఆది. I. 5. ఘనదురితానుబంధ కలి - కాలజదోషతుషారసంహతిన్.

**3. బిందుయతులు:—**

ఆది. I. 109. వాం,ఛిత పెయ్యది దానిఁ జెప్పుమ - చేయుదు ననినన్.

ఆది. II. 67. పీఠిం, బఱచె వియచ్చరవిమాన - పంక్తుల దూలన్.

ఆది. III. 90. బ్రహ్మలోకం, బునుండి యనేకదివ్య - ముని సంఘములతోన్.

ఆది. I. 185. శా,ర్ఙ్గవినిర్ముక్తవిశాలసాయకశతా-గ్రచ్ఛిన్న మై.

**4. తద్భవవ్యాజవిక్రమములు:**
**5. విశేషవళులు:**
**6. అనుస్వారసంబంధయతులు:**
**7. అనునాసికాక్షరయతులు:**

} వీటి కుదాహరణములు లేవు.

**8. మువిభక్తియతులు:—**

ఆది. II. 38. బోరన దా నగ్నిసూక్త - ములతో నెసఁగెన్.

ఆది. II. 68. తీర్థం,బున కరిగె నగంబు లొక్క-మొంగి గ్రక్కదలన్.

ఆది. II. 114. భువనంబులయందు సర్వ-ములు ద్రిమ్మరుటన్.

9. ముకారయతులు:
10. మవర్ణవిరామములు:
} వీటికుదాహరణములు లేవు.

11. ఋజుయతులు:—

ఆది. I. 16. కృష్ణద్వైపా, యనమునిప్రవ భాభిహితమ-హాభా
త బద్ధ......

ఆది. I. 23. మనో, హరసుచరిత్రపావనప-యఃపరిపూర్ణములై,

12. ప్రత్యేకయతులు:—

ఆది. IV. 29. దా, నిదికలరూ పెలుంగ నవ-నీపతి యుత్సు
కుఁడయ్యె నాత్మలోన్.

ఆది. VI. 104. అనపాయతఁ బొంది చేయు-నది ధర్మంబున్.

13. భిన్నయతులు:—

ఆది. II. 152. పవళుల్, రేలును నేమఱక పరిచ-రించుచునుం
డెన్.

ఆది. IV. 226. ఏన యెల్లకాలము ధరి-యింతుఁగాన.

ఆది. V. 32. ఇచ్చినవడియును గరము సంత-సిల్లి కుమారుం,
గని...

14. ఏకతరయతి:—

ఆది. I. 8. రాజకులైకభూషణుఁడు-రాజమనోహరుఁ డన్య
రాజతే, జోజయశాలి...

15. అభేదయతి:—

ఆది. III. 111. భవదగ్నిహోత్రముల్, వోఁడిగ వేల్వఁగాఁబడి
యెఁ- బ్రొద్దునుబోయెఁ గముండు సేనియున్, రాఁడు...

ఆది. IV. 42. లలితవృకోదరంబు తర-శత్రివళీయుతరోమరాజి
యున్.

ఆది. IV. 91. మూన్నత, ప్రవర యొక బావి మేలు మఱి-బావులు
నూఱిటికంటె...

ఆది. VIII. 48. ఆడ నో, దురురు సన్మను లిందుఁ గ్రోల్మాన-
భుల్గాను వ్వడిఁ జొచ్చినన్.

16. అభేదవర్గయతి:—

ఆది. I. 114. ఇక్ష్వాగ, భవన మెప్పాట నె-ల్వడఁగఁబోలు.

ఆది. I. 125. మహీ, వల్లభ తత్కథాధము నె-పంబున...

అర. III. 292. నానాభరణవిభూషిత,
పీనోన్నతకుచముఁ బోలె-వెలిగెడుదానిన్.

17. ఊష్మయతులు:—

ఆది. I. 12. పూజామహో, త్సవమున్ సంతతదానశీలతయు
శశ్వత్సాధుసాంగత్యమున్.

ఆది. I. 14. మదీయవం, శమునఁ బ్రసిద్ధులై విపుల-ఖడ్గశోభి
తులైన పాండవో, త్తముల...

18. సరసవళి:—

ఆది. I. 3. తే, జోజయశాలి శౌర్యుఁడు వి-శుద్ధయశశ్శరదిందు
చంద్రికా.

ఆది. I. 6. వ, ర్ణాశ్రమధర్మరక్షణమ-హామహిమన్.

ఆది. I. 19. అమలినతారకాసముద-యంబుల నెన్న ను.

ఆది. I. 45. జంబూషండవినిర్మి,
గంబాదిగహృదయరోచ-నము...

ఆది. I. 59. ... విబుధశ్రే
ణీనుతంబై యానుశాస-నికపర్వములన్.

ఆది. I. 67. పం, చదివసంబులు గర్భుఁడున్ దివ-సద్వయంబు...

ఆది. IV. 121. సాభిలాషుఁడై చూచె మ-హాభిషుండు.

19. సంయుక్తవిశ్రామము:—

ఆది. I. 6. వి, ద్యాక్రమతత్త్వవిత్త్వమున-దానగుణాభిరతిన్.

20. అంత్యోష్మసంధివిరమణము:—ఇందు కుదాహరణ
ము లేదు.

21. వికల్పసంధివిరమణము:—ఇందుకుదాహరణము లేదు

'జగ, న్నుతసుమహోతపోధన ల-నుగ్రహనిగ్రహశక్తియుక్త లీ'
అనుచోట్లసంధిచేత వచ్చినయక్షరమునకే యతి కనబడుచున్నదిగాని,
సమాసములోని మొదటిపదములోని అంత్యాక్షరముతో యతికానరాదు.

III ఉభయవళులు.

1. యుష్మదస్మచ్ఛబ్దవిరతులు:—

ఆది. II. 215. ధయ, త్రస్తాత్ములమైన యస్మ-దాదులకెల్లన్.

2. పరరూపయతి:—

ఆది. III. 227, తే, దండగండవిదారిఘోరత - రాసిభాసిభు
జార్గళా.

3. ప్రాదియతులు:—

ఆది. I. 98 ... కుండలము ల
పేక్షించుచు నున్నవాఁ డ-భేద్యుఁడు...

ఆది. I. 72. భా, రత్యమరాపగాఘము ని-రంతర...

ఆది. I. 80. ము, మ్మడుఁ గనీకినీస-మాఖ్యవమరు.

" " ఔనిరంతరప్ర-మానసంఖ్య.

" 89. సురా, మ్నాయము నాహుతాహుతిస-మంచిత.

ఆది. II. 40. మడవక సేయుమీవని స-మర్పణసేసి ప్రభుత్వ
మేర్పడన్.

అర. IV. 98. పగలు నిర్జింతు రాహవా-భ్యంతరమున.

**4. నిత్యసమాసయతులు లేక అఖండయతులు:—**

ఆది. I. 6. ఆశ్రితపోషణంబున న-వంతవిలాసమునన్.

„ 10. శా, ప్రస్ఫురులతెలిం గెలింగిరి సు-దాత్త...

„ 24. వ, రాయణునట్లు దానును ధ-రామరవంశవిభూష ణుండు వా,రాయణభట్టు వాఙ్మయధు-రంధరుఁడున్...

„ 31. అధ్యాత్మవిదులు వే-దాంతమనియు.

„ 124. కా, కోదరసంహతిన్ హలితమ-హోగ్రసమగ్రశిఖా వయంబులన్.

„ 162. విమ, లాదిత్యతనూజవిక్ర-మాదిత్యనిభా.

ఆది. III. 68. అజితశక్తియుతు ల-నాయువగుదు...

„ 160. ఇన్నరలోకభోగము ల-నేకము లందుము...

ఆది. V. 6. కుమా, రాయితశక్తిశాలి ధృత-రాష్ట్రుఁడు...

ఆది. VII. 94. శమహీనుఁడౌచు వి-శ్వామిత్రుచేసిన...

ఆది. VIII. 275. నిరంతరా, మానపయోధరప్రకర-ముద్ధతమై హరివంతరంబులన్.

ఆది. IV. 107. పం, చానవాదులఁబట్టి ప్రంమున-వంతబాహు బలాఢ్యుఁడన్.

**5. దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు:—**

ఆది. II. 282. వో, రనఁ గీర్తించిరి సంతతస్తుతిపదా-రావంబు రమ్యంబుగన్.

సభా. I. 46. ఆయంబువందు వా-లవభాగమెండె మాఁ-దువ భాగమెండె నం-దర్భమెండె.

అర. I. 300. కదలె తద్వనమెల్ల గ్ర-క్కదలుచుండ.

**6. నిత్యయతులు:—**

ఆది. VI. 47. ఈతఁ డనిపేయఁగాఁ దగఁడని పిని.

ఆది. VII. 141. ఎన్నఁడు, * స్నేనిబోఘముకాదు డిగ్గర-తీర తిందు రెలుఁగఁగాన్.

సభ II. 95. నీవుమజాచి కట్టెపథ - నేనివిసంబునఁ డేయఁగం బులన్.

7. రాగమసంధివళి:
8. విభాగవళి:
9. నామాఖండయతి:
10. పంచమీవిభక్తివిరామము:
} ఇందుకుదాహరణములు లేవు.

**11. కాకుస్వరవళి; లేక, ప్లుతయతి:—**

ఆది. I. 116. తపోమహిమా!యున్న దినంబులేల-మనలితిరెప్పుమా

ఆది. VIII. 110. మాయిద్దఱిలో, నం దెవ్వరిమలకు సెప్పు - మా యనవుడు.

**12. ప్లుతయుగవిశ్రామము : ఇందుకుదాహరణములేదు.**

## IV. ప్రాసయతులు.

వీటికి ఉదాహరణము లనవసరము.

### కొన్ని విశేషములు.

(1) నన్నయ 'జ్ఞ' అనుసంయుక్తాక్షరమును 'క్ష' అనేఉచ్చరించేవాడో, ఆకాలములో అతనిప్రాంతాలలో ఉచ్చారణ అలాగేఉండేదో. . అతనెప్పుడూ 'జ్ఞ' కున్నూ క, ఖ, గ, ఘ లకున్నూ యతివేయలేదు. చూడండి—

అర. III. 128. జ్ఞానుటన్న యందు నిర్మల - జ్ఞానవృత్తి

ఆది. I. 157. జ్ఞానము సర్వభూతహిత - సంహితబుద్ధియు...

ఆది. II. 222. అమ్మునికేంద్రుఁడైనవరు-యజ్ఞము ధర్మజరాజ సూయము,జ్ఞమ్ముక బరుగఁజేసినప్ర-జాపతియజ్ఞముఁ బాకశాసనీయ, జ్ఞమ్మును గృష్ణయజ్ఞము ని-శాకరుయజ్ఞము నీ మనోజ్ఞయజ్ఞమ్మును నొక్క-రూప విలసన్మహిమం గురువంశవర్ధనా.

ఆది. VIII. 85. కాలించు వృక్షాలు ధూమాఘన కార్తులు వృక్షులునై - శోషించు రత్యంతమున్.

సభా. II. 100. ధృతరాష్ట్రినను, జ్ఞానను బడయుడును మన కు - సమకూరు...మాత్రమే

పై ఉదాహరణాలలో 'జ్ఞ' కును చఛ, జఝ, శ, ష, స లకును మాత్రమే యతిఉన్నట్లు మన మూహించ వచ్చును.

(2) 'క్ష' కారములో 'క' కారోచ్చారణమే ఆ కాలమున ప్రధానముగాఉండేది. అందుచేతనే నన్నయ 'క్ష' కార 'క ఖ గ ఘ' లకేయతి వేసినాడుగాని,'చ ఛ జ ఝ, శ ష స' లతో యతివేయలేదు. చూడండి—

ఆది. I. 107. క్షేత్రమునం బ్రకామగతి-ఖేలనకొప్పి...

ఆది. II. 163. క్షమాదమసమన్వితుం గనియెఁ - గావహాంతం బునన్.

„ 118. క్షముఁడై రక్షించికొని సు-ఖస్థితి నుండెన్.

„ 178. క్షత్రియవంశ్యులై ధరణి-గావఁగ...
క్షత్రియులై శ్యకూఁదులనఁ-గా...

„ 179. క, క్షకకోటుల్ పనివేయఁగా భువనకో-క స్తంభత, క్షకభీతిన్ రచియింపఁ బంది ద్రుహర-క్షన్...

---

* 'ఎన్నఁడుసేని' అనుచోట 'సేని' అనునదే పదమని కొందఱందురుగాని, లాక్షణికు లెవ్వరూ అట్లు గ్రహించలేదు.

ఆది. II. 224. సా, క్షాద్విష్ణుండవ నీవు భూపతులలోఁ గౌర వ్యవంశోద్భవా!

ఆది. III. 92. క్షితిభృత్కంబగుదాని భూరిభుజశ-క్తిం జేసి.

సభా. I. 103. క్షేమంబులు నడుపుచున్న-కృష్ణునిరోగం,బు...

సభా. II. 25. క్షత్రియుండు పూజ్యుండు వి-క్రమసమృద్ధి.

అర. I. 155. క్షేమవృద్ధియనువాని యు-క్తత్రిమసాహస...

" 247. క్షత్రియధర్మముల్ సుగతి-కారణముల్...

" 253. విక్రమ, క్షణదానంబోసరింపుమీక్షణము వి-ఖ్యాతంబుగా...

" 262. క్షత్రియధ నైనపాపంబుఁ-గ్రాఁగవలయు.

అర. III. 186. క్షత్రియుఁ డున్నవిల్లియు స-ఘుక్షయకారణుఁడున్.

రెండుచోట్లమాత్రము 'క్ష' కును 'చ ఛ జ ఝ శ ష స' లకును యతి ఉన్నట్టు కనబడుతుందిగాని, ఆపాఠాలు సరియైనవికావని తోస్తుంది. ఆరెండింటికిన్నీ 'గౌతమీ గ్రంథాలయ' వ్రాత ప్రతులలో పాఠాంతరాలు కనబడుతున్నవి.

అర. I. 217. క్షమయ తాల్చియుండఁ-జన దెల్లప్రొద్దుఁ దే, జంబు...

(పాఠాంతరము):—

క్షమయ తాల్చియుండఁ-గా దెల్లప్రొద్దుఁ దే,జంబ...

అర. III. 186. క్షత్రిచరిత్రుఁడై పరఁగు-స త్త్వమునన్...

(పాఠాంతరము):—

క్షత్రిచరిత్రుఁడై పరఁగు-గర్వమునన్ (గర్వమునన్...)

3. 'ము-వో' లకుయతి:—

ఆది. II. 234. ముద, మునఁ దలఁచిన సురగభయము-వొందరు జనులన్.

4. నన్నయభట్టులో 'ఇంచుక్క' యతిలేదు, అనఁగా భావించు, సేవించు అనుమొదలైనవాటిలో హల్లుతోనేకాని, అచ్చుతో మైత్రిలేదు. ఇట్లే 'ఎడు' వర్ణకము పరమైనప్పుడుకూడా హల్లుతోనేకాని అచ్చుతోమైత్రి లేదు. మామిత్రులు మ-రా-రా-శ్రీ గిడుగు సీతాపతిగారు;

'ఆది. V. 155. సందియం, బీరమణీయకాంతి నుపమింపఁగ,'

అనిచూపి నన్నయ కిదిసమ్మతమేఅని చెప్పిరిగాని నేనుచూచినచాలా ప్రతులలో

"వీరలు దైవశక్తిఁ బ్రభవించినవా రను టేమిసందియం
బే? రమణీయకాంతి నుపమింపఁగవచ్చు..." అనే ఉన్నది,

ఇది అప్పకవిచెప్పిన కాకుస్వరయతి అవుతుంది.

ఆది. I. 55. లో "పర్వంబులనేనిటంగృపాయుతమై" అని అఖండయతి అచ్చుప్రతులలో ఉన్నదిగాని "కృపాయుతమై" అని వ్రాతప్రతులపాఠము కలదు,

5. 'ర-ఋ' లకు ప్రాసయతిచెల్లును—

ఆది. VII. 86. గారవమున నిచ్చి-యాఋషితోడఁ బు,త్తెంచె

6. 'ఋ-రి' లకు యతిచెల్లుతుంది:—

ఆది. VII. 132. కృతవీర్యుధనమెల్ల క్షితిచేసి,

7. 'ల-ళ' లకు ప్రాసయతి:—

ఆది. III. 27. అళినీలకుటిలకుం-తలముల కాంతియు,

అర. II. 52. నలునకాని నలిన-దళనేత్ర వరియింప, దక్షై,

8. 'న-ణ' లకు ప్రాసయతి:—

అర. I. 49. దుర్నిమిత్తనముల్ పుట్టిన నిర్ణయించి,

9. 'ల-ళ' లకు యతి:—

అర. III 109. తనచేతిపుష్పముల జల్లిన వంకఁటఁ దెదరి యవి య-ళిప్రకరనిషే, వన మొప్పనున్న యవి,

10. 'ఃఖ-హ' లకు యతి:—

అర. IV. 128. సుఖము దుః, ఖంబు నై సెడ విమో-హమును బొందకునికియు...

పట్టిక.

I. స్వరవళులు

| అప్పకవీయము | కవిజనాశ్రయము | కావ్యాలంకారచూడామణి | అనంతునిఛందస్సు | సులక్షణసారము | రంగరాట్ఛందము |
|---|---|---|---|---|---|
| 1 స్వరమైత్రివళి | 1 స్వరవళి | స్వరజయతి | స్వరయతి | స్వరయతి(యావడి) | స్వరయతి |
| 2 స్వరప్రధానవళి | ... | ... | ... | సరసస్వరయతి | |
| 3 లుప్తవిసర్గస్వరవళి | ... | ... | గూఢస్వరయతి | లుప్తవిసర్గకస్వరయతి | గూఢస్వరయతి |
| 4 ఋవళి | ... | ... | ఋకారస్వరూపయతి | ఋవళి | ఋయతి |
| 5 ఋత్వసంబంధవళి | ... | ... | కీదిరమాము | రివడి | |

ఆంధ్ర మహాజనసభాహ్వానసంఘసభాసభ్యులు, అధ్యక్షులు, ఆంధ్రమహాజనసభ ఆంధ్రరాష్ట్రీయమహాసభల అధ్యక్షులు, ప్రతినిధులు, చెన్నపురి



President and members of the Reception Committee and Presidents and delegates of the Andhra Mahajana Sabha and Andhra Provincial Conference, Madras

ఆంధ్ర ఖద్దరు ప్రదర్శనము - చెన్నపురి, 17-10-1924



The Andhra Khadi Exhibition, Madras

కార్యనిర్వాహక, ఆహ్వానసంఘములు, ఆంధ్రవిద్యార్థి మహాసభ, చెన్నపురి



Executive and Reception Committee of the Andhra Students' Conference, Madras

హిందూ అసోసియేషను గ్రంథనిలయ కార్యనిర్వాహకసభ్యులు, ఇంటూరు, గుంటూరు జిల్లా.



Hindu Association Grandha Nilayam, Intur, Guntur Dist.

| అప్పకవీయము | కవిజనాశ్రయము | కావ్యాలంకారచూడామణి | అనంతునిఛందస్సు | సులక్షణసారము | రంగరాట్ఛందము |
|---|---|---|---|---|---|
| 6 ఋత్వసామ్యవళి | ... | ... | ఇకారవిరతి | ... | ... |
| 7 వృద్ధివళి | ... | వృద్ధివళి | ... | వృద్ధియతి | వృద్ధియతి |
| **II. వ్యంజనాక్షర విరతులు** | | | | | |
| 8 ప్రాణివిరామము | ... | ... | ... | ... | ... |
| 9 వర్గయతి | 2 వర్గయతి | వర్గయతి | వర్గయతి | వర్గయతి | ... |
| 10 బిందుయతి | 5 బిందుయతి | సబిందువర్గజయతి | ... | బిందుయతి | బిందుయతి |
| 11 లిప్తవవ్యాజవిశ్రమము | ... | ... | లిప్తవవ్యాజయతి | జ్ఞావడి | ప్రాకృతాదేశయతి |
| 12 విశేషవళి | ... | ... | ... | ... | ... |
| 13 అనుస్వారసంబంధయతి | ... | ... | అనుస్వారయతి | ... | ... |
| 14 అనునాసికాక్షరయతి | ... | ... | ... | ... | ... |
| 15 ముఖ్యభ క్తియతి | ... | ... | ... | ... | ... |
| 16 ముకారయతి | 9 పోలికవడి | ముకారవళి | పోలికవడి | పోలికయతి, చక్కటియ (తి | పోలికయతి, చక్కటి (యతి |
| 17 మవర్ణవిరామము | ... | ... | మకారయతి | మావళి | మకారయతి |
| 18 ఋజుయతి | ... | ... | ... | ... | ... |
| 19 ప్రత్యేకయతి | ... | ... | దియతి | ... | ... |
| 20 భిన్నయతి | ... | ... | భిన్నయతి | అభిన్నయతి, భిన్నయతి | భిన్నయతి |
| 21 ఏకతరయతి | 8 ఎక్కటియతి | ఏకతరయతి | ఎక్కటియతి | ఎక్కటియతి | ఎక్కటియతి |
| 22 అభేదయతి | ... | ... | ... | అభేదయతి | అభేదయతి |
| 23 అభేదవర్గయతి | ... | ... | అభేదవిరతి | ... | ... |
| 24 ఊష్మయతి | ... | ... | ... | ... | ... |
| 25 సరసవళి | 10 సరసయతి | ఇతరేతరవర్గజయతి | సరసయతి | సరసయతి | సరసయతి |
| 26 సంయుక్తవిశ్రామము | 7 సంయుక్తాక్షర (యతి | | సంయుక్తయతి | సంయుక్తయతి | సంయుక్తయతి |
| 27 అంత్యోష్మసంధివిరమణం | | | వికల్పయతి | వికల్పయతి | అనునాసిక వికల్పయతి |
| 28 వికల్పసంధివిరమణము | ... | ... | యుక్తవికల్పయతి | (వికల్పయతి | ... |
| **III. ఉభయవళులు.** | | | (రేఫయుతయతి) | ... | ... |
| 29 యుష్మదస్మచ్ఛబ్దవిరతి | ... | ... | ... | ఉభయయతి | ... |
| 30 పరరూపయతి | ... | ... | ... | సౌభాగ్యయతి శకంధ్వా ఆదేశయతి, (ధిగణయతి | శకంధుయ (తి |
| | ... | ... | ... | | |
| 31 ప్రాదియతి | 4 ప్రాదియతి | ప్రాదియతి | ప్రాదియతి | ప్రాదియతి | ప్రాదియతి (సం॥మొ.) |
| | ... | ... | ... | ... | ప్రాదియతి (ప్రా॥మొ.) |
| 32 నిత్యసమాసయతి | ... | ఆదేశయతి | ... | నిత్యసమాసయతి, నాదేనక్ సమాసయతి, (శయతి | నిత్య (సమాసయతి |
| (అఖండవడి) | ... | ... | ... | | |
| 33 దేశ్యనిత్యసమాసవిశ్రాంతి | ... | దేశీయయతి | నిత్యసమాసయతి | దేశీయయతి | దేశ్యయతి |
| 34 నిత్యయతి | ... | ... | నిత్యయతి | ... | ... |
| 35 ఆగమసంధియతి | ... | (జవరాలు) | ... | ... | ... |
| 36 విభాగవళి | ... | ... | విభాగయతి | విభాగయతి | విభాగయతి |
| 37 నామాఖండయతి | 5 అఖండయతి | (మాదన) | ప్రభునామాంతరయతి | ప్రభుయతి, అఖండయతి | ప్రభునామాఖండయతి, (అఖండయతి |
| 38 పంచమీవిభక్తివిరామం | ... | ... | ... | ... | |
| 39 కాకుస్వరయతి | 6 ప్లుతయతి | ద్వ్యక్షరత్ర్యక్షరప్లుతాక్ష (రవళి | కాకుస్వరయతి | కాకుస్వరయతి, ప్లుతయతి | కాకుస్వరయతి, ప్లుతయ (తి |
| 40 ప్లుతయుగవిశ్రామము | ... | | ... | ... | ... |
| 41 ప్రాసయతి | ... | ... | ... | ప్రాసయతి | ... |
| | | | | ఉభయవర్గద్వయయతి, | ఘుక్ యతి (ధావడి |

# వనలక్ష్మీ వసంత విలాసము

### నేమాన సూర్యప్రకాశ కవిగారు

నరవీర సహకార సహకార ఫలవార
రసపూర మదకీరరాడ్విహార,
మసమాన మృదుమాన లసమాన రసపాన
మత్తభృంగవితాన మధురగాన
మతిపల్లవసముల్లసితఫుల్ల సుమవల్ల
రీసల్లలితవల్లి కాసమగ్ర
మరవింద నవకంద హరిచంద నానంద
కరగంధబంధురగంధవాహ
మసమకాంతలతాంతనితాంత మాధ
వీలతాక్రాంత సునితాంతవీథికాంత
రాంగజాభంగరణసంగతాంగవాథు
జంగ మలరు వసంతవాసరము కరము.

ఉ. అళికులకేళిపాళి సుమహాస లసత్కిసలారుణోష్ఠి యు
జ్జ్వలశుకసూక్తి కుందరద చంపకనాసిక మంజుమంజరీ
లలితకుచాఢ్యయౌచు వనలక్ష్మి యొసంగు కెంజిగి మాధవుం
డలరుచు వచ్చె రాగమున నప్డు మహోగమవేద్యమూర్తియై. 2

శా. చేరన్వచ్చిన మాధవుం గని వనశ్రీదేవి శాఖాభుజా
రారాజత్సుమభాజనంబుల మధుప్రాంచన్మహాపాద్యమున్
సారోదారపరాగగంధమును కింజల్కాక్షతల్ నించి యిం
పారం బూజయొనర్చె మంజుశుకవాక్యస్ఫూర్తి శోభిల్లగన్. 3

ఉ. కనకలతావితానకలికాకులదీపము చారుకీరతో
రణము లతాంతకల్పితవిరాజితతల్పము పల్లవావళీ
వినుతవితానమై విపినవీథి మనోహరకాననేందిరా
ఘనతరకేళికాగృహనికాయము భంగిఁజెలంగె నయ్యెడన్. 4

ఉ. మధుపవినోదనాద పరమశ్రుతియున్ మదకీరశారికా
ద్యధిక విరావతాళనికరార్భటియుం గలహంసకోకవా
క్ప్రఘనోత్తరమర్దలధ్వనియుఁ బెంపలరం బికగాయకావళుల్
మధురమనోజ్ఞగీతములు మానుగఁబాడెఁ గల స్వరంబునన్. 5

సీ. తరుణారుణప్రభాభరణారుణకిసాల
ముల లోలపికజాలముల కొసంగి
కాంతకాంతలతాంతకుంతసంతానంబు
నమరత్తిఁ గుసుమసాయకున కొసఁగి
నిష్యందమకరందనిర్ఝరసందోహ
ముల తుందిల మిళిందములకుఁ గూర్చి
మధురరసాధారమంజులఫలవార
ములసారమదకీరములకు నిచ్చి
బంధురసుగంధ గరిమల గంధవాహ
పోతముల కొనగూర్చి ప్రధూపవిపిన
పాళి సురసాలములు సురసాలములయి
భాసిలెను లీల నమ్మధుమాసవేళ.

సీ. విరహిసంచయముల వేటాడ వెడలిన
కుసుమాస్త్రుని తుపాకిసుండ్లనంగ
వెనరుపెం పొనరఁ గానవలక్ష్మి విరుని పై
పరపిన దృక్పరంపర లనంగ
లలి మాధవుఁడు వనలక్ష్మి కొసంగిన
సరిలేని నీలంపు సరులనంగ
మరుమంజరీస్తన భరమునఁ దగులతా,
తరుణాలకుటిల కుంతలము లనఁగఁ
గ్రొవ్విరుల తేనియలఁ ద్రావి క్రొవ్వి క్రొవ్వి
యొడలెఱుంగక కొమ్మల నోలిఁ ద్రాలి
తావులంటుచు మధురగీతములఁ బాడు
చలరె మధుపంబు లపుడు వనాంతరముల.

కం. పల్లవితాశోకములును
ఫుల్ల సుమాంచత్పలాశములును వనములం
దెల్లు వెలిగించుమను విల
సిల్లె మనోజప్రతాప శిఖిశిఖలగతిన్.

సీ. మల్లెపూవుల త్రావి మకరందము మగ్రోలి
మెదలుచునుండు దుమ్మెదల దండు
ఎలమావులను డాసి తలిరుటాకులు మేసి,
లలిఁ గూయు గండుకోయిలలపిండు
మావిపండ్లను మెక్కి మదమెక్కి కదునిక్కి
చెలువలరారు రాచిలుకబారు
పురివిచ్చి యాడుచుఁ బొరిఁ గేక లిడుచున్న
మిక్కగరంబు గాలు నెమిళ్లచాలు
పొగడపూవుల తావియుఁ బొన్నపూల,
పుప్పొడియుఁ గొని దిక్కులు నుప్పరంబు
గప్పుకొని యొప్పు చల్లనిగాలిగలిగి
యలరె వనులెల్ల నవ్వేళ నసమలీల.

3 గ్రంథ విమర్శనము.

# కనుపర్తి అబ్బయామాత్యుఁడు

చింతలపూడి శేషగిరిరావు గారు

## కవి ప్రశంస

ఈకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు. తండ్రి రాయనమంత్రి. తల్లి నరస మాంబ. కొండవీటి సీమలోనికనుపఱ్ఱుగ్రామము నివాసస్థలము. ఇతఁడు పదునెనిమిదవశతాబ్దమధ్యమున నుండిన వాఁడు. ఆశతాబ్దమునఁగల ప్రబంధకవులలో నితఁడు మిక్కిలిప్రౌఢుఁడు. ఈయన యనిరుద్ధచరిత్ర, కవిరాజ మనోరంజనమను రెండు ప్రబంధములను రచించెను. కవిరాజమనోరంజనమునకే పురూరవశ్చరిత్రమనినామాంతరము గలదు. ఈతనితాత ముత్తాతలు కొండవీటిరాజులకడ మంత్రిపదవు లలంకరించిరి. కవితాను ప్రథమమున రచియించిన యనిరుద్ధచరిత్రమందు తనతాతయైన యబ్బయ్య కొండవీటిరాజులమన్ననకుఁ బాత్రుఁడైనట్లు వ్రాసికొనెను. కాని యీతనికాలము నాఁటికిఁ గొండవీటి రాజ్యము దురుష్కు లాక్రమించియుండుట. ఈ కారణముచేతనే పిమ్మట రచించిన కవిరాజమనోరంజనమం దా ప్రశంస చేయఁడయ్యె. ఈకవికి మంగళగిరి నృసింహస్వామి యిష్టదైవము. ఈతఁడు రచించిన రెండు ప్రబంధముల నీలాతలనే తెల వర్ణించులాఘవమునకుఁ బొల్పడక మంగళాద్రినృసింహునకే యంకితమిచ్చి కృతార్థుఁడయ్యెను. నిరంతరదారిద్ర్యపీడితుఁడైనను నిజదారసుతోదర పోషణార్థమై తుచ్ఛసంపదకొఱకు నరస్తుతి చేయుట కేమాత్ర మిచ్చగింపక తనయుద్గ్రంథముఁ బరాత్పరుఁడైన భగవంతునకే యంకితమిచ్చి కృతార్థుఁడైన పోతనయోగీంద్రుని మార్గ మీకవి యవలంబించెను. ఈవిషయమున కవివాక్రుచ్చిన వాక్యము లారయుఁడు:—

"క. చదువులకు మేర యియ్యది, చదివినమాత్రంబె చాలు సరసవచస్సం,
పదఁ బొకేర్చినకొలఁదిని, యిపుడఁ గవితఁ జెప్పి హరికి నర్పింపఁదగున్.

క. భగవంతునిసద్గుణములు, పొగడుటకే కంటె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు, జగతిన్ సత్కవులు తుచ్ఛసంపదకొఱకై.

మ. హరినామాంకితకావ్య మెట్టిదయిన న్నానందమై సజ్జనా
దరణీయంబగుఁ బువ్వుమాలికలలో దారంబునందంబునన్
నరనామాంకితమైనకావ్యము రసోన్నత్యస్థమయ్యు న్నిరా
కరణింపందగు చను హీనజాతిపురుషుం డైకొన్న వేశ్యంబలెన్.

చ. కృతులు నిజాంకితంబు లొనరించిన నిష్టధనంబు లిచ్చి స
మ్మతిఁ బ్రభువుల్ కవీశ్వరుల మన్నన సేయుట కీర్తిఁ గోరి వి
శ్రుతమతి దేవతాస్తుతియె సేయుకవీంద్రుల నాదరించి స
త్కృతి యొనరించు సత్ప్రభునికీర్తికిఁ గీర్తి ఘటింపకుండునే." (అనిరుద్ధ)

"సీ. ప్రాజ్ఞులు ప్రబంధకల్పనాపాటవంబు,
గలుగుటకు సత్ఫలంబుగాఁ దలఁచి కృతులు
చేయుచుందురు జగదేకనాయకునకు
నమ్మతుఁడ నంకితముగఁ గృతార్థులగుచు.

క. ధారలకు ధాతఁ బువన, త్రాతలకున్ ద్రాత కోరి రక్షకుఁడట యా
దారలవాత్సల్యతిరి యిను, లారల సేతల వరించులాగున కేలా."

(కవిరాజ)

కవి రచించిన రెండు ప్రబంధములందును కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లనియెంచి 'ప్రాచీనకవి క్వచిదుపసూచితకథను' దీసికొని తనరచనసొంపున కనక ఘటితరత్నమువలెపాఠకులచిత్తము లలరించునట్లుచేసెను. ఈకవికి సాహిత్యమునందేకాక సంగీతమునందును, జ్యోతిషమునందును, సాముద్రికమందును, వైద్యమందును, బ్రవీణతగలదు. సంగీతమునందుఁ బ్రవీణతగలదనుటకు నిదర్శనము:—

"క. శ్రీమంగళగిరివరసిం, హామేయకృపా విజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడ గానకళా, ధీమంతుఁడ దేవతాస్తుతిప్రవరపరుఁడన్"

(కవిరాజ)

జ్యోతిషము:—

"సీ. అతివిక వ్యా సమాగమస్థితిదీయ,
మిగులనవ రత్నము తెంపుమిగిలియుండె

బుధుని కన్యాసమాగమమిథునవర్త,
నములు పెంపు వహించుట నైజము కద.

చ. ఇనఁ డుదయించువేళ నమరేంద్రసురప్రముఖగ్రహంబు లా
తతకళలన్విలుంగు హిమధామునిఁ జూచుచునుంటఁజేసి ని
ర్జితరిపుఁడై ధరాస్థల మశేషము నేలెడు సార్వభౌముఁడై
యతులితకీర్తి నొప్పెడు మహావిభవంబునఁ బెక్కువర్షముల్."

(కవిరాజ)

సాముద్రికమందుఁగూడ దనకుఁ బ్రవేశముగలదని చూపుటకే యనిరుద్ధచరిత్రమందు గ్రంథాంతమున నిష్కారణముగ నారదుని బ్రవేశపెట్టి యాతనిచే యనిరుద్ధున కతనిపుత్రుని భావిదశఁ జెప్పించెను. ఈభాగమును వదలివైచినను కథావిధానమున కేమాత్రము భంగము వాటిల్లదు.

వైద్యము:—

"గీ. వాతవిధ్వంసపరసాఖ్య వటులుగావ,
ధంబు నాగేంద్రమనుమంత్రితంబుఁ జేసి
వలయు నీపైఁ బ్రయోగింప మలయపవన,
మందు మంత్రంబులనుగాని మట్టుపడవు.

శా. మార్తాండోపమధనేవచేతను జగన్మర్త్యుండు ప్రాలేయశీ
తార్తిం బాసి తదీయవైకృతివిదాహంబొందఁ దద్భావ ని
ర్వర్తింపం గ్రియచేసె యుక్తిచెలువారన్ బూర్ణచంద్రోదయ
స్ఫూర్తిం గాలభిషగ్వరుండు పైపైజ్యోత్స్నారుచుల్ దేరఁగన్"

(కవిరాజ)

ఈకవికిఁ దనగ్రంథములు సమకాలికులయనాదరణకుఁ బాత్రములగుననియు సర్వవ్యాప్తము కావనియుఁ గొంతసందేహముకలదు. ఇతఁడు తనపుస్తకవ్యాప్తికొఱకుపోద్ఘాతరూపమునను కుకవినిందారూపమునను నెంత ప్రయత్నించెనో చూడుఁడు:—

"చ. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరిసొమ్ము గాదు భా
రతిదయ సాధవార్థికవిరాజులమానసముల్ ఘటంబు లా
యతముకొలంది లబ్ధమగునయ్యమృతం బటుగానఁదలంచి య
ద్యతనకవీంద్రులార! కృపదప్పక మత్కృతి నాదరింపుఁడీ."

(అనిరుద్ధ)

"తే. గీ. కాళిదాసాదులకునైనఁ గలవు తప్పు
లనిరి పెద్దలు మాదృశులనఁగ నెంత
తప్పుగల్గిన దిద్దుఁడీ యొప్పుగాను
బాలునకు బుద్ధిసేర్పసత్ఫంగిఁ గవులు.

చ. సుకవుల సూక్తులందు పరసుల్ సరసుల్ వెదుకంగఁబోరు మ
క్షికవితతుల్ వ్రణంబు పరికించుగతిన్ గొదవల్ గణించుటల్
కుకవులనైజబుద్ధి తెరలోఁ గనుచొప్పున బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమ లుండవె పెక్కులు వెక్కిరించుచున్.

తే. భగవదర్పితకావ్యంబుపట్ల నెరసు
లున్న దూషింపవలదు మాయన్నలార!
శుభకిరీటంబు ధరియించు కొనినతలకు
సుల్లు లెక్కలుపెట్టుట చొప్పుగాదు."

(అనిరుద్ధ)

"ఉ. ఎవ్వరి కెంతబుద్ధి పరమేశుఁడు దాఁ గృపఁజేసె నట్టిద
నివ్వటిలంగ కవిత్వరుచి నేరుపు చాలిన చాలకుండినన్
నవ్వక వర్తమానకవినాథులు చేకొనరయ్య! మత్కృతిన్
బువ్వులు గందకుండ రసముంగొను తేటులవంటి నేర్పునన్."

(కవిరాజ).

ఈ క్రిందిపద్యమున లాక్షణికులయందు దోషారోపణగూడ గలదు:—

"ఉ. చెల్లునటంచు నొక్కకవి చేసినలక్షణ మొక్కరివ్వలన్
జెల్లమిఁజేసి తారొకటి చెప్పఁగ ఛాందసవిస్తరంబు సం
ధిల్లుటఁ గావ్యశంక లవనిన్ దఱుచయ్యె రసజ్ఞులార! నా
యుల్లపుసౌధవీథి గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగుపల్కు లివి తప్పులు నేయక చిత్తగింపుఁడీ!

చ. పలుమఱుఁ దప్పులే వెతకఁ బాల్పడి యుండుటఁగాక దుష్కవుల్
తెలియఁగఁజాలు రెట్లు రసదీపకకావ్య కళారహస్యముల్
దలఁపఁ బ్రపూతిహేయ కలితవ్రణశోధనవాంఛగాక యీఁ
గలకుఁ బటీరచర్చిత సుగంధతనుస్థితి బుద్ధిఁగల్గునే.

మ. చతురుల్ పూర్వకవీంద్రు లన్నిటను చేస్వల్పజ్ఞుఁడన్ స్వామికిన్
హితమో కాదో మదీయకావ్యమని నా కేలా విచారింప న
గ్రతనూజాల్ వ్యవహారకర్త లయినం గానీ కడుంబాలుఁడౌ
సుతు నవ్యక్తపుమాట తండ్రి కొదవింపంగాద యానందమున్."

(కవిరాజ)

ఇంతటితో విరమింపక గ్రంథాంతములం దిట్లు పురాణపక్కిని వాక్రుచ్చెను:—

"కం. జననాథ! యిట్లు నాచే, వినిపింపఁగఁబడిన రసవివేకనిధానం
బనిరుద్ధచరిత్రము వ్రాసినఁ జదివిన వినిన నరునిఁ జెందు శుభంబుల్."

(అనిరుద్ధ)

"కం. కవిరాజమనోరంజన, మవునన వక్తకును శ్రోతకతిశుభదంబై
భువినాచంద్రార్కముకీర్తిపెలుంగఁ బురూరవశ్చరిత్రముధనరున్."

(కవిరాజ)

ఈతఁడు వ్రాసిన రెండుప్రబంధములలో ననిరుద్ధచరిత్ర బాల్యమున వ్రాయఁబడినదగుట, పిమ్మట వ్రాసినకవిరాజమనోరంజన మంతప్రౌఢముగలేదు. కాన ప్రస్తుత మని

రుద్ధచరిత్రమును వదలి వయసుముదిరినపిమ్మట నితని కవితాలలామ బాలత్వమునువదలి ప్రౌఢత్వమును దాల్చిన వెనుక వ్రాసిన కవిరాజమనోరంజనము నించుక విమర్శింతము.

### కవిరాజమనోరంజనము

కవిరాజమనోరంజన మీ ప్రబంధమునకు సార్థకనామము. వసుచరిత్రకుఁబిమ్మట గొన్ని పిల్లవసుచరిత్రలు బయలుదేరెనుగాని దీనికిఁదుల్యమగు ప్రౌఢప్రబంధము లొకటిరెంటికంటె నెక్కుడు గాన్పింపవు. ఈకవిరాజమనోరంజనము భావములప్రోవు. అలంకారములగని, వర్ణనల కాటపట్టు. జాతీయముల పేటిక. లోకోక్తుల కాలవాలము. ఇందుఁ బ్రతిపద్యమును భావగర్భితమై మృదుపదగుంఫితమై, అలంకారసహితమై, ధారాశుద్ధిగలిగి విరాజిల్లుచున్నది.

### కథాసంగ్రహము

పురూరవసభామందిరమునకు నారదుఁ డేతెంచి యతనికిఁ గొంతవేదాంతమును రాజనీతియు నుపదేశించి యమరావతికిఁ జనెను. ఇంద్రుఁడు నారదుని విశేషము లానతిమ్మని వేఁడెను. ఇమ్మునీంద్రుఁ డమ్మహేంద్రునకు 'శ్రోతవ్యవార్తాలాలిత్య వచస్సుధారససుధాంశుపూర్తిని' విశేషముల సంశ్రవణంబొనర్చెను. అందు ప్రస్తావవశమున పురూరవునివృత్తాంతముగూడ గొంత ముచ్చటించెను. ఇంద్రుఁడు నారదుని పురూరవునిపూర్వవృత్తాంతము సవిస్తరముగఁ జెప్పుమని ప్రార్థింప నాతఁ డిట్లు మొదలిడెను:—తారావిధులకు బుధుఁడు జన్మించెను. బుధున కిలాకన్యయందు పురూరవుఁడు గలిగెను. పురూరవుఁడు వసిష్ఠునిచే విద్యాభ్యాస మొనరింపఁబడి యుక్తవయసున పట్టాభిషిక్తుఁడయ్యెను. పిమ్మట దిగ్విజయయాత్ర మొదలిడెను. నారదుఁ డీదిగ్విజయయాత్రను వర్ణించుసమయమున నదికర్ణపేయముగ నాకర్ణించినయూర్వశికిఁ బురూరవునియందు వాంఛపొడమెను. భూలోకమున మిత్రావరుణులు తపస్సు చేయుచుండఁ దత్తపోభంగమునకై యింద్రుఁ డూర్వశినిబంపెను. ఊర్వశియాతపోధనులచే శాపగ్రస్తయై పిమ్మటఁ బురూరవునిఁ గూడెను. దీనికిఁ బూర్వ మూర్వశి పురూరవునిచే రెండువరములఁబడసెను. 'తాను మక్కువతోఁ బెంచిన జోడుతగళ్లను దస్కరు లహరింపఁ గూడదు. పురూరవుఁడు విగతవస్త్రుఁడై తనకుఁ గన్పింపరాదు. సమయభంగముజరిగిననాఁడుతా నింద్రలోకమున కేగెద'నని చెప్పెను. పిమ్మట నట్లెజరిగెను. ఊర్వశి గర్భధారిణియై పురూరవుని తేజస్సున నాయువనుపుత్రుని గనెను. పురూరవుఁ డూర్వశీవియోగమునకోర్వఁజాలక గంధర్వులను వేఁడ వారూర్వశీరూపముగల యగ్నిస్థాలియను యువతి నిచ్చిరి. పురూరవుఁ డీమోసము కనుగొని పురందరప్రముఖదేవతల నాశ్రయించి వారిచే నూర్వశిని బడసి నరసురలోకంబుల యథేచ్ఛావిహారంబుల జరియించున ట్లనుగ్రహింపఁబడెను. పిమ్మట శ్రుతాయువు, సత్యాయువు, జయుఁడు, విజయుఁ డను పుత్రులు కలిగిరి. వీరుగాక నరణులయందు హవ్యవాహనుఁడు జన్మించెను.

ఇదిగాక తారాశశాంకవిజయము, యిలాకన్యకథ, ఊర్వశీ పూర్వవృత్తాంతము, కుమారవన వృత్తాంతము, మొదలగు నుపకథలు గలవు. ఇవియన్నియుఁ గలిపి చదువునపుడు వస్త్వైక్యమునకు భంగము వాటిల్లినట్లు గానిపించునుగాని కథావిధానమునఁ గవి యీయుపకథల మిగులనేర్పుతో నతికెను. శేషము వేంకటకవియొక్క ప్రబంధమున వివరించిన తారాశశాంకవిజయకథ నీకవి రెండుమూఁడుపుటలయందు మిగుల హృద్యముగ వివరించెను.

### కథాసంవిధానమందలి లోపములు

కథావిధానమున నొకటిరెండుచోట్ల కవి పప్పులోఁ గాలువైచినట్లు తోఁచుచున్నది. పురూరవుని సరియగు చరిత్ర ద్వితీయాశ్వాసములోఁ బ్రారంభమగును. గ్రంథమందలి ప్రథమాశ్వాసము దీసివైచినను కథ కెట్టిభంగము వాటిల్లదు.

విమర్శనసౌకర్యముకొఱ కీ గ్రంథమును రెండు ఖండములుగ విభజింపవచ్చును. ఊర్వశీపురూరవసమాగమమునకుఁ బూర్వకథను పూర్వఖండమనియు నుత్తర కథ నుత్తరఖండమనియుఁ బిలువవచ్చును. పూర్వఖండమును పంచమాశ్వాసముతుదివఱకు విపులముగవర్ణించి యుత్తర

ఖండమును గ్రంథాంతమునఁ గొలదిపద్యములలోనిమిడ్చి త్వరత్వరగఁ జెప్పివైచెను. అక్కడతన తుదిభాగము త్రుంచి వైచినట్లుండి విషయవిభాగనిర్ణయమందుఁ గవికిఁ గలలోపమును వెల్లడిచేయుచున్నది. పూర్వఖండమున గల పుష్పాపచయాదివర్ణనల నంతదీర్ఘముగ సాగదీయకున్న నిట్టిలోపము వాటిల్లెడిది కాదు.

వైవస్వతమనువు మిగుల శ్రమపడి పొందిన పుత్త్రుఁడు సుద్యుమ్నుఁడు వేటకు వెళ్లెను. పిదప కుమారవనముఁ జొచ్చి శంకరునిశాపవశమున మరల నిలాకన్యయను యువతిగ మారెను. అంతట బుధునియాశ్రమమునకేగి యాతనిఁగూడి పురూరవుఁడను పుత్త్రునిఁ బడసెను. పిమ్మట వసిష్ఠునివేడ నాతఁడుఁ శంకరునిఁ బ్రార్థింప నతఁడు బ్రత్యక్షమై యొకనెల పురుషుఁడుగ నొకనెల యువతిగ నుండునట్లు వరమిచ్చెను.

అప్పుడు పుత్త్రుని వెంటఁబెట్టుకొని సుద్యుమ్నుఁ డింటికి వెడలెను. ఇంతకాలము వేటకుఁబోయి రాక తడసిన పుత్త్రుని జాడనరయక యిప్పుడు వైభవముతో వైవస్వతుఁ డెదురేగుట దొంగలుపడినయారునెలలకుఁ గుక్కలు మొఱిగినట్లున్నది.

నదీతటమున గంధర్వులు తగర్ల నపహరించినపుడు కొంతదూరము వెన్నంటిపోయి వారితోఁ బెనఁగులాడి పురూరవుఁడు వస్త్రవిహీనుఁడయ్యెను. విగతవస్త్రుఁడై యాతఁడు పోయినంతదూరము, మఱల వెనుకకుఁ దిరిగి యూర్వశియొద్దకు వచ్చునపుడు మార్గమధ్యమున నొకసారియైనను తనదిగంబరత్వమును జూచుకొనకుండుట మఱియొక లోపము.

### ర స పో ష ణ

కవి ప్రథమముననే 'వీరశృంగారరసాదిలీలల ప్రగల్భతకుఁ బుధులౌననంగ వి, స్తారము సేయఁగాఁదగిన సత్కథ' నేరి తీసికొనెను. మిగిలినరసములు కొంతవఱకచ్చటచ్చటఁ గానిపించుచున్నను బ్రబంధమున శృంగారము స్థాయిరసము. తనకువీలైన ప్రతిసందర్భమునను గవి శృంగారమునుఁ జొప్పించెను. ఈశృంగారము మొదట తారావిధులసందర్భమునను, పిమ్మట పార్వతీశంకరులవిషయమునను, తదుపరి నిలాకన్యాబుధుల విషయమునను అనంతర మూర్వశీమిత్రావరుణులవిషయమునను, అటు పిమ్మట నాయికానాయకులైన యూర్వశీపురూరవులసందర్భమునను బరిపూర్ణతఁ గాంచెను. కవికి శృంగారవర్ణనమున నల్లేరుమీఁదిబండీనడక కాని యిచ్చటను గవి మితమెఱుఁగక కేవలము పచ్చిశృంగారమును వర్ణించెను. ఇతఁడు కొన్నిచోట్ల ప్రథమసురతమును వర్ణించుటతోఁ దనివితీరక గర్భధారణమును, గర్భవతిని, గర్భవతిసంగమమును, బాలింతరాలితనమును, 'ప్రసవితానంతరద్వితీయమాససమాగమాధిక్యసుఖమును'గూడ వర్ణించెను. ఈ సందర్భమున నీపద్యము లెంత యేవగింపును గలుగఁజేయుచున్నవో చూడుఁడు:—

"సీ. పాలుబ్బిబిగువుగుబ్బలనెమ్మొనలకీవి
    పసపంటుపయ్యెదపై నటింప
కాయంపుముద్దలకారంపుఁదావు లా
    స్య నిసర్గవాసన నలమికొనఁగ
వదనమున దిటముగ వడిఁ జుట్టికట్టిన,
    బంగారుమైజారు కొంగు దనర
నుల్లిపూసలచేరు హారుమంజీముత్త్యాల
    కుతికంటుదాపునఁ గొమరుమిగుల
గీ. ప్రసవసమయపరిశ్రాంతి బడలియున్న
యంగకములకు నొకవింత యంద మెసఁగ
జూడఁదగియుండె నప్పు డాసుదతియందు
లాలితంబైన బాలింతరాలితనము.

సీ. అర్ధక్షణంబైన నంతరాయము లేని
    కౌఁగిలి యత్నసంఘటితమయ్యెఁ
గుచపీడనంబు చేకొలఁది సారెకుఁజేయు
    మమత హస్తస్పర్శమాత్రమయ్యెఁ
గపురపీడ్యపుఁదావిఁ గ్రమ్ముచుంబనలబ్ధి
    కటువస్తుపరిమళకలితమయ్యె
ఘటదక్రకపుంభావనటనలఁజూపునే
    ర్పులకుఁ జొక్కుట లపరూపమయ్యె
గీ. నతనిహృదయంబు పూర్వహర్షానుభవత
బొదలె బాలింతరాలి సంభోగకేళి
నలవిరయే దొంచఁ బ్రసవితానంతరద్వి
తీయమాససమాగమాధిక్యసుఖము."

ఇతఁడు శృంగారము నచేతనములైన తరులతాదులకుఁగూడ నంటఁగట్టెననుటకు రెండుదాహరణలు:—

"మ. శుకసందోహశుభాలికేళులకు దుర్గ సొంపొందు శాఖావలం
బక జంబీరఫలద్వయంబుఁ గని కొమ్మా! చూచితే ప్రోఢనా
యకునిం గూడిన బాల చన్గవను సామ్యంబయ్యె నానందు నో
క్కొకరం గేతన్న చూపెఁ బోడిచెలికిన్ కందర్పుఁ దర్శింపలగన్.
మ. లతికాంతల్ గడు పెంపుమీరి ఋతువేళా పుంవరిక్రీడ సం
తతి గల్గన్ ఫలగర్భభారములఁ జెందం బోలుఁ గాకున్నలం
• చితకోలంబకదంబదీర్ఘమము గన్పింపన్ గతం బేమి న
వ్యతరాంతర్నికరందకుగ్ధ సుమగుచ్ఛాంచద్భూచ్చాగంబులన్."

ఇంక నిట్టివి గలవుగాని స్థలసంకోచమునకై వెఱచి విడిచెద.

### పాత్రౌచిత్యము

ఉపకథలనువదలి యొక్క పురూరవశ్చరిత్రమునే తీసికొనిన నందు వచ్చు ముఖ్యపాత్రలు నాయికానాయకు లైన యూర్వశీపురూరవులు, వారలసంయోగకర్తలగు నారదశుకదంపతులు. నాయికానాయకపాత్రలు బాగుగ పోషింపఁబడినవి. నాయకుని విషయమునఁ గథావిధాన మునఁ దెలుపఁబడినలోపముదప్ప వేఱెద్దియు లేదు.

నారదుఁడు ప్రథమాశ్వాసమునఁ బురవర్ణనానంతరము ప్రవేశించి పురూరవునకు రాజనీతి మిగులనేర్పుతోఁ గఱపెను. ఈపట్టునఁ జూపఁబడిన రాజనీతిచతురతఁ జూడఁ గవికి నామాంతమునఁ గలయమాత్యశబ్దము సార్థకముగఁ దోఁచుచున్నది. పురూరవుని వైరాగ్యమును నారదుఁ డుపదేశించిన వేదాంతమునుఁ జూడ నిది రచియించినది శృంగారప్రియుఁడైన మనకవియేనా యని యబ్బురము దోఁపకమానదు. సంకుసాలనృసింహకవి చెప్పినట్లు శృంగారవర్ణన చదివిన యోగి భోగిగను వేదాంతవర్ణన చదివిన భోగి యోగిగను తప్పక మారును. ఈపట్టునగల వచనములు పోతనమహాకవి రచించిన సప్తమస్కంధములోని వేదాంతవిషయముల వర్ణించువచనములజ్ఞప్తికి రప్పించును. మఱల నారదుఁ డింద్రసభయందుఁ గన్పడి ప్రసంగవశమున నింద్రునకుఁ బురూరవవృత్తాంతము వినిపించెను. పిమ్మట పురూరవునిశౌర్యప్రతాపాదులు వర్ణించి యూర్వశికిఁ బురూరవునిపై వాంఛ పొడముసట్లు చేసెను.

శుకమిథునము:— శృంగారనైషధమందలి శ్రీనాథునిమరాళమును జూచియుఁ బ్రభావతీప్రద్యుమ్నమందలి పింగళిసూరన శుచిముఖినిఁ జూచియు నిచ్చఁ డీశుకమిథునమును బ్రవేశపెట్టెనుగాని వానియంతప్రాముఖ్యము వీనికి లేదు. ఈమిథునమునకు 'శారదారమణీ ముంజేతిపై నుండు రాచిలుకతోడి బాంధవ్యము' గలదు. ఇందలి శుకము త్రికాలవేది. మన్మథవికారమునకు లోనైన యూర్వశికిఁ జెలికత్తె లుద్యానవనమున శిశిరోపచారములు సలుపుచుండ నీమిథునము ప్రత్యక్షమై యూర్వశి పాకశాసనునియోగమున భువికేగినపుడు పురూరవుఁ డీమెపైఁ గూర్మివహించునని జ్యోతిషముఁ జెప్పి యాశీర్వదించును. పిమ్మట యూర్వశి భూలోకమునకు వచ్చి పురూరవసమాగమోపాయ మన్వేషించుచుండ నామెయూహపట మతని యుద్యానవనమున నుంపుడని యుపాయముఁ జెప్పెను. కవిసార్వభౌమునిహంసయు సూరనశుచిముఖియు నాయికలతోడనే పరిచయముఁ గలిగియుండక నాయకులయొద్దకుఁగూడ నేగి యన్యోన్యానురాగ ముదయించునట్లు చేసినవి. కాని యీమిథున మట్లొనర్పలేదు.

వనపాలకులు పురూరవునితో భాషించిన జాతీయము లౌచిత్యసూచకములు:—

"గీ. సామివారితోఁటలో మిక్కిలిగని
యనుగుమీఁద నుండె వాడ కొండు
దెచ్చిపెట్టినాఁడొ దేవర! యెఱుఁగము
కావరాదు వింతమానిసులను."

### అనుకరణము

ఈకవి పూర్వకవుల నచ్చటచ్చట ననుకరించినను మక్కికిమక్కి గ్రుడ్డియనుకరణగాదు. కొంతవఱకు మార్పు చేసి నేర్పుతో ననుకరించెను. కొన్ని యుదాహరణలు:—

"తే. వానిఁ గలలోన గాంచి వనజముఖియు
వానిమార్పుఁ జేకొన్ని మానవతియు
వానిఁ గా నాత్మభావించి వరునిఁ గవయ
నప్పళింపని సతియు లేదయ్యెనచట." (నైషధము)

"మ. లలనప్రాణేశులు గారవింపఁగ నింతల్ నిందుకౌఁగిళ్ల నం
దముగా నుండియు నప్పురూరవునిసౌందర్యంబు భావింతురు..." (కవిరాజ)

"వ. ఇతఁడు దర్పకుఁడనుమ చేర్పడ నక్షి లలాటపట్టికకా
శకల్పితి వ్రాసినట్టిలిపిజాల మనర్థముగానియట్లుగా

వితరణఖేలనావిభవవిభ్రమనిర్జితకల్పభూరుహం
బతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రునిఁ జేయు నాతనిన్."

(నైషధము)

"మ. "అయ మర్థి జన"యంచు యాచకలలాటాంతస్థలిన్ బ్రహ్మ ని
ర్ణయతన్ వ్రాయ వహించునట్టి లిపియర్థంబున్ విశేషాన్వయ
క్రియగా నర్థమవారిగా నొసఁగి యర్థిం జేయు వాగీశు వ్రాఁ
తయు నాత్మీయవితీర్ణియుం న్నిజముగా ధాత్రీశు చేకూర్చెడిన్."

(కవిరాజ)

"సీ. కోరి లీలాగేహకుడ్యభాగంబుల,
వ్రాయుఁడు రమ్యమహీశ్వరునిమూర్తి
వ్రాసి కన్యాత్వగౌరవము వీసరవోవ
దర్శింతు రనురాగతరళదృష్టి
దర్శించియతని శేఁదుగుఁదునో తగనోయం
చించుక్షించుక సంశయింతురాత్మ
సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించుట
ద్దము లెత్తిమోతురు తమ్ముఁదారు
తే. రాజకన్యలు జగతి నాక్రమమునందు
గందు వారల నిట్టూర్పుగాడ్పు వేఁడి
ముకురములు, చారుమోహనమూర్తి యనఁగఁ
బరఁగు దమయంతిచేతి దర్పణముదక్క."

(నైషధము)

"సీ. అమ్మహారాజు వృత్తాంత మాసక్తితోఁ
జెవియొగ్గి వినని రాజీవగంధి
విని వానిభువనమోహనవిలాసస్ఫూర్తి
సారె భావింపని చంద్రవదన
భావించి యతనిసంపర్కంబునకుఁ
జాల ముచ్చటపడని సమ్మోహనాంగి
ముచ్చటపడి చిత్తమున వెన్నవలెఁ గరం
గుచుఁ దన్మయతఁ గీల్కొనని రమణి
తన్మయతచేత నార్ద్రకందర్పగేహ
యగుచుఁ జెలిఁగొంది యసురుసు రనని వనిత
గానఁబడదయ్యె సురగణికాజనంబు
లో నొకర్తైనఁ గల్పభాస్థానమునను."

(కవిరాజ)

"సీ. ..............................
గ్రహణవేళలయందు రాహువాహరించి తృప్తిపైగజ్జునఁ దేచెనేని
..............................
.............................." (నైషధము)

"క. ఇజ్జందురు మజ్జందురు, వెజ్జలు నీలోనిమలుపు విషరాశిసుమీ
జుజ్జుకొని నిన్ను రాహువు, గజ్జునమల్రేన్పకున్న కాకున్న శశీ!"

(కవిరాజ)

"సీ. నలినసంభవువాహనమువారువంబులు
కులముసాములు మాకుఁ గు వలయాక్షి!
..............................
.............................." (నైషధము)

అను పెద్దనయనుకరించిన పద్యమునే యీకవిగూడ నిట్లనుకరించెను:—

"సీ. మానివాసము ముక్తిమానివాసంబైన
బదరికావనసీమ భామలార!
మామైత్రి యలకరామామైత్రిఁ బేరైన
శుకతల్లజముతోడ సుదతులార!
మాయింపు ఖేదముల్ మాయింపు భగవత్క
థాప్రసంగంబులు తరుణులార!
మానేత్రములకు సుమానేత్రజాదిలో
కములు దృశ్యంబులు కాంతలార
మానిజగతి దుస్సంగతిమానిజగతి
సత్పవిచారతే మందుట సకియలార
మామహితప్రోక్తి వినుఁడు సమాహితమున
మీకు శుభవార్త పలికెద మెలఁతలార!" (కవిరాజ)

పైపద్యము నైషధమందలి హంసపలికినదియు; నీ పద్య మీగ్రంథమందలి శుకము పలికినదియు. పెద్దనయనుకరించిన నైషధములోని శ్రీనాథునిదైన యీక్రింది హృద్యమగుపద్యమును గూడ నీకవి యనుకరించెను:—

"మ. కమలేందీవరషండమండితలసత్కాసారసీవారతిన్
గమికర్మీకృతసైకతీస్మృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిన్, బల్లవపాణి, పద్మనయనన్, రాకేందుబింబాననన్,
సమపీనస్తని, నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్."

(నైషధము)

"శా. ధ్యానానందనిమీలనంబులకు నేత్రద్వంద్వముల్ విచ్చి య
మ్మానుల్ గాంచిరి చెంగటన్ నిజసభీమధ్యంబునం బొల్చుతం
పానైగన్నిగగాత్రి, నీలచికురన్, బంధూకరాగాధరన్,
మీనాక్షిం, దృఢతుందిలస్తని, దరస్మేరాననాంభోరుహన్."

పోతనమహాకవి యంత్యప్రాసమునుగూడ నీకవి పెక్కుచోట్ల ననుకరించెను. రెండుమూఁ డుదాహరణములు చూపెద:—

"క. స్నానంబుల నియమాను, స్థానంబుల సిద్ధయోగసల్లక్ష్యహరి
ధ్యానంబుల నానావిధ, దానంబుల హర్షపూరితస్వాంతుండై.

ఉ. కీరములన్ మనోజ్ఞరుచిఖేలనపర్ణవిశేషశోభితా
కారములన్ నవారుణముఖప్రథితాత్మగతానురాగవి
స్తారములన్ జనశ్రుతిరసాయన మంజులవాక్కథాసుధా
పూరములన్ గనుంగొని రపూర్వముదంబున నూర్వశీసఖుల్.

సారస్వతనికేతనము, వేటపాలెము



Sarasvataniketanamu, Vetapalem



శ్రీ. ఉ. వెం. శ్రేష్ఠిగారు సారస్వతనికేతనమున కుచితముగా నొసఁగిన 'సుబ్రాయమహాల్' భవనము, వేటపాలెము.

" Subrayamahal " Office Premises of Sarasvataniketanamu a gift of U. V. Sreshti of Vetapalem



శ్రీ ఉ. వెం. శ్రేష్ఠిగారి సతీమణి శ్రీ కమలాంబగారు, వేటపాలెం

Mrs. Kamalamba, Lady of U. V. Sreshti Garu, Vetapalem

శ్రీయుత ఊ. వేం. శ్రేష్ఠిగారు, వేటపాలెము



Sjt. U. V. Sreshti Garu, Vetapalem

బాలికా హిందీపాఠశాలయందు ప్రాథమికపరీక్షలో మొదటితరగతియం దుత్తీర్ణలైన బాలికలు



Girls passed in first class at the entrance Examination, Hindi Girls' School, Cocanada

బాలికా హిందీపాఠశాల, కాకినాడ పరీక్షయందు మొదటితరగతియం దుత్తీర్ణలైన బాలికలు



Hindi Girls' School, Cocanada, Girls passed at the Madras Hindi Pracharak Entrence Examination in I Class

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు
హిందీ బాలికాపాఠశాల, కాకినాడ



Mrs Gummididala Durgabayamma Garu
Tutors, Hindi Girls' School,
Cocanada

ఉ. కాంచనశైలధీరుఁ డటుఁగాంచె నట త్తటకాంచనద్రుమా
ఖాంచలవాతచంచలనవాంబుజసంగతరంగమాలికా
సంచయడోలికాభ్రమణ సంభ్రమలోల మరాళబాలికా
ప్రాంచితకేలికాకలితహంసను నొక్క సరోవతంసమున్."

'వనిత తనంతఁ దావలచివచ్చిన చుల్కనగాదె యేరికిన్' అను పెద్దన పద్యపాదము నెంత రమ్యముగఁ జెప్పెనో చూడుఁడు:—

"క. మనసియ్యక యలయించును,దనువలచినరంభ నైనఁదావలచినచోఁ
జెనఁటికి నైనను వశుఁడై, చనవిచ్చును బురుషుఁడెంతసరసుండైనన్"

"ఉ. చూచి ఝళంఝళత్కటకచూచితవేగపదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడన్
జూచినయొక్క పోఁకనుమబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలన్ దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్."

అను పెద్దనపద్యము నీ క్రిందివిధముగ ననుకరించెను:—

"ఉ. దిగ్గనలేచి శంకితమతిన్ శశికాంతశిలావితర్దికన్
డిగ్గి బెడంగుగుబ్బలు నటింపఁగఁ గౌను వడంక వేడ్కతో
సిగ్గు మొగంబునన్ మొలవఁ జెంత నికుంజముచాటు కేగ న
ప్యగ్గమనంబునన్ జకితహంసిక లీల నభీసమేతయై.

మ. తిమిఁ బూఁదీగలఁ దూగుటుయ్యేలలఁ బంతాలాడుచున్ దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ దొక్కిగా సాగివిం
టిమొగంబై చనుదెంచతీవఁ గనుఁగొంటే దివ్యమానీంద్ర! నా
కమ్మగిన్నేత్రలమీఁదఁ గయ్యమునకున్ గాల్ద్రావులాగొప్పెడిన్."

అని 'బహుతపఃఫలము'గాఁ బలికిన సూరనకళాపూర్ణోదయమందలి పద్యము నీక్రిందివిధముగ ననుకరించెను:—

"మ. అరవిందాక్షులు దీగయుయ్యెలల నొయ్యారంబుగా నూఁగఁ జొ
చ్చిరి పాదాబ్జము లవ్వనీకిసలయశ్రేణిన్ దలర్చన్న సుం
దరశోభానఖపఙ్క్తి చక్కగమియై దండెత్త మంజీరపుం
జరవం బభ్రభునీమంతముల వాక్స్తంభంబు గావింపఁగన్."

## శైలి

శైలి మృదుపదగుంఫితమై, మిగులధారాళమై యలరారుచున్నది. కవియే కవిత్వస్వరూప నిర్ణయ మిట్లు గావించెను:—

"మ. తనఁ దా మెచ్చుకొనంగ నేటికిఁ గవిత్వప్రౌఢి యాంధ్రీఘన
స్తనకుంభస్ఫురణన్ నవీనమృదుచిత్రశ్రీపదాచ్ఛాదనా
ధీనవాలంకరణార్థసూచనల సంప్రీతిన్ మనోవీథులం
జొనుపంగల్గిన నింపులో విని రసజ్ఞుల్ మెచ్చినం జాలదే."

"చ. తడసినవల్పెపయ్యెదలు దాఁకొని పైపయి నంటియుండఁగా
నుడువ నగోచరంబగు వినూత్నవిలాసత నొప్పె నవ్వధూ
ప్పదఁతులుగుబ్బచన్నవలు ప్రౌఢకవీంద్రునిచే రచింపఁగాఁ
బడు మృదుగూఢపాకరసబంధురకావ్యవచస్సమంబులై."

ఇతఁడు గ్రంథమందంతటను జాతీయలోకోక్తుల నతివిరివిగ వాడియున్నాఁడు.

"కలలోన నరకులాడిన కలనే గాయములు"
"ఎంతసాహసు లహహ సీమంతవతులు"
"పువ్వుఁబోఁడి వికృతి పైకొన్న సెగపొంత, వెన్న గాదె"
"కలుగఁడుగదా వివేకంబు కాముకులకు"
"మదినిదిపుణ్యమౌనని యొనర్పగ పాపము వచ్చె మెంతో"
"భార్యా రూపవతీ శత్రుః"
"వ్రతముచెడిన సుఖము దక్కఁగవలె"
"ఉష్ణముష్ణేన శీతలం"
"ఖద్యోతనామములం దాల్చుమెఱుంగుకీటములు"

ఒక్క యీ క్రిందిపద్యమున నెన్ని జాతీయము లున్నవో చూడుఁడు:—

సీ. అతనిబింబాధరం 'బందని ద్రాక్షపం'డని
విచారించె మదాలసాఖ్య
యతనిచేసోఁకు నయ్యాట 'లేటావలి
గిలిగింతలని' వితర్కించె రంభ
యతనితాంబూలగంధాప్తి 'యేనుఁగు
మీఁదిసున్నం'బని మేవకించె
నతనికృపారసామృతవృష్టి 'పెడగంగ
యొడకు'మంచు ఘృతాచి మదిఁ దలంచె
జనమనోరమ ధాన్యమాలినిఁ గళా వ
తియుఁ దిలోత్తమపూర్వదిత్తియుఁ బ్రమోహి
మొదలుగా నింతులకుఁ జింత యొదవె నతని
చిత్తమది 'గట్టుచాటుని క్షేప'మనుచు.

"విషమసంధిఁ, గీడొనర్చుట హీనులజాడగాదె"
"తేనెపూసినకత్తిగాదె"
"మున్ను పుట్టినజలరాశి విషము పుట్టినరీతిన్"
"కుత్తుకను విషంబు నాలుకను బెల్లంబుగాదె పాలసునకు"
"నేతిబీరపస"
"అతివినయ మెల్లధూర్తత యనుట నిజము"
"గురువుకు బొమ్మవెట్టితిరి"
"ఏంతయు యలరించు నెవ్వరిని యత్నము సేయక వచ్చులాభముల్"
"సెగపొంత వెన్న పురుషుం డొంటిఁ బో వధూకేష్టతన్"
"నిరంకుశంబులుగదా జవరాండ్రతలంపు లెయ్యెడన్"
"అదృష్టలభ్యములు గావా సుందరీ సౌఖ్యముల్"

"నమ్మంగారాదు ప్రమాదం బొకవేళ బుద్ధిమంతునకయినన్"
"కల్గునే కాని మతిపూర్వజన్మమున గల్గినవృత్తి తథవాంతరంబునన్"
"ఎవరయం జరదంబరరహస్య మెవ్వం డెఱుంగున్"
"కలిమిగలచోట మఱియును గలిమి గలుగు"
"వనితలతలంపు లెఱుంగ నెవ్వరివశంబు"
"వనజముఖులకు బురుషులు వశులుగారె"
"ఎంతచేసినవారికి నంతగాదె"
"అనఘులకువారు తనయింటి కరుగుదేర, కోరి యనురాగమందని వారు గలరె"
"కలలవంటివిగావె ఋణానుబంధములో"
"వారకాంతలవలపు లెవ్వరికి సతము"
"వలచిన, యింతిం బాసిన విచార మింతనవశమే"
"భాగ్యవంతుం, డెంతదలచిన ఫలమా నిది నిజంబు"
"పెన్నిధిగన్న పేదగతి"
"అడవి, గాసినవెన్నెలయట్లు గాదె"

## వర్ణననైపుణ్యము

ఈతం డితరప్రబంధకవులవలెనే ప్రబంధమున కత్యవసరములని యెంచి, పురము, జలక్రీడ, పుష్పాపచయము, వేట, మన్మథవికారము, శిశిరోపచారములు, మన్మథశశ్యనిలదూషణములు, ఋతువులు మొదలగు వానివర్ణనల నొక్కటియైన విడువక రచించెను. స్వాభావికవర్ణనలకై కొన్నియుదాహరణలు చూపెద. ఈక్రింది పద్యములవలనం బాఠకులమనోఫలకములం దెట్టిచిత్రములు ముద్రితములగుచున్నవో చూడుడు:

"సీ. సఖులమాటలకు వేసట నొందుచును శయ్య
పై లేచి యసదుగా బయటం జేర్చి
చెదరినకురు లొక్కచేం బట్టి సొగసుచా
లనికొప్పు వలసి యెల్లనిని దులిమి
బరువంపు ముత్యాలసరములు దివిచి చెం
గటనున్న యింతివోయిటను వైచి
వలవంపు గిలుకుపావా లవ్వలికిం ద్రోచి యలంతి
పాదుక లంఘ్రులందుం దొడిగి
యనుగునెచ్చెలిభుజము కరావలంబి
తంబుగా నూది కనకసౌధంబు డిగ్గి
యలపుసోలపున పసుదుపురనుచు మంద
మందగతి నేగె వనమున కిందువదన.

సీ. శ్రీదేవి భూదేవి చెలిమెుకచరణంబు
నూరుదేశంబుల నుంచి యొత్తి
సమయోచితంబుగా సరసంపుఁజోలలు
దివ్యాంగనలు నిగ్గుదేరం బాడ
సనకాదు లుపనిషత్సారసంస్తవకదం
బోచ్చైర్ప్రశ్నినదపాళ ముజ్జగింప
పద్మసద్మనుమ విష్వక్సేనుండింద్ర
ముఖ్యులను జేసన్న నవ్వలికినుప
నమృతసాగరమధ్య శేషాహితల్ప
భాగమునసౌఖ్యనిరతిచేం బవ్వళించి
నిదురతమిం గన్ను లరమోడ్చి నెఱనెఱిగెడ్పె
విష్ణుమూర్తి తదాషాఢవేళయందు.

సీ. వనవాటికలయందు వరవిహంగీవిహం
గసమాజకూజితకలరవంబు
ప్రాసాదములయందుం బాఠకోద్గీతభూ
పాలాదిగీతికాబహుళరవము
గోస్థానములయందు గోపకాహ్వానోత్సు
కారంధసురభికాంభారవంబు
వరిశాకరములందు నవనవోత్ఫుల్లార
విందబృందచలన్మిళిందరవము
స్నానఘట్టంబులందు మజ్జనవిధాన
నిరతవిశ్వంభరామరనికరపఠిత
సుప్రసిద్ధానుమర్షణసూక్తరవము
శ్రావ్యమై యొప్పె నయ్యుషస్సమయమునను."

భావగర్భితములై యలంకారశోభితములైన యీ క్రిందిపద్యము లారయుడు:—

"చ. చనుచెడ దక్షిణాయనమిషంబునం గొన్నిదినంబు లుత్తరా
యణమున గొన్నినాళ్లు గగనాంతరసీమ మెలంగుచుం బురిం
గనంబను చోద్యము ల్గలయం గన్గొనుచుంచును రెల్లకాలముల్
ఘనమగుదర్పణేచ్ఛలను గైరవిణీ నళినీమనోహరుల్.

ఉ. శారదవేళయందు పరసంబగుపున్నమనాంటిరేయి ని
ర్నీరదరాజితాభ్రమున రెండవయామము నిండుచున్నచోం
జారుకళాభిరాముండను చంద్రుం డొకించుక సాటిచ్చు దు
ర్వారకళంకదోషము తొలంగుట గల్గిన రాజహంసముల్ నా.

గీ. అమరతరువుకు సంతానమనిన పేరు
నగవిభంజనుతోంటకు నందనాఖ్య
మదనసంహారునికిం గుమారసంజ్ఞ
యనుట తద్వనసంతతి యనుటనేమొ.

గీ. అతివకనుదమ్మికింబ్రతిముఖారవింద
మతివహస్తాంబుజములు తన్వంగిచరణ
కంజములు కొమ్మనెమ్మేనికమలసురభి
చాటుచున్నవి పద్మినీజాతి యనుట."

ఇట్టి వనేకములు గ్రంథమంతటను గలవు. శ్లేష యుఁ గొన్నిచోట్ల నుపయోగింపఁబడియె. ప్రబంధమునకు లోపము వాటిల్లుననియో పాండిత్యప్రకర్షకొఱకో, గోమూత్రిక, నాగ, ఛత్ర, అష్టదళపద్మ, పుష్పమాలిక, ఖడ్గ, చక్ర, సర్వతోభద్రబంధములం దొక్కటియు విడువక రచియించెను. బంధకవిత్వముతో విరమింపక ఆంధ్ర గీర్వాణభాషాశ్లేషకందము, కందద్వయరుగ్మవతీకమలవిలసితక్రౌంచపదవృత్తము మొదలగు గర్భకవిత్వమును వ్రాసి కందము, ఓష్ఠ్యకందము, నిరోష్ఠ్యమహాస్రగ్ధర, ద్వ్యక్షరి కందము మొదలగునవి రచియించి కవిత్వమున ననేక'సర్కసు' పనులజూపించెను.

'క్త్వార్థకయుత్తునకుసంధి,పోతనమహాకవివలె'లుక్సం శ్లేషానాచి'యనుసూత్రమునకు భంగముగ సంధికలుపుట మొదలగు వ్యాకరణవిషయమైన నెరసు లొకటిరెండు గలవుకాని కవిచెప్పినట్లుఁ కాళిదాసాదులకునైన గలవుతప్పులు; కాన నింతగొప్పగ్రంథమున నిట్టినెరసులు పాటింపఁ దగినవి కావు.

# ఆత్మార్పణము

జనమంచి సీతారామస్వామి గారు

పుడమిని నేడ్పుతోఁ గలుగుఁ బూరుషుఁ డంతఁ గ్రమక్రమంబుగాఁ
గడుపునకున్ ధనంబునకుఁ గాంతకు నారటమొందు నిట్టు లె
ప్పుడుఁ గడుదుఃఖమేకనుచు ముక్తిపథంబున నేగఁ డక్కటా!
పుడకలఁ గాని పోవదొకో పుట్టెను బుట్టినబుద్ధి రాఘవా!

మ. వనితార్థంబులఁ దిట్టిపోయుదురు సర్వానర్థమూలంబు లం
చును; సత్యం బరయంగఁ జిత్తమె నరుల్ చోద్యంబుగాఁ ద్రిప్పుచున్
ఘనకష్టాన్వితుఁ జేయుచుండునని పల్కంగాఁ దగున్; ధీరునె
వ్వనిఁ గాంతాకనకప్రభావము కలంపం జాలెడున్? రాఘవా!

మ. తను మోహించినరంభకున్ శుకుఁడు మున్ దాఁజిక్కినాఁడే? వరూ
థిని బల్మిం దనుఁ గౌఁగిలించినను దా ధీరత్వము న్బాసెనే
ఘనుఁడా నాప్రవరాఖ్యవిప్రుఁడు? మహాకామార్తయై తన్ను వేఁ
డిన చిత్రాంగిని రాసుతుం డెనసినాఁడే తొల్లి ? యోరాఘవా!

ఉ. మున్ను త్రిశంకభూవిభునిపుత్త్రుఁడు కౌశికహాని మాయచే
నెన్నియొ దుస్సహాపదలనేనియుఁ గాంచెనుగాని కల్మికై
యెన్నఁడు బొంకలేదు; జనకేప్సితసిద్ధికి సర్వరాజ్యమున్
గ్రన్నన వీడి శాశ్వతముగా నవివాహితుఁడై మహాధృతిన్
వన్నెకు నెక్కె భీష్ముఁడును; వారిని మర్వఁదరంబె రాఘవా!

ఉ. ఆసల గెల్వనేరక మనోఽశ్వము ద్రిప్పినయట్టు లేగి యా
యాసము నెంతపొందితినో, యందుల కెంతవిచారమయ్యెనో
వీసము దాచకుండ వినిపించుచు సర్వము, నీకు మ్రొక్కెదన్
దాసుని తప్పులన్నియును దండముతో సరిగాఁగ రాఘవా!

# మేఘసందేశము

రావు వేంకటరావు గారు

కవికాళిదాసకృతకావ్యములలో మేఘసందేశము స్వానుభూతిసంభూతంబగు ఖండకావ్యము. దీని నాదర్శముగా గొని కవులనేకులు హంసదూత నేమిదూతాదికావ్యముల విరచించిరి. అయినను కాళిదాస లేఖనీ ప్రసూతంబగు మేఘదూతంబే కావ్యరత్నంబు. ఇయ్యది విరహులకుహృదయము; భావకు గల్పవృక్షము; అలంకారమునకు మూలధాతువు; రసమునకు సాగరము; కవుల కాశ్రయము; కాళిదాసుని కల్పనాచాతుర్య మిందు సువ్యక్తమగును. హనుమత్సందేశమును మనసునం దుంచుకొని కాళిదా సీమేఘసందేశకావ్యరచనకు గడంగెనని ప్రాచీన వ్యాఖ్యాతల యభిప్రాయమై యుండెను. కాని దీనికిని దానికిని సందేశముమాత్రమే తుల్యముకాని మిగిలిన యాతనికృతుల కాధారము లగు నితివృత్తము లున్నట్లుగా దీని కేమూలకథయు గోచరింపదు. ఈత డేయాదర్శము గొనక స్వతంత్రంబగు నూతనభావసంపదల నీ కావ్యంబు వెలయించె ననుట నిశ్చయము.

ఇయ్యది నూటపదియేను పద్యములు గల చిన్న కావ్యమైనను భావప్రధానంబై యక్షీణరస భరితంబై, సార్వజనీనం బగుచున్నది. ఈ కావ్యమున రసము విప్రలంభశృంగారము; పాకము ద్రాక్షాపాకము; అలంకారము స్వభావోక్తి; సర్వశాస్త్రపారంగతుండగు మల్లినాథసూరి "మాఘే మేఘే వయోగతః; అనుటచే దీని భావగాంభీర్యము ప్రకటింపబడుచుండెను. వేయేల, సర్వశాస్త్రముల కిది గనియని చెప్పదగును.

స్వాధికారప్రమత్తుడైన యక్షుడు కుబేరునివలన శాపమును బొంది భార్యావియుక్తుడై తనశాపకాలమగు నొక్కసంవత్సరమును సీతానిమజ్జన పుణ్యోదకవేణులచే పవిత్రమై నిబిడితచ్ఛాయా తరుశ్రేణులచే నొప్పారు చిత్రకూటపర్వతమున నునికి బాటింపుచుండ నాషాఢమాస ప్రథమదివసమున మేఘుని గాంచెను. యక్షుని కప్పుడు భార్య తలంపునకు వచ్చె. విరహులకు మేఘావలోకనము కామాదివికారోద్దీపనముగదా. వియోగార్తిచే గుందుచున్న భార్య వర్షకాలమున నెటుల జీవముల నిలుప నోపునో యని సంకోచించి తన సేమమును దెలుప నిశ్చయించుకొనెను. యక్షుని కాపర్వతముపై వార్తాహారు లెవ్వరు దొరకుదురు? మేఘు డొక్కడే కనబడుచుండెను. కార్యార్థి యగుట మేఘు నర్చించి క్షేమమడిగెను. పుష్కలావర్త ఘనవంశసంభూతుడవని పొగడెను. నీ వంగీకరించి అలకాపట్టణ గమనోన్ముఖుడవై వెడలునప్పుడు ప్రియు లికరాగలరను సంతోషముతో గాంత లుద్గృహీతాలకాంతలై నిన్ను దిలకింతురు. నీభాగ్య మేమనవచ్చునని గొప్పచేసెను.

అచేతనుడగు మేఘుని వార్తాహారునిగా గల్పించుటేమి? అని పాఠకులకు సందియము కలుగవచ్చునేమో యని కవియే

శ్లో. ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః,
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు.

కామాంధులు యుక్తాయుక్త వివేకశూన్యులని విమర్శించెను. ఇక మేఘునిచే వార్త నంప నుద్దేశించుటలో నభిప్రాయభేదము లేదుగదా; కాని అపరిచితుడగు మేఘుడు స్వీయకాంతానురక్తుడగునేమో యని యక్షునకు భయము దోచెను. నీవు నాభార్యను చూచి చిత్త

చాంచల్యము బొందకు సుమీ యనిపలికిన మేఘు డేమను కొనునో? అదియును గాక గౌరవభంగముకాదా ? యక్షుడు దాని కొకయుపాయమును బన్నెను. తన కాంతకును మేఘునికిని వదిన మరది చుట్టరికముల గల్పించెను. అందువలన బైకి సోదరప్రేమ గనుపరచిన ట్లగును. అంతరుద్దేశ్యముమాత్ర మదిగాదు. "భ్రాతృజాయా మాతృవ న్నిశ్శంకం దర్శనీయా" యను న్యాయవ్యతిరేకుడు కాజాలడను తలంపు. తుదకు మార్గనిర్ణయమున కారంభించెను.

ఇందు కాళిదాసు చిత్రకూటమార్గమధ్య మందున్న పర్వతములను, నదులను, పట్టణములను, దేవక్షేత్రములను ఈ క్రిందివిధముగా ప్రాచీనోత్తర హిందూదేశస్థితిని చక్కగా వర్ణించెను.

"ఓయుత్తమకులసంభూతుడవైన మేఘుడా! నీ వీ చిత్రకూటపర్వతశిఖరమునుండి యుత్తరదిక్కుగా బయలుదేరి మాలమను నెత్తగు క్షేత్రమునెక్కి అక్కడనుండి యుత్తరముగా సుపక్వఫలసంశోభితమై చూతవృక్షములచే దనరారు ఆమ్రకూటపర్వతమున కేగి రేవా (నర్మద) నదిని జూచి క్రమముగా దశార్ణదేశముల బొంది ముఖ్యపట్టణమగు విదిశాపురమును జేరి యచట గల వేత్రవతీనదీజలమును త్రాగి సమీపమున నేకల నీచైరాచలంబున సేద దేరి నిర్వింధ్యానదికి బశ్చిమముగా బోయి యచ్చటనుండి యుత్తరదిక్కుగా మరలుము. నీ కా నదికి తూర్పుదిక్కుగా నున్న యుజ్జయినికి బోవుట చుట్టుదారియైనను తప్పక యానిర్వింధ్యామార్గము ననుసరించి యవంతిదేశముల బొంది వాని రాజధానియు శిప్రానదీతీరస్థము నగు యుజ్జయిని జేరుము. ఆపురమున గల శోభ గని దానికి సమీపమున నున్న గంధవతీ తీరమందలి మహాకాలక్షేత్రమునుచేరి మహాకాలనాథుని సాయంకాలపూజ నెరవేర్చుకొని మరలివచ్చి యారాత్రి యుజ్జయినిలో గడపునప్పుడు

"శ్లో. గచ్ఛంతీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః,
సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనితముఖరో మాస్మ భూ ర్విక్లబా స్తాః.

నడిరేయి వీథిబడి ప్రియభవనములకు బోవు పూబోండ్లకు నీవిద్యుత్కాంతిచే దారిచూపింపుము. చిన్కను, మ్రోతయు లేకుండ నుండుము. లేనిచో వార లుల్కి దురుసుమీ.

ఉదయమున నే యుజ్జయినినుండి పయన మారంభించి గంభీరానది మీదుగా దేవగిరి జేరి యందు కుమారస్వామి నర్చించి బయలుదేరి చర్మణ్వతీనదినిదాటి బ్రహ్మావర్తదేశము నరసి యం దర్జునుని శరవర్షమునకు జోటైన కురుక్షేత్రమును జూచి పిదప నతిరుచ్యమగు సరస్వతీజలమును త్రాగి కనఖలపర్వతమునకు దగ్గరగా బ్రవహించు గంగానది నడ్డముగా దాటి యంత హిమాలయమును జేరి యందు

"శ్లో. శబ్దాయంతే మధుర మనిలైః కీచకాః పూర్యమాణాః
సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః,
నిర్హ్రాదస్తే మురజ ఇవచే త్కందరేషు ధ్వని స్స్యాత్
సంగీతార్థో నను పశుపతే స్తత్ర భావీ సమగ్రః."

కిన్నరస్త్రీలచే త్రిపురవిజయకీర్తనల బాడునప్పుడు వేణువులు పవనపూరితములై శ్రుతివలె ధ్వనినిచ్చు. నాపై గుహలందు నీగర్జనయు మద్దెలవలె మ్రోగును. అచట నుమాపతికి సంగీతము పూర్తి కాగలదు. ఇంకను విశేషంబు లెల్లంగని యందున్న క్రౌంచరంధ్రమునుండి వెడలి యుత్తరముగా బోయి కైలాసపర్వతమున కతిథివై మానససరస్సుంగని యాగిరిపైనున్న గంగాదుకూలయగు నలకానగరిని జూడగలవు.

అని పూర్వమేఘమున మార్గవిధానమును బోధించి యుత్తరమేఘమున నలకాపట్టణమును యక్షునిగృహంబును చక్కగా వర్ణించెను.

అలకాపట్టణముయొక్క—

"శ్లో. విద్యుత్వంతం లలితవనితా స్సేంద్ర చాపం సచిత్రాః
స్సంగీతాయ ప్రహతమురజా స్స్నిగ్ధగంభీరఘోషమ్,
అన్తస్తోయం మణిమయభువ స్తుంగమభ్రంలిహాగ్రాః
ప్రాసాదాస్త్వాం తులయితు మలం యత్ర తై స్తై ర్విశేషైః.

ప్రాసాదాది ఘనసంపదను దెలిపెను.

మరియొకచో

"శ్లో. నీవీబద్ధో చ్ఛ్వసితశిథిలం యత్ర బింబాధరాణాం
క్షౌమం రాగాదనిభృతకరే ష్వాక్షిపత్సుప్రియేషు,
అర్చిస్తుఙ్గా నభిముఖమపి ప్రాప్య రత్నప్రదీపాన్
హ్రీమూఢానాం భవతి విఫలప్రేరణా చూర్ణముష్టిః."

అని చెప్పెను. దీనిచే యచటి స్త్రీపురుషాదులు స్వంతతోల్లాసులని తెలియఁగలదు. ఇట్లనేకవిధముల నల కాపట్టణశోభను వర్ణించుటలో కవి యకుంఠితకవితాశక్తిని కల్పనాసామర్థ్యమును గనబరచెను.

మహాకవి కాళిదా సిట్లు సులలితపదజాలంబుచే మనోహరముగ జిన్నకథాబీజము నంకురింపజేసి కావ్యలక్షణముల లక్ష్యమునం దుంచి శృంగారరసముబోసి చక్కఁగా బెంచిన యీకావ్యకల్పతరు వమృతధారావృష్టిని గురిపించుచున్న దనుట నిస్సంశయము. పూర్వహిందూదేశసంపదను తెలుపుచు నాగరికతావైభవములకు దార్కాణమై శ్రావ్యమందాక్రాంతావృత్త భాసురంబై సదభిప్రాయమంజులంబైన యీకావ్యము సంస్కృతభాషావధూటికి దిలకమని సమ్మతిగినది. ఇట్టికావ్యముల విరచించి ప్రసాదించిన కాళిదాసుని * కాళికాదేవి "త్వమేవాహం త్వమేవాహం" అని పలికెననుటలో నతిశయోక్తి, కల్పన లేదనియే నా తలంపు. అట్టి వాగమృతధారలచే దనిపిన కాళిదాసునే మహాకవి యనదగును.

---

# ఈశ్వరారాధనము

బాలకవి అల్లంశెట్టి అప్పయ్య గారు

కేవలభక్తిసంపదలు గీలుకొనన్ గయిమోడ్చి గొల్తుమో
దేవర! మావిపత్తులను దీర్చి కృతార్థులుగా నొనర్పు మీ
భూవలయంబునందు సరిపోలుదు రెవ్వరు నీకు? గర్తవా
దీవెకదా సమస్తము సృజింపను, బెంప, హరింప, నీశ్వరా!

ఉ. కన్నులుగల్గి వస్తుతతిఁ గానఁగలేము నిశీథవేళ మే
మన్న మనుష్యమాత్రుల మహో! నిను నేగతిఁ బోల్చువార మీ
వున్న తెఱంగు నిక్కముగ నొయ్యన మమ్ము దయార్ద్రబుద్ధి నీ
కన్నకుమారులంచు మదిఁ గాంచి మముర్ గరుణింపు మీశ్వరా!

ఉ. అంచితవేడ్క మాదు హృదయాబ్జములందున నిన్ను నిల్పి సే
వించెద మెంచిచూడఁ బృథివీస్థలిఁ గల్గు చరాచరంబులన్
సంచితలీలఁ గాచెదవు సాధుజన స్తవనీయ! మేము గా
వించిన దోసముల్ సయిచి వేఁ గరుణింపఁగదయ్య! యీశ్వరా!

ఉ. పాయని వేడ్కయంచు సదుపాయమటంచుఁ గుమారులంచునున్
జాయయటంచు సంసరణసాగరమందు మునింగియుండి నీ
మాయ రెఱుంగఁజాలమికి మా యపరాధములన్ గణింప కా
మ్నాయనుతాంఘ్రినీరజ, సమాదరణంబునఁ గావు మీశ్వరా!

ఉ. మేలొనగూడువేళ నిను మెచ్చెద మంతియెకాని, నిత్యమున్
హాళిఁ దలంపమైతిమి మహాత్మక! నెమ్మది నెంచిచూడఁగా
గాలము దాఁటుచున్నయది గాని ప్రయత్నము సాగదయ్యె నే
లీల స్వతంత్రమిచ్చెదవొ లేశమెఱుంగఁగఁ జాల మీశ్వరా!

---

* కాళిదాసుని చరిత్రలో నొక యితివృత్తము గలదు.

# కవిరాజలాంఛనము

## శ్రీ వేంకట శేషేశ్వరులు

గురుబుధరాజు లేకమయి హద్దుల సంభవ మందుదంచు ధీ
వరులు వచించువాక్యములు పల్మరుగాంచి తదీయపుణ్య సం
స్ఫురణముచే నసాధ్యమగు కార్యము సాధ్యముగా, గవిత్వముం
గురుతపహించునంచు కవికుల్కు-ము కుల్కు-మ గ్రుంకె బొరెదుం గాఁ. ౧

చం. సమయము గుర్తెఱింగి, తనశక్తి గణించి లభించు గౌరవ
క్రమము దలంచి దూరమును బ్రాంతముగాఁగొని, గంపెడాసతో
క్షమమెయి నిద్రహారములు సౌఖ్యపరంపరలం ద్యజించుచుం
శ్రమపడి యెట్టకేలకటు రాజపురంబును జేరఁబోయెనుం. ౨

చం. చనిచని కాంచె తత్కవి యసాధ్య జరామరణామయాద్రి సం
హాననసమర్థ వజ్రికులిశాయుధతుల్య సుధాకణ ప్రపూ
రనియతపానలోల సురరాజికృతానుపమార్చటీ ప్రతి
ధ్వనితదిగంతలోకము, సుదర్శనలోకము, రాజలోకముం. ౩

శా. ఆలోకంబున గల్గు సౌధములతీ రారాజితోద్యాన ది
వ్యాలంకారము లావిహంగముల గీతానంద మా యప్సరః
శ్రీలాస్యంబులు తన్నృపాలనగర శ్రీభాగ్య మేతత్సుకీ
లీలాచిత్రములం గనుంగొనెడు గేళిం దేలె దృప్తాత్ముడై. ౪

క. తనకన్న మేటిరాజు భువనముల నేలంగవచ్చు వార్తలు వినుచుం
గినుకవహించును పశ్చిమ్ముననిధి బడిమున్గి పోరె వనజాప్తుడొగిం.

గీ. శత్రుని శ్శేషమైన రాజ్యంబు నాక్ర
మించ రాజనర్యుడు సముద్ధరించె నంత
తపనుని ప్రభుత్వమందు దత్తంబులైన
జగములన్నియు మెల్లగా శాంతిజెందె. ౬

సీ. వేదవేదాంగాది విద్యాపయోరాశి
గురుడుపదేశమ్ము గూర్చుచుండ,
వివిధశాస్త్రిషు ప్రవీణుండు బుధుడొక్క-
సింహాసనం బధిష్టించియుండ
నమ్రులై సామంత నరనాయకులు గొంద
రాత్మనియోగంబు లనుసరింప,
వింతువెంబడివచ్చు స్వర్గవాసుల దివ్య
కాంతులు సభలోన గలసిపోవగ,

గీ. శుక్లభూషణాంబరవర శోభితుండు
షోడశకళాప్రపూర్ణుండు శుభచరిత్రు
డతులకనకసింహాసనం బాక్రమించి
సరసకవితారసాస్వాదసరణి దేల. ౭

సీ. నిగనిగలాడెడి సిరాక్-ఁజిదోవతి, వెన్క-ముందును పింజవెట్టికట్టి
వక్షంబుపై వల్లెవాటుగా నొక మేటి, జల్తారుకాశ్మీరశాల్వనైచి
ఫాలకము రుద్రాక్షవలయంబు మెడజుట్టి, గండపెండేరమ్ము గాలదొడిగి
బంగారు కంకణ పతకంబులు ధరించి, తగినవేత్రంబు హస్తమున దాల్చి

గీ. ఫాలకలమున తిలకంబు బ్రజ్వరిల్ల
బేరుగాంచిన బుధులు దద్వైంబడింప
గరుణవార్ధిని దనకు మార్గంబు జూప
రాజు గద్దెన సత్కవిరాజు వచ్చె. ౮

క. వచ్చిన కవిరాజుం గని, మెచ్చుచు నారాజవరుడు మీరిన వినయం
బచ్చుపడ నమస్కృతులిడి, యిచ్చెను సుస్వాగతంబు సెంతయు జేర్కొం.

గీ. స్వాగత మొసంగి యుచితవేత్రాసనంబు
చేర జూపించి యందు వేంచేయుడనుచు
కవిని గోరగ నాతండు కరుణమెఱయ
రాజు నాశీర్వదించి విశ్రాంతిగొనియె. ౧౦

ఉ. హే! కవిరాజ! త్వద్గమన మీయెడ మాకు శుభప్రదంబ లో
కైకమతుండ వద్భుత దిగంతవిశాలయశోధనుండ వ
స్తోకకవిత్వతత్త్వపరిశోధనలబ్ధసుకావ్యరత్నమా
లాకలితుండ వయ్యెద వలంకృతికాభరణంబ వెల్లెదం. ౧౧

గీ. విందు నీకీర్తి వీనులవిందుగాను
అనుభవింతును నీకవితామృతంబు
దేలియాడుదు కావ్య గంగాలహరిని
దర్శనమొసర్ప నెంతు నిత్యమ్ము నిన్ను. ౧౨

గీ. ఆపదగినతీర్థ మెత్తుదురైనయట్లు
మాసుకృతముచే దామె వేంచేసినారు
కావ్యసల్లాపపీయూష దివ్యరసము
మాకు జవిజూపుమయ్య ప్రేమంబుతోడ. ౧౩

మ. అని రాజేంద్రుడు పల్కినం, మనమునం దాశ్చర్య సమ్మోదముం
మినుముట్టం గవిరాజశేఖరుడు జేర్కొం రాజు స్తోత్రంబుచే
య నవీనానుపమానకల్పిత సువర్ణాలంకృతివ్రాత వ
ర్ణనసంశోభిత సత్కవిత్వరచనా నైపుణ్యముం జూపుచుం. ౧౪

గీ. తారమధురస్వనంబు శ్రోత్రప్రియం బొ
సంగ నానామహారాజ సభలజెప్పి
నట్టిపద్యమ్ములను సమయానుకూల
మైన చాటుపద్యమ్ముల నపుడు జదివె. ౧౫

మ. విని యానందము నొందుమీ మరియు దద్విద్యావినోదమ్ములం
దనిశం బొందక చాలకాల మితిరానందమ్ముల న్మాని త
ద్ఘనసైపుణ్యములం గనుంగొనుచు మోదంబంది తామిష్టు వ
చ్చినకార్యమ్ము వచింపుడంచు కవి నాశీతాంశు డర్పించినన్.

గీ. కవియు శుభమంచు లోనెంచి సవినయంబు
గా వచించెను యుక్తియు క్తంబు దోప
తాను జనుదెంచినట్టి ప్రధానకార
ణంబు రాజాచి త్తమునకు నచ్చునట్లు. ౧౭

గీ. ఆడితప్పనివారు మహానుభావు
లందు నీవంటివా రొక్కరైన లేరు
నీగుణంబుల జూచి మన్నించి శివుడు
శిరమునందాల్చె లోకప్రసిద్ధుడయ్యె. ౧౮

గీ. పాలసంద్రమ్మునం దుద్భవంబు జెంది
కమలకు సహోదరుండవై కల్పవృక్ష
మునకు చింతామణికి దోడబుట్టువైతి
వమృతమయుడవు నీపుణ్య మసదృశంబు. ౧౯

కం. ఎక్కడమానవలోకం, బెక్కడ యీరాజలోక మింతటిదూరం
బక్కట నేరాగ గలది, నిక్కము నీమహిమగాదె నీహారాంశా! ౨౦

సీ. అరయంగవిప్రుల కధినాయకుడవీవు
రాజాపోషింప వర్ణములు వెలసె
వర్ణవిభాగంబు ప్రబలంగ బ్రాహ్మణ
కర్మంబులెల్ల సక్రమముజరిగె
యజ్ఞయాగాదుల హవ్యంబు భుజియించి
దేవేంద్రముఖులు సంతృప్తిగనిరి
సంతృప్తిగాంచిన శక్రుండు నుచితమౌ
సరణి మేదినికి వర్షమ్ము లొసఁగె
గీ. వృష్టిచే భూమి సస్యసమృద్ధిగాంచె
గాన నీతిబాధలు మహీతలము విడచె
సర్వసౌఖ్యము లగ్గె విశ్వమ్మునకును
ధర్మమప్పుడు నాల్గుపాదముల నడచె. ౨౧

సీ. ప్రాగ్దిశ నుదయించు రాజా పశ్చిమమందు
ప్రభవించె కాలకర్మమున జేసి
వర్ణవిభాగమ్ము పాటితప్పెను ధర్మ
పరిపాలకుల సమాదరణలేమి
నిత్యకర్మంబులనియతి నాశనమొందె
వర్ణప్రభేద లోపమున జేసి
నాకౌకసులకెల్ల నాగ్రహం బుదయించె
కర్మానుచరణ విఘ్నమున జేసి
గీ. ప్రతిఫలంబుగ వర్ష లోపమ్ముగలిగె
క్షితితలంబెల్ల నాసరక్షేత్రమయ్యె
నీతిబాధలు మిగులబాధించె బ్రజల
సమసె ధర్మంబు నామరూపములు లేక. ౨౨

గీ. ధర్మభాస్కరుం డపరసంద్రమున బడ న
ధర్మగాఢాంధకారము ధరణిగవిసె
గటికచీకటి రాజమార్గమ్ము లేక
ధర్మదేవత మూడుపాదములు విరిగె. ౨౩

శా. భూకంపంబులు దోకజుక్కలు మహాంభోరాశి దౌర్జన్యముల్
లోకాధీశులవైరముల్ జనులకల్లోలంబు లాపర్వతా
నీకాస్ఫోటనముల్ జలప్రళయముల్ నింద్యాసురారోట్టముల్
వీకందాకె జగంబునొక్కమొగి గప్పెం గాలమేఘమ్ములన్. ౨౪

సీ. మూడుపాదంబులు భూతలంబున బాప
జాలకమిగుల కష్టమ్ము బడుచు
నొంటిపాదములోడ కుంటుచు రెండుమూ
డడుగుల నెట్టెట్టొ గడచిగడచి
యటుమీద సాగిపోవుటకు నోపిక లేక
తడబడి ధారుణీస్థలిని వ్రాలి
కడుపుమంటకు శాంతి గావింపగా లేక
నిటునటుబడి డొక్కలెగరవైచి
గీ. ముసరుకొను కీటకంబుల విసర లేక
పొడిచిచంపెడి కాకుల నదుప లేక
మొఱగి పైబడుకుక్కల నదుమ లేక
గోస్వరూపిణి భూదేవి గుంద మిగుల. ౨౫

గీ. ఎంతకఠినాత్మునకునైన చింతగలుగ
'వాసుదేవాత్మజాయ తుభ్యం నమోస్తు
భక్తకష్టహరాయ తుభ్యం నమోస్తు
పాహి మాం పాహి కరుణాలవాల!' యనుచు
నేడ్చు కామధేనువును వీక్షించి నగుచు. ౨౬

సీ. 'వెలలేని రత్నరాసులఁదెచ్చి యిమ్మంచు'
నొక్క పిశాచంబు హుంకరించె
'మితిలేని క్షీరముల్ పిదుకగావలెను రో'
మ్మంచు దానవుడొక్క డాగ్రహించె
'మావారి జూడగా బోవలె రథమీడ్వ
మనుచు రక్కసుడొక్క డావురించె
'సఖిలౌషధీసమూహంబు గావలెనంచు
దైత్యుడొక్కండు వేత్రమున జఱచె
గీ. 'షడ్రసోపేతమైన భోజన మొసంగు'
మంచు నొక్కభూతంబు గర్జించె మిగుల
నసురులు వచించు ఘోరవాక్యంబులెల్ల
వినియు విననట్లు నటియించె విశ్వమాత! ౨౭

గీ. ధేనురూపిణియౌ ధర్మదేవి పడెడు
బాధలంజూచి సహియించు పటిమలేక
మండుచున్నట్టి క్రోధంబు మాటుపరచి
చంద్ర! వచ్చితి నీదుదర్శన మొనర్ప. ౨౮

గీ. ధర్మపాలన సైకత శైలమయ్యె
బ్రహ్మతేజంబు హరిపదప్రసవమయ్యె
శమదమాసక్తి శశకవిషాణమయ్యె
సంకరంబయ్యె చంద్ర! విశ్వమ్మునందు. ౨౯

గీ. ఎవరిలోపంబునంజేసి యిన్నిపాట్లు
సంభవించెనో యెఱుగవే చంద్ర! యనిత
తనదు లోపంబు గుర్తించి ధర్మరాజా
మాఱుమాటాడలేక కన్నీరు విడచె. ౩౦

# శివరాత్రిమాహాత్మ్యము

పీఠికా విమర్శనము

బండారు తమ్మయ్య గారు

శ్రీనాథకవిసార్వభౌముని కృతిరత్నములలో శివరాత్రిమాహాత్మ్య మొకటి. ఇది శ్రీశైలక్షేత్రమందలి భిక్షావృత్తిమఠమునకుఁ జెందిన ముమ్మయశాంతయ్య యను జంగమున కంకితముగా రచింపఁబడినది. ఈగ్రంథము ప్రతి యొకటి యాంధ్రసాహిత్యపరిషత్తునకు, ఆనందసంవత్సరములో లభించువఱకు శ్రీనాథుఁ డీకావ్యమును రచించినవిషయ మాంధ్రలోక మెఱుంగదు. పరిషత్తునకులభించిన ప్రతి పెక్కు గ్రంథపాతములతో మిక్కిలి శిథిలావస్థలో నుండియున్నది. ప్రత్యంతర మెంత ప్రయత్నించినను లభింపనందున దొరకినయాయొక్క ప్రతిని బట్టియే యీగ్రంథము తొలుదొలుత కాళయుక్తిసంవత్సరములో పరిషత్పత్రిక 7 వ సంపుటముయొక్క 1, 2, 3, 4 సంచికలలోఁ బ్రకటింపఁబడినది. గ్రంథ మిట్లు ప్రకటింపఁబడినపిమ్మటఁగూడఁ బ్రత్యంతరము లభింపమిచే మరల నీకావ్యమును బ్రత్యేకపుస్తకరూపమున 1923 సంవత్సరములో పరిషత్తువారు విద్వద్బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ కల్లూరిసాంబమూర్తిశాస్త్రిగారిపీఠికతో ముద్రించి యున్నారు. శ్రీ శాస్త్రిగారీగ్రంథమునుగుఱించి పీఠికలో వ్రాసినకొన్నివిషయములఁగూర్చి నాకభిప్రాయభేదము లున్నందునఁ బండితులపర్యాలోచనార్థమై వాని నిచ్చట విమర్శించుచున్నాను.

ఉపలబ్ధమైన ప్రతిలో నాలుగాశ్వాసములుమాత్రమే యున్నవి. నాలవ యాశ్వాసముచివరను గథ పూర్తియైనట్లుండక

"సీ. పరమమునులు మాత్యాహాసం భవుని మాతు
భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ
భటులు ప్రశ్నులచే భంగపడుట చూచి
చిన్నఁబోయి యముం డేమిచేసెఁ జెపుప."

అనుపద్య ముత్తరకథాసూచకముగ నుండుటచేఁబరిషత్తునకు దొరకినగ్రంథ మసమగ్రమని కొందఱు తలంచుచున్నారు. పరిషత్పత్రికాధిపతులుగూడ నీగ్రంథమును మొదటఁ బత్త్రికలోఁ బ్రకటించినప్పు డిట్టి యభిప్రాయమునే సూచించిరి. కాని శ్రీసాంబమూర్తిశాస్త్రిగారీవిషయమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"ప్రస్తుతము లభించినగ్రంథము నాలుగాశ్వాసములది. దీనిలోఁ గవి మొదటఁ బ్రతిజ్ఞ జేసిన "ఉమాలింగోద్భవంబును, శివరాత్రిమాహాత్మ్యంబు" ననుకథలు ముగిసిపోయినవి. కాని నాలవయాశ్వాసాంతమున శివదూతలచే యమభటులు పరాజితులయి యమున కెఱింగింప "చిన్నఁబోయి, యముం డేమి చేసె"నని యైదవయాశ్వాసారంభసూచకముగ మునులచేఁ బ్రశ్నింపఁబడెను, దానిచే నింకను గొంత గ్రంథము కలదేమో యని తోఁచును. కాని శ్రీనాథకవి యింతమాత్రమే రచించెననుట సమంజసముగా నున్నది. ఏలన మొదటఁ బ్రతిజ్ఞ చేసిన శివరాత్రిమాహాత్మ్యము ముగిసినది. పైని యమప్రమథాదులయుద్ధములు కథ కంతగా నుపకరించునవి కావు. కావున మూలమగు నీశాన సంహితాధ్యాయాంత్యపద్యానురోధమున నీమునులప్రశ్నవాక్యమునుగూడ గ్రంథమందుఁ జొప్పించెననుట యుక్తము. రెండవది శ్రీనాథుఁ డీగ్రంథమును ముగింపకమునుపే కాలగతినొందుటవలన నాలుగాశ్వాసములుమాత్రమే శ్రీనాథరచితములని చెప్పవలయును. అంతియేకాదు. కావున శివరాత్రిమాహాత్మ్యము సమగ్రముగనే లభించినదని తలంపనగును."

ఇందులోని కొన్నివాక్యములు శ్రీ శాస్త్రిగారు గ్రంథరచనాకాలమునుగూర్చియు గ్రంథమందలి కథను గూర్చియు గ్రంథముయొక్కయంకితమును గుఱించియు వెలువరించిన యభిప్రాయములకు వ్యాఘాతమును గలిగించుచున్నవి. కావున వీనినిగూర్చి విమర్శింపకపూర్వము శ్రీ శాస్త్రిగారావిషయములపై నొసంగినయభిప్రాయములఁగూడ నుదాహరించెదను.

"ఈగ్రంథము హరవిలాసనైషధములకంటెను, భీమఖండమునకు మునుపు రచించెనని శ్రీవీరేశలింగముపంతులుగారి యూహ

యనియు, దీనియందు దోషము లత్యధికముగా నుండుటచే నియ్యది శ్రీనాథుని బాల్యకవితయని శ్రీ వాగపూడికుప్పుసామయ్యగారి తలంపనియు" నుదాహరించి శ్రీ శాస్త్రిగా రియ్యిరువుర యభిప్రాయములుగూడ సరికావని నిరూపించుచు మున్ముందీవిషయమునుగూర్చి కొంతవిమర్శనము సలిపిరి.

హరవిలాసరచనమునకును భీమఖండరచనమునకును మధ్య నున్నయిరువదిసంవత్సరములయంతరములో శ్రీనాథుఁడు రచించిన గ్రంథ మేదియుఁ గానరానందున శ్రీ వీరేశలింగముగారు నిరర్గళకవితాధారగల శ్రీనాథుఁడు వింశతిదీర్ఘసంవత్సరములు కావ్యరచనమునకుఁ గడంగక యూరకయుండియుండునా యనుశంకను గల్పించి కాని, శ్రీనాథుఁడు ధనలోలుఁడను నపభ్రమను గలిగియున్నవా రగుటచే నందుల కనుగుణముగా, శ్రీనాథుఁ డాకాలములో నీగ్రంథమును పెదకోమటివేమన కంకితమిచ్చుతలంపుతో రచించుటకుఁ బ్రారంభించియుండునని యు, గ్రంథము పూర్తియగులోపల వేమారెడ్డి మరణించి యుండుననియు, ఆతనిమరణానంతరము కొండవీటిరాజ్యము కూలిపోవుటచే శ్రీనాథుఁ డచ్చట నిలువ నీడలేక గ్రంథ సామగ్రితో దేశాటనమున కేఁగి యీగ్రంథమందలి కొఱవడినభాగమును బూరించి యవతారికాదులు వ్రాసి ధనముకొఱకు శ్రీశైలములో జంగముల కంకిత మొనర్చె ననియు నూహాలపై నూహాలు పన్ని యొకవిపరీతసిద్ధాంతము నొనర్చిరి. శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడు, ధనలోలుఁడు నని శ్రీవీరేశలింగముగారు మున్నగువారు ప్రకటించినయభిప్రాయములను విమర్శించుచు నేనువ్రాసిన "శ్రీనాథమహాకవి; గుణతత్త్వవిచారము" అనువ్యాసములో శివరాత్రిమాహాత్మ్యరచనమునుగూర్చిన శ్రీ పంతులుగారివాక్యములను బరామర్శించుచు "శివరాత్రిమాహాత్మ్యరచనాకాలవిమర్శనము" అను నొకఖండమును వ్రాసి దానిని రెండేండ్లక్రిందటనే ప్రత్యేకముగ నాంధ్రపత్రికలోఁ బ్రకటించియుంటిని.

(దుందుభికార్తిక శు ౧, ౨ సారస్వతానుబంధములఁ జూడుఁడు.)

అందులో నీగ్రంథము మనకుపలబ్ధములైన శ్రీనాథునికృతులలోఁ గడపటిదనియు, అదీ భీమఖండకాశీఖండములయనంతరమే క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతమున రచింపఁబడియుండుననియు సకారణముగ నిరూపించియుంటిని. ఆవ్యాసమును శ్రీసాంబమూర్తిశాస్త్రిగారు చూచియుండురనియే తలంచెదను. శ్రీశాస్త్రిగారు తమ పీఠికలో నీవ్యాసమును బేర్కొనకున్నను నేనుదాహరించినకారణములనే కైకొనుచు శ్రీవీరేశలింగముగారి వాదమును విమర్శించి నాయొనర్చిన కాలనిర్ణయమునే స్థిరపఱిచిరి. కాని యీసందర్భమున వీరు శ్రీనాథుఁడు కాశీఖండములో గుణనిధిచరిత్రములో మూలగ్రంథానుగుణముగా రచించిన

గీ. అక్కటకట! దురోదర వ్యసన మెట్లు ..... (ఆ ౪ ప ౧౧౩)
"చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర......
(ఆ. ౪. ప.౧౧౪.)"

అను పద్యములలో మొదటిదానిని శివరాత్రిమాహాత్మ్యములో విస్తరించి వర్ణించెననియు, రెండవదాని నేమాత్రము మార్పుసేయక యట్లే వ్రాసెననియు నుదాహరించినవాక్యములో వీ రించుక ప్రమాదమునకు లోనయిరని మనవిచేయుచున్నాను. పైపద్యములలో మొదటిది శివరాత్రిమాహాత్మ్యములో శ్రీశాస్త్రిగా రనినట్లు విస్తరించి వర్ణింపఁబడలేదు సరికదా యసలే యుదాహృతమై యుండలేదు. రెండవపద్యముమాత్రమే ప్రసక్తానుప్రసక్తముగ మార్పులేకుండఁ జేర్పఁబడినది.

శ్రీ కుప్పుసామయ్యగారివ్యాసమును నేను జూచుట తటస్థింపలేదు. ఈగ్రంథము కాశీఖండరచనానంతరమే రచింపఁబడినదని ప్రబలప్రమాణములచే నేనును శ్రీసాంబమూర్తిశాస్త్రిగారును నిరూపించినందున గ్రంథమందలి దోషములఁబట్టి యది శ్రీనాథుని బాల్యరచితమైయుండునను శ్రీకుప్పుసామయ్యగారి యభిప్రాయము నిలువనేరదు. అట్లైనచో నిఁక నీగ్రంథమందలి దోషములకు సమాధానమేమి? శ్రీ సాంబమూర్తిశాస్త్రిగా రీగ్రంథమందలిదోషములఁ బదమూఁడింటి నుదాహరించి యట్టివేకాక యింక ననేకదోషములును, నప్రౌఢకవితాబంధమును నవతారికాభాగమునమాత్రమే కాని మఱెచ్చటను గాన్పించుట లేదనియు నందులకుఁ గారణముగాఁ దమకు వేఱొక

పతుము స్ఫురించుచున్నదనియు లిఖించి దాని నిట్లు వివరించిరి.

"(పూర్వోక్తములయిన కాశీఖండపద్యములయొక్క) ఈమూల శ్లోకములు కాశీఖండమందు నీశానసంహితయందు నొకరీతినే యుండునా? ఈశానసంహిత యెందున్నదో యగపడదు. కాశీఖండమే యీశానసంహితయనివ్వ దప్పు కాఁజాలదు. కావున నీగ్రంథము కాశీఖండముగూడ రచించినపిమ్మటనే ౧౪౪౦ ప్రాంతమున రచింపఁబడెనని నానిశ్చయము. అయినచో నవతారికాభాగమందలి యప్రౌఢ శైలికి వలాత్కృతికప్రయోగములకును గతి యేమందురా? శ్రీనాథుఁడు కాశీఖండమునందుఁ గుబేరపూర్వవృత్తకథావసరమున శివరాత్రిమాహాత్మ్యమును గుణనిధిచరిత్రరూపమున వర్ణించెను. తనగ్రంథములం దటనట బాణకాదంబరిలోని వాక్యముల నుపయోగించెఁగాని యీరెంటియందును దనివిసనక కాదంబరిలోని రసవంతములగు భాగముల విరివిగ గ్రహించి సుకుమారచరిత్రమును గల్పించి శివరాత్రి మాహాత్మ్యమును సమగ్రముగ వర్ణించెను. గ్రంథమును పూర్తిచేసి యవతారిక రచింపకముందే కైలాసమున కేఁగెను. పిదప శ్రీశైలవాసియగు శాంతయ యెట్లో యీరచనకేభిత ప్రతినిసంపాదించి కొంతధనము వెచ్చించియో లేకయో స్వయముగనో లేక తనమిత్రుఁడగు నొకయప్రౌఢకవివలననో యుపోద్ఘాతము నుద్భవింపఁజేసి జనకవియుక్తయై నిరాలంబయైన యీకృతికన్యను దనకంటఁగట్టుకొనియెనని యూహించుట సాహసము కానేరదు. గ్రంథారంభమునందలి యిష్టదేవతాస్తుతియుఁ గవిస్తుతియుఁ గృతిపతి కృతికర్త నుద్దేశించి పలికినవాక్యములును గవి ప్రతిజ్ఞావాక్యములందలి ప్రథమపురుషప్రయోగమును, వేయేల, సకలవిధదోషాకరంబైన యవతారికయెల్లను శ్రీనాథుని యితరపూర్వగ్రంథములకు భిన్నమార్గముగలదై యీసిద్ధాంతమును ఘోషించుచున్నది. కావున నింతవఱి యవతారిక శ్రీనాథవిరచితము కాదనియుఁ గథాభాగము నాలుగాశ్వాసములుమాత్రము కాశీఖండానంతరము ౧౪౪౦ ప్రాంతమున శ్రీనాథుని చరమదశయందు రచింపఁబడెననియు నీకృతియే శ్రీనాథుని యంత్యకృతి యనియు (దీనికంటె నర్వాచీనకృతి కనఁబడువఱకు) నూహింపవచ్చును."

గ్రంథముయొక్క యంకితమునుగూర్చి తా మూహించిన విపరీతాభిప్రాయము సాహసముకానేరదని శ్రీశాస్త్రిగారు తలంచిరిగాని యది తప్పక సాహసమగుననియే నాతలంపు. గ్రంథమునకు దొరకినది యొక్కప్రతి. అదియైనను గ్రంథపాతములతో శిథిలమైయున్నది. అందునను నవతారికాభాగము మఱియు శిథిలమైనది. అట్టిదాని నూఁతగాఁ గొని శ్రీశాస్త్రిగా రిట్టియభిప్రాయమును వెలువరించి కీర్తిశేషుఁడైన యొకసుకృతివరేణ్యున కపకీర్తి ఘటించుట సాహసముగాక మఱేమగును? కృతిభర్తగా సంభావింపఁబడు శాంతయ నేఁడు శ్రీశాస్త్రిగారి యభిప్రాయము ప్రకారము కృతిహర్తయై యవమానమునకు గుఱియగుచున్నాఁడుగదా! దోషము లవతారికయందే యున్నందున నదియొకటిమాత్రమే శ్రీనాథకృతముగాక శాంతయ్యచే నవతరింపఁజేయఁబడినదనికదా వీరిసిద్ధాంతము. అట్లయినచోఁ గృతినాయకసంబోధకము లగు నాశ్వాసాద్యంతపద్యములమాట యేమి? అవతారికా పద్యములలోఁ గానవచ్చుదోషములుగాని యప్రౌఢకవితాబంధముగాని వీనిలోఁ గానరావు. శ్రీశాస్త్రిగారు వీనినిగూర్చి యేమియు సెలవిచ్చియుండలేదు. అవి శ్రీనాథకృతములందురా లేక శాంతయ్యచేతనే కల్పింపఁబడినవందురా? శ్రీనాథునియితరకృతులందలి యాశ్వాసాద్యంతపద్యములకును వీనికిని బాటింపఁదగిన శైలీభేదముగాని, కవితాబంధశైథిల్యముగాని నాదృష్టికిఁ బొడఁగట్టుటలేదు. మచ్చున కీక్రిందిపద్యములఁ జిత్తగింపుఁడు:

క. శ్రీహర్షసుకవికవితా, వ్యాహారకథాసుధారసాస్వాదసుఖ
శ్రీహర్షోదయ నిర్వ్యస, మాహితమహితాంతరంగ!మామిడిసింగా!

(నైష. ఆ. 3 ప.)

క. శ్రీహిమవద్గిరిపుత్రీ మృనోహరపదభక్తిజాత నూతనసరస
వ్యాహారకావ్యనాయక! మోహనకేళిజితజయంత! ముమ్మయశాంతా!

(శివ. ఆ. 2 ప. 1)

ఉ. భానుసమాన! మానగుణబంధుర! బంధురమానిదాన! దా
సానుకృతాంబువాహనదాంబుదవాహనకామధేనుసం
తానకకర్ణ! కర్ణసుఖదాయివచోరచనాధురీణ! కీ
ర్తావరరాజ! రాజముకుటాంఘ్రిసరోరుహభావితాత్మకా!

మ. వరశైవాకవిధానపాత్రికవితా వ్యాపారపారంగత
స్థిరలక్ష్మీనవశారదోదయ! దయాధీనాయతాలోక! లో
కరమాపాదన! పాదపద్మవినతక్ష్మాపాలసంకీల! కీ
లరతిప్రస్ఫుటకాంత! కాంచనవకల్పద్రీవరకీర్త్యగణీ!

(శివ. ఆ. 2 ప. 111)

మాలిని. అచలవిపులధైర్యా! హారివిద్వత్సపర్యా!
ఖచరవినుతకీర్తీ! కామినీహృద్యమూర్తీ!
యుచితజనవివేకా! యారుజన్మప్రవేకా!
సుచిరశుభవినోదీ! సుస్థిరశ్రీప్రమోదీ!

(హర. ఆ. 7 ప. 90)

మాలిని. పరమసుఖవినోదా! సారశైవార్థమోదా!
పరమపదవివేకా! భానుతుల్యప్రభావా!

ధరణీధరసుధైర్యా! దంభసంగ్రామశౌర్యా!
నిరుపమగుణధామా! నిత్యకల్యాణసీమా!

(శివ. ఆ. 3. ప. 135)

విమర్శకదృష్టితో వీక్షించువారి కీపద్యము లేక కవిత్వములుగాఁ బొడగట్టకమానవు. ఇఁక నీగ్రంథమందలి షష్ఠ్యంతములఁగూర్చి విచారించినను నవికూడ శ్రీనాథ కృతములు కావని యనుమానింపఁదగిన కారణములు లేవు. ఈ క్రిందివానిని దిలకింపుఁడు:

క. శైవాగమశాస్త్రనిధి, ప్రావీణ్యాగణ్యపుణ్య భరితాత్మునకున్
భావాభావవివేకికి, భావితవంశావతార పరమాత్మునకున్.

క. జంభాంతకవైభవునకు, సంభృతశాస్త్రప్రతాపశైలోన్నతికిన్
కుంభిత్రాస్వభవరతికిన్, దంభోళిస్ఫురితతీవ్రతరఖడ్గునకున్.

శ్రీనాథునియితరకృతులందలి షష్ఠ్యంతములకును వీనికిని గమనింపఁదగిన భేదమేమియుఁ గానరాదు. కావున గ్రంథమందలి షష్ఠ్యంతములుగాని, యాశ్వాసాద్యంత పద్యములుగాని శ్రీశాస్త్రిగారొనర్చిన పైసిద్ధాంతమున కేమియు నుపకరింపక యందులకు బాధకములగుచున్నవి. మఱియు ముమ్మయశాంతయ్య శ్రీనాథునియితరకృతిపతు లందఱవలెనే వీరశైవుఁడు. శ్రీనాథుఁడు వీరశైవుఁడై యుండుననియు నందుచే "తస్మై దేయం, తస్మాద్గ్రాహ్యం" అను తన్మతరహస్యమును గ్రహించి తనకృతులన్నింటిని దనమిత్రులు బాంధవులు నాశ్రయులు నగు వీరశైవులకే యంకితమొసంగెననియు నాయభిప్రాయము. ఈవిషయమై విశేషాంశములు దెలియఁగోరువారు "శ్రీనాథుఁడారాధ్య బ్రాహ్మణుఁడా?"అనుశీర్షికతో ఆంధ్రపత్రిక పదునాల్గవ సంవత్సరాదిసంచికలో నేనువ్రాసిన వ్యాసమును దానిపై శ్రీ కాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగారు అభినవసరస్వతి జూలయినెల సంచికలో వ్రాసిన విమర్శనముపై "శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడుకాఁడా" యను శీర్షికతో నేను మరలవ్రాసినవ్యాసమును (కళాపత్రిక సం. 2 సంచి. 5, 6 లలోఁ బ్రకటితము), నా శృంగారశ్రీనాథ విమర్శనములో "శ్రీనాథునిమతము" అనుశీర్షిక క్రింది విమర్శనమును (సారస్వతసర్వస్వము సం. 1 సంచి. 7) చిత్తగింపఁగోరెదను. మఱియు శ్రీనాథునికాలములో శ్రీశైలమున భిక్షావృత్తిమఠము వైభవప్రాభవములతోఁ దులఁదూఁగుచుండినట్టు లాధారములు పెక్కులుగలవు. శ్రీనాథుఁడు తనసహజశివభక్తి కనుగుణముగాఁ జిఱుత నాఁటినుండియుఁ దఱుచుగా శివరాత్రికి శ్రీశైలమహా పుణ్యక్షేత్రమునకు యాత్రసలుపుచు నచ్చటిభిక్షావృత్తి మఠస్థులతో స్నేహసంబంధమును గలిగియుండును. ఈ విషయమును సూచించుఛాయ లాతనియితరకృతులందుఁ గూడఁ బొడఁగట్టుచున్నవి. చూడుఁడు.

శ్లో. దాతా కోమటివేమనామనృపతిః పాత్రం గురుశ్శంకరః,
స్థానం చేబ్రినపాడు రత్రకవి శ్రీనాథభట్టారకః;
కాలశ్చైత్రశివరాత్రిపుణ్యసమయః స్వాతిః నహోవా శ్రీగిరి,
శ్రేయః కిం నను వర్ణ్యతే సుకవిభిః శృణ్వంతు తచ్ఛాసనమ్.

(పినపాడు తామ్రశాసనము 1405 A.D., శృంగారశ్రీనాథము పుట 119)

శ్రీనాథుఁడు తనకు శ్రీశైలమందలి భిక్షావృత్తి మఠజంగములపయిఁ గల యభిమానముచేతనే కాశీఖండ హారవిలాసములో శివాభిషేకమునకై చిఱుతొండనంబిని జెఱకురసము తెచ్చి యిమ్మని కోరిన మాహేశ్వరుని భిక్షావృత్తిజంగమునిగనే వర్ణించినాఁడు.

శా. అయ్యా! యాద్యవవంశసంభవుని సేకామ్రమాధినాథాంఘ్రికా
శయ్యామందిరనిర్మలాత్ముకుని భిక్షావృత్తి జంగం బొకం
డొయ్యం జేరఁగవచ్చి మాశివుని కేఁ డోఁ జర్చ్చెదం గావఁ దే
వయ్యా! యిక్షురసంబు తూమెఁడనుమం ప్రార్థించి సేవించినన్!

(ఆ 2. ప. 7)

జంగములందఱు సహజముగ భిక్షయే వృత్తిగాఁ గలవారుగాన నిందలి "భిక్షావృత్తిజంగమ" శబ్దమునకు భైక్ష్యము వృత్తిగాఁగల జంగముఁడనియర్థము చెప్పుటలో సారస్యముండదు. శ్రీనాథుఁడు భిక్షావృత్తిమఠజంగముల మనమున నిడికొనియే యీ పదమును బ్రయోగించెనని తలంచుట యుక్తమని నాయభిప్రాయము. మఱియు శ్రీనాథకృతమని శ్రీసాంబమూర్తిశాస్త్రిగా రంగీకరించిన శివరాత్రిమాహాత్మ్యకథాభాగములో

సీ. కేలందోయెత్తి మ్రొక్కెనెపాశుపతులకు, శరణార్థి వసియనే జంగ
ములకు (ఆ.4 ప.55)

అనివ్రాసి శ్రీనాథుఁడు తనకు జంగములందుఁగల భక్తిగౌరవముల 'వెల్లడించినాఁడు'. కావున శివరాత్రిమాహాత్మ్యము శ్రీనాథుఁడే శివరాత్రి కేఁగినప్పుడు రచించి భిక్షావృత్తిమఠస్థజంగముఁడగు ముమ్మయ శాంతయ్యకుఁ

దానే యంకితమిచ్చి యుండను గాని శ్రీశాస్త్రిగా రభిప్రాయపడినట్లు శ్రీనాథునిమరణానంతరము శాంతయ్య దాని నెట్లో హరించి తన కంటఁగట్టుకొనెననుట సమంజసము కానేరదు.

ఇఁక దోషపూరితమని శ్రీశాస్త్రిగారు సెలవిచ్చిన యవతారికవిషయ మాలోచితము. పరిషత్తునకు దొరకిన యీగ్రంథప్రతియొక్క లేఖకుఁడు గుడిమెట్టగ్రామకరణమగు వెంకనయఁట. ఆతనిభాషా సంస్కార మేపాటిదో మనకుఁ దెలియదు. శ్రీసాంబమూర్తి శాస్త్రిగారెత్తి చూపినదోషములలోఁ గొన్ని లేఖకదోషములు కావచ్చును. వెంకనగాని తత్పూర్వలేఖకులుగాని తమకు దొరకినమాతృకలలో నవతారికాభాగము శిథిలమై యుండఁగా దానిలోనిశిథిలభాగములను దమసొంతకవిత్వముతోఁ బూరించి తమప్రతిని వ్రాసియుండిరేమో! శ్రీశాస్త్రిగారెత్తిచూపినదోషములు చాలవఱకు స్వల్పపు సవరణములతో నిర్బాధకము నిర్దుష్టము లగునవియే. చూడుఁడు:

| తప్పు | ఒప్పు |
| --- | --- |
| సుతునిన్నుద్యుక్తకాంతాత్మునిఁ | సుతు మోహోన్ముక్తకాంతాఖ్యునిఁ |
| ఆవిని బుక్కిటుండిడి | ఆవిని బుక్కిటుంగొని |
| కృతిపతులగు కవిముఖ్యుల | కృతినరులగు కవిముఖ్యుల |
| వశిప్రాసవిడంబబంధమై | వళిప్రాసవిడంబబంధమై |
| చేర్పరతేఁడు | చేర్పుతోడ |
| మహితపంచాక్షరీమంత్రమాపపార్శ్వ | ......మానితాత్మ |
| పరమసాత్త్రిశ్యేభావంబులేఁపంగ | ...భావంబుపరికింపగౌరి |
| | కాఁబోలు నీగరితమిన్న |
| గౌరికాఁబోలునీకాంతతలఁప | |

మఱియు వీరుదాహరించినదోషములలో "నవ్వటు చింత" (ఆ. 1 ప 56) "కాకోదరగ్రామణికంఠగ్రైవేయ" (ఆ. 1 ప. 58) అనుచివరవి రెండును నవతారికాభాగములోనివిగాక కథాభాగములోనివేమైయున్నవి. గ్రంథము ప్రథమాశ్వాసములో నేపద్యమునుండి శ్రీనాథకృతమో వీరు తమపీఠికలో వివరించియుండలేదు. కథాభాగము ఆ. 1.ప.44 తోఁ బ్రారంభమైయుండఁగా శాస్త్రిగారుదాహరించిన పై రెండు దోషములకు గతియేమి? "కాకోదరగ్రామణికంఠగ్రైవేయ" ఇదివచనములోని భాగము. ఇందు కంఠశబ్దమును లేఖకుఁడు ప్రమాదమున ననవసరముగ హెచ్చుగా వ్రాసినాఁడు. అంతియేకాని యది కవిప్రయుక్తము కాదు. దానిని దీసివేసిన వాక్యము నిర్దుష్టమగును. 56 పద్యములో "నవ్వటు" అనునది లేఖకుని పూరణమైయుండవచ్చును. లేదా, యది శ్రీనాథకృతమైనఁ గానవచ్చును. ఈపదము శ్రవణసుభగముగా లేకున్నను నిందలి సంధిమాత్రము దుష్టముగాదు. ఇట్టిప్రయోగములు శ్రీనాథుని యితరకృతులందును గలవు. "శోగికిఁ, భుజియింపంగనొప్పవార్వఁటిది యెందుంగల్గునే యిద్ధరఁ (హర. ఆ. 1 ప. 97) కావున కేవలము శ్రీశాస్త్రిగా రుదాహరించినదోషములను బట్టికూడఁ గృతిపతియగు ముమ్మయశాంతయ్యకు వా రంటఁగట్టినదోషము సాహసైకమూలకమని యే తలంపఁదగును. శాంతయ్య యెచ్చటనో శ్రీశైలప్రాంతములనుండినవాఁడు. గ్రంథమన్ననో (శ్రీశాస్త్రిగారి యభిప్రాయము సరియైనచో) శ్రీనాథునిచే నేరాజమహేంద్రవరప్రాంతముననో రచింపఁబడియుండవలెను. అట్టిచో నది శ్రీనాథునిచే స్వయముగా నంకితమొసంగఁబడి యుండనిచో శాంతయ్య దానినెట్లో హరించి కృతిపతిత్వము తన కంటఁగట్టించుకొనుట యసంభవము గాకమానదు. అయినను నవతారికాభాగమందలి దోషముల మాట యెట్లున్నను నందలికవిత తరువాతి కథాభాగమందలి కవిత్వముకంటెను, శ్రీనాథుని యితరకృతులలోని కవితకంటెను నప్రౌఢముగనున్నమాట మాత్రము సత్యసమీపముగనే యున్నది. ఈవిషయమును గూర్చియు నవతారికయందలిదోషములఁగూర్చియు సమర్థించుటకుఁ బయి సమాధానముకంటెను సమంజసమయినది మఱియొకపక్షము నాకు స్ఫురించుచున్నది. విజ్ఞులు దానిని బర్యాలోచింతురుగాక! గ్రంథము శ్రీనాథునిచే ముమ్మయ శాంతయ్యకు నంకితమయి సమర్పింపఁబడిన తరువాత శాంతయ్యకాలములోఁగాని యాతనియనంతర మాతని వంశీయులకాలములోఁగాని వారియజాగ్రత్తచేత షష్ఠ్యంతములకు ముందుఁగల గ్రంథభాగము క్రిమిదష్టమయి యుండవచ్చును. అందులకు వారు విచారించి యాభాగమదివఱకుఁ దాము చదివి వినియున్నదియే యగుటచేతను,

అందు వర్ణింపఁబడిన వంశావతారాదులు తమకు లెస్సగాఁ దెలిసినవియే యగుటవలనను, మరల నావిషయములను దమస్వంతకవిత్వముతోఁ బూరించిరో లేక యొకసామాన్యకవివలనఁ బూరింపించిరో యాభాగమును బూర్తి చేసియుందురు. కృతిపతి కృతికర్త నుద్దేశించిపలికినవాక్యములును, గవి ప్రతిజ్ఞావాక్యములందలి ప్రథమపురుష ప్రయోగమును శ్రీనాథునియితరకృతులందలి మార్గమునకు భిన్నములై యుండుటకుఁ గూడ నిదియే కారణము కానోపును. కావునఁ బైనివ్రాసినసంగతులనెల్లఁ బర్యాలోచింప నీవిషయమునుగూర్చి యీయభిప్రాయమే సర్వవిధముల సమాదరణీయము కాఁదగునని నాయాశయము. షష్ఠ్యంతములనుండి యావద్గ్రంథము శ్రీనాథరచితమే యనుట కెట్టియాక్షేపణములు నుండరాదు.

ఇఁక నీకావ్యమందలికథనుగూర్చి శ్రీశాస్త్రిగారు ప్రకటించినయభిప్రాయములనువిమర్శింతము. గ్రంథమందుఁ గథకు మూలముగాఁ జెప్పఁబడిన యీశానసంహిత యెందున్నదో యగపడదనియు, కాశీఖండమే యీశానసంహితయనినఁ దప్పుకాఁజాలదనియు, శ్రీనాథుఁడు కాశీఖండమున గుణనిధిచరిత్రమునఁ దానువర్ణించినశివరాత్రిమహాత్త్వమునందును దనయితరకావ్యములలోఁ దానచ్చటచ్చట ననుసరించిన బాణునికాదంబరియందలి రసాస్వాదమునందును దనివిసనక వానిని విస్తరించుతలంపుతో నాకథనే సుకుమారచరిత్ర మనుపేరితో విస్తరించి యీగ్రంథరూపమున వ్రాసెననియుఁ గదా శ్రీశాస్త్రిగారియభిప్రాయము. ఇదియుఁ బైదానివలె సాహసమనియే నా తలంపు. ఈశానసంహిత వీరికిఁ గానరానంతమాత్రమున నిట్లుతలంచుట సమంజసముకాదు. పురాణములో సమానసాదృశ్యముగలకథలు వేర్వేఱుతావుల నుండుట యసామాన్యముగాదు. అందునను మహార్ణవములో నుపమింపఁబడిన స్కాందపురాణవిషయమునఁ జెప్పవలసినదే లేదు. ఈశానసంహిత యనఁగా శంకరసంహితయేకాని వేఱు కాదు. శంకరసంహిత స్కాందపురాణమందలి షట్సంహితలలో నొకటి. ఈవిషయమును శ్రీనాథుఁడే వివరించినాఁడు.

"ఇమ్మహాస్కాందమ్మునకు నవయవంబు లాఱు సంహితలవిశ్రమంబున సనత్కుమారసంహిత పంచపంచాశత్సాహస్రిక, సూతసంహిత షట్సాహస్రిక, శాంకరసంహిత త్రింశత్సాహస్రిక, వైష్ణవసంహిత పంచసాహస్రిక, బ్రాహ్మసంహిత త్రిసాహస్రిక, సౌరసంహిత యేకసాహస్రిక ......"
(కాశీ. ఆ. 1 ప. 80)

శ్రీనాథుఁడు తెనిఁగించిన శివరాత్రిమాహాత్మ్యము శంకరసంహితలోనిది. ఈ విషయము కథాభాగములోని యీక్రిందిపద్యములో శ్రీనాథుఁడే స్పష్టమొనర్చినాఁడు.

ఉ. తాపససార్వభౌములు సదాశివరాత్రిమహావ్రతంబు దో
షాపహృతిక్రమంబు వినఁ గాచరణంబున నేమ సద్గురు
శ్రీపదపద్మము ల్దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపితదివ్యమార్గమునఁ దేటపడ న్మృదులింటినుండియున్.
(ఆ. 1 ప. 49)

"ఈశానసంహిత" యనుపదము శ్రీనాథకృతముగాదని త్రోసిపుచ్చినయవతారికలోనేకాని కథాభాగములో నుదాహృతమయి యుండలేదు. "స్కాందంబున నీశానసంహితం జెప్పంబడ్డ యురులింగోద్భవంబును, శివరాత్రిమాహాత్మ్యంబును, ......కథావిధానంబున కధీశ్వరుఁగా శాంత" (ఆ. 1 ప. 38) ఇవిషష్ఠ్యంతములకు ముందున్నవాక్యములు. ఈకారణముబట్టి కాశీఖండమందలి కథయు, శివరాత్రిమాహాత్మ్యమునందలి కథయు వేర్వేఱని తలంపనగునే కాని మొదటిదానినే పేరుమార్చి శ్రీనాథుఁ డిట్లు విస్తరించి రచించె నని తలంచుట యుక్తము కాదు. బాణునికాదంబరిలోనివాక్యము లీగ్రంథములోఁ బెక్కుచోటుల ననుసరింపఁబడినమాట వాస్తవమే. అయిననేమి? అది శ్రీనాథునకుఁ గాదంబరీకావ్యమునందలి యభిమానమునే సూచించునుగాని శ్రీశాస్త్రిగారి పైయభిప్రాయమున కేమియు సహాయకము కాఁజాలదు.

ఇఁక నీగ్రంథముయొక్క సమగ్రతాసమగ్రతలగుఱించి శ్రీశాస్త్రిగారు వ్రాసినవాక్యములను బరామర్శింతము. శ్రీనాథుఁడు రచించినగ్రంథము నాలుగాశ్వాసములు మాత్రమే యనుటకు శాస్త్రిగారు చూపినప్రధానకారణము కవిమొదటఁ బ్రతిజ్ఞచేసిన.

"ఉరులింగోద్భవంబు, శివరాత్రిమాహాత్మ్యంబు"

ననుకథలంతతో ముగిసిపోవుటయేకదా: ఈకవిప్రతిజ్ఞయనునది శాస్త్రిగారు శ్రీనాథకృతము గాదని

త్రోసిపుచ్చిన యవతారికలోనిది. కావున నది శ్రీనాథుని ప్రతిజ్ఞయే యనితలంచుటెట్లు? ఇంతియేకాక యీ వాక్యములలోఁగూడ

"శివరాత్రిమాహాత్మ్యంబును" "కథావిధానంబున కధీశ్వరుఁగా" ననుపదములకు మధ్య గ్రంథపాతమున్నది. లుప్తభాగములో మఱేమి చేర్కొనఁబడినవో? కావున శాస్త్రిగారి యీవాక్యములు స్వవచనవ్యాఘాతమునకే తోడ్పడును గాని వారియభిప్రాయమున కుపకరింపనేరవు. నాలవ యాశ్వాసాంతమున సూచింపఁబడిన యమప్రమథాదుల యుద్ధములు కథ కంతగానుపకరించునవి కావఁట. కావున వానిని శ్రీనాథుఁడు వర్ణింపలేదనియే తలంపవలెనఁట. మూలమగు నీశానసంహితాధ్యాయాంత్యపద్యానురోధమున మునులప్రశ్నవాక్యమునుగూడ గ్రంథమందుఁ జొప్పించెననుట యుత్తమమఁట. ఈశానసంహితయనునది లేనేలేదనియుఁ గాశీఖండమే యీశానసంహితయనియు విపరీతముగ వ్రాసిన శాస్త్రిగారు స్వవచనవిరుద్ధముగ మరల నిట్లువ్రాయుట మఱింత విపరీతముగనున్నది. మఱియు శ్రీనాథుఁ డీగ్రంథమును ముగింపకమునుపే కాలగతి నొందుటవలన నాలుగాశ్వాసములుమాత్రమే శ్రీనాథరచితములని చెప్పవలయుననికూడ శ్రీశాస్త్రిగారు వ్రాసిరి. శ్రీనాథుఁడు గ్రంథమును ముగింపకమునుపే మరణించెనని యేలతలంపవలెనో నాకు బోధపడుటలేదు. గ్రంథము శ్రీనాథునిచే ముమ్మయశాంతయ్యకు స్వయముగా నంకితమీయఁబడక శాంతయ్యచే నపహృతమయియుండునని వారూహించుటయే యీయభిప్రాయమునకుఁ గారణము కాఁబోలును. శాంతయ్యపై నీ రోనర్చినదోషారోపణమును విమర్శించి గ్రంథ మాతనికి శ్రీనాథునిచేతనే యంకితమై యుండవలెనని యిదివఱకే నిరూపించియుంటినిగదా! కావున శ్రీనాథునిమరణముచే గ్రంథము పూర్తిగా రచింపఁబడలేదని తలంచుటకూడ సమంజసముగాఁ దోఁపదు. పైకథాభాగము లనవసరమగుటచే వానిని విడిచిపెట్టి కవి యంతమాత్రమే రచించెనని యొకసరి వ్రాసి మరల నిట్లువ్రాయుటగూడ స్వవచనవిరుద్ధమే. కథారంభమున,

"గీ. గ్రంథసంఖ్యఁ బురాణసంఘంబుఁగూడి
నాల్గులక్షల నీపురాణములలోన
నూఱువేల్గ్రంథములతోనె నతిశయించి
శ్రీమహాస్కాందసంహిత శివుఁడుచెప్ప" (ఆ. 1 ప. 47)

వ. అందు శివరాత్రిమాహాత్మ్యంబు చెప్పంబడియుండు నమ్మహావ్రతం బెట్టి దెవ్వ రాచరించి రేఫలంబునొందిరి మాకుం బరిపాటి దేటపడ వివరింపుమనిన" (ఆ. 1వ 48)

అనియున్నది. వ్రతచర్యాప్రకారము ప్రథమాశ్వాసమున 111 వ వచనమునఁ జెప్పఁబడినది. దాని పిమ్మటిపద్యములో వ్రతమహత్త్వము చెప్పఁబడి దృష్టాంతమునకై సుకుమారునిచరిత్ర ముదాహృతమయి తరువాతియాశ్వాసములో వర్ణింపఁబడినది. అంతియే కాని పైని చేర్కొనినవచనములో మునులు కోరిన ప్రకారము వ్రతము నాచరించి ఫలము నందినవారిచరిత్ర మేదియు మన కుపలబ్ధమయిన నాలుగాశ్వాసములలోను జెప్పఁబడలేదు. సుకుమారుఁ డలవోకగా శివరాత్రిని జాగరణము చేసినవాఁడే కాని వ్రతము నాచరించినవాఁడు కాఁడు గదా! సుకుమారునిచరిత్రములోఁ గూడ నాతనిశివసాయుజ్యానంతరము యమప్రమథాదులకు ఘటిల్లిన యుద్ధవిశేషములు కొఱవడియేయున్నవి. కావున నీకారణములనుబట్టి శంకరసంహితాదీపితమయిన కథ యంతయు మనకు లబ్ధమయినగ్రంథములోఁ బూర్తిగా వర్ణితము కాక మఱికొంత గ్రంథ మింకను గొఱవడియేయున్నదని గోచరము కాకమానదు. శ్రీనాథుఁడు కథనంతను బూర్తిగనే యాంధ్రీకరించి యుండును. ఆతని యితర కావ్యములేవియు నయిదాఱాశ్వాసములకంటెఁ దక్కువ కలవి కావు. ఈగ్రంథమునఁగూడ మఱికొన్ని యాశ్వాసము లుండియేయుండును. వానిని లేఖకుఁడే వ్రాయవిడిచెనో లేక యాతనికి దొరకినప్రతిలోఁగూడ నవి కొఱవడియుండెనో తెలియరాదు. కాఁబట్టి మనకుదొరకిననాలుగాశ్వాసముల గ్రంథము నసమగ్రమనియే తలంపనగునని నాయాశయము.

శ్రీశాస్త్రిగారు పీఠికాంతమున నితరుల కనేక సంస్కరణములు దోఁపవచ్చుననియు నవియెల్లను ద్వితీయముద్రణమున గ్రహింపఁబడుననియు వ్రాసియుండుటచే నాకుఁ దోఁచినయభిప్రాయములతో నీవ్యాసమును లిఖించితిని. గ్రంథమందలిపాఠములు కొన్నిటికి నాకుఁదోఁచిన సంస్కరణములను వేఱొకపరి వివరించెదను. విజ్ఞులు క్షమింతురు గాక!

# వ్యాజోక్తి చమత్కారము

కావ్యకళానిధి చిదంబరశాస్త్రిగారు

దాఁపఁగ నేల నీకుఁ జెడదారులు చూపిరి పాప మెవ్వరో
పాపులు శౌరికీర్తి గుణవైభవరూప విలాస భాసురా
టోపముఁ జూచి యోర్వని కఠోరమనంబున ముద్దరాల నీ
కేపగిదిన్ గ్రహింపఁగల విట్టి కుయుక్తులనెల్ల భామినీ!

చ. హరుఁడన నెవ్వఁడంచు హృదయంబున నీవు దలంచికొంటివో
సురుచిరగాత్రి! వాఁ డపరిశుద్ధుఁడు బూడిదమేనితో దిగం
బరుఁడయి కాటిలోపల నివాసముఁ జేసెడి భూతనాథుఁ డా
పరుసునిపొందుకై యఱ్ఱుసాఁచితి వెంతటి వెఱ్ఱిదానవో.

చ. వనజదళాక్షి పెండ్లియను పల్కుల నావల నుండనిమ్ము మ
న్నను గయిఁ గేలఁబట్టుకొనఁ బూనినకాలమునందు బుస్సలు
స్సనుచుఁ బయింబయింబడెడు నాతని మేనునయందు పాముల
న్గనుఁగొని తల్లడంపడి వికారము నొందక నిల్చియుందువే?

చ. కుశలసమాగమంబనినఁ గొంత విచార్యము దీనికేమి యా
పశుపతి కౌఁగిలింత సులభంబుగ నీకు లభించుఁ గాని యో
శశిముఖి! కప్పురంబు లెగఁజల్లెడు నీయురమెట్లు ఘర్షణ
ప్రశిథిలమైన తద్భసిత పంకములోఁ బడి మున్గి తేలునో.

చ. అమృతశిలా నిబద్ధమగు నాలయమందు ఘుమంఘుమార్భటీ
సముచిత గంధవాహ మెగఁజల్లుచు నెల్లెడమందు పూలలోఁ
దమకము మైఁజరింప బసదానవు నీవు కపాలకల్యకే
శములకు నాస్పదంబగు శ్మశానములోఁ జరియింప నేర్తువే.

ఉ. పువ్వులు లాజలట్లు పువుఁబోఁడులు పైఁబయి జల్లుచుండఁగా
మవ్వపు టేన్గునెక్కి పదిమందికిఁగూడ హృదంతరంబులం
దువ్విళు లూరునట్లు చననొప్పెడి నీ వొక యెద్దునెక్కి రా
నవ్వనివార లుండరని నాకు స్ఫురించు మనంబునఁ గోమలీ!

చ. గణనకునెక్కి పేర్వడిన గట్టుల కేనికిఁ బుట్టి పుణ్యల
క్షణమగు నీవమంగళుని బట్టుకొనం దలపెట్టుటెల్ల నో
గుణవతి! పువ్వుమాలికను గ్రోతికిఁ జుట్టిన చందమారయ నిం
దణువున సత్యమాడితి నబద్ధముఁ దలంపకు మాత్మలోపలన్.

ఆ. వే. అతని నాశ్రయించి యాలక్ష్మియు గుణమెల్లఁ
దొలఁగిపోవఁ జంద్రుఁడే క్షయించి
శోచనీయ యయ్యె నీచరిత్రముగూడ
నంతదశకు వచ్చె నక్కటకట!

సీ. కులమునైనను జూచి కోరుదు మందుమా
తలిదండ్రు లెవ్వరో తెలియరాదు
రూప మాలోకించి ప్రాపింతు మందుమా
మూఁడుకన్నులు పైకి దాడివెడలు
భాగ్యంబు నాసించి పడయుదు మందుమా
దైన్యంబు దానికిఁ బ్రబలసాక్షి
లక్షణంబులు గోరి వీక్షింతు మందుమా
దిసమొలయె వానిఁ దేటపఱచు
ఇట్టి మహానీయుఁడౌ వరుఁ డెట్లు చిక్కె
పట్టితివి మంచికొమ్మనే పట్టుబట్టి
యెన్ని నోములు నోఁచితి వెంతతపముఁ
జేసితివి వీనికోస మోచిన్నదాన!

ఉ. ఓసరసీరుహాక్షి! విను మొక్కటిమాట మనోజవైభవో
ల్లాసవికాస భాసుర విలాసము లొక్కెడు భర్తతోడ భ
ద్రాసన మెక్కఁగాఁ దగినదానవు నీ వెటు లుగ్రమైన వ్యా
ఘ్రాసనమందు జోగియగు నాతని చెంతను గూరుచుందువో?

ఉ. జాణవు నీవు నిక్కముగఁ జాతురిగల్గినదాన వాతఁడో
స్థాణువు, నీవు సుందరి వతండు విరూపుఁడు, నీవు నిత్యక
ల్యాణి వతం డమంగళుఁడు, హాస్యముగాకొకొ నీవు వానికిన్
రాణివటన్న నెవ్వరయినన్ వినువారలు నవ్వకుందురే!

ఉ. తెలియంజాలవు కష్టసౌఖ్యముల నంతేకాని లేకున్నను
జ్వాలశ్శృంగార రసంబులొల్క నభినంద స్ఫూర్తితో దివ్యమం
గళసూత్రంబును గట్టఁగాఁదగిన నీకంఠంబునం దాతఁడో
కలికీ! కాలభుజంగమున్ విడువ నీకయ్యారె యేమయ్యెడిన్.

చ. అమలినగాత్రి! నీకొక రహస్యముఁ జెప్పెద వానికిన్ మతి
భ్రమ మొకఁ డుద్భవించినది పాపము దీనికిఁ దోడు లేనిచోఁ
బ్రమదముతోడ దేవతలు పానము సేయుచు నుండు వేళలో
నమృతము వీడనాడి యొకఁడైనను గాని విషంబుఁ ద్రావునే?

చ. ఎటులఁ బరిగ్రహించుటకు నెంచితివో మదిలోన సుందరీ!
నటగణమందుఁ జేరిన యనామకుఁ డాతఁడు సుమ్ము కానిచోఁ
గటితటమందుఁ దోలు బిగఁగట్టి జటాపటలంబు మోముపైఁ
దటతటలాడఁ దక్కతక తక్కతక తక యంచు నాడునే!

శా. పుట్టిననాఁటనుండి బహుభోగములోఁ దులదూగి నేఁడు చే
పట్టుట కిచ్చగించితి వభాగ్యమునంతయు నొక్కమూటగాఁ
గట్టి పురాకృతం బెవఁడు కావని ద్రోయఁగనేర్చు మేల్మిక్రొం
బట్టు పసిండిపుట్టముల పట్టునఁ బెబ్బులి తోలుఁగట్టుమా.

ఉ. కన్నియ! వింటివా కుటిలగామిని వేల్పొకచాన నెత్తిపై
నున్నది వానికాఁతఁడు మహోగ్రుఁడు యోజన కొంత చేయుమా
యున్నిటికేమి గాని వచియించెద నేనొకమాట సర్వసం
పన్నవు నీవు పాపము కపాలములోఁ దిన నేర్చికొంటివే!

ఉ. సొమ్ములు గోరినట్లయిన సుందరి! నీకతఁ డీయఁగాలస
ర్పమ్ములు; చందనంబుపయి భావముగల్గినఁ గాటిలోని భ
స్మమ్మును బైనఁజల్లు; తుమ్మపైఁ బనిచోఁ దనబిచ్చమందు బి
చ్చమ్మొక యింతపెట్టు; నిది సత్యము మాటలు వేయునేటికిన్.

చ. భసితముఁగోరితో మణిఁగపాలముఁగోరితొ కాటిలోపలన్
వసతులఁగోరితో మఱియుఁ బాములఁగోరితొ తోలుఁగోరితో
రసికతఁగోరితో మఱికదా రాజ్యముఁగోరితొ యేమికోరితో
పసితనమెల్ల నిట్లు పలుపాల్పడఁ ద్రోఁచితి వెఱ్ఱిదానవా?

గీ. మన్మథాంతకుఁ డాతఁ డోమంజువాణి!
వానితోఁగూడి నేనొక చాననుచుఁ
గాపురం బెట్లు చేయుదో కాని నీవు
చెలువ లిడివిన్న నవ్వుల చేటుగాదె?

క. ప్రాచీనం బౌతం డా, లోచింపుము బాలవీవు లోలాక్షీ! నీ
సాచీకృత ముఖదృగ్వ్యా, కోచము వ్యక్తంబు నేసి కొనెదవు సుమ్మా.



దైవప్రార్థనము

Prayer class



ఉపాధ్యాయులు, విద్యార్థులు

Boarders and Teachers



ఆశ్రమముయొక్క ప్రక్కదృశ్యము

A side view



విద్యార్థుల భోజనము

Boarders taking food

శ్రీ జిట్టా అప్పయ్యగారు, వారు స్థాపించిన పది ధర్మపాఠశాలల బాలురు
చెన్న రాజధాని విద్యాశాఖమంత్రిగారు ౨౨-౧-౧౯౨౫ నాడు బాపట్లకు వచ్చినపుడు తీసినచిత్రము



Ten Free Schools of Mr. Jitta Appayya Garu, Bapatla

శారదానికేతనమునందలి బాలికలు, గుంటూరు





Girls, Sarada Niketanamu, Guntur

# భాగవత ప్రాశస్త్యము

సేపూరి లక్ష్మీనరసయ్యగారు, యం. ఏ., యల్. టి.

శ్రీ ఆంధ్రదేశమునఁ బేరెన్నికవడసిన పవిత్రగ్రంథరాజములలో భారతభాగవతములు ముఖ్యములు. అందు రెండును సర్వాంగసుందరమగు గ్రంథములు. వాని కింతటిపవిత్రత వానికథాంశములవల్లను, వానియందలి యుత్తమకవిత్వసరణిఁబట్టియు వచ్చినది. ఈవ్యాసమునందు భాగవతప్రాశస్త్యముం గొంతవఱ కరయుదము.

భాగవతమునందలి ప్రధానకథ భగవంతుని లీలావతారకథ. ఇందుఁ దఱుచుగ భగవద్భక్తులగు రాజన్యులయొక్కయు, భగవంతునకు ముందుఁ బిమ్మట నున్న మనువులయొక్కయుఁ జరిత్రములు మనోహరముగ వ్రాయఁబడియున్నవి. భగవద్భక్తులమహిమలు, భరతఖండమునఁగల రాజులపూర్వచరిత్రములు దివ్యావతారప్రభావములు నీగ్రంథమునఁ జేర్కొనఁబడినటు లితరపురాణగ్రంథములలోఁ గానరాదు. ముఖ్యముగ భాగవతమున శ్రీకృష్ణావతారప్రభావమే యెక్కువగా నభివర్ణింపఁబడియున్నది. మొత్తము నిరువదియొక్క యవతారముల ప్రభావము సైతము సంగ్రహింపఁబడినది. కావుననే యీగ్రంథము పురాణములలోనెల్ల నెక్కువగాఁ బఠింపఁబడుచున్నది. హైందవులతత్త్వసార మీగ్రంథమున సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నది. దానంజేసి ప్రతిహైందవునికి నీగ్రంథము పవిత్రమైయున్నందున దీనికీప్రశస్తి కలిగినది.

భాగవతకవితాశిల్ప మిఁక విచారింతము. దీనియందలి భావవైశద్యము, రసౌచిత్యము, అలంకారసంపద, కల్పనాచమత్కారము, పాత్రపోషణము, భావనాశక్తి, అర్థబాహుళ్యము లోనగునవి వర్ణనాతీతములు.

పోతరా జనసరములగుచోటుల సమయానుసారముగ రసపోషణ చేసియున్నాఁడు. ఎట నేరసము వ్యక్తీకరింపవలయునో, పోతనకంటె నెఱింగినకవి యింకనొకఁడు గానరాఁడు. ప్రథమస్కంధములో నశ్వత్థామ యవమానసమయమునందు భయానకబీభత్సరసంబులును, కృష్ణనిర్యాణవార్తదెలుపునప్పుడు శోకకరుణరసంబులును, సప్తమస్కంధములో ప్రహ్లాదవధయందు శాంతకరుణరసంబులును,నృసింహావతారఘట్టంబునందు వీరరౌద్రాద్భుతరసంబులును, దశమస్కంధములోని రుక్మిణీకల్యాణమునందు శృంగారభక్తిరసంబులును, నరకాసురయుద్ధమందు వీరశృంగారరసంబులును, అత్యద్భుతముగా వర్ణించియున్నాఁడు.

ఉదాహరణములను జూడుఁడు. తనయొద్దకు పట్టితెచ్చిన అశ్వత్థామను ద్రౌపది యాడినమాటలు వినుఁడు:

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు మ
ద్విద్రోహంబును నీకుఁ జేయరు బలోద్రేకంబులోఁ జీఁకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా, నీచేతు లెట్లాడెనో! (1. 162)

ఉ. అక్కట, పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్తనై
పొక్కుచునున్న భంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నెట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో!
(1. 168)

పైపద్యము లెంతకఠినహృదయునికైనను జాలిఁ గొలుపఁజాలియున్నవి. ఇట్టిమాటలు విన్నతర్వాత శిశుహంతకుఁడగు నశ్వత్థామ యెంతటిమనోవేదననైనను జెంది యుండును. ఇట్టి తరుణములో నశ్వత్థామను దిరుగుచెప్పకుండునట్లు చేయుటయందు రసౌచిత్యమెంతయుఁ గాపాడఁబడినది.

ద్రౌపది పరమయోగ్యతయు, అశ్వత్థామసంపూర్ణపరాభవము వర్ణింపఁబడిన పద్యమును దిలకింపుఁడు.

ఉ. ద్రోణునితోఁ శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట న
క్షీణతనూజశోకవివశీకృతయై విలపించుభంగి నీ

ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంతపొక్కెనో
ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే.
(1. 165)

ఎక్కడ దాగినను అశ్వత్థామకే కాదు, మఱి యెవ్వరికైన నీపరాభవము భరింపరానిది. విక్టరుహ్యూగో (Victor Hugo) గారి 'దురదృష్టవంతులు' (Les Misarables) అను నవలయం దొకపోలీసు, దొంగనుండి యోగ్యుఁడుగా మారినవానివలన గొప్పసహాయమును బొంది, ఆదొంగను బట్టవలసిన బాధ్యత రాజధర్మమై యొకవైపునను, కృతజ్ఞత రెండవవైపునను బాధింప, రెంటికిని సంధి పొసఁగింపలేక, సముద్రమందుఁబడి చచ్చెను. ఈసందర్భములో నశ్వత్థామ యేమిచేయవలసినవాఁడో తెలియకున్నది. పాంచాలిపలుకులభావవైశద్య మెంతమనోహరముగ నున్నదో చూచితిమి.

కృష్ణనిర్యాణవార్తతో ద్వారకనుండి వచ్చుచున్న తమ్ముని గాంచి, సంభ్రమంబున "అన్నా! ఫల్గున..." (1. 350) అనిపిలిచిన ధర్మజునిమనస్సునందు దమ్ముఁడు కన్నీరుదెచ్చినప్పటినుండియుఁ గృష్ణనిర్యాణవార్త వినువఱకు, పొరలినతలంపులు మిక్కిలి మనోహరముగా వర్ణింపఁబడినవి.

క. మనసారథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనవిభుఁడు గురుఁడు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా! (1. 358)

అనుపద్యము కుతూహలమును, భయసంభ్రమాదులను మిక్కిలి చమత్కారముతో వినువారికి గలుగఁజేయుచున్నది. అర్జునునియందుఁ గొంతశమించిన శోకము, గుణగ్రహణశక్తి కనఁబడుచున్నవి. పోతరాజుకవిత్వమునకు సప్తమస్కంధమునుండి క్రొత్తమెఱుఁగు వచ్చెను. ధార నిగ్గుదేలెను. ఈస్కంధముననే పోతరాజు తనకభిమానరసమగు భక్తి నెక్కువగాఁ బోషించెను. నవరసములలో భక్తిరస మొకటికాకపోయినను, పోతరాజు దాని నొకరసస్వరూపముగా నిర్ణయించి సజీవముఁ జేసెను. భగవంతుఁడు రసస్వరూపుఁడని యామ్నాయములు దెలుపుచున్నవి.

"రసో వై సః" అనుసూక్తి నెఱిఁగినవాఁ డగుటచే రసస్వరూపుఁడగు భగవంతుని దివ్యమంగళవిగ్రహమును భాగవత రచనారంభముననె వర్ణించెను. ఆమంగళమూర్తిని వర్ణించుటలోఁ బోతరాజు తన్మయుఁడై తనివిదీఱ కవితారచనము గావించుచు, కావ్యప్రపంచమును సైతము మఱచిపోవుట కలదు. కేవలము ఔచితి పోతరాజుకవిత్వములో నెంతకలదో పరికించురసవిదులకు అది వెగటుగఁ దోఁచినను, పాఠకులకు, భక్తలోకమునకు, నాయాభాగములు సుధావర్షములవంటివని చెప్పవచ్చును. పోతరాజు వర్ణించు భగవద్వర్ణనలు ప్రత్యేకించి భగవంతుని యాకారములను వర్ణించునవియేకాని నిర్జీవములగు ప్రతిబింబపద్యములు కావు. తేపతేప కొకనూతనమార్గము ద్రొక్కుచుఁ బారవశ్యముఁగూర్చు భక్తిరసద్యోతకపద్యముల నిటులొనరించుట యనితరసాధ్యము.

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబువోవునే మదనములకు... (7. 150)

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ... (7. 169)

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంఫితచర్మభస్త్రిగాక... (7. 170)

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక... (7. 171)

క. చాలదు భూదేవత్వము, చాలదు దేవత్వ మధికశాంతత్వంబుం
జాలదు హరిమెప్పింప వి,శాలోద్యములార! భక్తి చాలినభంగిన్.
(7. 244)

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములన్
జిక్కఁడు యుక్తిని, భక్తిని
జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ! (7. 248)

ప్రహ్లాదుని వివిధోపాయంబుల హింసించుటయందును, ఆహింసల నన్నిటిని దీనభావములేక ప్రహ్లాదుడు భరించుటయందును శాంతకరుణాద్భుతబీభత్సరసములు వర్ణించినట్లుండును. నిదర్శనములను జూడుఁడు:

ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు......(7. 198)

అను పద్యాదులయందు శాంతకరుణారసంబులును,

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి
కరటి దంతంబులఁ ద్రొక్కింపఁ బంపు... (7. 198)

ఉ. ఎఱుఁగఁడు జీవనోపధను లెవ్వరు భర్తలు లేరు బాధలం...
(7. 202)

లోనగుపద్యములం దద్భుతబీభత్సరసంబులు వెదచల్లఁబడినవి. అదియును గాక, కుళింగపక్షిశోకమునందు, జాలిదైన్యము నెట్లుమేళవించినవో తిలకింపుఁడు:

చ. అడవుల మేతమేసి మనమన్యుల కన్నఁడు నెగ్గుసేయ కి
క్కడ విహరింప నేఁడకట కట్టిఁడిబ్రహ్మ కిరాతుచేతిలోఁ
బడుమని వ్రాసెనే నుదుటఁ బాపపుదైవము కంటి కింతెరు
కుండుబరువయ్యెనే బ్రదుకు గోమలి! యేమన నేర్తుఁ జెల్లరే!
(7. 61)

"కొక్కులురావు..."(7. 63) అనుపద్యముఁగూడఁ జూడనగు.

గజేంద్రమోక్షణకథయందు గజేంద్రుని భక్తి, ఆయాసము, సందేహము, భయము, నిపుణతతో నీ క్రిందిపద్యములం దిముడ్పఁబడినవి.

క. కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగిగణములపాలం
గలఁడందు రన్నిదిశలను
గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో. (8. 86)

క. వినుదట జీవులమాటలు
చనుదట చనరానిచోట్ల శరణార్థుల కో
యనుదట పిలిచిన సర్వముఁ
గనుదట సందేహమయ్యెఁ గరుణావార్ధీ! (8. 91)

గజేంద్రుని మొఱయం దెంతకరుణరసమున్నదో యరయుఁడు:

సీ. కలుగఁడే నాపాలికలిమిసందేహింపఁ
గలిమిలేములు లేక కలుగువాఁడు...... (8. 87)

శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె... (8. 90)

వామనమూర్తి విశ్వరూపము నొందినవిధంబు బ్రహ్మాండంబంతయుఁ గన్నులగట్టినట్లు మనోజ్ఞముగా వర్ణింపఁబడెను.

శా. ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.
(8. 622.)

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగుఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.
(8. 628.)

నవమస్కంధములోని రామావతారకథయందును, దశమస్కంధములోని రుక్మిణీకల్యాణ కథయందును రసోజ్జీవము తాండవమాడుచున్నది.

ఇఁకఁ గుచేలోపాఖ్యానమునందలి దరిద్రావస్థ దైన్యస్థితివర్ణన సర్వవిధములఁ బోతనజీవితముతోఁ బోలి యున్నట్లు తోఁచుచున్నది.

సీ. ....................కుచేలుండు
నానొప్ప విప్రుండు మానధనుఁడు
విజ్ఞానరాగాదిరహితస్వాంతుండు
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు
బాధింప కొరులఁ గార్పణ్యవృత్తి
నడుగఁబోవక తనకు దా నబ్బినట్టి
కాసు పదివేలనిష్కముల్ గాఁ దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష
యొకవిధంబున నడపుచునుండునంత. (10. ఉత్త 965)

సీ. లలితపతివ్రతాతిలకంబు వంశాభిజాత్య
తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడునొచ్చి పెడవులు దడుపుచు
శిశువు లాఁకటిచిచ్చుచేఁ గృశించి
మలమలమాఁడుచు మానసం బెరియంగ
బట్టెఁడోరెము మాకుఁ బెట్టుమనుచుఁ
బత్త్రిభాజనకృతపాణులై తనుఁజేరి
వేఁడిన రీమలు నూఁడినట్టు
లైన శోకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లనిపలికె నోజీవితేశ!
తెట్టుముట్టాడు నిట్టిపేదరిక మిట్లు
నొంప దీనికుపాయ మూహింప వైతి. (10. ఉత్త. 966.)

నరకాసురయుద్ధము వర్ణించుటయందుఁ గనుపఱచిన భావప్రకటనము, కల్పనాసౌష్ఠవము ప్రశంసనీయములై మనోజ్ఞములై యున్నవి.

సీ. వీణఁ జక్కఁగఁ బట్టి వెరవెఱుంగనికొమ్మ
బాణాసనం బెట్లు పట్టనేర్చె
మ్రాఁకునఁ దీగఁ గూర్పంగ నేరని లేమ
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె

శరవి మత్స్యము ద్రుప్పఁజాలనియబల లే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్ప నేరనితన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ
బలుకుమనినఁ బెళుకుపలుకని ముగుద యేం
గతి నొనర్చె సింహగర్జనములు
తనరఁగ మెఱచెఁ ద్రిజగదభిరామగుణధామ
చారుసత్యభామ సత్యభామ. (10. ఉ త్త. 181)

కృష్ణునితో సత్యభామ వచ్చెదననుటయుఁ గృష్ణుఁడు వలదనుటయుఁ గల కథాంశమును బోతరాజు సరళముగ వ్రాసెను.

సీ. సమస్తపుష్పంధయఝంకారములు గావు
కీచకాకుంభీంద్రబృంహితములు... (10 ఉ త్త. 164)

అనుపద్య మాంధ్రజనులచే గౌరవింపఁబడుచున్నది.

సత్యభామవీరాకారము, ధనుస్సు సగుణంబుచేయుట లో నగునవి యీక్రిందిపద్యమునం దిముడ్పఁబడి యున్నవి.

శా. ఆల్లంత బలంబునొంది తడఁగట్యానంత తేజోనితే
పాలిత్యాత్మమహాప్రతాపమున వీరాలోకదుర్లోకయై
తానేకాపసుఁగాంచె దనువుం దన్వంగి దైత్యాంగనా
శ్రీహాసంభునునిగ్రహంబుగ రణక్రీడామహోత్కంఠతోఁ.
(10. ఉ త్త 175)

యుద్ధరంగమున కుతుకి భయంకరమృత్యుదేవిని నరకాసురునికొఱకు కాహ్వానించు సత్యభామాస్వరూపము నరకాసురుని కెటులు గనవచ్చుచున్నదియుఁ బ్రేమమూర్తి యగు కృష్ణుని కెటులఁగనవచ్చుచున్నదియుఁ బోతరాజొకమాఱె మనోజ్ఞముగఁ జెప్పియున్నాఁడు. వీరశృంగార రసములు సాంకర్యమునొందనీక ప్రత్యేకత సంఘటించి యొకపద్యములో రచించుట పోతరాజువంటి రాచికునకుఁ దప్ప మఱియొకనికి సాధ్యముకాదు.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కుపరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతిసందర్శనంబు
హర్షదాయియై మహాశోకదాయియై
పరఁగు ముద్దరాలిబాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల. (10. ఉ త్త. 183)

ఒకవ్యక్తియవస్థ నేకవిధముగ వర్ణించుటలో భావనాశక్తి మెండుగాఁ గావలయును. అట్టిశక్తి పోతన యందు మిక్కుటముగఁ గలదనుట నిక్కువము. ఇటులు దుష్కరనియమములతోఁ బద్యములు పూర్తిచేసి రసమును గాపాడినవా రరుదు. తలకుమించిన యలంకారములు గూర్పనెంచి కృతార్థులు గాలేక వ్యర్థపదములతోఁ బద్యములఁ బూరించువారిని గర్హింపనగు. సహజమగు శైలిలో నెట్టిదుష్కరనియమమేని రసవంతముగఁ దీర్చు పోతరాజు సర్వవిధములఁ బ్రశంసనీయుఁడే.

భక్త్యుద్రేకములచేఁ బరవశుఁడై యందందు దేవతాస్తోత్రములు మిక్కుటముగా వ్రాసియున్నాఁడు.మస్తృంతములతోపాటు క్రిందిపద్యమునందలిరసము, భావబోధనము కడువిచిత్రము.

సీ. ఒకచెలికానిపై నొకచేయి సాఁచి వే
ఱొకకేల లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పునకొందని కొన్నికుంతలములు
చెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుంచెమంగలు వుచ్చి కొమరారఁ గట్టిన
పసిఁడివన్నియగల పటమువాని
నాఁడలఁ దిరిగిరా నలనడఁ జుట్టిన
దట్టంపుఁ బింఛెపు దండవాని
రాజితోత్పలకర్ణపూరములవాని
మహితపల్లవపుష్పదామములవాని
భువనమోహనవటవేష భూతివానిఁ
గనిరి కాంతలు కన్నులకఱవుదీఱ. (10. పూర్వ. 861.)

భక్తులయందు భగవంతునికిఁగల యనురాగము "సిరికింజెప్పఁడు" (8. 96.) అను పద్యమునందుఁ దేటపడుచున్నది.

రుక్మిణీదేవిమనస్సునందలి యాందోళన మేవిధముగ నున్నదో

మ. ఘనుఁ డాభూసురుఁ డేఁగెనో ... (10. పూర్వ. 1725.)

అనుపద్యమునఁ జూడనగును.

మఱియు నీక్రిందిపద్యమునందలి వర్ణనక్రమమును, శయ్యామార్దవమును జవిచూడుఁడు.

సీ. దేవకీసుతుకౌఁగిటఁ దీఁగెలు వీడంగ
    నెలఁదికి హైదీఁగె వీడఁదొడంగెఁ
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ
    గాంత వింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడచూపఁ
    బొలఁతికిఁ జనుదోయి పొడవుచూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
    జలజాక్షిమధ్యంబు సన్నమయ్యె
హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధికమగుచు బాల కమరెఁ
బద్మనయనునలఁ బ్రమదంబు నిండార
నెలఁతయౌవనంబు నిండియుండె. (10. పూర్వ. 1690.)

పోతరాజు శబ్దాలంకారప్రియుఁడు. అంత్యనియమము నేర్పుగ గూర్పుచేయుటయందు మత్తేభపద్యముల రసవంతముగ రచించుటయందు, సంస్కృతాంధ్రముల సమముగ మేళవించుటయందు నీకవి యసమానుఁడు. పోతరాజువలె, ధారాశుద్ధిగల కవితలో నంత్యనియమాది శబ్దాలంకారములు భావానుకూలముగ వ్రాయుట దుష్కరము.

క. అడిగెదనని కడువడిఁ జను
నడిగిన దను మగుడ నుడువఁడని నెడ నుడుగున్
వెడవెడఁ జిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. (8. 108.)

ఇట్టిపద్యములు పోతరాజు కవిత్వములో ననేకములు గలవు. ఈపద్యములోఁ దనకవితాశిల్పము ప్రకటించుటకై సర్వలఘునియమము శుద్ధాంధ్రభాష, వృత్త్యనుప్రాసము కాపాడి రసముగూడ జీవము నెలకొల్పి యున్నాడు. ఇట్టికూర్పుబిగి, కయితవిన్నాణము, పలుకుపొందిక, తఱచుగ నితరులలోఁ గానరావు. కేవలము స్వాభావికమగు కవిత కీనియమములు కవితాశిల్పములు అనవసరములే కాని, నిరంకుశమగు పోతనకవితలో నీమెఱుగు లనవసరములనియుఁ దెచ్చిపెట్టుకొనినవనియుఁ దెలుప వీలుండదు. పద్యమునందేకాక గద్యమునందు నిట్టిశబ్దార్థాలంకారములు, రసపుష్టి గాననగును.

పదప్రయోగమునందుఁ గొందఱు సంస్కృతపదబాహుళ్యకవితాభిమానులు. మఱికొందఱు ఆంధ్రపదబాహుళ్య కవితాభిమానులు. ఈ రెండుతెగల రసజ్ఞుల "మెప్పింతు కృతుల నయ్యిరువుల" నని పోతరాజు ప్రతినఁబూని, సర్వజనసమ్మతముగఁ బండితపామరుల కుపయోగించున ట్లుభయభాషలను సమముగ సంధించి భాగవతము జనాహ్లాదకరముగ వ్రాసెను. ఇతనియందు సలక్షణశైలి, ధారాశుద్ధి, శయ్యామార్దవము గలవు.

భాగవతములోని కథాంశములు భారతాదిగ్రంథములలోఁ గొన్ని కలవు. ఆయాపద్యములతోఁ బోతరాజుపద్యములు పోల్చినచోఁ బోతరాజు శక్తిసామర్థ్యములు ద్యోతకము కాఁగలవు.

ఈక్రిందివానిని బోల్చిచూడుఁడు:

1. ఉ. అమితాఖ్యానక శాఖలం బొలిచి... (భార. ఆది. 1. 65)
   మ. లలితస్కంధము కృష్ణమూలము... (భాగ. 1. 22.)

2. యయాతిచరిత్రమున దేవయానను నూతినుండి పైకెత్తు సందర్భమున,

చ. జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీ
   తలవహనక్షమంబయిన... (భార. ఆది. 3. 144)
శా. సప్తాంభోనిధి మేఖలావృతమహాసర్వంసహాకన్యకా
   .......... (భాగ. 9. 527.)

వీనియందు నన్నయభట్టుశైలి మార్దవము లేకపోయినను, వృత్త్యనుప్రాసాదిశబ్దాలంకారములు మనోహరముగ సమకూర్పఁబడి భావవంతములై యున్నవి.

ఇటులె భీష్ముఁడు శరతల్పగతుఁడై శ్రీకృష్ణుని స్తుతించుఘట్టమునఁ దిక్కనపద్యమునకుఁ బోతనపద్యములకుఁ గల పోలికఁ జూడుఁడు:

మ. యదువంశంబున వాసుదేవుని.....గృష్ణాత్మునిన్. (భారతము)
మ. త్రిజగన్మోహనశీలకాంతిఁ దను వొప్పింపఁ బ్రాభాతనీ
   రజబంధుప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక
   వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
   విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.
   (భాగ. 1. 218.)

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి
    గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న
    జగముల వ్రేఁగున జగతి గదలఁ

చక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ
బైనున్నపచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ
గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచుదేవుండు దిక్కు నాకు. (1. 222)

పోతన భీష్మునిపై కుఱుకుచున్న శ్రీకృష్ణుని దివ్య మంగళవిగ్రహమును గన్నులఁగట్టినట్లు చిత్రించియున్నాఁడు. తిక్కనపద్యమందు కథను వచించుటతప్ప, క్రొత్తవిశేష మేమియు లేదు. ఇట్టిదే యీక్రిందిపద్యము.

సీ. వీఁడచే రక్కసి విగతజీవఁగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటిబాలకుండు... (10. పూర్వ. 1249.)

దీనిని

సీ. ప్రాణంబులోఁగూడ రక్కసిచన్నుల
పాలుద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె. (భార. ఉద్యో. 3.)

అనుపద్యముతోఁ బోల్చిచూడఁ బోతరాజు శయ్యామార్దవంబు తెలియవచ్చును.

ఉత్తరహరివంశమునందును, హరివంశమునందును, భాగవతములోనికథాంశములు గలవు. అట్టిసలములలో వర్ణనాంశములుగల పద్యములును, వర్ణనలులేని పద్యములును పైగ్రంథములతోఁ బోల్చిచూచిన, భాగవత మే విషయమందును దీసిపోదని చెప్పుటయందుఁ బ్రమాదము లేదు. పోతన నాచనసోమునికి శంభుదాసునికి నీడగుఁ గాని చెప్పుటలో సందేహము లేదు.

పోతనయం దితరకవులయందు లేనియమోఘశక్తి యొకటి కలదు. దృశ్యప్రబంధము ప్రదర్శించుతఱి నర్తకుఁడు తానే, కథాపాత్రము ననుకొని నర్తనమును గావించినట్లు ఒకభక్తునిచరిత్రము వ్రాయునపు డాభక్తుఁడు తానే యనుకొని తాదాత్మ్యము పొంది యాభాగమును రసవత్తరముగఁ దృప్తికరముగ ననన్యసాధ్యముగ వ్రాయును. ఇట్టితాదాత్మ్యమున ప్రహ్లాదచరిత్రమున, గజేంద్రమోక్షణమున, కుచేలచరిత్రమున, శ్రీకృష్ణజీవితమున పాత్రములలో లీనమై యాయాఘట్టములకుఁ బ్రాణదానము గావించియున్నాఁడు. కావుననే భాగవతమునందలి పైకథాంశములు రసవత్తరములు కాఁగలిగినవి. విచారకరములగు నంశములు కవితాసృష్టిలో నిముడ్చుతఱిఁ దానేడ్చుటయు, శృంగారరసము వర్ణించుతఱి నాయుద్రేకము లోన నడంచుకొనుటయు, వైరాగ్యము వ్రాయుతఱి తన యాశ్రితహితభావముఁ బ్రకటించుటయు, భక్తి వ్రాయుతఱి తన నిశ్చలహృదయముఁ బ్రదర్శించుటయు, ఇంత యేల, ఏరసము వ్రాయునపు డారసములో లీనమగుట పోతరాజకవివర్యునకు సహజస్వభావము. రసమునఁ దాదాత్మ్యము పొంది వ్రాయుటచేతనే భాగవతమున కింతయనరాని విలువ గలిగినది.

భక్తునకు సంగీతమునకు నవినాభావసంబంధము కలదు. కాన భక్తకవి, తనకవిత వృత్త్యనుప్రాసములతో నంత్యనియమములతో యమకముతో సంగీతమున కనుకూలముగ మార్చుట సాజము. పోతన భక్తుఁడగు గాయకుఁడు గాననే, సంగీతసంప్రదాయమున కనుకూలముగ శబ్దాలంకారములఁ బోషించెనని తోఁచుచున్నది. ఇటులె దాశరథీశతకకర్తకూడ చేసియున్నాఁడు. దీనిచే భక్తునకుఁ జిత్రకవితకు సంబంధమున్నటులు తలంపఁజనును. కావుననే భక్తుఁడగు పోతరాజు కవితలో శబ్దాలంకారములు మెండుగాఁ గానవచ్చుచున్నవి. పోతరాజునకు దుష్కరప్రాసములఁ గూర్చుట శబ్దాలంకారములతోఁ బద్యముల వ్రాయుట సహజముకావున భాగవతము పండితపామరులకు శ్రవణపఠనయోగ్యమై మనోరంజకమై యున్నది.

ముఖ్యముగఁ బోతన భక్తిరసము కరుణరసము పోషించెను. శృంగారము కొంత సరసముగ, రమణీయముగఁ బోషించెను. వీరహాస్య భయానకాది రసములఁ బ్రచురించుటలోఁ బోతన మిగుల నైపుణ్యముకలవాఁడని చెప్ప వీలులేదు. భక్తిరసమున నాంధ్రవాఙ్మయమునఁ బ్రధానపీఠము పోతరాజుదే. అతని నాపీఠమునుండి తొలగింపఁగలకవి "నభూతో నభవిష్యతి" యని సాహసముతోఁ జెప్పవచ్చును.

# శ్రీ పరమేశ్వర స్తుతి

విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రి గారు

హరిహరుఁడంచు భేదము లనంతముగా గ్రహియింపఁజేమి యే
వరుఁ డెవనిం గుతించి మనసం బొనరించిన నిన్నె కాదె భా
స్కరశశివహ్నులు న్వెలుఁగుచుండుట నీదగు లీలలం గదా?
కిరణశశాంకమౌళి! నను దిద్దఁగఁ గావు ముమామనోహరా! ౧

మ. ఒకఁ డీలోకము లెల్ల నిత్యములు నా నూహించు దృగ్గోచరా
వికలత్వంబుఁ దలంచి, వేఱొకఁడు దా విశ్వంబు నశ్వంబనుం
బ్రకటాధ్యాత్మికసంపదం దలఁచి, యూహాపోహ లిట్లుండ నీ
యకలంకాత్మను నెట్లు నేఁ దెలియఁగా నర్హుండ గౌరీశ్వరా! ౨

శా. నానారూపములంది లోకముల నానాప్రక్రియం జేసి దే
వానేకత్వము దోఁపఁగా మునులచే సర్వప్రథంబొంది వి
జ్ఞానానందము రూపుగాఁ జెలఁగి ప్రజ్ఞాపూరపారీణుఁడై
నానాస్త్రప్రతిరోధియౌ గిరిసుతేశుం జెప్ప నన్నేమునన్. ౩

పంచచామరము. బలా! బలారి గర్వమంద వాని బాహుబంధ ముం
దలిర్చి దేవతాళి గొల్వ దాంతమూర్తిఁ దాల్చితౌ
చెలంగి లోకమేచి కాల్చు చిచ్చుబోలెఁ గ్రాలు నా
హాలాహలంబు మ్రింగు నీకు హా, విభుత్వ మొప్పదే! ౪

క. పరమదయాకరుఁడగుటను
బరాత్పరుఁడవనుచు నిన్ను బ్రణుతింపనగున్
హరిహర భేదంబులచే
విరిసి లోకమెల్ల నీవ విభుఁడఁ జెలఁగుడా. ౫

స్రగ్ధర. ఏ శ్రీదేవళ్ళివో డయ మిత్రశరమనఁగ లే దీప్రపంచంబుఁ దా
లోకంబై నీదుదీప్తి జ్వలితము, నిరాలోకమై గాసినొందున్
శ్రీకంఠఖ్యాతినొందన్ ద్రితజనులఁ గృపాదృష్టి తత్రం గావ నీకే
కా కేయేకాకికొప్పు న్ఘనవిరయతమసాండకోట్యర్క! శర్వా! ౬

మ.స్ర. లయవేళావేళలీలాలహరిఁ బొగడ నేలాపనాళోటి కట్టున్
వియదుర్వీమధ్యమం దుద్విజితజనతమో విభ్రమం బాఁచి బాహా
ద్వయిచే నాకాశమంతంతనె నిరోపి దిశావారముం ద్రోచి పాద
ద్వయిచే భూమీతలంబు న్వనధి మునిఁచెదో భావభూగర్వహారీ! ౭

ఉ. వేదములెల్లఁ దావకవిభేదముఁ దెల్ప ననంతశాఖలై
యాదియు నంతముం గనని యందగ వర్ధిలియు న్వ్రతమోవ్యపా
వాదములయ్యె నిద్దెలుపు పట్టునఁ గానఁగరాదె నాదు నీ
భేదము దేవ! యోగిజనవేద్య! గిరీంద్రసుతామనోహరా! ౮

శా. శ్రీశాదులకైన నీమహిమము ల్చింతింపఁగా వచ్చునే
శేషుండైన భవద్వియత్కథనలు న్లేదే కదా! లోకముల్
ల్లోకంబైన భజింపఁగాని నిను నే లీల న్భజింపంగ లే
దో శశ్వద్దయమానమానస! విభో! యోచంద్రచూడామణీ! ౯

చ. భవుఁడు భవార్తిహారి యపవర్గసుఖప్రదుఁ డవ్యయుండు స
త్సవనఫలప్రదాత దితిజన్మకృతాంతుఁ డనంతుఁ డాద్యుఁ డు
ద్భవరహితుండు భావభవభంజనుఁడంచు నిను న్నుతింతురో
శివ! బుధవర్యులెల్ల సురశేఖరిణీధర! చంద్రశేఖరా! ౧౦

చ. హరియనియు న్స్రష్టరుండని యహర్యసుతామణి లక్ష్మియున్ సురే
శ్వరుఁడనియు న్మఖి న్విమతి సల్పి ఫలంబుల నొందనెంతు కీ
వరుస నిజంబె దేవతలవంగడ మింతెటి దున్న దేవుఁ డా
శ్శంకరుఁడను ప్రాంతపల్కు నడికారము లొప్పున చంద్రశేఖర! ౧౧

ఉ. సత్తు నసత్తునాఁ బరగు సారపదార్థయుగమ్ము నీవకా
సుత్తమయోగులెంచెద రనుత్తమధీవిభవంబున న్పురే
శోత్తమ! తథ్యమేని భువి నొక్కటి రెండగు టెట్లొ తెల్పి నా
మత్తఁ బాఁచి కావు మణిమ్రప్రభిమాకర! చంద్రశేఖరా! ౧౨

ఉ. ఆకృతిహీనుఁ డంచు నొకఁ డాడు గుణాకరుఁ డంచుఁ బల్కు నొం
డో కరుణాకరా! భవదనూనమహామహిమంబు లెన్నఁగా
నా కమలాక్షుఁ డోపఁడన నన్యుల కెంతటిశక్తి సర్వలో
కైకనివాస! వాసవముదాపహరా! శివ! చంద్రశేఖరా! ౧౩

చ. ఒక త్రుటిలోన లోకముల నోపికమై సృజియించి మన్చి వే
ఱొక త్రుటిలోన మాపుదట! యొక్కని కింతటి చేఁత లొప్పునే!
పకపక నవ్వి దానవుల భస్మము సేయుట నీక చెల్లఁగా
క కలుషభక్తపోష! సుగుణాకర! శంకర! చంద్రశేఖరా! ౧౪

ఉ. అన్నము లేకయున్న ననిలాశనులై చరియింపవచ్చుఁగా
కెన్ని విధంబుల న్విషము నెవ్వరు నెన్నఁడు మ్రింగనోపరీ
కెన్నిక గాలకూటవిష మెట్లు భుజించితివయ్య! సంశ్రితా
పన్నశరణ్య! నీకతగు భక్తులఁ బ్రోచుట చంద్రశేఖరా! ౧౫

స్రగ్ధర. ఏదేవాధీశ్వరుం డెల్లెడల వెలుఁగుఁదా నింతభేదంబు లేకిం
ద్రాదు ల్గానంగలేరే యధిపుమహిమ మవ్యాహత ప్రజ్ఞ లున్నన్
గాదిక్షాంతాదిమంత్రాక్షరము లెవని యాకారరేఖావిలాసం
బా దివ్యజ్యోతి శంభుం డహరహముఁ గృపాస్వాంతతన్నన్ను నోమున్.

శా. రాజార్ధంబుఁ దల న్ధరించి గిరిజారాజాననన్ దేహమం
దోజ న్నిల్పి గణాధిరాజ సతులాభ్యర్చ్యత్పాహతం జూచిరా
రాజద్వైతు గముల్గమారు సెడ సంక్రాంతంబుగాఁ జేయు నా
రాజన్మూర్తి శివుండు భక్తిసిరి యాక్రాంతంబు నన్నేమెడున్. ౧౭

ఉ. శ్రీమదుమామనోహర! వశిప్రవరప్రతి పద్యమాన ని
స్సీమ మహామహత్త్వ! సురశేకరిణీలసదుత్తమాంగ! దు
ష్కామజదైత్యభంజన! లసన్మృగచర్మవసాన! దేవదే
వా! మము దుఃఖవారినిధిపారముఁ జేర్పుము చంద్రశేఖరా! ౧౮

గీ. విషము తినుటఁజేసి విషధరముల మేనఁ
దాల్చుచుంటఁజేసి తద్ద జడిసి
యమృతకిరణు నొసలందు ధరించితే
పామువిసము వీడ వలదె శర్వ! ౧౯

సీ. నొసలసెగడుమంట విసము గళమ్మున, మేనసెల్ల గాలిమేఁపరి సెక
వీని సైపనోపకాని తెయూచల, జేయిఁ, గదలిచూలి, సెసఁగ రుద్ర!

కం. తలరేఁటిన నొదవెడునో, తలయేరు న్వలియు, సేలతాల్చితి వేస్తం
బులలవను చర్మముల, నో, కిరిమిట్టం దొర్లెదేల గిరివరశయనా! ౨౧

గీ. తిరిపెమూఁడుతినుటనెజీయుపునక నీరు, త్రావుటకుమరోసిచావుఁగోరి
విసముమ్రింగి కాటవిసవిసఁ దిరిగెదు, నీకు చావుగలదె నీలకంఠ! ౨౨

శివులు

ఉ. శ్రీమదజాండభాండములఁ జేయుచునుండు నెదం దలంచి ని
స్సీమ మహావిభూతి నజశేషులకైన నెఱుంగనీయ కా
భూమకపాల రూపమునఁ బొల్పగ నెల్లయెడ దామరైన యా
శ్రీమదుమా మహేశ్వరు లశేష సుఖంబులు మాకొసంగుతన్. ౨౩

చ. ఎవరు చరాచరంబులకు నీశులు కర్తలు హర్తలు న్స్వయం
భవులు భవార్తిదూరులు శుభస్థితి హేతువులెవ్వరే మహో
త్సవము లొసంగి భక్తులను సంతతసౌఖ్యము లిచ్చి ప్రోతురా
భవుఁడు భవానియు న్సకలభవ్యము లెప్పుడు మాకొసంగుతన్. ౨౪

అంబిక

స్ర. శ్రీశానాదిదేవాశ్రిత పదకమలన్ శిష్టరక్షావిచక్షుం
గాశీవాస న్సదాభ్యాగత జనదురితాఖండతాప ప్రణాశన్
శ్రీశక్త్యాద్యర్చితాంఘ్రిశ్రితజనవరద స్ఫూర్తిమహేశాంకదేహా
వాశక్తింబూజ నేతుం బరమలలిత నేథక్తితాత్పర్యయుక్తిన్. ౨౫

ఉ. సర్వజగద్విధానచణచారువిభూతిఁదలిర్చి బ్రహ్మనై
గుర్వనవోద్యమంబున వికుంఠతలేకుఁడునాఁ జెలంగి యా
శర్వుఁడు నావెలింగి లయచర్యలఁ జూపెద విట్టి చెయ్దముల్
పార్వతి! నీక చెల్లమునివాక్యనసా విషయప్రశక్తికిన్. ౨౬

మ. జలరాశిప్రతిమానమా భవమునం జాంచల్యమంబూని నే
వలసత్వంబున నీపదాంబుజముల న్ధ్యానింపలేనైతిఁ జి
ద్విలసత్పూర్ణకృపాతరంగముల సద్విజ్ఞానమొందించి యో
లలితాంబా! నను నెప్పుడు న్మనముతో లాలించి పాలింపుమా. ౨౭

చ. హరిహరపద్మభూరుచిరహారశిరోమణి దీప్తులగ్నమై
చిరము భవత్పదాబ్జము లిసీ కననీక చెలంగుచుండ నే
పరణి భవత్పదంబులకుఁ జాటిలి మ్రొక్కెడువాఁడ నమ్మరో!
వరదయ నన్నుఁ బ్రోచుట నివార్యము నీకుఁ బురారిభామినీ! ౨౮

సీ. మహిషమానవాదు మర్దించి తనిరెదు, మాటనిజమె తల్లి చేటికైన
మన్మనోతిపంకమగ్న మాత్సర్యాది,మహిషనితతిని బరిమార్పలేని. ౨౯

ఉ. శుంభనిశుంభదైత్యు లతిశూరులఁ ద్రుంచితివంచుఁ బల్కెడీ
జంభము లేల నాకడ విశాలమృషాంధమదీయచిత్త మా
దంభమదాది దుష్టపరితఃపరివారితమై యొసంగ నో
బంధురనీలవేణి! పదపద్మముల న్మతియింతుఁగావవే. ౩౦

శా. అంబా! నీకడనాకు డాఁపరిక మేలా చెప్పెద న్మన్మనో
జంబాలంబున మోహమాహిషపిశాచం బెప్పుడు న్గోప్పగా
డంబంబూని చరించు దాని దునుమాడన్లేనిచో నిన్ను నే
నంబా! యెట్టునుతింపవాఁడ నిపుడాహా! తథ్యమూహింపుమా. ౩౧

ఉ. తల్లిరో! నీదుపిల్లఁడిటు తల్లడమందఁగఁ జూచుచుంటనీ
కిల్లపమే మదిం గరగకుండెనె ప్రేమ యొకింతలేక చే
యుల్లలపాటులేదె యొదనుంపఁ దలంపవదేల పిల్లలం
గల్లలపాలుసేయుటది కార్యమెనీకు జగత్కుటుంబినీ! ౩౧

చ. పతిసగఁబాలుగొన్న బహుభాగ్యము, తారకు నుక్కడక్కఁగా
నతులమహానుభావు సుతునందినగొప్ప, సురేంద్రునైనఁదన్
నుతియొనరింపఁజేనిఁ గడునొంచెదు బొమ్మనుజేయుసొంపునీ
కతగు గిరీంద్ర కన్య! చిరకాలము ఘోరతపంబుసేయుటన్. ౩౩

గీ. నీకు రూపమున్న నిఖిలలోకేశ్వరి!
కానరా కదెట్లు కనవఁగలవు
మంత్రమాకృతి యని మహితసంయములంద్రు
దానఁ గావఁగదవె ధ్యానరతుల. ౩౪

కం. అమ్మా! నీపూజకుఁ బూ
లిమ్మహి నెందేగి యెట్టులేఁ దెచ్చెదఁగా
నోమ్మా! మన్మానస ప
ద్మమ్మతి వికసితము భక్తి మకరందంబున్. ౩౫

క. అంబ! భవత్పదయుగసే, వం బరమసుఖంబు గల్గ భావింతునె యా
పుంబాకశాసనాదుల, డంబైశ్వర్యాధికుల విడంబనసేకులన్. ౩౬

శా. లోకాలోకపరీత భూమితల మేలోకైకమాన్యకటా
క్షాకల్పంబునఁదేజరిల్లు హరిరుద్రాజుల్ నిరావేశులై
రేకల్యాణికృపం జెలంగుదురు శ్రీహ్రీంకారమంత్రాత్మకం
శేకాంతామణిరూప మాగిరిజ మమ్మేకాలముం బ్రోచుతన్. ౩౭

క. ఓంకారపంజరవిహగి
శ్రీంకారపదాబ్జసమదసింహాసన శ్రీ
హ్రీంకారరూప ఐంహ్రీం
శ్రీంకల్పితమూర్తి మాకు సిరుల నొసఁగుతన్. ౩౮

శా. అంభోజాసనవాసవాది దివిజౌఘావీతరత్నాంబరా
దంభోపాయనము ల్గ్రహించు భవదుద్దామప్రభుత్వంబునన్
రంభావల్కలమట్లు లిచ్చితిదె ధీర స్వాంతవృత్తిన్ సదా
శంభూ! పార్వతి! నాదుపద్యముల నాశ్చర్యంబుతో నందుఁడీ. ౩౯

గీ. అర్తిహరులు శివులు, హరిసురేశులకైన
వారిఁ బొగడశక్యమె, భవవిమోక్ష
కాంక్షఁదవిలి భక్తి కడలూఁది యిటు నెన్నె
కత్తి సాంబమూర్తి కలితభక్తి. ౪౦

# శ్రీకృష్ణుడు-గయోపాఖ్యానము

పాలకోడేటి వెంకట్రామ శర్మ గారు, బి. ఎ.

మానవ జన్మమెత్తి ప్రజాసమూహమున కుపకారము గావించిన అవతారపురుషులలో శ్రీకృష్ణుడు ఉత్తముడని పలువురు చెప్పుదురు. విష్ణ్వంశసంభూతులగు శ్రీకృష్ణశ్రీరాముల చరిత్రలు హిందూసంఘమును చిరకాలమునుండి పోషించుచున్నవి. వారిజీవితము బహువిపులముగా వ్రాయబడి పలువురచే పఠింపబడు చున్నది. హిందూబాలురు బాలికలుకూడ వీరిచరిత్రమును గ్రహింపక నుండజాలరు. హిందూమతమంతయు వీరి చర్యలపై నాధారపడిన ట్లగపడును. శ్రీరామశబ్దమును శ్రీకృష్ణశబ్దమును ప్రతిహిందూగృహమందెల్లపుడును తాండవమాడుచుండును. శ్రీరాముడు బహుసాధువు; న్యాయ పరిశీలుడు; సుగుణమూర్తి. మఱియు బాహుపరాక్రమమందు సత్యసంధతయందు ఏకపత్నీవ్రతమందు దుష్టశిక్షణమందు పరిపాలన శక్తియందు అద్వితీయుడు. శ్రీకృష్ణుడు సాధుపురుషుడు గాడు. ఎల్లప్పుడును యుక్తులను పన్నుచు దుర్మార్గులను శిక్షించుచుండును. యుక్తిచే నితరులగుణములను ఊహలను తెలుసుకొనగల శక్తిగలవాడు మఱియు శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, మహాభారత యుద్ధములో పాండవుల కాతడుగావించిన అపరిమితసహాయము, దుర్మార్గులగు శిశుపాలనరకాసురజరాసంధాదిరాక్షసులను బరిమార్చి దేశమును ప్రజలను ఉద్ధరించుట, అతడు అర్జునునితో గావించిన సంవాదసారాంశమగు భగవద్గీత మొదలగు చర్యలు ప్రజలదృష్టుల నాకర్షించెను. అందుచే నాతడు అందరిచే పూజింపబడుచుండెను.

అట్టి భగవత్స్వరూపుడనబడు శ్రీకృష్ణుని ప్రజలు వివిధవిధముల పూజించుచుండగా ఇప్పటిబాలురలో నీతివాదులు కొందఱు ఆతనిచర్యలలో కొన్నిటిని ఖండించి భగవత్స్వరూపుడగువాడు అట్టి పనులు చేసియుండడని వాదించుచున్నారు. శ్రీకృష్ణునిచర్యలలో ఖండితములని చెప్పబడెడు ముఖ్యాంశముల నిచ్చట పొందుపఱచుచున్నాను. (1) శ్రీకృష్ణుడు బావమఱదియగు శిశుపాలుడు వరించిన కన్యను వివాహమాడుట, (2) ధర్మరాజును అసత్యము పలుకవలసినదని బోధించుట, (3) భీమునకు దుర్యోధనుని తొడమీద కొట్టి చంపుమని కనుసన్న జేయుట, జరాసంధాదులను యుక్తిచే చంపుట మొదలగు కృత్యము లన్నియు భగవత్స్వరూపుడగు శ్రీకృష్ణుడు చేయదగినపనులు కావని నీతివాదులు చెప్పుదురు. శ్రీకృష్ణుని చర్యలరీతిని గమనించుటకు ఇది సమయముగాదు.

కాని గయోపాఖ్యాన కర్తయగు శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, శ్రీకృష్ణుని సామాన్యమానవునిగా తలచిరా లేక భగవత్స్వరూపుడని బోధించిరా యని యాలోచింపవలసి యున్నది. పార్థుడు శ్రీకృష్ణుని చర్యలను మందలించునటుల యీనాటకమందు సృష్టింపబడెను. పార్థుడు కోపావేశముచే ఒడలు తెలియక శ్రీకృష్ణుడు గావించిన చర్యలనన్నిటిని ఏదోవిధముగ ఖండించెను. మహానుభావుడగు శ్రీకృష్ణుడు తాను గావించిన సత్కార్యము లన్నియు అవమానకరములని పార్థుడు తలంచుటగాంచి ఆశ్చర్యపడెను. వాటికి తగు సమాధాన మీయకపోయెను. కాని ఆతని ఆశ్చర్యము మందహాసము చూడ శ్రీకృష్ణుడు పార్థుని అజ్ఞానుడని తలంచినటు లగుపడుచుండెను. శ్రీకృష్ణుడు ఎత్తిపొడుపులచే పార్థుని కోపమును రెచ్చజేసెను. పార్థుడన్న మాటలకు కొన్నిసమయముల శ్రీకృష్ణునకు పట్టరాని ఆగ్రహము గల్గెను. ఇట్లు ఆగ్రహము గలుగుటచేతను విదూషకుడగు కౌశికునిచర్యలచేతను రుక్మిణీ సత్యభామాదుల నడవడికలచేతను ఈ నాటకమందలి శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడా లేక క్షత్రియవీరుడాయని ఆలోచింపవలసి వచ్చును.

ఆగ్రహమును పొందనంతవఱకు శ్రీకృష్ణునకు ఈ ప్రపంచ నాటకమంతయు లీలగా నుండెను. కాని ఆగ్రహము గలిగినచో చక్రాయుధమును ప్రయోగించుటకు సిద్ధమగును. మహాభారత యుద్ధమందుకూడ తనప్రతినకు విరుద్ధముగా మిక్కుటమైన కోపముచే చక్రాయుధమును ప్రయోగింప సమకట్టెను.

భగవత్స్వరూపుండగు శ్రీకృష్ణునకు ఇట్టిగుణము లుండవచ్చునా, భక్తవత్సలుడగు గయుని సంహరించుట తగునా యని పలువురుచేయు పరిహాసమునకు యీకవి యిట్లు సమాధానము నాంద్యంతమున చెప్పియుండెను.

"మ. వసుధన్ బుట్టినవారిలో నొకడు సర్వజ్ఞుండు లేడెందు, మా
నిసి కావించిన కార్య మెట్టిదయిన న్నిర్దుష్ట మానంట వి
శ్వసనీయంబగు మాటగాదు; కృతులో ప్రాశస్త్యముం గాంచినన్
రసముం జిమ్మిన చారుకావ్యములె కాన న్దోషభూయిష్ఠముల్.

గీ. చిందుదివ్వెలతోడ క్రీనీడలట్లు
యలరు గురువెందపూసల నలుపునట్లు
గుణగణములోడ దోసముల్ గూడియుండు
ప్రాజ్ఞులు క్షమియింతు రితరులు పరిహసింత్రు."

మానుషజన్మమెత్తినతరువాత ఎంతధీమంతుని చర్యలయందైనను పొరపాట్లుండకపోవు. హరిహరాదులు సత్కార్యములు గావించి ప్రజాసమూహమున కుపకారము గావించుటకై భూలోకమున నవతరించినపుడు మానవ సాంఘికాచార సంపర్క-

ములచే ప్రజాసమూహమున క్రమక్రమముగా ప్రవర్తించవలెను. ఏకాలమున వారవతరించిరో ఆకాల సాంఘికనిర్ణయములను పాటించి సాంఘికదురాచారములను ఖండించి దుర్మార్గులను శిక్షించినపుడే ఆసక్త దేశోద్ధారకుడనియు భగవత్స్వరూపుడనియు పిలువబడును. అట్టిలోపములే లేకున్నచో మానవసంఘమం దాసక్త గౌరవముతో సంచరింపజాలడు. అవతారపురుషులందఱు నట్టివారే. ద్రౌపది పంచ పాండవులను వివాహమాడినను ఇప్పటి ఆచారముల ననుసరించి అట్టి చర్య అవమానకరమైనదైనను కాలము ననుసరించి ప్రవర్తించుటచే శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడైనను ఆవివాహమును ఖండించలేదు. ఇటులనే అవతారపురుషులలో స్వల్పలోపములను పాటింపరాని దోషములను మనము చూచుచున్నారము. రామునియందును బుద్ధుని యందును దోషములు బహుస్వల్పము. వారియందైనను కొన్నిలోటు పాటులు అగుపడుచుండెను. ఏసుక్రీస్తు మహాత్ముడు, గాంధియు అట్టి అవతారపురుషులే. ఇట్టి మహాపురుషులను భగవత్స్వరూపులందు దోషములుండినను ప్రాజ్ఞులు వాటిని పాటింపరు.

ఈకవికి విశ్వరూపమగు శ్రీకృష్ణునియందు భక్తి విస్పష్టము: వీరి నాటకములందు శ్రీ కృష్ణుని చర్యలను వర్ణించుట సహజము. ఈ గయోపాఖ్యాన నాటకమందు శ్రీకృష్ణుని బాల్యదశయు గయుని మూలమున శ్రీకృష్ణునకును పార్థునకును జరిగిన సంవాదమును సంరంభ మును వర్ణింపబడెను. తాత్కాలికముగా శ్రీకృష్ణునకు తనస్త్రీబృంద ముతో ఎట్టిసంబంధముగలదో శ్రీకృష్ణుడు గావించిన చర్య లెట్టివో, శ్రీకృష్ణునిబల మెట్టిదియో బహుచమత్కారముగా బహుజనులు చిర కాలము నానందించునటుల వర్ణింపబడెను. మానవలక్షణములందు యింగ్లాడు నాటకకర్తలలో షేక్సుపియరున కెట్టిపరిచయమో అట్టి పరిచయము ఆంధ్రదేశమునం దీకవికి గలిగినట్లు మరెవరికిని లేదు.

శ్రీకృష్ణుని ఆగమనమునుగురించి సాత్యకి ఇట్లు చెప్పుచున్నాడు. శ్రీకృష్ణుడు బాల్యంబున కొంతకాలము వ్రేపల్లెలో నందయశోదల పెంపుడుబిడ్డడై పెరిగెను. ఆయన నిప్పుడు చిన్ననాటి తల్లిదండ్రులగు నందయశోదలు చూడగోరి పిలువనంపిరి. వృద్ధులగు గోపాలకమాతా పితలను సందర్శించుటకును శైశవంబున దనకుం గ్రీడాస్థానమైనయమునలో సకుటుంబముగ జలక్రీడామహోత్సవము సలుపుటకును సంకల్పించి యదుకుంజరు డిపు డీబృందావనమునకు విచ్చేసియున్నాడు. ఇపుడే మేలుకాంచి, కాల్యకృత్యంబుల నిర్వర్తించి ప్రాభాతికమందసమీరం బుల నించుక సేవించి, ప్రభాకరునకు విధివిధానముగ నర్ఘ్యప్రదానము చేసి, యనంతరము జలకేళి సలిపి సాయంకాలమగునప్పటికి వ్రేపల్లె కుంజని, తల్లిదండ్రులదర్శనముచేసికొని, మూడునాళ్లచ్చటనుండి ద్వార కకుంబోవును. ఇట్లు ఎన్నడో పెంచిన ముసలిగొల్లలజూచుటకై బయలు దేఱుట శ్రీకృష్ణుని సుగుణమును వెల్లడిచేయుచున్నది. శ్రీకృష్ణకౌశి కుల సంవాదముచే శ్రీకృష్ణుడు హాస్యశృంగారరసములందు పరిచయము గలవాడని బోధపడుచున్నది.

శ్రీకృష్ణుడే తనబాల్యస్థితి ఇట్లువర్ణించుచున్నాడు. నాజనకుడు వసుదేవుడు నేను జనియించిన కొన్నినిమేషములకు నాకు లోకత్ర యనృశంసుడగు కంసునివలన ప్రాణాపాయంబు శంకించి శిశువగు నన్ను నొడినిడికొని యర్ధరాత్రంబున మధురాపురంబునుండి వ్రేపల్లెకుం జని పురుటాలగు యశోదాదేవిమంచమున నన్ను బెట్టి యెవరు లెఱుంగకుండ నమ్మహాశక్తి దరుగుటయు, నేను నందునియింటఁ బెరుగు టయు జగద్విదితవృత్తాంతములుగదా! ఆదినములలో.

చ. బుజములఁ జద్దిచిక్కములు మోవిని బిల్లనగ్రోవి మూతి న
క్కజముగబ్రాకిబ్రారతులు కంఠమునం గురివెంద పేర్లు కా
ళ్లఁజిఱుతగజ్జియ ల్గరముల మ్మనికోలయు నొప్పియుండఁగా
నిజముగ గొల్లకందునయి నే నిటఁగాచితి నాలమందలన్.

ఉ. హాయిగ మేపి పచ్చికబయళ్లను గ్రేపుల, నిమ్మహానదీ
తోయములం గుతూహలముతో జలకేళియొనర్చి సందమల్
సేయుచు నాకులంబుఱచి చిక్కములన్నియువిప్పి, యీతరు
చ్ఛాయల నారగించితిమి చల్దుల బువ్వము బంతు లాడుచున్.

అనంతరమందు

మ. అనుమానంబులు లేని డెందములతో, నాయాస మెక్కింతచెం
దని నెమ్మేనులతో, విముక్తకచబంధశ్రేణితో, నొండొరుం
గనుచుం బిల్చుచు నేరుచుం దుముకుచు న్వీక్షించుచుం గానసై
క్కన చెట్టెక్కక యాడుకొంటి మతిరక్తిన్ గోతికొమ్మచ్చులన్.

సీ. ముద్రిజేసిన లక్కబొమ్మలోయనఁ బసుల్
నెమరువేయుట మాని నిలిచియుండ
మంత్రౌషధంబుల మహిమంబుచేబలెఁ
ద్రాచుపాములు మెచ్చి తలలుద్రిప్ప
జాబిల్లి వెలుఁగులు జంద్రకాంతములట్లు
చేరువశిలలెల్లఁ జెమ్మగిల్ల
వనకారునంబలె ననువొప్పఁ జిగురించి
మోడుమ్రాకుల వెండి మొగ్గదొడుగ
హరిణములుగూడి పారవశ్యమును జెంది
చలనములు మాని మోదబాష్పములు విడువ
నీపమహీరుహశాఖపై నెక్కి తొల్లి
మురళి మ్రోయించితిని జగన్మోహనముగ.

ఇట్లు శ్రీకృష్ణునిచర్యలను అతిమనోహరముగ అమందానందమున చిత్రలేఖనముమాదిరి కన్నులకు దృశ్యమగునటుల మిగుల రసవంతముగ వర్ణించెను.

మఱియు పలువురచే శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడని పూజ నీయుండని చెప్పించెను. తెరలోని వైతాళికుం డిట్లుపలుకుచున్నాడు.

మ. నినుధ్యానించి విముక్తులౌటకు మహానిష్ఠాగరిష్ఠాత్ములై
చనుచున్నారు మునీంద్రు లీయమునలో స్నానంబు గావింపఁగా
నినుసేవించి కృతార్థులౌటకును క్షోణీనాథు లిందందుఁ జే
రినవా రీవనమందు మేలుకొనవే కృష్ణా! జగన్నాయకా!

తమ్ముడగు సాత్యకియు అన్నగారగు బలరాముడును భార్యలు సత్యభామా రుక్మిణులును సోదరియగు సుభద్రయు కాశికాద్యనుచరులును శ్రీకృష్ణుని విష్ణ్వంశ సంభూతుడని పిలుచుట యొక యాశ్చర్యము గాదు. తమకు నిర్హేతుకజాయమానకరుణాకటాక్షముతో సహాయపడుచున్న శ్రీకృష్ణుని పాండవులు పూజించుటయు సహజమే. కాని గయుడుగాని పుష్పదంతాదులుగాని యమునాతరంగిణిగాని బ్రహ్మాదులుగాని శ్రీకృష్ణుని పూజించుట అతనిగుణవిశేషముచేత నని చెప్పక తీరదు.

సాత్యకి తనఅన్నయగు శ్రీకృష్ణుని మహాత్ముడనియు త్రిలోకైకపూజ్యుండనియు భగవత్స్వరూపుడనియు సంబోధించెను. వైతాళికుడు మునులు చక్రవర్తులు భగవంతుడగు జగన్నాయకుని పూజించు నిమిత్తము వేచియున్నారని చెప్పెను. కాశికుడు శ్రీకృష్ణుని జగత్త్రితయైక పూజ్యు డనెను. సహదేవుడు శ్రీకృష్ణుని సకలలోక సౌఖ్యసంధాయకుడనియు జగన్నాథుడనియు, అర్జునుడు శ్రీకృష్ణునిగూర్చి యాపద్బాంధవుడనియు, అనిర్వాచ్యప్రభావుండగు మహానుభావుడనియు, గాండీవాదిమహాదివ్యాయుధసంప్రాప్తికారకుడనియు, పాండవక్షేమంకరుడనియు విపులసభాంతరాళమున కౌరవులు పాంచాలీవస్త్రాపహరణము సల్పుచుండ మనల కటాక్షవీక్షణంబున రక్షించినవాడనియు, భీముడు,

ఉ. గంధగజేంద్రతుల్యబలగర్వితృణీకృతశాత్రవుఁడా జరా
సంధు నెదుర్చు నాఁడును విషాదమెఱుంగ నొకింత లేని ద
ర్పాంధులు కౌరవుల్ వనికి నంపిన నాఁడును గుండెఁగాని స
ద్బంధుఁడు కృష్ణుఁ డీడ్డు పగవాఁ డగువంతను గుందదక మదిన్.

అనియు, నకులుడు,

తే. గీ. మహిత కార్యగతులు దెల్ప మంత్రియగుచు
శుభము లొనగూర్చు గారాబు చుట్టమగుచు
నాపదలయందుఁ బాయని యాప్తుఁడగుచుఁ
జెలఁగు హరి దాయయగు నన్నఁ జింత గాద.

అనియు, యుధిష్ఠిరుండు శ్రీకృష్ణుని లోకైక పూజ్యుడనియు, జగత్త్రాణుండనియు, వైకుంఠేశు డైనట్టి సరసిజాక్షుడనియు, దైవమనియు, సద్గురుండనియు, మధుసూదనుండనియు, హరియనియు చెప్పుట చూడ పాండవులకు శ్రీకృష్ణునియం దెట్టి అభిప్రాయముగలదో తెలియగలదు.

ఇక గంధర్వులలో పుష్పదంతుడు శ్రీకృష్ణుని భగవంతుడనియు, చిత్రరేఖ

తే. గీ. దేవకీసూతి సుజనవిధేయుఁ డంద్రు
భక్తవత్సలుఁ డంద్రు కృపాళుఁ డంద్రు
అసురకంటకుం డొకఁడైన యతని చక్ర
మనపరాధుల మీఁది కెట్లుసగునొక్కొ! యనియు,

గయుడును శ్రీకృష్ణుని శిష్టవత్సలుఁడనియు, నీ వాసమయంబున మహీతలంబున నున్నవార్త విన్న నీచరణాబ్జంబులకడ వ్రాలక మిన్నకుందునే" యనియు "నీ సందర్శనముకంటె సత్యలోకావలోకన మెక్కుడు ఫలదాయకమే యనియు, నీవు భక్తుడననియు, అన్యకాంతలు తల్లులని మనంబున నెంచు పరమపావనుడును, అపకారులకునైన హానిచేయఁగలేని పరకృపాళుండును, మూడుమూర్తులసేవ ముప్పొద్దులాచరించుభక్తశేఖరుండును, జగము గ్రుంగినగాని సత్యంబుదప్పని ప్రథమాన కీర్తిమంతుడును, వేదములు నాల్గు శాస్త్రంబు లారు నొకటి క్రమత నేర్చిన ఘనుడును, అయినట్టి గయుడు, చక్రాంకుఁడు వధియింపఁ బ్రతినఁబూన హరిసవాహనుఁ డాటంకముచేసి శరణు నొసంగఁజాలునే యనియు, భగవంతుడును, త్రిమూర్త్యాత్మకుడును, త్రిలోకోపకారపరాయణుడును యశోవంతుడనియు, సర్వప్రపంచంబున విష్ణువ్యాపకము లేనితావు కలదేయనియు,

సీ. పాతాళమున కేగి బ్రతుకవచ్చు నటన్న
బలిచక్రవర్తి నన్బట్టి యిచ్చు
మర్త్యలోకముఁ జేరి మనవచ్చు ననుకొన్న
నాలోకమునఁ గృష్ణుఁ డవతరించె
స్వర్గలోకముఁ జొచ్చి సౌఖ్య మొందెదనన్న
సుత్రాముఁ డాతని సోదరుండె
నక్షత్రపథమున నక్కియుండెద నన్న
భానుమండలమునఁ బరగు నతఁడు
ఆకాశగంగలో నడఁగియుండెద నన్న
నతనిపాదములందె యది జనించె
జలధినాయకు వేఁడి శరణుఁ జొచ్చెద నన్న
వటపత్రశాయియై యటవసించు
వనభూములందున వసియించెద నటన్న
నగ్ని నన్మ్రింగు నేకాహుతిగను
గుహలలోపల డాఁగికొనవచ్చు ననుకొన్న
సింహరూపము దాల్చి చెలఁగునటు,

తే. గీ. గడచె కైలాస సత్యలోకముల యాస
యెందుఁబోవుదు? గతియేమి? యెవఁడుప్రోచు?
బదియు నాలుగు భువనము ల్వెదకి చూడ
నేను దలదాఁచుకొనఁదగు నెలవు లేదు.

అనియు, ఓజగన్నాథా! ఓ దేవకీగర్భ జలధి రాకాసుధాకరా! ఓభక్తవరదా! నాపై నీకింత యలుక పొడముటకు నా నిష్ఠీవనకారణము తగిన కారణము గాదనియు విలపింపదొడగుట చూడ శ్రీకృష్ణునియందు గంధర్వుల కెట్టి అభిప్రాయము గలదో విశదపడుచున్నది.

ఇపుడు శ్రీకృష్ణునిగూర్చి మనమందరము గౌరవించు నారదాదుల అభిప్రాయముల తెలుసుకొనవలెను.

(తెరలో ఆకాశవాణి ఏమనిచెప్పెను.)

గీ. అవని భారము హరియింప యదుకులమున
నవతరించిన యాదినారాయణుండు
దేవకీసూతి నీతల ద్రెవ్వనేయఁ
జండతరమౌ సుదర్శన చక్రధార.

గయునకు సత్యలోకమందలి బ్రహ్మ యిట్లుపదేశించెను. "నీ చరిత్ర సింహమున కలంక పుట్టించి యేమఁగు శరణంబు వేఁడు లేడి కథవలె నున్నది. ప్రతినఁబూనినవాఁడు పద్మనాభుఁడు. ప్రయోగింపఁబడునది మహాచక్రము. అది యెవ్వరు నివారింపఁగలరు? అతఁడు మహావిష్ణువు, కాని మనుష్యుఁడు కాఁడు. అతని మహిమల సంగ్రహముగాఁ జెప్పెద వినుము.

ఉ. వేదము లుద్ధరించెఁ, బృథివీధరమెత్తె ధరిత్రిఁదాల్చెఁ, బ్ర
హ్లాదుని నేలె, నబ్బలివడంచెను, మాపెను క్షత్రియాన్వయం
బాదశకంఠునిం దునిమె నబ్ధికి సేతువుగట్టె, యాతఁడే
యాదవుఁడయ్యె భూభరము నంతయుఁ బాపఁగ ద్వాపరంబునన్.

తే. గీ. పద్మనాభుఁడు నినుఁగూల్ప బ్రతినదాల్చె
వాని కడుపునఁబుట్టు నర్భకుఁడ నేను
శరణ మెట్టులీయ నేర్తు నీసమయమందుఁ
గాచినను మానినను నీలకంఠుఁ డొకఁడె.

అచ్చటనుండి గయుఁడు కైలాసమున కేగి శంకరుని శరణు వేఁడెను. కాని ఆ మహాదేవుడు కూడ నాతనికి అభయమిమ్మట కంగీకరింపలేదు.

తే. గీ. నళినవాథు విరోధులు నాకు శత్రు
లతనిభక్తులు నాభక్తు లగుచునుందు
రతనికిని నాకు భేదము లేదరసిచూడ
నతనిపైరికి నీకెట్టు లభయ మిత్తు?

అతని చక్రప్రయోగంబు మరల్ప నాతఁడె సమర్థుండు కావున, నాతని పాదంబులే యాశ్రయింపుము అని మహేశ్వరుడు గయునకు సలహో నిచ్చుటజూడ శ్రీకృష్ణునిమహిమ లోకంబునకు విదితంబగు.

ఇన్ని కారణములచే గ్రంథకర్త యుద్దేశము శ్రీకృష్ణుని చర్యల ఖండించి అతనియందు భక్తిని లేకుండ జేయుటకుగాక శ్రీకృష్ణునియందు గల అపోహలను బోగొట్టి ఆ మహానుభావునియందు ప్రజలభక్తిని యీ గ్రంథరాజముచే ద్విగుణముగావించెను. మననాటకకర్తలలో ఇట్టి నేర్పు మఱియొకరియందు కానరాదు.

మనమింకను కొన్ని సందేహముల నివృత్తి చేయవలసియున్నది. భక్తుడగు గయుఁడు పొరపాటున నుమియగా శ్రీకృష్ణున కంత ఆగ్రహము గలుగుట న్యాయమా, పార్థుని తన్నుట న్యాయమా, యను విషయముల నాలోచించి ఈవ్యాసమును విరమింతును.

దుర్వారపరాభవజనితక్రోధంబున నిట్లనియుండ వచ్చునని పార్థుడు చెప్పెను. గయుఁడు, భీముడు, తుదకు పరమేశ్వరుడు గూడ నట్లనే తలచెను. కాని భగవానునికి అర్ఘ్యప్రదాన మిచ్చుసమయమున నిష్ఠీవనమువైచుట ఆగ్రహకారణమే యయినను భగవత్స్వరూపుడగు శ్రీకృష్ణుడు అట్టి అఖండప్రతిజ్ఞ దాల్చుట న్యాయమా? అందుచే పరమేశ్వరు డేమనెను?

చ. ధరఁగలవారి జూడకయె తా నుమియన్ గయుతప్పు; చూడకే
కరణి కొనర్చువాని నరకంగ మకించుట నీతితప్పు; తా
నరయక ముందుగా శరణు నాతని కిచ్చుట పార్థుతప్పు; నో
సరసిజనాభ! యక్కరణ సంధియొనర్చుట యొప్పు నిత్తఱిన్.

కృష్ణునిజూచి పరమేశ్వరుఁడు దేవా! ఈగయుఁడు నీకు పరమభక్తశ్రేణిలో చేరిన గంధర్వుడు. నీవు కావందగినవాడు. ఈయర్జునుండు నీకు రక్షణీయుఁడు, అని చెప్పెను.

శ్రీకృష్ణుడు అంతయు తెలిసినవాడయినను తన ప్రతిజ్ఞ ఎట్లు పరిహారమగును? అని అడిగెను. ఆ ప్రతిజ్ఞ ఏమన,

ఉ. ఈవిధి నద్దురాత్ము వధియింపక పోవుదునేని దేవకీ
దేవికి పుణ్యమూర్తి వసుదేవునకుం దనయుండఁగా నిఁకన్
ధీవినుతప్రభావుఁడగు దేవర కేనమజుండఁ గానిఁకన్
పావనమైనయట్టి యదువంశమునన్ జనియింపలే దిఁకన్.

అంతట పరమేశ్వరు డాప్రతిజ్ఞ నిట్లు సమర్థించెను.

సీ. దేవకీసుతుఁడవు గావు నీ వరయంగఁ
బురుషోత్తమా! స్వయంభువువు గాని,
బలభద్రుఁ డన్నఁగ భవదగ్రజుఁడు గాఁడు
నీపానుపగు ఫణీశుఁడు గాని,
యాదవు ల్గారు పీరఖిలేశ! నిన్ గొల్వ
క్షోణిఁబుట్టిన యట్టి సురలుగాని,
నరమాత్రుఁడవు గావు ధరణిభారము మాన్ప
నవతారము నుదాల్చు హరివిగాని,
యాదవుండవు గావు మహానుభావ!
మానవుండవు గాని నీమాటతప్ప
దీవు ప్రతిన దాల్చిన దెల్ల నీదృశంబు
యదిగో! సకలంబుఁ గనవయ్య! యంబుజాక్ష!

అని ప్రతిజ్ఞా పరిహారముగా దివ్యదృష్టిచేత క్షీరసాగరమును జూపును. అప్పుడు అందఱు సంతోషభరితు లగుదురు. గయార్జునులు క్షమింప వేడ శ్రీకృష్ణుడు యీనాటకమునకు కారణమిట్లు చెప్పును. గయుని భయపడకుమని వారించి, అర్జునునితో సమరకాలమున గోపావేశమున దానన్న మాటలను పాటింపవలదని శ్రీకృష్ణుడు బోధించి ఇట్లనెను.

మ. కుటిలాచారులు ధార్తరాష్ట్రులకు మీకున్ గయ్యమా దానికై
పటుశస్త్రంబులఁ దత్తదర్థ మయి సంపాదించితో లేదొ యం
చిటులైనం గనఁగోరి యీనాటకము నే నీలీలఁ గల్పించితిన్
భ్రుకుటిలోఁ గూల్చెద నీవు శాత్రవుల నోదుర్వారదర్పోన్నతా!"

ఆహా! ఎట్టిలీల సృష్టించెను? ఈలీలచే ఎంతమంది సుందిరి? విష్ణులీలలు గ్రహించుట నారద, బ్రహ్మ, శంకరాదులకే సాధ్యము కానపుడు సామాన్య మానవులమగు మనము గ్రహింపఁ గలుగుదుమే. కాని విష్ణులీలలు కొందఱు అమాయకులనుగూడ చిక్కులబెట్టునాయని సందేహము తోచెడు. పాండవాదుల ప్రాణములును సుభద్రాదుల ప్రాణములు నెట్లు నోచ్చెనోకదా. గంధర్వులందఱు గోలయై తిరిగదా! గయుండు చూడకుండ నుమియుటచే ఈ శిక్ష ననుభవింపవలసినదే.

ఆతని సత్యసంధతచే శుడకు సంతుష్టాంత రంగుడాయెను. అది ఎట్లనిన గయుడే యిట్లు పలుకుచున్నాడు.

మ. తపముల్ నోములు తీర్థయాత్రలు మహాదానంబులుం హోమముల్
జపముల్ యాగశతంబు పావననదీ స్నానంబు లెవ్వారి స
త్కృపకుం బాత్రములౌటకు న్నరుడు భక్తింజేయు నా దేవతా
ధిపులం గంటి నుమారమాపతుల నాదిష్టంబు సామాన్యమే?

ఇక పార్థుడు శ్రీకృష్ణునిచే తన్నులతినినను,

సీ. గజ్జెలందియలును ఘల్లుఘల్లుమని మ్రోయ
కాళీయాహి ఫణాళిఁ దాండవంబాడె నెద్ది?
భువన పావనమైన దివిజస్రవంతికిఁ
ప్రభవ కారణమౌచుఁ బరగె నెద్ది?
స్వారాజ్యమునుగొన్న వైరోచనునిఁ ద్రొక్కి
పాతాళభూమికిఁ బంచెనెద్ది?
పతిశాపవశమున గతిలేక పడియున్న
చదురాతివాతిగా సలిపె నెద్ది?
యాదిలక్ష్మి నిచ్చెడువేళ నబ్ధిరాజు
కనకపుం బళ్లెరంబునఁ గడిగె నెద్ది?
యట్టి నీపాదపంకజం బమలచరిత!
నాకతన దేహమునుదాఁకె నవసియుండు!

శ్రీకృష్ణుడు కాఠిన్యమువహించి ఎంత కన్ని చెప్పినను తనపట్టు వీడక, అమితాగ్రహము గలిగినటుల నటించుటచే సోదరులుగాని స్త్రీజనముగాని పాండవులుగాని సత్యమును గ్రహింపకపోయిరి. విష్ణుచర్య లు అతిసంధానలు దురూహ్యములు గదా. అంత కాఠిన్యమే చూపక పోవుచో పాండవాదులుగాని బలభద్రాదులుగాని యుద్ధసన్నద్ధు లగుటకు ముందంజవేయరు. దుర్యోధనాదులు తమబలములతో కపటమైత్రితో పాండవుల సహాయార్థము రాకపోవుదురు గదా. ఒక వ్యూహము పన్ని శ్రీకృష్ణుడు ఎన్ని సంగతులు కనిపెట్టగలిగె? తుదకు గయుడు గాని పార్థుడుగాని చంపబడలేదే. తనయొత్తిపాడుపులచే పార్థునకు ఆగ్రహము గలుగునటుల జేయుటకు శ్రీకృష్ణుడుయత్నించెను. సామ, దాన, భేద, దండోపాయములచే ఆతనిమదిని తెలుసుకొనుటకు శ్రీకృష్ణుడు యత్నించెను. తుదకు విష్ణ్వంశసంభూతుడగు తననే మార్చుకొనగల శక్తిగలిగినపుడు శ్రీకృష్ణుడు లోలోన సంతోషించియు తన నిజశక్తిజూపిన బాగుండునని మహా కోపముతో

శా. నేనే శ్రీహరి యంశ సంభవుడనేని న్విశ్వనిర్మాణ ర
క్షా నిర్మూల చణుండనేని యిదె లోకద్రోహి దైతేయసం
తానారణ్య దవానలాయితకరత్సౌదర్శన జ్వాలలన్
మేనింబాసి కిరీటి మస్తకము భూమిం ద్రెళ్లుగా భోరనన్.

అని చక్రము త్రిప్పుచున్న సమయమున శంకరుడు ప్రవేశించి వారిని వారించెను. ఆ చక్రఘాతి కాచువారు లేరు. ఇదంతయు శ్రీకృష్ణుని లీలయే. పార్థుని కిందుమీదులుగా శ్రీకృష్ణునిమహిమ తెలియుటయే

కాక తాము నర నారాయణాంశముల జన్మించిన విధమును చూచుట గలిగెను. మత్స్యావతారమును శ్రీకృష్ణుడు పార్థునకుజూపెను. తుదకు శంకరుని జూచుటచేతను తనప్రతినకు భంగము వాటిల్ల కుండుటచేతను శ్రీకృష్ణుడు తన్ను క్షమించుటచేతను కృతార్థుడాయెను.

పార్థుడు తుదకు తనసంతోషము నిట్లు వెలిపుచ్చెను.

తే. గీ. భిన్నమయ్యును నేకమై వెలయు నెద్ది
యేకమయ్యును భిన్నమై యొసఁగు నెద్ది
యమ్మహా దివ్యతేజంబు హరిహరులుగ
ద్వివిధమయి తోఁచె మనపుణ్య విభవమునను.

తా నరయుక శరణిచ్చినందున పార్థునకును తత్కారణమున పాండవులకును స్త్రీజనమునకును గలిగిన స్వల్పసంక్షోభమునకు యీఫలితము పదిరెట్లధికమైనదికాదా? యుధిష్ఠిరుడు శంకరునిజూచి చాల ఆనందము పొందెను. శంకరుని ఆశీర్వచనముచే పాండవులమంతయు పావనమాయెను. అతని కోరికలు ఫలించెను. ఎందులకనిన,

సీ. ఫాలనేత్రముతోడ ఫణిభూషణముతోడ
కాలకూటాంచిత గళముతోడ
బాలచంద్రునితోడ శూలాస్త్రముతోడ
మందాకినీల సన్మౌళి తోడ
ధవళదేహముతోడ నవవిభూతులతోడఁ
బ్రకట రుద్రాక్ష మాలికలతోడ
పునుక దండలతోడఁ బులికలాసముతోడ
మునికోటి నలరించు మూర్తితోడ
కరుణ వెదచల్లు కాంత విగ్రహముతోడ
భువనజాతిఁ దోలంగించు బుద్ధితోడ
తొల్లి పార్థునిఁ గృపఁగన్న భిల్లుఁడనాహా!
కనుల పండువుగాగ సాక్షాత్కరించె.

సీ. విసము మెక్కినవాని మిసిమి మెక్కినవాని
భజియింపఁగల మహాభాగ్య మొదవె
కరిఁగూల్చువాని మకరిఁగూల్చువానిని
సేవింపఁగల మహా శ్రీ లభించె
చర్మచేలమువాని ధర్మచేలమువాని
వినుతింపఁగల మహా విభవ మబ్బె
తెల్ల మేకగలవాని నల్ల మేకగలవాని
పూజింపఁగల గొప్పపున్నె మొదవె
ఎద్దునెక్కువాని గ్రద్దనెక్కెడువాని
సోమధరుని హరునిఁ గామధరుని
కన్నులారఁ జూచు కలిమి మా కొనగూడె
నొక్క నెలవునందు నొక్కమారె.

ఇట్లు గంధర్వులు, పాండవులు, యదువంశజులు, దేవతలు, సర్వవిధముల

యీ యుద్ధఫలితమును గాంచి సంతోషించిరి. మఱియు ప్రజాసమూహము సంతోషించుటకుగాను,

ఉ. పాడియుఁ బంటయుం గలిగి భాగ్యములతోఁ దులదూఁగుచుండి దా
రేడులు నిన్నుఁ గొల్చుచు మహీజనముల్ సుఖియింత్రుగాక! తా
రాడినమాటఁ దప్పక భయంపడివచ్చెడు వారిగాచుచు
న్వాడిదొరంగ కిందుక నృపాలురు మేదిని నేలుగావుతన్."

అని ధర్మరాజు కోరుటచే శంకరుడు దానికి అంగీకరించెను. ఈగయోపాఖ్యాన నాటకమందు శ్రీకృష్ణుని అనిర్వాచ్య మహిమచే సకలజనులు తృప్తిపొంది సంతోషభరితులైనటుల గ్రంథకర్త అన్వయించుటచే ఆగ్రంథకర్తయొక్క యుద్దేశ మూహ్యంబు.

శ్రీకృష్ణునిగూర్చి సద్వర్ణనగావించిన సుప్రసిద్ధగ్రంథరాజములలో నీ నాటకమును గూడ ఒకరత్నముగా భావింపవలెను. శ్రీకృష్ణుని గుణవిశేషము లింత మధురముగా వర్ణించగల కవులు అరుదు. ఈ గయోపాఖ్యాన నాటకము షేక్స్పియరాదుల నాటకములవలె మృత్యువులేనిది. మన సుప్రసిద్ధ ఆంధ్రనాటకములలో ఇదియొక పుష్పము.

# శ్రీకృష్ణపరమాత్మ - రాధ

బుక్కపట్నం తిరుమల నరసింహాచార్యులు గారు

తే. గీ. కృష్ణుఁ డొకనాఁడు భామతోఁ గేళి సల్పు
చుండుపట్టున స్ఫురియించె నొకటి యతని
కంత భామను జేరి కార్యాంతరమునఁ
బోవవలయును మధురకుఁ బోలఁతి మిన్న.

చ. అనవుడు సత్యభామ యవునా! నట ముగ్ధత వల్లవీజనం
బవయము నంత నొందెద రహో! యిఁక వీరటు లేగకున్నచో
ఘనముగ కార్యముం జెడును గావున వెళ్ళెడు వేళ మించెడున్
గనుకని ప్రేమ భారమయి కష్టపరంపర గాసి గొల్పదే.

గీ. అట్టి యదనునఁ గృష్ణుఁ డాయతివ భావ
మిట్టిదని యూహసేసి తా నెలమి సుల్కు
వేళ లేదింకఁ గార్యంబు విప్పి చెప్ప
సతివరో పత్తు వైళంబ యనుచు వెడలె.

చ. చనిచని కాంచెనాడట రసాలకిసాలలతావితానసం
జనితసుగంధవాయుపరిసంభృతహర్షము నేత్రయుగ్మరం
జనముఁ గలక్వణన్మధురసస్వరసంగత భృంగమాలికా
వనపికశారికాశుక నివాసము నొక్క వనప్రదేశమున్.

గీ. కాంచి తొలమిని బూఁదోటఁ గౌతుకమునఁ
జేరి యందందుఁ దన సృష్టి చిత్రములను
దమిని బరికించు చొకపూఁతదవ్వు లోన
నచట నొకలేమ కాన్పించె నబ్బురముగ.

గీ. పొన్నగున్నల జాబిల్లి వెన్నెలలను
జీర్ణమైనట్టి చెంగావి చీర గట్టి
పరమశాంతితో భక్తిమై పరలుచుండి
సాధుగుణశీల రాధ సాక్షాత్కరించె.

గీ. అటులు సాక్షాత్కరించిన యతివఁ గాంచి
యసమశరు బారి కోడి యత్యాతురమున
మేనియందునఁ బులకలు మీఱి మిగుల
సంతసంబునఁ దలపంగ సాగెనిట్లు.

గీ. భక్తియే తనజీవనోపాయముగను
నన్నుఁ గీర్తించుటే తన తెన్ను గాఁగ
నన్ను దర్శించుటే తనయెన్నికగను
దనర రూపొందు భక్తియా తరుణి యదిగో.

సీ. చంద్రికాశ్రీలను జగ్గునిగ్గుల గెల్చు
ముఖబింబమున కెన మొనయు నెద్ది
యంగజా శుగముల నవలీలగాఁ గేరు
చూపుఁ గోపుల కెన చూడ నెద్ది
ఇందిందిరావళి నెలయించి భ్రమియించు
నెఱివేణి సరివోల్ప నెమ్మి రొద్ది
కెండిగుబ్బలి డంబు విహసించి తలక్రొత్తు
వక్షోరుహంబుల పాటి యెద్ది

గీ. కమ్మతేనియ సోనలఁ జిమ్ము మోవి
మేలి బంగారు వన్నెల మేలమాడు
లలిత తనుకాంతిఁ దనరారు లలన యహహ!
మదను వాఁడిబాణమై పలరు నదిగో.

శా. ఆరూపంబును, నాయొయారమరశే! యాకెర్కు లాబెర్కు లే
నారీరత్నమునందుఁ గాన మహహా! నామానసంబందుఁ జె
న్నారాటంబది హెచ్చె మానక యిసీ! యాశోభలం జేరి యీ
యారామంబున వెట్టిగొందు నిఁకనే నామన్మథున్ గిన్మథున్.

గీ. రాధికను సాటియౌనట్టి రమణు లేరి
యట్టి భువనైక సుందరి యట్టి సాధ్వి
లేదు లేదింక నెందున నీఁడు గాంచ
రాధ కారాధయే సాటి రాఁగఁ జనును.

గీ. అనుచుఁ గృష్ణుండు లేమకరంబు వదలలేక
'రాధ రాధా' యటంచును రాధఁ జూచి
'అహహ! మెచ్చితి నీభక్తి కాత్మలోన
నక్కటా! యెంత డస్సితి' వంచుఁ గదిసె.

ఉ. అప్పుడు మంజులాతిశయ హస్తము లాకుచపాళి సోకినన్
భామ హృదంతరాళమునఁ బాయని కామవికార మెందుమన్
మోమున ఘర్మబిందువులు ముత్తెములట్టులు నప్పటిల్లఁ దా
వామకరంబుచేఁ దుడిచి పయ్యెద సర్దుచు నిల్వఁ గృష్ణుఁడున్.

ఉ. ఓవలినాక్షి! చింతయిఁక నొందకు నేను కృశించుచుండె నీ
మానసమందు నెంచునల మామకరూపముచిక్కె నీకుఁ బో
ఆనన మెత్తి చూడు మిటు లంచని యంగన చెక్కుటద్దముల్
దా నటు నొక్కె రాధయును దద్దయుఁ గృష్ణుని జూచియంతటన్.

గీ. కీలుగంటునఁ దాల్చిన పూలు చెదరఁ
జైఁటకొంగును గొంగేలఁ బదిలపుచి
పిటీంది కడుగుల నిడుమ దాఁటెంపెసంగ
వెంటనే కృష్ణు కౌఁగిలి వీడి చనియె.

గీ. అల్లనల్లన నరిగెడు నతివఁ గాంచి
'ఏటి కీబింక మింక? నీకేటి లజ్జ?
వెలఁదిరో! నన్నుఁ గూర్చి నీ విరహమెల్లఁ
గాంచినాఁడను కనులారఁ బొందియుండి.

చ. అనికమఁ 'కృష్ణ! కృష్ణ!' యని యాడెదు పల్కుల నాలకించి నే
ననువను నీదు కోరికను హర్షముతోఁ దగఁ దీర్పరాఁగ నీ
వనవిన రాని పల్కులనువమ్ములఁ గ్రమ్మఁగ నెట్లు నైతు నో
వనితరో! ఊహసేయుమ యిది భావ్యమె మోసమునే ఘజూచుటల్.

ఉ. అండజయాన! నీవు నను వంగజుబారికిఁ ద్రోసిపుత్తువో
నిండుమనంబుతోఁ దటిసి నీబిగికౌఁగిట గారవింతువో
రెండిటిలోన నిష్టమగు రీతిని నేయుము నమ్మితంటె నీ
వొండును జేయకుండ నిటు లరారక యేగుట న్యాయమానొకో.

గీ. సత్యభామాప్రియా! చాలు చాలు నీకు
పెఱలలతతోడఁ బలుకుట తెలుఁగు గాదు
నిన్న వలచినదానను నేను గాను
తలఁప నత్యమె నీకిప్డు వలపుటాలు.

గీ. అంతఁ గృష్ణుండు ప్రాన్పడి కొంతవడికి
వెలఁది! యిటులాడు టేమిది వింతయరయ
'లాఁతులను దాయు టిద్ది యే లాగు వయ్యె?
లాఁతి పీకెట్టు లౌదువో లలన! చెపుమ.

గీ. అనుచుఁ బ్రశ్నింప, రాధ యా హ్లాదమెసఁగ
మేనియందునఁ బులక లింపెసఁగ గద్గ
దస్వరముతోఁ బఁ జెఱునవ్వు తనరఁ గృష్ణుఁ
జూచి చెప్పఁగఁ దొడఁగెను జోద్యముగను.

సీ. నల్లనిమేనితో నల్లనల్లన వాలఁ
జేలయుఁ ద్రోలుచుఁ జెలఁగువాఁడు
వేణీభరంబున వెలయు పింఛముతోడ
నాటలాడెడు నట్టియంటగాఁడు
అఱమోడ్పుకనులచే యాదవకామినీ
జనము నాకర్షించు గొనముడువాఁడు
చివురుఁజేతులఁ బట్టి శృంగాముగఁ బిల్లఁ
గ్రోవి నూదెడునట్టి ఠీవి వాఁడు.

గీ. అందముల కెల్ల వంకమై యలరువాఁడు
లలితగోపాలబాల వల్లభుఁడునైన
బాలగోపాలకృష్ణుని పాదపద్మ
బంధురంబను నేనె నా భాగ్యమతఁడె.

గీ. అనఁగఁ గృష్ణుఁడుఁ బెల్లుబ్బి యాత్మలోన
మగువ పల్కెడు నొక్కొక్క మాట యందు
వేదశాస్త్రార్థవితతుల విషయమెల్ల
నిండియున్నది యేమన నేర్చువాఁడ.

కం. అని తలపోయుచుఁ దా నటు
మనమున నానందమొంది మగువను గనుమన్
గొనకొని పరీక్ష సేయఁగ
ననువుగఁ దానిట్టులనికె నంత రయమునన్.

శా. బాలా! బేలవు నీవు; నన్నెవనిగా భావించి యిట్లాడెదో
వాలాయంబుగ నీవు నెమ్మదిని సం భావించు తద్రూపమా
లీలామానుష విగ్రహుం డితఁడె పో లేఁ బాయమం దప్పుడి
క్రీడాగర్వయిను ఈడువచ్చి యిఁక సం క్రీడన్ ననుఁ గావుమా.

చ. అనుటయు నోమహాత్మ! యిది యంతయు నిక్కమొ, కాదొ, కాని
నామన మది బాలకృష్ణముఖమండలమందున వ్రాలుచుండె; న
న్ననఁ బనిలేదు;మానసమె యన్నిటి కుత్తరవాది యయ్యెడున్
నను నికఁ బోవనిండు సుగుణాఢ్యులు మీరవఁ గృష్ణుఁ డాత్మలోన్.

గీ. గంగిరెద్దుకు బొంతను గప్పినట్లు
లెట్టివసనంబు దాల్ప నిం కేమి ఫలము ?
జ్ఞానరత్నమె యడఁగింపఁ జాలువీని
భానుముందట దీపంబు పగిది గాను,

గీ. అనుచుఁ గృష్ణుండు నెంతయు నాత్మ నలరి
నాదుమానస మనుచెన్న నాతిభక్తి
యనెడు నగ్నిని ద్రవరూప మంది ప్రేమ
రసముజిల్కెడు నీభక్తు రాలిపయిని.

గీ. శిఖిశిఖాయుతచూళియై చెలువు మీఱి
సలలితంబగు మురళి హస్తమునఁ దాల్చి
యఖిల జీవులు జైతన్య మంద మోవి
నూఁదు చంతటఁ బ్రత్యక్ష మొంది దయను.

గీ. అతివరో! నీవు జీవించు నంతవరకు
నిటులె కాన్పించి నీమది కలిమిఁ గూర్తు
దేహయాత్రను ముగియింపఁ దివురువేళ
లేమ! నా తేజమును జేరి లీనమౌదు

# రామాయణ నీతిసారము

## రామాయణ ప్రాముఖ్యము

భారతీయ వివిధవాఙ్మయములందు రామాయణము మహోన్నతప్రస్థాన మలంకరించుచున్నది. భారతీయజీవితపరమార్థమును జీవితరహస్యములను స్పష్టముగ విశదీకరించు గ్రంథరాజములకు తలమానికమై తనరారుచున్నది. అందు రాజకీయ మత సాంఘికధర్మములు భారతజాతి పూర్వుల ఉచ్ఛస్థితికి తార్కాణములై ఇప్పటి వారికి ఆదర్శప్రాయములై భారతదేశమునకేకాక ఖండాంతరములందు సైతము ప్రశస్తిగాంచినవి. రామాయణము నీతులకు పెన్నిధి. అవి భారతసంప్రదాయప్రసిద్ధములు. రామాయణమువంటి ఉత్తమగ్రంథ రాజమును బడయగలిగిన భారతీయులు ధన్యులు.

రామాయణము అయస్కాంతమువలె భారతీయుల హృదయాకర్షణ మొనర్చుటకుగల కారణమేద్ది? భవభూతి ఉత్తరరామచరిత్ర వ్రాయుచు రసములలో కరుణరసమే ప్రధానమని వక్కాణించియున్నాడు. శృంగారరసప్రాధాన్యమును నిరసించెను. కరుణరసమునకుగల మహత్తిని భవభూతి సంపూర్ణముగ గ్రహించెను. అందులీనమై దాని సారమును గ్రోలి దానిని భారతీయులపై ప్రసరింపజేసెను. ఏదైన కరుణాభూయిష్ఠమైన ప్రదర్శనమును తిలకించినపుడు మనహృదయము లందు ఒకవిధమగు అనిర్వచనీయమైన దయారసము వెల్లివిరిసి సానుభూతి కలుగుచుండుట సహజము. అందులకుకారణము చిత్తసంస్కారము. ఆచిత్తసంస్కార మెందుకుకలుగునో విచారించినయెడల కరుణరసము ప్రభావము, తన్మూలమున కరుణరసప్రధానమైన రామాయణ నైతికస్వరూపము మనకు విస్పష్టమగును.

రామాయణావతరణమునకు మూలకారణమేది? బోయబాణమున విగతజీవులై భూమిపైబడిన క్రౌంచమిథునము వాల్మీకి దయార్ద్రహృదయమును కరగించి అందునుండి శోకరసపూరితవాక్కులను పెల్లింపజేసెను. అదియే రామాయణావతరణమునకు కారణము. ఆహృదయ పరివేదన మెంతపవిత్రమైనది! దరిద్రుడు, నిరాధారుడు, కష్టపరంపరాపీడితుడు దీనవదనముతో మనయెదుట ప్రత్యక్షమైన మనహృదయము జాలికలోనై వానిదుస్థితికి పరితపించును. దానితో ఒకవిధమైన చిత్తసంస్కారముకూడ కలుగును. ఈస్థితి మనమువచ్చినపుడు మన గతియు నింతయేకదా! వీనికి మనమేల దయ చూపరాదు? ఇట్టిభావములు మనోవీథిని ప్రచారము చేయుచుండును. ఆభావములు మనలను వానికైపునకు నీడ్చుకపోవును; కాని శృంగారమున కీవిధా త్తరశక్తి లేదు. విలాసదంపతులను చూచినపుడు, వారిచర్యల తిలకించినపుడు భావములు వేరు. అవి క్షణికములు. వానివలన చిత్తసంస్కారముగాని ప్రపంచానుభవముగాని పొందజాలము. అవి తాత్కాలికసుఖమున నోలలాడించి అంతర్ధానమగును. కాని కరుణరసము హృదయాంతసీమను నివాసమేర్పరచుకొని నీతిపరంపరలను వెలికి తీయుచుండును. ఈపరమ రహస్యము రామాయణమునందంతట ప్రసరించియున్నది. పట్టాభిషిక్తుడై మహారాజభోగము లనుభవింపనున్న రాముడు, పట్టమహిషియై అంతఃపురపరిచారికలు సేవింప హంసతూలికాతల్పములందు ఉల్లాసమున మండవలసినసీతయు, నారచీరలు ధరించి కంటకారణ్యముల జరింపవలసివచ్చినపుడు ఎవనిహృదయము కరగకుండును? దశరథుడు అవసానకాలమున కుమారచతుష్టయములో నొక్కడైనను లేక ప్రాణము విడువవలసివచ్చినపుడు చేసిన ఆర్తరవము, "రామంరామం" అనుఅక్షరములు, భారతీయుని కర్ణపుటముల ధ్వనించుచుండును గదా! పూర్ణగర్భిణి- ఇదివరకే దుర్భరకష్టపరంపరల గాగినసీత- జనాపవాదనివారణమునకై మరల వనవాసిని కావలసివచ్చినపుడు ఎవనిహృదయము ద్రవింపకుండును?

రామాయణప్రధానపాత్రలయందిట్టి విషాదవృత్తాంతము లుండుటవలన అది భారతీయులహృదయములను అయస్కాంతమువలె నాకర్షింపగలిగినది. అది ప్రపంచనైతికస్వభావమును చాటుచు భారతీయుల నిట్లు ప్రబోధించుచున్నది. ఓ భారతీయుడా! నీకు మానవజన్మకలిగినంతనే సంతుష్టి చెందకుము. కాలమంతయు సుఖప్రదముగ జరుగునని ఆశింపకుము. కష్టపరంపర లెదుర్కొనవున్నవి. వానిని ధీరుడవై మార్కొని జయముగాంచ ప్రయత్నింపుము. సన్మార్గప్రవర్తన నవలంబింపుము. ఇహపరసుఖములు కలుగును. నీకీర్తిచంద్రికలు దిశలు గ్రమ్మి ప్రకాశించును.

## సీతారాములు— దాంపత్యము

రామాయణము హిందూధర్మములను, హిందూజీవితమును తెలియజేయుచు వానినీతులను భారతీయులకు బోధించుచున్నది. సీతారాముల దాంపత్యము హిందూదాంపత్యనిదర్శనము! వారి అన్యోన్యప్రేమ, పవిత్రస్వభావము, నిష్కళంకహృదయము, హిందూసంసారప్రసిద్ధములు. వీరిచరిత సతీపతిధర్మమును నిర్వచించుచున్నది. భార్యకు భర్తయే దైవము; భర్తయేలోకము; భర్తయే స్వర్గము; భర్తృసాహచర్యమే పరమసుఖప్రదము; భర్తృప్రేమయే మహానందకరము. అనుభవింప మహాభోగములున్నను భర్తృప్రేమకు కొఱవగలిగిన భార్యకు సుఖముండదు. అదేవిధముగ భార్యాప్రేమకు లోపముకలిగిన భర్తకు భోగభాగ్యములున్న ప్రయోజనము లేదు. ఇద్దరిహృదయములు

కార్యనిర్వాహక సంఘసభ్యులు　　గౌతమీ గ్రంథాలయము, ౧౯౪౮-౪౯. రాజమహేంద్రవరము　　కార్యాలయము



Working Committee



Goutami Grandhalayam, Rajahmundry　　Office Premises

గాంధీ హిందీమందిర గ్రంథాలయము, గుంటూరు



Library, Gandhi Hindi Mandiram, Guntur



గౌరవకార్యదర్శులు　　Honorary Secretaries

స్వసంఘగ్రంథాలయము, ద్వితీయవార్షికోత్సవము, విశాఖపట్టణము



Second Anniversary. Our Association, Vizigapatam

పాలకొల్లు పురపాలకసంఘము (౨౩-౧౧-౧౯౨౮)



Municipal Council, Palacole, Vizagapatam

ప్రేమామృతపూరితములై అన్యోన్యభావదీపితములై తనరారును. అటులుగానిచో ఆసంసారము సుఖకరము కాజాలదు.

సీత ప్రేమస్వరూపిణి. భర్తృసహధర్మచారిణి; రాముడు వనవాస ప్రయాణమునకు సిద్ధమయ్యెను. రామునకు సీతవచ్చుట యిష్టము లేదు. రాముడొక్కడే వెళ్లుటకు సీత కిష్టము లేదు. ఒకరిమీద ఒకరికున్న అత్యధిక ప్రేమయే కారణము. సీత కష్టము లనుభవింపవలసివచ్చునే యని రామునివిచారము. రాముని బాసి సీత యుండగలదా! రాముడు అరణ్యములో కష్టములనుభవించుచుండ తానెట్లు గృహమందు భోగము లనుభవింపగలదు? భర్తృదర్శనము లేని నిముసము అంధకార ప్రాయము గదా! సీత కిదియే విచారము. రాముడుమాత్రము సీతాముఖసందర్శనము లేనిది ఒక్కనిముసమైన నుండగలడా? కాని సీతకష్టములుచూచి సహింపజాలడు. అందువలన రాముని ప్రేమ సీత గృహమం దుండవలయు ననియే కోరెను. 'సీతా! అరణ్యవాసముతో చెరలాటము నీసుకుమార దేహమునకు తగదు. కటికిరాల శయనింపజాలవు. నీమృదుపాదములు కంటకబాధ కోర్వజాలవు. మృదుమధురరవముల కలవాటైన నీ కర్ణపుటములు భీకరసింహగర్జనములను సహింపజాలవు. పంచభక్ష్యముల కలవడిననీవు కందమూలము లెట్లు భుజింపగలవు? మృదులదుకూలములు ధరించు నీవు చిరుగునారచీర లెట్లు ధరింపగలవు? చండ భాస్కర కిరణములు నీముఖాబ్జ మధువును స్వేదబిందు వ్యాజమున హరించుచుండ నేసహింపగలనా? నీకీశ్రమయేల? సుఖముగ గృహమందుండుము. నీవు సుఖివై యుండ నాకదే పరమానందము. అప్పుడు నాహృదయము దుఃఖమున కెడమీయదుసుమా!'

సీత కేదికష్టము? గృహమందు భర్తృవియోగమునమందుటయా? అరణ్యమున భర్తృసహవాసమున నుండుటయా? ఇక్కడనే భారత నారీమణిధర్మము నిలిచియున్నది. ఈ సందర్భమున సీత కనుపరచిన హృదయము ప్రేమామృతమయము; నిర్మలము; నిష్కళంకము. ఆమె వాక్కునుండి వెలువడిన పలుకులు అమృతబిందువులు. శోషితభర్తృహృదయక్షేత్రమును ఫలవంతముగ జేయునవి అవియే గదా. ప్రతిభారత నారీమణి హృదయఫలకమందు ఆపవిత్రాక్షరములు స్వర్ణరేఖలనుబోలి తేజరిల్లుచుండును గదా!

'నాథా! నేను మీవెంట వచ్చెదను. నన్నాటంకపెట్టవలదు. సతీ ధర్మము నిర్వహింపనిండు. జననీ జనకులు, సోదరసోదరీమణులున్న నాకు నీవే ప్రాణాధికవు. నిన్ను విడచి నేనొక్కనిముస ముండజాల. నీవు లేనప్పుడు నాకంతయు అంధకారము. నీసామీప్యమున నుండనప్పుడు నాకీరత్నకంబళములు, ఈహంసతూలికా తల్పములు, ఈదుకూలములు, ఈ ఆభరణములు సుఖమునిచ్చునా! నీవు నాకన్నులపండువు సేయుచుండ మహారణ్యము మహారాజ్యమగును. పర్ణశాలయే సౌధ రాజము; పర్ణశయనమే హంసతూలికా తల్పము; కందమూలములే పంచ భక్ష్యములు; పక్షిధ్వనులు మేలుకొల్పులు; సింహగర్జనములు వందిమాగధ స్తోత్రములు. ఇంక నాకు కావలసినదేమున్నది? మహాభోగ మక్కడ లేదా? ఆపచ్చికబయళుల నీతో విలాసముగ విహరించెదను. మర్మర ధ్వనితో ప్రవహించు ఆసెలయేళ్ల నేత్రపర్వముగ విలోకించెదను. మార్గమధ్యముననున్న కంటకములు తొలగించి నీకు శ్రమలేకుండ జేసెదను. ఘుమఘుమ సౌరభములు వెదజల్లు పుష్పములు సమకూర్చి పుష్ప హారములు నీకంఠమున వైచెదను. పూపొదరిండ్ల నీతో విహరించెదను. కాసారమనోజ్ఞప్రదర్శనముల దిలకించెదను. హంసమాలికల కర్ణపర్వమొనర్చుకొందు. ప్రకృతి సౌభాగ్యము ననుభవింతు. ఆయా విషయముల నుగూర్చి నిన్ను ప్రశ్నించి నీకు ఆనందము గూర్తును. నేను లేకున్న నీకాయానంద మెట్లు కలుగును? నీవున్నచోట నుండుటయే నాకు స్వర్గము. అదియే ఆనందదాయకము. వచ్చుట కనుజ్ఞ నొసంగుము. నిన్ను ప్రార్థించెదను!'

ఈప్రేమ అగాధము; వర్ణనాతీతము; మధురము; పవిత్రము; సౌశీల్య సమన్వితము. ఈ ప్రేమ భారతస్త్రీలకు ఆదర్శమై నిరంతర స్మరణీయమై ముంగొంగుబంగారమై విలసిల్లుచున్నది. ఆహా! భారతీయుల దాంపత్యమన నెట్టిదో సీతారాముల చరిత్రవలనగదా ప్రపంచమునకు వెల్లడియగుచున్నది!

## రాముడు-పితృభక్తి

రామాయణమునవచ్చు ముఖ్యపాత్రలన్నియు మానవ సౌజన్యమునకు ప్రధానములైన నీతులను బోధించుచున్నవి. ఒక్కొక్కనీతికి ఒక్కొక్కపాత్ర పట్టుగొమ్మయై యొప్పుచున్నది. రామునివలన లోకము తెలిసికొనవలసిననీతి పితృభక్తి. రాముడు పితృభక్తి స్వరూపుడు. వాని మనోవాక్కాయ కర్మల పితృభక్తియే తాండవించుచున్నది. తనయుని విధికృత్యములందు పితృభక్తియే ప్రథమస్థాన మలంకరించవలయునని రామునిచరిత్ర ఉద్ఘోషించుచున్నది. రాముడు మహారాజకుమారుడు; సకలభోగము లనుభవించుచున్నవాడు; జ్యేష్ఠుడు; సింహాసనాధిష్ఠతకు సర్వాధికారి; ప్రజాహృదయములను మారగొన్నవాడు. అట్టిరాముడు కామప్రేరితుడై కైకమాయావాగురం జిక్కి పూర్వమెన్నడో చేసిన వాగ్దాననిర్వహణమునకు నిర్బంధింపబడిన జనకుని కీర్తికి కళంకమొందవునేమో యనుభయమున తానై కైకకోరికలను నిర్వహింప బూనుకొనుటకు ఎంత భక్తివిశ్వాసము, వినయవిధేయత, హృదయనైర్మల్యము కావలయునో విచారించిన రామునిసచ్చరిత్ర యేమి ప్రబోధించుచున్నదో విశదము కాగలదు. కైకవాంఛ దుష్టము. దశరథునిదౌర్బల్య నిందార్హము. కాని రామునికి దశరథుడు తండ్రి. కైక సవతితల్లి. తల్లిదండ్రులను మనోవాక్కాయ కర్మల నిరసించుట పాతకము. జరిగినదానినిగురించి విచారించలేదు. తండ్రిని దూరలేదు. తల్లిని నిందింపలేదు. పదునాలుగువత్సరములు సకలభోగములువీడి కానవుల సంచరించవలయునే యని వెతనొందలేదు. జనకుని దూరమున్న లక్ష్మణుని నివారించెను. కైకపై వానికిగలిగిన ఆగ్రహము నణచి పట్టెను. ఎంతసహనము! ఎంత ధీరహృదయము! కష్టసముద్రము నీదబోవుచు ముఖము వీడడు. దీనవదనుడు కాడు. హంసహాసచంద్రిక లెప్పటియట్లే ముఖచంద్రబింబమున ప్రకాశించుచుండెను. మనస్సులో వ్యాకులమున్నగదా ముఖమున ప్రతిఫలించుట! సంతోషపూర్వకముగ

వనవాస దీక్షగైకొని సీతాలక్ష్మణ సమేతుడై అరణ్యమున కేగెను. భరతుడువచ్చి ప్రార్థించెను. ప్రేమద్యోతకములగు వానిని వీక్షించి తన దృఢాభిప్రాయము తెలిపెను. కైకకు వరములిచ్చిన తండ్రి మరణించెను. వరముల సమర్థించు భరతుడు విముఖుడై స్వయముగ రాముని ప్రార్థించెను. రాముడు రాజ్యము స్వీకరించినను దోషము లేదు. కాని రాముడు పితృవాక్యపరిపాలకుడు. జనకుడు స్వయముగ ఆజ్ఞాపించకున్నను ఆయన వాగ్దానమే తనకాజ్ఞ. దానిని శిరసావహించవలసిన విధి వానియం దున్నది. పదునాలుగేండ్లలో పల్లెగాని పట్టణముగాని చొరలేదు. అగ్నిసాక్షిగ స్నేహముచేసిన సుగ్రీవుని కిష్కింధయైనను చొరసాహసింపలేదు. పితృవాక్యపరిపాలన కింతకంటె ప్రబలనిదర్శన మేమికావలయును?

## సీత—పతిభక్తి

రాముడెట్లు పితృభక్తిస్వరూపుడో సీతయట్లు పతిభక్తి స్వరూపిణి. భారతనారీమణులకు పతిభక్తియే పరమాభరణము. ఆయాభరణమును హృదయపేటికయందు పదిలపరచి ఎటువంటికష్టము లెదురుకొన్నను దానిని విడువరు. అది వారికి ప్రాణాధికము. సీత భారత స్త్రీలకు ఆదర్శక; సాధ్వి; పతిభక్తియే పరమధర్మమని నమ్మిన నారీమణి. పతితోడిదే లోకమని విశ్వసించిన సహధర్మచారిణి. పతిసుఖము తన సుఖము. పతికష్టము తనకష్టము. మహాభోగములను త్యజించిన ధీర సాధ్వి. చెరయందున్న కాలమంతయు మలినవస్త్రధారిణియై భూశయనయై నిరంతర రామనామస్మరణతో కాలముగడపిన ప్రేమమూర్తి. లోకాపవాదనివారణార్థము తన్ను భర్త విసర్జించినపుడు సైతము నాథునిమీద అపరాధారోపణచేయని సహృదయురాలు. ఇదియే నిజమైన పతిభక్తి. అగ్నిపరీక్షయందు జయముగాంచిన మహాపతివ్రతామణి సీతామహాదేవియే. సీత జీవితము భారతదేశచరిత్రయందు పవిత్రమై స్త్రీజనాదరణీయోగ్యమై నలరారుచున్నది. ఆప్రేమ, ఆభావైకత్యము, ఆమహానందము, ఆసుఖము, ఆసంసారమాధురీమహిమ, సీతారాములవనవాస క్లేశమును సంఘమునుండి విద్యుల్లతలవలె నిర్గమించుచు భారతసంఘమును తేజోవంతముగ జేయుచున్నది.

## లక్ష్మణుడు, భరతుడు—భ్రాతృవాత్సల్యము

భరతలక్ష్మణులకు వనవాసము జనకుడు విధించినదికాదు. భ్రాతృవాత్సల్యము, భక్తి, విధించినవి; అగ్రజుడు ఒంటరిగ అడవులలోపడి బహుకష్టము లనుభవింపవలసి వచ్చునేయని విచారించి ఆకష్టములు తాను భరించి అన్న సేవకుడైవనవాసము చేయుటకే ప్రతిజ్ఞ పరిసమాప్తి బొందించు వుద్దేశముతో లక్ష్మణుడు అడవులకేగ సంసిద్ధుడయ్యెను. అగ్రజుడు పూజ్యుడనుభావము లక్ష్మణుని హృదయక్షేత్రమున సుస్థిరమై అనన్యసామాన్యభక్తిప్రేమలు నాటుకొనచేసినవి. తనకు రాముడు దశరథతుల్యుడు; సీత సుమిత్రాసమానురాలు; కనుక వారిద్దరను జననీజనకులవలె సేవింపవలయును. అట్లు సేవించి లక్ష్మణుడు కృతార్థుడయ్యెను.

భరతుని భ్రాతృవాత్సల్యము, భక్తి, అత్యద్భుతము. సులభముగ చేతికందిన మహారాజ్యభోగములను త్యజించి రాముని రాజ్యస్వీకారమునేయ ప్రార్థించి విఫలమనోరథుడై రాజ్యము చేయనొల్లక రామపాదుకాపట్టాభిషేకముచేసి తాను వల్కలాజినములుధరించి దీక్షానిష్ఠాగరిష్ఠుడై, పదునాల్గుసంవత్సరములు పట్టణము చొరనొల్లక నందిగ్రామమునకుపోయి గడపిన భరతునిచరిత్రము వ్యక్తికి ఆశ్చర్యము కలుగజేయదు! తనహృదయవేదన తెలుపుచు తల్లిని దూషించువాక్యములు రామభరతవాత్సల్యముకేకాక భారతభ్రాతృవాత్సల్యమును వెల్లడిచేయుచున్నవి. మహాపాతకీ! ఎంతపనిచేసితివి, నాకు పితృసమానుడగు రాముని అడవుల కంపితివి. పూజ్యుడగు జనకుని ప్రాణములను హరించితివి. రాముడు ఘోరాటవిలో జటాజినములు ధరియించి కందమూలముల క్షుద్బాధ నివారించుకొనుచు వర్షాతపముల నలసుచుండుచు దుర్భరకష్టముల ననుభవించుచుండ నేను తెగువమనిసింహాసన మధిష్ఠించి రాజ్యముచేయుచు మృష్టాన్నము భుజించుచు భూషణాద్యలంకారంబుల దాల్చుచు మహాభోగము లనుభవింపగలనా! అక్కటా! ఇక అన్నమొగమెట్లు చూడగలను? నీకడుపునబుట్టుటచేగదా [illegible] వచ్చినది.

## దశరథుడు—కాముకుడు

కామాంధుడగువాడు పతితుడగుననువిషయము దశరథునివృత్తాంతమువల్ల విశదమగుచున్నది. సకలభోగము లనుభవించి వృద్ధుడై అవసాన కాలము నిరీక్షించుచున్న దశరథుడు కామము వశంపడి కైకచేతిలో కీలుబొమ్మయై ప్రియసుతునకు కష్టములు దెచ్చిపెట్టి తాను దిక్కులేని చావుపాలాయెను. కైక మనోహరరూపలావణ్యములకు భ్రమసి వలలో చిక్కుపడెను. ముగ్గురుభార్యలలో కైక నెక్కుడు ప్రేమించి ఆప్రేమప్రభావము గొల్పించి మృత్యువు పైకొనెను. బహుభార్యాత్వము సంసారసుఖదాయకము కాదనియు ఏకపత్నీవ్రతమున నున్నశ్రేయ ఆనందము సుఖము నాశింపనేరదనియు ఈచరిత్ర బోధించుచున్నది.

## కైక—మంథర

కైక వరములనుకొనుటకుపూర్వము దుస్స్వభావయైనట్లు గానరాదు. ఆమె నిజముగ సత్స్వభావురాలు. రాముని పట్టాభిషేకవార్తవిని ఆనందించినది. కాని మంథర విషము కెలకెక్కించినది. అంతటితో కైక బుద్ధిమారి దుస్స్వభావయై హృదయము వజ్రకాఠిన్యముదాల్చినది. దీనినిబట్టి రాజాంతఃపురపరిచారికలేమి సామాన్యగృహపరిచారికలేమి సత్స్వభావలుగనుండిన క్షేమకరమనియు లేకున్న గృహకలహములు సంభవించుననియు దుష్టులను చేర్చరాదనియు విశదమగుచున్నది. దుస్సాంగత్యము సర్వదా నిషేధింపదగినది. అది పక్కలోని పాముకాటువంటిది.

## సుగ్రీవుడు—మిత్రత్వము

రామునకు సుగ్రీవునితో మైత్రి బహుకార్యసాధకమై మహోపకారకమైనది. రామసుగ్రీవులమైత్రి నిష్కళంకమై నిర్మలమై అన్యోన్య

సుఖాస్పదమై యొప్పినది. మైత్రియనగా నెటులుండవలయునో అందువలనగలుగు లాభము లెవ్వియో స్పష్టమగుచున్నవి. సుగ్రీవుడు నూత్నప్రాప్తభోగపరుడై తాత్కాలికాజ్ఞానమునబడినను లక్ష్మణప్రబోధితుడై తెలివినొంది మైత్రీవిధానమునసరించి రామకార్యధురంధరుడై సకలసేనలతో సహాయపడి మిత్రునకు జయము చేకూర్చెను. రాముడు సుగ్రీవమైత్రిలేనిచో సముద్రముదాటుటగాని రాక్షసులజయించుటగాని సాగకపోవును.

## హనుమంతుడు—భృత్యత్వము

నిజమైన భృత్యుడెవరనిన హనుమంతుని పేర్కొనవలయును. భృత్యధర్మములన్నియు హనుమంతునియందు మూర్తీభవించి యున్నవి. రామసుగ్రీవులమైత్రిచేకూర్చి సుగ్రీవునకు చేయవలసిన భృత్యధర్మము నిర్వహించెను. రామునికి భృత్యుడై నిరంతరరామకార్యాసక్తుడై రామునియందే మనస్సు లీనముచేసి రాముడేయై మెలగినవాడు. భృత్యున కుండవలసిన భక్తి, విశ్వాసము, వినయవిధేయతలు కార్యజ్ఞానము, చాతుర్యము, ధైర్యము, సహనము, నిరీక్షణము, మెలకువ మొదలగు సుగుణరత్నములు లేకున్న హనుమంతుడు ఒంటరిగ లంకజొచ్చి సీతాక్షేమ మరయ లేకపోయెడివాడు. యజమానుని నోటనుండి యేమాట వెలువడునో, యేమి యాజ్ఞాపించునో యని మెలకువతో కనిపెట్టి చరించుట భృత్యుని ధర్మము. అందు హనుమంతుడు మేటి. ఎంతటి సాహసకార్యమునకైనను వెనుకంజవేయువాడు కాడు. ప్రాణములకైన తెగించి దుర్ఘటకార్యముల నైతము సాధించువాడు. ఇవియే భారతభృత్యధర్మములు. హనుమంతుడు మార్గదర్శియై వీనిని భారతీయులకు చూపుచున్నాడు.

## ధర్మమే జయము

ఇందుకు నిదర్శనము రావణుడు. రావణుడు సాధారణ పురుషుడు కాడు. మహాబలశాలి; ముల్లోకములను గడగడలాడించిన కార్యధనుడు; వేదరహస్య జ్ఞాన దురంధరుడు; మహాతపశ్శాలి; అద్వితీయ శివభక్తుడు. కోటి శివలింగపూజాతత్పరుడు; అగణితవర సంపన్నుడు; అహంబ్రహ్మ యనువాడు. అట్టివాడు పరాజితుడగుటకు కారణమేమి? అతనిఅధర్మ ప్రవర్తనమే ముఖ్యకారణము. ధర్మమార్గావలంబకుడై చరించినంత కాలము జయలక్ష్మి వానిని వరించినది. ధర్మమార్గ ప్రవర్తనమనగా స్వధర్మనిర్వహణము. రావణుడు రాక్షసజాతికి రాజు. తనవిహిత కృత్యమును నెరవేర్పవలసినబాధ్యత వానియందున్నది. విరోధుల నోడించి తనకుదాసులనుగా జేసికొనుట రాజధర్మము. ఇంద్రాదులు విరోధులు. కనుక వారి నోడించి తనభుజశక్తిని చాటెను; రాజ్యము విస్తరింప జేసెను; అధికారమును బలపరచికొనెను; స్వమతస్థాపన మొనర్చెను; స్వమతభిన్నుల హింసించెను. క్రూరబాధలకులోనుచేసి తనమతమునకు త్రిప్పుకొనెను. కాని వారిని హతమొనరించెను. ఇవన్నియు స్వధర్మ నిర్వహణార్థము చేసినపనులు. అధర్మమార్గ ప్రవర్తన మనుటకు వీలులేదు. స్వధర్మము ఘోరమైనను దోషరహితమనియు న్యాయసమ్మతమనియు ధర్మవ్యాధుని చరిత్ర తెలుపుచున్నది. తాను మహాజ్ఞానియై యుండియు నిజధర్మము ననుసరించి కులవృత్తియగు మాంసవిక్రయము జేసెను. ఆవృత్తి విసర్జించుట పాతకమని తెలియజేసెను. రాజైనవాడు స్వమత స్వధర్మస్థాపనార్థమై ఎన్ని అకృత్యములు ఈ కాలమున చేయుటలేదు? పశ్చిమదేశమున నెంతమంది రాజులు స్వమతేతరులను క్రూరదండనముల పాలొనరింప లేదు! ఎంతమంది స్వమతమును వీడక ప్రాణము లర్పించిరి. రాజ్యము లొండొంటి కబళింప జూచుట వింతకాదు. జర్మని బెల్జియమును మ్రింగజూచినది. ఫ్రాన్సును రూపుమాప దలచినది. ఆస్ట్రియాను కీలుబొమ్మవలె ఆడించినది. హిందూదేశము పారతంత్ర్యమున అల్లాడుచున్నది. ప్రస్తుతకాలముననే ఈవిధముగ జరుగుచుండ అవి రాజకీయతంత్రములని సమర్థింపబడుచుండ ఇక ప్రాచీనకాలము సంగతి చెప్పవలయునా?

రావణు డిన్ని ఘోరకృత్యములు చేసినను వానినణచ రాముడు ప్రయత్నము చేయలేదు. ఎందువలన? కలహకారణము లేకపోవుట వలన రావణుడు చేసినవన్నియు కలహకారణములుగావా! కావనియే చెప్పవలెను. రావణుడు స్వధర్మ ప్రతిష్ఠాపన చేసికొనుచుండ పరరాజు అనవసరముగ జోక్యము కలుగజేసికొనుట రాజధర్మముకాదు. అటుల చేయుటచే ధర్మముగనెడల సీతాపహరణపర్యంతము రాముడేల యూరకుండవలయును! అప్పటికి రాముడు అరణ్యవాసము చేయ మొదలుపెట్టి పదుమూడు వత్సరము లయ్యెను. రావణుని దుర్నయములను వినియుండెను. బుధులెందరో మొరలిడుకొనిరి. కాని రాముడవి అధర్మములుగ భావించి యుండలేదు. తనధర్మమును నిర్వహింప తానేవిధముగ పాటుపడుచుండెనో ఆవిధముననే రావణుడు పాటుపడుచుండెనని తలచియుండవచ్చును.

కలహకారణము రావణుని అధర్మ ప్రవర్తనతో ప్రారంభమైనది. పరనారీహరణముతో రావణునికి ధర్మచ్యుతి కలిగినది. ఇంద్రియజితుడై అహంకారసమన్వితుడై అజ్ఞానాంధకారమున మునిగెను. అదియే వాని అధర్మ ప్రవర్తనకు మూలము. అధర్మ ప్రవర్తనతో అధఃపతితుడయ్యెను. జయలక్ష్మి వానిని విడిచెను. అంతటితో బలము నశించెను. శౌర్యము పోయెను. తన దుష్కార్యమే గాలమై మనసును కలతపెట్టెను. ఆసంక్షోభమే వానిని నిర్వీర్యునిగా జేసెను. రామరావణులయుద్ధము ధర్మాధర్మ సంరంభము. రాముడు ధర్మస్వరూపుడు. రావణుడు అధర్మస్వరూపుడు. ధర్మ స్వరూపమునకు ఆత్మవిశ్వాసము, ధైర్యము, ఉత్సాహము, ఆసక్తి మొదలగునవి తోడొసంగును. అధర్మ స్వరూపమునకు ఆత్మవిశ్వాససంశయము, అధైర్యము, నిరుత్సాహము, నిరాశ ప్రత్యక్షమై వెనుకకు లాగుచుండును. కనుక ధర్మమునకే జయము.

## మంత్రాలోచన—హితము

రామాయణకథవలన రాజనీతులు కొన్ని స్ఫురించుచున్నవి. రాజునకు మంత్రాలోచన ముఖ్యము. తానెంత సమర్థుడైనను రాజు మంత్రులసలహా గైకొనవలయును. దీనికి నిదర్శనము విభీషణునికి శరణమిచ్చు సందర్భమున రాముడు తానుసర్వస్వతంత్రుడై యుండియు

విభీషణునియొక్క మనస్సును వానిముఖముననే గ్రహించియు సుగ్రీవాదులను వారివారి యభిప్రాయమును గురించి ప్రశ్నించెను. వాద ప్రతివాదములు కావించెను. దశరథుడు రామ పట్టాభిషేక ప్రయత్నములకు ముందు మంత్రులతోను పురోహితులతోను ప్రజలతోను సంప్రతించి కార్యమునకు పూనుకొనెను.

తన మేలుగోరి హితముచెప్పువారిని గర్హించి వారిహితము గైకొనక స్వబుద్ధి ననుసరించువారు చెడిపోవుదురు. తనకు సోదరుడై తనహితము గోరుచు న్యాయమార్గమును జూపిన విభీషణుని వెడలగొట్టి రావణుడు అధోగతి పాలాయెను.

### రాజు——ప్రజలు

రాజప్రవర్తన ప్రజాప్రవర్తనకు మార్గదర్శకమని రామునిపరిపాలన తెలుపుచున్నది. ఈసత్యమే సీతారాముల పునర్వియోగమునకు కారణమైనది. సీతను పాతివ్రత్యప్రతిష్ఠాపనకై అగ్నినురికి పవిత్రురాలైన సీతను— పూర్ణగర్భిణిని, రజకుని ప్రల్లదమున ప్రేలిన నుడులు మనసును కలతపెట్ట వెనుకముందు లాలోచింపక ప్రజాపరిపాలకుడగు రాముడు మరల అరణ్యమున కంపవలసినవాడయ్యెను. తననడవడియే తనప్రజల నడవడికి మార్గదర్శకమని విశ్వసించినవాడు. తనయందే మాత్రము కళంకమున్నను, ఉన్నదని ప్రజల కనుమానముతోచినను, అది ధర్మపరిపాలనకు కార్చిచ్చువంటిదగును. సీత పవిత్రయని తానెరుగును. కాని లాభమేమి! ప్రజలు నమ్మలేదు. కనుక సీతను విసర్జించవలయును. లేకున్న పాలకుని అధర్మమార్గప్రవర్తనము పాలితులకు మార్గదర్శకమగును. ప్రజాభ్యుదయమునుకోరినరాజు స్వసౌఖ్యమునైనను విడనాడవలయును.

### రాజు——స్వమతస్థాపకుడు

మతస్థాపనచేసి దానిని రక్షించుట రాజవిధులలో నొకటి. మతమున లోపములున్న వానిని ఖండించుటయు, మతభిన్నప్రవర్తకులను శిక్షించుటయు రాజధర్మమైయుండెను. అప్పటివేదమతప్రకారము ఒక్కొక్కతరగతికి ఒక్కొక్కవిధి నిర్ణయింపబడి యుండెను. తద్భిన్న ప్రవర్తకులు శిక్షార్హులు. శంబుకవధ కిదియే కారణము. శూద్రునకు తపస్స్వాధ్యాయాదులను వేదమతము నిషేధించినది. దద్వ్యతిరేకముగ తపస్సుచేయుచున్న శూద్రుని వధించి వేదమతమును కాపాడవలసినబాధ్యత రామునియం దున్నది. అంతియేకాని యొకరువ్రాసిన నాటక ప్రకారము బ్రాహ్మణకుతంత్రము కానేరదు.

భారతీయులకు రామనామము పవిత్రమై ముక్తిప్రదమై వారి హృదయములందు లీనమైనది. పల్లెలు పట్టణములు రామనామమయములు. సీతారామలక్ష్మణవిగ్రహసుశోభితములు. అవసానకాలమందు రామనామస్మరణతో భారతీయులు ముక్తిపొందుచున్నారు. రామునిపితృభక్తి, పితృవాక్యపరిపాలనదక్షత, సత్ప్రవర్తన, ఏకపత్నీవ్రతము, స్నేహవాత్సల్యము, సదాచారము, సీతాపాతివ్రత్యము, సహధర్మచారిణీత్వము, ప్రేమమాధుర్యము, భరతలక్ష్మణుల భ్రాతృవాత్సల్యము, భక్తి, అనిర్వచనీయములై ఆనందదాయకములై మార్గదర్శకములై భారతీయులను పవిత్రులనుగ జేసి వారిహృదయక్షేత్రములందు భక్తిజ్ఞానములను ప్రజ్వలింపజేసి వారిజన్మమును ధన్యపరచి ఆచంద్రార్కస్థాయిగా దివ్యత్వము నొందించుచున్నది.

---

# ఆంధ్రలక్ష్మీనృసింహస్తోత్రము

## తుమ్మల సీతారామమూర్తిచౌదరి గారు

శ్రీ సుతవార్ధి వాస! సురశేఖర! చక్రవిరాజమానస
త్పాణిపయోజ! శేషఫణిభవ్యఫణాగ్రమణిప్రకాశితాం
గా! నిఖిలాత్మ! యోగివరదా! భవసాగరయానపాత్ర! ల
క్ష్మీనరసింహ! నా కొసఁగుమీ భవదీయకరావలంబమున్.

ఉ. శ్రీనలినోద్భవేంద్రశశిశేఖరమారుతభాస్కరాది గీ
ర్వాణకిరీటకోటిమణిరాజితపాదసరోజ! భార్గవీ
పీనకుచాబ్జహంస! సుకవిప్రకరస్తుత! సచ్చరిత్ర! ల
క్ష్మీనరసింహ! నాకొసఁగుమీ భవదీయకరావలంబమున్.

ఉ. దీనిలయా! భవాఖ్యజలధింబడి, కామకరాళనక్ర సం
తానముపాలు చేసితిఁగదా తనువంతయు, రాగవీచికా
శ్రేణిఁగొట్టుకొంటి నయొ చిక్కితి దిక్కెవ రింక నాకు! ల
క్ష్మీనరసింహ! .........

ఉ. గానకళాభిమాన! భవగాఢవనాంతరవర్తినై గతిం
గానక మారభీకరమృగంబు ముఖంబునఁ జిక్కి మత్సరా
మానవిదాఘపీడనల నొందుచుఁ గుందుచునున్నవాఁడ ల
క్ష్మీనరసింహ! .........

ఉ. త్రాణకళాప్రవీణ! భవదారుణకూపములోనఁ జిక్కి శో
ధానిచయోరగంబులకుఁ దావలమై దరిఁ గానలేక నీ
ధ్యాన మొనర్చుచుంటిఁ దయదాఁకుఁడనంటి నఘంబు గెంటి ల
క్ష్మీనరసింహ!.........

ఉ. మానఘనాఢ్య! సరసరణమత్తకరీంద్రకరాభిఘాత సం
తానముచేత దేహము యథాయథలై చనె నక్కటా! యిఁకన్
ప్రాణము లుండఁజాల వతిబాధ జనించె సహింపఁజాల ల
క్ష్మీనరసింహ!.........

ఉ. భానుసహస్రతేజ! ఫణిభంజనవాహ! సుధాపయోధివా
సా! నిఖిలేశ! సంసరణసర్పవిషానలదగ్ధమూర్తినై
దీనతఁ జెందితిన్ భవదధీనుఁడ నైతిని జాలమేల లక్ష్మీనరసింహ!...

ఉ. జ్ఞాననిదాన! సంసరణజాలములోపల నైహికాఖిలా
పానికురుంబనామ బడిశంబునఁ జిక్కి చలించి మోక్షమం
గానఁగలేక చేపవలె గాసటబీసటఁ జెందుచుంటి లక్ష్మీనరసింహ!...

ఉ. ఓనిగమాంతవేద్య! దురితోత్కరబీజ మనంతకర్మశా
ఖానిబిడంబు నింద్రియనికాయదళాన్వితొ మంగజాత స
త్పూనచయంబు దుఃఖఫలశోభితమైన భవాఖ్యభూరుహం
బే నిపు డెక్కి క్రిందఁబడి రేడ్చుచు దుర్గతిఁ జెందెదరంటి ల
క్ష్మీనరసింహ! నాకొసఁగుమీ.........

ఉ. ఏ నిఁక నేమిసేతు జగదీశ! భయంకరమై భవాఖ్యదా
వానలకీల లిప్పు డకటా నను జుట్టె నిఁకెందుఁ జొత్తు ని
న్నే నెఁగదంబులం గమర నీచరణాపగనమ్మినాఁడ లక్ష్మీ నర...

ఉ. నే నిపు డీభవాబ్ధిని మునింగితి నాశిరి సాగదారొ నీ
దీనునిఁ గూర్మిఁ గన్గొనఁగదే యిటువంటి మొరల్ వినఁగదే
దానవపుత్త్ర కష్టసముదాయ వినాశపరావతార! లక్ష్మీనరసింహ!...

ఉ. దానవశానిదాన! ఖలదైత్యభయంకర! జన్మమృత్యుసం
తానవనాగ్నిహోత్ర! భవసంతతివిస్ఫురకర్మ వీరసం
చావన! భక్తలోకవరదా! మురదానవగర్వభంగ! లక్ష్మీనరసింహ!...

ఉ. ఆనతవైరి! సింధుతనయాకుచదత్త మృగీమదార్ద్రవ
క్ష! నిఖిలేప్సితంబులును సంస్మృతియందుదయించ నందుచేఁ
బూనితిసర్వకర్మములఁ బొందితి బాధలనెల్ల నింక లక్ష్మీనరసింహ!...

ఉ. ఓనళినాక్ష! మిన్నదరు హుంకృతులన్ యమకింకరుల్ గళ
స్థానమునందు బంధనవితానముఁ జుట్టి బిగించి లాగుచో
దీనుఁడు నొంటివాఁ డకట దిక్కును లేని కీవు దక్కల
క్ష్మీనరసింహ! .........

ఉ. జ్ఞానధనంబు నంధుఁడనుగాను పున నింద్రియనామచోరసం
తానము తస్కరించి బలదర్పములం బ్రకటించి యించె న
జ్ఞాన మహాంధకారమయకందరమందునఁ జిక్కినాఁడ లక్ష్మీనర...

ఉ. ధీనిధి! మాధవా! సురపతీ! సకలాత్మ! మఖాధిపా! మధు
ప్రాణహరా! జనార్దన! కృపాకర! కేశవ! వాసుదేవ! సు
జ్ఞాన! మహామహా! బుధసఖా! జగదాకృతి! పద్మనాభ! ల
క్ష్మీనరసింహ! .........

ఉ. దానవపుత్త్ర, నారద, సుధర్మ, పరాశర, పుండరీక, శ్రీ
శౌనక, కీరనామఋషిసత్తమ, సాత్యవతేయ, హృన్నివా
సా! నిరవద్య భాగవత సంచయపాలన పారిజాత! లక్ష్మీనరసింహ!...

ఉ. మానుగ నొక్కకేల నవమంబగు చక్రముఁ దాల్చి శంఖముం
బూని వఱొక్కచే జలధిపుత్త్రిక నొండొకకేల నూని యా
పై నొకసవ్యహస్తమున భక్తజనాభయముద్రఁ బూను ల
క్ష్మీనరసింహ! .........

ఉ. శ్రీనిధి! జన్మమృత్యుగజసింహ! దినేశగిరీశవేద వం
ద్యానుపమప్రభావ! కమలాననపద్మమరందమత్తభృం
గా! నిను నమ్మితిం దురితకర్ముఁడ నంచుఁ దలంచఁబోకు ల
క్ష్మీనరసింహ!.........

ఉ. మీన! కిటీంద్ర! కచ్ఛప! యమేయసటాక్ష్య! రమాదికామినీ
శ్రీన! పాకశాసనవిరించి హరాదిసురాభివంద్య! సు
జ్ఞానవిరాజమానయతి సత్తమచిత్తసరోజహంస! లక్ష్మీనరసింహ!...

ఉ. నే నిరతంబు నాదుజననీ జనకుల్ సగమిత్రసోదరుల్
జ్ఞానము విత్తముల్ నృపశిఖామణియున్ సకలంబు నీ కనీ
నే నిజమంచు నమ్మితిఁగదే జగదీశ! రవిప్రకాశ! లక్ష్మీనరసింహ!...

ఉ. దానవపుత్త్రచిత్తనవ తామరసాంతర మత్తభృంగ! గం
గానిభనిర్మలాంగ! మణిరత్నకిరీటవిరాజితోత్తమాం
గా!, నళినాలయాపదనకంజప తంగ! దయాంతరంగ! లక్ష్మీనర...

మ. అనవద్యంబయి శంకరార్యరచితంబై యొప్పు నీస్తోత్రముల్
ఘనభక్తిన్ బఠియించువాఁడు దళితాఘస్తోముఁడై మానవం
దనుఁడై నిర్మలచిత్తుఁడై యభవుఁడై తా శాశ్వతానంద భా
జనమై రాజిలునట్టి విష్ణుపదవీసంవాసియై యుండఁడే?.

ఉ. ఏవరు లీభవాంబునిధి నీదఁగ లేక తపింతు రిరముల్
గానఁగ లేరొ వారి కనుకంప జగద్గురు శంకరార్య శ్రీ
శ్రీనరసింహసంస్తవముఁ జెప్పిరి యొప్పుగ తెప్పయో నటుల్
గానఁ బఠించి దీని భవకంధిఁ దరింపుఁడి సర్వమానవుల్.

ఉ. శ్రీనరసింహ! సర్వవిభుశేఖర! ఖేచరరాట్పతాక! తా
పానలవర్షరూప! భుజగానలవృశ్చికనీరరోగ తృ
ష్ణానిచయార్తినాశ! కరుణాజలధీ! దురితాంతకా! నినున్
ధ్యానమొనర్తు వందనశతంబులనిత్తు ననుగ్రహింపుమా.

సీ. అపరశంకర శంకరాచార్యరచితమై, భారతావనిలోనఁ బేరుగన్న
నీస్తోత్రమును భవన్నిర్హేతుకదయాప్తి, నాంధ్రీకరించితి నంచితముగ
నల్పజ్ఞుడనుగాన నస్ఖలిత్కవిత్వంబు,దోషభూయిష్ఠమై తోఁచుమందు
రైనభక్తిరసముఖ్యముగఁ దప్పులసైచి, కావ్యకన్యాపరిగ్రహము సల్పి

గీ. ఘోరసంసారదుఃఖముల్గాల్చివైచి,భవ్యశాశ్వతసంతోషపదవినొసఁగి,
వెలఁగినీదాసులందునన్జేర్పుమయ్య!శ్రితజనావనరంహ!లక్ష్మీనృసింహ!

సీ. గంటూరుసీమ నెక్కుడుసంపదలనొప్పు
కావూరునామ సద్గ్రామమువాని
కమ్మవంశభవుండు తుమ్మలనారయా
హ్వయుఁడు శ్రీమతిచెంచమాంబయందుఁ
గనినట్టికొమరుఁడు కలితసీతారామ
మూర్తినాముఁడు బంధుమూర్తిగోరి
రక్తాక్షిసంవత్సరమునఁ గార్తికమాస
శుద్ధపంచమి సుప్రసిద్ధమైన
శాలివాహశకంబు శాస్త్రవేదగకేందు
సంఖ్యలం దలరారుసమయమందు
శ్రీశంకరోక్త లక్ష్మీనృసింహస్తోత్ర
మాంధ్రీకరించెఁ దా నంచితముగ.

గీ. జగతి నీగ్రంథమాస్తికజనములందు, నతిశయవ్యాప్తినందికీర్తినిఁ జెంది
యాదివాకరతారాసుధాకరంబు, శ్రీనృసింహానికరుణాలఁ జెల్లుఁగాత!

# రామాయణము - భారతము

(వినోదపాఠము)

క్రొత్తపల్లి సూర్యరావుగారు

ఏదానికిని సాజాత్యము, సాహాయ్యము, వివాదము లేక ప్రతిఘటనము లేకున్న గుణాగుణములు తెలియరావు. సాజాత్యంబున సమానగుణంబులంగల గురుత్వాగురుత్వములు వెల్లడి యగును. సాహాయ్యంబునఁ దనలోనున్నంతలో సుగుణంబులు దెలుప దుర్గుణంబుల వెలిపఱుప యత్నింతుము. ప్రతిఘటనంబున సామర్థ్యాసామర్థ్యములు తేటపడును. వివాదంబున రెండుపక్షంబులు లేర్పడును. పక్షంబులవారా యిరువురకుల యోగ్యతాయోగ్యతలఁజర్చించి విషయనిర్ధారణము చేయుదురు. కొందఱు ప్రతిపక్షులలోపంబు లెంచెదరు. కొందఱు మేళ్లం జూపెంతురు. శాంతచిత్తులు రెండును జేటపడ వివరింతురు. పండితులందరి మేలెర్చి సత్యనిర్ధారణము గావింతురు. కావున నొక్కొక విషయంబున కొంగుబాగులు తెలిసికొనుటకు సమయమగును. దీనికటి యనుభవమున్నపుడే పెన్నల యుపయోగము గోచరించును. "ఏనమహాత్ములంగల్గ భూమిశసభలలోఁ గవులను నధిక విఖ్యాతి గల్గు". అద్దకపుబట్టలకొల్లు రెండున్నపుడే బందరద్దకము గొల్లపాలెపుటద్దకముల మంచిచెడ్డలు తేలును. ఇట్లెన్నియో పిచ్చిమాటలు వ్రాయవచ్చును. ప్రస్తుత మేమన:—

వాల్మీకిరామాయణముంగాంచి దానిఖ్యాతిం దిలకించి యిటీవల వ్యాసుఁడు రచియించినభారతమునకు వచ్చిన గౌరవముఁ దద్వితీయమునకుఁ గలసమానగౌరవము మున్నగునవి కొన్ని యిచ్చో వివరింపఁదలఁచితిని. బారెఁడు మూరెఁడు పీఠికలెందుకు!

కాలనిర్ణయము:— రామాయణము ముందుపుట్టెనా భారతము ముందుపుట్టెనా యను విచారమునకుఁ దెలివియాధారములు దొరకవు. అదిముందని యిదిముందని మాచిన్నిసోదరులు కొందఱు పెద్దవ్రాఁతలు వ్రాయుదురు. శాసనాధారము, చరిత్రాధారమును గల యితరకవులు మొదలగువారివిషయములలో నాల్గుమూఁడుశతాబ్దములవాఁటివానికే కాలనిర్ణయము కుదరక పండితులు తికమకలాడుచున్నారు. అట్టిచో నెన్నాళ్లవని తలంచినను యుగములు దాఁటిపోయినవని మేముతలంచు నీరెండుగ్రంథములకుఁ గాలనిర్ణయము చేయుటకు శక్తి నాకు లేదు. ఎన్ని కవులచరిత్రములున్నను నెన్నిగ్రంథములున్నను నాయొరికి దగ్గఱనుండు కూచిమంచి జగ్గకవి కృతియిచ్చిన దీకులకొండవీనయ్య యేయూరివాఁడో తెలియరాలేదు. కావునఁ గవిజీవితములు కవులచరిత్రలు నాకు నచ్చలేదు. ఇట్టి యూహాలను బోఁగొట్టుకొనవచ్చునాయని యొక్కింత యూహించి యూహాలను గ్రంథస్థము చేయఁదలఁచితిని. నమ్మినను నమ్మకున్నను; మానిన మానవచ్చును; నాకావిషయమునఁ బట్టుదలలేదు. ఇతరులపూర్వపక్షములకు సిద్ధాంతముచేయఁబూనను. రామాయణ మెప్పుడు పుట్టినది? వేదములో రామశబ్దము లేకున్నను రామునిగుణములుగల యొక్కనిగుణములు రాముఁడే యనిపించునవి కనఁబడుచుండుటచే- నతిప్రాచీనకాలమునుండి రాముఁడుతలంపునకు వచ్చువాఁడుగదా. ఆరామునిగూర్చి వ్రాయఁబడిన శ్రీమద్రామాయణము కాలమెప్పుడనుటకు-ఎట్లయిన వేదకాలమున కీవలనే పుట్టియుండును. గుంటవానిపాలెము చింతపండు పాలుపడే కాని చిన్న గాంద్రకు జ్ఞప్తికిరాదు. కావునంతయును నదిలేదనవచ్చునా? పాండవుల పేరులు వేదములలోఁ గనఁబడవు. నీవు వేదముచదివినావా యనియడిగితిరా యెన్నో ప్రశ్నలు వేయవలసివచ్చును. భారతము వేదకాలమున కీవలిదనుటకు సంశయ ముండఁగూడదు. అదిచాల నవీనము. ఇతరాధారములు మనభాషలో మనదేశములో లేవు. అప్పుడితరభాషలలో మున్నవా, యెంతకాలము క్రిందటివి? ఎన్ని భాషలున్నను మనకుఁ బ్రామాణ్యమునకుఁ దెలుగుభాష కావలయును. పశ్చిమదేశముం దీసికొందము. పూర్వము హిందువార్యులతో నీదేశమునకు వచ్చి సింధుమైదానములలో వసించి యార్యులనార్యులై నసిమ్మట వారియింటఁ బనులుచేసికొని జీవించుట కుపపత్తి లేక వారినలెడ దిగఁబడులై గంజాముజిల్లాలోని తోఁటపల్లి బరదకోట, బర్వాకొండలలోని తిరుగుచుండు లంబాడీలు, బుడుబుక్కలు, గదబలు, కోయలు మొదలగువారికి బట్టలు కట్టుకొనుటనేర్పి దయచేసికొని యొవ్వరికి కక్షపాలలోనుండియో రామాయణమును మనవా రపహరించిరని తోఁచుచున్నది. ఈరహస్యము నా కంగారకునిలో నావురుదుబ్బులప్రమాదమున వచ్చినచేఁ గాలిపోయి నప్పుడు చంద్రునిలోని పంటకాల్వలలోని నీరు పోఁతించియార్పిన యొకఁడు తీఁగలేని వార్తపంపినాఁడు. దానిని నేను వ్రాసికొనకుండ లోలోన దాఁచుకొన్నాఁడను గావున తోఁచుట యేమిటి- నిజమే- భారతము మన దేశమునకు వచ్చినదాని కేమాత్రమును నెవ్వరును చెప్పలేదు. కాఁబట్టి పాశ్చాత్యదేశాధారము మనకునచ్చుఁదగినవానిలో ముఖ్యమైనది. ఒక్క యక్షరశాస్త్రజ్ఞుఁడు "రామన్ బాతిమ్" అనుపదము సంగ్రహించినాఁడు. ఆశాస్త్రజ్ఞుఁ డక్షరములెట్లు పుట్టినవో యనుచర్చ చిన్నగఁజేసెను. తోఁకలు ప్రమాదమునఁ దెగిపోయిన రెండుకోఁతులవల్లఁబుట్టిన మనుష్యులు మొదలుకొని భాషయెట్లు వృద్ధియైనదియును నాలఁడు వ్రాసినాఁడు. ఎ. అబ్రాహాములింకను. బి. బేబరునింబెముంచని యిట్లక్షరక్రమమును బట్టి ఆర్. రాముని కంటె ఎస్. సీత చిన్నదియని వ్రాయఁబడినది. అందు "రామన్ బాతిమ్" పదమునాతఁడు పెట్టులకీవలఁ బడైచినాఁడు. నారదవ్యాకరణమునకు వ్యాఖ్యవ్రాసి సహజవైరముచే దేవతలను విమర్శించుచు రావణుఁడు తెనుఁగు మాన్యంతభాషయని నిశ్చయించినట్లు తెల్పఁబడినది.

పదునెనిమిది పర్వముల భారతమునకుఁ బదునెనిమిది దినముల యుద్ధము-బదునెనిమిది యక్షౌహిణులసేనయు. దశరథునకు ముగ్గురు భార్యలవలన నలువురు కొడుకులు నొక్కకూఁతురుఁ బుట్టిన, పాండురాజున కిద్దఱు భార్యలవలన నైదుగురు పుత్రులే పుట్టింపఁబడిరి. మఱి ధృతరాష్ట్రునకు నూర్గురు కొడుకులకుఁ గడగొట్టొక్కకూఁతురు. దశరథునకు బాలకాలము సంతానము లేదు. కావున నేకారణమునైన నేమి భారత కథానాయకులకును సంతానముగలుగలేదు. దశరథుఁడు వేటకేఁగెనని పాండురాజును వెళ్లెను. అతఁడు నీరుముంచుచున్న మునిబాలుని సారంగము (ఏనుఁగు) అనిచంపెను. ఈతఁడు విహరించు మునిదంపతులను సారంగము (లేళ్లు) లనిచంపెను. ఆరాజునకుఁ బుత్రవియోగమున మరణమని శాపమువచ్చిన నీరాజునకు భార్యాసంగమమున మరణమని శాపమిప్పించెను. మొదటిరాజు పుత్రకామేష్టియను జన్నము చేయఁగాఁ బాయసపుముద్దలను యజ్ఞపురుషుఁ డొసంగెను. రెండవ రాజుభార్యకే యొకముని మంత్రముపదేశించె. రెండుముద్దలు ముగ్గురుస్త్రీలు నాలుగుభాగములుగాఁ బంచుకొని నలువురుబిడ్డలంగనినట్లు రామాయణముంజదివి యొకమంత్రముననే యిద్దఱుస్త్రీలకు నైదుగురు పుత్రులుపుట్టునట్లు చెప్పెను. (ఇందును బాయసపుముద్దలవలె మంత్రోచ్చారణములును నాలుగే). లక్ష్మణశత్రుఘ్నులు కవలవారైనందున నకులసహదేవులునైరి. రామాదులకుఁ బ్రథమమునగురువు సుధన్వుఁడు. పిమ్మట విశ్వామిత్రుఁడు. నగస్త్యుఁడునూరకయే విలువిద్యనేర్పిరి. భారతములో మొదటఁగృపాచార్యుఁడు, తర్వాత ద్రోణాచార్యులు జీత గాండ్రై నేర్పిరి. ఇంద్రుఁడు, శివుఁడును సాయపడిరి. తనబాహుబలమున యుద్ధాదులలో దశరథుఁ డింద్రునకు సాయపడిన గ్రుడ్డిధృతరాష్ట్రునొక్కచోఁ గూర్చుండఁబెట్టి పాండురాజు తనబాహుబలమున రాజ్యమునడపెను. అతనికొడుకు కర్జునుఁ డింద్రునకు సాయపడి నివాతకవచాదులనుజంపెను. తనపుత్రుఁడగు భరతునకు రాజ్యముకావలయునని కైక తంత్రములెక్కుడ (సవతితల్లి)చేసి రెండువరములమీఁదనై రాము నడవికిఁ బంపఁగాఁ జిన్నతండ్రికొడుకులగు పాండవులకు భాగమీయవలసివచ్చునని పెద్దతండ్రికొడుకులు రెండుసారులు జూదమాడి యోడించి యడవికిఁబంపిరి. ప్రోత్సాహకులలో మంథరకు మాఱు శకునిం జెప్పవచ్చును. దశరథుఁడు మృతినొందినపుడు ముగ్గురుపత్నులు మిన్నకుండిరని పాండుని మృతియప్పుడు చిన్నభార్యను సహగమనము చేయించెను. దశరథునిమృతి యప్పటి తైలద్రోణిసందర్భము వ్యాసుఁడు దుర్యోధనాదులు పుట్టినపుడు కుండలలోఁబెట్టించుటగా ననుకొనవచ్చును. రామునిపట్ల ముగ్గురుతమ్ములు నెంతభక్తిగలిగియుండిరో ధర్మజునిపట్ల నలుగురుతమ్ములు నంతభక్తిగలిగియుండిరి. శాంత మొదటఁబుట్టిన నామెను రాజునకుఁ దత్తిచ్చి బ్రాహ్మణునకుఁ బెండ్లిచేసినందునఁ బెండ్లికాకమున్నె కుంతికిఁ బుట్టినకర్ణుని సూతకులమువారు పెంచుకొనిరి. రామాయణములో సూర్యవంశపురాజులు, భారతములోఁ జంద్రవంశపురాజులు. రామాదులు విష్ణ్వంశము; పాండవులు ధర్మ, వాయు, శక్రాదుల యంశములు. ధార్తరాష్ట్రులు కలిద్వాపరాదుల పాళ్లవలనఁ బుట్టిరి. వాల్యర్జును లింద్రపుత్రులు; సుగ్రీవకర్ణులు సూర్యపుత్రులు; హనుమంతుఁడు భీముఁడు వాయుపుత్రులు. ఇట్లే యంశముల జన్మము తెలియఁగునది. రామలక్ష్మణులు మునివేషము వేయఁగాఁ బాండవులు బ్రాహ్మణవేషము వేసిరి. భరతుఁ డన్నరాజ్యమునేనెట్లు హరింతునా యని విచారించెను. దుర్యోధనుఁ డన్నదమ్ముల రాజ్యము నెట్లు హరింతునాయని విచారించెను. (ధ్వనియందుఁబ్రధానము). లంకాదహనమునకే లాక్షాగృహదహనము- స్వయంప్రభగుహకే యుప్పరిత్రవ్విన భూబిలము. శూద్రముని తపంబునుండి బ్రాహ్మణబాలుని రాముఁడు రక్షించెను- (చచ్చినవానిని బ్రతికించెను). భీముఁడు బకాసురుని నోటఁబడి చావఁబోవు బ్రాహ్మణబాలుని బ్రదికించెను. ఇంక నెన్నియేనిఁ జెప్పవచ్చును.

వివాహములు:-సీతపూర్వజన్మమునఁ దన్ను నవమానపరచిన రావణునిఁ రెండవజన్మమునఁ దనభర్తచేఁజంపింపఁబ్రతినపట్టి తొలిమేను నగ్నికర్పించి యజ్ఞప్రదేశమున నేలలోఁ జాలులోనుద్భవించినది. మఱి ద్రౌపది తొలిపుట్టువున వివాహమునకు భంగము కావించిన భీష్ముని మఱుజన్మమునఁ దనభర్తచేఁ జంపించుటకై తొల్లింటిమేను నగ్నికిచ్చి ద్రుపదుని యజ్ఞకుండములో నుండి పుట్టుటయే కాదు; తనతండ్రిని బరాభవించిన ద్రోణునిఁ జంపుటకని యొకసోదరుని వెంటఁబెట్టుకొనివచ్చినది. దశరథుని పుత్రకామేష్టిలో కుండమునుండి యజ్ఞపురుషుఁడు వెడలెను. ద్రుపదుని యజ్ఞకుండములో నుండి దృష్టద్యుమ్నుఁడు ద్రౌపదియు నిద్దఱువచ్చిరి. జనకుఁడు పెంచుట, భూమిలోఁ బుట్టుట, చాలులో నగపడుట-యీ కారణములచే సీత-జానకి, భూపుత్రి-సీత యైనందున ద్రౌపది. ద్రుపదుని పెంపుచే ద్రౌపది-యాజ్ఞసేని, ఇత్యాది. సీతా ద్రౌపదులు రాముని నర్జునుని బెండ్లియాడఁబుట్టిరి. రావణుని జంపఁదగ్గ బలవంతుని వెదకుటకు దైవచోదితుఁడై జనకుఁడు శివుని విల్లెక్కుపెట్టినవానికి సీతనిచ్చుటకుఁ బ్రతినచేయ,ద్రుపదుఁడు, నర్జునుఁడు మాఱువేసములతో నెక్కడనైన నున్నాఁడా, లక్కయింటఁ గాలినాఁడా, యని తెలిసికొనుటకు మత్స్యయంత్రము-అక్కడను విల్లెక్కుపెట్టుట-ఇట్లు కల్పించెను. అక్కడను బలువురు రాజపుత్రులు విల్లును బట్టలేక భంగపడిరి. ఇక్కడనునట్లే. రాముఁడను క్షత్రియపుత్రుఁడు బ్రహ్మర్షియగు విశ్వామిత్రునితో విల్లెక్కు పెట్టఁబోటికి వచ్చెను. పాండవులను క్షత్రియకుమారులే బ్రాహ్మణవేషములతో బ్రాహ్మణబృందములోఁ గలసివచ్చిరి. విల్లు విఱిచిన రాముని మూలమున నలుగు రన్నదమ్ములకు నలువురు కన్యలతోఁ బెండ్లియైనది. అర్జునుని మూలమున నైదుగురన్నదమ్ములకు నొక్క కన్యతోఁ బెండ్లిచేయఁబడినది. విశ్వామిత్రుఁడు రాముని చేరు వినికిడి కావలెనని రామలక్ష్మణులను దండ్రినడిగి తీసికొనివెళ్లెను. ద్రోణాచార్యుఁడు శిష్యులనందఱం బిలిచి ద్రుపదునిబట్టువా రెవ్వరని యడిగెను. చెట్టుచివర మాయపక్షిని బెట్టి ద్రోణాచార్యులు చేసిన చిత్రము- (వ్యాసుఁడు సమయము వచ్చినపుడెల్ల రెండుమూఁడు విధములఁ జమత్కరించుచుండును). వాలిం జంపుటకు సమర్థుని వెదకుటకు దుందుభి కళేబరము-సప్తతాళములు సుగ్రీవుఁడుకల్పించుట కావచ్చును.

వనవాసము:—వనవాసమునకు వాల్మీకి యొక్కకాండము నరణ్యకాండము -రచించెను. వ్యాసుఁడొక్క యారణ్యపర్వమును

వ్రాసెను. చిత్రము, రాముని వనవాసము పదునాలుగేండులు. పాండవుల వనవాసమున వ్యాసుఁడొక్కఁ డేఁడు రక్షించి పండ్రెండేఁడులు సాధారణము - నొక్కఁడేఁడు కఠినము - ఈ యేఁడే యజ్ఞాతవాసమని యెంతచిత్రముగానైన నల్లినాఁడు. రాముఁడు పద్నాల్గేండ్లు వనములోఁ దిరిగివచ్చునప్పటికి భరతుఁడు నాఁటుకొనునని కైకతలంపు. పాండవులుమరల రానేలేరు. అజ్ఞాతవాసములోఁ బట్టుకొందుమని దుర్యోధనాదులతలంపు. రాముఁడువచ్చినను జనులు భరతుని పాలనము తెన్నగా నున్నదందురు. కాని రాముఁడు బలవంతుఁడని కైకయెఱుఁగదు. పాండవులు; బలవంతులు ధర్మరాజువచ్చినా, నన్నే జనులు వలచెదరు. పదుమూఁడవయేఁ డెక్కడ నున్నను బట్టుకొనుచుంటిమా వారికెప్పటికి వనవాసము, నాకెప్పటికి రాజ్యలాభమని దుర్యోధనుఁడు - ప్రక్కబెదరుచేఁజేసినది. రావణుఁడు దుర్యోధనుఁడు, నొక్కరీతిగాఁ జూడవచ్చును గాని గుణభేదముకలదు. రామాయణ భారతములు చదివిన వారి సారవంతమైన వాక్యరాజమున రావణుఁ 'డెఱిఁగిన మూర్ఖుఁడు' 'దుర్యోధనుఁ డెఱుఁగని మూర్ఖుఁడు' నని నిగ్గుఁదేర్చినారు. అడవులలో రామునకుఁ బాండవులకు మునులు మేల్లొనరించిరి. జంతువులంగొట్టి తెచ్చికొని తినినంత తిని పిదప మిగిలినమాంసము నెండఁబెట్టి దాఁచుట సీతపనియైనది. పాపము ద్రౌపది కేయాకులు నలములు తెచ్చియిచ్చినను బంచభక్ష్యపరమాన్నములు చేయువర మొసంగఁబడినది. తల్లులతో వసిష్ఠాదులతో సదుద్దేశమున భరతుఁ డడవికి రాముంజూడఁబోయిన దురుద్దేశముతో దుర్యోధనుఁడు గోవులను జూచుటకనుమిషపై స్త్రీజనముతో బాండవులంజూడఁవెళ్లి "కాఁదలఁచినపనిని గంధర్వులుతీర్చ" నట్లుచేసికొనివచ్చెను. విషయము తెలియని సహోదరులుభరతునిపైఁగినిసిరి. తెలిసిన మునులుమొదలగువారు దుర్యోధనుశపించిరి. రాముఁడయోధ్యకు రాననిన భరతుఁడు నేను నిందేయుండునని పదికి నీవునత్తునని చెప్పఁదాఁక నేలఁబండుకొందునని పట్టుపట్టినదానికే గంధర్వులవమానించిరని దుర్యోధనుఁడు ప్రాయోపవేశము చేయఁబోయినది. మాయలేడిని సీతకోరెను. సౌగంధికమును ద్రౌపదికోరెను. సీతను రావణుఁడు హరించెను. ద్రౌపదిని సైంధవుఁడు పట్టికొనియెను. సీతయొద్దలక్ష్మణుని గాఁపుంచెను. ద్రౌపదియొద్ద ధౌమ్యునిబెట్టెను. జటాయువు ధౌమ్యుఁడు సమానధర్మము గలవారు. రాక్షసస్త్రీ శూర్పణఖ రామునిఁబెండ్లియాడఁ గోరినది. సాఁగలేదు. హిడింబ భీమునిఁబెండ్లియాడినది. రామునికదియపకారము, పాండవులకిదియుపకారముచేసిరి. కిష్కింధ - విరాటువిషట్టణము. సుగ్రీవుఁడు - విరాటుఁడు; వాలివధాదులు సుగ్రీవునకు రామునకుఁ దోడుపడెను. గోగ్రహణాదులఁ బాండవులు విరాటునకుఁ దోడైరి. లాలించిసీతనుగొన రావణుఁడుతలఁచెను. బలవంతమున ద్రౌపది నవమానపఱచి దుర్యోధనాదులు చేయఁబోయినదిచాలక సింహబలుఁ డొక్కఁడు దాఁపరించినాఁడు. సీతను వెదకుటకు సముద్రలంఘనాదులుఁ బాండవులను వెదకుటకు గోగ్రహణ పాంచరాత్రాదులును.

యుద్ధము:—రావణునిచేష్టలు విభీషణునికి నచ్చక రామునితోఁజేరుటకే విదురుఁడు - యుయుత్సుఁడును బాండవులంజేరుట. రావణుఁడు తమ్ముఁడగువిభీషణునిఁ దన్నినదానికే ధృతరాష్ట్రుఁడు తమ్ముఁడగు విదురుని దఱిమివేయుట. నాపక్షములోని వారాపక్షమునకు బోవువారు, ఆపక్షమునుండి నాపక్షమునకు రాఁగోరువారుఁ గలరాయని ధర్మరాజు పలికినపలుకులు వ్యాసునికొంటెయుక్తులలోనివి. మఱియుఁ బాండవులలోఁ జేర్పకుండఁ గర్ణుని మొదటినుండియు విరోధిపక్షముననే యుంచెను. దఱిమివైచిన విదురుని మరలఁ బిలుచుకొనిరెను. అంగదునిరాయబారమునకు, శ్రీకృష్ణునిరాయబారము, సంజయునిరాయబారమును. మీఁదుమిక్కిలి విరాటునిపురోహితుఁడు, తోడలు విఱుగ శాపమిచ్చినముని. అందు హనుమంతుఁడు పోరియులసి కాబోలు నిందు ధ్వజమెక్కి చూచుచుండెను. శ్రీహరి నరుఁడై క్రోఁతులుకొండముచ్చులతోఁగూడి యుద్ధముచేయ శ్రీకృష్ణుఁడై శ్రీహరి తాను గత్తిముట్టక మనుష్యులచేఁ బోరించెను. అందున శక్తిప్రయోగము నిందునను శక్తిప్రయోగము. అందు నాగబాణప్రసంగము, నిందునాగబాణప్రసంగము. బ్రహ్మాస్త్రములు రెంటనుగలవు. రావణునిపాతాళహోమము దుర్యోధనుఁ హ్రదప్రవేశము. నాగురువు విల్లువిఱిచినాఁడని పరశురాముఁడు రామునిపైఁ గినిసిన న్యాయముగఁ దొడలు విఱిచినాఁడని బలరాముని కోపము. విరోధివధము పట్టాభిషేకము అశ్వమేధము (రాజసూయము) నిందువందునుగూడఁ గలవు.

విశేషములు:—నందిగ్రామములో భరతుని యునికికి సభానిర్మాణమును దానింజూచి యోర్వని దుర్యోధనుని దుఃఖమును బోల్పవచ్చును(తృప్తిగాఁదోఁపదు). దశరథుఁడు రామునియుద్ధము స్వర్గమునుండి వచ్చి విమానముమీఁద నిల్చిచూచెను. పాండురాజు ధర్మరాజునొద్దికి నారదునిచేత స్వర్గమునుండియే వార్తపంపెను. అరణ్యమునకు భరతుఁడు వచ్చినపుడు రాముఁడు నీవందఱఁ గాపాడుచున్నావా జీతములు నెలనెల కిచ్చుచున్నావా యని యొక్క యధ్యాయము చెప్పినదానికి నారదుఁడే యీరీతిగా ధర్మరాజు నడిగినాఁడు. ఛాయాగ్రాహిణి మొదలగు సముద్రమధ్య గ్రహములను హనుమంతుఁడు చంపుటయు నర్జునుఁడు సముద్రమధ్యమున నుండు క్షుద్రుల శిక్షించుట. హనుమంతు డొకభూతము చేత మ్రింగఁబడి దానిప్రేగులు తెమల్చినదానికి గరుత్మంతునిచే మ్రింగఁబడి యొక బ్రాహ్మణుఁడు గొంతుగుండెలు మండించినాఁడు. కుశలవులు వనమున ఋష్యాశ్రమమునఁ బుట్టిన కారణమునఁ బాండవులును మునిపల్లెలలోఁ బుట్టినారు. దశరథుఁడు రెండువరములు కైకకిచ్చిన ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికిఁ గావలసినన్నివరము లడుగుమనెను గాని యామెయు రెండు వరములకంటె నెక్కువ యడుగక దానికి సూత్రములు గనఁబరిచినది. అంగదుఁడు మండోదరిని దలపట్టి యీడ్చిన దుశ్శాసనుఁడు ద్రౌపదిని దలపట్టి యీడ్చి సుద్దులుకూడ విప్పెను. రావణాదులు తపస్సుచేసి బ్రహ్మవలన వరంబులంగొనిన నర్జునుండు తపస్సున నింద్రునీశ్వరు మెప్పించుట. రామాయణములోని రాక్షసమాయలకు హైడింబునిచేఁ గొన్ని మాయలు చేయించుటకుఁగా నొక్కరాక్షసుని బెట్టెను.' హనుమంతు విశ్వరూపము శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూపము. దుష్టుల (రావణాదుల) బాధలకు బ్రహ్మాదులు విష్ణుమూర్తికడ మొఱపెట్టుకొనుటచే భూభారము మాన్పఁ గోరఁబడినది. రాక్షసకులక్షయము. సర్వకులక్షయము, ధృతరాష్ట్రవంశక్షయము.

అందు నిందు దేవదానవాంశములఁ బలువురు పుట్టిరి. అనసూయ సీత కంగరాగాదులిచ్చుట పతిభక్తి బోధించుట సత్యాద్రౌపదీ సంవాదముతో సరిపెట్టుకొనవచ్చును. మండోదరి మొదలగు రాక్షసస్త్రీల యేడ్పునకు స్త్రీపర్వమే. లక్ష్మణవిదురుల దేహత్యాగ మొక్కజత. రాముఁ డయోధ్యావాసుల నందఱ సరయూనదీమార్గమున స్వర్గమునకుఁ బంపిన వ్యాసుఁడు భారతరణమృతుల గంగానదిలో నుండి లేవదీసి వారివారి విధవలను వారివారితో గంగలోఁద్రోసి పంపెను. ఈతనికి విడోల (విధవలు) మీఁద దయయెక్కుడు. బ్రహ్మ పంపున రాముని యొద్దికి యముఁడు వచ్చెను. ధర్మరాజు నొద్దికిఁ గాలుఁడు కుక్కవేషముతో వచ్చెను. ఇందునందు మహాప్రస్థానము. రామాయణములో రామునియొద్ద వసిష్ఠుఁ డన్నిటికిని-ధర్మరాజునొద్ద వ్యాసుఁడు మంత్రాలోచనాదు లన్నింటికి. వాల్మీకి రామాయణగ్రంథకర్త మాత్రమే. వ్యాసుఁడో యనేకగ్రంథకర్త - భారతములోఁ గథానాయకుఁడే యాతఁడనవచ్చును. రాముఁడు కథానాయకుఁడును శ్రీహరియు; భారతమునఁ గథానాయకుఁడు వేఱు; శ్రీహరి వేఱు. దశరథుని కొఱకే పుత్రకామేష్టియని రహస్యముగా నొకరుచెప్పిరి. సర్పయాగము "సీతదగ్ధముగాఁగ దేవవినిర్మితము" అని సర్పయాగము నెవ్వరుం జేయలేదు. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు లేదని ఋత్విజులుచెప్పిరి. సీతను బెండ్లి యాడినపిదప వచ్చి రామునిపైఁ గోపించిన పరశురాముఁడే భారతములో భీష్ముని నీ వంబను బెండ్లియాడుమని కోపించెను. ఇందువిశేష మేమన నొక్కఁడు నాకు వలదనివిడిచినకన్యను బ్రహ్మచర్యవ్రతభంగముచేసికొని పెండ్లియాడుమనుట. గురువుగారివిల్లువిఱిచినందున శిష్యుఁడు రామునితోఁ గయ్యముచేయరాఁగా గురువు శిష్యునితోనే (భీష్ముఁడు, బరశురాముఁడు) పోరవచ్చెను. తెల్లవారకుండ ద్రోణపర్వతముం దెచ్చినంగాని లక్ష్మణుఁడు బ్రదుకఁడని ప్రొద్దుగ్రుంకకుండ సైంధవుని జంపకున్న నర్జునుఁడు బ్రదుకఁడఁట. రామాయణములో ద్రోణపర్వతమునకు మహాభారతములో ద్రోణపర్వము. (మహాభారమున్ద్రోణపర్వతము) తండ్రినిజంపినకారణమునఁ బరశురామునిచే క్షత్రియ సంహారము చేయఁబడినది. తండ్రిఁజంపినకారణముననే యశ్వత్థామ ధృష్టద్యుమ్నుని జంపినది. ఇద్దఱును బ్రహ్మచారులు; ఇద్దఱుబ్రాహ్మణులు; ఇద్దఱుఁజిరంజీవులు. శివశిష్యుఁడొకఁడు శివభక్తుఁడొకఁడు. పరశురాముఁడు స్వర్గమునకుఁబోకుండ రాముఁడు మార్గనిరోధము చేసిన నశ్వత్థామను స్వర్గమునకుఁబోకుండ వ్యాసుఁడు దనతోనె భూలోకమున నుంచుకొనియెను. సీతముందుగాఁ భూమిలోఁజొచ్చినది. ద్రౌపదిముందుగా భూమిమీఁదఁ బడినది. రాముఁడు లక్ష్మణుని బ్రతికియుండఁగనే తఱిమివేయునప్పుడు కొంచెమునించెనని ధర్మరాజాతమ్ములు భూమిమీఁదఁబడినపిమ్మట పీనికిట్టిగర్వము పీనికిట్టి స్వాతిశయమని నిరసించి విడిచిపెట్టెను.

చిత్రములోఁజిత్రము :— క్రొత్తవాల్మీకులు క్రొత్తవ్యాసులు బైలుదేఱిరి. క్రొత్తవాల్మీకులు,విచిత్రరామాయణములు, ఆనందరామాయణములు, అద్భుతరామాయణములు, హనుమద్రామాయణములు, అధ్యాత్మరామాయణములు, శతకంఠరామాయణములు, సహస్రకంఠరామాయణములు (అర్థములేని పేరులతో) రచియించిరి. క్రొత్తవ్యాసులు చిత్రభారతములు మొదలయినవి లిఖించిరి. ప్రక్షిప్తము లిందునుగలవు. నవీనవాల్మీకుల వింతలు చెప్పనలవి గాదు. వాల్మీకిరామాయణములోని రామునిచారిత్రమునకు భంగముందెచ్చు గాథలువ్రాయఁబడినవి. వారుచెప్పినభాగము నొకదానినెత్తి బదులలోఁ జూతము పెట్టినారు. దాని పేరు "వేసుకరమే వెతగొలుపును". చిన్నతనమునఁ దనతమ్ముఁడు పాలుత్రాగకున్నఁ దానుత్రాగనిరాముఁడు కుంటిదనిగూనిదని మంథరను వెక్కిరించి గూనుమీఁదఁగొట్టి కైకకుఁ గోపమురాఁగా నింతకష్టపడినాఁడని వ్రాసెను. ఆహా! ఇక్కడిరాముగుణము లెంతగా వివర్ణించినాఁడు. నాయనా, నీవు రామాయణము లెన్ని చదివితివి? వాల్మీకి లక్షణము నీవట్టు లెఱుఁగుదువు. వినయ వినాశమగుననుభయముచే సందర్భముదొరకినచోటనెల్లఁ గథాచ్ఛలంబున నితర గాథలం దెల్పు వాల్మీకి- విశ్వామిత్రునిచేతనే విశ్వామిత్రచరిత్రముం జెప్పించినవాఁడు- రాముఁడు మంథరఁ గొట్టినఁ దిట్టిన వేళాకోళము చేసినఁ జెప్పఁడా! రామునినోట నొరులు నొచ్చుకొను పరిహాస వచనమే వెడలదే; యట్టివాఁ డాఁడుదానిఁ గొట్టునా! తిట్టునా! అట్టి వచనమే వెడలిన వాల్మీకి చెప్పకమానఁడు: త్రిజటుఁడను బ్రాహ్మణునితో రాముఁడు "తమువాచ తతో రామః పరిహాససమన్వితమ్" అని కూడఁ దెల్పినాఁడు. ఆపరిహాస మెంతచక్కని సందర్భమున నున్నదో రామాయణముఁ జదువుఁడు. మైనమువలె నూబిలోని,రాటలవలె నెటువంటిన వటువంగును. బాలురహృదయములలో నిట్టురాముని దోషగుణములు కల్పించి చెప్పు వాల్మీకులకు నమస్కారము.

ఆర్యులారా! ఇట్టివి వ్రాయుటకుఁ జిరకాలముక్రిందట (1896 లో) కీర్తిశేషులు బ్ర. శ్రీ. గురుజాడ శ్రీరామమూర్తి పండితులుగారు విజయనగరములో శ్రీవ్యాసనారాయణస్వామి యాలయముకడఁ బర్వతముమీఁద గూర్చుండి చెప్పిన కొన్ని బీజవాక్యము లాధారమైనవి.

సంపూర్ణము




“ ఒక సోదరుఁడు ”

## ౧
## పరిచయము

బాల్యమునందె మోహనరావు తనతలిదండ్రులఁ గోల్పోయెను. నాఁటినుండియు నాతని మేనమామయగు మాధవరావుగారతనిని, తలిదండ్రులు లేనిలోపము లేకుండఁ బెంచుచుండిరి. ఈయనకు విజయవాడలో మూఁడు నాలుగువందల రూపాయల వేతనముగల యొక గొప్పయుద్యోగము గలదు. చిరకాలమునుండి విజయవాడయే నివాసస్థలమైనందునఁ, గృష్ణయొడ్డునఁ 'జంద్రభవన'మను పేరిట నొక సుందరమగుభవనమునుగట్టించి యుందుండిరి. ఆయన కొకపుత్రిక గలదు. ఆమెయే మనకథానాయకియగు జానకి! ఈమె మోహనునికన్న నాలుగేఁడులు చిన్న. లేక లేక కల్గిన యొక్కపుత్రికపైఁ దలిదండ్రులగు మాధవరావు, కామేశ్వరమ్మగార్లకుఁగల ప్రేమయింతయని వేఱుగ వర్ణించి వ్రాయుటనవసరము. మోహనరావునుగూడ వారు తమకన్నబిడ్డకన్న నెక్కుడుప్రేమాతిశయముతోఁ బెంచుచుండిరి. వారికిఁ బురుషసంతానము లేకపోవుటయు దీనికిఁ గారణము.

మాధవరావుగారియోగ్యత, మేధాశక్తి, మొదలగునవి, ఆయనకుఁ బ్రజలయందు బ్రఖ్యాతి గడించిపెట్టినవి. ఎల్లరకు నీయనయనిన సమితమగు భక్తి. తాను కలుగఁజేసికొన్న ప్రతివిషయమునందు నీయన యగ్రస్థానమువహించి ప్రజలగౌరవాదరణలకుఁ బాత్రుఁడగుచుండెను. ఇఁకఁ గామేశ్వరమ్మగారిమార్గము వేఱు! ఈమెను జిన్ననాఁటినుండియుఁ బట్టుదలయనుపిశాచము బాధించుచుండెను. తాను పట్టినపట్టు మంచిదైనను, చెడ్డదైనను, విడువదు. దూరమాలోచించుస్వభావ మీమెయందు లేకపోవుటచే నీపట్టుదల తఱచు విపరీతావస్థగాఁ బరిణమించుచుండెడిది. ఈమెకుఁగలఛాందసము, దానికి మఱింత సాయమయ్యెను.

తలిదండ్రులమఱపించు మాధవరావుగారి ప్రేమకుఁ గృతజ్ఞుఁడై, మోహనరావు మెలఁగుచుండెను. అతనిసహజసద్గుణసంపత్తియు, బుద్ధిసూక్ష్మతయు, చారుసౌందర్యవిగ్రహమును, మేనమామనేకాక యెల్లర నాకర్షించుచుండెను. జానకి గుణరూపములందు మోహనునకుఁ దీసిపోదు. ఆమె బాలికయైనను బుద్ధిసూక్ష్మతయందును, సుగుణసంపత్తియందును బెద్దదే! ఇంకను వికసింపని యామెయౌవనకుసుమ మచ్చటచ్చట సౌరభములు వెదఁజల్లుచుండెను. జానకీమోహనులొక్కచోఁ దినుచు, నొక్కచోఁ జదువుకొనుచు, ఒక్కచో నాడుకొనుచు, నిముసమాత్రమైన నొండొరుల నెడఁబాయక పరస్పరప్రేమారూఢులై మెలఁగుచుండిరి. వారిపరస్పరప్రేమాతిశయమునకు మాధవరావుగారెంతయు సంతసించుచుండిరి.

## ౨
## మాధవరావుగారి మరణము

మోహనరావునకుఁ బదునాలుగేండ్లు నిండినవి. జానకికిఁ బదియవలేఁదు. మొదటినుండియు మాధవరావుగారికి, జానకీమోహనులకు వివాహముసేయవలయునని యాశ గలదు. అందులకే జానకీమోహనుల పరస్పర ప్రేమాతిశయమునకు సంతోషించెడివారు. తమకు మగపిల్లలు లేరు. మోహనునకుఁగల పిత్రార్జితము బహుస్వల్పము. మాధవరావుగారికి వలసినంతయాస్తి గలదు. తనకు జానకిదప్ప నితరులు లేరు. అందుచే మోహనునకుఁ బిత్రార్జిత మేమియు లేకపోయినను ఇబ్బంది లేదు. బుద్ధిమంతుఁడును, రూపవంతుఁడును, నగు అల్లుఁడే మాధవరావుగారికిఁ గావలయును. ఇవన్నియు మోహనునియందుఁ జక్కగ నమరినవి. వానికితోడుగ జానకీమోహనులలోఁ బరస్పరప్రణయము ప్రబలియున్నది. ఇంతకన్న మాధవరావుగారికిఁ గావలసిన దేమున్నది? ఆయన యీవిషయమై కామేశ్వరమ్మగారితోఁ గూడ వీలయినప్పుడెల్ల మాట్లాడుచుండిరి. ఆమె తన అయిష్టమును జూపకుండినను స్పష్టముగా నూరకొనుచుండెను. ఇందులకు గారణము లేకపోలేదు. ఈమె మిగులఁ బూర్వాచారపరాయణ. మోహనుఁడు నవీనాచార పరాయణుఁడు. బ్రహ్మసమాజమునం దెక్కుడభిమానముఁ జూపుచుండెడివాఁడు. హిందూ దురాచారములఁ దెక్కింటి నామె యెదుట సకారణముగ ఖండించుచుండెడివాఁడు. ఈమె నిజస్థితి గ్రహింపలేక యాగ్రహముఁ జెందుచుండెడిది. ఇది నిత్యము జరుగుచుండుటచేత నామెహృదయమున మోహనునిపై నసహ్యభావము నాటుకొనిపోయెను. మాధవరావుగారిట్టివిషయములందు నిర్లక్ష్యభావముఁ జూపెడివారు. జానకిగూడ నొక్కొక్కసారి మోహనునివైపు మాట్లాడి తల్లికిఁ గోపము దెప్పించుచుండెడిది. బుద్ధిపూర్వకముగ, గాదు; సరియైనకారణములు చెప్పి యామె నొప్పింపవలయునని జానకి ప్రయత్నము.

జానకి విద్యావతి. మోహనుఁ డామెను దన ప్రక్కకుఁ ద్రిప్పుకొని కామేశ్వరమ్మగారితో వాదించుచుండెడివాఁడు. ఈతనివలన జానకికూడఁ జెడిపోవుచున్నదని తల్లియూహ. అందుచే వారివివాహమామె కంతఁ యిష్టములేదు. కాని వారిద్దఱును మంచిమార్గమునఁ బడిన నిద్దఱకు వివాహము సేయవచ్చునని తలంచుచుండెను.

మాధవరావుగారు తమయుద్దేశ్యమును జానకీమోహనులకుఁ దెలియనీయలేదు. సమయమునఁ దెలియనీయవచ్చునని మిన్నకుండిరి. జానకి మాత్రమెట్లో తలిదండ్రుల రహస్యసంభాషణ విని గ్రహించెను. అప్పు డామెపొందిన హృదయానందము వర్ణనాతీతము. తా నాసంగతి మోహనునకుఁ దెలియనీయలేదు. మోహనుఁ డాసంగతి నేమియు నెఱుఁగఁడు. తనకు జానకివంటి భార్య దొరకుట దుస్సాధ్యమని తలంచుచుండెను. ఆమెపైఁ దనకుఁగల యనురాగము మరల్పఁ బ్రయత్నించెను గాని నిష్ఫలమయ్యెను. తనవంటివాఁడు జానకి నాశించుట పరిహాసాస్పదమని భావించుచుండెను. కాని యెట్లు! ప్రేమ మరలదు. ఇట్టియాలోచనలతోఁ గాలము గడపుచుండెను.

మాధవరావుగారు తమకోర్కె నెరవేర్చుకొనుటకుఁ బ్రయత్నములు మొదలిడిరి. కాని తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును. జానకీమోహనుల దురదృష్టవశమున నాయన యకస్మాత్తుగా వ్యాధిగ్రస్తుఁడయ్యెను. వైద్యులకు లోటులేదు. ఔషధములకుఁ గొదువ లేదు. కాని రోగము నానాఁటికి దుర్భరమై మరణావస్థకు దింపెను. గృహమున నెవరికిని ధైర్యములేదు. వైద్యులు తమతమశక్తిసామర్థ్యముల నుపయోగించిరి. కాని కార్యము లేకపోయెను. మన మెన్ని ప్రయత్నములు చేసినను విధివ్రాఁత తప్పదుగదా! మాధవరావుగారి కవసానకాలము సమీపించెను. అప్పుడు భార్యనొక్కతెను బిలిచి తనలోనున్న బాధ నంతయుఁ బ్రయత్నముమీఁద నణఁచిపెట్టి యామెతో నిట్లనెను: "నాకిఁక భగవంతుని యాజ్ఞ యైనది. పోయివచ్చెదను. నీవుమాత్ర మధైర్యముఁ జెందక జానకీమోహనులను జాగ్రత్తగాఁ బెంచుము. సాధ్యమగునంతత్వరలో వారిరువురకు వివాహమొనర్చియందఱును సుఖముగ నుండుఁడు. నాచేతులతో నేను వారిద్దఱకు వివాహము సేయవలయునని యత్నించితిని గాని నా కాయదృష్టము లేకపోయెను." భార్య మాటాడలేక కంటనీరువెట్టుకొని యేడ్వఁదొడఁగెను. తరువాత జానకీమోహనులఁ బిలిచి తనప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని "అమ్మా, జానకీ! నాయనా, మోహనా! నేను పోయివచ్చెదను. ఇఁకముందు మీజీవితము లెట్లుండునోకదా! అన్నిటికిని [illegible]యున్నది. మీరుమాత్రము భద్రము. మీ వివాహము చూచుభాగ్యము నాకు లేదందుకు విచారించుచున్నాను." అనియెను. లోనుండి పొంగిపొరలివచ్చుచున్న దుఃఖము కన్నీటిగుండ బయటఁబడెను. జానకీ మోహనులు మాధవరావుగారిమీఁదఁ బడి కౌఁగిలించుకొని హోరున నేడ్వఁదొడఁగిరి. అందఱకును మనోధైర్యము వాడెను. ఇఁక వారికి ధైర్యము చెప్పువారెవరు? మాధవరావుగారిని బాధించుచుండిన రోగ మొక్కపెట్టున భయంకరమృత్యురూపము దాల్చి ఆమహానుభావుని నోటవైచికొని పోయెను.

## 3

## జానకి - మోహనరావు

మూఁడేండ్లు గడచినవి. కామేశ్వరమ్మగారు జానకీమోహనులను బెంచుచుండిరి. మోహనరావు కాలేజీచదువునకై రాజమహేంద్రవరమేఁగెను. కృష్ణయొడ్డున వారి చంద్రభవనమునందే జానకి, కామేశ్వరమ్మగారు నివసించుచుండిరి. మోహనరావు సెలవులకు వచ్చుచుండెను. అతఁడు రాజమహేంద్రవరములో నున్నన్నాళ్లును జానకి కేమియుఁ దోఁచుటలేదు. ఇంతవఱకొకరినొకరు వదలియుండనివారి కిప్పు డెడఁబాటుగల్గినఁ గష్టమే కదా! కాని తప్పదు. వారిద్దఱు నెట్లో దినములు గడపుచు వచ్చిరి. సెలవులనిన వారికి పండుగ. ఎప్పుడు సెలవుదినములు వచ్చునా, ఎప్పుడు విజయవాడకుఁ బోవుదునా, యని మోహను డాలోచించుచుండును. ఎప్పుడు మోహనుఁ డింటికివచ్చునా యని జానకి తపించుచుండును.

క్రిస్టమస్ సెలవులు వచ్చినవి. మోహనరా వింటికి వచ్చెను. ఇఁక జానకీమోహనులకుఁ బండుగే! వారొండొరులఁగాంచి సంభాషించుకొనునప్పుడు శశాంకునిఁజూచి జలధి యుప్పొంగునట్లు వారి హృదయములానందముచే నుప్పొంగును. వీరి ప్రవర్తనము కామేశ్వరమ్మగారి కంతఁగా నిష్టములేదు. మోహనుఁడు బ్రహ్మసమాజమునం దభిమానియగుటయే యిందుకుఁ గారణము. బ్రహ్మసమాజమనిన జందెములఁ ద్రెంపి వితంతువివాహములఁ జేసికొనుటయనియే కామేశ్వరమ్మగారి నమ్మకము. కాని సమాజముయొక్క నిజము మోహనుఁ డెన్నిమార్లు బోధించినను ఆమె తల కెక్కినది కాదు. మోహనుఁడే తన తనయను దుర్మార్గమునఁ బెట్టుచున్నాఁడని యామెయొక్క నమ్మకము. ఈసంగతి జానకి గ్రహింపలేకపోలేదు. చాలసార్లు చెప్పిచూచెను. కాని, యత్నము నిష్ఫలమయ్యెను. ఏమిసేయఁ గలదు?

నాఁటిసాయంకాలము చంద్రభవనోద్యానవనము వివిధ తరులతా పుష్పాదులతో, సంధ్యారాగపుటెఱెండలో నూత్నశోభఁ గాంచుచుండెను. పుష్పసుగంధవాహినులై చిరుగాలులు మెల్లన నాకుల నాడించుచు హృదయాహ్లాదకరముగ నుండెను. ఆ యుద్యానవనమే మనమునకాహ్లాదకరము! ఆ వివిధవర్ణపుష్పలతాదులే మనోరంజకములు! ఆ పుష్పసుగంధములే ఆనందదాయకములు! వీనికిఁదోడుగ సంధ్యారాగము, కృష్ణవేణీ ప్రవాహము, ఆ తరంగమాలికలగానము! ఇఁకఁ గావలసినదేమున్నది? అప్పుడుండు ఆనందము, సౌఖ్యము అనుభవైకవేద్యములు! ఇట్టి యానందము ననుభవించుటకే జానకీమోహనులు విహారార్థము బయలుదేరిరి. వారివిమలసౌందర్య కాంతులచే నాయుద్యానవనము, ఆ సంధ్యారాగము, ఆ కృష్ణవేణీతరంగిణి, ఆస్నిగ్ధసైకతస్థలములు, మఱింత శోభఁగాంచినవి. వానికి ఆజానకీమోహనులే తగుదురు.

ఆ యుద్యానవనము కృష్ణయొడ్డుననే యుండుటచే దానికిఁజేరి యొక యిసుకతిన్నె గలదు. జానకీమోహను లటకేగి కూర్చుండిరి. ఒకవైపునఁ గృష్ణవేణి! ఒకవైపున నుద్యానవనము!చంద్రభవనము! పైనిసంధ్యారాగము! మధ్యమధ్య [illegible]! ఇఁక నేమి కావలయును?

"మోహనా, ఈ ప్రకృతిసౌందర్యము నా భావతరంగముల నుప్పొంగఁజేయుచున్నది సుమా! ఈకృష్ణవేణి, ఈ యుద్యానవనము, ఈ సంధ్యారాగము, మనమున కెంతయానందమును గూర్చుచున్నవో కాంచితివా?" అని జానకి తన నెమ్మోమునఁ జిఱునగవుతో మృదుమధురస్వరమున ననెను.

మోహనుఁడు మందహాసముతో, "జానకీ! నీవు చెప్పినది నిజమే కాని, నీవు పరిహాసముగాఁ దలంపకున్నచో నే నొకసంగతిఁ జెప్పెదను. నీ విటనుండుటవలననే నే నీయానందమును బొందుచున్నాను. నీవు లేనియెడల నన్నీప్రకృతి సౌందర్యము లెవ్వియు నాకర్షింపలేవు. నీవు నమ్మినను, నమ్మకపోయినను, నా హృదయాంతరాళమున నుండి వెలువడిన భావమిది" అనెను.

"మోహనా, ఇట్టిపరిహాసము లెచట నేర్చికొంటివి!"

"నామాట పరిహాసమా? నా యంతరాత్మసాక్షిగఁ జెప్పుచున్నాను."

"పరిహాసము గానిచో నాదర్శనమాత్రమున నీకుఁ గలుగు నానందమునకుఁ గారణమేమి?"

"అది నే నెట్లూహింపనేర్తును? నీపై నాకుఁగల నిర్మల ప్రేమయే కారణమని తలంతును."

జానకిమోమునఁ గొంచెము కోపముగనుపట్టుచు "ఏమీ! కన్యకను, అస్వతంత్రను, నన్నీవిధముగఁ బ్రేమింపవచ్చునా? ఇదియన్యాయముగాదా!" అనెను.

"జానకీ, క్షమింపుము. పొంగిపొరలు నామనోభావము నాఁపుకొనలేక యట్లంటిని. నాహృదయము నాస్వాధీనమైయుండినచో నిన్నుఁ బ్రేమింపకపోయియుండుదును. ఈ దరిద్రుఁడు జానకిని బ్రేమించుట కర్హుఁడని, నేనిదివఱకే యెఱుంగుదును; కాని, మనస్సు స్వాధీనము కాకుండుటచేఁ బ్రేమ మరల్పలేకుంటిని."

జానకి, "మోహనా!" అని యాతనికంఠమును గౌఁగిలించుకొనెను. వారిరువురిమేను లేకమై పరవశతఁగాంచెను. నేత్రములనుండి యానందబాష్పములు వెల్లువలై ప్రవహించెను. క్షణకాలము వారిరువురు మైమఱచిరి.

కొంతసేపటికిఁ గౌఁగిలివీడి, జానకి "మోహనా, నన్ను నీ వెట్లు ప్రేమించుచుంటివో నిన్నును, నే నట్లే ప్రేమించుచున్నాను. ఇది ముమ్మాటికిని సత్యమని నమ్ముము. జానకికి నీవే సర్వమును; నీదివ్యదర్శనమే నేత్రానందము; నీవాక్సుధారసమే కర్ణానందము; నీ కౌఁగిలియే మోక్షము. నీకుఁదప్ప జానకిహృదయమున, నన్యునకుఁ దావులేదు" అనెను.

"మనపరస్పరప్రేమకు అత్త యవరోధము గల్పించునేమోయని భయమగుచున్నది"

"అంగీకరించినను, అంగీకరింపకున్నను, మనహృదయభావములకు మార్పులేదు. అమ్మ కీవిషయమున నేమియు సంబంధము లేదు."

## ౪

## అవరోధము.

"మోహనా, నీహృదయము మార్చికొని, బాగుపడఁ దలఁచుకొనలేదా?" అనికామేశ్వరమ్మగారు మోహనునిఁ గఠినముగా నడిగెను.

"అత్తా! నాహృదయమున నాటుకొని, పెరిగి, పెద్దదైనమహావృక్షమును బెఱికివైచుటెట్లు? నాయంతరాత్మ నిక్కమని నొక్కిచెప్పునది కాదనుట యెట్లు?"

"నీ విన్నిగాక మఱెన్ని చెప్పినను, నామనమున కెక్కవు. నీవు నిజముగాఁ బాడైపోవుచున్నావు."

"అత్తా, నీమూఢనమ్మకమే నీదిగాని, నేఁజెప్పువిషయము లెన్నఁడును నీ వించుకంత విమర్శించి యాలోచింపవు. ఇఁక నామాటలు నీమనమున కెట్లునచ్చును?"

"నీ కంతయభిమానమున్న నాసమాజమున నే చేఱరాదా? జందెము త్రెంపివైచి, యొకవితంతువును వివాహమాడరాదా?"

"జందెముఁ ద్రెంపి, వితంతువును వివాహమాడుటే బ్రహ్మసమాజమని నీనమ్మకము. నిజమును నీకన్నిమార్లు చెప్పినను బోధపడకున్నది. నే నీరోజునఁగాకున్న రేపైనను బ్రహ్మమతమును దప్పక స్వీకరింతును."

కామేశ్వరమ్మగారు కోపముతో, "మోహనా, చిరకాలమునుండి నీకు జానకినిచ్చి వివాహము సేయవలయునని యనుకొనుచుంటిని. నీ వెన్నఁటికిని బాగుపడునట్లు తోఁపదు. కావున జానకి నింకొకని కిచ్చి పెండ్లిచేసెదను." అనెను.

మోహనుని మోము వెలవెలఁబోయెను. ఆతుదివాక్యమాతనిహృదయమున దారుణాఘాతమై బాధించెను. ఆమనోవేదన భరియించుటెట్లు? కాని, ప్రయత్నముమీఁద దాని నణఁచిపెట్టెను. "అంతమాత్రమున నేను నాహృదయమును మార్చుకొందునా? నాయదృష్టమెట్లుండిన నట్లగును." అనెను.

కామేశ్వరమ్మగారికి కోపము హెచ్చెను. పండ్లు పటపటఁ గొరుకుచు, "సరె, జానకి నీకుఁదక్కదు. గుంటూరులో నొకసంబంధమున్నది. ఆవరునకు జానకినిచ్చెదను. నీవు బ్రహ్మసమాజము స్వీకరింపు" మనెను.

మోహనరావట్లె తానుగూర్చుండిన కుర్చీలో నిస్తబ్ధుఁడై యుండెను. ఏమిసేయుటకుఁ దోఁపదు. హృదయమునకు భయంకరమగు కత్తివ్రేటు! గత్యంతరమేమి?

కామేశ్వరమ్మగారు గదినుండి వెడలిపోయెను. ప్రక్కగదిలోనుండి వినుచున్న జానకి యొక్కమాఱుగ వచ్చి మోహనునిఁ గౌఁగిలించుకొనెను. ఈకౌఁగిలింత, నిన్నటి యిసుకతిన్నెపైఁ గౌఁగిలింతవంటిదికాదు. అది ఆనందాతిశయమువలన, ఇది పట్టరాని దుఃఖాతిశయమువలన! అప్పుడు వెడలిన కన్నీరాహ్లాదమువలన, ఇప్పుడు వెడలిన కన్నీరు దుస్సహవిచారమువలన! ఇఁక నేమున్నది? నిర్మలప్రణయ ప్రవాహమునకుఁ దీరని యవరోధము!

## ౫

## వివాహము

మోహనరావునకు సెలవులు గతించెను. అతఁడు రాజమహేంద్రవరము విడచెను. వెళ్లిన నేమిప్రయోజనము? మన స్సిక్కడనే యున్నది. అతనిని చిరకాలమునుండి బంధించుచుండిన ఆశాపాశము తెగిపోయినది. మాతృసమానయై తన్నుఁ బెంచుచున్న మేనత్తచేఁ దిరస్కరింపఁబడిన మోహనునిస్వాంత మెటులుండునో వేఱుగ వర్ణింప నవసరము లేదు. కాని జానకి తన్ను గాఢముగఁ బ్రేమించుచున్నదనిమాత్ర మాతనికిఁ గొంచెము ధైర్యముగ నుండెను. ప్రేమించుచున్నంతమాత్రమున మేనత్త జానకిని దన్నుఁ బెండ్లాడనిచ్చునా? ఆమెకు మోహనరావుమీఁద గోపమునకుఁ గారణ మాతఁడు బ్రహ్మసామాజికుఁడ నగుటయే. ఇట్లు బ్రాహ్మణ్యము చెడఁగొట్టునాతనికి దనతనయ నిచ్చుట యామెకేమాత్రము నిష్టముగ లేదు. మోహనరావు తాను బ్రహ్మసామాజికుఁడగుట మానెదనన్న నామె మెత్తఁబడునేమో! కాని యాతఁ డసత్యము పల్కుటకు సాహసింపఁడు. ఈసందర్భమున జానకిహృదయ మెట్లుండెనో వ్రాయనక్కఱలేదు. ఎట్లైన మోహనునిచే నబద్ధమాడించి యతనిని సామాజికుఁడగుట మానెద ననిపించుట కామె విశ్వప్రయత్నము చేసెను. కాని మోహనుఁ డందులకు సమ్మతింపఁడయ్యె! తల్లికిఁగూడ నామె చాల దూరము బోధించిచూచెను. కార్యము లేకపోయెను. తన కిఁక నన్యునిఁ జేపట్టవలయునని నిర్బంధము వచ్చెను. ఇదివఱకే తన హృదయమును మోహనుని యధీనము చేసినజానకి ఇప్పుడె ట్లన్యునిఁ జేపట్టఁగలదు? పాప మామెకు గత్యంతరము లేదు.

జానకి ధీమతి. గభీరహృదయ. తాను మోహనునిఁ దక్క నితరునిఁ బ్రేమించుటకల్ల. తల్లి తన్ననేకవిధముల నిర్బంధించుచుండెను. అన్యునికిచ్చి వివాహము సేయవలయునని యామె కోర్కె. జానకి ఆమె మాట వినకపోయిన నామె క్రోధానలమునకు భస్మపటలమై పోవును. మొదటినుండియు జానకికిఁ దల్లియనిన భయమెక్కువ. ఆమెమాట కెదురాడ వెఱచుచుండును. కావున జానకి చిరకాలము దీనివిషయమై యాలోచించెను. ఒక గంభీరమగు నాలోచన, భావము, ఆమె హృదయమునఁ దట్టెను. దానికన్న నాచరణీయము వేఱొండు లేదనినిశ్చయించుకొనెను.

జానకికి గుంటూరుసంబంధము స్థిరమయ్యెను. మాఘమాసమున ముహూర్తము పెట్టఁబడెను. ఇందులకు జానకిగూడ నంగీకరించెను. ఉభయపక్షములవారు వివాహప్రయత్నములలో నుండిరి. ముహూర్తము సమీపించెను. గుంటూరునుండి మగపెండ్లివారు ముహూర్తపుదినమునకుఁ దరలివచ్చిరి. ఇరుపక్షములలోను జాలమందిబంధువులు విచ్చేసిరి. మోహనరావుమాత్రము రా లేదు. శుభలేఖ అందక కాదు! అందఱికన్న ముందుగనే యాతనికి శుభలేఖవచ్చెను. దూరమునుండియే యతని హృదయవేదన దుర్భరమగుచున్నప్పుడు, విజయవాడకువచ్చి జానకియెదుట నిలువఁగలఁడా? జానకి కంఠసీమ నన్యుఁడు మంగళసూత్రమునుఁ గట్టుటఁ గన్నులారఁ జూడఁగలఁడా? జానకి పరునిపై దలఁబ్రాలు పోయుటఁ జూచి సహింపఁగలఁడా? రాజమహేంద్రవరముననే, యీమనోవ్యథ భరింపఁజాలకుండెను. ఇఁక జానకి యెదుట భరింపఁగలఁడా? మేనయత్తపైఁబట్టరానికోపము వచ్చెను. కాని యేమిసేయఁగలఁడు? జానకి తనహృదయపూర్వకముగా వివాహమునకంగీకరించినదా యనుసందేహ మతనిని సదా పీడించుచుండెను. జానకి తన్నట్లు మోసగించునా? ఏమో స్త్రీలను నమ్మరాదు. అని సందేహించుచుండెను. కాని నిజమగుసంగతి తెలియలేదు. ఈవివాహమున కామె సమ్మతింపదని యాతనికి గట్టినమ్మకము. కాని వివాహము స్థిరపడినది.

ఈసందేహములతో మోహనరావునకు మతిపోయెను. దీనివలన జదువునందుఁగూడ శ్రద్ధతగ్గెను. అతనికి మాటిమాటికి జానకి కౌఁగిలించి, "నీకుఁ దప్పనాహృదయమున నన్యునకుఁ దావులే"దను మృదుమధురస్వరమున వెలువడిన యామెవాక్యము జ్ఞప్తికి వచ్చుచుండెను. అట్లు జ్ఞప్తి వచ్చినప్పుడెల్ల నాహృదయవేదన మఱింత దుర్భరమై పోవుచుండెను.

అటు జానకి నిశ్చలయై యుండెను. విచారసూచన లేదు. సంతోషచిహ్నములును లేవు. ఏవిషయమునుగూర్చియుఁ దనయభిప్రాయము నిచ్చుటలేదు. ఇతరు లేమిచెప్పినను "ఊఁ" యని యూరకుండును. విస్తరించి యెవరితోడను మాటలాడుట మానెను. ఆమె హృదయముయొక్క లోఁతు నెవ్వరును గ్రహింపఁజాలకుండిరి. వివాహము యథావిధి జరిగిపోయెను. వరుఁడు మంగళసూత్రమును దనకంఠసీమఁ గట్టునప్పుడుమాత్ర మామె దుఃఖము నాఁపుకొనఁజాలకపోయెను. కన్నులనుండి కన్నీటిబిందువులు జలజలరాలెను.

## ౬

## జానకిలేఖ - నౌకావిహారము

రాజమహేంద్రవరమున మోహనరావునకుఁ గొంచె మెచ్చు తక్కువగఁ బిచ్చియెత్తినట్లయ్యెను. అతనిహృదయము పలువిధములగు నాలోచనలకు భావములకుఁ దావయ్యెను. ఒకమూల "జానకి నన్నిట్లు మోసగించెనుగా!" యనుదుఃఖము; ఒకమూల మేనయత్తపైఁ గోపము; ఒకమూల జానకి కౌఁగిలింత జ్ఞప్తికివచ్చుట, ఆమె వాగ్దానమువలని ఆశ; ఒకమూల జీవితముపై విముఖత; ఒకమూల పగ; ఒకమూల నసూయ; ఇన్నియు నేకమై యాతనికిఁ బిచ్చియెత్తించెను. చదువు తిన్నఁగ సాగుటలేదు. పరీక్ష లెట్లో గడచెను. వేసవిసెలవులు వచ్చెను. విజయవాడకు వెళ్లుదునా వలదా యని యాతఁ డాలోచింపఁదొడఁగెను. వెళ్లి జానకి నెట్లు చూడఁగలఁడు? వెళ్లకుండిన నిట దిక్కెవరు? మేనయత్తయే తనచదువున కాధారమైయున్నది. పర్యవసానమేమియు నాలోచింపలేకపోయెను.

ఒకనాఁడు విజయవాడనుండి రెండుత్తరములు వచ్చెను. అం దొకటి విప్పిచూచెను. అది తనమేనత్త వ్రాసినలేఖ. అందుఁదాను పెండ్లికిరాకపోవుటకుఁ గారణ మడుగుచు సెలవులిచ్చిన తక్షణము బయలుదేరి రావలయునని వ్రాయఁబడియుండెను. రెండవయుత్తరము విప్పిచూచెను. విప్పగనే జానకి కోమలహస్తముతో వ్రాసిన యక్షరములు గాన్పించెను.

అందిట్లుండెను:

"మోహనా!

నావివాహవిషయమై నీకిదివఱలోఁ జెప్పుటగాని వ్రాయుటగాని లేదు. ఈసందర్భమున నీమనస్సెట్లుండునో నాకుఁ దెలియును. నీవుపొందినంత హృదయావేదన నేనును బొందితినిగాన నీబాధ నేను గ్రహింపఁ గల్గితిని.

కాని కొండొకకారణమున నాహృదయము రాయిఁజేసి కొంటిని. అమ్మసంగతి నీవెఱుంగుదువుగదా! ఆమె ప్రచండక్రోధానలమున కాఁగలేక యట్లొనర్చితిని.

అయినప్పటికిని నాహృదయమునమాత్రము మార్పు లేదు సుమా! నాభౌతికదేహమునుమాత్రమే యానూతనవరుని స్వాధీనము గావించితిని. అతఁడు దానికే మంగళసూత్రమును గట్టెను. హృదయము మాత్రము నీదె. దానికి మంగళసూత్రము నాఁడే నీవు కట్టినావు. అందుచే మనకిఁక నావిషయమున విచారము వలదు. ధీమంతుఁడవగు నీకు విస్తరించి చెప్ప నవసరము లేదు.

నీవు మఱల నెప్పటియట్లనే యుండుము. ముఖభావమునందేమి, చర్యలయందేమి, నీహృదయమును గనుపఱుపకుము. సెలవులిచ్చినతోడనే రమ్ము. అమ్మ యిప్పటికిని నీకు మాతృసమానయగు మేనయత్త! తక్కిన విషయము లన్నిట నీకామె లోటుజరుగనీయదు. కనుక వయయరూంచి వెంటనే రమ్ము.

ఇట్లు ప్రేయసి,
జానకి."

మోహనరావునకు సెలవులనిచ్చి వారమైనది. విజయవాడకు వెళ్లుటకు నిశ్చయించుకొనెను. రైలెక్కి విజయవాడస్టేషనులో దిగి బండిచేసికొని యింటికి బయలుదేరెను. అతనిహృదయ మెందుచేతనో కాని వడిగఁ గొట్టుకొనసాగెను. ఇప్పుడు తాను జూడఁబోవు జానకి మునుపటిజానకి కాదు! వివాహిత; పరకాంత. అట్టిజానకిని మోహనుఁడు చూడఁగలఁడా? ఎట్లైనను దప్పదు. హృదయమును గుదుటఁ బెట్టుకొనఁ బ్రయత్నించెను. కార్యము విఫలమయ్యెను. బండి చంద్రభవనమును సమీపించెను. సమీపించినకొలఁది హృదయము మఱింతవేగముగఁ గొట్టుకొనసాగెను. చంద్రభవనముఖద్వారమున బండి నిలచెను. మోహనునకు శరీరము కంపింప మొదలిడెను. బండినుండి దిగవలసివచ్చెను. దిగుటయెట్లు? దిగిన జానకి కంటఁబడునేమొ. అయినను, దిగుటతప్పదు. ఎట్టకేలకు బండినుండిదిగెను. వీధిగుమ్మము తెఱువఁబడియుండెను. అట నెవరును లేరు. అతఁడు లోపల ప్రవేశించెను. అక్కడ నెవ్వరును గాన్పింపలేదు. బండివానికి అద్దెనిచ్చి పంపివేసి, సావడిలో నిటునటు జూచుచుండెను. ఎవరు ముందుఁ గంటఁబడుదురో-జానకియో- మేనత్తయో? ఎవరు గానిపించిన నెట్లు ప్రవర్తింపవలయునో? అతని కేమియుఁ దోఁచుటలేదు.

ఇంతలో దొడ్డిలోనుండి యొకవ్యక్తి తనవైపునకు శరవేగమున వచ్చుచుండెను. మోహనునకుఁ గండ్లు చీఁకట్లు గ్రమ్మెను. నిస్తబ్ధుఁడై పోయెను. ఆవ్యక్తి పరుగునవచ్చి, యాతనిఁ గౌఁగిలించుకొనియెను. ఆవ్యక్తి మనజానకియే. ఇది మూఁడవకౌఁగిలింత! జానకీమోహను లిప్పుడీ లోకమున లేరు.

కొంతసేపటికి వారికి మెలఁకువవచ్చెను. మోహనరావు, తన్నుఁ గౌఁగిలించుకొనినవ్యక్తి జానకియని తెలిసికొనెను. ఇంతవఱకు నెవరి యెదుటఁబడుట కాతఁడు భయమొందుచుండెనో, ఆమెయేయామె! ఆమె పరకాంతయని తనకుఁ దెలిసియున్నను కౌఁగిలి విడిపించుకొనలేకపోయెను. వెంటనే వారిరువురును గన్నీటిసెలలఁ బ్రవహింపఁజేసిరి.

పొరిగింటికేగియుండిన కామేశ్వరమ్మగారు వచ్చి మోహనరావును గుశలప్రశ్నల నడిగిరి. వానికన్నిటికిని మోహనరావు సరియైన సమాధానము నిచ్చెను. తనహృదయభావము నామెకుఁ దెలియనీయక, యెప్పటియట్లనే మెలఁగుచుండెను.

ఒకనాఁటిసాయంకాలము, కామేశ్వరమ్మగారు పొరుగింటికి జనిరి. జానకీమోహనులిద్దఱు నలవాటుప్రకారము విహారమేగిరి. నేఁడు నౌకావిహారము సేయఁదలఁచిరి. వారికొక చిన్ననావ గలదు. అందులో వారిరువురుమాత్రమే యెక్కి, వారే నౌకను నడపించుకొని నదీగర్భమునకు బయలుదేరిరి.

కృష్ణవేణీస్రవంతి లేఁగెరటములతోఁ బ్రశాంతమై యుండెను. మలయమారుతము మెల్లన వీచుచుండెను. జానకీమోహను లధిష్ఠించిన నౌక, రాజహంసవలె నొయ్యారముగఁ బోవుచుండెను. ఆకాశమున మేఘము లక్కడక్కడ నుండి చూపరుల కానందమొదవించుచుండెను. పశ్చిమాద్రినున్న లోకబాంధవుఁడు తన సంధ్యారాగము లంబరవీథి వెదఁజల్లి యామేఘమాలికలకు వింతశోభఁ గల్గించుచుండెను. ఆసంధ్యారాగపుఁబెండలోఁ బ్రకృతియంతయు నవజీవనము గాంచినట్లుండెను. నావ నడచుచుండెను.

భానుఁడు పడమటఁ గ్రుంగిపోయెను. అతనికాంతు లస్తమించెను. నలుఁగడలఁ జీకట్లలముకొనుచుండెను. ప్రకృతి నిశ్శబ్దముగనుండెను. నావ నడచుచునే యుండెను.

జానకి తానువేయుచున్న తెడ్డు నాఁపివైచి తనరొండిలో దాఁచియుంచిన రివాల్వరును బైకిఁదీసెను. మోహనుఁ డది చూచి తానుగూడ తెడ్డునాఁపివైచెను. జానకి మందహాసవిలసితవదనముతో మోహనుని ప్రక్కఁ జేరి కూర్చుండెను. నావ నడుపుట నాఁపివైచిరి. అది నదీగర్భమునఁ దనదారిఁ బోవుచుండెను.

"మోహనా!" యని జానకి యప్రయత్నముగ ననెను.

"జానకీ!" యను ప్రత్యుత్తరముగూడ నప్రయత్నముగనే వచ్చినది. వారిరువురి మృదుమధురస్వర మాకృష్ణవేణీతరంగమాలికలపైఁ దేలియాడెను.

"ఇదిగో రివాల్వరు, అందికొనుము; ముందునన్ను-తరువాతనీవు."

"కాదు, కాదు, ముందు నేనే, తరువాత నీవు.

"హృదయేశ్వరుఁడవగు నీకన్న ముందు నేఁబోయినఁగాని నాకు ముక్తిలేదు".

"జానకీ! నాచేతు లాడకున్నవి. ఆ—అయ్యో!"



"అమ్మా, జానకీ! నాయనా, మోహనా! నేను పోయివచ్చెదను."—పు. 197



"మన పరస్పరప్రేమకు అత్త యవరోధము గల్పించునేమో యని భయమగుచున్నది"—పు. 198



" ఇదిగో రివాల్వరు, అందికొనుము, ముందు నన్ను-తరువాత నీవు "—పు. 200

జానకి క్షణమాలోచించెను. చివర కొకయుపాయము దోఁచెను. నౌకయింకను నదీగర్భముననే యున్నది. క్రింద నఖాతములలోఁతు. జానకి తనరివాల్వరుతో నావయొక్క గర్భమున గురిచూచి "తల్లీ! నమ్ము నీగర్భమున ధరించినందులకు నిన్నుఁ గూడ మాతోడఁ దీసికొనిపోవలసి వచ్చినది. ద్రోహమునకు క్షమింపుము" అని ప్రేల్చెను. వెంటనే రెండుమూఁడుకన్నములుపడెను.

నౌకలోనికి నీరు గ్రమ్ముచుండెను. జానకీమోహనులు గంభీర హృదయులై కూర్చుండిరి. ఒకరినొకరు కౌఁగిలించుకొనిరి; ఒకరినొకరు ముద్దుగొనిరి; కండ్లనుండి కన్నీరుగార్చిరి. అదియే కడసారికౌఁగిలింత! అదియేకడసారిముద్దు! అదియే కడసారికన్నీరు! ఆహా! ఆకౌఁగిలి. ఆ ముద్దు; ఆకన్నీరు: ఎంతపవిత్రములైనవో కదా! ఆక్షణకాలముననే వారనుపమానందమునుగూడ ననుభవించిరి.

కౌఁగిలి వీడనేలేదు. శిరములు వంచిరి. పరమేశధ్యానమునఁబ వశులైరి. నౌకనిండుగ నీరెక్కినది. ఒక్కపెట్టున నానౌక తనతో నాజానకీమోహనుల నాకృష్ణవేణీగర్భమునకుఁ దోడ్కొనిపోయెను. పైన నేమియునెఱుఁగనట్లు కృష్ణవేణి మెల్లఁగఁ బ్రవహించుచుండెను.

# భీష్మప్రశంస

మండలేముల వేంకటశాస్త్రిగారు, బి. ఏ. ఎల్. టి.

కారణ జన్ముండై గంగాసారమణీమణికిఁ గన్నకడుపై, ధీరో
దారుండై, జితశాత్రవ, వీరుండై మెఱసినాఁడుభీష్ముండిలలోన్.

సీ. భుజవిక్రమక్రమస్ఫురణచే నెవ్వాఁడు
భార్గవరాముగర్వం బడంచె
వేదాంతశాస్త్రార్థ విజ్ఞానమున నెవ్వఁ
డయ్యుధిష్ఠిరు సంశయములఁబాపె,
సాత్త్వికప్రజ్ఞాప్రశస్తిఁ బాండవులకుఁ
బలికెను నిజవధోపాయ మెవ్వ,
డనవద్యరాజయోగారూఢి హృత్పద్మ
మున నిల్పెఁ బరమాత్మ ననఘుఁడెవ్వఁ

తే.గీ. డుత్తరాయణ పుణ్యకాలోదయమ్ము
దనుకఁ బ్రాణములను మేనఁ దాల్చె నెవ్వఁ
డతఁడు వొగడొందు; శంతనుసుతుఁడు ఘనుఁడు
పుణ్యచరితుండు నవతార పూరుషుండు.

క. జితమన్మథవిగ్రహుఁ డరి,
చితమతి వేదాంతశాస్త్ర సిద్ధాంతములన్
మతియుతుఁడు బ్రహ్మచర్య,
వ్రతదీక్షాపరుఁడు సుజన వంద్యుఁడు ఘనుఁడున్.

ఉ. సాయకతల్పమందు దివిజస్తుతలీలఁ దనర్చి మౌనియై
గాయకువాయఁబూని యుదకమ్మును గ్రోలుచు గాలిఁ దేల్చుచున్
పాయని ప్రేమ, ధర్మజు నహాస్తమనోవ్యథుఁ జేసి చేర గాం
గేయుఁడు సత్వరమ్ము మదిఁ గీలితవిష్ణుపదాబ్జభక్తుఁడై.

క. "నా యిచ్చవచ్చినప్పుడు, వాయుందు నీతనువు" ననుచుఁ బల్కిన ధీరుం
డేయుగమునఁగలఁడే గాం, గేయుండొక్కరుఁడు దక్కఁగీర్తింపంగన్

సీ. పుణ్యుఁడై భక్తాగ్రగణ్యుఁడై నారదు
మించినాఁడు ప్రశస్తిఁ గాంచినాఁడు,
దాంతుఁడై, విమలసుస్వాంతుఁడై పరమవే
దాంతుఁడై మునివృత్తిఁ దాల్చినాఁడు,
మాన్యుఁడై శౌరిసమ్మాన్యుఁడై సహజసౌ,
జన్యమ్ముఁ బలుమారు చాటినాఁడు,
జ్ఞానియై బ్రహ్మవిజ్ఞానియై సనకాది
జ్ఞానమూర్తులఁ బోలఁ జాలినాఁడు

తే. గీ. భీష్ముఁ డని సురలెల్లరు వినుతిసేయ
బిరుదుమగఁడన ధరణిలోఁ బరగినాఁడు
జనకు మెప్పింప సద్బ్రహ్మచర్యమూని
వరముఁ గొనినాఁడు స్వచ్ఛందమరణమునకు.

గీ. బ్రహ్మచర్యాశ్రమంబున వఱలుచుండి
క్షత్రియుండయ్యు; సద్విజాశ్రయములైన
నాల్గుపురుషార్థములఁ బొందఁగల్గినాఁడు
తరమె యాతనిమాహాత్మ్యగరిమఁ బొగడ.

చ. జనకునియట్ల బాహుబలసంపదయున్, మఱి తల్లిపోలెఁ బా
వనసుచరిత్రముల్, గురునిభంగి మునీశ్వరవృత్తి నొంది, నె
మ్మనమున భక్తిమార్గముఁ గ్రమంబునఁ బూనుచుఁ గర్మయోగియై
జనకుని మించి యొప్పెనట జన్మము లిట్టివి యెందుఁగల్గునే?

గీ. బాహుబలమును, సలలితవ్రతము బుద్ధి
వైభవమ్మును నిష్కామభక్తియుక్తి
జ్ఞానవైరాగ్యములు మించు శాంతనవుఁడు
భారతీయజనాళి హృత్పద్మముల వ
సించి దేశాభ్యుదయముఁ గల్పించుఁగాత!

# జీర్ణవస్త్రములు

పోడూరు రామచంద్రరావు గారు, బి. ఏ.,

('క్లేర్ థారన్‌టన్'ను అనుసరించి)

౧

ఎక్కడచూచినా అవివే. గది అంతా వాటితో నిండి పోయింది. కుర్చీలమీద, బెంచీలమీద, తలుపుల మీద వ్రేలాడుతున్నాయి. అన్నీ, చీరలు, జాకెట్లు, గౌనులు, వోణీలు- పట్టువి, ఊలువి, నూలువి- వింతవింత రంగులతో, వివిధములగు అల్లికపనులతో- ఎఱ్ఱవి, పచ్చవి, ఊదావి, మబ్బువి, రోజావి, తెల్లనివి, పువ్వులవి, ఇవి అవి, అనిచెప్ప వీల్లేదు. ఆగదిలో ఎక్కడచూచినా కుర్చీలూ బెంచీలూ, తలుపులూకూడా చివురుజొంపముల్లాగు, పూతపూసినట్లు, విరాజిల్లుతున్నాయి. వాటిమధ్య, మేటి రోజాలాగ, వనసుందరిలాగ, వనసుందరి కూర్చుంది తన విశాలనేత్రములతో వాటి నుపలక్షిస్తూ.

"ఇది ఉద్యానవనం లాగుంది. అక్కడక్కడ వాడి పోయిన పువ్వుల్లా, యీరంగులు వెలిసిపోయిన పాత దుస్తులున్నాయి. "పిన్నీ! నాకిన్ని బట్టలున్నాయనే ఎప్పుడూ గోచరించలేదు సుమీ!" అన్నది.

"నీకు దుస్తులమీద మమకారం ఎక్కువ. చూసిందల్లా కొనేస్తావు. ఇంతవఱకూ నీవొక్కతెవే మిగిలావు. మీఅమ్మ పోయినప్పట్నుంచీ నాకు పిల్లల్లేకపోవటంచేత కళ్లల్లో పెట్టుకొని పువ్వులా పెంచుకుంటూ కావాలన్న దాన్నల్లా కొని యిచ్చాను. ఇక ముందు నాయీవి యెవరిక్కావాలి ? మహారాజులాంటివాణ్ణి పెళ్లాడుతున్నావు. కావలసినంత డబ్బు. కావలసినన్ని దుస్తులు. కావలసినన్ని నగలు. ఈపాతవాటి నిక చూడనక్కర్లేదు. ఇక వీన్నేంచేస్తావు?" అని యశోద అడిగింది.

"బీదవాళ్ల కిచ్చేస్తా. పాపం మనసీతకు బట్టలంటే ఎంతో మక్కువ. కాని తల్లితండ్రులు బీదవారు కావటం చేత కొనిపెట్టలేరు. వీటిని దాని కిచ్చేద్దామని ఉంది" "సరే నీయిష్టం. నాకిక పని ఉంది. పోతాను" అని యశోద వెళ్లిపోయింది.

వనసుందరి నిజంగా వనసుందరే. ఆవిణ్ణి మించిన అందగత్తె లావూళ్లో లేరు. అది నవ్వుతూంటే పువ్వులు వర్షించినట్లుండేది. ఆగుండ్రనిముఖమూ, ఆసోగకన్నులూ, ఆఅమాయకత్వం, ఆ ఒయ్యారమూ చూచి ఆనందించని వాళ్లు లేరు. పిల్లలతల్లులందరూ "మాకోడలైతే బాగుండును" అనుకునేవాళ్లు. యువకులలో "దాని పెళ్లాడితే" అని నీళ్లుమ్రింగనివాళ్లు లేరు. నడుస్తూంటే హరిణశాబకములా ఉండేది. దారిని పోతూంటే లక్ష్మిలా ఉండేది. పాపం! వనసుందరి తలిదండ్రులు చిన్నప్పుడే గతించారు. పినతల్లి యశోద దాన్ని గారాబంగా పెంచింది. పినతండ్రికి అదంటే పంచప్రాణాలున్నూ. దానికి కొనిపెట్టని వస్తువుల్లేవు. కుట్టించని దుస్తుల్లేవు. ఒకనాడు మాలతీలతలాగు,ఒకనాడు రోజాపువ్వులాగు, ఒకపొద్దు చంపకమట్లు, ఒకసమయంలో మందారపువ్వను కొనేలాగ, వింతవింత దుస్తులతో అది మిలమిలలాడుతూంటే ఎంతో చక్కగా ఉండేది. ఆమెకిప్పుడు యౌవనం అంకురించింది. మన మోహనుడు పెళ్లిసంబంధాలు వెతుకుతున్నాడు. ఆ గ్రామానికి మొఖాసాదారు బాలీబాబు. వానికినలభైవత్సరములువయసు. విశేషించి, అంత కాదుకూడా కాదు. ఇంచుకస్థూలకాయుడు. వానికిచ్చి యీపువ్వును, కాకిముక్కుకు దొండపండులాగ కట్టాలని మన మోహనుడు ఊహిస్తున్నాడు. దీనికికారణం బాలీబాబు కున్నడబ్బే. డబ్బుచేత సుందరికి అన్నీ లభిస్తాయనినీ, దానికి కావలసినవన్నీ కొనుక్కుంటుందనినీ మోహాను డనుకున్నాడు.

సుందరి యశోదను తల్లిలా చూసుకునేది. ఆవిడకు కావలసిన పనులన్నీ చేస్తూ సహాయ కారిగా ఉండేది.

యశోదానిష్క్రమణానంతరం, సుందరి దుస్తులు చూచుకుంటూ కూర్చుంది. ఇంతలో దానికళ్లల్లో కాంతి తరిగిపోయింది. తల వంచుకుంది. ఈపాతబట్టలు దాని

కేదో పూర్వస్మృతి కలిగించాయి కాబోలు. దానికి విచారం ఉదయించింది. ఆలోచనా ప్రవాహంలో పడి కొట్టుకొని పోతూంది సుందరి.

ఇంతలో ఎవరో తలుపు తట్టినట్లు విన్నది. "రావచ్చు" అన్నది. ఒక యువకుడు లోన ప్రవేశించాడు. అతడు పొడగరి. సరుకుచెట్టులాగు, ఈతచువ్వలాగు, బక్కపలుచని శరీరము. పాతబట్టలయినా శుభ్రంగా ఉన్నాయి కట్టుకున్నవి. శరీరము చామనచాయది. కన్నులు తేజోవంతములైనవి. మొత్తముమీద అందగాడనే చెప్పవచ్చు. అతనిది నవ్వుముఖము. నవ్వుతూంటే చంద్రునివికాసంలా ఉండేది. చూచినవాళ్ల మనసు పరవశం అయిపొయ్యేది. అతడు లోనికి రావటంతోనే సుందరి లేచి గంతువేసింది. అతని ఆగమనం ఆశ్చర్యం కలిగించింది కాబోలు ఆమెకు.

"శరత్తూ! నువ్వా! బాలీబాబుతో పట్నంపోయావనుకున్నానే." అన్నది నెమ్మదిగా.

శరచ్చంద్రుడు బాలీబాబు పినతండ్రికుమారుడు. "నిజమే. వెళ్లాను. కాని బాలీబాబు, కొంచెం పనిమీద పంపగా వచ్చాను. ఈగొడవంతా యేమిటి? ఈలాదుస్తులు పరిచావేమిటి? తొడిగి చూస్తున్నావాయేం? "అని నలువంకలా చూస్తున్నాడు శరత్తు. కొంచెం ముఖం చిట్లించి" తొడుక్కోవటం ఏమిటి పాతగుడ్డలు.? ఎవళ్లైనా బీదవాళ్ల కివ్వాలని చూస్తున్నా. కూర్చో! ఆకుర్చీలోవి బల్లమీదపడెయ్యి" అన్నది. "ఓహో! ఆలాగా, సరే, నీపని నీవు చూసుకో. అయితే వీని నిచ్చేస్తున్నావూ?" అన్నాడు.

సుందరి ఒకరోజాపరికిణీ చూస్తోంది. తల పంకించింది.

"ఆ! అది నాకు జ్ఞాపకముంది." అంటూంటే వాని కళ్లు అపూర్వకాంతిని వెళ్లగ్రక్కుతున్నాయి. "ఔను! దాన్ని నేనెఱుగుదును. నాడు వనభోజనాలప్పుడు తొడుక్కున్నదే కాదూ? అప్పుడే మనం మొదటితడవ కలసికోవటం."

"అవును. ఆవేళ దీనికి ద్రాక్షపళ్ల మఱకపడింది. పొరపాటున పళ్లెంమీద కూర్చున్నాను."

"అప్పుడు నామీద కోప్పడక ఆపళ్లెం నేనే అక్కడ మఱచిపోయినా, పోనీ ఫరవా లేదులే. ఇది అసలు ఎఱ్ఱనిదే. ఇంకొంచెం ఎఱుపెక్కింది. ఇదోహ అందం," అన్నావు. "అప్పటినుంచీ నువ్వంటే నాకెంతో ప్రేమ"

"అంటే నీకు అందంఅంటే తెలియదన్నమాట. నాఅందం నీకు ప్రేమకలిగించకపోయినా, ఏదో నిర్లక్ష్యంగా అన్నమాటే నీకు ప్రేమకారణం అయింది కాని నాకు లోపల చాలా కోపంగానే ఉంది. అంత విలువైన చీర ఇప్పుడు కాసుకూడా చెయ్యదు. అదేకాక వెలిసిపోయింది కూడాను" అని నిర్లక్ష్యంగా జవాబిచ్చింది.

"అయితే దీనికి ఐదువరహాలిస్తా," అన్నాడు. నిశ్చలంగా ఆమె అతనికేసి ఒకమారు చూచి మళ్లీచూడ్కి త్రిప్పుకుంది.

"ఛీ! ఊరుకో" అని మందలించింది సుందరి "లేదు. వేళాకోళం కాదు. నిజంగా ఇస్తాను" అని లేచి చీర పైకి తీశాడు. "చూడు. ఇది చాలా పాడై పోయింది. అంచులు పూర్తిగా."

"ఛీ! వూరుకో" అని నవ్వుతూ కసురుకొన్నది.

"పోనీగాని ఏమంటావు? ఆచీర"

"కాదు, వాణీ!"

"సరే. ఏదో ఒకటి. దీని కీపేరని ఎవరు బొడ్డుకోసి పేరెట్టారు? ఆచర్చ యెందుకులే. ఐదువరహాలు చాలా లాభసాటిబేరం. ఇంకొకళ్లు దీనిలో సగంకూడా యివ్వరు. సుందరీ! జ్ఞాపకం ఉందీ. "ఎక్కడున్నారు. మళ్లీ చూడవస్తా"నన్నా నావేళ. అంటే నువ్వు కోకిలస్వరంతో "పిన్నీ నేనూ చాలా సంతోషిస్తాం" అని మారు పలికేవు.

"పిన్నీ నేనూ" అంటూ నవ్వాడు కొంచెం. "నువ్వు."

"అప్పుడు నేను మావాళ్ల యింట్లో ఉన్నా, మాధవీకుటీరంలో" అన్నా. "ఎంత చక్కని భవనం! కాదూ? ఈవూదాచీర మాసీతకు చాలా బాగుంటుంది" అన్నది.

౨

శరచ్చంద్రుడు ఆగులాబీచీర ముడతతో అవకతవకగా మడిచి బల్లమీద పెట్టాడు. ఊదాచీరవంక చూడడం మొదలుపెట్టాడు.

"ఊహు! సీత తన కిదిబాగుండదనుకుంటుందని నాభయం. అది దాని వర్ణముకు సరిపడదు" అన్నాడు.

"నువ్వుకూడా, పాపం, సీతకి మల్లే పేదవాడ వైతే రంగులు, సరిపోవకం, అందాలు, ఆలోచించవు. నేను." అంటూ విచారంగా పలికింది.

"నిజానికి నాకో బీదచెల్లెలుంది. దాని కీచీర బాగుంటుంది. అది చాలా పేదరాలు. వీథిముఖమేనా చూడదు పాపం."

"ఎందుచేత?" అని అడిగింది సుందరి.

బుజాలెగరేస్తూ "వీథిలోకి చూస్తే ఏమౌతుందో ఏమూశపుడుతుందో అని భయం దానికి. ఊఊదాచీరకు పదిరూపాయిా లిస్తాను."

"ఊరుకుందూ! ఏమన్నా పిచ్చిపట్టిందా ఏం. నీకీలాంటి చెల్లెలుందని నేనెప్పుడూ వినలేదే.?" "అవును. పేద బంధువులను గూర్చి యెవరు వింటారు? అది ప్రపంచ సరణి. గొప్పవాళ్లను గూర్చే ఆలోచిస్తూంటారు. మావాళ్లంతా" అని సాభిప్రాయంగా చూస్తూ "పదిహేను వేలరాబడిగలవాళ్లే ఉంటారాయేం?" అన్నాడు. "పాపం యీపిల్ల-" ఆలాంటిపిల్ల ఉందని నేను నమ్మను" అని నిశ్శంకగా సుందరి అనేసింది.

"పాపం తనస్థితి యీలాంటిదని అదే నమ్మదు. నేను చెపుతూన్నట్లు ఆపిల్ల పాపం తన సవతితల్లికి చాకిరీ ఎప్పుడూ చేస్తూండాలి.

"సవతితల్లా?"

"ఔను! తల్లి చిన్నప్పుడే పోయింది. తండ్రి ఇంక పినతండ్రితో సమానంకదా. దానికితోడు సవతితల్లి పోరు. చాలావిచారకరమైనసంగతి. అన్నట్టు ఆతోపు చీర" అని కొంచెం సిగ్గుపడ్డాడు. శరత్తు సుందరి కుర్చీలోంచి తీసిన తోపుచీరకేసి చూస్తున్నాడు! "ఆనాటి సాయంకాలం మనము సముద్రం దగ్గిరకి పోయినప్పుడు కట్టుకున్నావుకాదూ? మనమిద్దరమే వెళ్లాం. వీణాపిన్ని రావాలనుకుందిగాని మన అదృష్టంచేత తలనొప్పి వచ్చిందావెను. వనమూ! ఆసాయంత్రం! ఆహా! నేను నాజన్మలో మరువలేను సుమా!"

"ఔను!" అని ఆమె కాస్త సిగ్గుపడింది. ఆమె ముఖం జేవురించింది "మన మిద్దరం చిన్నపిల్లల్లాగు ఆడుకున్నాము కాని నాకాదినములింక,— తలుచుకోవడం యిష్టంలేదు." అని మెల్లగా "బట్టలు ఎంతసౌందర్యం కలిగిస్తాయో? కట్టు, జుట్టు, బొట్టు, అన్నారు"

"అప్పుడు నన్ను ముద్దెట్టుకున్నావు. ఆకెరటాలు—" అని ఆవేశంతో అంటున్నాడు.

తన మనోభిప్రాయం దాచుకోటానికి ప్రయత్నిస్తూ "నిజానికి" అని వేళాకోళంగా "అప్పుడు చాలా భయంవేసింది. సముద్రం చాలా భయమైందే" అన్నది. "అప్పుడు సూర్యు డస్తమిస్తున్నాడు. అతని బంగారు చాయలు అద్దంలోవలె నీటిలో ప్రతిఫలిస్తున్నాయి. ఒకవంక చంద్రబింబము ఆకసమున తెల్లమచ్చవలె కళావిహీనమై కనబడుతూన్నది. నీశిరోజము లాబంగారుచాయలో బంగారువలె మెఱసిపోయాయి. ఆహా! ఎంత చక్కనిసమయం. ఎంత ఆనందకరమైన సమయం. ఆలాంటికాలం మళ్లీ వస్తుందా? ఒకమూలనుంచి గట్టుమీద నున్న ఆకాశ మల్లిపూలవాసనతోకూడిన వాయువులు వీతెంచుతూండడం; ఒకవంక సముద్రగానం; ఒకప్రక్క-"

"అబ్బ! నాకాలం అంతా పాడుచేస్తున్నావు. నా పనికభ్యంతరం కలిగిస్తూన్నావు. నీధోరణి అంతా కవిత్వంగా మారిపోతోంది. నీకవిత్వం వినటానికి పనిలేనివాళ్లెవ్వరైనా ఉంటే బాగుండును. నాకు-"

"చాలా విచారంగా ఉంది. సుందరీ! నేనిక నీపని కభ్యంతరపెట్టను." అని మౌనము ధరించి కూర్చున్నాడాతడు. ఒకటి తరువాత ఒకటిగా సుందరి గుడ్డలను మళ్లీ పరీక్షిస్తోంది.

## 3

"అది ఆకుపచ్చవోణీకాదూ?" అని అడిగాడు.

"లంగా."

"ఏమైతేనేం, అదికట్టుకుంటే కొంతమంది చాలా అందంగా కనబడతారు మొగాళ్లకి. కొందరు పురుషుల ఒళ్లు పరవశం అవుతుంది. మోహజనకంగా ఉంటుంది. నాడు మీామేనత్తగారింట్లో నిన్ను చూస్తే నాకాలాగే అయింది. ప్రత్యూషకాలము పక్షులకలకలములు శీతల మందవాతపోతములు మల్లెపూలఘుమఘుమ ఆలాంటి సమయాలు మళ్లీ వస్తే."

"అవి మాకు సెలవుదినాలు." అని విసుగుతో "కొంచెం జరుగుదూ" అన్నది.

"జరిగే ఉన్నా. కాని నాటి ఉదయం"

"ఉహు! ఈదుస్తులనుగూర్చి ఆలోచింతాం. అది సీతకు పొడుగౌతుందేమో. అదీకాక దానికీలాంట పసుపు పచ్చ నచ్చదేమో"

"పసుపుపచ్చదా? అలాంటిది తొడుక్కున్నవాళ్లెవరో—ఉహు! అది సీతకు బాగుండదు. మాచెల్లెలు, దానిపేరేం చెప్పాను?"

"ఆ, చూచావా! అలాటిదాన్ని సృష్టిస్తూన్నావన్నమాటే" "అదే సృష్టింపబడింది పాపం. నీవే దానిలాగ రాత్రింబగళ్లు విసుగూ విరామం లేకుండా పని చేస్తూంటే"

"ఏం? పాపం? కాసంత తీరికా లేదూ?"

"తీరికా?"

"అంతపనా?"

"దానిసవతితల్లి దాన్ని ఒక్కక్షణం ఊరుకోనివ్వదు. ఏదో ఒకపని కల్పిస్తూంటుంది. పోనీలే. దాని మాటకేం. అది నువ్వు మునుపు పూలుకోసుకోటానికి దేవాలయంలోకి తొడుక్కొచ్చే దానవుకాదూ?"

"అవును, అపుడు పచ్చలంగాలు తొడుక్కునేవాళ్లు. ఇప్పుడు అవి మోటయిపోయాయి. వాటిముఖం ఎవళ్లూ చూడరు."

శరత్తు ఇంతలో ఒక గోధుమవన్నె జాకట్టు తీసి చూస్తున్నాడు. వాని ముఖమునందు పూర్వస్మృతిచే కాబోలు చిర్నగవు తాండవించింది.

"వనా! ఆదినాలు జ్ఞాపకం ఉన్నాయా? ఆసరోవరంచెంత పూలతోటలో, ఆగులాబులూ, ఆమాలతీలతలూ, ఆసంపంగిపొదలూ, ఆలేమావిగున్నలూ, వాటిమధ్య నీవొక రోజాపువ్వులాగు, వనసుందరల్లా, మధుమాసలక్ష్మి అన్నట్టు, నీదగ్గర ఆలక్ష్మిని ఆరాధిస్తూన్న భక్తుళ్లాగ నేను, మనమిద్దరమూ, చిలుకాగోరింకల్లాగ, జంటమావిగున్నల్లాగ, మసలుతూన్నపుడు ఒంటిగా, జంటగా, ఆహా! ఆసమయం వేరు; మన భావవృత్తము వేరు. మన-"

"ఏమిటీప్రసంగము." అని కంపితస్వరంతో "అదంతా స్వప్నావస్థ" అంది.

ఆమెకేసి అతడు చూశాడు. వారిచూపులు ఏకీభవించాయి. అతనిచూపులు ఆమెచూపులను అరికట్టాయి. తనచూపులను మరల్చుకుందామని విశ్వప్రయత్నం చేసింది సుందరి. కాని లాభంలేకపోయింది. ఆమె చెక్కిళ్లెర్రవారినాయి. ముఖమున ముచ్చెమటలూ పోశాయి. వివర్ణత కలిగింది.

"శరత్తూ! ఈప్రస్తావనవల్ల ఏంలాభం. ఆరోజులు గడచిపోయాయి. ఆదశమారిపోయింది" అన్నది.

"ఏంమారింది. ఎందుకు మారింది. సుందరీ! మనలో నొకరు మరణిస్తేనేగాని అవిమారిపోలేవు. మనప్రేమ అలాంటిది గనుక" అన్నా డావేశంతో.

"నీ వల్లా అనటానికి అధికారంలేదు."

"ఏం? అధికారమూ? ఎందుకు లేదు.అది యిచ్చేవా వారెవరు? నీవేకా" అని లేచి నిలబడ్డాడు. చేతుల్లో జాకెట్టుంది. యువకుడు, పొడగరి, బలష్ఠుడు. విశాలమైన కళ్లు. నూనూగుమీసాలు. మొగము జేవురించింది. కన్నులు ప్రకాశిస్తూన్నాయి. "నీవు నన్ను ప్రేమిస్తూన్నావు కనుక. అలాకాకపోతే నేనిల్లామాట్లాడకపోయేవాణ్నే. ఆబుంగముఖం, బడుగుదేహం, పదిహేనువేల రాబడి, అన్నీ ఉన్న బాలీబాబును పెళ్లాడనిచ్చేవాణ్నే. వానికి నలభైయేళ్లు వయస్సు. ఎప్పుడు చూచినా అస్వస్థత. విచారిస్తూన్న ముఖవికాసం. అలాటి పిసినిగొట్టు ఇదివరకు పృథివిలో పుట్టలేదు. కాని, నీవు నన్ను ప్రేమిస్తున్నట్లు ఎఱిగియుండిన్నీ అలాటివాణ్ణి చేపట్టడానికి ఏలా ఒప్పుకోమన్నావుచెప్పు? సుందరీ!నాప్రణయసుందరీ! నీకు నాతో సంసారసుఖంలభించేటట్టు వానితో ఉంటే లభించదని నాకు పూర్తిగా తెలుసు. ఈఅదనులో ఊరుకోవడం నాకు భావ్యంకాదు. అది దారుణం. నేనాలా చేయలేను. చూస్తూ ఊరుకోడం నాశక్యంకాదు. నేను-"

"శరత్తూ! మతిపోయినట్లుంది. ఇది తప్పని తెలియుటలేదూ?"

"ఒకవారంలోగా డబ్బుకోసం తగనిపెళ్లి చేసుకోబోతున్నావని."

ఆమెదేహం కంపిస్తోంది. ముఖం వెలవెలలాడుతూంది. మాట రావటం లేదు. వానిని తేరిపార చూచింది. అంతలో, ఏలాగో, అత డాగోధుమరంగుజాకెట్టును కావలించుకోటం—అదృశ్యం—ఆమెకోపాన్ని, ధైర్యకవ

చాన్ని ఒక్కమారు సడలించేసింది. "శరత్తూ! నిన్నేమీ అనను. నువ్వీవాళ అసందర్భంగా మాట్లాడుతూన్నావు" అంది నింపాదిగా. "ఆశరత్కాలమందు, ఆపుచ్చపూవులాంటి వెన్నెట్లో, మనమిరువురమూ ఉల్లాసంగా ఉండేటప్పుడు—ఈలా అసంబద్ధంగా, అసందర్భంగా మాట్లాడేనా? బాలీబాబు రాకకు పూర్వం, తన ధనసంచులతో నిన్ను మభ్యపెట్టడానికి. పూర్వం, నేనాలా ఉన్నానా?"

సుందరిచేతులు వణకుతూన్నాయి. బాలీబాబు తన వ్రేలికితొడిగిన వజ్రపుప్రధానపు ఉంగరం తళుక్కుని విద్యుల్లతలా మెఱిసింది.

"సుందరీ! నువ్వు బాలీని పెళ్లాడకూడదు. అతని స్థూలకాయాన్నిగుఱించి నేనేమీ చెప్పను. కాని అది మాత్రం వాస్తవం. ఎంతలావు. ఎంతవలయం, రోజుకి రోజూ, వీలయినంతవఱకూ, అన్నివిధాలా బలుస్తూన్నాడు. ఇంకా బలుస్తాడు. పదిసంవత్సరాల్లో ఎంతలావౌతాడో ఊహించలేం. ఏనుగులుకూడా పనికిరావేమో అని నాఅనుమానం. దానికితోడు తిండికూడా ఆలాగే తింటాడు. అన్నీ పాడుతిళ్లే. ఆలాంటివానిని నువ్వెల్లా సహిస్తావు? నీకు లావంటివాళ్లని చూస్తే అసహ్యంకూడానూ. అందులోనూ అందగత్తెవు. శలాకలా ఉంటావు. పాపం!"

సుందరి వానికేసి వెఱ్ఱిచూపులు చూస్తోంది. అప్పుడు శరత్తు ఎంత చక్కఁగా ఉన్నాడో, ఎంత సన్నగా ఉన్నాడో ఎంత పొడుగైనవాడో, ఎంత యౌవనంలో ఉన్నాడో, ఆలోచిస్తోంది కాబోలు. ఆశరద్రాత్రులు, ఆ వనవిహారాలు, ఆసముద్రతీరాలు, సూర్యాస్తమయసమయాలు, వినోదాలు, ఆటలు, పాటలు తలుచుకుంటూందేమో. పదేళ్లలో గుమ్మాలుకూడా పట్టని బాలీబాబుయొక్క బడుగుదేహాన్నిగూర్చి ఆలోచిస్తూందో; ఏమో? ఆసమయంలో ఆపడుచుపిల్ల ఊహ తెల్లాఉన్నాదో, ఎవడు చెప్పగలడు? "మనకిద్దఱికీ ఎంత బాగా అతుకుతుందో నీకే తెలుసు. కాని, నిన్నల్లా ఉండమని నేను కోరటంలేదు. బాలీబాబును చూడకముందు ఆలా చేస్తే చేశావు. అదీకాక నిన్ను మాపల్లెటూళ్లో ఉండమనిన్నీ నేననను." అంటూ మళ్లీ ఉపన్యాసం మొదలెట్టాడు. "అది నీ కిష్టంలేకపోవచ్చు. ఆలాగైతే అక్కరలేదనెయ్యొచ్చు. అదికాదు. విను. నాకుద్యోగం ఇచ్చారు. మలబారుదేశంలో, ఒకలతాధికారికి ప్రతినిధిని. అక్కడ మనకోచక్కనిబంగాళా యిస్తారు. దాని ఫోటోకూడా చూశాను. చాలా బాగుంది. అది పడమటికనుమల దగ్గర. ఆనారికేళవనాల్లో, ఆతేయాకుతోటల్లో, ఆయేలకిమళ్లల్లో, ఆపిల్లగాలులలో, ఆవృక్షచ్ఛాయలలో, ఆలాటి మనోహరదృశ్యాలు నీకు చాలా యిష్టంకూడాను. అక్కడ, మయూరములు నృత్యాలు చేస్తూండగా, కోయిలలు పాడుతూంటే, చిలుకలు పలుకుతూన్నప్పుడు, ఆశాంతస్థలాలలో—అక్కడ ఒకచక్కనిసెలయేరుకూడా ఉందట. నాకు విశేషం జీతం యివ్వరు. అక్కడ యీలాంటివిందులూ, విహారాలూ, ఇష్టాగోష్ఠులూ, లేకపోవచ్చు. కాని, దైవవశాన్ని నువ్వు నన్ను పెళ్లిచేసుకోటం తటస్థిస్తే, ద్రవ్యంవల్ల సాధ్యంకాని ప్రకృతిసౌందర్యము మనకు లభిస్తుంది. అది నీకే తెలుసు. ఇక బడుగుదేహపు బాలీబాబును చేపట్టితే నీవు దగాపడిపోయావన్నమాటే. నగలు, నాణెములు, దుస్తులు, గుఱ్ఱపుబగ్గీలు, తక్కినవాళ్లకు సంతోషం కలిగించినా,—తప్పకుండా కలిగిస్తాయి. నాకు తెలుసు.; కాని నీకవి నచ్చవు. కావలసినపని కాస్తా అయిందంటే, నీకు బాలీబాబు మొగుడౌతాడు. అతనిధనానికంతకీ అధికారిణివౌతావు. వెయ్యిరూపాయిలఖరీదైన పట్టుబనాతు చీరకట్టుకుని, బాలీబాబిచ్చిన పదివేలరూపాయిల రత్నాలహారం మెడకు తగిలించుకుని, రత్నకంబళాలుపరిచిన చావడిలో సోఫామీద కూర్చుని, మనసుకు హాయి లేకపోగా, లోపలిబరువు, పైబరువు సహించలేక, విచారిస్తూ, నాతోపాటు సుఖంగా ఉండలేకపోతింగదా, జరిగినదానికి విచారిస్తే ఏంలాభం అనుకుంటావు. అప్పుడు మనప్రేమ యేలాంటిదో నీకే తెలుస్తుంది."

సుందరి నిశ్చేష్టురాలై కూర్చున్నది. తల వంచుకుంది. వజ్రపుటుంగరం చూస్తూంది.

"అది—ఏమిలాభం శరత్తూ!" అని హీనస్వరంతో పలికింది. "ఏమీ? లాభంలేదూ? బాగుండదూ? వెన్నెల్లో మన ఉద్యానవనంలో విహరించటం బాగుండదూ? మల్లెపూవులపొదరిండ్లలో సల్లాపించుకోవటం బాగుండదూ? అరుణోదయాన్ని సెలయేటికి స్నానానికి పోవటం బాగుండదూ? మన ముద్దులబాలుణ్ణి నీవు కావని నేనూ, నేను కాదని నువ్వూ ముద్దులాడుతూ, మొత్తుకుంటూ, వాని

వెంట పరుగెత్తుతూండడం బాగుండదూ? వానితో ఆడుకోటం—"

అంటూ అతడు సుందరిదగ్గరకు చేరాడు. మంద్రస్వరంతో మాట్లాడుతున్నాడు. ఆమె లేచింది. కిటికిదగ్గఱకుపోయింది. తెలతెలబోతూంది. తడబడుతోంది. కంపిస్తోంది. భయపడుతోంది- అతణ్ణి చూచికాదు-తన్నుగూర్చే.

"శరత్తూ! వద్దు. వద్దు. ఆలాంటిమాటలు నాకు చెప్పకు," అని దీనంగా పలికింది.

"ప్రియా! ఆలా అంటే నీకు బాధగా ఉంటుందా! నన్ను ప్రేమించకపోతే?" అన్నాడు. ఆమె ప్రత్యుత్తరమీయలేకపోయింది.

"ఇంతకు—ఇంతకుముందే ఎందుకు చెప్పావుకాదు?" "చెప్పవలసిందే కాని—నాకు తెలియదు.—ఏలాగో కొన్ని దినాలక్రితం నీవు చేయదలచిన—ఈఘోరకృత్యం—చేయాలనుకున్న—సుందరీ!"

అంటూ దగ్గిరకెళ్లాడు. భుజంమీద చేయివేశాడు. అతనిస్పర్శతో ఆమె వివశ అయిపోయింది. నింపాదిగా ఏడువ ప్రారంభించింది. అత డామెతల నిమురుతూ ఓదార్చాడు. కాని ఇంకా ముద్దులాడలేదు.

"మన కిరువురకూ విధి వ్రాసిపెట్టాడు, వనా!"

"ఈ! శరత్తూ! నాకుతెలుసు, కాని—"

"కానీలేదు అర్ధణాలేదు"

"బాలీకి కోపం వస్తుందేమో? నేను—"

"బాలీ భయంనీకులేదు. అదినామీదవదిలెయ్యి"

"భయంలేదు. కాని చివరికి, ఈమోస్తరుగా, ఇది ధర్మంకాదు."

"అతణ్ణి పెళ్లాడ్డంకంటే అన్యాయమా?"

"పిన్ని—విచారిస్తుంది." అన్నది నెమ్మదిగా.

"విచారించదు. మన క్రొత్తబంగాళాలో మనం ఏలా ఉన్నామో చూచిందంటే సరి."

"నేను—బాలీబాబుకు చెప్పటం ఎల్లా?"

"ఆపూచీ నాది"

ఆమె అతణ్ణి కౌగలించుకుంది.

"శరత్తూ! నాకెంతో ధైర్యం కలిగించావు! నిజంగా నాకు భయం ఎక్కువ. బాలీ అంటే వణకు—అయ్యో! అతడిచ్చిన ఆవస్తువులు, ఆవుంగరం.—"

"ఓస్, మగవాళ్లకి తమ వస్తువులు తమకొస్తే చాలు, సంతోషిస్తారు. ఇంకొకళ్లని టోపీవేయటానికి పనికొస్తాయి ఆనగలు. విషయం ఆలోచిస్తూన్నావా ఏం?"

"లేదు. లేదు."

సుందరి వానిభుజంమీదనుంచి తల కొంచెం ఎత్తింది. ఇంకా చెక్కిళ్లమీద బాష్పాలు ప్రవహిస్తున్నాయి.—కాని ఆమె మందహాసం చేస్తోంది.

"శరత్తూ! నీవు సరిగా చెప్పావు"

"అవును. అది సరి అని నాకు తెలుసు"

"మనం సుఖంగా ఉండగలం"

"కావలసినంత"

"కనుక"

"చేస్తావా?"

"అవును. శరత్తూ! చేస్తాను"

అని బాలీబాబు ప్రధానంఉంగరం తన వ్రేలినుండి తీసివేసింది. వారిద్దరూ దుస్తులమధ్య సోఫాపై కూర్చున్నారు.

"ఈజీర్ణవస్త్రాలు—ముద్దులబట్టలు" అని మెల్లగా గొణుక్కుంది.

"ఎంత చక్కగా నాభావములను కదలించావూ? నా హృదయతంత్రులు ఆడించావు. శరత్తూ! నీవు గొప్ప వక్తవుసుమా! ఇక ఈదుస్తులను ఎప్పుడూ వదిలిపెట్టను. నాముద్దులచొక్కా!" అని గోధుమరంగు జాకెట్టును ముద్దాడింది. ఒక్కక్షణం వారిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. వనసుందరి ఒక్కొక్కదుస్తునే స్వప్నావసలో చూస్తోంది.

"ఇదుగో! సుందరీ! చూడు" అన్న శరత్తు కంఠస్వరం వింతగా వినిపించింది.

"ఇది చాలా చక్కనిమోసం. కాని నిన్నది బాధించదు. నీఅభిమానమునుమాత్రమే. ఆహా! నువ్వు అతణ్ణి వదిలేస్తానంటం అదే చాలు పదివేలు. పాపం! బాలీ నన్నెందుకు పంపాడో చెప్పనా?"

"ఏమిటో నాకు తెలియటంలేదు"

ఆమె నడుముచుట్టూ చేయివైచి దగ్గరగా లాగికొని నిలబడ్డాడు.

"ఎవర్తో రెండు దినాలక్రితం పట్నాన్నుంచి వచ్చింది. దానిమాటల్లో ఎంతనిజంఉందో భగవంతుడికి

తెలియాలి, కాని బాలీ తన్ను పెళ్లి చేసుకుంటానన్నాడని ప్రమాణకం చేసింది."

"ఏమిటీ? బాలీ ఏంచేశాడు?" అని ఆత్రముతో అడిగింది.

"నిన్న రాత్రి పెళ్లి చేసుకున్నాడు. విష్ణ్వాలయంలో జరిగింది. ఇవ్వాళ పట్నం వెళ్లిపోయారు. బాలీకి నీతో చెప్పడానికి సాహసం లేకపోయింది. నన్ను చెప్పమన్నాడు."

"ఏమిటీ, ఇది నిజమే?"

"ప్రియా! నేను కలిపించుతానా? కాని ఇక దాన్ని గూర్చి ఆలోచించకు. ఏమైతేనేం. తెలియకముందే వదిలేశావుగా. వాణ్ణి బాగా మోసగించావు" "శరత్తూ! బాలీని నేను పెళ్లాడాలనుకోటం—" "ప్రియా! ఇక మఱచిపో. ఇక మనకు లెక్కలేనంత సుఖం. మనకేం లక్ష్యం?" అన్నాడు మెల్లగా. "నిజమే, ఇక మనకేం లెక్క. కాని, శరత్తూ! నీవు నాహృదయాన్ని త్రిప్పివేయటం నీయొక్క ఉదారస్వభావమే."

అతనివంక ముఖం ఎత్తింది. తనివితీర ముద్దిడుకున్నాడు. ఆనందంలో తేలిపోయారు వాళ్లు!

# ఎటులు నిను మెచ్చుకొనుటయొ యెఱుఁగనమ్మ!

ముక్కవిల్లి వేంకటనారాయణ. బి. ఏ.

ఆఁగు మాఁగుము బాలికా! ఆఁగుమాఁగు
మెంతయోసేపు నేను నిన్నిక్కడాఁప
నిముసమాత్రంబు నీవిట నిలువుమమ్మ!
ఉదయమాదిగఁ జదువులో నొదిగియుండి
వివిధపాఠావలోకన విసిగి విసిగి
ఎట్టకేలకుఁ దెగువతో నిల్లువెడల
నగవులొలికెడు ముద్దునెమ్మొగముతోడ
కళలు చిమ్మెడు కడచూపు కనులతోడ
మహిత కుసుమిత మల్లికా మాలతోడ
చిగురులేమావి పూరెమ్మ చేతఁబూని
అనుపమానంద దాయకవగుచు నెదుట
కానఁబడినావు నాభాగ్య గరిమ వలన;
సంతసముమీఱ మధుమాస సమయమందు
చిగురుమావుల క్రీనీడఁ జెలఁగుచుండు
విమల పికగాన మాధురీ విశ్రుతిఁగని
పొరలు సంతోషమున నొడల్ మఱచియుండి
ఎన్ని నాళ్లాయెనో ఏమి యెఱుకనీకు?
ప్రకృతికాంతా గృహంబునఁ బరిఢవిల్లు
పచ్చతోరణములఁగను ప్రమద మేమొ?
చివురుమావుల క్రీనీడఁ జేరియుండి
అమలపికగానములఁ గ్రోలు హాయియేమొ?
కలువరాయఁడు చంద్రికల్ గాయుచుండ
సైకతస్థలి చరియించు సరస మేమొ?
మఱచి పోతివి బాలికా! మఱచి పోతి!
వలపు గులికెడు నీముద్దు వదన మిపుడు
చూచు తోడనే వికలత లేచిపోయె,
మనము వికసించె, నీరస మణఁగి పోయె,
ఒక్కసారిగ మధుసౌఖ్య మొసఁగి నావు,
ఎటులు నినుమెచ్చు కొనుటయో యెఱుఁగ నమ్మ!



" శాల్వ్యులుడు ఆమెచేయు గాయముల లెక్కగొనక అశ్వమునుండి ఆమెను దిగిచి బిగ్గ గాగిలించుకొనియెను."

—పు. 210



"గుర్రుపెట్టుచు నా ముప్పొన్నె మెకము........అట్లనే నిలిచిపోయినది. దిట్టముగ కొమ్మవిరిచిన చేతికఱ్ఱ పైకినెత్తి గబగబ యీతడు..... కొంతదూరమేగి...... నిర్భయముగ నరచెను."—పు. 210



"ఇరువురు ఒకరినొకరు ఒకనిమేషమాత్ర మట్లనె చూచికొనిరి. ఇరువురు ఒక్క త్రుటిలో నొకరినొకరు పోల్చికొనిరి."—పు. 211

# యుగములనుండి నీ కొఱకు కనిపెట్టికొని యుంటిని

అడివి బాపిరాజుగారు బి. ఏ.

(చిన్న కథ)

౧వ భాగము

శ్యావ్యలుడు మహా బలిష్ఠుడు, ఆజానుబాహుడు, ఉన్నత శరీరుడు. ఆతనినవ్వులు వైశాఖమాసంపు మెరుపులు; ఆతని గదాఘాతములు భాద్రపదంపుపిడుగులు; ఆతనిసౌహార్దము కమలదళశీతలము; ఆతని కార్ముక నిర్ముక్తశరము మృత్యుకుమారీలోచనాంచలము. పవిత్రములగు ఋక్కులరచించిన పర్యాంకార మహాఋషి, కుమారుని గని దస్యుమారు డితడేయని గరువము చెందువాడు.

తలిదండ్రుల ఆశీర్వాదముగొని శ్యావ్యలుడు సింధునదీతరంగముల నావలలోదాటి గాంధారమునకావల నసురదేశమునకు మహాసైన్యముల నడపికొనిపోయినాడు. అసురులు మహానాగరికులు; దేవతలకు విరోధులు. వారికోపము దావానలస్వరూపము. ఆర్యరాజగు శ్యావ్యలుడు గాలిలోనెగురు ఉత్తరీయాంచలములుగల అశ్వవీరులు, మెరుపుల తులలీను అంకుశములగల మావటీలున్న గజములనెక్కు నాయకుల, హిమవన్నగప్రవాహంపువడిని బోవు రథంబులఁబోవు శూరులనడుపుకొని వచ్చినాడని తెలియగనె అసురులు ఉదయారుణకిరణకాంతులు ప్రసరించు మంచుశిఖరములబోలు కాంతులుగలవారు సైన్యముల సమకూర్చుకొని వచ్చి ఆర్యదళములగవిసిరి.

౨

అసుర రాజకుమారిత పాంచర నవయౌవనవతి; పదునెన్మిది వర్షముల ప్రాయంపు పడుచు. కాళ్ళకు మువ్వెలు దాల్చి కవచము శరీరమునకు తొడిగినది. మూడు ధనువులబల్లెము ముష్టిని బట్టి యుద్ధమునకు తండ్రివెంటనే అరిగినది. ఆమె యందమునకు ఆర్యాంగనలు కేలుమోడ్పవలయునని అసురవీరులతలంపులు. కూడవచ్చు స్ఫురద్రూపులగునాయకురవీరులు అగ్నిపూజానలంబకులు; కెందవిష్టాదిరులు; మేరుపర్వత సానువుల మిలుకరింపు లేతదేవదారుతరుసౌష్ఠవము విడంబించు పాంచరను జూచి పులకరాల నందుచుండిరి.

ఆమె యెక్కిన ధవళాశ్వము తన్ను స్వారిచేయు ఉత్కృష్ట వ్యక్తిని దలంచి గరువముగా నమితవేగమున బోవుచున్నది. పాంచర నీలంపుకురులు ఆకాశమున మహావేగంబునబోవుమేఘాల బోలి యామె వదనముం గప్పుచుండ నెడమచేతి చిటికెనవ్రేల నామె యావాజిని నొత్తిగించుకొనునది.

ఇంతలో నిరు సైన్యములు తలపడినవి. అసురులు దృఢకాయులు, మహాబలులు. ఆర్యులు యుద్ధముల నారితేరిన మగటిమిగల బంటులు. అసురులంత ధవళాంగు లార్యులు కాకపోయినను పసిమి బంగారు చాయల పరిపమొందియుంట రెండుసైన్యములకు సంకులసమరమైనప్పుడు ఆర్యులెవ్వరో అసురులెవ్వరో ఆవంతయు తెలియదయ్యె. పోరు ఘోరమైనది. బల్లెములు, శూలములు, శరములు, ఖడ్గములు, తరవారులు, ముసల ముద్గర గదాద్యాయుధములు పక్షులవలె రివ్వు రివ్వున ఆకాశ సంచలనము చేయుచున్నవి.

పాంచర తండ్రి ప్రక్కనే యుండి తండ్రిని తన్ను కాపాడుకొనుచున్నది. అసురార్యయుద్ధనాయకులిర్వు రంత యుద్ధాన మార్కొనిరి.

౩

యుద్ధమారంభమున నుండియు శ్యావ్యలుడు మేఘాలను చొచ్చివచ్చు గాలి ప్రవాహమువలె పొగమంచు చీల్చి పోవు సూర్యకిరణంబువలె శంఖమొత్తుచు నమితవేగమున ఆ అసుర సైన్యములఁ జొచ్చి నాయకుల ఘనముగు పోరాటమున నోడించుచు చెండాడుచు గాయములనందుచు మోదుగపూవులపరించినట్లు రక్తధారలు ప్రవించుచున్నను లెక్కచేయక ముందుకు తనరథము తోలించుకొనుచుండ అసురనాయకుడు వచ్చి తన్నుదాకినాడు.

వృద్ధుడైనను హిమగిరిశిఖరమువలెనున్న యాతని వీరత్వమును శ్యావ్యలుడు శ్లాఘించుచు యుద్ధమొనర్చెను. శ్యావ్యలుని తీక్ష్ణంపు చూపులలో తళుక్కురని మెరసినది. తండ్రికి చక్ర రక్షకురాలుగా ప్రక్కనుండి తన్ను తదేకదీక్షతో గమనించు పాంచర నాతడు చూచినాడు. బాణములు గుప్పుచునే యాతఁ డామెను రెప్పవాల్పక చూచుచు యుద్ధమొనరించుచుండెను. వారిచూపులు నొండొంటితో మిశ్రమైనవి. వారిహృదయము తలనో కొట్టుకొన్నవి.

ఇంతలో అనేకాసురసైన్యములు ఆర్యసైన్యములు తమ తమ రాజులకాపాడుకొన ముందుకు వచ్చినవి. పాంచర పకపక నవ్వి ఈనాటికి నాపనో నాయకుని కనుగొంటిని. 'ఓఆర్యకుమారుడా! నే నీయుద్ధమున కడతేరక మునుపు రక్తంపుదారల నాకడకురమ్ము; నాబాహుబలము చవి చూచెదవుగాక!' అని యామె సంగీతస్వనముల కేక వేసినది.

౪

'ఓదివ్యసౌందర్యగాత్రీ! విజయుడనై యుద్ధమునగెల్చి నిన్ను నేను వేదభూములకు గొనిపోయి వివాహమాడుదును. ఇదిగోవచ్చుచున్నాను.' అని గంభీరస్వనముల నాతడు మారుపల్కినాడు. ముండ్ల

డొంకలవలె, విడల్చుకొని పోవు అడవిన్యపథమువలె, మహాప్రవాహమున కెదురీదు ఏటుగువలె, నాతడు నరుకుచు, ఖండించుచు, త్రోయుచు విరిగిన రథంబునుండి డిగ్గనురికి పాంచర గుఱ్ఱంబుకడకు పోయినాడు. కరవీరకుట్మలాధర కాంతుల నవ్యజ్యోతిరింగణాక్షులు మెరుపులీన తనబల్లెముతో శ్యావ్యలుని పాంచర గవిసినది. తనపలక నామెధాటికి అడ్డుపెట్టుచు ఇంద్రునివలె బలవంతుడును అశ్వినీకుమారులవలె అందగాడును పవిత్రునిబోలి కాంతిమంతుడును అగు శ్యావ్యలుడు ఆమె చేయు గాయముల లెక్కగొనక అశ్వమునుండి ఆమెను దిగిచి బిగ్గ కౌగలించుకొనియెను.

ఆమె మహాసంతోషమున అతని దృఢబాహువుల నిరికికొని పోయి ఆతనిని తనవీరులు చూచుచుండ తండ్రినివ్వెరగంది కనుగొన 'నాహృదయేశ్వరా! ఎన్ని నాళ్లకు నిన్ను కనుగొంటిని. నాహృదయమును ఆత్మను సర్వస్వము, నిదిగో, నీకు ధారపోయుచున్నా'నని ఆతనిమోము వంచి అధరము తనివితీర ముద్దుగొనియెను. ఆపవిత్ర చుంబనమే వారి ఆత్మల నైక్యము చేసినది. వారికి గాంధర్వవివాహమైనది. ఈచిత్రము చూచు సైనికులు నాయకులు ఎల్లరు యుద్ధముమాని జయజయధ్వానములు సలిపిరి. కాని ఆ తత్క్షణముననే వారా రక్తమయరణరంగమున బహుగాయముల నందియుంట నాఆలింగనము తోడనే నిర్జీవులై క్రింద బడిపోయిరి. హాహాకారములెల్లెడలను బయలుదేరినవి.

## ౨ వ భాగము

అహమ్మదాబాదు కాంగ్రెసున కాంధ్రదేశమునుండి ప్రేక్షకులుగా పోయిన వారిలో వైకుంఠరావొకడు తనస్వగ్రామమునుండి బయలుదేరి బెజవాడ సికందరాబాదులమీదుగా ఎల్లోరా అజంతా సాంచి మొదలగు పుణ్యస్థలములదర్శించి ఉజ్జయినినుండి అహమ్మదాబాదతడు స్నేహితులతో చేరినాడు. అఖిలభారతీయ మహాసభయొక్క అఖండోత్సవము, మాతృదేశము నిజరూపసాక్షాత్కారమిచ్చుదానిని, ప్రపంచమునకంతకు సత్యసందేశముల నంపు దివ్యపురుషుడగు మహాత్మా గాంధీమాని నాయకత్వ మిచ్చుదానిని, ఆతడు కన్నుల వైకుంఠముగఁ జూచి ఇంటికిఁ బోయి తానుచేయు అసిస్టంటు సర్జనుపనికి రాజీనామానిచ్చి దేశసేవను చేయ యిరువదియైదేండ్ల ప్రాయముగల వైకుంఠరావు మనస్సున నిశ్చయించినాడు.

చిన్నతనముననే తల్లిదండ్రులు పోయినవారగుట తన్ను వివాహమాడుమని బలవంతము చేయువారుకాని ఇక్కడకాదక్కడనుండుమని ఆజ్ఞలనిచ్చువారుకాని లేరు. ముసలిముత్తవతల్లి పెంచి పెద్దవానినిచేసి చెన్నపట్టణమున బి. యే. లో కృతార్థుడయిన వెనుక వైకుంఠరావుఇంగ్లీషు వైద్యకలాశాలలో చదువుచున్నప్పుడుమిక్కిలిగొప్పదగు తనఆస్తినంతయు వైకుంఠరావునకిచ్చి వైకుంఠమునకేగినది. మనుమనిమాటలే ఆమెకు వేదాక్షరములుగా నుండునవి. అందుకని ఆమె ఆతడేమన్న దానికి సరేయని ఒప్పుకొనుచుండెను. జబ్బపుష్టిగలిగి పొడుగరియై పచ్చని దబ్బపండు చాయకలిగిన వైకుంఠరావు చిన్నతనమునుండియు అన్నివిధములగు నాటలయందునుఆరితేరి బంగారుపతకములువెండికప్పులు బహుమానం గొనువాడు. ఫుట్బాలులోగాని, క్రికెట్టు, టెన్నిసు, హాకీఆటలలో వైకుంఠరావున్నాడని తెలియగనే ఆరోజు టిక్కెట్లన్నియు అయిపోయి ప్రేక్షకుల సంఖ్య స్థలముపట్టనిదగునది.

## ౨

అహమ్మదాబాదుకాంగ్రెసైనవెనుక నాతనిస్నేహితులు వెనకకు పోదమన్నను పోనీక వారినందరిని ఆతడాబూశిఖరమునకు గొనిపోయెను. వారందరు దిలావరా దేవాలయములు చూచి యింటికివచ్చుచుండ చీకటిపడినది. దారితప్పికొండదిగువ లోయలలోనికిఁ బోవు బాటబడి పోసాగిరి. అయ్యో, దారితప్పితిమని మరలవెనుకకు పోవుచుండ ఇంతలో గాండ్రుమనియొక బెబ్బులి భయంకరముగ నరచినట్లు వినవచ్చినది. ముందు దిరువురుపోవుచు చటాలున నాగిరి. అప్పుడే మన వారందరట్లనే నిలబడిపోయిరి. మోటారుకారు లాంతర్లవలె కన్నులు జ్వలింప గుర్రుపెట్టుచు నా మువ్వన్నె మెకము తోకచివర గాలిలో నాడించుచు అట్లనే నిలిచిపోయినది. ముందు ఆయిదుగురు క్రొత్తపురుషులు, వెనుక వైకుంఠరావు మరొకాయన నిలిచియుండిరి. అందరి గుండెలు లటలట సమ్మెటల పెట్టులవలె కొట్టుకొనసాగినవి. అప్పుడు వైకుంఠుని కన్నులు మిరుమిట్లుగొలిపినవి. దిట్టముగ కొమ్ముపిరిచిన నేతికర్ర పైకెత్తి గబగబ యాతడు ముందున్న యా క్రొత్తపురుషుల నిరువురగడచి కొంతదూరమేగి యాకర్రను నేలనువేసికొట్టి హూత్తని నిర్భయముగ నరచెను. పిడుగువంటి యాకేకవిని యాతని రూపుమాచి ఆమెకము ఇట్టేపలాయనమైనది. అందరికిని ఒడలుజలదరించి గుండెలపై నుండి పెద్దరాయి తీసినట్లయినది.

వైకుంఠరావు స్నేహితులును ఆ క్రొత్తవారలును త్వరితముగ వచ్చి ఆబూపట్టణము చేరబోవుచుండ ఇంతలో ఒకభిల్లులమూకవచ్చి వారిని చుట్టుముట్టి ఉన్న ధనమంతయును కట్టినబట్టలను అచ్చటనుంచమని బెదరించిరి. వైకుంఠునితోపాటు ఆక్రొత్తపురుషులలో బాలకుడు వారితో యుద్ధమునకు బయలుదేరెను. వైకుంఠుడాతని వెనుకకు త్రోచి నల్గురయిదుగురు భిల్లుల నవలీలగ దూరమునకు గిరవాటువైచినాడు. వారప్పుడీతని గాంధిటోపిచూచి 'ఓరే వీరు గాంధిగారి శిష్యులురా. మనము వీరినేంజేయకూడదురా' యని పారిపోయిరి.

## 3

నాల్గుదినములైనవెనుక వైకుంఠరావుస్నేహితులతో ఆబూస్టేషను చేరెను. బొంబాయికి రెండవతరగతి టిక్కెట్లుగొని డిల్లీమెయిలు కొరకై కనిపెట్టికొనియుండిరి. బండివచ్చినది. త్వరితముగ వారు రెండవ తరగతి పెట్టెలఁ జూచిరి. అన్నియు క్రిక్కిరిసియున్నవి. ఇటుపరువెత్తిరి; అటుపరువెత్తిరి. వైకుంఠరావునకు మితిమీరిన కోపమువచ్చినది. ఈలవేయుగార్డును పట్టికొని గబుక్కున వెనుకకు తిప్పికొని 'అయ్యా! నమస్కారము- మేము రెండవతరగతి టిక్కెట్లుకొన్నాము. స్థలము అణుమాత్రము లేదు. మొదటితరగతి ఎక్కుచున్నాము. నల్గురము. నమస్కా

ము.' అని యాగార్డు తెల్లబోయి చూచుచుండ మొదటితరగతికడకునిమి షమున వెడలిపోయెను.

గుమ్మము కడ నొక పార్సీబాలుడు చేతికఱ్ఱతో నిలువఁబడి యుండెను. వైకుంఠరావు 'క్షమించుడు' అని ఎక్కఁబోయెను. బండి కదలినది. ఆబాలుడు కన్ను తెరవక 'వీలులేదు' అనిచేయిఅడ్డముపెట్టినాడు. నవ్వుచు వైకుంఠరా వాబాలుని చేయి యవలీలగ తలుపునుండి తీసివేయుచుండ ఆబాలుడు కుడిచేతికఱ్ఱతో వైకుంఠుని తలపై కమిరవేగమున సత్వముతో తాడన మారంభించినాడు. స్నేహితుల బండిని వేలాడుచుని వైకుంఠుడు ఎడమచేతినెత్తి కఱ్ఱదెబ్బల నాపుకొనుచు బండిలోనికి ఆబాలుని త్రోసికొనిపోయి అతని చేతికఱ్ఱలాగి అవలకు గిరవాటువైచి యాబాలుని యెత్తికొనిపోయి యొక్కసోఫాపై కూర్చుండబెట్టి పోవుచుండ యాబాలునిటోపీ యూడిపడిపోయినది.

౪

రస్టంజీ మెనక్జీ కోటీశ్వరుడు; గొప్పవర్తకుడు. అతని సుందర భవనము మాడంతస్థులది; బొంబాయి నగరమునముఖ్యస్థలమున నుండునది. మెనక్జీ కోటీశ్వరునితనయయగు బకావలీకన్య పాటలనాటల శోభిల్లిపోవుచుండెను. బకావలీకన్య అమితరూపవతి. పార్సీకన్యలందరిలో రిక్కలలోని రేరాజువలె వెలిగిపోవుచు అనేకుల పార్సీ యువకుల హృదయముల వ్రక్కలు గావించినది.

అబూ పట్టణమున వారికొక పెద్దమేడకలదు. అహమ్మదాబాదు కాంగ్రెసు అయినవెనుక తండ్రి కుమార్తెలిరువు రొకసారి ఆబూపట్టణము జనిరి. అక్కడ ఒక సాయంత్రము వాహ్యాళికిం బోయినప్పుడు రాత్రిపడిపోయినది. మగవీరుడగు బకావలీకన్య పురుషవేషమున సంచరించుట, టెన్నీసు మొదలగు నాటల నాడుట, గుఱ్ఱపుస్వారి చేయుట ఆమెకమితమునుయిష్టము. ఈనాడు నామె పురుషవేషముననున్నది. ఇంతలో ఎట్టఎదుట నొక బెబ్బులి కాన వచ్చినది. ఒక యువకుడు దానిని భయపెట్టిపారదోలినాడు. భిల్లులమూక తమ్ము గదియనుండ వెడలగొట్టినాడు.

ఆమెకాతనిపై అమితముగకోపమువచ్చినది. నాల్గుదినములుండి వారు బొంబాయి తిరిగిపోవుటకు స్వంత మోటారుపై స్టేషనుకువచ్చి మొదటితరగతినెక్కిరి. బండి కదలుటకు సిద్ధముగానుండ బెబ్బులిని తోలిన యాయువకుడు బండినెక్కవచ్చుట నామె చూచెను. తన్ను చిన్న పసిపిల్లగానెంచి తాను తరుమనెంచిన పులిని తోలినాడని యామె యాతని ప్రహరింప సంకల్పించి యడ్డుపెట్టెను. వారిరువురకు సంకుల సమరమైనది. వైకుంఠరావుచేతిని రక్తముస్రవింప నామె యాతని బాదినది.

౫

అప్పుడా బాలునిమోము నవయౌవనవతియు మహాసౌందర్యగాత్రియు నగు నొక బాలికమోమైనది. ఇరువురు ఒకరినొకరు ఒకనిమేష మాత్రమట్లనె చూచికొనిరి. ఇరువురు ఒక్క త్రుటిలో నొకరి నొకరు పోల్చికొనిరి. 'హా! నాహృదయేశ్వరీ! ఎన్ని యుగంబులైన వెనుక నిను కనుగొంటిని,'యని యాతడుచ్చైస్స్వనమునబలికి ఆమెను బిగ్గకౌగలించుకొని, తనస్నేహితులు, ఆబాలికతండ్రియగు మెనక్జీ, వెరగంది చూచుచుండ ఆమె కరవీరకుట్మలాధరముల తనివితీర ముద్దుగొనియెను. 'నాథా, ఎన్ని యుగములు నీకై పరితపించియుంటినో నేటికి నినుకనుగొన్నాను. ఇప్పుడైనను విడనాడకుమీ' అని యామెయు త్తిరింగబాహుల వైకుంఠరావును కనుంగొని మోముమోమున చేర్చివేసినది. వారి ఆత్మలకు పట్టిన ఆమహాపురాతనచరిత్రము ఇతరుల కర్థముగాక, కొన్ని వర్షముల క్రిందనుండి మోహించియుండిరనియు యుగములను నది అలంకారరూపముగా వాడబడినది అని అనుకొనిరి.

వైకుంఠుడన్నిటికి తెగించి కోటీశ్వరుడగు రస్టంజీ మెనక్జీ కుమార్తెను వివాహమాడెను. బెల్గాం కాంగ్రెసునకు వైకుంఠరావును భార్యయు వెడలివచ్చిరనియు వారు 'నోచెంజర్లు' సభకువచ్చి యుండిరనియు వారావహోత్సాని అమోఘపదంబుల విని తమ లక్షల ధనము వ్యాపకమునకై వినియోగింతుమని వాగ్దానము చేసిరనియు బొంబాయి క్రానికలుపత్రిక ప్రకటించినది.

నాటికి నేటికి పాంచదయు శ్యామ్యలుడును మరలగలసికొని మహదానందముల నందుచున్నారుగదా!

# ద్యోయానము

తాపీ ధర్మారావుగారు, బి. ఏ.

ఉన్నది కన్నటు వ్రాయుట
కన్నఁ గవికి మేలు లేదు గద; తాత్పర్యా
భ్యున్నతి నారసి రసజ్ఞు
లెన్న, నలంకార రచన లేలా నాకున్?

గీ. "స్వాంత విస్ఫూర్తి లేని వాస్తవముకంటె
సత్యముం బోలు కల్పిత సరణి మేలు,"[1]
కాదె, కల్పనా భావసంకలన గరిమ
నిజమె వ్రాసెదఁ జదివి చింతింపుఁడనుచు.

గీ. దివ్యగంధిలసద్భావ దృప్తసరస
కావ్యమదిరారసంబును గౌతుకమున
నాని యాని, ప్రమత్తత నఱనిముసము
దెఱవఁ గన్నులనిద్రఁ జెందితిని పగలె.

గీ. లలితకౌశేయశాటి డోలిగ నొనర్చి
నట్లు; పంచమీచంద్ర రేఖాంచలములు
రెండు నొక్కటఁ గట్టినట్లుండు నొక్క
దివ్యయానంబు నందున్న తీఱుఁగంటి.

ఉ. సారథి సున్న, చక్రములసంగతి శూన్యము, రెక్కలున్న యా
దారియుఁ గాదు, ధూమప్రవిధానము గూడ హుళిక్కి, విద్యుదా
ధారము లేదు, కీలులును దంత్రులు నారయఁ బూజ్య, మైన సం
చారముఁ జేయఁ బై కెగసెఁ జయ్యన వద్ది వియత్తలంబునన్.

శా. ఆరీతిం జను నావిమానమున కాహా! చుట్టుఁగప్పట్టెఁ, బ్రా
కారాకారము నంది, సూదిమొనకుం గాసంత సందీక, నీ
హారాతీతగభీరశైత్యమున జీవాంశంబు జాఁజేయు, పెన్
దారిద్ర్యంబన, నంధకార మతిసాంద్రంబై, కరగ్రాహ్యమై.

గీ. అవిచిత్రయాన మందున, వింతలై
యమరభూరుహముల సుమము లనఁగ
సౌరభముల మానసంబును లోఁగొనఁ
జాలునలరు లలరు శతము లగుచు.

ఉ. అందున నొక్క ప్రావు, తన యంతనె జాఱిపడంగ, దాన నే
మందును! దివ్య తేజ మొకఁ డద్భుతలీల జనించెఁ నందు నా
హైందవ పశ్చిమోత్తరమహా మహీభాగ నిసర్గవైభవం
బందము మీఱఁ బాణితలమందునఁ గన్నటు దోఁచె నొక్కటన్.

చ. కనకవిభూషణావళులు, గట్టి యయోమయ పట్టసంబులున్,
ధనములు, సుందరాంగులు, సనాది చరిత్రముఁ గల్గు పాత్రులన్
ఘననిభగాత్రులన్, మితవికస్వరనేత్రుల, యజ్ఞసూత్రులన్
గనుఁగొనఁగల్గెఁ గొందఱను గంధిపరీతమహీశ పుత్రులన్.[3]

ఉ. వారలఁ బాఱఁ దోలి, కృషివర్తను,[4] లావులు నావ లక్ష్యముల్
తేరులుగల్గి చేరములఁ దేలిన ధీరులు, గౌరసుందరా
కారులు, దీర్ఘబాహులు, మఖప్రమదాత్ము, లుదారచింతనుల్,
చారులఁ జొచ్చి నిల్చిరట భవ్యవిచారవిదారితారులై.

క. చక్కని కన్నులఁ, దిన్నని
ముక్కులుఁ, దీర్ఘైన చిబుకములు, దరహాసం,
బుక్కు మఱ తేజముఁ, గన నీ
కక్కట! చీఁకటులు మూసె నంతన్ వింతన్.

మ. అలరొందుర్లఁగఁ గంటి నొక్క వచనవ్యాపార ధుర్యుండు,[5] మ
న్నుల బంగారురజంబు మించు నల సింధుప్రాంత మందుండి, యొం
టెలపై నాయిసు మేఁడు నేఁడును వడిన్ నిండించి, దేశంబు నా
వలఁ జేరం జని, వైభవంబున సరిప్రాతంబు వేధించుటన్.

గీ. కోటకొమ్మల బొమ్మిడికం, బోట లేని
యతనిబలువిల్లు, నఱపట్టు, యసము వదల
మెఱుపులం గొల్పు చక్కని గఱుల సిడము,
చీకువాలున నంతలోఁ జెన్ను దఱిగె.

---

1. నిజామీ యను పారసీక కవీశ్వరుని యూహ క్రీ.[శ. 1250] 2. ఈపద్యావళిని దస్యుదుల రూపస్వభావ ప్రవర్తనాది వర్ణ నలకెల్ల వేదంబులును చరిత్రములును బ్రమాణంబులు. కల్పితములు గావని యెఱుంగునది. 3. వేదంబులఁగల దస్యులవర్ణనము. ఆర్యులకుఁ బూర్వ మానేలకు నేలవగునను వీరలదే. 4. ఆర్యుల యాయాకారసముద్రయానాదులు వేదంబులఁగాంచనగు. 5. ఈతఁడు డెరయస్ అను పారసీక చక్రవర్తి. క్రీ. పూ. 486. పారసీకులభాషయు నాచారములును నార్యులవివలెనుండెననియు నీ యాకారాదులును బెహిస్తూన్ శాసనమునఁ దెలియనగును. వానిసర్వరాష్ట్రాదాయమునందు నీదేశభాగమే మూఁడవపాలును, అనఁగా సం 1కి ఒకకోటి యేబదిలక్షల రూప్యముల నిచ్చుచుండెను.

వ. అంతమఱికొంత వడి కాలవిమానమందలి క్రొన్ననయొందు నేల రాలుటయు నం దుద్భవించిన ప్రకాశంబున.

చ. బిలబిలదోఁచ నొక్కరుఁడు, సుభిక్షము, నాప్య, మహోగ్రవీర్యమై,
కొలఁదిక నెఱుంగనట్టియటకుం జనుదెంచి యెుక్కెననేమి! యా
దిలుఁడుఁ౬ భూపుతేఖవాయ శీర్షికహేమ కరండకోటితో
గితిఁగొనుమబ్బుఁజొచ్చెఁ దులకింప ధనంబులు, పశ్చిమంబునన్.

ఉ. మబ్బున నేఁగుచుండుటఁ, బ్రమాణము నాకసదోయి కేదియే
నబ్బదుగాని, పచ్చికబయళ్లనుఁ బైరులవీచుగాలి దా
నిబ్బడివాసనల్ నెఱప, హృద్యనిరంతర మంగళధ్వనుల్
గుబ్బతిలంగ, వచ్చె, జనకోటి ముదంబును౭ బెంపుఁ దెల్పుచున్.

వ. అట్లు మహావేగంబున నా ద్యోయానసంబంధ కౌర విహారంబు సేయుచుండ మఱియొకవిరి యయాచితంబుగ భూస్థలిం బడుటయు,

క. ఇల్లుం దల్లుల నొల్లక,
పల్లంబుల క్రింద నుంచు పచ్చిపలలమున్
జొల్లులు గాఱఁగఁ దిని అం
పిల్లెడి కల్లరి పిసాసి పిల్లలఁ గంటెన్.

గీ. ప్రజలఁ బీడించి కాల్చెడి ప్రతిభ, కోట్ల
ధనము దోఁపుఁ గైకొనిపోవు ధైర్యమహిమ,
యబలలం గొట్టి చెఱపట్టు న్యాయబుద్ధి
యన్ని, ముసురుఁ జీఁకటి వంటి వంతరించె.

శా. కాలంబుండిన యంతవట్టు మఱవం గారాని యిక్కట్టులన్
జాలంగాంచియు, దేశకాలముల స్వాస్థ్యం బెట్టిదో నాఁడు! స్వా
భ్యాలిక్ వైలమ తేలఁజాలె; నిది సత్యంబంచుఁ దెల్పంగ, నా
గాలిందోఁచెను ప్రాభవోదిత కళాకల్యాణముద్రాంకముల్.

ఉ. కమ్మనుమం బొకండు దొఱఁగంబడె, తొల్లిటియట్ల సత్ప్రకా
శమ్మును గ్రమ్మ, నందుఁ గనఁజాలితి సుందరదేవహర్మ్యబృం
దమ్ములు గుందనమ్ము రతనమ్ములు సొమ్ములు విగ్రహమ్ములం
దమ్ములు శిల్పముల్ బహువిధమ్ములు దేశపువైభవమ్ములన్.

ఉ. కోరికసాఫల్యకాంక్షితే ముఖుండొక దిట్టఁడు, ౧౦ శేఁగి, భీకరా
కారులుఁ దోలు దుష్టులమగల్ తమఁగొల్వఁగ, సారెసారెకున్
జేరి, ప్రసిద్ధగోపురపు శిల్పములం బడగొట్టి, పైఁడి భం
డారము, రత్నరాసులు, బిడారములం గొనిపోరె దవ్వులన్

గీ. అంధకారంబు మూఁడ నీయక చెలంగె,
మున్ను సెన్నఁడుఁ గన్నది విన్నదియును
గాని యాచూడ్ధనముల, నైననేమి?
దేశసంపద మఱలను దేఁజికొనిరె.

చ. లేమి తెలుకప్పి, యంత పతితప్రసవప్రథఁ బాయ, నేయపా
యముఁ గననట్లు గ్రమ్మె మహావిభవంబునఁ దూలు దేశ భా
గముఁగని, కోచెఁ నొక్కరుఁడు ౧౧; కాంతిలువజ్రసమూహమైదుమా
ర్గ మణులును; లెన్ననేల? యతఁడుం గొనిపోవు ననూహ్యసంపదల్.

వ. మఱల ముసురు నిరుల నాయానం బెగురుచుండ మఱి యొక్కపుష్పము భూమింబడి వెల్గునిచ్చుటయు;

శా. హాహారావము లుప్పతిల్ల జన లోకాలాత విఖ్యాత దు
ర్దాహుం డొక్కఁడు, హూణ, కుంటి౧౨, ప్రజకుం దారిద్ర్యముం గూర్చి తా
నూహాతీత ధనంబు నందియును గర్వోద్రేకమా! హింస ను
త్సాహంబో!—చానరింపఁ బాల్పడె నవాచ్య క్రూర కార్యావళిన్.

ఉ. మిత్తియు నుత్తముండ యన మించి, జనంబులు బీస్గుపెంటగాఁ
గుత్తుకలన్ విలాసమునఁ గోసి, యనాథల నేచి, చేయి నొ
వ్వ ఉత్తధనంబు దోఁచి, పరితృప్తిగ నూరులు గాల్చి, కేరు నా
యుత్తముఁ, దుట్టిఁ గట్టుకొని యుండక, చేరెను గాల గర్భమున్.

గీ. ఇంతపాటుఁ గనియు, నిల సిరి శేకత్తి
విరియపాఁగఁ౧౩ గన్న నిందుగాఁగ;
వేలుచెడకయున్న, వివిధాంగశోభతో
గాసిఁ బాసి యలరుగాదె లలిలు?

ఉ. తొల్లిటి యట్లనే, కుసుమధూత రమిప్రసమునందుఁ గాంచితిన్
ఢిల్లిపురంబు, శేషుఁడు గణింపఁగరాని సిరిం జెలంగఁగా,
నల్లసమాదుల! యతిశయోక్తియె! నాఁజను ద్రవ్యరత్నముల్
గొల్లన నెవ్వఁడో౧౪ యిమపంచెల మించఁడు కొల్లఁగొట్టుటన్.

క. రతనాలా, నాణెములా,
యతిసుందరమైన నగల, యాదోఁపిడికిన్

---

౬. అలెగ్జాండరను యవనరాజు క్రీ. పూ. 326 దేశము సప్తనదీజలమయము (అవ్యయము). స్నేహమున నాగరాజాదులవలనను, కయ్యమునఁ బురుషోత్తమాదులవలనను, వానిసేన నొక్కొక్కనికిఁ గిరీటములు స్వర్ణపాత్రలు లోనగనవి చిక్కెను. ౭. చంద్రగుప్తాశోకాదుల కాలము.

౮. వీరే హూణులు. ఘోరాచారములంబట్టి కానోపు, వారుపిశాచులకుఁ బుట్టిరని ప్రసిద్ధి. గిబ్బన్ 'రోమువినాశము'ను జూడుఁడు.

౯. గుప్తచక్రవర్తులను హర్షాదులు నేలినకాలము. ౧౦. గజనీమామూదు 11 వ శతాబ్దము. ఈతఁడు సోమనాథాదిదేవాలయములఁ బడఁగొట్టి, తీసుకొనిపోయినధనము "7000 పౌన్లు బరువుగల బంగారునాణెములు, 6000 పౌ. బరువు బంగారుగిన్నెలు, 15000, పౌ. బంగారుకణికెలు, 129000 పౌ. వెండియు, 150 పౌ. బరువునుమించు వజ్రములు, కెంపులు ముత్యములు సరసములు" 25 పౌ. 1మణుఁగు. ౧౧. మహమ్మదుగోరీ. పండ్రెండవ శతాబ్దము. మహమ్మదీయచరిత్రకారులే పద్యమునకుఁ బ్రమాణము. ఆకాలమున గోరీయంత ధనికుఁడగు రాజు లేకుండె.

౧౨. ఈతఁడే తైమూరు, పదునాల్గవ శతాబ్దము. "The Lame Firebrand (అలాత) of the World" ఈతఁడు స్వీయచరిత్ర వ్రాసెను. ౧౩. మొగలాయి చక్రవర్తుల యైశ్వర్యకాలము. ౧౪. నాదరుషా 18 వ శతాబ్దము. జనుల నపరిమితంబుగఁ బీడించి దోఁచిన ధనములు నలువది యైదుకోట్ల రూపాయ లగును.

మిలిఁదెల్పఁగ గతిగలదే?
కతవలెఁ గాన్పించునెమిలి గద్దియ యొకటే!

గీ. వీటిడియుఁ సేవ,౧౫ యాత్మీయ విపులకృష్ణ
పైతమును మాఱఁ దోఁచిన్న సంపదలును,
బోయి గాలిడితెఱలోన మాయఁబడియె;
కాని, విహరించుమండె విమాన మటులె.

శా. ఈదేశంబు వరాలతీవ ౧౬యనఁ బేరొత్తం దగుం గ్రమ్మఱన్;
గాదే, నాసుమకాంతి, సొండొరులకుం గానీక స్వార్థాత్మ కెం
తో దూరంబుననుండి శ్వేతముఖముల్ సోరూర రానేల? నే
లా దోఁచంగ ననేకకోటి పరిసంఖ్యంబైన ద్రవ్యంబునన్?

గీ. చేరములు, వారి వింతవ్యాపారములును,
సంపదలుఁ గప్పు సంతమసంబు మాన్పి,
యంతఁజూపె లతాంత నితాంత కాంతి
సర్వసాధారణం బనఁ జాలు జగతి.

వ. అవ్వెలుంగునఁ బూర్వరీతి ఘోరవి శేషంబు లేవియుఁ దల్
క్షణంబునఁ గానరావు.

ఉ. క్రూరులురారు; దోఁపిడులుఁ గొల్లలుఁ గానను; కాలవ్యాధులుం
దైరులు; సంకులంబనఁ గనంబడ; దేమిటి కీ సుమవ్యయం?
బారయఁజాల—మూర్ఖ, తెలియంగనకుంటివె? వేముఖంబులన్
బారులుగట్టి, చీమలు, నెపంబున, నేమిదొకొండుఁ బోవుటన్.

వ అగునని యించుక పరిశీలించి చూడ.

శా. రారాపిల్ల నగల్ పగల్ గొనఁగ, నారా! యిల్లలుం గల్లలై
యొరెంబన్నది దూరమై, దిసమొలల్ రోగంబు భోగంబునై,
ఘోరాచారమె పారమై, శిశుమృతిం గోడాడుటే పాడునై,
తీరంబారని లేమిఁ గాంచితిని - భ్రాతిన్ నోఁచమొ నోఁచితిన్?

క. చిటిపాటిబరువులఁ జీమలు
కుటిలగతిం గొంచుఁబోవు గుణలేశము లె
చ్చటివని లోచనముల నే
నటుద్రిప్పితిఁ; జెప్పనెట్టు లకటా! నాకున్.

ఉ. ఆఁకొనుసెల్ల లోకముల కన్నమవారిగఁ బెట్టె, నాకముం
దాఁకు ననేకశాఖల సనాతన సత్కృశ లుట్టఁగా, దివిం
బ్రాఁకుచు సర్వశోభఁదనివారకు గట్టివరాల చెట్టునెన్
గూఁకటివేళునే పాడిగఁ గొర్కెఁ బిపీలిక లీతి బోరికల్.

క. ఆకులపాటును, శాఖలు
బోకారుట, నిల్వనీడ పోవఁగమి, కఱవున్
జేకూఱుట, మనపాలిటఁ
గాకుండునె? చీమలన్న గాములుగావే?

ఉ. చూడనె తొల్లి యిక్కటుల గ్రుక్కియు, నింతటఁదేఱఁబాఱితూఁ
గాడు సమస్తసంపదల కాకరమానటు, దేశముండ? ని
ష్పీడులమన్ శతాబ్దములు నేఁగుట తోఁచునుగాని, లేమి పో
కాడు తెఱంగుఁగాన; బువుఁగాంతియు మాయదు; సూనమాఁగదున్

గీ. పాలము, నెపుడో, దృష్టిబొమ్మనుఁ గట్టిన
చింకిపాఁతయైనఁ జిక్కనను
కౌంగిలించి మానముం గాచుకొనునట్టి
కటికిలేమిఁ గాంచఁగలఁడె నరుఁడు?

వ. ఇంక నీదుస్స్వప్నప్రదర్శనంబు మాయింపఁ జీఁకటులు మూయ
కుండుటం జేసి.

చ. అడలు కుమారునిం బొదుగునమ్మకరంబులో, వీతదార్ఢ్యముం
బడిబడిఁగూర్చు కోఁకలకుఁ బట్టెడునిద్రయొ, దుఃఖరాశి రా
యిడి పరిఁజేర్చు చల్లనగు మృత్యువో నా, నిరుతేలగ్రమ్మ వొ
క్కడరున, దేశభక్తనయవాళినిపీడనకంటకాకృతిన్?

ఉ. యానవిలాస మింక సమయం జనుఁగాక ! నభాన నిల్వ రా
కేనిఁకఁ దల్లక్రిందుగ మహింబడి చచ్చెదఁగాక, లేమి నా
దీనులఁ జూడఁజాలనని, తెంపతెన్నై, పుష్పవత్రైవ,౧౭ నా
హా! నెలకొంటి నింటను, సుఖాసన, మెప్పటి పుస్తకంబులోన్.

క. మబ్బుతెఱ, లుబ్బువెల్గులు,
జొబ్బిల్లె దుకల్కి, పెఱల చుబ్బన చూఱల్,
దబ్బర తేరుంజనిరొను;
నిబ్బరమగు లేమినగపె నిల్చెందిరమై.

చ. చటుల దరిద్రతాసమ విషాదము ఖేదమునంద, మందునాఁ
కటి పెనుచిచ్చులార్చఁగ, దిగంబర దుస్సహదైన్యవృత్తి యొ
క్కటు మటుమాయమై చన, జగంబు విడంబనలేని శాంతి దో
గుటఁగనఁ జక్రరత్నసమహార్చిత మా ప్రణయంపు మూర్తి, సం
కటసమవర్తి, కూర్తి గోల గంగ, వమోసున యామునవర్తియై.

౧౫. నాదర్షాసేన యెనుబదివేల జనము. ౧౬. ఐరోపాదేశీయుల కిది 'పెగోడా ట్రీ—వరహాలచెట్టు.' అనాయాసంబుగ వరాల రాల్చికొన, బుడుతగీచులు, హాలెందులు, ఆంగ్లేయులు, పరాసులు ననేకవర్తకసంఘములుగ వచ్చిరి. రాల్చిరి. ౧౭. ఇంతదనుక రాలుమఱ డిన పూలు తమంతఁ దామె పడుచుండెను.



# విన్నకోట పెద్దన

విద్వాన్ కత్తీ సాంబమూర్తిశాస్త్రి గారు

కావ్యాలంకార చూడామణియను లక్షణగ్రంథమును రచించిన యీకవి నివాసస్థానమును గూర్చి వ్రాయుచు ఆంధ్రకవులచరిత్రమునందు కీ. శే. రా. బ. కం. వీరేశలింగము పంతులుగారు "ఈకవి రాజమహేంద్రవరనివాసి. పురవర్ణనమున కుదాహరణముగా రాజమహేంద్రవరమును

సీ. గంభీరపరిఖ నాగస్త్రీల కత్రాంత
        కేళీవిహారదీర్ఘిక యనంగ
సత్తాలసాల మస్యుల కొబ్బి దివిఁబ్రాఁకఁ
        జేసినదీర్ఘ నిశ్రేణి యనఁగఁ
జతురచాతుర్వర్ణ్యసంఘ మస్థలపాలి
        రాజితకల్పకారామ మనఁగఁ
బ్రాంత సుస్థితరైన ఘనజటావాహిని
        భుక్తిముక్తిప్రదమూర్తి యనఁగ
నెప్పుడును నొప్పు రాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నేరాజు తనదు పేర
నట్టి రాజమహేంద్రుని యనుఁగుమనుమఁ
డెసఁగుఁ జాళుక్యవిశ్వ నరేశ్వరుండు.

అనుపద్యమున వర్ణించుట యీకృతికర్తృభర్తల వాసస్థలము రాజమహేంద్రవరమని నిర్ణయించుట కాధార"మని యభిప్రాయమును బొందుపఱిచియున్నారు. (చూ. ఆం. క. చ. ప్రథమభాగము. 285 పేజి. నూతన ముద్రణము). నే నీనడుమఁ గవులచరిత్రమును జదువుచున్నపుడు శ్రీపంతులుగారిసిద్ధాంతము ప్రమాదమేమో యని సంశయ ముదయించుటచే నాకుఁగల సంశయహేతువులను బ్రకటించినచోఁ బండితులు వానిసత్యాసత్యత్వముల నిర్ణయింతురనునాశచే నిటఁ గొంత వ్రాయుచున్నాఁడను.

1. విన్నకోటపెద్దన తనగ్రంథము తొమ్మిదియుల్లాసములందునుగూడ నెక్కడను దననివాసమునుగాని తన యేలికయగు విశ్వేశ్వరరాజునివాసమునుగాని కంఠోక్తిగాఁ బేర్కొనలేదు. పురవర్ణనమున కుదాహరించిన పద్యమే యీతఁడు రాజమహేంద్రవరమువాఁడుకాఁడని తెలుపుటకుఁ జాలియున్నది. కృతిపతి రాజమహేంద్రవరమునఁ నే రాజ్యము చేయుచుండినయెడల నట్లు వర్ణించుటయే నాయకోత్కర్ష హేతువుగాని నాయకునితాతయో తాత తాతయో రాజమహేంద్రవరమును నిర్మించినారని వ్రాయుట యుత్కర్షాదాయకము గానేరదు గదా? అవతారికాభాగమునందుఁగూడ "రాజమహేంద్రవరస్థాత రాజనరేంద్రుఁ డెక్కువతాతయేవిభునకు" అని కృతిపతివంశములోఁ బూర్వుఁడగు రాజనరేంద్రుఁడు రాజమహేంద్రవరమువాఁడని మాత్రమే తెలిపెను గాని యీ విశ్వేశ్వరరాజునకును రాజమహేంద్రవరమునకును నేసంబంధముగలదో కొంచెమైనఁ బేర్కొనలేదు.

2. కేయూరబాహుచరిత్రమును రచించిన మంచనకాలనిర్ణయావసరమున "పృథ్వీశరాజుమంత్రి మనుమఁడైన గుండనామాత్యునకుఁ గేయూరబాహుచరిత్ర మంకితము చేయబడియుండుటచే నీకవి తిక్కనసోమయాజికాలములోనో కొన్ని యేండ్లతరువాతనో యుండవలయును. కాఁబట్టి యీ మంచనామాత్యకవి ౧౩౩౦ సంవత్సరప్రాంతముల యందున్నవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇతఁడు రాజమహేంద్రపురనివాసుఁడు. పయినిజెప్పఁబడిన వెలనాటిచోడులలోనయినరాజులు చాళుక్యరాజప్రతినిధులుగా రాజమహేంద్రవరము రాజధానిగా వేఁగిదేశమును బాలించినవారే."

"ఈపాకనాటిరాజ్యమును క్రొత్తగా గెలిచి రాజేంద్రచోడఁడు-("వెలనాటిచోడఁడు") కులోత్తుంగరాజేంద్రచోడఁడు" అని యీతని నామాంతరములు)— దానిపాలనమునకయి కొమ్మనామాత్యుని నియమించినట్లు కనుపట్టు

చున్నది. ఈవిజయము ౧౧౭౦ సంవత్సరప్రాంతములం దయియుండవలెను" (చూ. ఆ. క. చ. నూ. ప్ర. 251 పే.)

1. ౧౨౩౮ సంవత్సరమునందు కృష్ణాగోదావరీ మధ్యమునందున్న వేఁగిదేశమంతయు గణపతిరాజుల యధీనమయినది.

కులోత్తుంగచోడదేవుని కాలమునుండియు చాళుక్యచోడులందఱును తాము వేఁగిదేశమును విడిచి చోళుల బిరుదావళులను వహించి చోళులుగానే పరిగణింపఁబడుచు వచ్చుటచేత (చూ. ఆ. క. చ. నూ. పే. 29) అనియు వ్రాసిరి. ఈవ్రాఁత లోకదానితో నొకటి సరిపోకున్నవి. చాళుక్యులవంశవృక్షమునందు ౧౧౫౮ మొదలు ౧౨౦౦ వఱకు రాజ్యముచేసిన వెలనాటిచోడనితో నే వారిరాజ్యము రాజమహేంద్రవరమును విడిచినట్లు స్పష్టపడుచున్నది. వెలనాటిచోడఁడు మొదలయినవారు సైతము చాళుక్యరాజప్రతినిధులుగా రాజమహేంద్రవరము నేలిరి. అంతియకాని వారు చాళుక్యవంశమువారు కారు. ౧౨౩౮ కే రాజమహేంద్రవరము గణపతిరాజుల యధీనమయినది. అని వ్రాయుటచేత ౧౨౩౮ తరువాత చాళుక్యులకేకాక చోళులకుఁగూడ రాజమహేంద్రవరము దూరమయినదని స్పష్టమగుచున్నదిగదా?. ఇట్లుండఁగాఁ పదుమూఁడువందలనాలుగవసంవత్సరప్రాంతమందు రాజ్యమేలిన విశ్వేశ్వరరాజు రాజమహేంద్రవరమును బాలించుట యెట్లు? కావున విశ్వేశ్వరరాజు రాజమహేంద్రవాసుఁడయియుండఁడు.

3. విశ్వేశ్వరరాజు శాసనములును దరువాతనాతని మనుమనిశాసనములునుగూడ రాజమహేంద్రవరసమీపమునఁ గాక దూరస్థలములం దున్నవి. వానియందు రాజమహేంద్రవరప్రశంసయే కానరాదు.

4. విశ్వేశ్వరరాజు రాజరాజనరేంద్రున కేడవతరమువాఁడని నిర్ణయించుట కాధారము లేదు. ధర్మలింగేశ్వరస్వామియాలయమునఁ జెక్కింపఁబడిన శాసనము సరియయినదిగా నగపడదు. చాళుక్యులవంశవృక్షమునందు భీమరాజులు ముప్వురుగలరు. 14వ తరము 22వ తరములచాళుక్యభీములకు విజయాదిత్యుఁడు, అమ్మవిజయాదిత్యుఁడు ననుకుమారులు గలరు. 20వ తరమువానికి సంతతి లేదు. కాని వీరిలో నెవ్వరికిని విమలాదిత్యుఁ డను కుమారుఁడు లేడు. విశ్వేశ్వరరాజు శాసనమందు భీమేశ్వరునికొడుకు. విమలాదిత్యుఁడు నాతనితనయుఁడు రాజనరేంద్రుఁడు నని యుదాహరింపఁబడినది.

కావున నీవంశక్రమమును సరికాదని చెప్పవలసియున్నది.నన్నయభట్టుచరిత్రమం దుదాహరించినవంశవృక్షమందు భీమేశ్వరులకుసంబంధించినశాఖలు రెండుగలవు.

I. 1. చాళుక్యభీముఁడు 2. దానార్ణవుఁడు, 3. విమలాదిత్యుఁడు 4. రాజరాజు, 5. కులోత్తుంగచోడదేవుఁడు 6. విక్రమచోడఁడు 7. కులోత్తుంగచోడదేవుఁడు 8. రాజేంద్రచోడఁడు, 9. రాజరాజచోడఁడు అనునది.

II. 1. భీముఁడు. వానియన్నకొడుకు సత్యాశ్రయుఁడు. వానిక్రమమున విజయాదిత్యుఁడు, విష్ణువర్ధనుఁడు, మల్లప్పదేవుఁడు, విజయాదిత్యుఁడు; మల్లవిష్ణువర్ధనుఁడు అనునది రెండవది. విశ్వేశ్వరరాజు శాసనములో నుదాహరింపఁబడినశాఖ యిదియేదియునుగాదు. 1. భీమేశ్వరుఁడు 2. విమలాదిత్యుఁడు 3. రాజనరేంద్రుఁడు 4. కులోత్తుంగచోళుఁడు 5. విమలాదిత్యుఁడు 6. మల్లప్పదేవుఁడు 7. ఉపేంద్రుఁడు 8. కొప్పభూపుఁడు 9. మనమోపేంద్రుడు 10. విశ్వేశ్వరరాజువంశవృక్షము. ఈమూఁడుశాఖలకును సంబంధము లేమి బాగుగ నగపడలేదా? అట్టితఱి నీతఁడు రాజనరేంద్రుని కేడవమనుమఁడని నిర్ణయించుట కాధారములేమి? వీనినాలోచింపఁగా విశ్వేశ్వరరాజు శాసనములోని వంశవృక్షము సరియయినదికాదని తేలుచున్నది.

III. విశ్వేశ్వరరాజు రాజనరేంద్రుని సంతతిలో సరిగ నేడవతరమువాఁడు గాక యెుత్తమువీఁడఁ జాళుక్యవంశమువాఁడుమాత్ర మగునేమోకాని రాజమహేంద్రవరమును బాలించినవాఁడుమాత్రము గాఁజాలఁడు. కావున రాజనరేంద్రుని కాలమునసుసరించి విశ్వేశ్వరరాజు కాలమును నిర్ణయించుటకు వలనుగాదు. ఈతనివాసస్థానమును నిర్ణయించుటయు సరిగాదు.

విన్నకోటపెద్దన తనకృతియందు కృతిపతిని వర్ణించుచు

సీ. శ్రీకంఠచూడాగ్రశృంగార కరణ మే
రాజన కన్యయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువ
ర్ధనుఁ డేనుహీంశుతాతలకుఁ దాత
భృతకుమారారామ భీముండు చాళుక్య
భీముఁ డేన్నపకులాబ్ధికి విధుండు
రాజమహేంద్రవరస్థితరాజన
రేంద్రుఁ డెక్కువతాత యేబిభునకు
ఆంధ్రవశేదానవోపేంద్రుఁడగు నుపేంద్ర
ధరణివల్లభు డేరాజు తండ్రితాత

అహింసా జ్ఞాన ప్రచారక సంఘసభ్యులు, పరిగి, హిందూపురము




Members of the Ahimsa Jnana pra haraka Sanghamu

శాంత్యాశ్రమము, రాజమహేంద్రవరము



Santyasramam, Rajamundry

ఆంధ్రసేవాసంఘము, రంగూను




Andhraseva Sanghamu, Rangoon

రాత్రి ధర్మపాఠశాల, దీనపోషకసమాజము, రంగూను




Free night School, Deenaposhaka Samajam, Rangoon

ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వని కన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబ సుతుఁడు.

అని పేర్కొనెను.

దీనియందుఁ జంద్రునకు విశ్వేశ్వరునకు నెట్టిసంబంధముగలదో యల్లేవిష్ణువర్ధనభీమరాజనరేంద్రులతో నీవిశ్వేశ్వరునకు సంబంధముగలదని తెలుపుటకై "తాతలకుఁ దాత, కులాబ్ధికవిధుండు, ఎక్కువ తాత" అనుపదము లుపయోగించి కడపటి వారికిగల సంబంధము విస్పష్టముగనే చెప్పియున్నాఁడు. కావున నీరాజు రాజనరేంద్రున కేడవతరమువాఁడని వ్రాయుట కాధారములు లేవు.

కావ్యాలంకారచూడామణి రచింపఁబడిననాఁటికి చాళుక్యరాజ్యము (తత్రాపిరాజమహేంద్రవరమున) లేదని దృఢముగా నమ్మవచ్చును. ఆకాలమున రాజమహేంద్రవరము కాకతీయులకో వారిసామంతులగు రెడ్లకో యాస్థానమయి యుండుననుటకు సందేహములేదు.

IV. కావ్యాలంకారచూడామణియందు విశ్వేశ్వరుని నివాసము సరిగఁ బేర్కొనఁబడ లేదుగాని కొంతయూహించుట కవకాశముమాత్రము గలదు. విశ్వేశ్వరరాజు కావ్యాలంకారచూడామణియం దెంతయధికుఁడగు చక్రవర్తిగా వర్ణింపఁబడినను నీతఁడు చిన్నసంస్థానమునకు మాత్రమే యేలికయని తోఁచుచున్నది. తమపోషకుల నతిగావర్ణించుట కవులకు సామాన్యవిషయమే కదా? పాండురంగమాహాత్మ్యమునందు తెనాలిరామకృష్ణునిచే నతిగా వర్ణింపఁబడిన విరురివేదాద్రి యొకజాగీర్దారుని మంత్రిమాత్రమేయని యెల్ల రెఱింగినదే కదా? అట్లే విశ్వేశ్వరరాజుకూడ మిక్కిలి గొప్పగా వర్ణింపఁబడినాఁడు. ఈతనిరాజ్యము విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధి సమీపముననుండినది.

మాలిని. స్తుతిహిమకరజూటా చూర్ణితద్విట్కిరీటా
ప్రతతగుణపరీణా పంచధారాధురీణా
పితకరకులదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా.

(కా. చూ. 9. ఉ. ఆశ్వాసాంతము.)

అనుపద్యమునందు, "పంచధారాధురీణా" యను పదము విశ్వేశ్వరరాజునివాసము నెఱింగించుచున్నది. పంచధారయనునది యొకగ్రామము. ఇదియే విశ్వేశుని యావాసము. ఈగ్రామమందే ధర్మలింగేశ్వరస్వామి యాలయము గలదు. దానసే విశ్వేశ్వరరాజుయొక్కయు నాతని మనుమనియొక్కయు శాసనములు గలవు. విశ్వేశ్వరరాజుయొక్క యుద్ధములుగూడ నీప్రాంతములందే జరగుచుండెడివి.

అ. చతురుపాయబాహుళ కీర్తిమావలిఁ
బాఱవిడిచి చిత్రభానుసాక్షిఁ
బాఱ సర్వసిద్ధిపద మేది ధరణీవ
రాహమునకు నోడి రాచకదుపు. (కా. చూ. 7. ఉల్లాసము.)

అనుపద్యమునందు విశ్వేశ్వరరాజు సర్వసిద్ధిని జయించినట్లు స్పష్టముగదా? ఇట్లే

ఉ. ద్వీపులఁ ద్రుంచి విశ్వజగతీపతి యుత్తమకీర్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ము ఘటించుటయుం బ్రసన్నుడై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁగాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధి బ్రసిద్ధివహించి రుర్వరన్.

(కా. చూ. 7. ఉల్లాసము.)

అనుపద్యమునందు విశ్వేశ్వరరాజుచే నిర్మింపఁబడిన గోస్థానము పేర్కొనఁబడినది. ఈగోష్ఠ మిప్పటికిని "గోకులపాడు, గోపులపాడు, గోగులపాడు" అను పేరులతో వ్యవహరింపఁబడుచున్నది. ఇంకనీప్రాంతములందు కొక్కెరాపల్లి, లక్కవరము, చోడవరము, పులపర్తి, కొప్పాక, (కొప్పభూపునిపేరనిర్మింపఁబడినది), రాయవరము, మొదలయిననామములుగల గ్రామములు చాళుక్యరాజులసంబంధమును సూచించుచున్నవి. వీనియందు శిథిలములయిన దేవాలయాదుల చిహ్నములుగూడ నటనటఁ గలవు. వీనినన్నిటిని జూచిన దప్పక చాళుక్యులు కొంతకాల మిట రాజ్యముచేసిరని తెలియవచ్చును. ఈశాఖ రాజమహేంద్రవరమును బాలించినది కాక పిఠాపురప్రాంతమందున్నవారికి సంబంధించినదై యుండవచ్చును. అయినను దమకులమందు మహాప్రఖ్యాతు లగుటచే రాజరాజాదులను దమశాసనాదులందు వర్ణించికొనియుందురు. పైనివ్రాసినదానింబట్టి యీవిషయము సత్యదూరము కాఁజాలదు. కావునఁ జాళుక్యవిశ్వేశ్వరుని నివాసస్థానము రాజమహేంద్రవరముగాక విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధిసమీపముననున్న "పంచధార" యనిన నే సమంజసముగా నగపడుచున్నది. కృతిపతినివాసస్థాన మదియగునపుడు విన్నకోటపెద్దననివాసము ఈప్రాంతమైనఁగావచ్చును, లేక, రాజమహేంద్రవరమో మఱియేదో కావచ్చును. కృతిపతినివాసము ననుసరించి యాతనివాసస్థానము నిర్ణయించు టంతసిద్ధాంతము కానేరదు. ఈవిషయమున జారిత్రకులు పరిశీలించిన నింక ననేకనూతనవిషయములు బయలుదేఱి సిద్ధాంతముచేయ నవకాశము లభించును.

# వేమన కాలము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

ఆంధ్రపత్రికలో ఒకసంవత్సరముకుముందు "వేమన యోగి దేశకాలములు" అనివ్యాసము వ్రాసితిని. అటుపయిని రక్తాక్షియుగాదిసంచికలో "వేమనకాలనిర్ణయము" అనుపేర శ్రీబండారు తమ్మయ్యగారు వ్యాసము వ్రాయుచు నందు వేమనకాలమునుగూర్చి నేనువ్రాసిన విషయ మంగీకారార్హముకాదని యాక్షేపించిరి. ముందు నేనువ్రాసినదేదో వారుకాదన్నదేదో యించుక తెల్పుచు నా పైవ్రాసినదాని సమర్థించుకొనుచున్నాను. నేను వ్రాసినవ్యాసము ప్రతి నాదగ్గఱ జాగ్రత్తపఱుపలేదు గాన దానివిషయముమాత్రము తెలుపుచున్నాను.

నేను చాటుపద్యమణిమంజరి) ప్రథమభాగమున, "పరగరాయనికులు బాచనిధనమెల్ల, భటులపాలు కవుల పాలు దలఁప, ధరను లోభివానిధనము దాయాదులపాలు జారకాంతపాలు వేమ!"యను వేమనపద్యమునుబట్టి వేమన రాయనిభాస్కరునికాలమువాఁడయి యుండవచ్చుననియు, రాయనిభాస్కరులు పలువు రున్నారనియు, వేమాభిధానులగు రెడ్డిరాజులకాలమువాఁ డీవేమనకావచ్చుననియు, నందుకుసరిగా కాటయవేమనయొద్ద మంత్రిగా నొకరాయనిభాస్కరుఁ డున్నాఁడనియు, నీరాయనభాస్కరుని వేమనయోగి ప్రశంసించి యుండవచ్చుననియు నిటుచూడఁగా వేమనయోగి క్రీ.శ.1400వాఁ డగుచున్నాఁడనియు వ్రాసితిని. వేమనచరిత్రము రచించిన వంగూరి సుబ్బారావుగారు మొదలగువా రీకాలమునే యంగీకరించిరి. ఇటీవల నొకతూరి సవిమర్శనముగా నేను వేమనపద్యములను బఠించితిని. అప్పు డీక్రింది రెండుపద్యములు వరుసగా నొక్కచోటఁ గన్పట్టినవి.

ఆ. పరగరాయనికులు బాచనిధనమెల్ల
భటులపాలు కవులపాలు దలఁప
ధరను లోభివానిధనము దాయాదుల
పాలు జారకాంతపాలు వేమ!

ఆ. ప్రాకటముగ నిట్టిలోకములోగుంటు
పల్లిముత్తఁ డెన్నఁ బరమగుణుఁడు
అన్నదానమునను హరుపూజచేతను
హరునిఁగాంచె లోన నరసివేమ!

ఇటీవలియచ్చుప్రతులలో నీ రెండుపద్యములును భిన్నస్థలములఁ జేర్పఁబడినవి. 1850 ప్రాంతములముద్రితములయిన యచ్చుప్రతులలోను, వ్రాఁతప్రతులలోనునీ రెండు పద్యములు నొక్కచోటనే కలవు. కొన్నిప్రతులలో గుంటుపల్లి యని యుండవలసినదానికి "లోకములో గంటి, పల్లెముత్తఁడెన్న" అని లేఖక ప్రమాదముచే, లోకములోఁ గంటిఁ—పల్లెముత్తఁడెన్న—అని ఛేదము వచ్చునట్టు తప్పు వ్రాఁతయున్నది. కొన్నింట గంటుపల్లి అనియున్నది. ఆకాలమున గుంటుపల్లిముత్తమంత్రి విషయము ప్రఖ్యాతముగా గుర్తింపఁబడియుండకపోవుటచేఁ గొందఱు దీని సంస్కరింపఁజాలరయిరి. పయిపద్యములు రెండు నొక్కచోట నుండుటను జూడఁగానే—అప్పటికిఁ గొలఁదికాలముక్రిందటనే చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమున గుంటుపల్లిముత్తమంత్రి చాటుపద్యములఁ బెక్కింటిని బ్రకటించియున్నవాఁడనగుటచే నేను 'పల్లెముత్తఁడు' కాదు 'గుంటుపల్లెముత్తఁడే' యని గుర్తింపఁగల్గితిని. ఈగుంటుపల్లిముత్తామాత్యుఁడు శా. శ. 1545 లోఁ జనిపోయినాఁడు: దీనికిఁ జాటువు

క. పాండుగ శరజలనిధి హరి
చందనశరుచంద్రసంఖ్య శకవర్షములన్
దుందుభి వాహాఢంబున
నందముగా పీరముత్తఁ డరిగెన్ దివికిన్.

చాటుపద్యమే కాక శాసనములు, సన్నదులు మొదలయిన బహుసాధనము లాతనికాలమును దెల్పుచున్నవి.

ఈ ముత్తామాత్యునికాలమునఁగూడ నొకరాయనభాస్కరుఁడుండెను. అతఁడును సుప్రఖ్యాతుఁడు, మంత్రిమానాటి కట్టుబాట్లుమొదలయినవి కల్గించినవాఁడాతఁడే. రాయనభాస్కరుని చరిత్రమున నవిచూడఁదగును. అతనికొడుకే కొండమంత్రి. అతనిమనుమఁడే రామలింగభాస్కరుఁడు. ముత్తామాత్యుఁడును నీరాయనభాస్కరుఁడును నందవరద్విజులు, సన్నిహితబంధువులు, సమకాలమువారు గాన వేమన వారినిద్దఱను బ్రశంసించినాఁడనుట యుక్తము గదా! వారినిద్దఱను బ్రశంసించినవేమన క్రీ 1400 కాలమువాఁడు కాఁడుగదా! క్రీ. శ. 1623లోఁ జనిపోయిన ముత్తామాత్యుని వర్ణించిన వేమనకూడ నాకాలమువాఁడే యగును.

దీనిపైఁ దమ్మయ్యగారి యాక్షేపములు:—

వారివ్యాసము కడచినయుగాదిసంచికలో నున్నది గాన దానినుండి కొంతభాగము నుదాహరించుచున్నాఁడను.

"ఈపద్యము ప్రక్షిప్తముగాని వేమనశిష్యులు చెప్పినదిగాని కాక వేమన స్వయముగాఁ జెప్పినదే యని యంగీకరించినను దానిఁబట్టియే వేమన ముత్తనామాత్యుని కాలములోనున్నట్టు తలఁపరాదని నా యభిప్రాయము. రాయనిభాస్కరుని ప్రశస్తినిబట్టి వేమన యాతనియనంతరము చిరకాలమున నాతని నట్లు పేర్కొనెనో యట్లే ముత్తనామాత్యునిఁగూడఁ దానాతనియనంతరము వెలసి నప్పటికిఁగూడఁ బేర్కొనియుండవచ్చును. అన్నప్రదాతలు నెఱదాతలు నగు పుణ్యాత్ములు స్థిరకీర్తులగుటచే నేకాలమందును గీర్తింపఁబడుచునే యుందురు. కొన్ని పద్యములనుబట్టి వేమన క్రీ. శ. 1623 తరువాతనే యుండెననుట కవకాశ మేర్పడుచున్నది. "శ్లో. అవసరపఠితా వాణీ గుణగణరహితాపి వహతి పరమోదమ్, రతిసమయే యువతీనాం భూషాహానిశ్చ భూషణం భవతి" అను పండితరాయల శ్లోకమునకు వేమనపద్యములలో నీక్రింది యనుకరణ మున్నది:

గీ. ప్రస్తుతంపువేళఁ బద్యంబుచదివినఁ
దప్పులున్న మిగుల నొప్పియుండు
వెలఁది (పఁణతి) సురతవేళ బిత్తరై (ప్రౌఢయై)యుండదా
విశ్వదాభిరామ! వినుర వేమ!

వేమ క్రీ. శ. 1412-1480, వఱకు నుండినట్లు తాము తలంచుటచే శ్రీసుబ్బారావుగారు పండితరాయలే వేమన ననుసరించినట్లు వ్రాసిరి. పండితరాయలాంధ్రదేశమున జన్మించినను......వేమన తెల్గుపద్యమును విని దానిని సంస్కృతీకరించెననుట యసంగతము. పండితరాయలు మొగలుచక్రవర్తియగు షాజహాను (క్రీ. శ. 1682-1658) ఆస్థానమం దుండినవాఁడు. ఆంధ్రదేశమున నాతనిగ్రంథములకు వ్యాప్తికలిగినతరువాతనే పైశ్లోకార్థమును విని వేమన తెలుఁగుపద్యమును జెప్పియుండునని తోఁచుచున్నది."

పై యాక్షేపములకు నే నిప్పుడు చెప్పుసమాధానము లివి:-ముత్తమంత్రిమీఁదిపద్యము ప్రక్షిప్తమేమో అని, వేమన శిష్యులుచెప్పినదేమోఅని, యేల సందేహింపవలెను? వేమన స్వయముగాఁ జెప్పినదేయని యంగీకరించుటలో "తుష్యతు దుర్జన"న్యాయ మేల? వేమనపద్యము లెప్పటినుండి ముద్రితములగుచున్నవో అప్పటినుండియు, నీపద్యము ముద్రితమగుచునేయున్నదిగదా. వ్రాఁతప్రతులలోను నున్నదిగదా! ప్రసిద్ధములయిన వేమనపద్యముల నేకారణములచే వేమనస్వయముగారచించినవేయని నిశ్చయించుచున్నారో, ఆకారణములెల్ల నీపద్యమువిషయమునను గలవుగదా! ఈపద్యమునుబట్టి నే నీక్రొత్తవిషయమునుజూపుటకారణమా యేమి ప్రక్షిప్తమనియో, శిష్యకృతమనియో సందేహముచెందుటకు? "తుష్యతుదుర్జనన్యాయమున"తుదకు వేమనకృతముగాఁగూడ నంగీకరించుట ప్రక్రమాంతరముచే నేఁజెప్పిన క్రొత్తవిషయము తప్పఁజెప్పఁగల్గుచున్నాముగదా అనియా? రాయనిభాస్కరునికిఁ దర్వాత నాతనిప్రతీతిని విని వేమన యాతనిఁ బ్రస్తుతించెననుట నంగీకరింపలేదుగదా! అది సాటిగాఁజూపి ముత్తామాత్యునిఁగూడ నట్లే ప్రశంసించెననుట యెట్లు? వేమన ముత్తామాత్యుని సమకాలమువాఁడగు రాయనిభాస్కరునిఁ బ్రశంసించినాఁడని నే ననుచున్నాను. ఒకకాలముననే ప్రఖ్యాతులై యొకరాయనిభాస్కరుఁడును ముత్తా

మాత్యుఁడునుండఁగాఁ దత్సమీపకాలముననున్న వేమన యొక రాయనభాస్కరుని ముత్తామాత్యునిఁ బ్రశంసింపఁగా నట్లు ప్రశంసింపఁబడిన రాయనభాస్కరుఁ డాముత్తామాత్యుని తోడివాఁడు కాఁడనుట సంగతముగా నుండునా ? ఈరాయనభాస్కరుఁడుమాత్ర మేమి యప్రఖ్యాతుఁడా? అట్టి ప్రస్తుతికిఁ దగనివాఁడా?

'అవసరపఠితావాణీ' యను శ్లోకము పండితరాయల దనునమ్మక మింత చేయించినది. కాని యది పండితరాయలశ్లోకము కాదు. ఆయన ముత్తాతపుట్టుకకుఁగూడ నింకనుముందే ఆశ్లోకము పుట్టియున్నది. ప్రసంగరత్నావళిలో, సుభాషితపద్ధతిలో,నీశ్లోకము గానవచ్చుచున్నది. ప్రసంగరత్నావళి శక 1388లో సంకలనముచేయఁబడినది. ఈశ్లోకముపుట్టి అప్పటి కింకనెంతగాలమైనదో! ఇది యాధారముగాఁ బండితరాలకింకను దర్వాతివాఁడు వేమన యనిచెప్పెడుమాట తప్పయిపోయినది. ఇఁక నేను వేమన ముత్తామాత్యునికాలమువాఁడే యగుననుటకుఁ గారణము చెప్పుచున్నాఁడను. ముత్తామాత్యుని కాలమువాఁడే యనఁగా ముత్తామాత్యునితోఁబుట్టి యాతనితో నంతరించెనని యర్థముకాదు. వేమన యాతని ప్రాభవము నెఱిఁగి యుండుననియగును. ముత్తామాత్యుని తర్వాతఁగూడ వేమన జీవించియుండెనని యీవేమనపద్యమే చెప్పుచున్నది గదా? ముత్తామాత్యుఁడు క్రీ.శ.1623లోఁ జనిపోయినాఁడు గాన, వేమన యటుతర్వాతఁగూడఁ గొంతకాలము జీవించి యున్నాఁడు గాన, యాతఁడు క్రీ.శ.17-వ శతాబ్దిపూర్వార్థమం దున్నవాఁడగును. ఆతనియునికి నంతకింకనుదర్వాతికిఁ దెచ్చుట కాధారములు కానరావు సరిగదా బాధకము లున్నవి. తంజావూరి సరస్వతీమహాలులో వేమన పద్యముల వ్రాఁతప్రతు లున్నవి. ఇప్పటికి నూటయేఁబదేండ్లకుముందు సరిచూడఁబడినలిస్టులలో వేమనపద్యములపుస్తకము లున్నవి. అప్పటికవి యింకనెంతో పూర్వకాలమున వ్రాయింపఁబడినవై యుండును. నేఁటికవి యతిశిథిలస్థితిలోనున్నవి. అవి రెండువందలయేండ్లకింకను బూర్వకాలపుప్రతులు. వేమన తంజావూరికి వెళ్లినాఁడని ప్రతీతియున్నది. ఇప్పుడు ప్రకటితమగుచున్న వేమన బొమ్మ తంజావూరి రాచనగరిలోనిదే. మనదేశమున దొరకుచున్న వేమనపద్యముల వ్రాఁతప్రతులలోఁగూడఁ గొన్ని రెండువందలయేండ్లక్రిందటి వున్నవి. వేమనపద్యములలోఁ గొండవీటిప్రాభవము గానవచ్చుచున్నది. గజపతులరాచఱికము ప్రశంసలున్నవి. ఇవి పదునేడవ శతాబ్ది పూర్వార్థమునకు సంగతములుగా నుండును.

ఈ వ్యాసము తొలుత నేను వ్రాసినవ్యాసము దోషజుష్టము కాదని నిరూపించుటకే వ్రాసితిని.

# ఎండమావులు

సాహిత్యసరస్వతి డి. యస్. శర్మగారు

కన్నులు పూయఁ, గుత్తుకదగ న్వసివాఱ, నొడల్కుడుంగ నా
పన్నత నొక్కయిత్తి కడుబాట మెఱుంగు జలంపు జాడలన్!
సన్నిదృష్టిగాంచి యురుసంబున నబ్బి నవీనయాన సం
పన్నతఁ జూపి యుస్సురని ప్రాణము లొక్కటఁబాయు నక్కటా!

శా. పైపైఁ దేల్ గులికించి సాధుమృగము న్వంచింప నీక్రౌర్యకు
వ్యాపారంబులు మానకుందువుగ? గోవ్యాఘ్రుంబ! నీగర్వమా
యాపీనత్వము వెల్లనిమ్ము! ఘనమార్తాక్రాంతవర్ష ర్తు న్వే
చ్ఛాపూర్వంబుగ వచ్చునాఁక మృగతృష్ణా! నీకుఁబూజ్యంబగున్.

# తిక్కన వంశచరిత్ర

ఆంధ్ర శేషగిరిరావు గారు

[సారస్వత సమాజము.]

తిక్కన నియోగిబ్రాహ్మణుఁడు, గౌతమగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, ఆతనివంశీయులు లౌకికాధికారధూర్వహులై కీర్తివిస్తారులై వెలుగొందిన శక్తిమంతులు.

కొట్టరువు మావెనమంత్రి తిక్కనవంశమునకు మూలపురుషుఁడు. ఈతఁడు 'త్యాగవ్రతశీలుఁడు'; 'అమలినాచారుఁడు'; 'నానాగుణమణి'; 'ఆగమకోవిదుఁడు'. మావెనమంత్రి నందనుఁడు కేతన; ఈతఁడు శూరుఁడు; ధీరుఁడు; 'తేజోవిధవాభిజాత్యముల' గణన కెక్కిన సుప్రసిద్ధపురుషుఁడు. కమ్మనాటిని బరిపాలించిన త్రిభువనమల్లదేవచోడున కమాత్యుఁడు. ఈ కేతనమంత్రి నాచమాంబయందు ౧. గుండన, ౨. భాస్కరుఁడు, ౩. మహేశ్వరుఁడు, అను మువ్వురుకొమాళ్లఁ బడసెను. ఇట్లు పడసిన పుత్త్రత్రితయమునందు రెండవవాఁడగు

భాస్కరమంత్రి

ఆంధ్రమహాపురుషులగు కవితిక్కన, ఖడ్గతిక్కనలకుఁ బితామహుఁడు; భాస్కరమంత్రి 'ఆర్యశిరోమణి'; గుంటూరివిభుఁడు; 'సారకవితాభిరాముఁడు'; 'శాపానుగ్రహశక్తియుక్తుఁడు'; 'సాహిత్యవిద్యాపారీణుఁడు'; 'విబుధశ్రేయస్కరుఁడు'; 'అర్థార్థిలోకావనవ్యాపారవ్రతుఁడు'; 'అమలాచారుఁడు'; 'గౌరీపతి శ్రీపాదప్రవణాంతరంగుఁడు'; 'ధర్మమార్గపథికుఁడు'.

పంద్రెండవ శతాబ్దాంతమున నాంధ్రభూమి పూర్వచాళుక్యచోడచక్రవర్తుల పాలనములో నుండెను. చందవోలు రాజగు పృథ్వీశ్వరమహారాజా పూర్వచాళుక్యచోడచక్రవర్తులకుఁ బేరునకు మాత్రము ప్రతినిధియై విక్రమసింహపురము మొదలుకొని సింహాచలముపర్యంత మాకాలమునఁ దెలుఁగుమాగాణి నేలుచుండెను. మన భాస్కరమంత్రి ఈపృథ్వీశ్వరమహారాజు నధికారము క్రింద గుంటూరుసీమను బరిపాలించి ప్రథితకీర్తి నమువార్జించెను. కావుననే ఈతఁడు దశకుమారచరిత్రమునందును, నిర్వచనోత్తరరామాయణమునందును, గుంటూరివిభుఁడుగాఁ బేర్కొనఁబడినాఁడు.

ఈమంత్రిభాస్కరుఁడే ఆంధ్రమునఁ దొలుఁదొల్త రామాయణము రచియించెననియు, ఆపుస్తకమాయన పేరనే భాస్కరరామాయణ మని వ్యవహరింపఁబడుచున్నదనియు, ఏకారణముననో ఆగ్రంథమునం దరణ్యకాండము తప్ప తక్కినకాండములన్నియు నుత్సన్నము లయ్యెననియు, ఆయుత్సన్నభాగములను హుళక్కిభాస్కరాది కవిపుంగవులు పూరించిరనియు, గాళ్లులేని కథయొకటి మనలో వ్యాపించియున్నది. సత్యప్రియులీకథను మంగీకరింపఁజాలరు.

భాస్కరమంత్రి తాతతండ్రులు కృష్ణామండలములోని వెల్లటూరులో నివసించిరి. ఉద్యోగధర్మమున భాస్కరామాత్యుఁడు తననివాసము వెల్లటూరినుండి గుంటూరునకు మార్చుకొనియెను. భాస్కరమంత్రికి కొమ్మాంబయందు ౧. కేతన, ౨. మల్లన, ౩. సిద్ధన, ౪. కొమ్మన; అను సుతచతుష్టయము కల్గెను. (వంశవృక్షము.)

గౌతమగోత్రమున

కొట్టరువు మావెనమంత్రి

కేతన = నాచమాంబ

గుండన | భాస్కరుఁడు = కొమ్మాంబ | మహేశ్వరుఁడు

౧. కేతన | ౨. మల్లన | ౩. సిద్ధన | ౪. కొమ్మన

## ౧
### కేతన

ఇతఁడు భాస్కరమంత్రి జ్యేష్ఠపుత్త్రుఁడు. కేతన పితామహునకువలెఁ గమ్మనాటి చోడరాజాస్థానమునందు గొప్పకొలువులు చేసి ప్రభుసన్మానములంది ప్రసిద్ధిచెందినవాఁడు. అభినవదండివిరచితమైన దశకుమారచరిత్రమందీ కేతనమంత్రి యిట్లభివర్ణింపఁబడినాఁడు.

చ. కవిజను ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువులిచ్చువాఁడు నా
నవరసభావనుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు నా
నవునన రాజనీతివిచక్షణుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యిమ్మహిన్.

అ. ౧, ప. ౩౬.

ఇతఁడు బ్రహ్మమాంబయందు ౧. భాస్కరుఁడు, ౨. గుండన, ౩. మల్లసిద్ధన, అనుముగ్గురుసుతులఁ బడసెను. అభినవదండి వర్ణనమునుబట్టి కేతనామాత్యుని పుత్త్రులును పౌత్త్రులును అఖండితశౌర్యదానములచేఁ గీర్తిగౌరవములుపొంది వెలుగొందిరని నిర్ణయించుట సాహసమును సత్యదూరమును గాఁజేరదు. (కేతన వంశవృక్షము)

కేతన = బ్రహ్మమాంబ
- భాస్కరుఁడు = మారమాంబ
  - కేతన
  - మారయ
- గుండన = భూమిదేవి
  - మల్లన
  - కొమ్మన
  - సిద్ధన
  - కేతన
- మల్లసిద్ధన = అప్పమాంబ
  - కేతన
  - మల్లన

## ౨
### మల్లన

మల్లన భాస్కరమంత్రి ద్వితీయపుత్త్రుఁడు. ఇతఁడును అగ్రసోదరునకువలెనే కమ్మనాటిచోడులయొద్ద మంత్రిత్వము వహించినవాఁడు. మల్లనమంత్రి మిక్కుటమైన దేహదార్ఢ్యము కలవాఁడు; ప్రతాపశాలి; 'భాగ్యసమగ్రుఁడు'; 'పరమదయాపరతంత్రుఁడు'; 'హరిపూజాపరుఁడు'. ఈతఁడు మాచమ్మయందు మనుమసిద్ధియను పుత్త్రరత్నమును బడసెను. దశకుమారచరిత్రమందీ మనుమసిద్ధి ఇట్లు వర్ణింపఁబడినాఁడు.

సీ. సుకవిలోకస్తవశ్లోకకు దనకీర్తి
పదనైన చంద్రాతపంబు గాఁగ
నాపదార్తజనసస్యములకు దనకృపా
ధారాంబు వమృతంపు సోనగాఁగ
వనితాజనుల మాపులనతూపులకు దన
ప్రసన్నని పేమ లేపంబుగాఁగ
మహనీయ నృపనీతిమణులకు దనమాట
లాలితశాణోపలంబు గాఁగ
ఆ.వె. విమతి కర్ణుఁ డయ్యె వివిధవిద్యాఖ్యాన
చరితుఁ డభవచరణ సరసిజాత
మధుకరాయమాణ మానసుం డప్రతి
మానవిమలబుద్ధి మనుమసిద్ధి.

అ. ౧, ప. ౬౦.

(మల్లన వంశవృక్షము.)

మల్లన = మాచమ్మ
- మనుమసిద్ధి

## 3
### సిద్ధన

సిద్ధన భాస్కరామాత్యుని తృతీయపుత్త్రుఁడు. అన్నదమ్ములునలువురిలో నితఁడు మిక్కిలి ప్రయోజకుఁడు. విక్రమసింహపురవిభుఁడగు తిక్కజననాథాగ్రణికాప్తమంత్రియు సేనాపతియునై కీర్తికెక్కిన దీసిద్ధనామాత్యుఁడే. ఉదాత్తనృపనీతియం దీతఁడు బృహస్పతిసమానుఁడు; 'సామాద్యుపాయపారగుఁడు'. ఇతని సాయమున తిక్కజననాథుఁడు తనరాజ్యమును గాంచీపురముపర్యంతము విస్తరించెను. సిద్ధనామాత్యునకుఁ బ్రోలాంబయందు ఏడ్వురు తనయులు జననమొందిరి. (సిద్ధన వంశవృక్షము.)

సిద్ధన = ప్రోలాంబ
- (అగ్ర) తిక్కన = చామమ్మ
  - సిద్ధన
  - కొమ్మన
  - ఇమ్మడి
  - మమ్మడి
- భాస్కరుఁడు
- కేతన
- మల్లన
- నారాయణ
- పిన్న భాస్కరుఁడు
- పెమ్మన

సిద్ధనామాత్యుని అగ్రనందనుఁడగు
### రణతిక్కన

కొట్టరువువారివంశములో సుప్రసిద్ధపురుషుఁడు. ఈతఁడు అన్వయోద్ధారకుఁడు. తిక్కజననాథాగ్రణి

యనంతరమందు విక్రమసింహాపురమున రాజ్యమేలిన మనుమసిద్ధిరాజు నొద్ద ఇతఁడు సేనాని; మంత్రిమణి. ఎఱ్ఱగడ్డపాటి యేలికయగు కాటమరాజునకును మనుమసిద్ధిరాజునకును పసులమేపు బీళ్ల విషయమై పొసఁగిన పోరునందు విక్రమపౌరుషాదులు నెఱపి వీరస్వర్గము చూఱలాడిన దీక్షస్యచరిత్రుఁడే. ఈతనిభార్య వనితాశిరోమణియగు చానమ్మ. దశకుమార చరిత్రమం దీరణతిక్కన ఇట్లు వర్ణింపఁబడినాఁడు:

సీ. వేఁడిన నర్థార్థి నృపపుత్రు సేరని
　　దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
వెఱచినజనులకై బ్రదికిపోవఁగనీని
　　శౌర్యంబు తన కిష్టసఖుఁడు గాఁగ
శరణుచొచ్చిన శత్రువరులకైన రక్షించు
　　కరుణారసము తనకు సంగడము గాఁగఁ
బరికింపఁ బాండవప్రభులకైన పెంపగు
　　సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ.
తే. గీ. జగతి నతికొమ్మ రాయవేశ్యాభుజంగ
రాజ్య రత్నాకరమూర్తి రాజమూర్తి
గంధవారణ బిరుదవిఖ్యాతకీర్తి
దివ్యతేజుండు సిద్ధయతిక్కశౌరి.　　ఆ. ౧, ప. ౬౬.

ఖడ్గతిక్కనభవనము నొకకవి కమనీయముగ వర్ణించియున్నాఁడు. చూడుఁడు:

సీ. వీరవివాదంబు వేదనినాదంబు
　　పాయక యేప్రొద్దు బ్రబలుచుండు
భూసురప్రకరంబు సేసలు చల్లఁగఁ
　　బాయ కెన్నిరుయు కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలు వోసినజలంబు
　　పతితంబు ముంగిట జాలువాఱు
రిపులకొసఁగిన పత్రికల పుత్రికలను
　　బాయక కరణముల్ వ్రాయుచుండ్రు
తే. గీ. మానధనుఁడైన తిక్కన మంత్రియింట
మదనసముఁడైన తిక్కన మంత్రియింట
మహితయశుఁడైన తిక్కన మంత్రియింట
మంత్రిమణియైన తిక్కన మంత్రియింట.

'నెల్లూరు ప్రాంతమునఁగల పట్టుపురాయిగ్రామానకుఁ దూర్పుభాగమునఁ బినాకినీనదీతీరమునఁ దిక్కనపాడను స్థలము గలదు. ఆస్థలమందు గుఱ్ఱముమీఁద రౌతును జెక్కిన శిలయొకటి నేఁటికిని గలదు. అది తిక్కన ప్రతిమయని స్థలజ్ఞులు చెప్పుదురు. ఈవిషయము ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందలి చారిత్రకసంపుటములందున్నది. (చూడు చాటుపద్యమణిమంజరి: భా. ౧.)

## ౪

### కొమ్మన

కొమ్మన భాస్కరమంత్రి కడగొట్టుతనయుఁడు. కేతన, మల్లన, సిద్ధనల, 'కూరిమితమ్ముఁడు'. తండ్రియనంతరమం దీకొమ్మన గుంటూరిసీమను బరిపాలించెను. ఈతఁడు 'దండాధీశుఁడు'; 'పవిత్రశీలుఁడు'; 'సాంగవేది.'

గుంటూరిసీమను బరిపాలించుసమయమున నీతఁడు చందవోలురాజగు పృథ్వీశ్వరరాజు అధికారముక్రింద నుండెను. పదమూఁడవశతాబ్దాదిని విక్రమసింహాపురాధీశ్వరుఁడైన తిక్కరాజు ఉక్కుమిగిలి పృథ్వీశ్వరరాజు నోడించెను. అట్లగుట నాపృథ్వీశ్వరరాజు తెలుఁగు చోడుల కొలువులోఁ బ్రవేశించుటయు, నేలికతోఁ బాటు కొమ్మన దండనాథుఁడుగూడ తిక్కరాజు కొలువులోఁ జేరుటయు, నిజస్థానము గుంటూరినుండి నెల్లూరునకు మార్చుటయు సంభవించెను.

కొమ్మన లౌకికాధికారధూర్వహుఁ డగుటయే కాక వైదికాచారనిష్ఠాపరుఁడై వేదములను సాంగోపాంగముగ నభ్యసించిన ప్రాజ్ఞుఁడు.
(కొమ్మన వంశవృక్షము)

కొమ్మన = అన్నమాంబ
|
కవి తిక్కన
|
కొమ్మన

దశకుమారచరిత్రయం దీతఁ డీవిధముగ నభివర్ణింపఁబడినాఁడు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో శౌరపాణ్డుఁడో
　　నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దివరాజతనూజుఁడో
　　నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
　　యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
　　యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

తే.గీ. సూర్యవంశక భూపాల సుచిరరాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధి శీతకరుఁడు
కులనిధానంబు కొట్టరు కొమ్మశౌరి. అ.౧, ప. ౮౧.

సదాచారసంపన్నయు, సుగుణశీలయు, మహాప్రతివ్రతయు నగు అన్నమాంబ ఈతనికులవధూరత్నము. ఆమెను కేతనకవి ఇట్లని వర్ణించినాఁడు:

సీ. పతిభక్తి నలయరుంధతి పోలెనేనియు
సౌభాగ్యమహిమ నీసతికి నెనయె
సౌభాగ్యమున రతి సరియయ్యె నేని భా
గ్యంబున నీయంబుజాక్షి కెనయె
భాగ్యంబు నందు శ్రీ ప్రతియయ్యె నేనియుఁ
దాలిమి నీలతాతన్వి కెనయె
తాలిమి భూదేవి తగసాటి యగునేని
నేర్పున నీపద్మనేత్ర కెనయె
తే. గీ. యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడెఁ గృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్య నర్ధాంగలక్ష్మి
యఖిల గుణగణాలంకృత యన్నమాంబ. అ. ౧, ప. ౮౪.

ఈ పూజ్యదంపతుల పుత్రుఁడు మహాకవియైన

## తిక్కన సోమయాజి

సీ. సుకవీంద్ర బృందరక్షకుఁ డెవ్వఁడనిన వీఁ
డను వాలంకకుఁ దోడ యైనవాఁడు
చిత్త నిత్యస్థితశివుఁ డెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థ మైనవాఁడు
దశదిశా విశ్రాంత యశుఁ డెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్ర మైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁడనిన వీఁ
డనిచూపుటకు గుఱి యైన వాఁడు
తే. గీ. మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువుకొమ్మ నామాత్య కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.
దశకుమారచరిత్ర, అ. ౧, ప. ౮౮.

ఈతఁడు భారతములోని విరాటపర్వము దొట్టి పదేనుపర్వముల 'ఆంధ్రావళిమోదముంబొరయ', 'బుధ సంతోషంబునిండార' నాంధ్రీకరించిన కవిబ్రహ్మ; కావ్య శిల్పి. 'భారతీసుస్థితిసంభావితవదనసదనుఁడు'; నిఖిల కళాసంవేది'; 'పండితపుండరీకనవపంకజబాంధవుఁడు'; 'దానపరమోధారాపల్లవితవిప్రధాత్రీజుఁడు.' తిక్కనశుభచరిత్రుఁడు; నృపమాన్యుఁడు; చతురాననసన్నిభుఁడు; బలసూదనవిభవుఁడు; అమాత్యశేఖరుఁడు.

తిక్కనసోమయాజి నిజస్థానము నెల్లూరుపురము. ఆతని తాతయుఁ దండ్రియు గుంటూరిపురవాసులే. అయినను తిక్కన తండ్రి కొమ్మనదండనాథుఁడు తనయేలిక యగు పృథ్వీశ్వరరాజు జయము నొందిన బదంపడి నిజస్థానము గుంటూరినుండి నెల్లూరునకు మార్చుకొనియెను. మఱియు దశకుమారచరిత్రయందు మూలఘటిక కేతన కవి 'నారచింపంబూనిన కృతి కధీశ్వరుండైన కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానంబగు విక్రమసింహపురంబు వర్ణించెద' నని విస్పష్టముగ వ్రాయుచున్నాఁడు. అట్లగుట నెల్లూరే తిక్కనసోమయాజి నిజస్థానమనుటయందసత్యతాసంశయమునకుఁ దావు లేదు.

అభినవదండిచే వర్ణింపఁబడినట్లు తిక్కన 'అభిరూపభావభవుఁడు'. అతని తల్లియగు అన్నమాంబయు, తండ్రియగు కొమ్మనయు సురూపయుతులు. సుందరదంపతులకుఁ బుట్టిన తిక్కకవిరాజు స్ఫురద్రూపియగుటలో విరుద్ధమేమున్నది? కేతనవచనములలో తిక్కన—'కనకగిరితటీసంకాశవక్షస్థలీభాగుఁడు'; 'శ్రీరమణీరమణీయమహోరస్థలివిజిత కాంచనోర్వీధరవిస్తారితబలుంతు; 'కల్పకపరాభవకరణధురీణదీర్ఘబాహుండు'; జలజసుభగనేత్రుఁడు'; 'వియన్మణితేజుఁడు'; 'పవిత్రమూర్తి'; వీనిని బట్టి తిక్కనామాత్యుఁడు విశాలవక్షుఁడనియు బలకాయుఁడనియు ఆజానుబాహుఁడనియు సువిశాలనేత్రుఁడనియు, తేజోమూర్తియనియు మనము నిర్ణయింపవచ్చును.

తిక్కనకవిమాత్రుఁడే కాఁడు. ఆతఁడు యోధుఁడు. గంటముబట్టుకొని కవితారంగమున నెంత స్వేచ్ఛగా విహరింపఁగల్గునో కరవాలము గీలించి కదనరంగమున నంత స్వేచ్ఛగా విహరింపఁగల్గిన పరాక్రమశాలి. తిక్కన పితృపితామహులవలె వాహినీపతిత్వము వహించిన వీరుఁడు. 'తిక్కదండాధీశా' ; 'తిక్కచమూపా' అని అభినవదండి అనుసంధించిన సంబోధనలబట్టి మనమావిషయము నిశ్చయమని నమ్మవచ్చును.

తిక్కన బొడ్డుమాణిక్యముతోఁ బుట్టిన యదృష్టశాలి. ఆతని పితృపితామహులు రాజాస్థానములందు గొప్పకొలువులు చేసి ప్రభుసన్మానము లంది సిరి

శ్రీసీతారామ ఐకమత్యసంఘ ప్రథమమహాసభ, రాజమహేంద్రవరము



First Conference, Sree Seetarama Aikamatya Sanghamu, Rajahmundry



శ్రీరామ బాలభక్త గ్రంథాలయము, రాజమహేంద్రవరము

Sree Rama Bala Bhakta Library, Rajahmundry



శ్రీబాలగణపతి గ్రంథనిలయము, పానంగిపల్లి, రామచంద్రపురం తాలూకా

Sree Balaganapathy Grandha Nilayam, Panangipalli, Ramachandrapuram

శ్రీ కన్యకాపరమేశ్వరీ జాతీయపాఠశాల, గుంటూరు



Sree Kanyakaparamesvari National School, Guntur

శ్రీ బాలభక్తసమాజము, చతుర్థవార్షికోత్సవము, కంబాలపేట, రాజమహేంద్రవరము



Sree Bala Bhakta Samajam Fourth Anniversary Kambalapet Rajahmundry

శ్రీశారదా పుస్తకభాండాగారము, నాగిరెడ్డిపల్లె, కదిరి



Sree Sarada Library Nagireddipalli, Kadiri

సంపదలతోఁ దులఁదూగిన భోగదేవేంద్రులు. తిక్కకవి నాథాగ్రణియు మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణా పాత్రుండై నిజకులక్రమాగతమగు మంత్రిపదవి నధిష్ఠించి,

గీ. అందలంబుగొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబగట్లు భూమికానిక గాఁగలెం
కెసఁగు రాచపదవు లెల్లఁ బడసి.

దశకుమారచరిత్ర, ఆ. ౧, ప. ౨౧.

సంపత్సమేతుండై రాజ్యసుఖము లనుభవించిన సుఖవాసి, మనుమభూపాలునివలనఁ బొందిన ఐశ్వర్యము మాత్రమే కాక కవితిక్కన గణపతిదేవచక్రవర్తివలన నెనిమిది గ్రామములను విశేషమైన యైశ్వర్యలాభమును బొందినాఁడు. కావుననే, ఆతఁడు అష్టైశ్వర్యములఁ జూఱలాడిన అనుభోగి యనుట.

కవి తిక్కన నెఱదాత; 'సతతదానవినోది' పితృపితామహులవలె దానధర్మము లొనర్చి ఆశ్రితభరణుండై పేరుపొందిన విద్వద్భోగ్యభాగ్యుఁడు. యాగాది బహువిధకర్మలొనర్చి భూరిదక్షిణలచే నర్థార్థులఁ దనిపిన ఈవికాఁడు. 'కావ్యరసముం గొనికూడి' విద్వద్గరిష్ఠులకుఁ బెక్కూళ్లు అగ్రహారములుగా నొసఁగిన 'బుధారాధన విరాజి'; విశేషించి 'కవిసరోజమార్తాండుఁడు.'

తిక్కన'సుకవీంద్రబృందరక్షకుఁడు.' ఆనాఁటిసారస్వత ప్రపంచమునంతను నిరంకుశముగఁ బరిపాలించిన కవిరాజు. ఉభయకావ్యప్రౌఢిఁబాటించు శిల్పమునఁ బారగుఁడగుటచేఁ గవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప నాఁటివారు తపస్సు ధారపోసిరి. సోమయాజి తాను గావ్యశిల్పియుఁ గవిబ్రహ్మయు నైనను సమకాలమువారల కవితారసమును గ్రోలి హృదయపూర్వకముగ వారలకు మెప్పులందించిన రసవిదుఁడు. ఆతఁడు కేతనామాత్యవిరచితమైన దశకుమారచరిత్రకుఁ గృతిభర్త. భోజరాజీయము రచించిన యనంతామాత్యుని ప్రపితామహుఁడగు బయ్యన మంత్రికి 'భవ్యభారతి' అను బిరుద మిచ్చి గౌరవించిన కవితారసజ్ఞుఁడు. మార్కండేయ పురాణము రచించిన మారనకు గురువు. ప్రథమాంధ్రమహాకవియగు నన్నయభట్టారకుని 'ఆంధ్రకవిత్వవిశారదుఁడ'ని 'విద్యాదయితుండ'ని కొండాడిన విశాలహృదయుఁడు. వ్యాసభగవానుని 'భవ్యకవితావేశుఁడ'ని నుతించిన 'కళావిదుఁడు.' తిక్కనశిష్యులఁ జేరఁదీసి కవితాభిక్షపెట్టిన సారస్వతాభిమాని.

తిక్కన మనుమసిద్ధిమహీవల్లభుని మంత్రిమాణిక్యుఁడు. అతఁడు 'సామాద్యుపాయవిదుఁడు;' నీతిమాణిక్యుఁడు;' విశేషించి 'నీతినిపుణమతి జితపురుహూతామాత్యుఁడు.' కావుననే యొకప్పుడు మన్మక్ష్మాపాలుఁడు రాజ్యరమఁ బోఁగొట్టుకొనఁగాఁ దిక్కనతన ప్రతిభావిశేషముచేఁ దిరిగి సంపాదించినాఁడు. అక్కన బయ్యనలను సిద్ధిరాజు జ్ఞాతులు పోటరులై నెల్లూరిపై దాడివడచి మన్మభూపాలు నోడించి రాజ్యము నాక్రమించి తమకుఁదామే పరిపాలన చేయఁదొడఁగిరి. తిక్కన 'రాజనయవిధాప్రయోజన విశారదుఁ'డగుట మనుమసిద్ధిపక్షమువహించి గణపతిదేవ చక్రవర్తి సమక్షమునకుఁ బోయి సకలము నివేదించి 'నయవచస్సమగ్రతా చతురాస్యుఁడ'నిపించుకొనియెను. సోమయాజులపటువాక్యశక్తికిమెచ్చి యతని బహుప్రకారంబులఁ బూజించి యెనిమిది గ్రామములొసఁగి, నవలక్షధనమును యజ్ఞకుండలములు నిచ్చి,ఆతని రాయబారమును శిరసావహించి, కాకతీయాంధ్రచక్రవర్తి అపారసైన్యసమేతుఁడై దాడివెడలివచ్చి అక్కనబయ్యనలనుక్కడించి మనుమసిద్ధిని బునరభిషిక్తుని గావించెను. బళిరా! తిక్కనసోమయాజి స్వామిభక్తి, కార్యదక్షత! చేజారిపోయినరాజ్యమునే తిరిగి సంపాదింపఁగల్గెను. సర్వజ్ఞుఁడగు మంత్రిసనదరించినరాజ్యము సుస్థిరమైయుండుననుటలో నాశ్చర్యమేమి? అట్లగుటనే తిక్కనను 'మన్మక్ష్మాపతి ప్రాజ్యరాజ్యంబునిధిశశి' యని కేతన సంభోధించియున్నాఁడు.

తిక్కనబ్రహ్మవేత్త. ఆతఁడు 'వేదాదిప్రకటవివిధ విద్యాభ్యాసాపాదిత మహత్త్వుఁడు'; సకలాగమార్థతత్త్వ విచారోదారుఁడు'; 'నానావేదవేదాంగ తత్త్వజ్ఞుఁడు'. భారతమందలి యాశ్వాసాద్యంతపద్యములం దిముడ్పఁ బడియున్న ఉపనిషదర్థములఁ బరికించుచో తిక్కన'వేదాది

సమస్తవిద్యావిభాసి' యని తెల్లమగును. శాంత్యానుశాసనికపర్వపాఠకులకు వేదాంతము, సాంఖ్యయోగములందు సోమయాజికిఁగల కుశలప్రవేశము తెలియవచ్చెడిని.

తిక్కన కర్మిష్ఠి. ఆతఁడు గణపతిదేవచక్రవర్తి సభాభవనమున నద్వైతవాదమును సలిపి అనుమకొండనివాసులైన బౌద్ధులచుల్కనగ నోడఁగొట్టి బౌద్ధదేవాలయములు గూలఁద్రోయించిన హిందూమతాభిమాని. కర్మకాండయం దాతనికి గాఢనమ్మిక మున్నట్లు కనఁబడుచున్నది. 'మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుఁ' డాతఁడు. 'ఉదాత్తశ్రౌతస్మార్తకర్మతత్పరమతి'; 'వేదోదితకర్మవ్రతుఁడు'; 'సతతాధ్వరక్రియాకర్మఠపాణిపద్ముఁడు'; 'అధ్వరాబ్జదినసాథుఁడు'; 'సతతస్వాహాస్వధాదిశబ్దద్వయసంస్కృతహవ్యకవ్యసంతర్పితముఖశిఖిముఖనిలింపపితృవర్గుఁ' డై, 'వైదికమార్గనిష్ఠ మగువర్తనముందగనిర్వహించిన' మహనీయచరితుఁడు.

తిక్కనవినయనిధి. ఆతనిసౌజన్యమును, వినయమును మెచ్చఁదగినవి. నాలుగుముక్కలు నోటఁబట్టగనే కన్నుమిన్నుగానక మాకుసమ మేమేయంచు గర్వించు దుర్విదగ్ధులవలెఁ గాక తిక్కన తానుకవిబ్రహ్మ, కావ్యశిల్పియయ్యు సౌజన్యమును వినయమును గోల్పోవని గభీరుఁడు. ఈతని వినయసౌజన్యముల కీతనిగద్యయే ప్రబలనిదర్శనము. 'బుధారాధనవిధేయ'; 'బుధారాధనవిరాజి' అని వ్రాసికొనియున్నాఁడు. నిర్వచనోత్తరరామాయణమునందలి 'నాత్మ సత్కవీశ్వరుల సుధ క్తిఁగొల్చి వారికృపఁగాగవితావిలాసవిస్తరమహనీయుఁడైనను' అను వాక్యమే సోమయాజి వినయసౌజన్యములను చాటిచెప్పుచున్నది.

తిక్కనకుమారుఁడు కొమ్మన. కొమ్మననుండి యాతనివంశీయులు పాటూరివారయినారు. తిక్కన బహువిధయాగములొనర్చి అర్థార్థులకు ధనము విరఁజిమ్ముటచే నాతనిసంపద క్రమముగా నీడఁబోయినది. కావుననే కొమ్మనజీవయాత్రార్థము పాటూరికరణీకము సంపాదింపవలసినవాఁడయ్యెను. ఈపాటూరు నెల్లూరున కైదారుమైళ్ల దూరములో నున్న పల్లెటూరు. తిక్కన సంతతివా రిప్పటికిని నాగ్రామమున నున్నారు.

తిక్కన ఆంధ్రమహాపురుషుఁడు; కూలంకష ప్రజ్ఞాధురీణుఁడు; శ్రీమంతుఁడు; నిరర్గళధీమంతుఁడు; అముష్యాయణుఁడు; విశ్రుతవిశ్రాణుఁడు; కావ్యకళాజనిభూమి; సారకవితానిర్మాణచాతుర్యుఁడు; నిరతిశయ వివేకోన్నిద్రుఁడు; అన్వయోద్ధారుఁడు. ఆతఁడు ఆంధ్రఋషి; సోమయాజి; రాజ్యాంగవేత్త; బ్రహ్మవేత్త; కృతికర్త; కృతిభర్త; మంత్రిమాణిక్యుఁడు; దండాధీశుఁడు. వేయేల? ఆతఁడు లోకోత్తరపురుషుఁడు; సర్వాంధ్రలోక పూజనీయుఁడు.

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధములొప్పఁ
గొనుట యధికకీర్తికిఁ దెరువు
లాతఁడా మహాకావ్యములు చెప్ప నర్థియుఁ గా
వలయుందు నమట ప్రశంస త్రోవ
యర్థికై చెర్కొల్ల నగ్రహారంబులిఁ
గానిమ్మునమట పొగడ్త సాలము
మహితసమృద్ధిమై బహువిధయాగంబు
లొనరించుననుట పద్దసముదారి
తే.గీ. పరువడిఁ గొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపుపొంపారి నెగడుపట్టి
కొమ్మనామాత్యు తిక్కని గొలఁదిసడివి
డింక నొక్కనిఁ జెన్నంగ నెందుఁగలఁడు!

దశకుమారచరిత్ర; అ. ౧, ప. ౯౨.

# నిజామురాష్ట్రము - పరిశోధనోద్యానము

* కాకతీయ మహాయుగము

## శ్రీ శేషాద్రిరమణకవులు - శతావధానులు

పచ్చికండలు నెత్రు పంకిలంబుగఁ జేసి, తెలుఁగుఫౌజులు పోరఁ దెగినతావు
సారస్వతసుమంబు సౌరభమంద మంద, మానిలంబుల వీచినట్టిచోటు
వీరశైవమతాసి విశ్వసంహారతాం, డవ మాడినట్టి క్రీడాగృహంబు
ఆంధ్రశిల్పప్రౌఢి యాంధ్రవిక్రమరేఖ, జాలుగాఁ బాఱిన శాద్వలంబు
తే.గీ. రాచనెత్తుటఁ బితకుఁ దర్పణ మొనర్చి, యాంధ్ర భార్గవుఁడు కృతార్థుఁడైన నెలవు
నేఁటియుగమున కేమి సందేశమొసఁగఁ,జాలదో కో - నిజాము వాస్తవ్యులార!

ఆంధ్రకవితారంగస్థలమును, దేశీయరాజన్యులకు మందిరమును, సమధికైశ్వర్యసంశోభితము నగు నిజామురాష్ట్రమునందుగల యాంధ్రదేశవిస్తృతియు, నచటి సారస్వతరంగస్థలములు, చరిత్రప్రదేశములు దేశీయులదృష్టి నంతగా నాకర్షించియుండవనుట సాహసము కాఁజాలదు. నిజామురాష్ట్రములోని తెలుఁగుదేశము నిర్జీవస్థలముగాదు. ఆంధ్రకవిరాజుల రసవత్కవితావ్యాప్తముచేఁ బునీతమైన పుణ్యభూమి; ఆంధ్రవీరుల పరాక్రమరక్తధారలచేఁ బవిత్రమైన స్వర్గచిహ్నము; ఆంధ్రకాంతల సహగమనకీర్తిశాసనవాటికలచేఁ బావనమైన రత్నగర్భ; ఆంధ్రశిల్పులహస్తవిన్యాసముచే సజీవమైన చరిత్రరంగస్థలము. ఇప్పుడా ప్రాణావశిష్టములగు చారిత్రకచిహ్నములు ఆంధ్రపరిశోధకులదృష్టి నంతగా నాకర్షింపఁబడకుంట యాంధ్రమాతృదురదృష్టమనుటకంటె నన్యపదము పయోగింపఁజనదు.

### ఆంధ్రభాగము

నిజామురాష్ట్రమునందు ౧ వరంగల్లు, ౨ కరీమునగరము, ౩ ఆదిలాబాదు, ౪ అత్రాపుబల్దా, ౫ మెదకు, ౬ నిజామాబాదు, ౭ మహబూబునగరము, ౮ నల్లగొండమండలములు పూర్తిగ ఆంధ్రమండలము లనఁ దగియున్నవి. ఇంతియకాక రాయచూరుమండలములోఁ గొన్ని తాలూకాలు, ఇందూరుమండలములోఁ గొన్ని తాలూకాలు ఆంధ్రదేశమునకుఁ జెందియున్నవి. తక్కినమండలములలోఁగూడ నాంధ్రులు నివాసముగానుండెడు గ్రామములు కలవు. నిజామురాష్ట్రమునందుగల యాంధ్రదేశము విస్తీర్ణము ౪౧,౩౪౧ చదరపుమైళ్లు అని దొరతనమువారి లెక్కలవలనఁ దెలియుచున్నది. నిజామురాష్ట్రమునఁ దెలుఁగు మాతృభాషగాఁ గలవారు ౬౧,౧౫,౧౭౪. ఇంతవిశాలము ఆంధ్రజన సమావృతమునగు నీ నిజామురాష్ట్రమునఁ గల చరిత్ర స్థలములు, సారస్వతపరిణామములు, ఆంధ్రజాతీయ చిహ్నములు గుఱించి యాంధ్రతత్త్వము సమగ్రముగా నెఱుంగుట ప్రత్యాంధ్రభాషాభిమానికిని విధియై యున్నది.

తొలుత నిజామురాష్ట్రములోని భూభాగమును చాలవఱకు తూర్పుచాళుక్యులు పరిపాలించిరి. తూర్పు చాళుక్యుల ప్రాచీన శాసనములు ఆలంపురి, కొలనుపాక, వేములవాడ, పానుగల్లు, కళ్యాణపురము, వనవాసి, కరీమునగరము లోనగు గ్రామములలోఁ గలవు. ఈచాళుక్యులెల్ల రాంధ్రులగుటచే నాంధ్రదేశమున విరివిగా నాలయములు దుర్గములు కోటలు నెలకొల్పి దేశమునకు దమయైశ్వర్యమునంతయు ధారవోసి ప్రకాశింపఁజేసిరి. పశ్చిమ చాళుక్యుల ధాటివలనను, కొల్లాపుర మండలేశ్వరుఁడగు విజయాదిత్యుని వలనను, కజ్జలుని యవినీతివలనను, బసవేశ్వరుని విజృంభణమువలనను, శైవజైనమతముల కలహములవలనను, చాళుక్యరాజ్యము ప్రాణావశిష్టమయ్యెను. తూర్పుచాళుక్యుల విస్తృత సామ్రాజ్యము నొందిన యైశ్వర్యములను దెలుపు చారిత్రకచిహ్నములు నిజామురాష్ట్రమునఁ బెక్కులు గలవు. హతశేషములగు నాచిహ్నముల నన్నింటి నుద్ధరించి యించుమించుగా నాంధ్రదేశమునంతయు నేకచ్ఛత్రముగాఁ బరిపాలించిన రాజన్యులు † కాకతీయులను నాంధ్రకాకతీయులు.

### కాకతీయ సామ్రాజ్యము

కాకతీయులలో ప్రోలరాజుమిగులఁ బరాక్రమశాలి. ఈతఁడు హనుమకొండ రాజధానిగాఁజేసికొని తెలుఁగుదేశమునంతయుఁ దన

* ఇది నేను వ్రాయఁబోవు నిజామురాష్ట్ర వాఙ్మయచరిత్రమునందు ఒక మహాయుగము. ఇందు క్రీ. శ. ౧౩౨౦ వఱకుఁగల చరిత్రాంశములే చర్చింపఁబడినవి. అవశిష్టాంశములు పద్మనాయక మహాయుగమునఁ జర్చింపఁబడును.

† కాకతీయులు ఒరంగల్లు పాలించిన యాంధ్రరాజులు. వీరు తొలుత, జైనులు పిదప శైవులు. కాకతీయను దేవిభక్తులగుటచేఁగాకతీయులనఁబడిరి. కాకతమ్మగుడి పూర్వమోరుగల్లులోఁ గలదు.

సామ్రాజ్యపతాకము క్రిందికిఁ దెచ్చికొని తీవ్రయత్నములు గావించిన మహాశూరుఁడు. ఈతని మహాయత్నమున కడ్డుపడిన చాళుక్య చూడామణియగు తైలపదేవుఁడు లంకాకవిమయాధీశ్వరుఁడగు గోవిందరాజు, మంత్రకూటపురాధీశ్వరుఁడగు గుండరాజు, మండలేశ్వరుఁడగు జగ్గదేవుఁడు పరాభూతులైరి. ఈప్రోలరాజు నాఁటిన స్వాతంత్ర్య బీజము లాంధ్రదేశమునకు ఆంధ్రజాతికిఁగల ప్రత్యేకజాతీయతకు నమృతఫలము పెట్టెననుటలో సాహసము లేదు. కాకతీయరాజన్యునితోఁ బోరుటకు దొరకొనిన యరాతివీరులందఱు నాంధ్రులనియు ఓరుగల్లు ప్రాంతములలోనుండు రాజన్యులనియు నూహింపనవకాశములు గలవు.

ప్రథమప్రతాపరుద్రుఁడని వ్యవహరింపఁబడు కాకతీయ రుద్రదేవచక్రవర్తికాలమునుండి కవితాకళకు ఆంధ్రశిల్పములకునిజామురాష్ట్రమున మంచి యవకాశములు లభించెను. రుద్రదేవుఁడు అనుమకొండలో నాంధ్రశిల్పులచే విచిత్రమగు నొకదేవాలయమును గట్టించి దానికి రుద్రేశ్వరమను నామమొసంగి తనవంశచరిత్రమునంతయు రామేశ్వర భట్టారకునిచే శ్లోకరూపముగ నిర్మింపఁజేసి శాసనము వేయించెను. రుద్రదేవుఁడు స్వయముగఁ గవీశ్వరుఁడై సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలోఁ గావ్యములను రచించి కవులఁ బ్రోత్సహించుట చే పాలకుఱికి సోమనాథాది మహాకవులు కాకతీయసామ్రాజ్య వృక్షచ్ఛాయ ననుసరించుచు సుఖజీవనములకు నవకాశము లభించినది. రుద్రదేవునినాఁటి యాంధ్రకవితాగ్రంథము లింతవఱకును బ్రచురణము కాకుంటకంటెఁ జరితాపకరాంశ మింకొకటి లేదు.

కాకతీయగణపతిదేవచక్రవర్తి ఆంధ్రకవితాభిమాని. ఇతనియొద్ద మంత్రిగానున్న విశ్వేశ్వరశివదేశికులు సంస్కృతాంధ్రములలో నఖండ పండితుఁడు. తిక్కనసోమయాజి ఈగణపతిదేవునియొద్దకువచ్చి తనభారతమును వినిపించి యభీష్టఫలముల నొందినటుల నైతిహ్యములు పెక్కులు గలవు. గణపతిదేవుఁడు పాండ్యదేశమునుగూడ ముట్టడించి తనరాజధానిలోఁ గలుపుకొనెను. గణపతిదేవుని సేనానాయకులలో రుద్రసేనాని, మేచయనాయకుఁడు, చౌండసేనాని లోనగువీరులు నెలకొల్పిన శాసనాంకములు, ధర్మములు నేటికిని స్థిరముగనున్నవి. రుద్రమదేవిగణపతిదేవుని కొమార్తెయని తెలుపుశాసనములు పానుగల్లునందు, కొలనుపాకలోను గనుఁగొనఁబడినవి. రుద్రమదేవి సామ్రాజ్యసమయమున నాంధ్రకవితాకన్యపొందిన శ్రేయోవృద్ధులను గుర్తింపఁదగిన యవకాశములు కానరావు. కాని రుద్రమదేవి చరిత్రమమాత్ర మసామాన్యమైనది. ఆమె పరాక్రమము నొకకవి యిటుల గానముచేసియున్నాఁడు.

"ఆక్రామంతి తరత్తరంగవిగళద్దుగ్ధాబ్ధి ఫేనావళీ,
రాచామంతి శరచ్ఛశాంక విసరజ్జ్యోత్స్నా ప్రవాహా
మృతమ్;ఆకర్షంతి సురేంద్ర దంతిదశనప్రాకారలగ్నాం
శ్రియం, ముక్తాహారలతాయితాః ప్రతిదిశం రుద్రాంబి
కాకీర్తయః"

## మల్కాపురముశాసనము

రుద్రమదేవి యనంతరము ప్రతాపరుద్రచక్రవర్తి రాజ్యమునకు వచ్చినదిమొదలాంధ్రకవితకు మంచియవలంబనము దొరకెను. పెక్కుమంది కవులు ఒరంగల్లుచేరి కవితాజీవనము చేయసాగిరి. కాకతీయసామ్రాజ్యకీర్తిచంద్రికలు, ప్రతాపరుద్రపరాక్రమవిఖ్యాతి, నేటికిని సజీవముగాఁ జరిత్రపరిశోధకులకుఁ గనంబఱచు ప్రతాపరుద్రయశోభూషణమును వ్రాసిన విద్యానాథమహాకవి నిజామురాష్ట్రములోని వాఁడె. కాకతీయసామ్రాజ్యము ననుసరించి ప్రఖ్యాతిగాంచిన కవులలో ముఖ్యుల నామములు తెలిసినంతలో నుదాహరించెదము.

## పాలకుఱికి సోమనాథ మహాకవి

ఇతఁడు కర్ణాటాంధ్ర సంస్కృతభాషలలోఁ బెక్కుకావ్యములను వ్రాసినకవి. ఇతనికవిత రసవత్తరము మనోహరముగా నుండును. పిడుపర్తి సోమనాథుఁడు ఈబసవకవి లోనగువారీతని శిష్యపరంపరలోనివారు.

## భాస్కరాదులు

భాస్కరరామాయణము వ్రాసిన భాస్కరుఁడు తనకృతి సాహిణిమారున కంకితము గావించెను. సాహిణిమారుఁడు ప్రతాపరుద్రుని కాలములోనివాఁడు. భాస్కరరామాయణమునకు సంబంధించిన మల్లికార్జునభట్టు కుమారరుద్ర దేవుఁడు, అయ్యలార్యుఁడు మంత్రిభాస్కరుఁడు, హుళక్కి భాస్కరుఁడు ఒరంగల్లుప్రాంతమువారే ?

## మారనకవి

ఇతఁడు మార్కండేయపురాణము వ్రాసి ప్రతాపరుద్రునిసేనానాయకుఁడగు గన్నయనాయకునకు నంకితము గావించెను. మారనకవి తిక్కన సోమయాజి శిష్యుఁడు.

## కోన బుద్ధారెడ్డి

ఇతఁడు రంగనాథ రామాయణము వ్రాసెను. ఒరంగల్లునకుఁ గొంతదూరములోనున్న బూదపూరు వర్ధమానపురములోనున్న కుప్పాంబశాసనములలో బుద్ధారెడ్డి ప్రశంసింపఁబడియున్నాఁడు. బుద్ధారెడ్డి కాకతీయరాజులకడ సేనానాయకుఁడో సామంతుఁడో యై రామాయణ ద్విపద వ్రాసియుండవచ్చును. దీనివలన ఉత్తరరామాయణ ద్విపద వ్రాసిన కాచవిభుఁడు విఠలరాజు నిజామురాష్ట్రీయులని తెలియును.

## రుద్రదేవ చక్రవర్తి

ఇతఁడు క్రీ. శ. ౧౧౪౦ మొదలుకొని ౧౧౯౬ వఱకు హనుమకొండలో రాజ్యము పాలించెను. ఈరాజన్యుఁడు సామ్రాజ్య విస్తృతికై సంగరము లొనరించుటయే కాక విద్యాభూషణ బిరుదాంకితుఁడై సంస్కృతాంధ్రకర్ణాటభాషాకవులకుఁ బ్రోత్సాహ మొనరించి తెలుఁగుభాషలో స్వయముగా నీతిసారమను గ్రంథము రచించినటుల

మా. రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. రుద్రదేవుఁడు రాజై ధర్మసంస్థాపనమునకుఁ బాటుపడుటయేకాక కవియై మాతృసేవకు ముందుకు వచ్చి కాకతీయసామ్రాజ్యమును ఆంధ్రకవితారంగస్థలముగా మార్చెను. రుద్రదేవుఁడు జైనాలయములలో నొకటియగు హనుమకొండలోని పద్మాక్షిదేవాలయమును శైవాలయముగ మార్చుటకు బ్రాహ్మణులకుఁ జేయూఁతనొసంగెను. రుద్రదేవుని రాజనీతి చతురత కాతని గ్రంథములోని యీక్రిందిపద్యములు దృష్టాంతములు కాఁగలవు.

తే. గీ. ఆజ్ఞ లేనినృపుఁడు నరయు చిత్తరువులో
నున్న రాజు మాడ్కి నొక్కరూప
యానఁ ద్రోయునృపుని నైనను దండింప
కున్న రాజ్య మేల నుండుఁ జెడక.

ఉ. కొందఱు మేలమాడుటలు కొందఱు వావులు దేర్చిపిల్చుటల్
కొందఱు ముద్దుసేయుటలు కొందఱు సెయ్యపుఁ జూపునాడుటల్
కొందఱునాత్మ భావమునఁ గొందఱమన్నన భృత్యులందు ని
ట్లందఱ నన్నిభంగుల నృపాగ్రణి వశ్యులఁజేయఁగాఁ దగున్.

## జాయసేనాపతి

ఇతఁడు గణపతిదేవుని సేనానాయకుఁడై, కవి సభాశిఖామణి, నాట్య విద్యావిశారద, బిరుదముల నొంది నృత్తరత్నావళియను నాట్య గ్రంథమును రచించెను. జాయసేనాపతి శాసనములు గణపేశ్వరమునందును గుంటూరు మండలములోని చేబ్రోలునందును గలవు. ఇందు ఆంధ్ర నృత్యాదికములు ప్రశంసింపఁబడియున్నవి. ఇది యుత్తమగ్రంథము.

## వీరభల్లటదేశికుఁడు

ఇతఁడు సర్వశాస్త్రములలోఁ బండితుఁడై ప్రతాపరుద్రచక్రవర్తి యాస్థానములో మహాకవిగా నున్నటులు చెప్పుచున్నారు. ఇతని గ్రంథము లింకను లభింపలేదుగాని

ఇతీవ కథయామాస వీరభల్లటదేశికః,
ప్రతాపరుద్రదేవస్య సన్నిధౌ సర్వశాస్త్రవిత్.

అను నొక నాట్యశాస్త్రములోని శ్లోకమువలన వీరభల్లటుఁడు సుప్రసిద్ధుడనియు నాతనిగ్రంథములు కాలగర్భమున నిమిడియున్నవనియుఁ దోఁచుచున్నది.

## శాకల్యమల్లభట్టు

ఇతఁడు ప్రతాపరుద్రుని యాస్థానములో నుండెను. ఇట్లని స్థానిక చరిత్రమునందును ప్రతాపచరిత్రమునను గలదు. ఇతఁడు నిరోష్ఠ్యరామాయణము రచించెను. కాని యీపుస్తక మిపుడు కానరాదు. భాస్కరరామాయణములోని భాగములు రచించిన మల్లికార్జునభట్టు యీతఁడని కొందఱు, అందలి యుద్ధకాండ శేషము వ్రాసిన యయ్యలార్యునకుఁ బినతండ్రియని మఱికొందఱు వ్రాసియున్నారు. ప్రసంగరత్నావళియను గ్రంథములోని "పూర్ణ స్తత్కృపయా గజేంద్ర విజయీ శాకల్య మల్లః కవిః" యను శ్లోకభాగమువలన నీకవి కాకతీయ సామ్రాజ్యపతనానంతరము విద్యానగరరాజ్యము స్థాపించిన హరిహరరాయల వద్దనుండెనని తెలియును. ఇతఁడు ఉదారరాఘవమను సంస్కృత కావ్యమును రచించెను. అందలిగద్యవలన నీకవి సహజపాండిత్యుఁడనియు శాకల్యయమనది గృహనామమనియు మాధవపండితుని కుమారుఁడనియుఁ దెలియుచున్నది. ఇతని గ్రంథము లెన్ని మాటుమణిగియున్నవో!

## శివదేవుఁడు

ఇతఁడు పురతత్త్వరసాయనమను కావ్యమును రచించెను. ప్రకృత మాగ్రంథభాగము మాత్ర మొకచోఁ గలదని తెలిసికొంటిమి. ఈకవి రుద్రమదేవి ప్రతాపరుద్రులకాలమున నున్నటుల వినికిడిగలదు. ఇతని గ్రంథాదికముజీవితమునుగూర్చి యింకను బరిశ్రమ జరుగవలసియున్నది.

## విద్యానాథుఁడు

ఇతనికిది బిరుదనామము కావచ్చును. ఇతఁడు అగస్త్యేశ్వర నాముఁడని కొందఱూహించుచున్నారు. కాని యది నిశ్చయముగ నిదమిత్థమని రాని స్థితిలో నుంటచే విద్యానాథుఁడనియే మనము వ్యవహరింతము. ఇక్కవి ప్రతాపరుద్రుని యాస్థానమునందుండి యాసామ్రాజ్యసంపదలను గావ్యముఖమునఁ జిత్రించి యాంధ్రసైనికుల పరాక్రమజీవితములఁ గొనియాడినధన్యుఁడు. ఈతని యితరగ్రంథాదికముగూడఁ గానవచ్చుటలేదు.

ఇంతియకాక విశ్వనాథకవి, అగస్త్యేశ్వరుఁడు, శ్రీరామదీక్షితుఁడు, నృసింహపండితుడు మల్లినాథుఁడు లోనగు మహామహులందఱు కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించిన కవులు పండితులునైయున్నారు. ఏకశిలానగరమును ఆంధ్రసామ్రాజ్యమునకు ముఖ్యస్థలముగావించి గణపతిదేవుఁడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుఁడు, అనుమకొండ రాజధానిగఁ జేసికొని ప్రోలరాజు రుద్రదేవచక్రవర్తి ఆంధ్రదేశమునకు ఆంధ్రభాషకుఁ గావించిన యుపకారములు సమగ్రముగాఁ దెలుప వీలు లేకున్నది.

## క్షేత్రములు

జైనులు బౌద్ధులు హిందువులు నెలకొల్పిన దేవాలయములు నిజామురాష్ట్రమునఁ బెక్కులుగలవు. అందనేకములు పూర్వము మిగుల నైశ్వర్యములోఁ దులతూగి యిపుడు నామమాత్రావశిష్టములైయున్నవి. అందలి శిల్పముల వైభవము, విగ్రహముల సౌష్ఠవము, దీర్ఘకలయందము, ప్రశంసాపాత్రములనుటలో సంశయములేదు. ఇంతియకాక యిక్కడి ప్రాచీనములగు చరిత్రచిహ్నములు శిల్పచిహ్నములు నిజామురాష్ట్రమునఁ గలవు. వాని చరిత్రము లార్జించినచో నొకయుత్తమగ్రంథముగా రచింపవచ్చును.

## అలంపురి

ఇది నిజామురాష్ట్రములో నున్నది. దీనిని శ్రీశైలమునకుఁ బశ్చిమద్వారమని చెప్పుదురు. ఇట రాష్ట్రకూటులు, చాళుక్యులు, కాకతీయులు స్థాపించినశాసనములు పెక్కులు గలవు. కొన్ని జైనమఠములుఁ గలవు. ఇచట బ్రహ్మేశ్వరునియొక్కయు జోగుళాంబయొక్కయు దేవళములు సుప్రసిద్ధములు. ఇట మంథాన భైరవుఁడను శివాగమాచార్య

డు చిరకాలము నివసించి ఆనందకందళము, మంథానభైరవతంత్రములో నగు నుత్తమగ్రంథములు రచించెను. ఇచట సందముగనున్న దేవాలయములు పెక్కులుగలవు. వానినిగూర్చి ప్రత్యేకగ్రంథమునఁ జేర్కొనఁ దలంచినారము.

## కొలనుపాక

ఇది దక్షిణకాశియని స్థలపురాణమునఁ బ్రశంసింపఁబడియున్నది. స్థలపురాణమువలనఁ దొలుత కకుద్ధభూపతి సోమదేవుఁడు పాలించినటులఁ దెలియును. ఇచట మిగుల పురాతనమగు నొక జైనదేవళముగలదు. అందలి విగ్రహసౌందర్యము ప్రశంసాపాత్రము. కొన్ని కారణములచే నీగ్రామము పూర్వము జైనాలయముగానుండి పిదప చాళుక్యులవశమున ఆ స్థితులవశమయ్యెనేమోయని తోఁచుచున్నది. ఇచట మిగుల విశాలమగు సోమనాథదేవాలయము జైనమతమునలె నున్న వీరనారాయణదేవాలయమేకాక జాతికొక్కదేవళము గలదు. వీని నన్నింటిని మతములని వ్యవహరించుచున్నారు. ఈగ్రామములోఁ బలుతావుల చాళుక్యుల శాసనములు లెక్కకుమించియున్నవి. ఇంతియకాక జైనశాసనములు సైతము గలవు. కొలనుపాకసోమనాథుని ప్రశస్తి దిగంతవ్యాప్తమైయున్నది. కొలఁదిగ నిచట కాకతీయుల శాసనములు గలవు. ఇదియొక సుప్రసిద్ధమగు శివక్షేత్రము. కాకతీయరాజ్యముతో నీక్షేత్రవైభవమంతరించినది.

## వేములవాడ

దీనినే వేములవాడయందురు. పూర్వమిది జైనక్షేత్రము. ఇచటగల జైనవిగ్రహములకు మితము లేదు. గ్రామములో నెచోటచూచినను జైనవిగ్రహములే. రాజేశ్వరాలయ మిచట మిక్కిలి ప్రఖ్యాతిగలిగియున్నది. పూర్వమిదియొక జైనమతమై శైవులచే నాక్రమింపఁబడెనని చెప్పుదురు. ఈయాలయావరణములోఁ బెక్కు ధ్యానజైనవిగ్రహములు కలవు. చాళుక్యరాజరాజుదియొక్కయు, త్రిభువనమల్లునిదియొక్కయు, శాసనములు కలవు. ఇచట భీమేశ్వరాలయము మిగుల గొప్పది గలదు. ఆలయమునందలి మండపము మహోన్నతముగ విశాలముగనుండి చూపరులకు దిగ్భ్రమ గొలుపుచున్నది. ఇది చాళుక్యరాజులలో నొకఁడగు త్రిభువనమల్ల విజయాదిత్యునిచే నున్నతినొందెను. వేములవాడ భీమకవి కీభీమేశ్వరుఁడే వరప్రదాతయని చెప్పుదురు ఇట భీమేశ్వరాలయముంట యెరుంగక ప్రభాకర శాస్త్రిగారు భీమకవి యీవేములవాడవాఁడు కాఁడని సంశయించిరి. స్థలపురాణములో భీమేశ్వరాలయమునకు దక్షవాటికయను పేరుగలదు.

## ధర్మపురి

ఈ గ్రామము పూర్వము చాళుక్యరాజులలో నొకశాఖవారికి రాజధానిగానుండెను. ధర్మపురిరామాయణము, నరసింహశతకము ఇచటి దైవమును గూర్చినవియె. దరిగొండ ధర్మకవి శేషవిచిత్రరామాయణము నచటినృసింహుని బొగడెను. పద్మపురాణమున మడికిసింగన యీ నృసింహస్వామి వైభవములను శ్లాఘించెను. ఈ దివ్యక్షేత్రము ఓరంగల్లునకుఁ బండ్రెండామడలదూరములో గోదావరీతీరమున నున్నది. నిజాము రాష్ట్రీయుల కీక్షేత్రముపై భక్తివిశ్వాసములు మెండు. ఇచటను గొన్ని శాసనములు గలవు.

## అయినవోలు

ఇదిఓరంగల్లున కొలఁక్రోశులదూరములోనున్న క్షేత్రము. ఇది వీరాలయము. ఇందు మైలారుదేవుఁడు శివునవతారమనియుఁ బూజనీయుండనియు శాసనములలోఁ గలదు. ఈయాలయమున ఓరంగల్లులో నున్నట్టి శిలాద్వారములు మహోన్నతములగునవి చెక్కని శిల్పవిన్యాసములతో నిండినవి నాలుగుకలవు. మైలారు పూర్వ మొక మహావీరుఁడనియు నాతఁడు సంగ్రామములో మరణించినది మొదలుకొని దైవముగాఁ బూజింపుచుండిరనియుఁ గాకతీయరుద్రమదేవి విపులమగు నాలయముఁ గట్టించెననియు స్థలజ్ఞులు చెప్పుదురు. తీర్థప్రజలీక్షేత్రమునకు విరివిగా నేతెంచి ప్రాణాచారములు పడుట నేటికాచారముగ నున్నది. మైలారువీరభటులు గావించు భక్తిపారవశ్య ప్రదర్శనములు శ్రీడాభిరామమున నిటులు ప్రశంసింపఁబడెను.

సీ. అనుపమండు గెజ్జెనిచంద్రమల్లెల, చోద్యంపుగుండాలు చొచ్చువారు
కరవాడియలుగల కవరుపాతరలలో, నట్టిచేరులఁగోసి యురుకువారు
గాలంపుకొంకికంకాళచర్మము గ్రుచ్చి, యుడుకునీళ్లనుయ్యాలలూగువారు
కటికిరొమ్ముగాళంపు గండకత్తెరపట్టి, మిసిమింకులునుగాక త్రిప్పువారు

తే. గీ. వీరమైలారుదేవర వీరభటులు
గొండ్లియాడుచునున్నారు గొలగపడుచు
సాహసమువార్తికైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలారు వీరభటులు.

## కాళేశ్వరము

ఇదియొక శివక్షేత్రము. ఇచట కాళేశ్వరుఁడను శివుఁడుగలఁడు. కాకతీయులు ఈశివునియందు భక్తితాత్పర్యములుగలవారై పెక్కుమాఱులు దానధర్మములు గావించి తులాభారములు తూఁగియున్నారు. ఆంధ్రదేశమునందు సుప్రసిద్ధములగు త్రిలింగ క్షేత్రములలో కాళేశ్వరమొకటి. విద్యానాథుండు ప్రతాపరుద్రీయములో "శ్రీశైలకాళేశ్వర ద్రాక్షారామనివాసినః" యని కాళేశ్వరశివునిఁ బ్రశంసించెను. కాళేశ్వరప్రశస్తి యచటిపూర్వవైభవచిహ్నములు నెఱుంగనివారు, కాళేశ్వర ప్రతిభ కాళహస్తికి ముడిపెట్టుటలో వింతలేదు. త్రిలింగములలోఁ గాళేశ్వరమును జేర్పక కాళహస్తిని జేర్తురు పేని యాంధ్రదేశవైశాల్యము తగ్గుటయేకాక ఉత్తరసర్కారులన్నియు ఆంధ్రదేశములోఁ జేరకుండునని యోచింపఁజాలకున్నారు. ఇక్కాళేశ్వర ప్రతిభ స్థలమాహాత్మ్యము చూచిన బోధ కాఁగలదు.

ఇంతియకాక- పేల్పుకొండ, యాదగిరి, ఏలేశ్వరము, ఉమామహేశ్వరము, ఆలవాల, నాగులవరము, ఓరుగల్లు, రామగిరి, మొగిలిచర్ల, మట్టపల్లి, వాడపల్లి, జటప్రోలు, లోనగునవి నిజామురాష్ట్రమున మిగులఁ బ్రశస్తినొందిన పుణ్యక్షేత్రములు. వీని సమగ్రవైభవము కాకతీయ సామ్రాజ్య మున్నదశలోనున్న తఱి వర్ణనీయముగ నుండెను. ప్రక్క

తము వీనిప్రశస్తి చాలవఱకు పరిశోధన శరణ్యముగ నుండెననుట సత్య మునకెందుకేని దూరము కాఁజాలదు.

## శిల్పములు

నిజామురాష్ట్రమున మనోహరశిల్పవిన్యాసములతో నిండిన యాలయములు వేలకొలఁది గలవు. అందు పానుగల్లులోనిచాళుక్య దేవాలయములోని శిల్పములు మిగుల మనోహరముగ దర్శనీయ ములుగ నున్నవి. ఇందలి యాలయ స్తంభములపైగల చిత్రశైథిరి చాళుక్యరాజులనాఁటి శిల్పప్రశస్తిని వేయివిధములఁ గొనియాడు చున్నది. ఈ † పానగల్లే ఆంధ్రదేశమున మిగుల వ్యాప్తిలోనున్న బాల నాగమ్మకథకు జన్మస్థలము. ఇందలి శిల్పము లాంధ్రులు దృష్టికింకను సంపూర్ణముగాఁ జొత్రము కాలేదనుట సత్యము. ఒరంగల్లునకు నాలుగై దామడలదూరములోనున్న పాలెముపట్టు చెంతగల రామప్పగుడి దర్శ నీయమైనది. అందలి స్తంభములపైఁగల చిత్రనిర్మాణము, ద్వారములపైఁ గల లతాకల్పనము మండపముపైభాగములందుఁగల చిత్రములు స్తంభ ములకు మూలలకు నెలకొల్పిన స్త్రీవిగ్రహముల చెక్కఁడనము ప్రశంస నీయముగ నున్నది. ఇచటి శిల్పము కాకతీయ గణపతిదేవుని నాఁటిది. ఈయాలయమందలి చిత్రములు రసవిదులను పాశ్చాత్యమహమ్మదీయ శిల్పుల నాకర్షించి దర్శనీయముగఁ దనరుచున్నది. హనుమకొండలోని రుద్రదేవుని దేవాలయశిల్పములు, వరంగల్లులోని శంభునిదేవాలయము లోని నందుల చెక్కఁడనము, గణపవరములోని దేవళముల శిల్పప్రశస్తి పిల్లలమఱ్ఱి, నాగులవరములోని కాకతీయ సేనానాయకులనాఁటి మనో హరచిత్ర విచిత్ర శిల్పదేవళములు కాకతీయరాజుల నాఁటి మనోజ్ఞ శిల్పములకు నగ్రస్థానము గొనియున్నవి. ఒరంగల్లు ద్వార స్తంభములపైఁ గల పనితనము కాకతీయశిల్పములకుఁ బరమావధులని ప్రశంసింపఁదగినవి.

కాకతీయ సామ్రాజ్యసమయమున నున్న దుర్గములలో రామ గిరి దుర్గము మిగులఁ బ్రశస్తమైనది. ఇది మహోన్నతమగు శైలముపై దృఢతరముగ నెలకొల్పఁబడినది. ఓరుగల్లు చుట్టునున్న మట్టికోటయు లోనున్న రాతికోటయుఁ గొంచెము దూరముగనున్న ఖిల్లాకోటయు తద్రాజ్య మహదైశ్వర్యమునకు ఆంధ్రుల నిర్మాణకౌశలమునకుఁ దార్కా ణగ నున్నవి. నంగునూరు, హనుమకొండ, వర్ధమానపురము, మంథెన, లోనగు చోటులఁగల పూర్వతరదుర్గములు కాకతీయసామ్రాజ్య దృఢస్థితికి సాక్ష్యములుగా నున్నవి. ఈదుర్గముల కన్నింటికంటెఁ బ్రాచీనముగ దృఢతరముగానున్న నందగిరి-కళ్యాణపురము కోటలు చాళుక్యరాజుల శక్తిసామర్థ్యములకు సాక్ష్యమిచ్చుచు నేఁటికిఁ గవుల పండువుగా నున్నవి. గణపతిదేవుని కాలములోఁ గట్టఁబడిన రామప్ప చెఱువు, గణపవరముచెఱువు, పాకాల చెఱువు, లక్నారముచెఱువు గాజులగట్టుచెఱువు, సముద్రమునుబోలి నిజామురాష్ట్రమున నాఁటినుండి నేఁటివఱకు సుభిక్షము గావించుచున్నవి. పాకాలచెఱువు ఒరంగల్లునకు ముప్పదిమైళ్ల దూరములో నున్నది. దీనికి ముద్గలతీర్థమని పేరుగలదు. గణపతిదేవుని మంత్రియగు బయ్యనామాత్యునికుమారుఁడు జగదాళము ముమ్మడయ్యంగా రీతటాకమును నెలకొల్పెను. ఇది రెండుకొండలకుఁ గలిపి ౨౦౧౦ గజముల పొడవుకట్టవేసి నిర్మింపఁబడెను. కట్టవెడల్పు ౫౦ గజములు, నీటిలోతు ౩౦ మొదలు ౪౦ అడుగులవఱకుఁ గలదు. చెఱువువైశాల్యము ౨౫ మైళ్లు చతురము. వేసవిలో నీరుండు ప్రదే శము ౧౩ మైళ్ళ చతురము. మామూలుకంటె మూఁడడుగులయెత్తు నీరు రాగానే * చిత్తాపుఖాను గండినుండి ౨౫ అడుగుల వెడల్పుగ నీరు ప్రవ హించును. నిజామురాష్ట్రమున కాకతీయులు నెలకొల్పిన తటాక ములు పాకాలచెఱువును మించినవి పెక్కులు గలవు. దీనిఁబట్టి వాని వైశాల్యమును గుర్తింపనచ్చును. నిజామురాష్ట్రమున కాకతీయరాజులు సేనానాయకులు నెలకొల్పిన తటాకములకు లెక్కలేదు.

## ప్రాచీనచిహ్నములు

ప్రపంచఖ్యాతి వహించిన అజంతాశిల్పములు నిజాములోని బర్దాను తాలూకాలోనివి. అలెగ్జాండరు స్మిత్తు క్రీ. శ ౧౮౨౪లో చూచి ప్రపంచమునకు చాటువఱకు ఈశిల్పముల సంగతి లోకమునకుఁ దెలి యదు. ఇటులె నైజాములో పర్వతభాగములలో నెన్నిశిల్పము లున్నవో నిర్ణయింపరాదు. ఇప్పటికి పదేండ్లక్రింద రంగశాయిపేట (ఒరంగల్లునద్ద) లో నొక్కకొండలో నొక్క విశాలగుహ విశాలమగు శిలా శాసనము బహిర్గతమయ్యెను. దానిపరిక్రమింకను లోకమునకుఁ దెలి యదు. నలుఁడు నైజాములోని బీదరు (విదర్భ) ప్రాంతము లేలిన యాంధ్రరాజన్యుఁడు. నలుని పేరుతో నలకుర్గ మొకటి కలదు. నలుని వంశీయుండగు భావదత్తుని అయిదవ శతాబ్దము నాఁటితెలుఁగులిపి సం స్కృతభాషాశాసనము విశాఖపట్టణముజిల్లా జయపురము వీజెన్నిలోఁ బరిశోధింపఁబడెను. పశ్చిమ చాళుక్యుఁడగు కీర్తివర్మ నలునివంశము రూపుమాపినటు లొకశాసనము గలదు. దీనిచే నలుఁడు విదర్భప్రాంత మేలిన చరిత్రయుగములోని రాజనియే తెలియుచున్నది. ఈయాంధ్ర రాజన్యుని శాసనములు వెదకవలసియున్నది. అశోకుని శిలాశాసన మొకటి క్రీ. పూ. ౨౫౦లోనిది రాయచూరు జిల్లా మాస్కియను చోట నుండి నీమధ్య నైజాము దొరతనమువారు ప్రచురించిరి. గణపతిదేవునకు రుద్రమదేవి కుమార్తెయగునని జెర్మనీ పండితుఁడగు హోల్టజు తెలుఁగుదు ప్రతాపరుద్రీయమునుండి దృష్టాంతము చూపువఱ కాంధ్రదేశమున కాసంగతి తెలియదు. హోల్టజునకు పిమ్మట రుద్రమ దేవి గణపతిదేవుని పుత్రియని తెలుఁగుశాసనములు పరిశోధింప నవకాశము

---

† ఈపానగల్లు నల్లగొండకు నాలుగుమైళ్లదూరములోనున్నది. ఇదిమహమ్మదీయసామ్రాజ్యమునకుసంబంధించినదిగాదు.మా.శారద,నవంబరుసంచిక.

* చిత్తాపుఖానుశాసనము ఒరంగల్లులో గలదు. ఇతఁడు తెలఁగవీరుఁడై స్వతంత్రముగ రాజై పదునాల్గవశతాబ్దమున ఓరుగల్లుప్రాంతములను కంథ మెట్టును పాలించెను. ఇతని నిజనామము సీతాపతి. ఇతనిమంత్రి నిమ్మల పెద్దిరాజు చిత్రభారతము చరిగొండ ధర్మకవివలన నంకితమునొందెను. చిత్తాపుఖాను అనునది బిరుదనామమనియు సీతనిపూర్తినామము బహమనీరాజులయొద్ద "చిత్తాపుఖాను" అనివ్యవహరింపఁబడినటులఁ దెలియుచున్నది.

చిక్కినది. ఇటులె పరిశోధించిన నిజామురాష్ట్రమునఁగల చరిత్ర చిహ్నము లెన్ని బయలుపడునో చరిత్రాంశములు శిల్పరహస్యము లెన్ని బహిర్గతము కాఁగలవో నాఁటిచరిత్రాంశము లేనాఁటికి గ్రంథస్థముగా నున్నవో నిర్ణయింపఁ గాలపురుషుఁడొక్కఁడె సమర్థుఁడని తోఁచుచున్నది!

పశ్చిమచాళుక్యులకడ దండనాయకుఁడుగానుండి పిదప తురీయాశ్రమము స్వీకరించిన గురుమల్లికార్జున పండితారాధ్యుల వారు నిజామురాష్ట్రములోని తెలుగుదేశవాసియే. ఈతని విపులజీవితము గ్రహింతుమేని పండ్రెండవ శతాబ్దములోని శైవుల విజృంభణము, జైనమతవినాశనము, చాళుక్యరాజపతనము బోధకాఁగలదు. జైనమతసంరక్షణార్థమై బద్ధులైన బిజ్జలుఁడు, శిలాహార రాజగు రెండవభోజుఁడు, కల్యాణనగర రాజ్యమేలిన సోమేశ్వరుఁడు, సంకారాముఁడు, ఆహవమల్లుఁడు లోనగు చాళుక్యరాజన్యుల రాజ్యవిస్తృతి గ్రహించినగాని కాకతీయసామ్రాజ్య విస్తృతి, ఐశ్వర్యము విస్పష్టముగాదు. వర్ధమానపుర రాజ్యమును చిరకాలము పాలించి రుద్రదేవుని పరాక్రమమువలన నశించిన కరికాల చోడాన్వయులగు భీమరాజు, గోకర్ణుఁడు, ఉదయాదిత్యుడు లోనగు రాజన్యులు భాషవిషయికముగ నుపకారముచేసిరి భీమరాజు మిగుల దుష్టుఁడని రుద్రదేవుఁడు చేర్కొనినను పానుగల్లువర్ధపురాదిశాసనముల వలన నాతఁడు పరాక్రమశాలియనుట కెంతమాత్రము సంశయములేదు. గోకర్ణుఁడుకవియనియు ఛందశ్శాస్త్రమును రచించెననియు నొక ప్రవాదముకలదు. అదియింకను ఇదమిత్థమని నిరూపింపరానిస్థితిలోనున్నది. ఎటులఁజూచినను పశ్చిమచాళుక్యులు భాషావిషయమున, పరాక్రమమున ఆంధ్రకాకతీయవంశమున కమృతదానము గావించి సార్థకులైరనుటకు సంశయములేదు. ఇట్టిచరిత్రాంశము లింకను గ్రంథములు కావుంట సంతోషకరము.

### తెలంగానా

నిజామురాష్ట్రములోని యాంధ్రదేశమును తెలంగానా యని మహమ్మదీయులు వ్యవహరింతురు. ఈ తెలుఁగు భాగములలోనివారు చాళుక్యరాజులకాలమున కాకతీయరాజుల కాలమున సేనాపతులై రాజప్రతినిధులై సైనికులై కన్నడదేశములకు మహారాష్ట్రదేశమునకుఁబోయి యటనే స్థిరవసతు లేర్పఱచుకొని నిలిచిపోయిరి. అట్టివారు నేఁటికి గృహభాషగా నాయాభాగములందుండియుఁ దెలుఁగునే వ్యవహరించుచు నాంధ్రకావ్యపఠన మొనరించుచుఁ గాలముగడుపుచున్నారు. ఈ తెలుగు దేశము పదునాలగవ శతాబ్దమధ్యకాలమునుండి మహమ్మదీయరాజన్యుల హస్తగతమయ్యెను. నాఁడు మొదలు ఆంధ్రుల చిరకాల నివాసములగు పూర్వపట్టణములకు మహమ్మదీయులు తమపేరులుపెట్టి పూర్వనామములు మార్చిరి. కరింనగర్. ఆత్రాఫుబల్దా, నవాబుపేట, షంషెర్‌బాద్, అమీనాబాద్, హస్నాబాద్, మహబూబునగర్, హుజూర్‌నగర్ అని యిటులు వ్యవహరింపఁబడు ఆంధ్రనగరములన్నింటికిఁ జరిత్రప్రసిద్ధములగు నాంధ్రనామములుగలవు. ప్రభుత్వ బలాతిశయముచేఁ బూర్వనామములు మాఱుపడియున్నవి. ఇప్పుడాధునికశోధకు లాగ్రామముల పూర్వనామములు గురుతించినఁగాని చరిత్రసంశయగ్రంథులు విడఁజాలవు. ఇందులకుఁ బరిశోధకులు శ్రద్ధఁజేసినగాని ఫలము కనఁబడదు. ఇందువలననే పూర్వచరిత్రములకు సంబంధించిన పెక్కు గ్రామములు శాసనములలోఁ జదువుచుండియు స్థలనిరూపణమున కెంతయో శ్రమ యగుచున్నది.

నిజామురాష్ట్రము కేవలము మహమ్మదీయరాజ్యమనియు నచట నాంధ్రుల యాచారవ్యవహారాదులు వేషభాషలు మనకెంతయో వ్యతిరేకముగ నుండునను వారిని బలువురను మేమెఱుంగుదుము. నిజాము రాష్ట్రమను పేరే నాలుగువందల సంవత్సరముల క్రిందినుండి వచ్చినదనియు, నైజాములోని తెలంగానా యంతయు నాంధ్రదేశమునకు నాయకరత్నమనియు, నాగరికవాసనలఁ దనివార ననుభవించు సోదరు లెఱుంగకుంట పరితాపకరము. పరిశోధకులు విడఁదీయరాని చరిత్రగ్రంథులు నిజామురాష్ట్రములోని శాసనములవలననే యేనాఁటికైన విడిపోవఁగలవు. కాకతీయసామ్రాజ్య మభ్యున్నతదశలో నున్నతఱి నాంధ్రతత్త్వము సర్వతోముఖముగ వెలుఁగొందెను. పూర్వచరిత్రచిహ్నము లన్నియు సురక్షితము లయ్యెను. కాకతీయులకు దేశీయకళలయందు నిరుపమానమగు నభిమానముగలదు. వారు నాట్యము, భరతము, శిల్పము కవిత, ఆయుర్వేదము, సంగ్రామము, మల్లవిద్య, ధర్మశాస్త్రము, అలంకారము, రాజనీతి, వేదాంతము, మతము లోనగు విషయములలో నాతిజేలిన మహనీయులఁ జేరఁదీసి యుత్తమ గ్రంథములు రచింపఁజేసిరి. తెలంగానాలో శాసనములవలనఁ బెక్కండ్రు మనమింతవరకెఱుంగని కవులపేరులు దెలియుచున్నది. పరిశోధించినకొలఁది యాకవిరాజులందఱు గ్రంథకర్తలని తెలియుచున్నది. కాకతీయ సామ్రాజ్యకాలములో సంస్కృతాంధ్రములలో నుత్పన్నములైన మహాగ్రంథములనేకములు గలవు. సమస్తకళలకు సంబంధించిన పుస్తకము లప్పుడు వెలసెను. జైనగ్రంథములుగూడ నాప్రాంతములలోఁ బెక్కులు సంస్కృతాంధ్రములలో రచింపఁబడెను. రాజవిప్లవములవలన గ్రంథభాండాగారములు కాల్పఁబడినను తెలంగానాలోనున్న యాంధ్రుల గృహములలో నింకను పరజనాలభ్యములైన యుత్తమగ్రంథములు వేలకొలఁది గలవని మాయనుభవముచే గ్రహించి చెప్పుచున్నారము. ఆంధ్రసామ్రాజ్యరంగస్థలములై మూఁడువందల సంవత్సరములు లక్ష్మీసరస్వతీ క్రీడారంగస్థలములైయున్న అనుమకొండ ఓరుఁగల్లు నగరముల నాశ్రయించిన పండితప్రకాండుల కావ్యరత్నము లెన్నఁటికైన పరిశోధకాగమ్యముగనున్న తెలంగానాలో లభింపవలసినదే.

నిజామురాష్ట్రములో లభించిన మహాభాష్యప్రదీపోద్యోతమను సంస్కృతగ్రంథ మిప్పుడు కాశ్మీరసంస్థానమునఁ బరిశోధింపఁబడుచున్నది. ఆదిలాబాదులో లభించిన గర్గసంహిత లండనులో ఇండియా ఆఫీసు వారు భద్రపఱచిరి. పాలకుఱికి సోమనాథుని సంస్కృతాంధ్ర కర్ణాట గ్రంథములు శైవులగృహములలో జీర్ణించుచున్నవి. పూర్వోక్తులగు

కీ|| శే|| పసుమర్తి రామయ్యశ్రేష్ఠిగారు, ఏలూరు



Late Pasumarti Ramayya Chetti Garu, Ellore

శ్రీయుత పసుమర్తి విశ్వపతిశాస్త్రిగారు, కాకినాడ



Sjt. Pasumarti Visvapathi Sastri Garu, Cocanada

శ్రీయుత పల్లె వెంకటసుబ్బారావుగారు, గుంటూరు



Sjt. Palle Venkata Subba Rao Garu, Guntur

శ్రీ శర్మసోదరులు, సుప్రసిద్ధాంధ్రబాలగాయక వైణికశిఖామణులు బుఱ్ఱా సత్యనారాయణ పంతులుగారు, బి. ఏ., బి. యల్.



Sree Sarma Brothers, Well known Andhra Boy Songsters



Sjt. Burra Satyanarayana Pantulu Garu B. A., B.L

కీ॥ శే॥ ఆచంట సుబ్బరాయుడుగారు,
ఇంగ్లీషు సైకిల్, మోటారు ఇంపోర్టింగ్ కంపెని యజమానులు, చెన్నపురి



Late Mr. A. Subbarayudu Garu,
Proprietor of English Cycle & Motor Importing Co., Madras.

శ్రీయుత ఆర్. సుబ్బారావుగారు, బి. ఏ.



Sjt. R. Subba Rao Garu, B. A.

కాకతీయ సామ్రాజ్యకవుల గ్రంథములింక ననేకము లనుపలభ్యములై నశించుచున్నవి. రుద్రదేవునిచే నిర్జితుఁడైన మేదరాజు (నైజాము) పాకాలశాలాకాలోని కరువపట్టమెందను గోదావరీతీరమునంతయుఁ బాలించిన రాజన్యుఁడనియు, నితనిమంత్రియగు నాగరాజు నీతఁడు జైనులనియు చరిత్రకారు లెఱింగిరు. రుద్రదేవు నెదిరించిన పాలవాస రాజగు మైళిగిదేవుఁడు ధర్మపురి చెంతగల పాలాస పాలించువాఁడనియు నిజామురాష్ట్రములోనివాఁడనియు చరిత్రవిదు లెఱుంగరు.

ఇంతియేల, కాకతీయసామ్రాజ్యములోఁ జేరిన నిజామురాష్ట్రములోని దేశీయచరిత్ర చిహ్నములు సమగ్రముగఁ బరిశోధింపఁబడు వఱకు దేశచరిత్ర మసమగ్రమనియే భావింపవలయును. చరిత్రమునకు భాషకు, శిల్పములకు, రాజనీతికి, ప్రాచీననాగరకతకు సంబంధించిన పత్రచిహ్నసముదాయము కాలవాహినిలోఁ గలసిపోకమున్నె నిజామురాష్ట్రములోని, ౮౧,౩౪౧ చదరపుమైళ్లు వైశాల్యము గల యాంధ్రదేశములో అడుగడుగునకొక పరిశోధకుఁడు తిరిగినగాని యాంధ్రదేశామూల్య చరిత్రము గోచరింపదు. అపుడుగాని కాకతీయ సామ్రాజ్యసంపూర్ణచరిత్రము గోచరింపదు. ఇప్పటికె చరిత్రచిహ్నములు చాలవఱకు రూపుమాసినవి. ఆంధ్రశిల్పము నుద్ఘోషించు దేవాలయములు పాడుపడి తుంటరిబాలుర శిలాఘాతములచే దినమునకొక ఛాయగా రూపుమాసి పోవుచున్నవి. శాసనశిల లనేకము లుపయోగము తెలియని భూస్వాములచేఁ దటాకగర్భములందు గోడలందు శకలములుగాఁ జేయఁబడి మరుగుపఱుపఁబడుచున్నవి. ప్రాచీనగ్రంథములు దీపావళి పండుగలలో వినోదసాధనములుగా దహింపఁబడుచున్నవి. కాకతీయ మహాయుగమునకు సంబంధించిన యుత్తమగ్రంథము రచించుటకుఁ దగిన సామగ్రి యిప్పటికే చాలవఱకు రూపుమాసినది. దీనినుద్ధరించుట నిజాము రాష్ట్రవాసుల ప్రథమవిధి. వానివాని సంపూర్ణచరిత్రములు భాషాప్రపంచమున శాశ్వతి నొసరించుట ఆంధ్రము మాతృభాషగాఁ గల ప్రత్యాంధ్రునివిధి. ఆంధ్రప్రపంచమునకు సర్వస్వము ధారవోసిన కాకతీయులకొఱకు మనము ప్రాలుమాలిన పశ్చాత్తాప తప్తమై నవ్యాంధ్రసోదరలోకమేని తేఱిచూడకపోదు. అప్పటి కీస్వల్పచిహ్నములేని దక్కునో దక్కవో!

శా. తల్లీ! కాకతిరాజ్యలక్ష్మి! భవదుద్యత్కీర్తి సంతానముల్
పల్లీపట్టనభాసమానములు నీప్రఖ్యాతు లాంధ్రావనీ
హృల్లీలామహిమాభిరామములు కావే! తావకోత్సాహపుం
జెల్లిగ్గై కొని కాలవాహినిని గల్పెన్; దుష్టదైవంబహా!

# గా లి ప ట ము

పూడిపెద్ది వెంకట రమణయ్య గారు

ప్రదులపల్ల వళయ్యాను మేను వ్రాల్చి
లేఁతనీరెండ దాగుడుమూఁతలాడి
తేఁటతేనియ నాకలిదీరఁ గుడిచి
కమ్మతెమ్మెరతోడి సఖ్యమున మెలఁగి
పుచ్చితిని గొన్నినాళ్లు క్రొంబూవునగుచు
దానసంతృప్తిలేక మార్దవముఁదొలఁగి
కలఁగిశుష్కించి సత్ఫలకాంక్షఁ జేసి
పరితపించి తుదకు ఫలవంతనైతి
అయ్యు నంతనుబోక మదాశయమ్ము
రసవిహీనమ్ము మాధుర్యరహితమగుట
గుండియలువీడ నేఁ గలగుండువడితి
తావుఁదప్పితి నాస నడంచుకొంటిఁ
గాంక్షవిడనాడి లోకోపకారమతిని
హృదయవైశాల్యమును బూని మొదటనున్న
సహజకాఠిన్యబీజమ్ము నడల విడిచి
రాపులంబడి మిగులమార్దవముఁ బడసి
యడఁగి మడిగియు విధిలాఁగునంతదనుక
సాగి యన్యులమానరక్షణకుఁ గడగి
శిథిలమై నామమాత్రావశిష్టమైతి
నంతలోఁదృప్తిలేక నయాచితముగ
లభ్యమౌముక్తినతిచపలమున విడిచి
మాసి రూపరి క్రిందయి మాటువడఁగ
నిచ్చగింపక పయిమెఱమెచ్చులంద
వన్నెకాసించి యారూఢపతితనైతి
దేశములనెల్లఁ ద్రిమ్మరి తెల్విపీడి
కోర్కె తలమున్కలాట నేఁగుల్లి కుల్లి
నొక్కులంబడి క్రొత్తమేనునఁజరించి
పూఁతమెరుఁగులఁ బేర్వడఁబూసికొంటి
అంతలోనైన సంతుష్టినందలేక
నెత్తివ్రాతను దాఁటనందియమువీడి
యాత్మబలమున నమ్మకమధికమగుడుఁ
గ్రిందుమీఁదునుగానక కెరలిపడుచు
నాకనమ్మునఁ దయితక్కలాడి విధిని
గడువఁ జూచితినేఁ గీర్తికామమునను
జతనమెట్లున్నఁ బ్రారబ్ధసంచితముల
నవలఁబోఁదోల నెవ్వని కగును జగతి
అన్నిఁటికి నాదకర్తృత్వ మంటిఁ గాని
చూడనయితిని యాజగత్సూత్రధారు
వాఁడు కొనవ్రేలఁ ద్రోవఁజూపకయ మనకు
నడుగుఁ గదలించునత్య మెంద్రైనఁగలదె!

# ప్రకృతిశాస్త్రజ్ఞుల లక్షణములు

జీవితకథలు

కానూరి లక్ష్మణరావు గారు

పరమేశ్వరసాక్షాత్కారమునకై ఘోరమైన తపస్సు చేయవలసి యుండును. అష్టకష్టములకులోనై యట్టితపస్సుచేసిన దానివలనఁగలుగుఫలిత మత్యద్భుతము. అట్టితపశ్శాలికి పరమేశ్వరుఁడు ఈయనివరములు లేవు. కోరుకొనినదెల్ల సిద్ధించును. రూపరహితుఁడయ్యు రూపముధరించి, నిర్గుణుఁడయ్యు సగుణుఁడై పరమేశ్వరుఁడు తుదకు ద్వారమునొద్ద నిలువంబడి కావలికాయు మన్నను కాయును. ఇట్లే ప్రకృతియొక్క సాక్షాత్కారమునుకూడ పొందవలెనన్న కష్టములపాలయి, కఠిన నియములకు, నిర్బంధములకు లోనై తపస్సు చేయవలయును. అట్టిగాఢదీక్షనుబూని తపస్సమాధియందు నిమగ్నుఁడైనవానికేకాని మహాశక్తియైన ప్రకృతి తనహృదయ మర్మములను దెలియఁజెప్పదు. అట్టి ప్రకృతిసాక్షాత్కారమునకై, మహత్తమమైన అగ్నిపరీక్షకు లోనగువాఁడే ప్రకృతిరహస్యతత్త్వవేత్తయైన శాస్త్రజ్ఞుఁడు.

## ఓర్పు-పట్టుదల

శాస్త్రజ్ఞుఁడు ముఖ్యముగా ఓరిమియు, పట్టుదలయు కలిగియుండును. తాను కనుఁగొనిన నూతనవిషయములు తాత్కాలికముగ నుపయోగములేకున్నను ఇంకను భావి పరిశోధనమునకై ప్రయత్నించుచునే యుండును.

ఫారడే విద్యుచ్ఛక్తిశాస్త్రము నభివృద్ధిపఱచినవారిలో ముఖ్యుఁడు. ఆతఁడు మొట్టమొదట ఇనుపముక్కను అయస్కాంతక్షేత్రములో త్రిప్పినయెడల విద్యుచ్ఛక్తి పుట్టును అని కనుఁగొనెను. కాని అట్లుద్భవించిన విద్యుచ్ఛక్తి బాల్యావస్థయందుండుటచే దైనిక జీవనమున నిప్పటివలె నుపయోగమునకు వచ్చియుండలేదు. అందువలన తనస్నేహితులు ఎందఱు పరిహాసముచేసినను ఫారడే మాత్ర మధైర్యమును జెందక తాను కనుఁగొనిన విషయము అత్యంత ప్రాముఖ్యమైనదని హృదయపూర్వకముగ విశ్వసించి దానిని లోకమునకు వెల్లడించెను. గ్లాడ్‌స్టను అంతటిగొప్పమంత్రి ఒకనాఁడు ఫారడేతో ప్రసంగించుచు అతనితో మీరు కనుఁగొనినవిషయమువలని లాభమేదియో నాకుఁ దెలియుటలేదని చెప్పెను. దానికి ఫారడే నిరుత్సాహము నొందలేదు. ఇది కొలఁది కాలములోనే పన్నువిధించుటకై మీదృష్టినాకర్షించు నంతటి అభివృద్ధిదశలోనికి రాఁగలదని ఫారడే చిఱునగవుతో బదులుచెప్పెను. ఇది యాత్మశ్లాఘనము కాదు: జాతకముచెప్పుటయు కాదు. కాని లోకమున కనుఁగొనిన యెట్టియల్పవిషయమునైనను శ్రద్ధతోడను,పట్టుదలతోడను పరిశీలించినచో దానివలన గొప్పఫలితములు కలుగఁగలవను ఆతనికున్న యాత్మవిశ్వాసమే ఆతనిచే నట్లు పలికించెను.

రేలే అను రసాయన శాస్త్రజ్ఞుఁడు నత్రజనము (Nitrogen) అను వాయువుయొక్క తారతమ్య గరిమ (Specific gravity) అనేకపద్ధతులవలన కనుఁగొనెను. ఇట్లు కనుఁగొనునప్పుడు తారతమ్యగరిమ ఒకమాఱు ౧.౩౦౦౨ను, మఱియొకమాఱు ౧.౨౯౯ను వచ్చెను. సామాన్యుఁడు ఇట్టివ్యత్యాసము పరిశోధనయందుపయోగించిన సాధనములందలిదోషములవలన సంభవించినదని తృప్తిజెందును. కాని రేలే అట్లుచేయక, గాలినుండితీసిన నత్రజనమునకు మఱియితరపద్ధతులవలన తయారుచేసిన నత్రజనమునకు భేదముండవలయునని యూహించెను. ఆతఁడనుకొనినట్లే కొన్నిసంవత్సరములైనపిదప గరిమయందలి వ్యత్యాసము వస్తుభేదమువలననని యే తేలినది. గాలిలో నత్రజనమునుబోలు ఆర్గనము (Argon) అను వాయువొకటి కలదని నూతనముగ కనిపెట్టఁబడెను. ఈ యార్గనమనువాయువు కలదని యప్పుడు తెలిసికొనిలేకపోవుటచేతనే ఆవ్యత్యాస మెందువలనఁగలిగినదియు అప్పుడు తెలియలేదు. ఇట్టిఆర్గనమును క్రొత్తపద్ధతుల తయారుచేయవలెనని ప్రారంభింపఁగా హీలియము (Helium) అను

క్రొత్తపదార్థ మొకటి కనుఁగొనఁబడెను. ఇది ఇటీవల చాలప్రాముఖ్యమునకు వచ్చినది. దీనివలన రసాయనశాస్త్రమున క్రొత్తసిద్ధాంతములు చేయవలసివచ్చినది. ఇదియే ప్రస్తుతము బంగారమును ఇతరపదార్థముల నుండికూడ తయారుచేయవచ్చునను ఉద్దేశముకలుగుటకు మూలకారణమైనది. ఇట్లు శాస్త్రజ్ఞుఁడు పట్టుదలతో పరిశోధనము గావించుచు, అల్పవిషయములనుండి, అత్యుత్తమవిషయములలోనికిఁ బోవుచున్నాఁడు.

జార్జ్ అనునతఁడు ఒకజ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు. నక్షత్రమండలమునుగుఱించి పరిశోధనచేయుచు భూమినావరించియున్న గాలి చలనముకలిగియుండుటచే తనపరిశోధనల కభ్యంతరము కలిగించుచున్నదని తెలిసికొనెను. అందువలన కొండమీఁదనుండుగాలి నిశ్చలస్థితిలోనుండునని అచ్చటకరుగుట కాతఁడు వెళ్లుటకు సిద్ధపడెను. కాని యాతఁడు కుంటివాఁడు: ధనమూ లేదు. అయినను కష్టమనియెంచక యాతఁడు ఎట్టెటో కొండపై కెగఁబ్రాకెను.

న్యూటను ఇంగ్లాండులో జన్మించిన మహాపురుషులలోనెల్ల అగ్రగణ్యుఁడు. అనేకశాస్త్రములకు బ్రహ్మవంటివాఁడు. సుమారు ఇరువదిసంవత్సరములుకష్టపడి, పరిశోధనలనుగావించి, ఎన్నియో లెక్కలు గుణించి యొకపుస్తకము తయారుచేసెను. అతనిసర్వస్వమంతయు దానిలో నుండెను. ఒకనాఁడది దీపముముట్టుకొని అగ్నిహోత్రుని కాహుతియయ్యెను. అప్పు డాతనిమిత్రులందఱును అతఁడు పిచ్చివాఁడైపోవుననితలంచిరి. కాని జరిగిన దానికి వగవక, ఎంతయో యోరిమివహించి మఱల నాతఁడా శాస్త్రమంతయు వ్రాసెను.

సూర్యోదయమునకుపూర్వ మొకానొక నదియొడ్డున ఒకపురుషుఁడు కూర్చుండియుండెను. ఆదారినరుగుచు మువ్వురుమిత్రు లాతనిని పలుకరించిరి. మఱల అస్తమయసమయము వచ్చినది. ప్రొద్దుటనరిగినవారు గృహాభిముఖులై నదీతీరమునకువచ్చునరికి ఆపురుషుఁడచ్చటనే కూర్చొనియుండుటనుగాంచిరి. వారలాతనింగాంచి జాలిపడిరి. పాపము వెఱ్ఱివాఁడు. ఇక్కడ ఏమున్నదనియో తదేకధ్యానముతో కూర్చున్నవాఁడు అని తమలోదాము నవ్వుకొనుచు తమత్రోవను బోయిరి. ఆపురుషుఁడే ఫేబరు అను గొప్పప్రకృతి శాస్త్రజ్ఞుఁడు. శాస్త్రములన్నిటిలోను క్రిమికీటకములనుగుఱించిన శాస్త్రమునందు పరిశోధనచేయుట చాల కష్టమైనది. పురువులేవిధమున సంచరించునో, అవి యేవిధమునఁ దమజీవితమును గడపుచున్నవో- ఈవిషయములను పరిశీలించుట మిక్కిలి కష్టము. తేనెటీఁగలలో ఒకరాణియీఁగ యుండుననియు మిగిలినయీఁగలన్నియు దానికి లోఁబడియుండుననియుఁ దెలిసికొనుట చాలపరిశోధనా ప్రయాసములకు సాధ్యమైనది. ఫేబరు శాస్త్రజ్ఞుఁ డట్టివిషయముల నెన్నిటినో కనుఁగొని లోకమునకు వెల్లడించెను.

చలనావస్థయందుండు ప్రతివస్తువునకు కొంత ఉద్వేగము కొంతయుండునుకదా! రైలు గంటకు ౬౦ మైళ్లు చొప్పున పోవుననియు, విమానము ౧౨౦ మైళ్లు చొప్పున పోవుననియు చెప్పుకొనుచుందుము. అట్లే వెలుతురు ఒకప్రదేశమునుండి మఱియొకప్రదేశమునకు పోవుటకుఁ గొంతకాలము పట్టును. ఇది అనఁగా ఒకసెకను కాలమున ౧౮౬ వేలమైళ్లు పరువెత్తుచున్నది. అందువలననే సూర్యుఁ డుదయించిన ఎనిమిది నిమిషములకుఁగాని సూర్యుఁడుదయించినట్లు మనకుఁ దెలియదు. అట్లే నక్షత్రములలోఁ గొన్ని సూర్యునికంటెను దూరముగానుండుటచే వెలుతురు అచ్చటనుండి భూమిని చేరుటకు ౩౦౦ల ఏండ్లుకూడ పట్టుచున్నది. ఇట్టివెలుతురుయొక్క వేగమును లెక్కించుటకు శాస్త్రజ్ఞులు ఒక చతురపు కాచఖండము నుపయోగింతురు. దానిమీఁద నొకచతురపు అంగుళములో గ్రాఫ్, పుస్తకములోవలె సుమారు లక్షగీతలు గీచియుండును. ఇన్నిటినిగీయుయంత్రమును చేయుటకు సుమారు పదిసంవత్సరములు పట్టును. ఇట్టి యంత్రమును చేయుటలో శాస్త్రజ్ఞులుచూపినఓర్పు నిరుపమానము. ఏనిమిషమునైనను విసువుచెంది, ప్రమత్తులై పనిచేసినచో ఎన్నియోసంవత్సరములనుండి చేయుచున్న యంత్రము త్రుటికాలములో చెడిపోవునుకదా!

ఉత్తరదక్షిణ ధ్రువములను కనుఁగొనవలెనని బైలుదేఱి ఎందఱో యుత్సాహవంతులైనవారు మృత్యువుయొక్క కోఱలలో చిక్కుకొని మడిసిరి. ఇట్లు కనుఁగొనఁ బ్రయత్నించుటకు వారిపట్టుదలయే కారణము. ౧౯౦౬ వ- సంవత్సరమున ఇరశ్చేర్ అనునతఁడు ఉత్తరధ్రువమునకు పోయియుండెను. ఆతని ననుసరించినవారలు చనిపోయిరి. తినుటకాతనికి భోజనసామగ్రి లేకపోయెను.

చలిబాధ తప్పించుకొనుట కాతనికి పాదరక్షలైన లేక పోయెను. ఆతఁడు ప్రాణావశిష్టుఁడయ్యెను. అయినను తాను సంచారముచేసినట్టి ప్రదేశమునుగుఱించి ప్రపంచమునకుఁ దెలుపవలయునని యెంచి మోకాలిమీఁద ప్రాకుచు రాఁగలిగినంతదూరము వచ్చెను. అచ్చట తాను వ్రాసిన దానిని విడిచి యాతఁడు తనప్రాణములను గోలుపోయెను.

౧౯౧౨-వ సంవత్సరమందు స్కాట్టుఅను నొక శాస్త్రజ్ఞుఁడు త్తరధ్రువము చేరవలెనని బైలుదేఱెను. మఱల నాతఁడు గృహాభిముఖుఁడై వచ్చుచుండఁగా నాతని నంతవఱకు అనుసరించుచుండిన మిత్రులనేకులు పరలోకగతులైరి. శేషించిన యిరువురితో ఆతఁడొకా నొక ప్రదేశమునకు వచ్చుసరికి మంచుదిట్టముగ కురియ నారంభించెను. పటకుటీరమున గూర్చున్నను భోజన పదార్థములయిపోవుటచే నాతఁడు మరణింపవలసివచ్చెను. తనకు మరణసమయ మాసన్నమగుచున్నదని తెలిసి కొని ఆతఁడు తాను వ్రాయఁదలఁచిన దంతయు వ్రాసి యుంచెను. కొన్ని నెలలకు మఱియొక రచ్చటికి వెళ్లి నప్పుడు స్కాటుచేతిలో గాకితమును పట్టుకొని దీర్ఘనిద్రా ముద్రితుఁడగుటఁ గాంచిరి. ప్రస్తుతకాలమున హిమవత్పర్వతము నధిష్ఠించుటకు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు చూపుచున్న పట్టుదల ఆశ్చర్యకరమైనది. మొదటిప్రయత్నము గొప్ప శాస్త్రజ్ఞుల మరణముతో ముగిసినను ఇంకను వారిలోఁ గొందఱు ఏతత్ప్రయత్నమునుండి విముఖులగుటలేదు.

శాస్త్రజ్ఞునికి సాధనాభావము అనుమాట లేదు. సాధారణముగ కళాశాలవిద్యార్థులు ఏగొప్పశాస్త్రజ్ఞుఁడో కనుఁగొనిన యొక్కసూత్రమునందలి సత్యమును పరీక్షించుటకే తమకళాశాలయందలి సాధనములు చాలవనియో వాటియందు లోపము లున్నవనియో చెప్పుచుండుట సహజము; కాని యిది విద్యార్థులమాట. శాస్త్రజ్ఞుఁడట్లుకాదు. వానికి సామగ్రియుండినను లేకపోయినను నతఁ: విషయమును పరిశీలించును.

డాక్టర్ ఫ్రాల్ స్టర్ గొప్పపేరువహించిన శాస్త్రజ్ఞుఁడు. అతనిపేరు దేశదేశముల వ్యాపించెను. అతనిపరిశోధనాలయమును జూచుటకు ఒకఁడువచ్చి, ఏతత్కార్యమునకు దనకనుమతినీయవలెనని కోరెను. వెంటనే ఫ్రాల్ స్టర్ సేవకునిబిలిచి తనపరిశోధనాలయము నాతనికిఁ జూపవలసినదని చెప్పెను. కొన్నినిమిషములు నిశ్శబ్దముగ గడచినవెనుక నాసేవకుఁడు ఒకపళ్లెరమునఁ గొంత సాధనసామగ్రినుంచి అదియే తనయజమాని పరిశోధన సామగ్రియని చూడవచ్చినయాతనికి చెప్పెను. పాపమా పెద్దమనుష్యుఁ డంతట చిన్నబోయియుండవచ్చును. ఎంత యోగొప్పగా పరిశోధనాలయముండునని వీక్షింపఁ గొండంతయాశ పెట్టుకొనివచ్చిన యాతఁడు చిన్నపళ్లెమును మాత్రమే చూడవలసివచ్చుట నగుబాటుకాదా? కాని ఫ్రాల్ స్టర్ యొక్కసొత్తుఆపళ్లెమొక్కటే. ఆచిన్నిపళ్లెరము నుండియే యాతనిపెద్దపరిశోధనములు మొలకలెత్తినవి.

ఏకాగ్రత

ఏకాగ్రతయనఁగా ఒకవిషయమున మనస్సును లగ్నముచేయుట. తపస్సమాధినుండి వాల్మీకి తాను వల్మీకపరివృతుఁడైనట్లు కనుఁగొనలేకపోయెను. ఇట్లే శాస్త్రజ్ఞుఁడును విషయపరిశోధనమున ఏకాగ్రచిత్తుఁడై తపోసమాధినుండును

దూరవస్తువులు చర్మచక్షువులకుఁ గాన్పింపవు. అందుచేత నక్షత్రమండలమును బరిశీలించుటకు ఒకయంత్రము నుపయోగింతురు. ఇట్టిదానినొకటి ఆర్షల్ శాస్త్రజ్ఞుఁడు తయారుచేసెను. అట్టిసందర్భమున నాతఁడు పదునాఱుగంటలకాలము తదేకదీక్షనహించి ఒకరీతిని మెలుగుపెట్టుచు, చేతులకు విశ్రాంతినీయలేదు. ఇట్టిసమయములందు భోజనముమాటతలపెట్టకుండుటచేత ఆతనిసోదరి ఆతనినోటిలో అన్నపుముద్దలు కలిపిపెట్టుచు ఆతనిని పోషించుచుండెడిది. ఆర్షల్ గొప్పమేధావి. ఆకాశము నంతను మూఁడులక్షలభాగములుగ విభజించి ప్రతిభాగములోనికి వచ్చునక్షత్రమును పరిశీలించుచు కొన్ని యేండ్లు గడిపెను.

న్యూటను తనజీవితమంతయు శాస్త్రపరిశోధనమునందే గడపియుండెను. సూదంటుఱాయినంటుకొని యుండు అయస్కాంతమునుబోలి ఆతనితలంపు లెల్లప్పుడును శాస్త్రపరిశోధనయందే లయమైయుండెడివి. లోకమున పిచ్చివానిని ఏస్త్రీయు వివాహమాడ నిచ్చగింపదు కదా! అట్లగుటచే ఆడంబరబాహ్యాలంకారరహితుఁడును, ఏకాగ్రచిత్తుఁడునైన న్యూటను నెవరువరింతురు? అయినను ఆతఁడు గొప్పవాఁడుగ పరిగణింపఁబడుటచేత ఒకానొకస్త్రీ ఆతనిని వివాహముచేసికొనుట కిష్టపడెను. మొదటిదినముననే వారిరువురు నొక్కయెడకు పోయి

యచ్చటనున్న బల్లలపై నాసీనులై ముచ్చటలు ప్రారంభించిరి. కాని న్యూటను ఏదొయొకటి రెండునిమిషములో మాటలాడి తాను చేయుచున్న యేదియోయొక పరిశోధనమును గుఱించి యాలోచింపఁ బ్రారంభించెను. స్త్రీసహజముగ మాటకారి. అందులో జీవితమంతయు తనకు సహకారిగ నుండవలసిన మనుష్యునితోఁగాక మఱి యెవ్వరితో మాటలాడును? ఆమె న్యూటనుతో నేమేమో చెప్పఁ దొడంగెను. గాయకుఁ డెంతమనోహరముగ పాడుచున్నను చెవిటివానికి తెలియదు. అట్లే న్యూటను ఆలోచనాసముద్రమున మునిఁగి తేలుచుండ నా స్త్రీ యొక్క మాట లాతనికెట్లు వినఁబడును? గాఢాలోచనా నిమగ్నుఁడై యున్న వానియవయవములు మఱియొక పనిని దేనినైన కల్పించుకొనను. విద్యార్థు లెక్కువ శ్రద్ధతోఁ జదువుచున్నప్పుడు కూనరాగము తీయుచుందురు. అట్లే న్యూటను ఆనాలోచనాపరుఁడై యుండఁగా పొగచుట్ట త్రావుట యాతని కలవాటు. చుట్ట నుసికట్టఁగా దానివిరాల్చివేయుటకై తనచేయియే యనుకొని యాతఁడు తనప్రక్కనున్న యాస్త్రీచేతిని పట్టుకొని చుట్టదగ్గఱికిఁ బోనిచ్చుచుండెను. తానంతవఱకుఁ జెప్పిన సంగతులకు సంతోషించి న్యూటను తనచేయిపట్టుకొనెనని యామె సంతోషించుచు ఆతఁడట్లు తనచేతి నెంతవఱకుఁ గొనిపోవునో యని యోజించుచుండెను. న్యూటను ఆమెచేతిని తీసికొనిపోయి నుసిరాల్చుటకై తనచుట్టమీఁద నుంచెను. నుసిరాలి నిప్పరగులుటచే ఆమెచేయి కాలెను. అంతటితో నంతసించి యిఁక నీపెండ్లిముచ్చట యింతటితోఁ జాలునని యాయున్మత్తుని విడిచి వెళ్లిపోయెను. అదియే యాతనివివాహమునకు ప్రారంభమును సమాప్తమునుకూడ.

దేశాచారమునుబట్టి న్యూటను నీళ్లలో కోడిగ్రుడ్డు నుడుకఁ బెట్టి తినుచుండెడివాఁడు కాని యాస్వల్పకాలముకూడ నాతనికి కాలహరణముగఁ గనిపించుచుండెడిది. అందుచేత కోడిగ్రుడ్డు నొకచేతిలోనుంచుకొని నీటిని కాఁగఁబెట్టి తనలెక్కలను గుణించుకొనుచుండెడివాఁడు. ఒకనాఁడిట్టి పరిశోధనలో గడియారమును దగ్గఱఁబెట్టి చూచుకొనవలసివచ్చెను. అందుచే నాతఁడు గడియారము నొకచేతిలోను కోడిగ్రుడ్డు నింకొకచేతిలోను ఉంచుకొని యాలోచించుచుండెను. నీళ్లుకాగెను. అప్పటికి న్యూటనుకు వంటవిషయమై యేకోలఁదిగనో జ్ఞాపకముండుటచే తనచేతిలోనున్న వస్తువును నీటిలో వేసెను. కొన్ని నిమిషములకు కాలము చూడవలసివచ్చినప్పుడు తనచేతివంకఁ జూచెను. కాని అది యచటలేదు. పాపము కోడిగ్రుడ్డుబదులు గడియారము నీటిలో నుడుకుచుండెను.

న్యూటను రెండుపిల్లులను అల్లారుముద్దుగఁ బెంచుచుండువాఁడు. అందులో నొకటి రెండవదానికంటె పెద్దది. దీర్ఘాలోచనాపరుఁడై యున్నప్పుడు అవి యాతని యొద్దకువచ్చి యాడుకొనుచుండెడివి. అవి వచ్చినట్లు కాని, పోయినట్లుకాని యాతఁడు గమనించుచుండువాఁడు కాఁడు. కాని ఒకదినమున అవి అల్లరిచేయుచుండుట చేత తనపనికి భంగముకలిగింపకుండ అవి తమయిచ్చ వచ్చినట్లు సంచరించుటకు గదిగోడయందు రెండురంధ్రములు చేసెను. ఒకనాఁడాతనిస్నేహితుఁడొకఁడువచ్చి యాతనిని రెండుకన్నములేలచేసితివని ప్రశ్నింపఁగా, రెండుపిల్లులకు రెండుకన్నములు చేసితినని చెప్పెను. ఆస్నేహితుఁడు పెద్దపిల్లికొఱకు చేసినకన్నములోనుండి చిన్నపిల్లి పోలేదా? అని నవ్వెను.

ఈకథనే ఇంకొకరీతిని జెప్పెదరు. న్యూటను ఒక పిల్లినిమాత్రమే పెంచెను. అది వచ్చుటకు పోవుటకు రెండురంధ్రములు చేసెను. స్నేహితుఁ డాకన్నములను జూచి నవ్వి యిదియేమి? వచ్చుటకు, పోవుటకు ఒక పిల్లికి ఒకకన్నముచాలదా యని ప్రశ్నింపఁగా, లోపలికివచ్చుపిల్లి ధనరాశి (Positive) వెలుపలికిపోవునది ఋణరాశియు (Negative) నగుటచే రెంటికిని భేదముండుటవలన రెండుకన్నములును పొడవవలసివచ్చెనని చెప్పెను. ఇట్లు చెప్పటచేత న్యూటనుయొక్క ఏకాగ్రత మఱింత స్పష్టమగుచున్నది.

ఒకానొకదినమున న్యూటను గుఱ్ఱముపై జీనుచేతితోఁబట్టికొని దానినడుపుచుఁ వినోదార్థము కొండపై కెక్కుచుండెను. కాని యాతఁడెల్లప్పుడు నాలోచనానిమగ్నుఁడై యుండుటచే నాతఁడు చేయుచున్నపనిని పాటింపక దేనినిగుఱించియో యోచించుచుండెను. కొంతదూరము పోయినతరువాత చూడఁగా గుఱ్ఱము కొండదిగువనున్న మైదానములో మేయుచుండెను. కాని జీనుమాత్ర మాతనిచేతిలోనే యుండెను!

ఇట్లే న్యూటనుగుఱించి యెన్నియోకథలు గలవు. న్యూటను చిన్నవయస్కుఁడైనప్పుడు పాఠశాలలో మంద

బుద్ధియె చివరచోటు ఆక్రమించుచుండువాఁడు. ఒకనాఁడాతని సహాధ్యాయి యాతనిఁజూచి పరిహసింపఁగా వెంటనే ఆతఁడు పట్టుదలతో చదువు ప్రారంభించి తనతరగతిలో ప్రధానస్థాన మాక్రమించెను.

పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభదశలో పాశ్చరు అనునాతఁడు ఫ్రాన్సు దేశమున జన్మించి సూక్ష్మజీవులు మొదలగువానినిగుఱించి పరిశోధనములుచేసి ఘనతవహించెను. ఆతఁడెల్లప్పుడును తనపరిశోధనాలయమునందే కాలము గడపుచుండువాఁడు. ఆతనిమిత్రులు కొందఱు ఆతనికి వివాహముచేయుటకై ప్రయత్నములుసలిపి ఏదోయొకసంబంధమును వెదకి ఆతనికి సుముహూర్తము నెఱింగించిరి. వివాహముహూర్తము సమీపింపఁగనే మతానుసారముగావధువు మొదలగువారు క్రైస్తవులగుడికి వెళ్లిరి. అక్కడ వివాహము జరుగవలసియుండెను. కాని పెండ్లికొడుకైన పాశ్చరుమాత్ర మచట కనఁబడలేదు. ఆతనికొఱకు నాల్గుదిక్కులు వెదకిరి. తన పెండ్లి యేయగుటచేత ఆతఁడు తప్పక బయలుదేఱి యుండునని ఆతని నెవ్వరైన త్రోవలో నాటంకపఱచి యుందురని-ఈ మొదలగు వాక్యములాజనసమూహమున వినఁబడెను. కాని వారిలో పాశ్చరు అంతరంగిక స్నేహితుఁడొకఁడు కలఁడు. ఆతనికి పాశ్చరుయొక్క గుణములు తెలియును. అందుచే జనసమూహముయొక్క మాటలను విశ్వసింపక వెంటనే పాశ్చరు పనిచేయు పరిశోధనాలయమునకు పోయెను. అచ్చట గాఢాలోచనానిమగ్నుఁడై పాశ్చరు స్నేహితునిరాకయే గమనింపక తన పనితాను చేసికొనుచుండెను. అప్పుడు స్నేహితుఁడు తాను వచ్చినసంగతి నాతనికెఱింగింపఁగా ఏదియో యల్పాత్యల్పవిషయమును విస్మరించినవానివలె నాతఁడాతనితో 'అయ్యో! ఆమాట నేనుమఱచితినే' అని సావకాశముగ జవాబొసంగెను.

# విశ్వకల్యాణము

పెనుమర్తి వేంకటరత్నము గారు

క్రొత్తతావి పసందు లొత్తుకున్నది బలే!
నెఱమల్లెతీవ పందిరులయందు
చిఱుతకోయిల భుజించిన కిసాలయములో
స్వాతంత్ర్యరాగముల్ సందడించె
ఒలికించుకొన్నవి పిలలరాగంబులు
వనలక్ష్మి ప్రేమవాసనలు కొన్ని
మాధుర్యవాహినీమసృణవీచికలలోఁ
గవికికోకిలల గీతరవము మొరసె

లాజలుగఁ బూలఁ దీవయిల్లాండ్రుచల్ల
మాధవుఁడువచ్చినాఁడు బంధురకుమారి
కామనోహరరాగ మార్గములయందుఁ
కేకలు కరుల్లుకట్టిచిందించుకొనిరొ.

మార్గమునఁ బోవుచున్నారు మధురమైన
కంఠరవమున గీతముల్ కందళింప
నప్సరఃకన్యకాళి నృత్యములలోనఁ
క్రొత్తదనపు గీతంబులు కొసరుకొనిరొ.

విశ్వవాణీనవ్య వీణారవంబులు,
శాంత్యాశ్రమములలో సందడించె
సత్యాగ్రహవ్రతాచరణంబు లుర్వరా
పారతంత్ర్యంబును బారఁద్రోలె
భారతీదేవి సంకీర్తనఘోషలోఁ
కళ్యాణ రాగముల్ క్రమ్ముకొనిరొ
హృదయవిపంచికాముదిత గీతములలోఁ
బ్రాయవాహిన్యంబు కణములొలికె

విశ్వరంగమ్ము చైతన్యవిస్తృతమయి
నవనవోన్మేష బృందావనంబునందు
బాలగోపాలు వేణుగీతాలలోన
సన్నయముఁ జేసుకొన్నది హర్షరేఖ.

లేఁడికన్నియ ముద్దులాడు శార్దూలంబు
ఎనలేని ప్రేమముల్ పెనఁచికొనిరొ
మత్తవారణమును మర్యాదగాఁజూచె
దర్పకంఠపిశితసక్త మృగరాజు
ఎలుకపిల్లకుముద్దులిచ్చు మార్జాలంబు
కలుకుగోళ్లలఁ బ్రేమవిరిసికొనిరొ
పావురంబునుడేగ ప్రబలవత్సర వీఁగి
నీడంబులందుఁ దూగాఁడుచుండె

విశ్వకల్యాణగీతికా వృత్తిలోన
మ్రోగుచున్నది సుకవితా రాగగరిమ
అదిగొ! ఉదయాస్తమయములయందు వెలుఁగు
బాలభాస్వంతుకోటిరుద్వేలదీప్తి.

ఆత్మకుసుమము లర్పించునట్టివారి
వదనములయందు హర్షంబు లొదిగికొనుచు
మృత్యుదేవీభయంకర నృత్యములను
లెక్కచేయుటయే లేదులే! పసందు.

# అధ్యాత్మరామాయణకర్త సుబ్రహ్మణ్యకవి

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ గారు

శ్రీమదఖండ మహీమండల పూజ్యంబగు అధ్యాత్మ రామాయణకీర్తన ప్రబంధకర్తయగు సుబ్రహ్మణ్యకవి వృత్తాంతము నెంతయుఁ దెలియునవకాశము తద్గ్రంథమున లేకుండుటచే 'ననేకులు సుప్రసిద్ధగ్రంథ కర్తయగు తత్కవి విషయములు తెలియ నభిలషించియుఁ దెలియువసతిలేక విచారపడుచున్నారు. నేనీ వృత్తాంతమును తెలిసికొనఁ గొంతకాలమునుండి ప్రయత్నించుచుండి నేటికిఁ దెలియఁగలిగినందులకు సంతసించి యిట్లు వ్రాయుచున్నాను.

ఈకవి ములికినాటి వైదికబ్రాహ్మణుఁడు; హారిత సగోత్రుఁడు. వీరు సుబ్బన్న వరదన్న శేషన్న యను ముగ్గురన్నదమ్ములు. తంజావూరు మండలములోని మునిపల్లె గ్రామవాసులు. సుబ్బన్నకవి, (సుబ్రహ్మణ్యకవి) పండితుఁడు. వరదన్న వైణికుఁడు. శేషన్న సామాన్యుఁడు. ఒకపుడు వీరు శ్రీతిరుపతియాత్రకువచ్చి స్వామిసన్నిధియందు వీరి సంగీతవిద్యావైశద్యమును జూపుచు సభ చేసి పాడుచుండ కాళహస్తి ప్రభువో, లేక వారి మంత్రులో, వీరినచటఁగాంచి వారిసంస్థానమున నుండు మనివేడగా వారంగీకరించి కాళహస్తినికేరి సంస్థానమున నుండిరి. కొంతకాలమునకు సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణము కీర్తనలు శ్రీశేషశైలేశున కంకితముగ వ్రాసి తిరుమలకేగి వేంకటేశ్వరుల సన్నిధిని గ్రంథము సమర్పించి తిరిగి దిగువతిరుపతికి వచ్చి గోవిందరాజ స్వామిని సేవించి బసయందుండెను. నాటిరాత్రి శ్రీ వేంకటేశ్వరులు మహంతునకు స్వప్నమందు సాక్షాత్కరించి నాభక్తుఁడొకఁడు కాళహస్తినుండి అధ్యాత్మరామాయణమును మదంకితముగ వ్రాసి నాకర్పించి వచ్చెను; కాని వానినెవ్వరును గౌరవింపక సామాన్యునిగఁ జూచిరి. కావున నీవతనినిపుడు నాసన్నిధికిఁ గొనివచ్చి గౌరవముతో బ్రహ్మరథముబట్టించి బహూకరించి పంపుమని యాజ్ఞనీయగా మహంతు తత్క్షణమే మేలుకాంచి వెతకించి యామహనీయుని రప్పించి తానును పరివారముతో కవిని గిరిపైకిఁ గొంపోయి మహావైభవముతో నుత్సవముచేసి గౌరవించి తగుబహుమానములతో నంపెను. కర్ణాకర్ణిగా నీవృత్తాంతమును కాళహస్తి ప్రభువగు శ్రీరాజా దామరకుమార వేంకటప్పనాయునింవారు విని మిక్కిలి సంతసించి యిట్టిగౌరవము తనసంస్థానకవికి జరుగుట తనకును గౌరవాతిశయమని మెచ్చి కవిని రప్పించి రామాయణగ్రంథమును చదివించి విని యీవృత్తాంతము తనకంతకుపూర్వము కవి చెప్పనందులకు విచారపడి కవిని మిగుల సన్మానించి కవిచేయు శ్రీరామోత్సవాదులకై రామానుజపల్లెయు, వీరిభుక్తికై కృష్ణంపల్లెయు నను నీరెండు గ్రామములు శాలివాహనశక॥ 1682 (క్రీ.1760) ప్రమాదిసం॥ శ్రావణ బ ౮ న ధారవోసియిచ్చిరి. ఇవి కాళహస్తికి 7-8 మైళ్ల దూరమునఁ బశ్చిమమున గలవు. ఇందు రామానుజపల్లె అన్యాక్రాంతమైనది కాని కృష్ణంపల్లె మాత్రము వీరి మునిమనుమఁడగు బ్ర॥ మునిపల్లె చెంచు సుబ్బయ్యగారు (సాకిన్ కృష్ణంపల్లె) భుక్తపరుచుకొనుచున్నారు. వీరు సాత్వికులును యోగ్యులునై యతిథి పూజావిశారదులై విరాజిల్లుచున్నారు.

అధ్యాత్మ రామాయణము వ్రాయబడి యిప్పటికి రమారమి 160 సం॥ లగును. ఇట్టి సత్కీర్తిని గడించిన కవియొక్కయుఁ దత్పోషకులగు ప్రభువుయొక్కయు వంశపురుషులను తెలిసినంతవరకు నిందువ్రాయుట యావశ్యకమె కాని యిందు విస్తరించి వ్రాసిన గ్రంథవిస్తరమగునని క్లుప్తముగ నిందుక్రింద వ్రాయుచున్నాను. ప్రభువంశ చారిత్రములు 1894 సం॥ న డిప్యూటి తహశ్శీల్దారగు శ్రీ పుట్రగుంట గురుస్వామయ్యగారు వ్రాసిన తెలుఁగుచరిత్రమును బట్టియు నిటీవల శ్రీదివాన్ బహదూర్ రఘునాథరావుగారు వ్రాసిన యింగ్లీషు చరిత్రమునుబట్టియు విపులముగఁ దెలియఁగలదు. వీనినిఁ బట్టిచూడ పైనఁజెప్పబడిన శ్రీదామరకుమార వేంకటప్ప నాయనింవారు క్రీ. 1745 సం. న ప్రభుత్వమునకువచ్చి 50 సం॥ లు పాలించినట్లు కనుపట్టుచున్నది. కావున

సుబ్రహ్మణ్యకవి కొసంగిన గ్రామదానకాలము సరియైనట్లు కనుపట్టుచున్నది.

సుబ్రహ్మణ్యకవి పూర్వుల పేర్లు తెలియఁగల సాధనములు లేవు కాని వారిసంతతి వారి పేర్లుమాత్రము చెంచుసుబ్బయ్యగారు చెప్పినరీతి నిందు వ్రాయుచున్నాను.

1 సుబ్బన్న (సుబ్రహ్మణ్యకవి) 2 శేషన్న 3 వరదన్న సోదరులు. శేషన్నకు సుబ్బన్న, యీసుబ్బన్నకు 1 కాళహస్తయ్య, 2 చెంచయ్య, 3 రాఘవయ్య, 4 రామయ్య, 5 అచ్చమ్మ. ఇందు చెంచయ్యకుమాత్రము చెంచుసుబ్బయ్య (ఇపుడున్నవారు). సుబ్రహ్మణ్యకవి వరదన్నల సంతతి తెలియరాదు. సుబ్రహ్మణ్యకవి పూజింపుచుండెడి శ్రీరామమందిరము (దేవతార్చన వీరిమనుమఁడు చెంచయ్యగారు భరింపలేక తనయగ్రహారములోని 13 కుంటల (యకరం 1-20 సెంట్లు) పల్లపుభూమిని నైవేద్యాదులకిచ్చి కాళహస్తిపురమున భజనమందిరమున నిల్పెను. ఈ మందిరనిర్మాణమునకేమి శ్రీస్వామివారి వసంత నవరాత్రి మహోత్సవాన్న ప్రదానములకేమి కాళహస్తిపురబ్రాహ్మణసభవారు ద్రవ్యసహాయమొసర్చి కైంకర్యములు జరిగింపుచున్నారు. ఇదిగాక కాళహస్తి ప్రభువులగు శ్రీరాజా దామర కుమార వేంకటలింగమనాయనింబహదూర్ వారు నీస్వామియెడల మిగుల భక్తిశ్రద్ధలు కలిగి రథోత్సవాది కైంకర్యములు జరిగింపుచున్నారు. వీరుకాక సుబ్రహ్మణ్యకవినాఁటి ప్రభువుమొద లిప్పటివరకుఁగల ప్రభువులందఱు నీస్వామియెడల భక్తిశ్రద్ధలతోఁ గైంకర్యములు జరిగింపుచు వచ్చిరి.

ఇపు డీమందిరము బ్ర॥ రాళ్లపల్లి ఆదినారాయణయ్యగారి (కాళహస్తి) విచారణక్రిందనుండి ఏకాదశి శనివారములందు భజనలు మొదలగుసేవలు మిగులభక్తిశ్రద్ధలతో జరుపఁబడుచున్నవి. ఈ పీఠమును గాంచినవారెల్లరును సుబ్రహ్మణ్యకవినిఁ గాంచినట్లు సంతసింపుచున్నారు.

ప్రభువంశవృక్షము

దామర తిమ్మానాయనింవారు. వీరికి కుమార వేంకటప్ప నాయనింవారు (అగ్రహారదాత). వీరికి తిమ్మానాయనింవారు. వీరికి పెదవేంకటప్పనాయనింవారు. వీరికి తిమ్మానాయనింవారు. వీరికి వేంకటప్పనాయనింవారు. వీరికి, (1) ముద్దు వేంకటప్పనాయనింవారు, (2) తిమ్మానాయనింవారు, (3) చెన్నప్పనాయనింవారు, (4) గంగాపుర రామానాయనింవారు, (5) శేషాచలపతి నాయనింవారు, (6) చిన వేంకటప్పనాయనింవారు. వీరిలో మొదటివారికి అక్కప్పనాయనింవారు రెండవవారికి వేంకటలింగమనాయనింవారు ప్రస్తుత ప్రభువుగారు.

సుబ్రహ్మణ్యకవి స్తోత్ర పంచరత్నములు

సీ. శ్రీరామపాద రాజీవముల్ భజియించి
యిహపరసుఖముల నెసఁగితీవు
అధ్యాత్మ రామాయణార్థగీత గ్రంథ
కర్తవై సత్కీర్తిఁ గాంచితీవు
సంగీతసాహిత్యశాస్త్ర బ్రహ్మజ్ఞాన
విదుఁడని బుధులెన్న వెలసితీవు
మునిపల్లెపంకి పావనమూర్తివై రాజ
వరసభాపూజల వరలితీవు.
తే.గీ. ములికినాటి మహీసురముఖ్యుఁ డనఁగఁ
హారితమునివర్యగోత్రజుఁ డనఁగఁ బరఁగి
పరనివాసుఁడవౌ నిన్నుఁ బ్రస్తుతింతు
కవిశరణ్య! సుబ్రహ్మణ్య కవివరేణ్య!
శా. బ్రహ్మజ్ఞుండనుచుం బ్రహ్మవిదులున్ బ్రఖ్యాతుఁడౌ సత్కవి
బ్రహ్మన్‌బోలు కవీంద్రుఁడంచుఁ గవివారం బుజ్వలద్గాయక
బ్రహ్మతో ప్రక్కపుఁడంచు గాయకులు స్తోత్రం బెల్లెడన్ సేయఁగా
బ్రహ్మక్షేత్ర్యయశంబుఁ గాంచితివి సుబ్రహ్మణ్య విద్వన్మణీ!
సీ. మెప్పించితివి కదా మృదులకావ్య మొసంగి
తిరుపతి వేంకటేశ్వరుని మొదల
పట్టించితివి కదా బ్రహ్మరథంబును
వేంకటేశునమ్జ్ఞఁ గొంకులేక
గడియించితివి కదా గ్రామముల్ రెండు శ్రీ
కాళహస్తి నృపాలు గౌరవమున
వెలయించితివి కదా కలకాలము రహింప
మహిత సీతారామ మందిరంబు
తే.గీ. రామకథగాన కృతిఁ జేసి రక్తి వెలయ
నిలనుఁ గల్పించితివి కదా పలువురైన
గాయకాళికి జీవనోపాయ మొకటి
కలితపుణ్య సుబ్రహ్మణ్య కవివరేణ్య!
మ. హరిభక్తుల్ సుకవుల్ బుధోత్తములు బ్రహ్మజ్ఞాను లౌవార లెల్లరు దర్శించి నినుందలంచి పరమాహ్లాదంబు నొందంగ సుస్థిరమై మెప్పగఁ గాళహస్తినిఁ బ్రతిష్ఠింపించితౌ రాఘవేశ్వరపీఠంబు భవత్ప్రపూజితము సుబ్రహ్మణ్యధీరోత్తమా!
క. అబ్బంబగు నీ మహిమను
నేఁ బ్రస్తుతిసేయ నేర్తునే కవిబుధులెం
తేఁ బ్రాంజలిడఁగ మునిపలి
సుబ్రహ్మణ్యాభిధాన! సుగుణనిధానా!

శ్రీమతి చిరుమామిళ్ల రాధాబాయమ్మగారు, శాఖమూరు లక్ష్మీదేవమ్మగారు



Sreemathi Sakhamooru Lakshmidevamma garu
& Chirumamilla Radhabayamma garu

శ్రీయుత త్రిపురనేని చలమయ్యగారు, ప్రసాదరావుగారు.



Sjt. Tripuraneni Chalamayya garu
& Sjt. Prasadarow garu

సయ్యద్ అహమ్మద్ అలీషాఖాదర్‌వలీ యోగిగారు




Sayyad Ahammad Alisha Khader Valiyogi garu

శ్రీయుత రాజవైద్య కోలా అప్పలనరసింహదేవుగారు,
ఆదిక్షత్రియ పత్రికాధిపతి, రాజమహేంద్రవరము



Sjt. Kola Appala Narasimhadevu garu
Editor, Adikshatriya Patrika, Rajahmundry

శ్రీకాంచీ కామకోటి పీఠాధిప జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్ర
సరస్వతీ శ్రీపాదులవారు, కుంభకోణము



శ్రీయుత పిశుపాటి చిదంబరశాస్త్రిగారు



Sjt. Pisupaty Chidambara Sastry garu

శ్రీయుత తిమ్మన వెంకటరత్నముగారు, స్వచ్ఛందసైనికపరినాయకుడు,
ఆంధ్రమహాజనసభ, మద్రాసు



Sjt. T. Venkataratnam garu
Captain Volunteer, Andhra Conference, Madras

శ్రీయుత నూతులపాటి నరసింహచౌదరిగారు, సీతశిల్పి



Sjt. N. Narasinha chowdary garu, Sitasilpi

# విజయనగరరాజులమతము

[శ్రీకృష్ణరాయలవఱకు]

(The Religion of the Vizianagar Emperors up to Sri Kishna Raya.)

కుందూరి ఈశ్వరదత్తు గారు బి. యే.,

విజయనగరసామ్రాజ్యమును గుఱించి 'విస్మృత సామ్రాజ్య'మను వర్ణమిచ్చు 'ఫర్గాటన్ ఎంపైర్' [1] అను గ్రంథమును వ్రాసిన స్యూయల్ పండితుఁడుకాని తరువాత మాఁడేండ్లకు 'శ్రీకృష్ణదేవరాయ చరిత్రము' వ్రాసిన సుప్రసిద్ధాంధ్రచరిత్రకారుఁడును, అస్మద్గురువులుఁడునైన శ్రీచిలుకూరి వీరభద్రరావు పంతులుగారు కాని, విజయనగరరాజ్యచరిత్రముపై నిటీవల రెండుమూఁడు గ్రంథముల విరచించిన డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారుగాని, తద్రాజ్యము నేలిన మహారాజులమతమెట్టిదో, ఆకాలము నాఁటి ప్రజల మతాభిప్రాయము లెట్టివో విస్తరించి యేమియును వ్రాయలేదు. ఆయాకాలముల నాఁటి ప్రజల మత సాంఘిక రాజకీయార్థిక పరిస్థితులఁ జర్చింపని చరిత్ర చరిత్రకాదు.

నేనిటీవల కార్యాంతరమున శీర్ణకర్ణాట రాజధానియగు 'హంపి-విజయనగరము' యొక్క శిథిలములను జూడఁబోవుట తఁగినదుగ్రహము వలనఁదటస్థపడుటయు, నప్పుడ నొకచోట శివాలయములను ఒకవైపు విష్ణ్వాలయములను మఱియొకవైపు జైనదేవాగారములను, ఎక్కడఁ జూచినను నాగశిలలను, గణపతి మారుతి విగ్రహములను జూచుటయు సంభవించెను. ముఖ్యముగా విష్ణ్వాలయములు లెక్కకు మించియున్నవి.

ప్రస్తుత మీవ్యాసమునందు విజయనగరరాజులమతమును గుఱించి నాకు లభించిన ఆధారముల ననుసరించి నాయభిప్రాయముల నాంధ్ర పాఠక మహాశయులకుఁ దెలుపఁ బ్రయత్నించు చున్నాఁడను.

## సంగమవంశము

విజయనగరసామ్రాజ్య మేలిన సంగమ వంశజులైన హరిహర బుక్కరాయాదులు శైవులుగఁ గన్పట్టుచున్నారు. ప్రథమ హరిహర రాయలును, వీరబుక్కరాయలును శైవాగమతంత్రవేదియగు కాశీవిలాస క్రియాశక్తి గురువకు శిష్యులు. ఆదిశంకరులు తరువాత శంకరాచార్య పీఠము నధిష్ఠించినవారిలో మహామహిమాఢ్యుఁడును, విద్యానగర నిర్మాణకారకుఁడును నగు మాధవ విద్యారణ్యులు శిరమంత్రి. శైవాగమతంత్రజ్ఞుఁడైన మాధవమంత్రి బుక్కరాయల సేనానాయకుఁడు, బుక్కరాయలు సర్వజ్ఞ బిరుదాంకితుఁడును, ఉదర హరివంశ కృతికర్తయు నైన నాచనసోమునకుఁ బంపాక్షేత్రంబునకునుండిన శ్రీ విరూపాక్షస్వామిసన్నిధిని శా. శ. ౧౨౯౭ రాక్షససంవత్సర చైత్రశుద్ధ నవమినాఁడు శివాశీర్వాదమునందు పంచాక్షరదివ్యయను గ్రామమునకు బుక్కరాయపురమని నామాంతరము గల్పించి ధారపోసి శాసనము వ్రాయించెను. ఈ వంశమునకు విరూపాక్షస్వామి కులదైవమయినట్లు తోఁచుచున్నది. అదిగాక బుక్కరాయలు శైవమతావలంబియైనను పరమత ద్వేషములేనివాఁడైనట్లు తెలియుచున్నది. ఇతని కాలమునందు 1368 సంవత్సరమున శ్రావణబెళ్గొలయను పట్టణమున వైష్ణవులకును జైనులకును వివాదములు సంభవించినప్పుడు తాను మధ్యవర్తిగనుండి యుభయుల కనుకూలముగాఁ దగుతీర్పు చెప్పెను. 2

బుక్కరాయల తరువాత నతనికుమారుఁడైన రెండవ హరిహర రాయలుపరమతములందు వైమనస్యములేక ప్రజారంజకుఁడై పాలించెను. ఇతఁడు శైవుఁడు-కాని యితఁడు మతాంతరులగు జైనులను నెరము పరిపాలనమునందున్నతపదవుల నిచ్చెను. ఇతని సేనానాయకుల లో నొక్కఁడగు ఇరుగప్ప దండాధిపుఁడు జైనమతస్థుఁడు. జైనాలయమునుగూడ నిర్మించెను. 3 తరువాత ౧౪౨౨ — ౧౪౪౭. వఱకు పాలించిన ప్రౌఢదేవరాయలు జైనమతాభిమానియైనట్లు కనఁబడుచున్నది. శా. శ. 1349 కి సరియైన పరాభవనామ సం. కార్తీక

1 స్యూయల్ పండితుఁడు తన 'ఫర్గాటన్ ఎంపైర్' అను గ్రంథమును కొన్ని సంస్కరణములతో మఱల క్రిందటి సంవత్సరము ప్రచురించెనని తెలియవచ్చుచున్నది.

2 'Hampi Ruins' by Longhurst, Page 26. ఆంధ్రులచరిత్రము, మూఁడవభాగము పేజి 371.

3 1. His name appears on a pillar in a Jain temple near Kamalapura at Vizianagar in an inscription bearing date 13 85 A. D.; which proves that the king was tolerant in religious matters. (Forgotten Empire Page 48.)

2. He (Harihara II) was a worshipper of Siva under the form Virupaksha, but appears to have been singularly tolerant of other religions. Ibid Page 49.)

(3) ఆంధ్రుల చరిత్రము. మూఁడవభాగము పుట 373.

పౌర్ణమినాఁడు వ్రాయించిన శాసనముఁబట్టి జైనాలయమొక్కటి యితఁడు నిర్మించినట్లు తెలియుచున్నది.[1] నేటికిని పెక్కులైన దేవాలయములు పంపాతటమునకున్న హేమకూటాద్రి మీఁదను, విఠ్ఠలస్వామి దేవాలయమునకుఁ బోవుమార్గమునందును, మాతంగపర్వత సమీపమునను గాన్పించుచున్నవి. దీనినిబట్టి విచారింపఁగా ఈ జైనాలయముల నిర్మాణమునకు అప్పటి విజయనగరరాజుల పరమతాభిమానము నిష్పక్షపాతబుద్ధియేయని స్పష్టము. ఈ దేవాలయములు ముఖ్యముగా సంగమరాజవంశమునకుఁ జెందిన రాజశిఖామణుల కాలమునందును, అంతకుఁబూర్వము జైనమతము దక్షిణ హిందూదేశమునందుఁ బ్రబలియుండి నప్పుడును నిర్మింపఁబడి యుండవలెను. తరువాత విజయనగరరాజ్యమేలిన సాళువవంశరాజులుగాని తుళువాన్వయ ప్రభువులుగాని జైనమతమునందు శ్రద్ధదీసికొనినట్లు కనఁబడదు. అదియుఁగాక జైనమతము పూర్తిగా క్షీణించినది. నేటివఱకును బళ్లారిజిల్లాలో నక్కడక్కడ జైనమతస్థు లున్నారు.

## సహగమన దురాచారము

ఈకాలమునందు ప్రజలయందు సహగమనదురాచారము ప్రబలియుండినట్లు నిదర్శనములు కలవు. అందొక్కటి ప్రథమహరిహరరాయలకాలమునాఁటి శాసనము. అందు మాలగౌడు అనువాఁడు చనిపోయినట్లును, అతనిభార్య సహగమనముచేసి స్వర్గస్థురాలైనట్లును వ్రాయఁబడినది. ఇది ఆంధ్రులచరిత్రము మూఁడవభాగమునందు పేర్కొనఁబడినది కాని, ఆంధ్రచరిత్రకారుఁ డేకారణమువల్లనో విస్తరించి యీ విషయమై వ్రాయలేదు.

ఇదిగాక సహగమనమును సూచించుచిత్రములు రాళ్లపైఁ జెక్కియుండఁ, హంపియందు పెక్కులు నేను నాకళ్లారఁ జూచితిని. అవి కృష్ణాపురమునకుఁబోవుదారిలో ఉద్దండ వీరభద్రుని దేవళముదగ్గఱ కలవు. హంపికిఁబోవు రాజమార్గము పడమటిప్రక్కనుగూడ కలవు. ఇట్టి శిలలు కల్గుటకుఁ గారణము ఆకాలమునందు ఈదురాచారము ప్రబలియుండవలెను. ఇట్టి సహగమనములు రాజనగరునందుఁగూడ జరిగియుండవలెను. ఇందుకు నిదర్శనముగాఁ దలారిగట్టుకు సమీపమున నింబాపురము దగ్గఱ ఎముకలు, బొగ్గుతోఁగూడియుండు పెద్దదిబ్బ యొక్కటి కలదు. అది ప్రస్తుత మిక్కడిజనులు వాలిని (సుగ్రీవుని సోదరుఁడు) దహనము గావించిన స్థలమని చెప్పెదరు. పదునాఱవశతాబ్దమున న్యూనిజ్ 'సహగమనము' విషయమై తాను కన్నారఁగాంచినట్లు ఒకవర్ణన గావించినాఁడు. అందులో నిట్టికార్యములు సాధారణముగా నొక్కచోటనే కావింపఁబడునట్లు వ్రాసియుండుటచే నీబొగ్గులదిబ్బ సహగమనము గావించెడు శ్మశానవాటికయైయుండును. ఈవిషయమై 'హంపిశిథిలములు' (Hampi Ruins) అను గ్రంథమువ్రాసిన (Longhurst) లాంగ్‌హర్‌స్ట్ దొరగారిట్టి యభిప్రాయము పడియున్నారు.[3] విజయనగరమేలిన రాజులు సహగమన దురాచారము నేల మాన్పక యూరకుండిరో తెలియదు. రాజులు సమ్మతింపక యుండినచో నిట్టి దుష్కృత్యములు దేశములో జరుగుటకు వీలుండునా! న్యూనిజ్ వ్రాసిన సహగమన వృత్తాంతము మా చదువరులకుఁ దెలియుటకై ఈవ్యాసమునందే పేర్కొనుచున్నాను.

'ఈదేశమునందు స్త్రీలు భర్తలు మరణమునొందినపుడు వారలతోఁగూడ దాము తగులంబడుట వాడుకగా నుండుటయేకాక యందువలనఁ బుణ్యముకలుగుననియు గౌరవమువచ్చుననియు నమ్ముచున్నారు. వారిభర్తలు చనిపోయినప్పుడు బంధువులతోఁగలసి దుఃఖింతురు... ఏడ్పులు ముగిసినతరువాత వారలబంధువులు సహగమనము చేయవలసినదనియుఁ గులమున కపకీర్తినిదేవలదనియుఁ బ్రోత్సాహపఱతురు...... వానిభార్యను ఒక పనికిమాలిన గుఱ్ఱముపైఁ గూర్చుండఁ బెట్టెదరు. ఒక చేతిలో నద్దమును, రెండవచేతిలోఁ బూలమాలనుఁ బట్టుకొని పెక్కువాద్యములతోను సంతోషసాగరనిమగ్నులగు బంధుబృందముతోను ప్రేతభూమికి నూరేగుచుఁ బోవును......శవము పూర్తిగా తగులంబడినతరువాత మృతునిభార్య పరమానందముతో వచ్చి కాళ్లుగడుగుకొని నిలుచుండును. అంతట నొకబ్రాహ్మణుఁడువచ్చి తమశాస్త్రప్రకారము మంత్రములను జపించును. ఈకర్మకాండ ముగిసినతరువాత .........ఆమె పసుపుబట్టలనుగైకొని తనబంధువు లొకచెయి పట్టుకొనఁగా రెండవచేతిలో రొట్టెగైకొని గోతివద్దకుఁ బాటలుపాడుచు పఱుగులిడుచువచ్చి గోతిచుట్టును మూమ్మాఱు ప్రదక్షిణములుచేసి యాగోతిని గట్టిన తిన్నెపైకెక్కి నిప్పుగనుపించకుండఁ గండ్లకుఁ జాఁపకట్టఁబడియుండఁగా నిలువంబడి యుండును. ముందుగా నాగోతిలో బియ్యము మూటగట్టఁబడిన వస్త్రమును, తమలపాకులు, దువ్వెన, అద్దము కట్టఁబడిన వస్త్రమును వానిలో వైచెదరు. తరువాత నామె యెల్లవారియొద్ద సెలవుగైకొని తలనిండ చమురునిముడుకొని యద్భుతములగు ధైర్యసాహసములతో గోతిలోనికి దుముకును. దుమికినవెంటనే బంధువులు కట్టెలతో నామెను గప్పెదరు.........దహనమైన తరువాత పెద్దపెట్టున నేడ్తురు. రాయలు మృతుఁడైనయెడల రాణులెల్లరు నిట్టులనే చేయుదురు. దేశమునందంతట నీదురాచారమే ప్రబలియున్నది.[4]

1 Forgotten Empire Page 78.

2 Epigraphia Carnatica Vol. VIII. St 104. Archaeological Survey of India 1907-1908. The first Vizianagar Dynasty, Viceroys and ministers. Page 240. by H. Krishnasastri. ('A Jaina Sasana dated S 1276 (Vijaya) or A. D. 1354 from Soraba distinctly says in that year when Mahamandaleswara Hariappa Odeyar was ruling the kingdom, Malagowda died and his wife Chennakka went to Swarga (Heaven) by her sahagamana 'Seti.'

3 Hampi Ruins Page 41. The spot where these cremations took place was in all probability at Nimbapuram close to Talarigattu; where there is a large cinder mound covered over with rank vegetation and trees of considerable size. This mound is composed of alternate layers of slaglike cinders and ashy earth mixed with small frag-ments of calcined bone and there is no doubt that it represents the remains *of those slain in battle or else the recognised 'seti' ground of old city.* It will be noticed that Nuniz States' 'at the place where they are all burned,' thus indicating a place where they are always burned.

4 కర్ణాట రాజ్యచరిత్రము—శ్రీ వీరభద్రరావుగారు. పుట 245—247.

## సాళువవంశము

సంగమవంశ రాజులలోఁ గడపటివాఁ డగు విరూపాక్షరాయలు దుర్బలుఁడై రాజ్యపరిపాలనమునకుఁ దగక ప్రజలకు నిష్టుఁడు కాకపోవుటచేత, నతని దండనాయకులలోఁ బ్రసిద్ధిగాంచిన సాళువనరసింహరాజాతనిని జంపించి రాజ్యమాక్రమించుకొనెను. ఈసాళువవంశమునుగుఱించి మనకు 'జైమినిభారతము, వరాహపురాణము, సాళువాభ్యుదయము' మొదలగుగ్రంథములయందుండి కొంచెము తెలియుచున్నది. మొదటి రెండుగ్రంథము లాంధ్రకావ్యములు. ఈ వంశపు రాజులు వైష్ణవమతస్థులుగఁ గన్పట్టుచున్నారు.

ఇందుకు నిదర్శనములు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికృత 'జైమినీభారతము'నందె కాన్పించుచున్నది. ఇది విజయనగరరాజ్య మేలిన సాళువనరసింహరాజున కంకిత మీయఁబడినది. కృతిపతివంశమును వర్ణించుచు కృతిపతితాతతండ్రియగు సాళువమంగిరాజు నిట్లభివర్ణించియున్నాఁడు.

సీ. దురములో దక్షిణసురతాను నదిరించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్చాదికేలు
మాడ లద్దేవునమ్ముడికి నొసఁగె

పైని వివరింపఁబడిన సీసపద్యము మూఁడవపాదమువల్ల నతఁడు వైష్ణవమతాభిమానియైనట్లు స్పష్టము. కృతిపతి యైన సాళువ నరసింహరాజు వైష్ణవమతాభిమానియైనట్లు కనఁబడుచున్నది. నరసింహరాజు కృతికర్తతో నిట్లు పలికినట్లు కవిచెప్పినపద్యము:

కం. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమినిభారతమనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్. (1)

(2) ద్వితీయాశ్వాసము మొదటి పద్యమునందుఁ గవి కృతిభర్తను సంబోధించినవిధము;

కం. శ్రీరమణిచరణకలిత వి,చారణపరధియుదఖడ్గశార్దూలమహో
ధారానఖముఖదారిత, వీరారికురంగ గుండవిభునరసింగా!

(3) పంచమాశ్వాసము మొదటిపద్యము;

కం. శ్రీవేంకటాద్రినాథ ద,యావర్ధితరాజ్య సన్నుతార్థిజనమహో
దేవాగవైరి నృపరా,జీవనికరచంద్ర నారసింహనరేంద్రా!

(4) షష్ఠాశ్వాసము మొదటిపద్యము:

కం. శ్రీరామాయణభారత, చారుతరకథా సుధాప్రసన్న మనఃపం
కేరుహ యసమాన జయ,శ్రీరుచిరనివేశ నారసింహమహీశా!

ఇతఁడు శ్రీతిరుపతివెంకటేశ్వరస్వామికి అయిదుగ్రామములు దానముచేసిన ట్లొకశాసనము వల్లఁ దెలియుచున్నది.[2] కాని యితఁడు వీరవైష్ణవుఁడుగాక పరమతస్థులయందుఁగూడ నభిమాన ముంచినట్లు జైమినీభారతములోని యీక్రిందిపద్యమువలనఁ దేటపడఁగలదు.

మ. శివరాత్రి ప్రమదావలోకవశత స్వేష్టోజ్జ్వలత్కన్యకా
ధవసేవానుగ వాలుకాగణన భక్తవ్రాతయాత్రాసము
ద్భవభారాపగమ ప్రమోదభరదృప్యద్రాజ్యతాహార్యవై
భవలీలాపరపాకశాసనవచః పర్యాయపద్మాసనా!

(చతుర్థాశ్వాసము - పద్యము 143)

## తుళువవంశము

విజయనగరరాజ్య మేలిన తుళువవంశపు ప్రభువులు వైష్ణవమతాభిమానులు. అందుకుఁ బ్రమాణములు వారలు కృతినొందిన తెనుఁగు కావ్యములు. వీరలకు శ్రీ తిరుపతివేంకటేశ్వరస్వామి యిష్టదైవము. సాళువనరసింహరాయలయొద్ద సేనాధిపతిగనుండిన తుళువ నరసింహరాయలు (కృష్ణదేవరాయని తండ్రి) నందిమల్లయ్య, ఘంట సింగయ్య, కవులచే రచింపఁబడిన వరాహపురాణమునకుఁ గృతిభర్త. ఈక్రిందిపద్యములవల్ల యితఁడు వైష్ణవుఁడని తోఁచుచున్నది.

(1) కం. శ్రీ వెంకటాద్రిపతిసం,సేవా! హేవాకనిపుణ శేషాహిఫణా
శ్రీవినమదకరకరి సే,నావిభ్రమ యీశ్వరేంద్రునరసింహ నృపా!

వరాహ పురాణము ఆ. 2; ప. 1.

(2) శా. పుంభ్రాగామ్యవతంస వైష్ణవకథాపూతాత్మ ... ....... ...

ఆ. 4; ప. 173

(3) మ. కృతనారాయణ పాదపూజన జనక్షేమ క్రియాభోగ......

ఆ. 6; ప. 186

(4) కం. శ్రీరామా వసుగుణ ల
క్ష్మీరామా రమణభక్త......... ఆ. 111; ప. 1

తా నెంతటి విష్ణుభక్తుఁడైనను హరిహరభేదము లేనివాఁడయినట్లు వరాహపురాణమునందె కవు లిట్లు వ్రాసియున్నారు.

కం. శ్రీద సవనభుగ్భూజాం
భోదసమత్యాగ మధురిపుత్రిపురహరా
భేదసపర్యాచర్యా
హ్లాదసమేతాత్మయీశ్వరాధిపు నరసా.

అష్టమాశ్వాసము-మొదటిపద్యము.

[ఆంధ్రభోజుఁడని ప్రఖ్యాతిగాంచిన(ఈతుళువ నరసింహరాయలకుమారుఁడు) శ్రీకృష్ణదేవరాయలయొక్క- మతమునుగూర్చి ఆంధ్రసర్వస్వము సంపుటము ౧, సంచిక ౯ యందు జూడునది.]

1 A Little known Chapter of Vizianagar History by S. Krishnaswami Ayyangar, Page 41. 'They seem to have had their head quarters at Chandragiri and *appear to have been Vaishnavas.*'

2 250 of 1904. (A little known chapter of Vizianagar History Page 80.) Saka 1389 (A. D. 1467). Tirupati-Gifts of 5 Villages Sarvajit *by Saluva Narasingadeva Maharaja.*

# అతిదుఃఖితయగు సీత

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు, బి. టి. యస్.

సలిల మొక్కట నింకిన సరసిమాడ్కి
విస్మృతిని జెంది ఖిలమైన విద్యపోల్కి
మంచుచే సొంపుచెడిన తామరవిధాన
నిట్లు కీడ్పడియుంట యదేల తల్లి?

చలువ పైకొన్న పావకజ్వాలవోలె
గాఢతిమిరావృతంబగు కాంతివోలె
నుద్ధతినిజూపు దుఃఖంపుటార్మివోలె
నిట్లు దైన్యవృత్తిని బొంద నేలతల్లి?

కడలి, దుస్తరభంగసంఘములనడుమ
ఘోరమున నీటమున్గెడు పడవమాడ్కి
నశ్రుజలపూర్ణమగు నీముఖారవింద
మిట్లు దుఃఖాబ్ధిఁ గ్రుంకు టదేలతల్లి?

నలఁగి యెంతయు మాసినవలువ గట్టి
శోభదొఱఁగ నలంకారశూన్య వగుచు,
సారవిహీనమగు నొక్కసరసివోలె
జాలిఁ గొల్పుచు నిట్లుండ నేల తల్లి?

నందనమున నుండెడు సురనారిపగిది
నీవశోకవృక్షపునీడనే వసించి
విజనకాంతారభూమిని విడువఁబడిన
బాలికవలె నిట్లు విలపింప నేల తల్లి?

గగనమున వెల్గు గంధర్వనగరమట్లు
తోఁచిన విచిత్రమృగమును జూచి, శంక
పొడమ, సౌమిత్రి చేయు సదుపదేశ
పొందిన విమోహముఁ దలంచి కుందెదొక్కొ!

ధవుని యార్తనాదముఁ బోలు రవ మెసంగఁ
జపలవై రోదనమున బాష్పములఁ దోఁగి
నాఁడు లక్ష్మణార్యుని దూలనాడినట్టి
కల్పిత క్రియ నెంచి దుఃఖింతువొక్కొ!

రాక్షసుమాయ లెఱుఁగక భిక్షునేపి
నసురరాజేంద్రు నర్ఘ్యపాద్యాదివిధుల
భక్తి నర్చింపఁ, గనినదౌర్భాగ్యఫలముఁ
గొంత మదినెంచి యిట్లు శోకింతువొక్కొ!

ఉరుబలోపేతుఁడగు జటాయువుమహేంద్ర
పర్వతమువోలె రాక్షసప్రభుని దాఁకి
ప్రీల మేను నీకయి నేలఁ దూలిపడుట
స్వాంతమునఁ దలపోసి చింతింతువొక్కొ!

రామునిఁ బాసినట్టి యారటముచేత
సర్వసుఖములకును జలాంజలి యొసంగి
విభుని తేజంబె యెపుడు భావించుకొనుచు
నువిద! దుఃఖంపుతుదఁ గానకుంటివొక్కొ!

లోహితాంగ గ్రహమ్మున రోహిణీమ
తల్లి పీడితమైన చందమున, నీవు
రావణుని బారిఁ జిక్కి విరక్త వగుచు
నిట్లు దుఃఖభాజనవైతి వేమొ చెపుమ.

రావణుం డాడినట్టి దుర్భాషణములు
రాక్షసీతర్జనాదు లారావములును
శరములై నాఁటఁ బీడితస్వాంత వగుచు
నిట్టు లార్తిఁ గుందుచునుంటి వేమొ చెపుమ!

కాంత నవ్యమృణాళసంకాశమగుచుఁ
దనరు సుకుమార కంఠసీమను మనోజ్ఞ
కేశపాశమ్ము బిగిచి, వికీర్ణసార
సాస్యవయి, ఘోరమరణ మిూవంద నేల?

చండవిక్రముఁ డగు రాఘవుండు విభుఁడు
భండనోద్దండబాహుబలుండు మఱది
యురుఫలీకృత సకలకార్యుండు మంత్రి
గాఁ నీకు దుర్మరణంబు కాంత! తగునె?

నీకుఁగానె మహారణ్యలోకమెల్ల
సమత వర్తించి, యుల్లగండములఁ గడచి
నీకృపాదేశమునకు వినీతుఁ డగుచు
దరిని నేల్మోడ్చియున్న కింకరునిఁగనుము.

వాఁడె నీబంధనము దుల్చువాఁడుగాన
వాఁడె నీకు స్వాస్థ్యముఁ గూర్చువాఁడుగాన
వాఁడె నిను బతికడఁ జేర్చువాఁడుగాన
వానిఁ గనుమమ్మ! దీవించి వలుమమ్మ!



# శాసనావళి

సి. ఆర్. కృష్ణమాచార్యులు గారు

గత సంవత్సరాది సంచికలో 1921-22 సంవత్సరమున చెన్నరాజధాని శాసనశాఖవారు జరిగించిన శాసనపరిశోధనలోని ముఖ్యాంశములను వివరించి యుంటిమి.

ఆ వివరణయందే ప్రతి సంవత్సరాది సంచికయందును తత్పూర్వము వెలువడిన శాసనశాఖయొక్క వార్షిక నివేదికలోని ముఖ్యాంశములను విమర్శించుట యుక్తమని హెచ్చరించియుంటిమి. ఇటీవల కొందఱు మిత్రు లట్లు చేయుట ఆంధ్ర ప్రపంచమునకు చాల నుపయోగముగ నుండునని తెలియజేసియున్నందున యీ సంచికయందు [illegible]2-23 సంవత్సరమునకు యీశాఖవారి వార్షికనివేదిక[illegible]లోని సదంశముల నీవ్యాసమందు పేర్కొనదొడగినారము.

ఈసంవత్సరమున నీశాఖవారు 683 శిలాశాసనములను చెన్నరాజధానిలోని యఱవ తెనుగు కన్నడ జిల్లాలలోనుంచి సేకరించియున్నారు. ఇవిగాక 1921-22 సంవత్సరమున సేకరింపబడినవానిలో 80 శాసనములు కూడ యీసంవత్సరపు నివేదికలో విమర్శింపబడియున్నవి. మొత్తముమీద 1922-23 సంవత్సరపు నివేదికలో 763 శిలాశాసనములను గురించి ప్రసంగించియున్నారు. ఇవిగాక 15 తామ్రశాసనములనుగూడ పరీక్ష చేసి యిందు విమర్శించి యున్నారు.

తొలుత నీతామ్రశాసనముల లోని ముఖ్యమైన చారిత్రకాంశముల నొకింత చెప్పెదము. ఈపదియేను శాసనములును నివేదికకు ప్రథమానుబంధము (Appendix A) లో వివరింపబడియున్నది. దీనిలో తొలినాలుగును వట్టెలుత్తు, అను నొకవిధమైన వట్రువాతురములలో నఱవ భాషలో వ్రాయబడియున్నవి. ఇందు చారిత్రిక విశేషము లెవ్వియును గనుపించవు. ఇవి తిరునెల్లియను గ్రామమున దొరకినవట. ఇందుకు నిదర్శనముగ యీశాసనములలో తిరునెల్లిఆళ్వాన్ తిరునెల్లియూ ర్దేవర్ అను దేవనామములును, తిరునెల్లి, నెల్లికున్ఱమను గ్రామనామములును గానవచ్చుచున్నవి. దేవునికి 'దేవదేవేశన్' అను నపరనామమున్ను కనబడుచున్నది. తామ్రశాసనావళిలో అయిదవది వెనుకటిపల్లవరాజులలో నొకండైన కోవిజయనందివిక్రమవర్మన్ అను ప్రభువుయొక్క దానశాసనము. ఇది యితని 61 వ రాజ్యసంవత్సరములో పుట్టినది. ఈశాసనోద్దేశమేమన మంగలనాడాళ్వాన్ అనువాని విజ్ఞప్తిప్రకారము నల్లూరుఅను గ్రామమున కొంతభూమిని ప్రత్యేకముగ బ్రహ్మదేయముగావించి పట్టత్తాల్ మంగలం అనుపేరిట కొంతమంది బ్రాహ్మణులకు శాశ్వతదానముగ నొసంగుట మంగళనాడాళ్వానునకు మంగలరాష్ట్రభర్త, మంగలజనపదభర్తయనుసంస్కృతబిరుదము లివ్వబడియున్నవి. శాసనమునకు "అజ్ఞప్తి" అనగా ప్రకటించినయధికారి ఆలప్పాక్కం అను గ్రామమునకు సంబంధించిన విజనయల్లుటాఱ అనునతడు శాసనలేఖకుడు శ్రీదండి. ఇతడు కచ్చిప్పేడు (అనగా యిప్పటికాంచీపురము) లోని ఐంబనైచ్చేరికి సంబంధించిన విడేల్విడుగు పల్లవపెరుందచ్చన్ అను కంసాలియొక్క కుమారుడు.

ఈశాసనపురేకులు తంజావూరుజిల్లా తిరుత్తురైప్పూండి తాలూకాలోని కొత్తమంగలం గ్రామమునకు శివారైన పళ్ళికోయిల్ అను నుపగ్రామమున పదియేండ్లక్రింద భూమినుంచి త్రవ్వబడినది. ఇందు విష్ణ్వాదిగ పల్లవులవంశానుక్రమము వర్ణింపబడి యున్నది. వీరకూ

ర్మాది పల్లవప్రభువులయనంతరము హిరణ్యవర్మయను రాజు రాజ్యముచేసెను. ఇతనికి తర్వాత నందివర్మ సింహాసనము నెక్కెను. ఇతడు బాల్యముననే పరనృపతులను జయించి రాజ్యభారమును వహించినట్లు చెప్పబడియున్నది. ఇతనిచేత పరాజితులలో వల్లభ, కళభ్ర, కేరళ, పాండ్య, చోళ, కొంకణ రాజులు ముఖ్యులు. ఈరాజు చిన్నవయస్సుననే రాజ్యభారమువహించినందున యితని రాజ్యకాలము సుమారు 65 సంవత్సరములుగ నుండినట్లు నిదర్శనములు గలవు. మహాబలిపురములోననే నందిపోతవర్మయనుపేరిట యీరాజుయొక్క 65 వ రాజ్యసంవత్సరపు శాసనమొకటి (1922 సం॥ 666 శా) దొరకియున్నది. ఇతడు పల్లవవంశావళిలోని మూడవనందివర్మయగుచున్నాడు. శాసనమున ప్రారంభకస్తుతివిష్ణువును గొనియాడుచున్నది.

6,7 సంఖ్యలుగల తామ్రశాసనములు తరువాయి విజయనగరరాజులలోని వెంకటపతిరాయలచేత నివ్వబడిన దానశాసనములు. ఇందు మొదటిది శాలివాహనశకము 1513 (అనగా క్రీ. శ. 1591-92) సంవత్సరమునను రెండవది ఆశకము 1534 (అనగా క్రీ. శ. 1612-13) సంవత్సరమునను పుట్టినవి. తొలిది, అహోబలేశభూపాలుని కుమారుడును చంద్రగిరి ప్రభువును నైన చెంచభూపాలుని విజ్ఞప్తిప్రకారము చెంచసముద్రమను గ్రామము బ్రాహ్మణులకు దానముగ నివ్వబడినట్లును దానముపొందినవారిలో ననేకులు శబ్దశాస్త్రవేత్తలును జ్యోతిః శాస్త్రవేత్తలును నున్నట్లు చెప్పుచున్నది. రెండవది చంగలిపట్టు సీమలోని మురుగమంగలము అనుగ్రామము గోపాలసముద్రమను పేరిట, హారితగోత్ర, ఆపస్తంబసూత్ర, యజుశ్శాఖాధ్యాయియైన రామకృష్ణజోస్యులకు సర్వమాన్యముగ నివ్వబడినట్లు తెలుపుచున్నది. రామకృష్ణజోస్యులు స్వరమండలంవంశీయుడైన లింగనారాధ్యుని పౌత్రుడు, మల్లికార్జునారాధ్యగంగాంబికలపుత్రుడు. ఇతడు వేద, వేదాంగ, తర్క, స్మృతివేత్తయు; సూర్యసిద్ధాంత ప్రవీణుడును. ఈదానము (తిరుపతి) వేంకటేశస్వామివారి సన్నిధిలో చేయబడెను. వెనుకటి విజయనగరరాజులదానము లనేకములు ప్రాయశః శ్రీవేంకటేశ్వర సన్నిధిలోననే జరిగినవి.

8 వ సంఖ్యగల తామ్రశాసనము చరిత్రకుపయోగమైనది కాదు. ఇది బాపట్లతాలూకాలోని ఉప్పుటూరుగ్రామమున శ్రీఉరుమా శివశంకరరావుగారివద్ద నుండినది. దీనివహింనిబట్టి యిది కేవలము కృత్రిమశాసనమని చెప్పవచ్చును. ఈకల్పన పదియేనవ శతాబ్దమున రాజ్యముచేసిన విజయభూపతియను విజయనగరప్రభువు కాలమున జరిగియుండవలెను. ఈకల్పితశాసనముయొక్క ఉద్దేశ్యము లవణపురము (ఉప్పుటూరు)ను త్రిణయనపల్లవరాజు యాజ్ఞవల్క్యశాఖకు చేరిన బ్రాహ్మణులకు కొండఱికి సర్వసామాన్యముగ నిచ్చెనని స్థాపించుటయే. త్రిణయన పల్లవుడు చోళరాజైన కరికాలునికి సమకాలీనుడు; అతిపురాతనుడు. ఇతడు క్రీ. శ. ఆఱులేక ఏడవశతాబ్దములో నుండియుండవలెను. అంతటి పౌరాతన్యమును సూచింపదగిన ఛాయలెవ్వీగాని యీ శాసనమున గానరావు. ఈభావమునే తెలుపుచు ఉప్పుటూరి అమరేశ్వరాలయము నెదుట నంది స్తంభముమీద నొకశాసనము చెక్కబడియున్నది. (1922 సం—179 వ శాసనము.)

ఇందు లవణపురమును త్రిణయనపల్లవమహారాజు గంగానదీతీరమున నున్న అహిచ్ఛత్రపురము నుంచి వచ్చిన వేయిమంది యాజ్ఞవల్క్య బ్రాహ్మణులకు దానముచేసినట్లు చెప్పబడియున్నది. గ్రామములలోని సోమవీధి సూర్యవీథులకొలతయును ప్రతివృత్తికిని సంబంధించిన భూమి తోట నివేశనము మొదలైనవాటి కొలతయును వివరింపబడియున్నవి. గ్రామములో విభాగములను వెలివారికి అమ్ముకొను విషయమునను వివాహములలో కన్యలకు శుల్కమును తీసికొనువిషయమునను అనుసరించవలసిన కొన్ని నిబంధనలనుకూడ ఈశాసనము పేర్కొనుచున్నది. చారిత్రకముగ నీశాసనము నిష్ప్రయోజనమైనను తదుపాంశముల కిది కొంతవఱకాధారముగ కన్పట్టుచున్నది.

9, 14 సంఖ్యలుగల తామ్రశాసనములు రెడ్డిరాజులకు సంబంధించినవి. ఇవి రెండున్ను అనవేమారెడ్డిచేత నివ్వబడినవియే. రెండున్ను శా. శ. 1293 సంవత్సరము



నెల్లూరుపురమున వెంకటగిరి రాజాగారి కళాశాలను చెంతదొరకిన జైన 'పార్శ్వనాథ' తీర్థంకరవిగ్రహము. ఇందలి సప్తఫణి నాగప్రభను గమనించిచూడవలయును.



నెల్లూరుపురమున గోసాపత్రమువద్ద నుండిన పురాతనప్రతిమ. దీనిలో తొండమునకుముందు కాలికిని నడుమ శిథిలమయిన యొక పురాతన ఆంధ్ర(తెనుగు)శాసనమున్నది. అక్షరములపోలికనుబట్టి యిది క్రీ.శ.6-7 శతాబ్దములకు సంబంధించియుండునని చెప్పవచ్చును. ఇందు శిల్పనైపుణ్యము హెచ్చు.



నెల్లూరుపురమున దండువారివీథిలోనున్న శ్రీనృసింహస్వామివారి యాలయమున నున్న జైన విగ్రహము. దీనినే 'గోనేటిరాయి' అందురు. ఇచ్చటి కలెక్టరు ఆఫీసువద్ద నొక పూర్వపుకోనేటిని త్రవ్వుచుండగా అందుదొరకిన కారణమున యీరాతికి పైపేరు వచ్చినది. ఇప్పటిపూజారులు దీనికి ద్వాదశోర్ధ్వపుండ్రములను వేసి యొక ఆళ్వారు లని భావించుచున్నారు.



మహాబలిపురములోని ఆదివరాహాలయమునందు
మహేంద్రవర్మయొక్క ప్రతిమ



మహాబలిపురములోని ఆదివరాహాలయమునసున్న
సింహ విష్ణుయొక్క ప్రతిమ

శ్రీయుత యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు,
బి. ఏ., బి. యల్.



Sjt. Yarramilli Narayanamoorthi Garu,
B. A., B. L

పి. కృష్ణమూర్తి ఆచారి గారు



P. Krishnamoorti Achari Garu

పాలావఝ్ఝల లక్ష్మీనారాయణ గారు



Palavajjhala Lakshminarayana Garu

అనగా క్రీ. శ. 1371-1372) లో పుట్టినవియే. తొలిది ఆ సంవత్సరపు వైశాఖమాసమునను, రెండవది పౌష్యమాసమునను నుద్భవించెను. వీటికి రెంటికి ఎనిమిది మాసముల వ్యవధిమాత్ర ముండెను. తొలిదానిలో ఉప్పుగల్లు అను పూర్వదత్తి గ్రామమును అనవేమారెడ్డి బ్రాహ్మణులకు పునర్దానముచేసినట్లు చెప్పబడియున్నది. దీనిని వ్రాసినకవి బాలసరస్వతి. రెండవదిచాలముఖ్యమైన శాసనము. ఇందు అనవేమారెడ్డి తన పురోహితుడైన అప్పయార్య యను బ్రాహ్మణునికిని అతని మువ్వురుతమ్ములైన శ్రీరామభట్ట, పిన్నయభట్ట, సూరిభట్ట యనువారికిని కుర్తిదేశమునవమలాపహా యను నదీతీరమున నున్న ద్రుజ్జవరము అనుగ్రామమును అనవేమపురమను నపరనామమున దానముచేసినట్లు చెప్పబడియున్నది. దానగ్రహీతలు శ్రీవత్సగోత్రులును, అల్లాడభట్టుయొక్క పుత్రులును వీరిలో పిన్నయభట్టు అనవేమారెడ్డికి ధర్మవాదిగనుండినవాడు. 10, 11, 12 సంఖ్యలుగల తామ్రశాసనములు ప్రసిద్ధమైన రాచవంశములకుగాని రాజులకుగాని సంబంధించినవి గావు. ఇవి కన్నడదేశము (బళ్లారి ప్రాంత్యము) న కొన్ని గ్రామములలో మిరాశి మున్నగు హక్కులను స్థాపించుటకు పుట్టినదిగ కనుపడుచున్నది. 13 వ సంఖ్యగల తామ్రశాసనము విజయనగర ప్రభువైన అచ్యుతరాయల కాలమున శా. శ. 1455 (అనగా క్రీ॥శ॥ 1533-34) సంవత్సరమున పుట్టినది. దీనిని బట్టి మనకు యిక్కాలమున కొంగురాజ్యము సూర్యవంశపు కాశ్యపగోత్రపు చెన్నరాజుయొక్క కుమారుడు బాలభూపతియొక్క పరిపాలనలోనుండినట్లు తెలియుచున్నది. ఇతని ముఖ్యపట్టణము రాజరాజనగరము.

పైనివివరింపబడిన తామ్రశాసనముల కన్నింటికన్నను ముఖ్యమైనది 14 వ సంఖ్యగలదైన పశ్చిమచాళుక్యపులకేశి పృథ్వీవల్లభమహారాజుయొక్క శాసనము. ఇది కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావుగారివలన పంపబడినది. వీరే దీనిని భండార్కార్ పరిషత్పత్రికలో తమయభిప్రాయములతోటి ప్రచురించియున్నారు. కాని వారు దీని కిచ్చిన పౌరాతన్యమును ప్రాముఖ్యమును ఇంకను విచారణీయము లని శాసనాధికారిగారు సూచించుచున్నారు. అది యెట్లున్నను శాసనము పురాతనమైనదిగాన నది ఆంధ్రదేశమున నరసారావుపేటతాలూకా కొప్పరము గ్రామమున దొరకినదనువిషయమే గమనించతగినది. ఇది ద్వితీయపులకేశియొక్క 21 వ రాజ్యసంవత్సరమున పుట్టినది. కర్మరాష్ట్రములోని ఇఱ్బులియను గ్రామమున కొంతభూమి ముగమూరు గ్రామవాస్తవ్యుడును, శాండిల్యాయనగోత్రుడును ఆపస్తంబసూత్రుడును నైన వేదశర్మయను బ్రాహ్మణునికి పృథ్వీదువరాజుఅను సామంతప్రభువువలన దానము చేయబడియెను. ఈశాసనముయొక్క ప్రాముఖ్యమునుగుఱించి త్వరలోన నేచర్చించుటకు అవకాశ ముండును.

తామ్రశాసనములలోని ముఖ్యాంశములను సూచించినారము. ఇక శిలాశాసనములలోని విశేషాంశములను సూక్ష్మముగ వివరించెదము.

ఈసంవత్సరమున మహాబలిపురములోని ఆదివరాహస్వామి గుహాలయమున నపరూపమయిన పల్లవరాజప్రతిమలు రెండు కనుఁగొనఁబడినవి. ఈప్రతిమలను శాసనాధికారియైన రా॥ బ॥ కృష్ణశాస్త్రిగారు సుమారు పదియేండ్లకు క్రిందనే గమనించియుండిరి. 1913 వ సంవత్సరమున వారీయాలయమును పరీక్షించినపుడు ఆలయమున మంటిదిబ్బలు నిండియుండినందున దగ్గఱకువెళ్లి సంపూర్ణపరీక్షచేయుటకు వీలుపడకుండినను చిహ్నములనుబట్టియే వారివి రాజప్రతిమ లయి యుండనోపునని యూహచేసియుండిరి. 1922 వ సంవత్సరమున శాసనశాఖకు సంబంధించిన శ్రీసుబ్రహ్మణ్యఅయ్యరుగారీప్రదేశమును తనిఖీచేయబోయి ప్రదేశము శుభ్రముగనుండినందున బాగుగ పరీక్షించిన యీప్రతిమలకు పైభాగమున పల్లవగ్రంథాక్షరములలో చెక్కఁబడిన యీరాజులపేళ్లు బయలుపడినవి. ఇచ్చట దొరకిన రెండు ప్రతిమలలో నొకటి ప్రథమసింహవిష్ణునిదిన్ని మఱియొకటి యతని కుమారుడయిన మహేంద్రవర్మదిన్ని యయియున్నవి. మొదటిదానిపైన 'శ్రీసింహవిష్ణు పోత్తాధిరాజః' అనియు రెండవదానిపైన 'శ్రీ మహేంద్రపోత్తాధిరాజః' అనియు

వ్రాయబడియున్నవి. నామాంతములను బట్టిచూడ వీరికి నళినసంపర్క మున్నదనుటకు సందియము లేదు. సింహ విష్ణుపోత్తాధిరాజు కూర్చునియున్నాడు. ఇతనికి పొడవైన కిరీటమున్ను కంఠాభరణములున్ను, కర్ణాభరణములున్ను, ఉన్నవి. ఇతని కిరుపార్శ్వములలోను నొక కిరీటాలంకృతమస్తకయైన స్త్రీ నిలువబడియున్నది. వీ రిరువురును రాజపత్నులనుటకు సంశయము లేదు. మహేంద్రవర్మ నిలుచుకొని యున్నాడు. ఇతనికి కిరీటాదిరాజాభరణములున్నయవి. తనచెంతనిలిచి యున్న రాణికి స్వామిసన్నిధిని చూపుచున్నాడో యన్నట్లు రాజు తనకుడిచేతిని నగమెత్తి వ్రేలితో సన్నిధి వైపు చూపుచున్నాడు. మనరాజధానిలో పూర్వరాజ ప్రతిమలు దొఱకుట యరుదు. అట్టియెడ సుమారు క్రీ. శ. 6 వ శతాబ్దప్రాంతమున రాజ్యముచేసిన సుప్రసిద్ధ పల్లవప్రభువుల ప్రతిమలు వారినామాంకితములతోటి దొఱకుట యెంతయో సుకృతము. ఇదియేకాక శిల్పవైఖరిలో పల్లవులశిల్పవైఖరికి ప్రత్యేకముగ నొకగొప్పఖ్యాతి గలదు. దానియొక్క స్వభావప్రదర్శకత్వము, విగ్రహ గాంభీర్యము, వివిదభంగప్రదర్శనము మున్నగునవి గొప్ప యంశములు. ఇవి నైజమునకనురూపములైయుంట వీని యొక్క ప్రధానగుణము. అట్టితరి యీపల్లవప్రభువుల ప్రతిమలనుంచి యక్కాలపువేషభూషాదికములు స్థితిగతులుమున్నగువాటిని తెలియుటకు ముఖ్యాధారములయి యున్నవి. కావున నాప్రతిమలను యిందువెంట ప్రచురించియున్నారము.

ఇయ్యది వరాహాలయముననే పల్లవగ్రంథాక్షరములలో దశావతారములను పేర్కొను నొకశ్లోకము చెక్కఁబడియున్నది. అక్షరములనుబట్టి యీశాసనము 7-8 శతాబ్దములలో వ్రాయబడి యుండవలెను.

ఈశ్లోక మిట్లున్నది:—

మత్స్యః కూర్మవరాహస్య (శ్చ) నారసింహశ్చ (శ్చ)
వామనః [ః।*]
రామోరామస్య (శ్చ) రామస్య (శ్చ) బుద్ధ[ః] కల్కి-
చ తే దశ.

ఈశాసనమునుబట్టి దశావతారభక్తి 8 వ శతాబ్దమప్పటికే నెలకొనియుండవలెను. ప్రాచ్యవిచార పారీణులయిన సర్ రామకృష్ణ భండార్కార్ గారు శ్రీరామపూజ మనదేశమున క్రీ. శ. 12 వ శతాబ్దమునకు పూర్వమున నుండలేదని యభిప్రాయ పడియున్నారు. ఈశాసనము నాధారముచేసికొని యీయభిప్రాయమును మార్చుకొనవలసినట్లును, రామభక్తి 8 వ శతాబ్ద మప్పటికే వెలసెననియు రూఢిగ జెప్పవచ్చును. ఇదిగాక అమరసింహుఁడు అమరములో కృష్ణబలభద్రాదులను పేర్కొని రాముని పేర్కొనక పోవుటచేత నతనికాలమున రామభక్తి యుండలేదో యేమో యని కొందఱు సందేహించి యున్నారు. ఇప్పట్టునను యీశాసనము అమూల్యమైన యాధార మగుచున్నయది. ఇంతియేకాక యిక్కాల మప్పటికే బుద్ధునిగూడ వైష్ణవు లొకయవతారముగ గణించిరనియు దీనివలన తెలియవచ్చుచున్నది. ఇట్టి పురాణాక్షరముల లోననే చెక్కఁబడిన మఱియొక శ్లోక మీవరాహస్వామి యాలయమున కనుగొనబడి యున్నది. పల్లవప్రభువైన పరమేశ్వరవర్మయొక్క శాసనములయంతమునకూడ నీశ్లోకము కానవచ్చును. అది యెట్లన.

ధిక్తేషాన్ధిక్తేషాం పునరపి ధిగ్ధిగస్తుధిక్తేషాం [।*]
యేషాన్నభవతి హృదయే కుపథగతివిమోక్షకో
రుద్రః [॥*]

ఈశ్లోకము కొన్నిసమయములలో రుద్రపరముగానేకాక విష్ణుపరముగకూడ చెప్పబడుచుండును. అప్పుడు 'రుద్రః' యను పదమునకుమారుగ 'విష్ణుః'అని ప్రయోగింపబడుచుండును.

ఈసంవత్సరపుశిలాశాసనములలో వెనుకటిపల్లవులలో ప్రసిద్ధుడైన కొప్పెరుంజింగః అనువానిశాసనమొకటి యున్నది. ఇది ఉత్తరఆర్కాడుజిల్లా వాయలూరుఅనుగ్రామమున దొఱకినది. ఇచ్చటనే పూర్వపల్లవులశిలాశాసనమొకటి దొఱకియున్నది. ఇయ్యది పల్లవులవంశక్రమమును వివరించుటచే చాలముఖ్యమైనశాసన

మయినందున త్వరలోననే 'ఎపిగ్రాఫియాఇండికా' యను సర్కారువారిశాసనపత్రికలో ప్రచురింపబడును. కొప్పెరుంజింగునికాలము క్రీ. శ. 13 వ శతాబ్దము. ఈసంవత్సరము దొఱకిన (1922 సం॥ 418 శా) శాసనములోనితడు మూడవరాజరాజను చోళప్రభువును తెళ్లాఱుఅను గ్రామమున యుద్ధమున నోడించినట్లు చెప్పబడియున్నది. ఇతడు యీచోళరాజును మంత్రివర్గముతోటి పట్టుకొని శేందమంగలమనుచోట బంధించియుంచి చోళరాజ్యమును స్వాధీనముచేసికొనినట్లును తెలియుచున్నది. కొప్పెరుంజింగుడు చోళ, కర్ణాట, పాండ్య ప్రభువుల నోడించినట్లు ఇతని ప్రశస్తిశ్లోకములు చెప్పుచున్నవి. ఇతనికి 'సకలభువనచక్రవర్తి' యను బిరుద ముండెను. 'అవనినారాయణకాడవ పెరుంజింగన్' అని యితని యపరనామము. గోదావరిజిల్లాలోని దాక్షారామమున నొకశాసనమున్ను (1893 సం॥ 419 శా) కర్నూలుజిల్లాలోని త్రిపురాంతకక్షేత్రమున మఱియొక శాసనమున్ను (1905 సం॥ 197 శా) మహారాజసింహు డను వెనుకటి పల్లవప్రభువునకు సంబంధించి యున్నవి. ఈ మహారాజసింహుడు పైనివర్ణింపబడిన కొప్పెరుంజింగుని కుమారు డని తెలియవచ్చుచున్నది. కొప్పెరుంజింగుండు చిదంబరక్షేత్రమునెడ యపరిమిత భక్తిని నల్పుచుండినవాడు. ఇతనికిని చోళరాజునకును జరిగిన కలహములలో నప్పటి హొయ్సళప్రభువైన రెండవ వీరనరసింహుడు చోళరాజు పక్షమును గైకొనుచుండెను.

ఆంధ్రదేశమున నీసంవత్సరమున దొఱకిన శాసనములలో కొన్ని ముఖ్యమైనవి గలవు. ఇవి గుంటూరుజిల్లాలోని ఒంగోలుతాలూకాలో అద్దంకి, ధర్మావరము అనుగ్రామములలోనివి. వీటిని యిదివఱకే బటరువర్తి, వేణుగోపాలశెట్టిగారలు 'నెల్లూరుశాసనము' లను గ్రంథమున ముద్రించియున్నను యిపుడు తిరుగ వానిని పరిశోధించుట వలన వానియొక్క భావము విశేషముగ బయలగుచున్నది. ఇవి క్రీ. శ. 9 వ శతాబ్దములో నేలుచుండిన గుణగవిజయాదిత్యుడను తూర్పుచాళుక్యరాజు కాలమునాటివి. ఇవి పద్యాత్మకమయియుంటచే ఆంధ్రపద్యకావ్య వాఙ్మయముయొక్క చరిత్రకివి చాల విలువగలవి యగుచున్నవి. వీటియొక్క ఛందస్స్వభావమును పూర్తిగ చర్చించవలెనని శ్రీ॥ శే॥ లక్ష్మణరావుగారి కుత్సాహ ముండెను. వీటిపైని యొకవ్యాసమును వీరు ఎపిగ్రాఫియా ఇండికాలో వ్రాసియున్నారు. ఇది త్వరలో వెలువడును. అటుపైని వారి యభిప్రాయములను చర్చించుచు యీశాసనములను గుఱించిన విమర్శ యాంధ్రమునను ప్రచురించుట యవసరమగును. అయినను వీనిలోని చారిత్రికాంశముల నిపుడొకింత చెప్పవచ్చును. గుణగవిజయాదిత్యుని ప్రథమ రాజ్యసంవత్సరముననే పండరంగుండనువాడు దండాధిపపదవిని పట్టాభిషిక్తుడాయెననియు నితడు సామంతుల సేనలతోటి విజయయాత్రపై వెడలిపోయి పండ్రెండుబోయ కొట్టంబులను సాధించి వేఁగినాటిని జయించి త్రిభువనాంకుశుని (అనగా యీబిరుదును గలిగిన గుణగవిజయాదిత్యుని) యధికారమును స్థాపించి కట్టెపుదుర్గమును శిథిలముజేసి 'కణ్దుకూరును బెజవాడ గావించె'నని యొకశాసనమున చెప్పఁబడియున్నది. పేర్కొనఁబడిన ప్రదేశముల వరుసనుబట్టి చూడ పండరంగుండు తనవిజయయాత్రను నుత్తరమున వేఁగినాటను ప్రారంభించి క్రమేణ దక్షిణమునకు వచ్చి నెల్లూరుజిల్లాలోని కందుకూరువద్ద చేరి నట్లగుపడుచున్నది. అతడు పగులగొట్టిన కట్టెపుదుర్గ మనుప్రదేశము ఇప్పటి తెనాలితాలూకాలోని కటేవరముగ నుండవలెనని నాయభిప్రాయము. కణ్దుకూరును బెజవాడ గావించెననగ చాళుక్య రాజధానియైన బెజవాడకు సమానముగ కందుకూరు నలంకరించెనను భావమున్న ట్లగుపడుచున్నది.

ఇచట మఱియొకశాసనము గుణగవిజయాదిత్యుని ప్రతాపముల జెప్పునెడ నితడు అచలపురమును జయించినట్లును కిరణపురమును దహించినట్లును సంకిలయనువానినిన్ని కన్నర (అనగా- రాష్ట్రకూటరాజగు రెండవకృష్ణుడు) యనువానినిన్ని జయించినట్లును చెప్పబడియున్నది. ఈయచలపురము రాష్ట్రకూటులశాసనములలో నొకదానిలో వారిముఖ్యపట్టణముగ జెప్పబడియుండు

అచలపురముగ నుండవలెను. అది మధ్యపరగణాలలోని ఎలిచ్‌పూరుగా నుండవలెనని కొందఱభిప్రాయపడియున్నారు. సంకిలుడు మదనపల్లి ప్రాంతమున దొఱకిన కొన్ని పురాతన శాసనములలోని సంకలియనురాజుగ నుండనోపును.

చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకాలోని శాసనములన్నియు ఈసంవత్సరమున పరీక్షజేయబడినవి. వీనిలో ననేకములు క్రీ. శ. ఎనిమిదితొమ్మిదిశతాబ్దముల ప్రాంతమున నేలుచుండిన వైదుంబరాజులకు సంబంధపడియున్నవి. ఈశాసనములభాష యాంధ్రముగనుంటను బట్టి వైదుంబులు ఆంధ్రరాజులని చెప్పనగును. గండత్రిణేత్ర వైదుంబమహారాజు రేనాటిని యేలుచుండినోలింబులతో యుద్ధముచేసినట్లు ఒక శాసనమువలన తెలియవచ్చుచున్నది. వైదుంబులకు లోంకుళులను తెగవారు శత్రువులుగనుండినట్లు కొన్ని శాసనములవలన కనబడుచున్నది. వైదుంబరాజులకును బాణరాజులకును ఒకప్పుడు మైత్రియును మఱియొకప్పుడు విరోధమును నుండినట్లుకూడ స్ఫురించుచున్నది. ఈవైదుంబులకు 'సోళుల'ను వారు శత్రువులుగనుండినట్లున్ను స్పష్టమగుచున్నది. సోళులు యిక్కాలమున కడపజిల్లాప్రాంతమున నేలుచుండిన చోళరాజులని చెప్పుటకు యేలాటిసందియమును లేదు. చోళులు తమశాసనములనుబట్టి రేనాటికి ప్రభువులుగ నుండినట్లు తెలియవచ్చుచున్నది. వైదుంబులున్ను రేనాటికి ప్రభువులుగ నుంటచూడ వీరు చోళులనుజయించి రేనాటిని స్వాధీనముచేసికొని యుండవలయును. కడపజిల్లాలోని చిప్పిలి యనుగ్రామము రేనాటిచోళుల ముఖ్యపట్టణముగ నుండినట్లును కానవచ్చుచున్నది.

బళ్లారి కర్నూలుజిల్లాల ప్రాంతముననున్న తరువాయి పశ్చిమచాళుక్యుల శాసనములు కొన్ని పరీక్ష చేయబడినవి. ఇవి కన్నడభాషలో నున్నవి. పంచమ విక్రమాదిత్యుని శాసనమొకటియున్నది. దీనినిబట్టిచూడ యీ చాళుక్యులకును వీరి సామంతులయిన నొళుంబపల్లవులకును వైవాహికసంబంధము లుండినట్లు అగపడుచున్నది. ఈశాసనమువలన నితని కాలమున (అనగా క్రీ. శ. 1013-14 సం॥న ప్రాంతమున) నొక మహాకాళ దేవాలయ ముండినట్లు కన్పట్టుచున్నది. ఈవంశపురాజైన ప్రథమత్రైలోక్య మల్ల సోమేశ్వరుని పట్టపుదేవి మైలలదేవి శ్రీశైలమునకు విజయముచేసి శ్రీ మల్లికార్జున స్వామివారిని దర్శనముచేసి పాతాళగంగను సేవించి కాళాముఖగురువైన సురేశ్వర పండితులచేత కొంతదానము చేసెను. ఇందువలన నీమెయొక్క మతమియ్యది యని తెలియనగుచున్నది. ఈమెయొక్క భర్తకును కాళాముఖ మతమునెడ భక్తియుండినట్లు ఇతరశాసనములుకొన్నింటి వలన స్పష్టమగుచున్నది. ఈచాళుక్యులలో సుప్రసిద్ధుడయిన త్రిభువనమల్ల యను నపరనామమునుగల ఆఱవ విక్రమాదిత్యునికి పిరియకేతలదేవి యను నొకరాణి యుండెనని నూతనముగ నీసంవత్సరపుశాసనములలో నొకదానివలన బయల్పడుచున్నది. ఈయమ సంగీతసాహిత్యములలో చాల ప్రవీణురాలయినందున నీమెకు 'అభినవ సరస్వతి' బిరుదముకూడ నుండెనట. మనదేశమునపూర్వమున శ్రీవిద్యకు ప్రాముఖ్యముండెననుట కిదియొక నిదర్శనము. కర్నూలుజిల్లాలోని నందికొట్కూరు తాలూకాలో కొత్తపల్లిగ్రామములోని కొన్ని చాళుక్యుల నాటి దేవాలయములును శాసనములును యీ సంవత్సరము పరీక్షించబడినవి. ఈప్రదేశమును పూర్వమున శ్రీశైలమునకు పశ్చిమద్వారమని చెప్పుచుండిరి. ఈ జిల్లాలోని త్రిపురాంతకక్షేత్రమును శ్రీశైలముయొక్క పూర్వద్వారమని పూర్వము చెప్పెడివారు. హంపిక్షేత్రములోని శ్రీవిఠలరాయల దేవాలయాంగణములో మధ్వగురువైన శ్రీవ్యాసతీర్థులవారు శ్రీయోగవరద నరసింహస్వామివారి విగ్రహమును ప్రతిష్ఠచేసిన ట్లొక శాసనము పల్కుచున్నది.

మనమిపు డెంతనాగరికులమని విఱ్ఱవీగినను మన పూర్వీకులకున్నట్టి దృఢమైన నాగరికత మనకిపుడు కొన్ని యంశములలో లేదని చెప్పవలసి యున్నది. శిలాశాసనములయెడ వారికుండిన శ్రద్ధాగౌరవములు మనకు లేదని నొక్కిచెప్పవచ్చును. ఇపుడు జనసామాన్యమునకు వీని యందు శ్రద్ధలేదు. వానిస్వభావము వారికి తెలియదు.

తెలిసిన యుద్యోగస్థులకు వానియెడ యశ్రద్ధమెండు. కనుకనే సుమారు ఇరువది సంవత్సరముల క్రింద నుండిన పురాతనపు శిలాశాసనము లిపుడు వెదకినను కానరావు. ఇదియేకాక మూఢభక్తివలన వీటికి చేటువాటిల్లుచున్నది. దక్షిణదేశమున లక్షలుకొలది పైకమును ఖర్చుచేసి జీర్ణోద్ధారములఁ జేయనుత్సహించు నాటుకోట శెట్లకదేలనొకో పురాతన శాసనములయెడ నతివైరము? వాటిని అరగరాయించిననే వీరికి నిదురరాదు. ఇక్కారణమున నెన్నియో పురాతనశాసనములు నాశము నొందినవి. వీరి కింతటి యైశ్వర్యము నొసంగిన యాదేవు డొకింత వివేచనాశక్తి యివ్వకూడదా! ఇటుగాక పూర్వమున రాజులుగాని తదితరులుగాని జీర్ణోద్ధారమును చేయునెడ పూర్వము శాసనములను తిరుగ యథామాత్రకముగ చెక్కించుచుండెడివారు. అట్లుచేయుటకు కారణములనుగూడ చెప్పెడివారు. చంగిలిపట్టుజిల్లాలోని తిరుప్పరుత్తికున్రు అనుగ్రామమున త్రైలోక్యనాథాలయములో నొకశాసనము విక్రమచోళునికాలమున తొలుత వ్రాయబడినదియయి యామండపము మూడవకులోత్తుంగుని కాలమున జీర్ణోద్ధారమయినపుడు తిరుగ నట్లే చెక్కించబడియెను. ఇట్లే రామనాథ జిల్లాలోని తిరుత్తంగాల్ అనుగ్రామమున నొక పూర్వశాసనము ప్రథమకులోత్తుంగ-చోళునికాలమున తిరుగ చెక్కబడియెను. ఈశాసనమును తొలుత చెక్కియుంచిన బండను పగులగొట్టవలసి వచ్చినందున దానిని చెంతనున్న మండపముమీద వ్రాసియుంచుకొనిరి.

ఈవ్యాసమును ముగియించుటకు పూర్వము శాసనములలోని మఱికొన్ని విశేషాంశములను చెప్పెదము. పాండ్యరాజుల శాసనములలో నొకదానిలో, నొకరు మఠము నొకదానిని గట్టించి దానియందు మహాభారతము, రామాయణము, పురాణములు మున్నగువాటిని చదివి వ్యాఖ్యానము సల్పుటకుగాను 'మహాభారతవృత్తి' యను పేరిట కొంతభూమిని దానముచేసిరని చెప్పబడియున్నది. పూర్వమున దేవాలయములలోను, మఠములలోను, నాలుగువేదములను, శాస్త్రములను, పురాణములను వ్యాకరణమును చదివి వ్యాఖ్యానము చేయుటకుగాను వృత్తుల నిచ్చినందులకు శాసనములలో ననేక నిదర్శనము లున్నయవి.

ఈసంవత్సరమున నాంధ్రదేశమున కొన్ని ముఖ్యాంశములు గమనింపబడియున్నవి. గోదావరి జిల్లాలోని తునిగ్రామమున కేడుమైళ్లదూరముననున్న గోపాలపట్టణము గ్రామములోని పాండవులమిట్ట పరీక్షచేయబడినది. ఈకొండలో మూడుగుహ లున్నయవి. ఇందులో పెద్దది 40 అడుగుల పొడవును 20 అడుగుల వెడల్పును 5 అడుగుల యెత్తును కలదినై యున్నది. ఇది చెంతనుండు సముద్రమువైపు చూచుచున్నది. ఈమూడింటిలో నొక్క శాసనముగాని లేక పోయినను పూర్వమున సన్న్యాసులో లేక కొండమనుష్యులో యిందు కాపుర ముండిరనుటకు నిదర్శనములు కానవచ్చుచున్నవి. ఇదిగాక పిఠాపురమువద్ద కొడవలి యనుగ్రామమున తిప్పపైని తొలిచిన బావిలోని పురాతనశాసనమును ఈసంవత్సరమున రా॥ బ॥ కృష్ణశాస్త్రిగారును నేనును రాతినుంచియే నేరుగచదివి అచ్చుప్రతులలోని సందేహములను నివర్తిచేసికొంటిమి. ఇది సాతవాహనవంశీయుడైన వాసిష్ఠీపుత్రచడసాత (యనగా చంద్రసాతకర్ణి) యనురాజుయొక్క శాసనము. ఇది ప్రాకృతభాషలోనున్నది. త్వరలో ప్రచురింపబడును, ఈ తిప్పపైభాగమును పరిసరములను పరీక్షచేసినమీదట నిచ్చట నొకబౌద్ధస్తూప ముండియుండవలెనని మాకు నమ్మకము పొడమెను. ఈప్రదేశమును త్రవ్వించి పరీక్షలుచేయించుటకు కావలసిన ప్రయత్నములను శ్రీకృష్ణశాస్త్రిగా రిదివరకే పలిపియున్నారు. దీనిఫలమును త్వరలోననే మనము వినగలుగుదుము.

మనదేశమున నిట్టిపురాతనప్రదేశములును తత్సంబంధమైనశాసనములును ననేకములు యింకను సంపాదింపబడి పరీక్షకావలసియున్నవి. వీటిసంపాదనకున్ను పరీక్షకున్ను కావలసిన జనసామగ్రియును ధనసామగ్రియును యిపుడున్నయవి చాలవు. సర్కారువారును దేశాభిమానులును వీనియెడ యెక్కువ శ్రద్ధవహింతురని మానమ్మిక. అంతవరకును సమగ్రమైన శాసనపరిశోధన

పూర్తియై యందుమూలమున దేశపుపూర్వ చరిత్ర వెలువడజాలదు. చదువుకొనినవారుకూడ కొందఱు శాసనశాఖవారి వార్షికనివేదికలను చదువకయే వారు ప్రతిసంవత్సరము జరిగించు పరిశోధనలను గమనించకయే యీశాఖవారిమీఁద యసూయలను వెలిపుచ్చుకొనుచున్నారు. ఇది న్యాయమును కాదు; సమంజస మంతకుమునుపే కాదు. దేశములోని కొన్నినూతనపత్రికల సంపాదకులుకూడ యీయసూయాదుర్గంధము నాఘ్రాణించి దానివలన యీశాఖవారి కార్యక్రమమును లెస్సగ విచారించకయే వారిని నిందించుట దేశాభిమానఘోషణమని యెంచుచున్నారు. అట్టివారికిట్టుసేయుట దేశసేవ కాజాలదనియు, దురభిప్రాయములను తొందరపడి తమపత్రికలవలన వెదజల్లుటచేత వారుసత్యమునకు హానియొనర్చువారగుచున్నారనియు హెచ్చరిక నిచ్చుచు యీవ్యాసము నింతటితో ముగియించుచున్నారము.

# ఆత్మానందము

కలచవీడు వేంకట రమణాచార్యులు గారు

ప్రాగ్దిశాకాంత వెల్వెలబాఱకుండ
తూరుపున్జుక్క మింటికి బ్రాకకుండ
ప్రాణపతితన్మయత్వంబు బాయకుండ
నిదురమేల్కాంచి విభునిగాంచెదను గనుల.

"కాల్యముల్దీర్చి, కుంకుమాంకమువహించి,
ముఖము కళలీన, నిదురను బుచ్చి వచ్చు
వల్లభుని పాదములయందు వ్రాలిలేచు
నపుడు, నన్నొందుపారవశ్యము దలంప
విప్రలంభంబుననుఁగాంచు వెలదిలేదు.

"అత్తమామలు, మఱదులు, నాడుబిడ్డ
లాత్మశయ్యల వీడుటకన్న మున్న,
ఇంట బనులెల్లదీర్చి, వారిచ్చుదీవ
నలకు బాత్రతనొందు టానందమరయ!

"నాథుడుదయాన లేచి, స్నానంబుజేయు
వేళ, సీరిచ్చి పిండితో వీపుదోము
భాగ్యమబ్బినకాంత యీశ్వరునిబట్టి
స్నానమాడించు భక్తునానందమందు.

"అత్తమామలు విభునికి, నుత్తమోత్త
మంపుదైవంబు లగుట, లేమకు సతంబు,
వారిసేవల మించు శుభంబులేదు,
వారినిరసించుకంటె బాపంబులేదు.

"విభునిపాదములంటి సేవించువేళ,
జలకమాడించుటాదిసేవల బొనర్చు
వేళ, రుచ్యవస్తువు దినుపించువేళ,
అంచుననునిల్చి తమలమందించువేళ,
పాదములనంటి శయనించు భవ్యవేళ,
మల్లెమొగ్గల పలువిచ్చిమాటలాడు
రమ్యతరవేళ, ప్రాణమర్థంబె కాక,
యన్నిమించెడు నాత్మయే యధిప! నీకు
నర్పణమొనర్చితిని విభుడైననీవె,
ప్రేమబెంచినతల్లి దండ్రియునునీవె,
కరుణ ముక్తి మార్గముజూపు గురువవీవె
యంతయేకాదు, యీసృష్టికంత కాది
కారణంబగు నపరావతారమీవె,
నినువినా తల్లిలేదు తండ్రియునులేదు
నినువినా గుర్వు దైవము లేడటంచు,
నిష్ఠగూర్చుండి భర్తధ్యానించి తన్మ
యతనుజెందెడు నానందమంతె చాలు
వలదు తల్పరసౌఖ్య మేపాటిదైన.

# డాక్టరు అప్పాద్వైదుల లక్ష్మీనారాయణ గారు, ఎమ్. ఏ., ఎఫ్. యమ్. యు.

మహారాజశ్రీ అప్పాద్వైదుల లక్ష్మీనారాయణగారు, విజయనగరములోని మహారాజావారి కళాశాలయందు పదార్థ విజ్ఞాన శాస్త్రోపాధ్యాయులలో ప్రధానులు. పదార్థ విజ్ఞానశాస్త్రమందు నూతనములగు విషయములను కనిపెట్టినందులకై, కొలదికాలము క్రిందట మదరాసు విశ్వవిద్యాలయమువారు లక్ష్మీనారాయణగారికి డాక్టర్ ఆఫ్ సైన్సు (Doctor of Science) అను బిరుదమునొసంగి గౌరవించిరి. ఇట్టి గౌరవము సాధారణముగా లభింపదు. విశ్వవిద్యాలయమువారు ఇదివర కొక్కరికి మాత్రమే ఈబిరుదమునిచ్చియున్నారు. లక్ష్మీనారాయణగారు రెండవవారు. లక్ష్మీనారాయణగారిట్టి గౌరవమును పొందుటవలన ఆంధ్రదేశమునకు మిక్కిలిగౌరవమని చెప్ప నక్కరలేదు. ఆంధ్రులందరును గర్వపడవలసిన సమయమిదియే.

గోదావరి మండల మందలి సుప్రసిద్ధమగు కోనసీమలోని ముక్కామల యను గ్రామము లక్ష్మీనారాయణగారి జన్మస్థానము. ఈయన తండ్రిగారు శ్రోత్రియులు. కృష్ణ యజుర్వేదములో క్రమాంతస్వాధ్యాయవేత్త. లక్ష్మీనారాయణగారు యఫ్.ఏ.తరగతులు కాకినాడలోని పిఠాపుర రాజావారి కళాశాలలో జదివిరి. తరువాత, అనగా 1911-1912 సంవత్సరములలో రాజమహేంద్రవరములోని దొరతనమువారి కళాశాలలో బి. ఏ. తరగతులలో జదివిరి. ఈ రెండేండ్లలోనే పదార్థ విజ్ఞానశాస్త్ర మభ్యసించుట ప్రారంభమైనదని చెప్పవచ్చును. ఈశాస్త్రమును ఈయన రావుసాహేబు. పి. రాజగోపాల అయ్యరుగారి వద్దనభ్యసించిరి. వారు ఈయనయెడల మిక్కిలి దయగలిగి కావలసిన సాహాయ్యము చేయుచుండెడివారు. 1912 లో పట్టపరీక్షయందు తేరి, ఆసంవత్సరముననే జూలై మాసములో రాజమహేంద్రవర కళాశాలలో చిన్న ఉపాధ్యాయుడు(Demonstrator)గా, లక్ష్మీనారాయణగారు నియమింపబడిరి. మొదటినుండియు పదార్థ విజ్ఞానశాస్త్రమందుగల ఆసక్తిచేతను, వారి గురువులగు అయ్యరుగారి సహాయముచేతను లక్ష్మీనారాయణగారు 1914 లో యమ్. ఏ. పరీక్షయందుత్తీర్ణుడయ్యెను. తరువాత రాజమహేంద్రవర కళాశాలను వదలివిజయనగరమహారాజావారి కళాశాలలో పదార్థవిజ్ఞాన శాస్త్రోపాధ్యాయుడుగా నియమింపబడెను. నాటినుండియు శాస్త్రిమండలి దీక్షను వదలక ఆసక్తిని గోల్పోక, పట్టుదలతోను, అభిమానముతోను, శాస్త్రమున వ్యాసంగము జేయుచునే యుండెను.

ఇది యిటులుండగా, ఇండియా దేశమందలి శాస్త్రజ్ఞులందరును, సంవత్సరమున కొకసారి ఒకపట్టణమందు సమావేశమై వారివారి శాస్త్రములలో వారు వారు వ్యాసంగముచేసి కనిపెట్టిన నూతన విషయములను గురించి సంప్రతించు కొనుటకై ఒక మహాసభను స్థాపనచేసి కలసికొనుచుండు వాడుక కొద్ది సంవత్సరములనుండి ఏర్పాటైనది. ఆసంఘమునందు లక్ష్మీనారాయణగారు ఒక సభ్యులుగాచేరిరి. ప్రతి సంవత్సరము శ్రమ యని యాలోచింపక ఆ మహాసభకు (Indian Science Congress) పోవుచుండిరి. ఆసభలలో జరుగు చర్చలను బాగుగా గుర్తించి, పదార్థ విజ్ఞానశాస్త్రమందొక ముఖ్యమగు శాఖలో తనబుద్ధిని ప్రవేశపెట్టి, అందు, దేశ దేశములవారు పోవు పోకడలను తెలిసికొని, సారాంశముల నన్నిటిని చక్కగ గ్రహించి దానియందు కొంత పరిశ్రమచేయ మొదలిడిరి. అందులకు కావలసిన సాధన సామగ్రులు, అనగా విలువగల యంత్రములు మొదలైనవి శ్రీవిజయనగర సంస్థానమువారి దయవలన ఇంగ్లాండు మొదలగు దేశములనుండి తెప్పించుకొని తన తోడియుపాధ్యాయులగు, గున్నయ్య, సుబ్రహ్మణ్యముగార్ల సాహాయ్యముచేత, పనిసాగించు కొనుచు వచ్చిరి. ఆయనచేసిన కృషి ఫలింపసాగెను. సాధకమువలన పనులు సమకూడునుగదా! ఇదివర కెన్నడును శాస్త్రమందులేని అనేక నూతన విషయములను, శాస్త్రజ్ఞుల మహాసభయందు లక్ష్మీనారాయణగారు వ్యక్తపరచుచు వచ్చిరి. ఇంతియకాక ఇంగ్లాండునందును, అమెరికాయందును, మిక్కిలి పేరుచెందిన శాస్త్రవిషయిక పత్రికలలో (Philosohical Magazine, Nature, Physical Review etc.) నూతనాంశముల గురించిన వ్యాసములను వెలువరింపసాగిరి. అవి శాస్త్రజ్ఞులందరి దృక్పథమునబడి వారిగౌరవమునకు పాత్రములగుటచేత లక్ష్మీనారాయణగారికి ధైర్యమును, హెచ్చరికయును వృద్ధిపొందెను. యీయన కనిపెట్టిన విషయములన్నిటిలో ప్రధానమగు విషయమును గురించి కొంత ముచ్చటించెదను.

భౌతికశాస్త్రమునకును, రసాయన శాస్త్రమునకును మూలమైన విషయమొకటిగలదు. దానిని (Atomic Theory) అందురు. అణువాదమనవచ్చును. స్థూలపదార్థములు స్వతంత్రములైనవి కొన్నిగలవు. వాటి కేమియును మార్పులేదు. అవి యనేకరీతుల మార్పుచెంది, కూడుకొని, అనేక వికారములను, జెందుచున్నవి. ఈస్వతంత్రమగు పదార్థములను యలిమెంట్సు (Elements) అందురు. ఇవి అణువుల (Atoms) యొక్క సముదాయములు. ఎన్ని యలిమెంట్సుగలవో అన్ని విధములగు పీటములును గలవు. ఒక్కొక్క పీటమునకు ఒక్కొక్క వ్యక్తిగలదు. ఈపీటములు కంటికి గానరావు. ఎట్టి దుర్భిణి యంత్రమువలనను (Powerful microscope) గోచరింపవు. మిక్కిలి సున్నితములగు త్రాసులలోకూడ తూచుటకు వీలులేని చిన్న ధూళికణువులో సుమారు 10, 000 కోట్ల కోట్లు పీటములుండునని శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. అట్టి పీట

మునొక్క స్వరూపము బుద్ధిచేతనైన నాలోచించుటకు దుస్సాధ్యమై యున్నది. అట్టి పీటములో ఇంకను చిన్నవియగు యెలక్ట్రానులుగలవు. అవి సెకండుకు 93, 000 మైళ్ళచొప్పున యేటమునొక్క గర్భమందు విహరించు చున్నవట. ఒక్కొక్క యేటములో నొకటిమొదలు 92 వరకు యెలక్ట్రానులుండునట. వాటియొక్క సమావేశము, వాటియొక్క సంఖ్యయే ఆ పీటమునొక్క స్వతంత్రవ్యక్తికి మూలాధారములట. అట్టి అణువునొక్క గర్భమందు సూర్యుని చుట్టను సంచరించు గ్రహములవలె నియమము నతిక్రమింపక యెలక్ట్రానులు సంచరించు చున్నవట. యేమి యాశ్చర్యము! యెంతటి సూక్ష్మములు! కాని యెంతటి దీక్ష! యెంతటి యమము! యేమిభగవంతుని యేర్పాటు! యెటుల సూర్యాదిగోళములు తమతమ గతులను నియమము తప్పక పొందుచున్నవో, అటులనే అతి సూక్ష్మములగు అణువులలో నిర్మింపబడిన ఎలక్ట్రానులు కూడ (పరమాణువులలో) చిత్రముగ పొందుచున్నది. ఈయెలక్ట్రానుల సంఖ్యను బట్టియు వాటి వాటి చిత్రములగు సమావేశముల బట్టియు బంగారమునందలి పీటమునకును వెండియందలి పీటమునకును గలభేదము పుట్టుచున్నదని చెప్పియుంటినిగదా! ఈనూతనోద్దేశములను మొట్టమొదట శాస్త్రప్రవేశము నందు బెట్టిన మహా పురుషుడు నీల్ బోహర్ (Nell Bohr) అను యువకుడు. ఈతడు కోపెన్ హేగన్ పురవాస్తవ్యుడు. నిరుపమాన ప్రతిభాశాలి. ఈయన ననుసరించి ప్రతిభావంతులగు ననేకులు శాస్త్రజ్ఞులు ఈ అణుపరమాణు వాదములలో మిక్కిలి క్లిష్టములగు విషయములను పరిశీలించి జ్ఞాన దీపమునకు నూతన కళలను కల్పించు చున్నారు. అట్టివారికి గలిగిన ముఖ్యమగు నొకసందేహమును దీర్చి మన లక్ష్మీనారాయణగారు కృతార్థులైరి. ఇంకనెన్నియో తెలియవలసినవిషయము లీవాదమున నున్నవి. వాటిలో కొన్నింటినైన తెలిసికొని ప్రపంచమునకు వెల్లడి చేయగలుగుభాగ్యము లక్ష్మీనారాయణ గారికి గలుగుగాక యని మనము కోరుచుండవలెను.

లక్ష్మీనారాయణగారివంటి వారము కావలెనని ఆంధ్ర యువకులుత్సహించెదరుగాక! పట్టపరీక్షలలో కృతార్థులై ఉపాధ్యాయత్వమును బొందినవారందరును తమ తమ చదువులకు స్వస్తిచెప్పక తమకు అభిమానముగల యొకవిషయమందు క్రమవృద్ధిగ వ్యాసంగము జేసి పట్టుదలతోను నమ్మకతోను, ఋజుమార్గమునను పనిచేసినచో తప్పక మాతన విషయములు కొద్దిగనో గొప్పగనో గోచరింపక తప్పదను విషయము మనలక్ష్మీనారాయణగారిని జూచి ముఖ్యముగ గ్రహింపతగిన విషయమని నాకు తోచుచున్నది.

లక్ష్మీనారాయణగారిపుడు విజయనగరమహారాజావారి (Researdh Laboratories) శాస్త్రపరిశోధనాగారముల మీద పెత్తనమును బొందిరని వినుటకెంతయూ సంతసించుచున్నాను. యిది యెంచి శుభసూచకము. ఆయనకు మిక్కిలి ప్రోత్సాహకరము. ఆయన వంటివారు మన యువకులలో నింకనెందరో బయలుదేరగలరను దృఢవిశ్వాసము నాకుగలదు. లక్ష్మీనారాయణగారి కిప్పుడుజరిగిన సన్మానము రాబోవుసన్మానముల నింకెన్నిటినో సూచించు చున్నదని నమ్ముచున్నాను. ఇట్టి నూతనాంశముల గనిపెట్టుశక్తియుక్తులు, భగవంతుని దయవలన చిరకాలము ఆయనకు గలుగుగాక యనికోరుచున్నాను.

విస్సాఅప్పారావు,

రాజమహేంద్రవరము. 18-3-24.—శారద.

# శబరీ నిరీక్షణము

కొణిదెన బాలకృష్ణయ్యగారు

ఎలుకుల పిల్లఁగాంచఁజన నెబ్బెతికంబుగదాయటంచు, నే
తెలుపునుబట్టిపోయెదొ కదే; ననుడాయకఁ జిన్నిరామ! నీ
కొలకులఁగ దారిఁగాచి, యదు గో, యిదుగో ననుఁగన్నతండ్రి ద
గ్గఱకిదె వచ్చెఁ జూతమనె కాతలపోయుదు, నెన్నొనాళ్లుగన్.

ఉ. మేలిమితోడ నొండొకరిదించి నుతించెడి యోగులట్ల, నేఁ
జాలను యున్నయట్ల నిను సన్నుతిసేయఁగ రామచంద్ర! యీ
కేలుగవన్ గదించి తలఁ గీకరబాకరబానతోడ, నా
పోలినయట్లపాడి, నిను బూజయొనర్చెద నో జగత్ప్రభూ! ౨

ఉ. మాసినచింకిచీర, కసుమాలపుజాతి, ధరించుసొమ్ములా
పూసలపేర్లు, రూపుఁ దలపోయఁగఁ జీదరపుట్టు, నిట్టి నా
వేసముఁజూడ రోఁతయని వెళ్లకు మోరఘువీర! నాదుపే
రాసఁదలంచి దగ్గఱి దయామతి దర్శనమిచ్చి కావవే. ౩

సీ. మునిపంటనొక్కి తీయనిరకంబులనేఱి, పంచియుంచితి మావిపండ్లు రామ!
రుచిఁజూచి వెదకి నేర్పుగఁదెచ్చి దాఁచితి, పండఁబాఱు ననంటిపండ్లు రామ!
చవులెత్తింగి పొలాన సాధించి తెచ్చితి, బాగమాఁగిన రేఁగుపండ్లు రామ!
ఒకగింజఁదిని మఱియుంచితిఁ బదిలాన, బక్కాంపు దానిమ్మపండ్లు రామ!

గీ. ఇవ్వియేకాదు; కాయ లింకెన్నియేని, వేయురీతుల నాడాడ వెదకివెదకి
తెచ్చి; యిలునింపినీకుఁగాఁ దెన్నుగాచి, చూచునాగోల రామయ్య! చూడవయ్య!

చ. కనులకువిందుగూర్చుచును కమ్మనివాసనఁబొల్చు పూవులన్
గని; చిగురాకుజొంపములఁగాంచియుఁ; బూలఁజిగుళ్లఁదెచ్చి రా
ముని నిటఁబూజసేతు నిట ముచ్చటగాఁ బవళింపఁజేతు, నం
చును మది నాకు నేనెయనుచున్ దలపోయుచునుంటిగా దొరా! ౪

ఉ. నీలఁపుమబ్బుగుంపులను నింగిఁ గనుంగొని, కాననంబులోఁ
జాలుగ నిల్చి చీఁకటులెసంగెడి కానుగుచెట్లఁజూచి, నా
మేలిక రామదేవుఁ డిటులేకద నల్లనిమేనిచాయతోఁ
గ్రాలునటయ్య రే! యతనిఁ గాంచెద నెప్పుడటంచు నెంచెదన్. ౫

చ. అలసటఁదీర్చి, పండ్లఁదనివారఁగ నీకుఁ దినంగఁబెట్టి, నా
కులమును నన్నుఁగూడఁ బలుకూరిమి మంచిగఁజేయుమంచు నీ
చెలువగు చిన్నిపాదములఁ జేర్చితలన్; మదిఁదోఁచినట్టి మే
ల్పలుకుల నిన్నుఁ బాడఁగఁ దలంచితి; నాయన! రామ! రాఁగదే. ౬

సీ. చిన్నారియడుగుల చెలువెంతకందెనో, యడవిబాటలనీవు నడచుచుండఁ
జెలువలతలకట్టు సీతమ్మకానలోఁ, నడయాడఁ దానెంత బడలెనొక్కొ
కోనములప్రోవు నీ కూర్పులక్ష్మణుఁడెంత, యలసెనో పయనంబు నలుపలేక
ననలచందంబుఁగాదను మీతనువు లెంత, వాడియుండెనొ తొంటిపోడిమిసెడి

గీ. ఎట్టులో కష్టమనక నాయింటికడకు, వచ్చితిరయేని, యున్నంతవఱకు మీకు
నోగిరము నీరు నిచ్చి నా యోపినంత, యలతఁదీర్చెద రమ్మ మాయయ్య కాన. ౭

మ. కలిదో, గంజియొ, నాకుఁగల్గినటుగాక నీకు బెట్టంగఁ దేఁ
గలనే కమ్మనిపిండివంటలను, శాకవ్రాతముల్ రామ! పె
ద్దలకెందేనియు భక్తియే ఘనముగాదా? కల్మికంటెన్, దయా
కలనన్ వన్గనరావదేలను పరాకా? తండ్రి! యెన్నాళ్లకున్. ౯

మ. పొరపాటొక్కటిలేదు నావలన నెప్డున్ నిన్నె సేవింపనా
కరయుగ్మంబును గాన్కఁజేసితి నిదే కన్గొమ్ము, మున్ముందె మ
ద్గురుఁడెన్నో భవదీయసత్కథల నాకున్ జెప్పె నోజానకీ
వర, యింకైనను సందియంబు విడలేవా! రావ! రక్షింపవా! ౧౦

ఉ. కొంచెముకాలముండి యెటకోచనుభాగ్యము లేదు మాకు ని
శ్చంచలమై వసేందిర యొసంగెడిఁ దాను సమస్తసంపదల్
గొంచక వాటితోడ నొడగూర్తుము యోకొని వేళలందు మా
పంచలఁజేరు నర్థుల కుపాయనముల్ రఘురామ! నిచ్చలున్. ౧౧

మ. ఇలుసింగారముచేసినాను నిను నెంతేబత్తిఁ బూజింపఁ బూ
వులతోఁబుట్టలు నింపినాను ఇదె యాపోవంగఁ బోసేయఁ బం
డులనెన్నింటినొ దాఁచినాను; ఇటునేఁడో రేపొ వేంచేయఁ గ
న్నుల నిన్జూడఁగ వేచినాను; ప్రణతింతున్ రామ! విచ్చేయుమా. ౧౨

సీ. కోటిబ్రాహ్మణులను కొల్లగామృష్టాన్న, మారగింపఁగఁజేసి వట్టిఫలము
లీలనావులుకోట్లు లేఁగదూడలతోడ, సజ్జనులకుసేగి సలుపుఫలము
పెక్కుఅఁగన్నెలఁ బేర్మిసింగారించి, పాత్రులకిచ్చు నపారఫలము
పండినపొలముల నిండుపర్వములందు, యోగ్యులకిడుదాన నొప్పుఫలము
గీ. "మచ్చలేనట్టి చిత్తాన మంచిబత్తితోడ నీచేత నొకచిన్నితులసిదళము
నిడిన గల్గు" నటంచు నేనెదనెఱింగి కాంక్షఁజేసితి శ్రీరామ కదలిరమ్మ. ౧౩

మ. అదెయేదో నినదంబు వీనులకువిందై నన్నుఁ దాఁ బిల్చుచు
న్నది "యోసీ!శబరీ! తరించితివి ధన్యత్వంబుఁ గైకొంటి వ
ల్లదె శ్రీరాముఁడు నిన్నుడాసె నిఁకనేలాభ్రాంతి నీ" కంచు నేఁ
డిదియేమో విననయ్యె; దాశరథి యేఁడీ? నాసమీపంబునన్. ౧౪

మ. కనఁగా దూరమునందు, నీలఁపుశలాకన్బోలి యొప్పారె ప్ర
క్కన బంగారుఁపుఁజాయతోడ నదియో క్రాలంగ నేనున్న ది
క్కునకే యంతకు నంత దాపగుచు నేగున్దేరె; నన్గన్న నా
యనయున్, లక్ష్మణుఁడౌదు రేమొ; కలదే యాభాగ్య మిప్పేదకున్. ౧౫

మ. అగు నాదేవుఁడు రామచంద్రుఁడె నిజంబయ్యెన్ నిదానించి చూ
డఁగ నాస్వామికి ముద్దుతమ్ముఁడదె దండ న్బొల్చుచున్నాఁడు నె
మ్మొగములాడఁగఁ గాల్లుకందఁగ శ్రమమ్మున్ సైఁచి వారిట్లొ న
న్నుఁ గనంగా నిటవచ్చుచుండిరిఁక నా నోముల్ఫలించెన్గదా! ౧౬

### శ్రీరామ సాక్షాత్కారము

మ. భళిరే! కంటినిగంటి సాధులను గాపాడంగ నిక్కానకున్
బలుపాట్లన్బడి వచ్చు రాఘవుని శ్రీ పాదంబుల న్నేఁడు నా
తలఁపుల్పండెఁ గృతార్థనైతి నికఁజింతందక్క సేవింతుఁ బం
డులనర్పింతును మోడ్పుఁగేలవినుతింతున్ రామచంద్రప్రభున్.

శ్రీక్రియాశక్తి యొడయరు గ్రంథాలయ నవమ వార్షికోత్సవసభ, ధర్మవరము



The 9th Annual Conference of the Kriyasakti Yodayar Library, Dharmavaram



మునిసిపలు ఖద్దరుస్టోర్సు యొక్క నూలువడుకు సంఘము, తిరుపతి

Municipal Khaddar Stores' Spinning Club, Tirupati



గాంధీ పఠనాలయము యొక్క నూలువడుకు సంఘము, తిరుపతి

Gandhi Reading Room's Spinning Club

ఆంధ్రరాష్ట్రీయసభ, చెన్నపురి ఖాదీప్రదర్శన నిర్వాహకులు, ప్రదర్శకులు



Andhra Provincial Conference, Madras

శ్రీ వేంకటేశ్వరాయుర్వేదకళాశాల, బెజవాడ



Sri Venkatesvara Ayurvedic College, Bezwada

# ద్వావింశతి శ్రుతిపథకము

దువ్వూరి జగన్నాథశర్మ గారు

భారతీయగానము పెక్కువేలయేండ్ల వయస్సుగలది. అట్లగుటచేత రచనాదిభాగములందు దానిపట్ల అప్పుడప్పు డెన్నిమార్పులో కలిగినవి. ఐనను దాని మాధుర్యభాగముమాత్రము మార్పు పొందలేదు. అందుకుఁ బ్రధానకారణము: స్వరత్వమూలకమని పేర్కొనఁదగిన శ్రుతులపునాది యేనాఁటికిని శిథిలతనొందనిస్థితి యేర్పడియుండుటయే! మనసంగీతశ్రుతులపునాది శైథిల్యముఁబొందకుండు టొక్కటియకాదు; దానిరహస్యము, దానిమూలకందము పరమాత్మసంభావన మజ్ఞానికివలె సామాన్యగాయకులపొంతఁ బడదు. మఱియు దాని రహస్యము నెఱుఁగఁగోరుగాయకులుకూడ అల్పసంఖ్యాకులు. ఎవ్వరోకొంద ఱెఱుఁగఁగోరినను ఫలానుభవము హుళిక్కియను ననాదరంబునఁ బూర్తిగాఁ గష్టింపక విడిచిపెట్టినబుద్ధిమంతులును గలరు. అట్లగుటచేతఁ బ్రతిశతాబ్దమందును భారతీయగాయకులలో వాగ్గేయకారునంతటివాఁడయి ఆచార్యత్వము వహింపఁగల్గువాఁడొకరుఁడెవ్వఁడో శ్రుతులమీఁద బుద్ధింబఱచి ఆకాశప్రదేశమును ఎకరములలెక్కలో గణుతించినట్లు మిక్కిలి శ్రమపడి ద్వావింశతిశ్రుతిపథకముయొక్క నిజస్థితిని దెలిసికొనుచున్నాఁడు. నిజముగా నందువల్ల ఫలమేమయినఁ గలదా యందురేని, చటుక్కున ఫలమిట్టిదియని రూపింపఁదగినదియేదియు నుండదు. కాని చతుర్దండియని బయలుదేఱిన వేంకటమఖి మున్నగువారి చరిత్ర మరయుఁడు! త్యాగరాజాదికృతుల విస్తరతకు నిజమైన కారణమేమి? ఇంతరాగప్రపంచ మెక్కడనుండివచ్చినది? ఇఱువదిమేళములని- ముప్పదిఘనరాగములని- పురుషరాగములని- స్త్రీరాగములని ఇన్నియు లెక్కించఁగా నొకచిన్న కుటుంబసంఖ్యవలె కన్పట్టుచుండిన కర్ణాటకగానరాగాదివృద్ధికి- దానింబట్టి భారతీయగానమునకు - ఇంతటివృద్ధి వచ్చునట్లును, ఇతోధికవృద్ధికిఁగూడ మార్గమబ్బునట్లును ద్వావింశతిశ్రుతిపథకమును ఖచ్చితముగా మేధస్సునకుఁ దెచ్చుకొనిన మహోపకారమే వారొనర్చియుండిరి! అంతకుఁబూర్వముండిన యిఱువదిమేళములలోఁగూడ అయిదుమేళములు వాడుకనుండి తొలఁగఁదగినస్థితి పొందినవి. ఈసంగతి ఏలూరునందుండి అళియరామరాయలకుఁ గృతి సమర్పించిన రామామాత్యుని స్వరమేళకళానిధి విస్పష్టముగా బోధించుచున్నది. కాఁగాఁ బదునైదుమేళములు మాత్రము కల్గిన మనసంగీతరాగభాగమునకుఁ బరిశుద్ధములయిన డెబ్బదిరెండుమేళములను వేంకటమఖి తెచ్చిపెట్టినట్లగపడుచున్నది- (చూడుఁడు: చతుర్దండి ప్రకాశిక). అది యెట్లు? ద్వావింశతి శ్రుతిపథకము- దానికి సంబంధించిన అనువాది, సంవాది, వివాది, వాది స్వరశక్తికలనర్థము చేసికొని- అట్లు గనుక, దీని ప్రయోజన మిట్టిదియని చెప్పుటకంటె ఇందుల ప్రయోజన మిట్టిదియని తామే స్వయముగ నెఱింగి పనిచేయువారికిఁ జేమోడ్చుట నావిధియని తలంచుచున్నాను.

రమారమి నూఱుసంవత్సరములనుండి ద్వావింశతి శ్రుతిపథకమును అర్థముచేసికొనవలెనని పెక్కండ్రు యత్నించుచుండిరి. అట్లు యత్నించుచుండినవారిలో భారతీయ విద్వాంసులును గలరు; పాశ్చాత్యగణితవిశారదులును గలరు. కాని విజయకిరీటమును బొందఁజాలిన వారెవ్వరును కన్పడకున్నారు. కాఁబట్టి యీసమస్య క్లిష్టమైనదియే యని అందఱు నొప్పుకొనుచున్నారు. 1834 సంవత్సరములో కెప్టనువిల్లర్డుమహాశయుఁడును, 1870

ప్రాంతములో సర్ విలియంజోన్సుమహాశయుఁడును, 1877 సంవత్సరములో బోసాంక్వేట్ మహాశయుఁడును, 1885 ప్రాంతములలో ఎల్లిస్ పండితుఁడును, పేటర్సన్ మహాశయుఁడును, కెప్టన్ డేమహాశయుఁడును, ఇటీవల 1900 సంవత్సరప్రాంతములనుండి యిప్పటివఱకును క్లిమెంట్సుపండితుఁడును, మనద్వావింశతిశ్రుతిపథకము సర్థముచేసికొనవలెనని మిక్కిలి శ్రమచేయుట తటస్థించినది. కాని వారు వ్రాసిన తప్పువ్రాఁత లల్పబుద్ధులను పెడద్రోవలఁ బట్టించుటకుమాత్రమే శాశ్వతత్వము వహించియున్నవి. మనవారిలో కుంతే, పింగళే, సహస్రబుద్ధి, బోహట్టి, సర్ శౌరీంద్రమోహన్ టాగోరు, నాగోజీరావు, చిన్నస్వామి మొదలియారు మున్నగువిద్వాంసులు పెక్కుండ్రీసందర్భమున యత్నించియుండిరి. ఇటీవల విష్ణునారాయణ భాట్ఖండే, క్రిష్ణాజీ బల్లాల్ దేవళ్, నీలకంఠవినాయకఛత్రే, అబ్రహాంపండితార్ మున్నగుపండితులుకూడ యత్నించియుండిరి. ఎంద తెన్నిగణితచమత్కారములు చూపినను ఎవఁడుమార్గమువారి దేమైనది. పూర్వశ్రుతిపథకగణితమునకుండిన మూలసూత్రములతో నొక్కరికిని సమన్వయము కుదురలేదు. ఇట్టిదిమైయున్నది, మనద్వావింశతి శ్రుతిపథకప్రయోజనమును, నూతేండ్లనుండి ఎంతపండితునికైనను విజయసామీప్యతకుండిన అసాధ్యత్వమును.

ద్వావింశతిశ్రుతిపథక మన నేమి?

స,రి,గ,మ,ప,ధ,ని అనుస ప్తస్వరములుగలది సరళి. (Ganut) ఈస్వరసప్తకపథకము (Diationic Seale) స్వరద్వాదశకపథకమునుండి యేర్పడుచున్నది. స్వరద్వాదశపథకము అనునది ( Chromatic Scale) ద్వావింశతి శ్రుతిపథకమునుండి యేర్పడుచున్నది. స్వరస్థానములు మధ్యనుండు అంతరాళములును గలిసి ఏపద్ధతిలో ఇఱువదిరెండు శ్రుతులపరిమాణముగలదిగా నున్నదో దానికి ద్వావింశతిశ్రుతిపథకమని పేరు. స్వరములు పండ్రెండుగదా! పండ్రెండుస్వరములనడుమ అంతరాళములు పదునొకండుగదా! ఈమొత్తము ఇఱువదిమూడుకావలెనే, ఇఱువదిరెండెట్లగును? ఇది సమస్య. స్వరస్థానములయవయవము-అంతరాళముల యవయవము భిన్నదేహములనుండి యేర్పడి ఇప్పుడొకటియైనది. పూర్వకాలమందలి మధ్యమగ్రామదేహభాగముకొంత, షడ్జగ్రామదేహభాగముకొంత కలిసి ఇప్పటిరూపందినది. ఇట్టిదీనిని విడదీసి కలుపుసూత్రమెవరికిని బోధపడకున్నది. ఆసూత్రమే ద్వావింశతి శ్రుతిపరిగణనమని చెప్పి రెండుగ్రామములను కలిపిన విధానమని ప్రాజ్ఞులు బోధపఱచుకొనుచున్నారు. ఏసంగీతము పాశ్చాత్యమైన స్వరాంతరాళసంఖ్యచే ఇరువదిమూడగుచున్నదో అది గ్రీకుమాతృకగలది. దానినిగుఱించి మాట్లాడఁదగినది మన కిప్పు డేమియులేదు. క్రీ. పూర్వము 2500- 1400 నడిమికాలములో షడ్జమధ్యమగ్రామముల యేకీభావమువలన స్వరాంతరాళసంఖ్య ఇరువదిరెండుమాత్రమేమై రంజనసందర్భములకన్నిటికి అటపట్టయినది. భారతీయ మాతృక వివాదిస్వరములను పాడు నేర్పు (Enharmonics) వలన విద్వత్తు నేర్పఱచునది గ్రీకుమాతృక. సంవాదిస్వరముల (Harmonics)పాడుటవలన మైమఱపించుప్రౌఢిమ నేర్పఱచునది భారతీయమాతృక. అనఁగా 23శ్రుతులసంగీతమున వివాదిస్వరములుగల్గి(Tempered scale) ఏర్పడినది. 22 శ్రుతులసంగీతమున సంవాది స్వరములుగల్గి (untempered scale) ఏర్పడినది. మనదేశములో నీనడుమ బైలుదేఱినవివాదములో మహారాష్ట్రులు 22 శ్రుతులవంకకును, తంజావూరుతమిళులు 23 శ్రుతులవంకకును, క్లిమెంట్సుమున్నగు పాశ్చాత్యపండితులు 22 శ్రుతులవంకకును తమవాదమును బయలుపఱచిరి. 23 శ్రుతులను వారు యంత్రసంగీతము కావలసినవారు. వారికట్లుండినగాని యంత్రము సరిపడదు. హార్మోనియము, పియానోమున్నగునవి వారియంత్రములు. 22 శ్రుతులవారు వీణావాదనవైదగ్ధ్యమందిష్టపడువారు. తంత్రులకు 22-23 కూడ సరిపడును. ఇరుకక్షులవారును తమతమ పద్ధతులకు తంత్రులమీఁద కొలతలిచ్చిరి. పూర్వగ్రంథ సూత్రములతో వీరెవరికిని సమన్వయము రాలేదని ఇది వఱకే తెల్పితిమి.

మిక్కిలిపూర్వకాలంబున శ్రుతివీణ లుండినట్లు బోధపడుచుండినది. భరతుఁడు మధ్యమగ్రామవీణను, షడ్జగ్రామవీణను రెంటినిచెప్పి రెండువీణలకును ద్వావింశతి

శ్రుతిపథకమును చెప్పినాఁడు. పర్యాపకర్షోత్కర్షములచే షడ్జగ్రామవీణను మధ్యమగ్రామవీణగను, మధ్యమగ్రామవీణను షడ్జగ్రామవీణగను మార్పువిధానము చెప్పినాఁడు. దీనిని బట్టి వీణలందలి మెట్లు=సారెలు (పర్వములు=**Frets**) ఎటు త్రోసినను జరుగుపద్ధతిలో పూర్వులేర్పఱచుకొను చుండిరని బోధపడుచుండినది. మధ్యకాలములోఁ గొంత కాలము మెట్లులేక వీణలు సర్వస్వర ప్రతిపాదకములగు తంత్రులతో మాత్రమే యుండినట్లు ద్యోతకపడుచున్నది.

"రణద్భి రాఘట్టనయా నభస్వతః, పృథగ్విభిన్న శ్రుతిమండలైస్స్వరైః స్ఫుటీభవద్గ్రామవిశేషమూర్ఛనామవేక్షమాణం మహతీం ముహుర్ముహుః"

అని మాఘకవి ఒకవీణను- నారదుని మహతిని- వర్ణించియున్నాఁడు "వాయువుయొక్క ఆఘట్టనచేత వేఱు శ్రుతిమండలములుగల్గిన స్వరములవలన షడ్జమధ్యమగ్రామములందలి మూర్ఛనావిశేషములు స్ఫుటపడుట మాటిమాటికి మహతియందు నారదుఁడు చూచుట తటస్థించెను." ఒక్క వీణయందు ఒక్క గ్రామమూర్ఛనలు రావచ్చును, రెండు గ్రామమూర్ఛనలు రావు అవియైనను తంత్రిని వీటి పర్వములందు వ్రేలితో నదిమిననే వచ్చును. ఈనేచెప్పు సమన్వయము ప్రస్తుతవీణలమీఁద; నారదునిమహతియందో రెండుగ్రామములమూర్ఛనలుకూడ పర్వసన్నిహితమైన కరరుహస్పర్శ అక్కఱలేకుండ తంత్రుల యేర్పాటువలనను ప్రభంజనహతియొక్క ఆవేగము చేతను వచ్చుచున్నవి. అనఁగాఁ బర్వరహితములయి తంత్రీబాహుళ్యముగల్గిన వీణ లప్పుడుండినట్లు ఇందలి యర్థము.

శా. వాలారుంగొనగోళ్ల నీ వలపతక్ వాయించుచో నాటకక్ మేళంబైన విపంచి నిన్నమొదలుక్ నీవంటుమింతేసి యా యాలాపంబె యవేళఁబల్కెఁడుఁ బ్రభాతాయాతవాతాహతా లోల త్తంత్రులు మేళగింపఁగదవే లోలాక్షి! దేశాక్షికి.

అని అల్లసానిపెద్దనకూడ ఇట్టివీణనే యిచ్చియున్నాఁడు. "వరూధినీ! నీవువాయించి విడుచునప్పటికి నాటరాగమునకు నీవీణతంత్రులు మేళగింపఁబడియున్నవి. నీవువాయించక విడుచుటచేత ఇప్పుడు వేళగానివేళలో ఈ ప్రభాతవాయువీచికలచేఁ గొట్టఁబడిన తంత్రులు నాటరాగమును స్ఫుటపఱచుచున్నవి. ఇది దోషముగావున, ఇది దేశాక్షికిసమయముగనుక నీవు వాయించకపోయి నను వీణతంత్రులనైనను మేళగింపుము!" దీనినిబట్టికూడ అల్లసానిపెద్దన చెప్పిన వరూధినివీణ పర్వరహితమై బహుతంత్రీబద్ధమైనదిగా ద్యోతకపడుచున్నది. వీణలమెట్లు ఆవలకు ఈవలకు త్రోయుట, ఔడవాదిరాగంబులకు మెట్లు తగ్గించుట, సంపూర్ణరాగములకు పూర్తిగామెట్లుంచుట, ఇట్టి బాధలుపడుచు మొనమొన్నఁటిదాఁక అస్థిరపర్వవీణలనే మనగాయకులు వాడుచుండెడివారు. స్థిరపర్వవీణలను తంజపురితులజేంద్రప్రభువు స్థిరపఱచి ఇప్పుడున్నపద్ధతిలో నెలకొల్పినాఁడు. ఇట్లు బహుకాలమునుండి స్వరపక్కికలో అవసరమైనన్నిమార్పులు మనవీణలు పొందుచు వచ్చుచుండుటచే శ్రుతిబోధకములగు వీణలు బొత్తుగా వాడుకనుండి తొలఁగిపోయినవి. అచ్యుతదేవరాయవీణయొకటి శ్రుతిబోధకమైనది 15, శతాబ్దమందు బయలుదేఱినది. దానికి ఇప్పటివీణలకును భేదము స, ప, స, ప తంత్రు లిప్పటి వీణలందుండఁగా దానితంత్రులు స, ప, స, మ ధ్వనులు కూర్చుండెడివి. ఇట్టివీణనే ద్వావింశతిశ్రుతివీణనుగా మనవారు కూర్చెదరు.

ద్వావింశతి శ్రుతివీణకుఁ గొలతలిచ్చినవారిలో సుప్రసిద్ధుఁడు మా అనుపూర్వకుఁడును భరతాచార్యులలోనొక్కరుఁడును అగు అండ్రంగిసో మనాధభట్టు. ఈతనిగ్రంథము రాగవిబోధము. జర్మనీయులసమన్వయమున శ్రుతివీణానిర్మాణమునకుఁ బాశ్చాత్యులకుఁ దోడ్పడియున్నది. సంగీతరత్నాకరము, మతంగస్వరపక్కి, సంగీతపారిజాతము, శ్రీనివాసపండితపక్కి, చతురపండితపక్కి, నందికేశ్వరభరతము ఇవియును చతుర్దండిప్రకాశిక, స్వరమేళకళానిధి, సంగీతసారామృతము ఈ గ్రంథములును ద్వావింశతిశ్రుతిపథకమునుగూర్చి తెల్పఁగల్గిన సంస్కృతవాఙ్మయము. నేను ద్వావింశతిశ్రుతులనుగూర్చి, సాంస్కృతికసూత్రములనుగాని సెంట్లలోగాని లోగరిథమ్సులో తంత్రీవిభాగాత్మకమైన కొల్తలయాధారముల నిచ్చుటగాని యీవ్యాసమం దనవసరమని తలంచి యింతటితో విరమించుచు ద్వావింశతిశ్రుతిమేరువును ప్రస్తుతము వాడుకలోనుండిన షడ్జగ్రామాత్మకముగా నిచ్చుచున్నాను.

మున కనర్హులే యగుదురు. అనుశ్రుతాచార గ్రాంథికసాంప్రదాయములకు విశేషభేదము లేదు. ఇటీవల తమతమ విశేషపరిశ్రమలవలన గలిగిన రసతంత్రవిజ్ఞానము గ్రాంథికము చేసినయెడల తమతమరహస్యములు లోకమునకు వెల్లడియై తమతమయుపాధులకో, తమతమయాధిక్యతలకో భంగము కలుగునని యీర్ష్య వహించుటచేత, నాయాయనుశ్రుతాచార సాంప్రదాయములు కొన్ని హపహూర్మప్రాయములై యున్నవి. కాని, కొన్ని సిద్ధసాంప్రదాయము లున్నవి. అవి గ్రంథస్థములుగా లేవు. అందు విశేషభాగము వాదఖండమునకు సంబంధించిన నగుటచేతనో వెల్లడిచేసిన రససిద్ధికొఱకు విశేషపరిశ్రమచేయక యీ సులభపద్ధతుల నవలంబించి రసతాంత్రికాభివృద్ధికి విముఖులగుదురనియో యాయాసాంప్రదాయప్రసిద్ధ తంత్రరహస్యములు గ్రంథస్థములుగాక సిద్ధాధీనములై యున్నవి. వాదఖండ పరిశ్రమ ప్రస్తుతకాలమున కనవసరమైనను వాదభ్రష్టుఁడు వైద్యశ్రేష్ఠుఁడగు ననుసామెతకు ప్రయోజనము నెఱింగి రోగభూయిష్ఠమగు నీలోకము నుద్ధరింప రసరసాయన ఖండములు ముఖ్యముగాఁ బరిశీలించి వృద్ధినొందించుట యావశ్యకము. ప్రత్యేక రసతంత్రకారులకు పూర్వము చరకాదులు ఖనిజములగు రసాదిధాతువులను పరిశీలింపక పోలేదు. కాని తమ సంహితలయందు ప్రత్యేక రసాదిధాతు విమర్శనము వివరింపలేదు. సర్వధాతుపాషాణాది ఖనిజములు గ్రహించి రసతాంత్రికులు ప్రత్యేకతంత్రములు క్రమక్రమముగా కాలానుగుణ్యమగు తమతమపరిశ్రమల ననుసరించి వ్రాయఁదొడంగిరి. నిత్యానందసనాథ, నిత్యనాథ, చందనాచార్య, మంథాన భైరవ, కశ్యప, రేవణసిద్ధ, భోజ, నరహరి, వరరుచి, యగ్నివేశ, పునర్వసు, అశ్వినీదేవ, ఉగ్రాదిత్యాచార్య, మొదలగు రసతాంత్రికులు వ్రాసిన గ్రంథములు మరియు ననేక రసతంత్రములు జగద్విశ్రుతము లైనవి. అందు రసార్ణవాది గ్రంథములయందు రస, రసాయన, వాదఖండములు విపులముగా వర్ణింపఁబడినవి. రససారరసార్ణవాది తంత్రములయందు రసాంకుశవిద్యనుగురించి స్వల్పముగా వ్రాయబడి యున్నది. 1182 శకకాలమున వైద్యవరుఁడగు శ్రీ కేశవుఁ డొకసిద్ధమంత్రమను పేర వస్తుగుణతత్వమును వర్ణించుచు నొకగ్రంథము రచించెను. ఇతఁడు బరోడా (విదర్భ) దేశాంతర్గతమగు వరదా (వర్ధా) నదీతీరమునంగల దేవపద్రగ్రామనివాసి, మహాదేవపుత్రుఁడు; భాస్కరాఖ్యభిషగుత్తమునియొద్ద నాయుర్వేదము నధ్యయనము చేసెను. ఇతని కుమారుఁడు బోపదేవుఁడను వైద్యవిద్వాంసుఁడు. ఈ కేశవకృత సిద్ధమంత్రము గ్రంథమున స్వర్ణాదిసర్వధాతువులు, హింగుళసౌవీరాది రసవికారములు, శంఖవరాటప్రవాళములు, అంజనములు, సముద్రఫేన, తువరీ గైరికములు, తాళకమనశ్శిలలు, లక్క మొదలగువానికి గుణవర్ణనము చేయబడినది. కాని రత్నాదులు, మరియు, రసోపరసధాతూపధాతువులయొక్క రూపాంతరవిశేషముల నామములు తత్తద్వస్తుగుణతత్వము వర్ణింపంబడలేదు. శంఖగోరీపాషాణములు, చేర్పఁబడలేదు. ఈకాలమునకు రసతంత్రాభివృద్ధికాకనో, రసార్ణవాదితంత్రకర్తలకు ప్రాచీనుఁడగుటనో లుప్తకారణము దుర్గ్రాహ్యముగా నున్నది. ఇప్పటివరకు మనదృక్పథమునంగల రసయంత్రములయం దెక్కడను మయూరతుత్థ సిందూరము, శంఖపాషాణసిందూరము, ఇంగిలీకభస్మములు, క్షారబద్ధము కాకుండచేయఁదగిన తాళకభస్మయోగము, తామ్రభస్మము తెల్లగానగు విధానము, ఉక్కు తెల్లగా భస్మమగు ప్రక్రియ, మనశ్శిలాగంధకభస్మములు, అంజనములయొక్క ప్రత్యేక ప్రయోగవిధులు, తద్భస్మప్రకారములు, లోహాభ్రకాదులకు ఏకపుట భస్మసిందూర విధానములు, నవాసారము మొదలగు క్షారలవణములకు కట్టు, భస్మములు చేయువిధానములు, అగ్నిస్పర్శకు నిలువలేని రసగంధక తుత్థపాషాణాదులు నిలుచునట్లు చేయు (పాగరయొత్తని) కట్టు (బద్ధ) ప్రక్రియలు వర్ణింపఁబడి యుండలేదు. కాని, కొందరు వైద్యవేత్తలు సిద్ధసాంప్రదాయముల ననుసరించియో, అగస్త్యసాంప్రదాయముల ననుసరించియో సంగ్రహించి కొన్నికొన్ని యసాధ్యరోగములమీఁద ప్రయోగించి మంచిఫలితమును గాంచుచున్నారు. ఆ యా యోగవిధానములు గుప్తపరచియుండుటవలన గ్రంథస్థములుగాక వారితోడనే యనుగమింపవలసినవిగా నున్నవి. ఈ గుప్తవిద్యవలన లోకకల్యాణ మెట్లగును? రసతాంత్రికవిద్యాభివృద్ధి యెట్లు కలుగును? నూతన రససంస్కారములు కనిపెట్టిగాని సంగ్రహించిగాని, నూతన రసగ్రంథకర్తృత్వభాగ్యము సంపాదింప నిష్టములేకపోయిన పోవుగాక! వైద్యలోకము ప్రాచీన సంస్కారములైనను యథాశాస్త్రీయముగా విమర్శించినయెడల లోకోపకారకపరిశ్రమయందు దీక్షగలరై రసతంత్రాభివృద్ధి నొనర్చినభాగ్యమును వైద్యులు చూరగొందురు. క్రొత్తక్రొత్తపరిశ్రమలం జేసి, క్రొత్తపద్ధతులం ద్రొక్కి, క్రొత్తకల్పనము లూహించి తదనుగుణ్యములగు గుణములు అనుభవసిద్ధములుగా బరిశీలించి పాశ్చాత్యులు తమ రసతాంత్రికశాస్త్రమును నభివృద్ధి నొందించుకొనిరి. మనశాస్త్రము ననుసరించి యభివృద్ధికాకపోయినను తమశాస్త్రీయపద్ధతులను పట్టుదలతోఁ బరిశీలించి లోకోపకారమునర్చిరనుట నిర్వివాదము. మన ప్రాచీనరసతంత్ర పరిశ్రమలు చికిత్సాభాగమునకే చాలియు చాలనిపరిస్థితులలో నసంపూర్తిని బొందియున్నవి. పాశ్చాత్యరసతంత్ర పరిశ్రమలొక్క చికిత్సాభాగమునకే కాక సకలార్థిక కార్మికాదిపరిశ్రమలకు మూలాధారముగా బరిణమించి నిరంతరలోకసహాయభూతములై యున్నవి. మనము పౌరాణికగాథల నమ్మి పార్వతీరక్త శోణితములే కృష్ణాభ్రకగంధకములని చెప్పుదుము. పాశ్చాత్యు లట్లుగాక యీయీ ధాతువులు వేనివేని పరస్పర సమ్మేళనమువలన గలిగినవి? ఆయా ధాతువులను విభజించినప్పుడు ఏయే భాగము లెంతెంతకూడియున్నవి? అని పరీక్షింతురు. మరియు వానిని రూపాంతరములుగా మార్చి వానిగుణాగుణవిమర్శనముచేసి యుపయోగములోనికిం దెత్తురు. ఆతరువాత తదనురూపవస్తు కల్పనము చేయుదురు. వజ్రాదిరత్నము లిందుకు తార్కాణములు. మనమో కృష్ణాభ్రకసిందూరము ప్రాచీనపారంపర్యముగా శతపుటములు వేయవలయునను సిద్ధాంతమేకాని, ఆనిశ్చంద్రికత్వసిద్ధి, సిందూరత్వము, అరుణవిశేషము మన కొక్కపుటములో రావలయునను ప్రయత్నము, తదనుసారమగు సంస్కారవిధానమును గురించి యోచనచేసితిమా? పోనిండు; అట్టే శత

పుటాభ్రకసిందూరమే మన కవశ్యకర్తవ్యముగాక. కృష్ణాభ్రకము నూరుపుటములతో నిశ్చంద్రికగాచేసినట్లే యాకృష్ణాభ్రకమును తెల్లగా భస్మము నేలచేయకూడదు? అనుప్రశ్నము వేసికొని నూతనమార్గముల యోచించి అభ్రకమును నిశ్చంద్రికగాను తెల్లగాను భస్మీకరించి గుణాగుణవిమర్శనము చేసిచూడవలయును. అప్పుడుగదా రసతంత్రము నూతనాభివృద్ధినొందిన ట్లూహింపవలయును? ఇట్లే పాటుపడి యితర ధాతువులనుగురించి విమర్శింపవలసియున్నది. ప్రాచీనగ్రంథములయం దనేకసవరణలు చేయవలసినవి గలవు. పూర్వరసవైద్యగ్రంథములయం దొకేవిధమగు నౌషధయోగ మనేకనామాంతరములతో వివిధరోగ ప్రకరణములయం దుదహరింపఁబడి యున్నది. చింతామణియను వైద్య గ్రంథమున పిత్తభంజనరసము, కారుణ్యసాగరరసము, సూతరాజరసము, పైత్యాంతకరసము, మహాప్రాణేశ్వరరసము, సోమేశ్వరరసము, రసాయనము - ఇవి పిత్త, ఆమ్లపిత్త, అతిసార, గ్రహణీ, కుష్ఠ, హృద్రోగాది ప్రకరణములయం దొకేవిధమగు రసగంధకాభ్రకసమ్మేళనము వేర్వేరునామభేదములతో వేర్వేరుప్రకరణములయం దుదహరింపఁబడి నది. చింతామణియందు సంగ్రహణీప్రకరణమున వ్రాయఁబడిన సూతరాజరసమనుయోగమే రసేంద్రచింతామణియను రసగ్రంథమున గగనసుందరరసమను పేర నున్నది. పైత్యప్రకరణమున చెప్పఁబడిన పిత్తభంజనరసము రసేంద్రచింతామణియందు గ్రహణీప్రకరణమున త్రిసుందరరసమను నామాంతరముతో నున్నది. ప్రాచీనమైన రసేంద్రచింతామణియందు గ్రహణీహరమునిమిత్త ముదహరించిన త్రిసుందరరసమును అర్వాచీనుడైన చింతామణికర్త పిత్తభంజనరసమను నామాంతరముతో తనగ్రంథమున వ్రాసికొనుట తన కేమిధర్మము? ఏమిగొప్పతనము? గ్రహణీ, పిత్తదోషోపశమనశక్తులు రెండుగలిగియున్న యెడల నీరెండింటికి సాధన మిదియొక్కటియేయని నూతనరసతాంత్రిక గ్రంథమున వ్రాసికొనవలయును. ఇట్లు రసతంత్రము లెల్లఁబరిశీలించి యనుభవవిరుద్ధములు, పరస్పరభేదములు నామాంతరకల్పనములు విమర్శించి,ప్రతిప్రకరణమునవరించి,సిద్ధయోగముల నేర్చి,యొకచో వ్రాసినదియొక యుత్తమ రసతంత్రసారమగు గ్రంథరాజమగును. అది చికిత్సావిషయమున నసమాన గ్రంథముగా నుండును. ఇట్లేకాక భస్మసిందూరములు ప్రతిగ్రంథమునం గలవానిని అనుభవసిద్ధములుగా బరిశీలించి సిద్ధయోగములనన్నిటి నొక్కచోట వ్రాసిన వైద్యలోకోపకారముగా నుండును. రసరత్నసముచ్చయమున కాసీసబద్ధరసమను పేర నొకయోగము వ్రాయఁబడి యున్నది. రసము 1 భాగము, కాసీసము 6 భాగములు మద్దిచెక్క రసమున మర్దించి బిళ్లచేసి శరావసంపుటమున నుంచి చీలకమన్నులిచ్చి వరాహపుటమిడిన కాసీసబద్ధరసమగును అని యున్నది. ఈయోగకారునియభిప్రాయము కాసీసముచే బద్ధమైనరసము అనిగదా! కాసీసము లోహమయమగు లవణవిశేషమగుటచే రసమును బంధించునని యభిప్రాయము. ఇది సరియగునదియైనను అనుభవసిద్ధముగు పర్యవసానమందు కాసీసము సిందూరించి రసము లేచిపోవుచున్నది. కాసీససిందూరము కూడ నతిలేతదై పోవుచున్నది. ఈరెండింటి నాపుటము మద్దిచెక్క భస్మమునకైన తగినసత్తువలేదు. ఈయోగము దుస్సాధ్యమైన కిలాసాదికుష్ఠములకు చెప్పఁబడినది. ఇట్లే శ్విత్రాదిరసము రసగంధక కాసీసములు సమాంశములు చేర్చి తులసియాకు రసమున మర్దించి పైప్రకారమే పుటమిడవలయునని రసరత్నసముచ్చయమున రసవాగ్భట్టుదహరించెను. రసతంత్రములయం దిట్టి యనుభవ విరుద్ధములగు యోగములు వేనవేలు కనిపించుచున్నవి. ఇట్టి పుటయోగములు పరిశీలించి భస్మసిందూర ప్రక్రియలు చేసిచూచి విరుద్ధయోగములను విసర్జించుటగాని, ప్రక్రియాభేదముచేత సవరించుటగాని చేయవలయును. విసర్జించుటకంటె ప్రక్రియాభేదకల్పనములచే సాధించుటే యుత్తమము. దుస్సాధ్యమైన వ్యాధుల కిట్టి భస్మసిందూరములే శరణ్యములై యారోగ్యయుతములుగా నుండును. కుష్ఠాది దుస్సాధ్యవ్యాధులకు కల్లైనను భస్మసిందూరములైనను పనికివచ్చును. రసము తాళకము చేర్చి పలాశక్షార మధ్యమున పాకముచేసిన భస్మమగునని రసేంద్రచింతామణియం దీయోగము నే భాగభేదములచే రెండువిధములుగా విజయానంద రసమనియు విజయభైరవ రసమనియు నామాంతరములతో వర్ణింపఁబడియున్నది. ఈ రెండుయోగములు పైశ్విత్రాదిరసము, కాసీసబద్ధరసమువలె వ్యర్థ పర్యవసాన దశయందున్నవి. కాని, యోగకారుని యభిప్రాయప్రకారము నిజముగా భస్మసిందూరములై యున్నేని కుష్ఠాది రోగపీడితుల రక్షించుట సుకరమగునని తాంత్రికాభిప్రాయము. ఇట్లే యొకటి రెండు ధాతువులను సమ్మేళనముచేసి భస్మ సిందూరములుగా మార్చి దుస్సాధ్యమైన యనేకరోగములం బోకడమట వైద్యవేత్తల ముఖ్యకర్తవ్యమై యున్నది. ప్రతి రసగ్రంథమును సాంతముగా విమర్శించి విరుద్ధయోగములను, గుణహీనయోగములను బరిత్యజించి సిద్ధయోగముల నొక్కచో వ్రాసి వానిని వైద్యకర్తలు రోగుల కుపయోగించి వారి వారి యనుభవములను ప్రకటించినప్పుడే రసతంత్రాభివృద్ధియు చికిత్సాసౌకర్యము కలుగును. అప్పుడే యాయుర్వేదవైద్యులకు వైద్యాభిధేయము తగును. ఆయుర్వేదమునకు ప్రాచీనగౌరవము నిలుచును. పాశ్చాత్యులలో తమతమ యనుభవములను అప్పటికప్పుడే వెల్లడించుటచేతనే వారివైద్యము ప్రసిద్ధి నొందుచున్నది. మనలో పరిశ్రమ చేయువారలు లేరు; విమర్శకులు లేరు. ఉన్నచో పరస్పరాసూయలచేతను, అహంభావములచేతను తమతమ యనుభవములను కప్పి పుచ్చుదురు. ఇట్లుండిన నెంతకాలమునకైన నాయుర్వేదచికిత్సలకు గౌరవముగాని యభివృద్ధిగాని గడించిపెట్టఁగలమా? పాశ్చాత్యుల నిందించి మన యీకొద్ది యభివృద్ధికి సంతుష్టిపడి యహంభావముతోను మత్సరముతోను మనయాయుర్వేదమె ప్రాచీనము; మనప్రాచీనులకంటె తెలివి కలవారు లేరు; మనగ్రంథములనుండియే పాశ్చాత్యాభివృద్ధి గలిగినది; మనకంటె యెవరు నధికులుకారని గర్వించి పురోభివృద్ధిని గోరకుండుట మన వినాశహేతువే కాని వేరు కాదు. పాశ్చాత్య సాంప్రదాయముల విమర్శింపవలయును. యూనానీ ప్రక్రియలను పరిశీలింపవలయును. అగస్త్య సాంప్రదాయములను నేర్చుకొనవలయును. అన్నిటిలోగల సారమే లోకము నుద్ధరించునుగాని ప్రత్యేక మొకసాం

ప్రదాయమే యభివృద్ధికి కారణభూతముకాదు. అన్ని సాంప్రదాయములు విచారించియే తమశాస్త్రాభివృద్ధియందు పాశ్చాత్యులుత్తీర్ణులైరి. ఈ ధర్మసూక్ష్మమును సహనముతోను, యనహంభావముతోను సమ్మిక్త పరిశ్రమాభివృద్ధిచేసి రోగప్రపంచము నుద్ధరించుట ప్రతివైద్యునకు విధాయకకృత్యమై యున్నది. ఏ స్వల్పపరిశ్రమతోనైన బిరుదములను సంపాదింప గలుగుదుము. కాని, యీబిరుదులు రోగముల నుపశమింప జాలవు. ఆయుర్వేదాభిమానులను ధనవంతులు, ధన్వంతరులు వైద్యప్రపంచ ముద్ధరించుటకుఁ బ్రోత్సహింపఁబడినగాని యీమహాకార్యము కొనసాగదు. అయినను వైద్యవేత్తలు తమతమ యనుభవసిద్ధములగు చికిత్సా ప్రక్రియలతో సంతుష్టిపడక రసతంత్రపరిశీలనము విమర్శనము చేయుచు వైద్యాభివృద్ధికి పాటుపడి దుస్సాధ్య రోగములకు పరమహంసక్రియలు కనిపెట్టి లోకము నుద్ధరింపవలయును. ఇట్టి శుభాకాశము శ్రీహరికృపవలన సర్వవిధ వైద్యవేత్తలకుఁ గలిగి యీయాయుర్వేద మచిరకాలంబున నభివృద్ధి నొందుఁగాక!

---

# సనాతనాంధ్రులు

మంగిపూడి వెంకటశర్మ గారు

చదువు నేర్చినారు జ్ఞానంబు గన్నారు, నాగరికతలోన పైగలట్టి
కులమువారితోడ దులదూగుచున్నారు, ఆంధ్రభువి సనాతనాంధ్రజనులు.

క. సోదరభావముమెరయగ, సాదరముగ జూడకున్న సత్యాగ్రహముల్
ప్రాదుర్భవించు వైకం,బే దృష్టాంతంబు తెలియరే ద్విజులారా!

క. పాక మది యంతదూరము, రాకుండగ సర్వసమత రహి విరారంగా
ప్రాకటజన్మపుహక్కు వి, వేకముతో నొసగి కీర్తివెలయుం డాంధ్రుల్!

ఆ. అంటరానితనము గెంటివేసితిమంచు, అగ్రజులు సనాతనాంధ్రనరుల
కౌగలించి తిరుగగా గోర రెవరును, వారి వియ్యమొందగోర రెవరు.

ఆ. క్రైస్తవులను జూచుమోస్తరుగా మన, ల్మానుజనుల జూచుమాదిరిగను
గౌరవంబుగదుర గనుడు హిందుసనాత, నాంధ్రనరులగూడ నాంధ్రులార!

ఆ. ఎల్లవీథులందు స్వేచ్ఛగా తిరుగాడ, నిండు చదువనిండు ఎల్లమొదల
నీళ్ల రేవులందు నీళ్లు చేకొననిండు, న్యాయమైన వివి సనాతనులకు.

సీ. ఏపుట్ట గనుగొన్న నాపుట్ట నాగేంద్రు, నిరవుగా భావించునరసులార!
ఏచెట్టు గనుగొన్న నాచెట్టు భగవంతు, నెలవుగా నెంచు ధీలలితులార!
ఏగట్టు గనుగొన్న నాగట్టుపరమేశు, నిల్లుగా దలచు సుధీంద్రులార!
ఏమిట్ట గనుగొన్న నామిట్ట జగదీశు, నవతారముగ జూచునసఘులార!
మృగముల ఖగంబులను సరీసృపములందు, చెట్టులను పుట్టలందును మిట్టలందు
నీశ్వరుని లీలలను గాంచి మొనగుమీరు, నరులహింసింతు రిది యేమిన్యాయమయ్య!

సీ. కోతినిగనుగొన్న ప్రీతితో హనుమంతు, నంశగా దలచుపుణ్యాత్ములార!
వృషభంబు గని వెంకటేశ్వరుం డనుచు నం, దీశ్వరుండని మ్రొక్కు సీద్యులార!
కుక్క భైరవుడంచు గురుతరభక్తితో, భావించు కారుణ్యభావులార
గ్రద్దనుగనుగొన్న గరిమతో విష్ణువా, హనముగా నెంచు ధర్మాత్ములార
ఎలుక జూచి పాము దిలకించి విఘ్నేశు, వాహనంబు విష్ణుపానుపనుచు
బాధచేయలేని సాధుశీలురు మీరు, సాటినరులమీదిచలము తగునె?

ఆంధ్రప్రాంతీయ హిందీప్రచారక సమ్మేళనము, గుంటూరు



Andhra Prantiya Hindi Pracharaka Sammelanam, Guntur

అమ్మలూరు ఆళోకం. ఏళ్లు 6 అంగుళాలు. వయస్సు 2 సంత్స. జనకకన్నవారు
తీసినగాని ధర్మపత్నిఐన శ్రీ దివాన్ వెంకటప్పయ్యగారు, అమ్మలూరు



బాలభారతీసమాజము, ప్రథమవార్షికోత్సవము, అనంతపురము



Bala Bharati Samajam, Anantapur

కీ. శే. ఎల్లేపెద్ది జానకిరామయ్యగారు



Late Yellepeddi Janakiramayya Garu

శ్రీ పరిగె నంజుండప్పగారు, ఆధయమతార్థి, ధర్మవరము



Sjt. P. Nanjundappa Garu, Dharmavaram

శ్రీ అప్పాద్వేదుల లక్ష్మీనారాయణగారు, యమ్. ఏ., యఫ్. యమ్. యూ.



Sjt. A. Lakshminarayana Garu, M.A., F.M.U.

శ్రీపాలకోడేటి వెంకటకృష్ణారావు గారు, యమ్. బి. సి. యమ్.



Sjt. Palakodeti Venkatakrishna Rao Garu, M.B.&C.M.

శ్రీయుత వేదుల వెంకట్రామశాస్త్రి గారు



Sjt. Vedula. Venkatrama Sastri Garu

శ్రీయుత బోడ చిట్టెయ్య గారు, రంగూను



Sjt. Boda Chitteyya Garu, Raugoon

# బ్రహ్మసూత్రములు లేక వేదాంతసూత్రములు

చిలుకూరి వీరావధానులు గారు బి. ఏ

హిందువుడు "వేదాంతి" యను రెండుపదములును సమానార్థబోధకములే యని సర్వవేదాంతవిజ్ఞానపారంగతుడగు వివేకానందస్వామి యొకానొకచోట చెప్పియున్నాడు. హిందూదేశము సర్వదా వేదాంతులదేశమే యని యొక ప్రతీతి యున్నదనియు, ఆ ప్రతీతి పట్టి నిరాధారముగాక సహేతుకమైనదనియు దేశాంతరుడును ఖండాంతరుడును, మహాపరిశోధకుడును అగు మాక్సుమూలరు పండితుడు పెక్కు సందర్భముల వక్కాణించియున్నాడు. ఇట్లు చెప్పుటచేత, ఇతర దేశములందు తత్త్వవేత్తలు బొత్తుగా లేనేలేరని కాని, ప్రతిహిందువుడును సంపూర్ణజ్ఞానియని కాని, వారియుద్దేశ్యమైనట్లు గన్పట్టదు. ఒక విధముగ జూచినచో, మానవులెల్లరు ఎంతయో కొంతవరకు వేదాంతులే యని చెప్పవచ్చును. కాని కేవలజిజ్ఞాసువులు సత్యగ్రహణపారీణులునై ఐహికసుఖములు తుచ్ఛములని త్రోసి ఆముష్మికవిషయచింతల మునిగినధన్యులు ఇతరత్రకంటె భరతఖండమున నధికముగ నున్నారనియు భరతఖండవాతావరణమే ఆధ్యాత్మిక వాతావరణమనియు చెప్పుట అతిశయోక్తి గానేరదు.

ఇందుకు గారణము ఏదియైనను గానీ; సంగతిమాత్రము ఇది. మతములన్నిటిలోను బహుప్రాచీనమై, కాలనిర్ణయము చేయుటకు గూడ గడుగష్టసాధ్యమని తోచు వేదమతము, హిందూదేశము అనాదిగ పరలోకభూమియని వేనోళ్ల జాటుచున్నది. సర్వప్రసిద్ధమతములకెల్ల పుట్టినిల్లు ప్రాచ్యఖండమే. జొరాష్టరు, మోసెస్, గౌతమ బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు మొదలుగాగల మతకర్తలెల్లరు ఆశియాఖండవాసులే; ప్రాచ్యులే. ఖండాంతరములయందు ప్రస్తుతకాలమున వ్యాపించియున్న క్రైస్తవమహమ్మదీయమతములు ఆశియాఖండజన్యములే. ఇందు గొన్నిమతములకు దల్లియై, అన్నిమతములకు దొల్లియై తనరారు వేదమతము హిందూదేశమునకు జెందియున్నది. ప్లేటో, అరిస్టాటిల్ మున్నగు మహాతత్త్వవేత్తలకు జన్మస్థానమైన గ్రీసు మొదలగు పాశ్చాత్యదేశములందుగూడ క్రీస్తు పుట్టుటకు గొన్ని శతాబ్దములకు బూర్వమునసే తత్త్వవిచారణలు ప్రారంభమైనమాట వాస్తవమే; కానియవి స్వతంత్రముగ బయలుదేరినవా లేక హిందూదేశమునుంచి యచ్చటికి వ్యాపించిన వేదాంతజ్ఞానప్రభవములా యను విషయమున బండితమండలిలో జాలయభిప్రాయభేదము గలదు. కాని హైందవతత్త్వజ్ఞానముతో బోల్చినచో, పాశ్చాత్యవిజ్ఞానము నిన్నమొన్నటిదిమాత్రమే యనియు, దానియంత పరిపూర్ణావస్థకు ఇది రాలేదనియు పెక్కుర మతము.

జీవనోపాయమునిమిత్తమై విశేషశ్రమపడ నవసరము లేక, ఫలవంతమగు ప్రాచీనహిందూస్థానవాసులు ఆకాశమున స్వేచ్ఛావిహారము సల్పు పక్షులవలె పరలోకవిషయముల మీదకు తమ బుద్ధులను ప్రసరింపజేసిరి. చిత్తశాంతికొరకు ఆశ్రమప్రదేశములందును కొండగుహలందును నివాసము లేర్పరచుకొని, తమ్ముగూర్చియు తమ్ము నావరించియున్న ప్రపంచస్వరూపముగూర్చియు, ఎందులకు తామందుండిరో, ఎచ్చటినుంచి యచ్చటకువచ్చిరో, అచ్చటనుంచి యెచ్చటికి బోవుదురో మొదలగు ప్రశ్నలగూర్చియు విచారణయందు దీరుబడిగ గాలము పుచ్చుచు వచ్చిరి. ఈ విచారణలిప్పుడును మధ్యమధ్య విరామములు లేక నదీప్రవాహమువలె సంతతము జరుగుచునే యున్నవి.

బహుకాలమునుంచి అవిచ్ఛిన్నముగ జరుగుచున్న యాత్మతత్త్వవిచారణచే ప్రస్థానత్రయమని పిలువబడుచున్న ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతయనునవిగా వ్యక్తరూపమును దాల్చినవి. ఈమూడే ఆధ్యాత్మికవిషయములందు పరమప్రమాణభూత గ్రంథములుగ మనదేశమున పరిగణింపబడుచున్నవి. అనుల్లంఘనీయ కారణము వలన స్వస్థానమును బాసి, తెన్నుగానక, యొక కాంతారమధ్యమున నెన్నియో తిప్పలబడుచున్న బాటసారికి, పుణ్యవశమున లభ్యమగు మిత్రుడు సరియగుమార్గమునజూపి స్థిరముగ నిజస్థలమును చేర్చునట్లుగనే, అజ్ఞానాంధకారమునబడి, దివ్యమగు స్వస్వరూపమును మరచి, జననమరణప్రవాహరూపమగు సంసారసముద్రమున మునుగుచు దేలుచున్న జీవయాత్రికునకు ఈగ్రంథములు జ్ఞానబోధజేసి సిద్ధమగు నిజస్వరూపస్థితికి ద్రిప్పు మార్గదర్శకుడగు సద్గురువుగా నొప్పుచున్నవి. వీనికింతప్రామాణ్య ముండబట్టియే, మనదేశమందవతరించిన మహాతత్త్వవేత్తలగు శంకరరామానుజప్రభృతులు తమతమసాంప్రదాయిక సిద్ధాంతములే సత్యములని ధ్రువపరచుటకు స్వతంత్రగ్రంథముల రచించుటయే కాక, ఈప్రమాణగ్రంథ సమ్మతములుకూడ నని నిరూపించు నుద్దేశ్యముతో వీనికి భాష్యములువ్రాయ మొదలిడిరి.

ఈ ప్రస్థానత్రయము ఎప్పుడో చాలకాలముక్రిందట ఒకానొక దేశమున ప్రకటింపబడినదగుటచే ఈకాలమువారికి దానితో బనియేమి

యని కొందరికి సందేహము కలుగవచ్చును. కాని ఈసంశయమునకు అవకాశము లేదు. ఏమన, చిత్రముకొఱకైనను ఆధునికులు తమ విజ్ఞానమును పూర్వులవిజ్ఞానముతో పోల్చిచూడవచ్చును. కాని నిజముగ చిత్రము కొఱకే కాక, విశేషలాభముకూడ నున్నది. దేశచరిత్రలందును వార్తాపత్రికలందును ప్రకటింపబడువిషయములవంటివి కావు. ఇందలి విషయములు ఒకదేశమున ఒకకాలమున జరిగిన ఒకపురుషునిజననము ఇంకొకని మరణము మొదలగు సంగతులగూర్చి యవిచెప్పవు; దేశకాల జననమరణములన నెవ్వియో, పురుషుడనగ నేమో, ఈయనర్థములనుంచి పురుషుడు ముక్తుడగుటయెట్లో మొదలగు విషయములగూర్చి యివిచెప్పును. అవి తాత్కాలికసత్యములు; ఇవి త్రికాలబాధితసత్యములు. కావున వీనియుపయోగము ఒక్కరచనాకాలము నాటికేకాక, సర్వకాలములకును అయియున్నది. అదేరీతిని, ఇవి ఒక్క హిందూదేశస్థులకు మాత్రమేకాక, విశ్వమానవకోటికి సైతము సంబంధించియున్నవి. ఈసత్యమును ఇప్పుడిప్పుడే విదేశీయులు గ్రహించి, వీని పరిచయము విరివిగజేసికొనుచున్నారు. పరిచయమైనకొలదియు, ఆశ్చర్యనిమగ్నులగుచున్నారు. అన్నిపాశ్చాత్యభాషలలోనికిని నవి అనేకపర్యాయములు తర్జుమాచేయబడుచున్నవి. మూలగ్రంథములనేచదువుటకై మాక్సుమూలరు మొదలగు కొందరు పండితులు సంస్కృతభాషను పనికట్టుకొని చదివియున్నారు. యథార్థము చెప్పవలసివచ్చో, వీని పరిచయములేకుండుట మనయజ్ఞానమును అనామకత్వమునే బయలుపరచుచున్నవి.

కావున మనమిప్పుడు వీనిపరిచయము కొంతకలిగించుకొనుటకు ప్రయత్నించెదము. వీనినిగూర్చి యీవరకే కొంచెము తెలిసికొంటిమి; మఱికొన్ని వివరములు ఇక తెలిసికొందము. "బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః (భ. గీ. ౧3. 4.) యను శ్లోకార్థమునకు శంకరభాష్యమున వ్రాయబడిన యర్థము గ్రహించి 'బ్రహ్మసూత్ర'పదమునకు వ్యాపకార్థమును స్వీకరించితిమేని, అనగా బ్రహ్మప్రతిపాదకములగు వాక్యములు ('బ్రహ్మణః) సూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి' యను నర్థమును చెప్పుకొంటిమేని, ప్రస్థానత్రయమంతయు బ్రహ్మసూత్రమయమే. ఈమూటియందలి విషయము బ్రహ్మపదార్థమేకదా! ప్రతిపాదింపబడిన విధముమాత్రమే వేఱు. బ్రహ్మపదార్థమనునప్పుడు ఒక్క బ్రహ్మమునుగూర్చియే యని తలపరాదు. బ్రహ్మసూత్రభాష్యమున (I. I. I.) శంకరులు చెప్పినటులు, "ప్రధానపరిగ్రహే తదపేక్షితానామ ప్యర్థాక్షిప్తత్వాత్ । బ్రహ్మహి జ్ఞానేనాప్తుమిష్టతమత్వాత్ ప్రధానం । తస్మిన్ ప్రధానేజిజ్ఞాసాకర్మణి పరిగృహీతే యై ర్జిజ్ఞాసితై ర్వినా బ్రహ్మజిజ్ఞాసితం నభవతి తాన్యర్థాక్షిప్తాన్యేవేతినపృథక్ సూత్రయితవ్యాని। యథా 'రాజాసౌగచ్ఛతీ'త్యుక్తే సపరివారస్య రాజ్ఞో గమనముక్తం భవతి తద్వత్" అనగా 'రాజుపోవుచున్నాడు' అన్నప్పుడు పరివారయుక్తుడైన రాజగమన ముద్దేశింపబడినట్లె ప్రధానవిషయచర్చయందు దానికి సంబంధించియున్న విషయములన్నియు చర్చింపబడును. అట్లే సర్వకారణములకు కారణమైన బ్రహ్మమందు, సర్వపదార్థములును ఇమిడియేయుండుటచే వానిమాట ప్రత్యేకించి వేఱుగ చెప్పనక్కరలేదు. ఈమూటియొక్క ప్రయోజనమున్ను నిశ్రేయసమే కూడను. ఈమూటికిని కర్తకూడ నొక్కడేయని చెప్పవచ్చును. వేదాంతములకు అనగా నిత్యములగు నుపనిషత్తులకు ఈశ్వరనిశ్వాసములగుటచే నొకమానవగ్రంథకారుడు లేకపోయినను, వేదవిభాగకర్తయగు వ్యాసులవారి నొకపక్షమున కర్తయనచెల్లును. ఉపనిషత్తాత్పర్యనిర్ధారణార్థమై ప్రవర్తిల్లిన బ్రహ్మసూత్రములు వ్యాససూత్రములను నామాంతరము గలిగి యున్నవి. పంచమవేదంబని ప్రసిద్ధిగల మహాభారతమును రచియించిన యతడేకదా భారతాంతర్గతమై సర్వోపనిషత్సారసంగ్రహ మగు గీతాశాస్త్రమునకు కర్తయగును. దీనినిబట్టి యీమూడును అన్యోన్యసంబంధముగలవి యనికూడ తెలియుచున్నది.

ఈపైవిచారణచే బ్రహ్మసూత్రములన్నప్పుడు ప్రస్థానత్రయమునంతయు నిర్దేశింపవచ్చునని తేలుచున్నది. ఇక గొంచముముందునకు సాగిపోదుమేని, ఒక్క ప్రస్థానత్రయమేకాక బ్రహ్మస్వరూపమును వర్ణించు ఏయితరగ్రంథమైనను, పదార్థమైననుగూడ గావచ్చుననుటకు ఆక్షేపణ యుండగూడదు. ఏదేశమందుగాని ఏకాలమందుగాని, ఏభాషయందుగాని బ్రహ్మజ్ఞానసంపన్నులగు మహర్షులచే బ్రహ్మనుగూర్చి చెప్పబడిన లేక వ్రాయబడినవాక్యములెల్లయు బ్రహ్మసూత్రములే యగును. ఒకే సిద్ధపదార్థమునుగూర్చి తగినవారిచే నిష్పక్షపాతబుద్ధితో స్పష్టీకరింపబడిన మహావాక్యములన్నియు మనకు గౌరవనీయములే; అనగా, బైబిలు కొరాను మొదలగు పవిత్రగ్రంథములందుగూడ వర్ణింపబడిన బ్రహ్మవిషయములతో మనగ్రంథములందు వర్ణితమయిన విషయములను పోల్చి, మనగ్రంథములను జదువుటచేగల్గిన నమ్మకమును మరింత దృఢపరచుకొనవచ్చును. భేదములున్నచో, మనము స్వయముగ విచారణ చేసికొనవచ్చును. విచారణచేయగా జేయగా సత్యము మనకే బోధపడగలదు.

ఈరీతిగ బ్రహ్మసూత్రములగూర్చి సామాన్యవిధమున కొంత విచారించి, విశేషముగ ఇప్పుడు విచారణచేయబూనెదము. సర్వవేదాంత తాత్పర్యనిర్ణయార్థమై సూత్రరూపమున వ్యాసమహర్షి యనునామాంతరముగల భగవాన్ బాదరాయణాచార్యులవారిచే రచింపబడిన గ్రంథమునకు, బ్రహ్మసూత్రశబ్దము రూఢిగ చెల్లుచున్నది. ఇది పెక్కుపేర్లచే వ్యవహరింపబడుచున్నది. వేదముల కుత్తరభాగమందున్న యుపనిషత్తులవిచారణ యిందు చేయబడుటచేత ఉత్తరమీమాంసయనియు జీవాత్మ (క్షేత్రజ్ఞుడు) పరమాత్మైక్యవిచారణచే శారీరకమీమాంస లేక శారీరకసూత్రములనియు, వేదాంతములనగా ఉపనిషత్తులగూర్చి చర్చించుటచే వేదాంతసూత్రములు లేక వేదాంత మీమాంసయనియు, బ్రహ్మవిషయస్థలములగుటచే బ్రహ్మసూత్రములనియు ఇది పిలువబడుచున్నది.

దీనికి మూలాధారమగు ఉపనిషత్తులు వేదాంతర్గతమై స్వతఃప్రమాణములగుటంజేసి, ప్రస్థానత్రయమున నగ్రస్థానమలంకరించుచున్న

మాట నిజమే; కాని యవన్నియు ఒక్క భగవంతుని యావేశముచే వెలువడినను, ఒక్క నిముఖద్వారముననే వెలువడలేదు. 'వివిధకాలములందు భిన్నస్థలములందు, వేర్వేఱుమహర్షులకు స్ఫురించినయనేకాధ్యాత్మవిచారములు ఏకక్రమపద్ధతి ననుసరింపక పరస్పరసంబంధములులేక యొకప్పుడు పైకి పరస్పరవిరుద్ధములుగఁగూడ గన్పడులాగున నీయుపనిషత్తులందు నిరూపింపబడినవగుటచే వీనిలోని సమగ్రవిషయవిచారణ సల్పి, ప్రతివిషయమందును ఉపనిషత్తులన్నిటినుండియు ఒకటే సిద్ధాంతము చేయవలసిన యవసరము కలుగుచున్నది. లేనిచో నవి అన్నియు సత్యప్రతిపాదకములుకావను సందేహమునకు ఎడమున్నది. ఇంతేకాక ఉపనిషత్తులు యెప్పటికిని రహస్యార్థకములుగానే యుండును.

మఱియు సాంఖ్యయోగన్యాయవైశేషికాదిమతము లెన్నియో కపిలాది పరమఋషులచే ప్రవర్తింపజేయబడినవి. ఇవన్నియు తర్కప్రతిష్ఠితములయినను, శ్రుతులప్రామాణ్యము నిరసింపలేదు సరిగదా; కొన్ని సమయములందు అవసరమైనచో స్వపక్షస్థాపనార్థమై ఉపనిషద్వాక్యములనుపైరి ముదాహరించి తమవాదమునకు ననుకూలముగనే వానికర్థము జెప్పుచు వచ్చిరి. వీనికి తోడుగ వేదప్రామాణ్యమునే యంగీకరింపని బౌద్ధ జైన చార్వాకమతములు మిక్కుటముగ ప్రబలి విపరీతసిద్ధాంతములు బయలుదేరినవి. ఈసందర్భము లిట్లుండుటచే, యుక్తిప్రధానములై అపార్థములను గల్పించిన సాంఖ్యాదులను వేదబాహ్యములగు బౌద్ధాదులను ఖండించి శ్రుతినిత్యత్వమును స్థిరపరచవలసిన యవసరముకూడ కలిగెను.

ఈయవసరములన్నియు వ్యాసులవారు తీర్చిరి. సక్రమపద్ధతిని సకల వేదాంతవాక్యసమన్వయముచేసి, రహస్యమని యర్థముగల యుపనిషత్తుల రహస్యార్థమును ఆయన స్పష్టపరచెను. మోక్షసాధనములని చెప్పుకొనుచున్న యితరమతములజూచి ప్రజలు మోసపోకుండుటకై వానినెల్ల తెగనరికెను. తర్కనిరతమే బ్రహ్మసూత్రములను గ్రంథము. దీనికి శ్రుతియే ఆధారము. సాధారణముగ ఇందు ప్రతిసూత్రమునకు విషయవాక్యము శ్రుతియే. ఈలాగుననని వ్యాసులవారు స్మృతులను యుక్తులను నిరాకరింపలేదు. కాని యవియెల్ల శ్రుత్యనుగృహీతములై యుండవలెనని ఆయనయొక్క ఆశయము. "1-3.28 శబ్ద ఇతి చేన్నాతః ప్రభావాత్ప్రత్యక్షానుమానాభ్యామ్; 3-1-8 కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాంయథేతమనేవంచ; 1-2-6 స్మృతేశ్చ; 2-1-7 దృశ్యతేతు; 4-1-10 స్మరంతిచ; 3-3. 31 అని యమస్సర్వేషామవిరోధ శ్శబ్దానుమానాభ్యామ్."

ఇత్యాద్యనేకసూత్రములను పరికించునెడ ఈసంగతి బోధపడగలదు. ఇచ్చట శబ్ద దృష్టప్రత్యక్ష పదములు శ్రుతిని నిర్దేశించుచున్నవి. అనుమానమనగా స్మృతి. స్మృతులనెల్ల (సాంఖ్యాదులు) నంగీకరించక శ్రుత్యనుగృహీతములగు మనుస్మృత్యాదులను మాత్రమే స్వీకరించినట్లు 2-1-1 "స్మృత్యనవకాశదోష ప్రసంగ' ఇతిచేన్నాన్యస్మృత్యనవకాశదోష ప్రసంగః" యను సూత్రమువలన దెలియుచున్నది.

ఈవిచారణచే బ్రహ్మసూత్రములు శ్రుత్యాధారములేయైనను అవి స్మృతిమాత్రమే యని కూడ దేలుచున్నది. ఇట్లున్నప్పుడు మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములకును దీనికిని గల భేదమును గమనించవలెను? వ్యాసులవారు ఉపనిషత్తాత్పర్య నిర్ధారణార్థమైచేసిన యీ ప్రయత్నమువంటి ప్రయత్నములు ఆరోజులలో ఇంక నెన్నియో జరిగియుండినవని యూహించుటకు అవకాశములు పెక్కులు గనబడుచున్నవి. అనగా వ్యాసరచిత బ్రహ్మసూత్రములంతటివి చాల యుండియున్నవి. కాని యవియేవియు మన మెఱిగియున్నంతవరకు ప్రచారమున లేవు. అయినను వ్యాససూత్రములందే కొన్ని ప్రధానవిషయముల నభిప్రాయభేద మున్నప్పుడు పెక్కురు ఇతరఋషులు పేర్కొనబడియున్నారు.

"1-4-20-22 ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగమాశ్మరథ్యః; ఉత్క్రమిష్యత ఏవం భావాది త్యౌడులోమిః; అవస్థితేరితి కాశకృత్స్నః: 3-2-40-41 ధర్మం జైమినిరతఏవ; పూర్వంతు బాదరాయణోహేతువ్యపదేశాత్. 4-3-7 కార్యంబాదరి రస్య గత్యుపపత్తేః."

ఒక్కొక్కఋషి పేరు రెండుమూడుసార్లుకూడ నుదాహరింపబడినది. వీరలెల్లరు వ్యాసునకు పూర్వులో లేక సమకాలికులో కావలయును. వీరు గ్రంథముల రచియించి యుండవచ్చును, లేదా ఆ కాలమున తరుచుగ జరగుచుండెడి వేదాంతచర్చలలోనైన పాల్గొని యుండి యుండవచ్చును. వారిభావములన్నియు మనకు ప్రత్యేకముగ లభించనేరవు. వ్యాసులకు అవసరమైనవని తోచిన వానినే యాయన ఉదాహరించుటచే, ఆయన గ్రంథమున అవి జీవించియున్నవి. దీనిని బట్టి ఆకాలమున వేదాంతగోష్ఠి పుష్కలముగ నుండియుండవచ్చునని మన మూహింపవచ్చును.

బాదరాయణుని యీప్రయత్నము సూత్రరూపముగ నుండుటచేగూడ ఈయనుమానమే సిద్ధమగుచున్నది. ఏశాస్త్రవిషయములైనను బహువ్యాపకముగ ప్రచారములోనుండినగాని సూత్రరచన పొసగదు. బహుస్వల్పాక్షరములలో నిముడ్చబడి ఎంతయో విశేషార్థముగల యొక్కొక్కక్లిష్టసూత్రము, శాస్త్రవిచారణ పూర్తియైన పిదప రచింపబడును. చూడగనే యావద్విషయము స్ఫురించుటకును, సులభముగ జ్ఞాపకముంచుకొనుటకును సూత్రములు ప్రవర్తించును. గ్రంథరచనకు సూత్రములు చివరమెట్టు. అయితే రానురాను ఆశాస్త్రప్రచారము తగ్గి ఎవరో కొద్దిమంది ధన్యులకుమాత్రమే ఆసూత్రరహస్యము పొడగట్టినట్టిస్థితి సంప్రాప్తమైనప్పుడు సూత్రార్థము సామాన్యులకు బోధపడులాగున తగినపండితులు విరివిగ వృత్తులు వ్యాఖ్యానములు భాష్యములు వ్రాయుట సంభవించును. ఈస్థితియంతయు బాదరాయణసూత్రములకు పట్టినది.

ఈ సూత్రములు వ్యాససూత్రములనియు, బాదరాయణసూత్రములనియు వ్యవహరింపబడుటచే, ఈ సూత్రకారుడు వ్యాసుడనుమారుపేరుగల బాదరాయణుడని సిద్ధమగుచున్నది. కాని యితర

ఋషులపేర్లతోపాటుగ బాదరాయణుని పేరుగూడ ఈ సూత్రములందే పెక్కుస్థలములందు గనపడుటచే "1-3-26 తదుపర్యపి బాదరాయణః సంభవాత్; 1-3-33 భావంతు బాదరాయణోస్తిహి; 3-4-1 పురుషా

ర్థోతశ్శబ్దాదితి బాదరాయణః 4-3-15 అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాదోషాత్తత్క్రతుశ్చ."

ఈ గ్రంథకారుడు బాదరాయణుడేనా యను సందేహము కొందరికి కలుగవచ్చును. కాని యేదోయొక విషయమున భిన్నాభిప్రాయములు పొసగినప్పుడు, ముఖ్యపక్షమును సూత్రకారుని మతముననువదించుటకు 'ఇది నాయొక్కమతము' అని చెప్పకుండ ఇది బాదరాయణునిమతము అని చెప్పియుండవచ్చును. తన్నుగూర్చి చెప్పుకొనునప్పుడు, ఉత్తమ పురుషైకవచనము నుపయోగింపక ప్రథమ పురుషైక వచనము నుపయోగించుట మొదటి నుంచియు వాడుకలో నున్నది. ఆదికవియగు వాల్మీకి, ఆదికావ్యమగు రామాయణమున ఈ పద్ధతినే యవలంబించెను. దీని కర్త వాల్మీకికాడని యెట్లు అనుమానించుటకు వీలులేదో, యట్లే ప్రస్తుత విషయమున గూడను. ఈబాదరాయణుడే వ్యాసుడని ప్రసిద్ధి కావున సూత్రకారుడుబాదరాయణుడని అనుశ్రుతముగావచ్చుచున్న సంగతియే నిజమని తోచెడిని. బాదరాయణుని శిష్యులెవ్వరైన నీసూత్రములను ప్రకటించునప్పుడు ఇతరఋషులను పేర్కొనినట్లే తమగురువునుగూడ పేర్కొనియుండనోపునని మాక్సుమూలరు ఉపాయముచెప్పియున్నాడు. కాని యిది యెంతవరకు సమంజసముగనున్నదో యిప్పుడు చర్చింపజాలము.

ఈగ్రంథరచనా కాలనిర్ణయముగూడ అతిప్రయాసతో గూడుకొన్నది. ఈగ్రంథము సాంఖ్యయోగన్యాయవైశేషికమీమాంసాశాస్త్ర సిద్ధాంతములను, బౌద్ధ జైన చార్వాకమత సిద్ధాంతములను ఖండించుటచే వానియన్నింటి యనంతరమున నిది బయలుదేరినదని మాత్రము అనుమానించుట చాలతొందరపని యని తోచుచున్నది. "ఏతేనయోగః ప్రత్యుక్తః 2-1-3" అను నొక్కసూత్రమున యోగము పేరున్న, "భావంజైమి నిర్వికల్పామననాత్ 4-4-2" మొదలుగాగల యనేకసూత్రములయందు పూర్వమీమాంసాశాస్త్రకారుడగు జైమిని పేరును మాత్రమే ఈసూత్రములందు ఎత్తబడినవి. ఇతర సిద్ధాంతముల పేరులు ఎచ్చటను గానరావు. ఖండింపబడ్డ సిద్ధాంతములబట్టి ఇది ఫలాని దర్శనములకు జెందియున్నదని మన మూహింపవలయును. ఇతర దార్శనికుల పేరులుకూడ నిందెచ్చటను గానరావు. షడ్దర్శనసిద్ధాంతములు, బౌద్ధమత సిద్ధాంతములు గ్రంథరూపము దాల్చుటకు చాలకాలము పూర్వమునుంచియే యవి ప్రచారములో నున్నవి. ఇంకను గ్రంథాకారమున వ్యక్తముగాక ప్రచారములో మాత్రమేయున్న సిద్ధాంతములను వ్యాసులవారు ద్వితీయాధ్యాయమున ఖండించెననుట యుక్తియుక్తముగ నున్నది మఱియు జైమిని వ్యాసశిష్యుడను ప్రసిద్ధి గలదు. జైమిని పేరు బాదరాయణు లుదహరించెనన్నచో బాదరాయణుని పేరు జైమినికూడ నుదహరించెను. వేదముయొక్క పూర్వభాగమగు కర్మకాండకు మీమాంసయగుటచే పూర్వమీమాంసయనియు, వేదముయొక్క యుత్తరభాగమగు జ్ఞానకాండయొక్క మీమాంసయగుటచే ఉత్తరమీమాంసయనియు పేర్లు వచ్చెనేకాని, ఒకదానికంటె నొకటి ముందు రచింపబడుటచే నీనామములు వచ్చెననుటకు సందులేదు. ఈ రీతిగ నెంతసేపు విచారించినను ఇదమిత్థమని నిరూపణచేయలేము. వాస్తవమునకు అవి యేకాలమున రచింపబడినవంటే నేమిలాభము? ఈబ్రహ్మసూత్రముల యుపయోగము సర్వకాలములకు అయియున్నది.

ఇంతవరకును మనము బ్రహ్మసూత్రములయొక్క బహిరంగపరీక్షయందే చాలకాలము పుచ్చితిమి. ఇక నీనియంతరంగపరీక్షకొంచెము చేసెదము. అనగా ఈగ్రంథతాత్పర్యమును నిర్ణయించుటకు ఇంచుకంత ప్రయత్నించెదము. ఈపని మహాపండితాగ్రేసరులకు మాత్రమే చెల్లుననియు నావంటియల్పజ్ఞునకు నెంతమాత్రము తగదనియు బాగుగ గుర్తించియు, ఈవిషయమున విశేషాభిరుచిగలవాడనగుటచే తోచినది వ్రాయుటకు సాహసించితిని. ఈవ్యాసము వ్రాసినంతమాత్రముచేత నేనీగ్రంథవిషయమై చేయవలసినంత పరిశ్రమ చేసినానని కాని వ్రాయుటకు దగినపరిజ్ఞానముగలవాడనని కాని చదువరు లెంతమాత్రము ననుకొనకుందురు కాక. ఈగ్రంథముగూర్చి నాకు నెంతస్వల్పముగా దెలియునో, ఇంకను దెలిసికొనవలసినది యెంతయత్యధికముగా మిగిలియున్నదో, యది నాకే యనుభవము. అయినను కేవలము గ్రంథమునందలి ప్రేమచేతనే, ఈగ్రంథతాత్పర్యము కనుగొనుటకు ఇంచుకంత ప్రయత్నించెదను.

బ్రహ్మసూత్రములను స్వయముగ జదివెదమన్నచో నవి యర్థముకావు. సంస్కృతభాషా సాహిత్యమెంతయుండినను, అదియేమియు దీనికి నుపకరింపదని చెప్పవచ్చును. సూత్రములేవియు వాక్యరూపమున లేవు. సూత్రస్వభావమే యట్లు. కొన్ని సూత్రము లొక్క పదము మాత్రమే కలవి. ఉదా. "కంపనాత్ 1-3-39; అబాధాచ్చ 3-4-39" లింగాచ్చ 4-1-2; ఇందు గొన్ని సూత్రములు ప్రకరణమునుబట్టి అనగా అధికరణములందలి పూర్వాపరసందర్భములబట్టి కొంతవరకు గ్రాహ్యములుగానున్నను, అవి "అసందిగ్ధములు"గ నున్నవని చెప్పవీలులేదు. 'అంశోనానావ్యపదేశాదన్యథాచాపి దాశకితవాదిత్వ మధీయత ఏకే 2-3-43; యదేవవిద్యయేతిహి 4-1-18; సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేరశ్వవత్ 3-4-26" మొదలగు గొన్ని సూత్రములకు విషయవాక్యము స్పష్టముగా స్ఫురించుచున్నను, ఈసులభము సర్వత్ర లేదు. ఇందు పూర్వపక్ష సిద్ధాంతసూత్రములు మిశ్రితములై యున్నవి. ఏది పూర్వపక్షసూత్రమో, ఏది సిద్ధాంతసూత్రమో ప్రత్యేకముగ విభజింపబడకుండుటచే, ఇది ఫలానిదియని తెలిసికొనుటకు దగిన సాధనము లేదు. "సంధ్యేసృష్టిరాహ 3-2-1; అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్ 3-1-12; మొదలగునవి పూర్వపక్షసూత్రములు. ఇవి సిద్ధాంతసూత్రములతో గలసియున్నవి. ఇట్లు కలసియుండుటచే దమకు సమ్మతిలేని సూత్రములను పూర్వపక్షసూత్రములుగా ద్రోసివేయుటకు ఎవరికైనను వీలు కలదు. స్పష్టముగ వాక్యరూపమున లేకుండుటచే ఏసూత్రమునకైనను

ప్రజ్ఞగలపండితులు ఎంతటి విపరీతార్థమునైనను గల్పించుటకుగూడ నవకాశము గలదు.

బ్రహ్మసూత్రము లీరీతిగ స్వతంత్రపఠనమునకు నదుపాయము నీయమిచేత తద్రహస్యమును స్పష్టీకరించు భాష్యగ్రంథము లత్యవసరములగుచున్నవి. సూత్రకారుడగు బాదరాయణుని మతము ఆయననుండి గురుశిష్యపరంపరలో పరంపరాగతముగ వచ్చుచున్నదియైన పరంపరాగతముగ వచ్చుచున్నయామతమునే యనువదించుచు వ్రాయబడిన భాష్యము మనకు మిగుల సహకారియగును. అట్టిభాష్యమును జదివెడుభాగ్యము లభించెనేని సూత్రకారుని సమక్షముననే సూత్రకారుని ముఖముననే యాసూత్రపాఠ మభ్యసించుటతో దుల్యమగును. అప్పుడు యాతద్రహస్యములు మనకు దెలియగలవు.

బ్రహ్మసూత్రకారుని మతమునే వ్యక్తీకరించుచున్నామని ప్రగల్భములుపల్కు భాష్యములెన్నియో గలవు. 18 భాష్యములవరకు గలవని పండిత సీతానాథతత్త్వభూషణు డొక సందర్భమున జెప్పియున్నాడు. ఇవన్నియు నొకవిధముగ లేక యొకప్పుడు పరస్పరవ్యతిరేకముగగూడ నున్నవి. వివిధసాంప్రదాయములుగల ప్రవక్తలు తమతమ మతములే యథార్థమైనవని చెప్పుటకై, ప్రమాణభూత గ్రంథములలో నొకటిగా భారతీయులచే నంగీకరింపబడుచున్న బ్రహ్మసూత్రములకు గూడ భాష్యములు వ్రాసి, అతిప్రయాసమున దమసిద్ధాంతములను అందు జొప్పించిరని యిదివరకే సూచింపబడినది. ఇంతకును బ్రహ్మసూత్రప్రతిపాద్యమైనది యొక్కటేకాని, అనేకములు కాదుగదా! సత్యమొక్కటేగాని, భిన్నముగానుండ నేరదు. ఈభాష్యములం దేది సూత్రార్థమును సూత్రకారమతానుసారముగ బ్రకటించినదో, లేక యొకవేళ యందేభాష్యమునుగూడ బ్రకటింపలేక పోయెనో నిర్ణయించుట దుస్సాధ్యము. ఈభాష్యకారులందరు మహాపండితులున్ను, సదుద్దేశ్యముగలవారును ఒకవేళ 'ఏకంసత్ విప్రాబహుధావదంతి' యను శ్రుత్యుక్తపద్ధతిని, ఒకటేయగు బ్రహ్మసూత్రరహస్యమును ఈభాష్యకారులెల్లరు అనేకవిధముల వచించిరేమో?

ఇన్ని భాష్యములందును శంకరరామానుజ భాష్యములు చాల ప్రసిద్ధికెందియున్నవి. ఈరెంటిని యించుకంత పరీక్షించి యేదిసూత్రానుగృహీతమో చూతము. మనకు లభ్యమైనంతవరకు, భాష్యములన్నిటిలోను శంకరభాష్యమే యతిప్రాచీనమైనది. అందుచే నదియే సూత్రకారునికాలమునకు అత్యాసన్నమని స్పష్టమగుచున్నది. ఆదిశంకరులవారు క్రీస్తునకు తరువాత 8 వ శతాబ్దమువాడని కొందరున్ను, క్రీస్తునకుపూర్వమే యని మనపంచాంగములయం దుదాహరింపబడిన దానినిబట్టి మరికొందరున్ను భేదాభిప్రాయములు పడుచున్నమాట సత్యమే. కాని రామానుజాది భాష్యకర్తల కెల్లరకు పూర్వుడని యందరు నొప్పుకొందురు. శంకరభాష్యమింత ప్రాచీనమైనదగుటచే నది మనకత్యంతగౌరవపాత్రమైనది. ఇదిగాక 'వ్యాసంశుకం గౌడపదం మహాంతం గోవిందయోగీంద్ర మథాస్యశిష్యం శ్రీశంకరాచార్య'మ్మను శ్లోకపాదమున వ్యాసునిమొదలుకొని శంకరులవారివరకు గురుశిష్యపరంపర యవిచ్ఛిన్నముగ నుండుటచే, బ్రహ్మసూత్రకర్తయగు వ్యాసునిమతమే శంకరునకు లభ్యమయ్యెనని యనుమానించుటకు దగియున్నది. శంకరుని భాష్యము సూత్రకార సమ్మతమనుటకు నొకకథగూడ జెప్పుదురు. కాశీపట్టణమున శంకరుడు దనశిష్యులకు దారచించినసూత్ర భాష్యమును బోధము జెప్పుచుండగ, వృద్ధబ్రాహ్మణవేషమున వ్యాసులవారక్కడకు జేతెంచి యేమియు నెఱుగనివానివలె 'తదంతరప్రతిపత్తౌ రంహతిసంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్' 3-1-1 అను సూత్రమునకు భాష్యము వినగోరెననియు, శంకరుడు భాష్యము విన్నవించిన మీదట నిరువురకు జాలదినములు వాదప్రతివాదములు జరిగెననియు, జివరకు శంకరుడు వ్యాసునిగుర్తింపగా వ్యాసులు నిజరూపమున బ్రత్యక్షమై తుచ తప్పకుండ భాష్యమంతయు దనయభిప్రాయమును స్పష్టపరచెనని శ్లాఘించెననియు నొకకథ కలదు. మరియు వేదాంతమన్నప్పుడు అద్వైతవేదాంతమే అనగా శంకరునిచే బ్రకటింపబడినది యని లోకమున బ్రసిద్ధియున్నది. కావున బ్రహ్మసూత్రములు లేక వేదాంతసూత్రములు అద్వైతపరములేమో యని తోచగలదు.

రామానుజులన్ననో శంకరునికి దరువాతివాడన్న సంగతి నిర్వివాదాంశమే. దీనినిబట్టి శంకరునికన్న రామానుజులు వ్యాసునకు దూరస్థుడని సిద్ధించినను, ఆతనిమతముగూడ దూరస్థముగానుండితీర నక్కరలేదు. వ్యాససూత్రములకు విస్తీర్ణముగ వృత్తిని వ్రాసిన బోధాయనాచార్యులవద్దనుండి టంక ద్రమిడ గుహదేవాది పూర్వాచార్యులమూలముగవచ్చుచున్న మతానుసారము గదా శ్రీభాష్యమును వ్రాయబూనితినని రామానుజులు భాష్యప్రారంభమున సూచించిరి. ఈవృత్తికారుడు శంకరునికంటె పూర్వుడు కావున రామానుజులు శంకరునికి దరువాతివాడైనను, శంకరునికంటె పూర్వుడగు బోధాయనులమతమునే తనభాష్యమున ననువదించుటచే, రామానుజుని విశిష్టాద్వైతమే వ్యాసుని మతమునకు దగ్గఱయని తోచుచున్నది. రామానుజమతము వ్యాసునికంటె పూర్వమునుండియుకూడ బ్రచారములో నున్నట్టుగ వ్యాససూత్రములందలి "2-2-42-45 ఉత్పత్త్యసంభవాత్; నచకర్తుః కరణం, విజ్ఞానాదిభావేవా తదప్రతిషేధః, విప్రతిషేధాచ్చ," సూత్రములచే నూహింపనగును. ఈయధికరణమున భాగవత లేక పాంచరాత్ర దర్శనముద్దేశింపబడినదని భాష్యకారుల యభిప్రాయము. ఈసాంప్రదాయప్రభవమే రామానుజమతము. అయితే ఈసూత్రములందు పాంచరాత్రాగమమునందలి కల్పన ఖండింపబడినదని శంకరుడనును. సంరక్షింపబడినదని రామానుజుడనును. ఈతగవు దీర్చగలవారెవ్వరు? ఏదియెట్లయినను రామానుజమతము అనాదిగ వచ్చుచున్నదని సిద్ధమగుచున్నది. ఇదిగాక రామానుజులు వారిశ్రీభాష్యమును కాశ్మీరదేశమందలి సరస్వతీపీఠమున సాక్షాత్సరస్వతి శ్లాఘించెనని యొకకథ గలదు. సాక్షాత్సూత్రకారుడే శంకరుని సూత్రభాష్యమును దనకు సమ్మతమైనదిగా జెప్పెనను కథకు రామానుజునిగూర్చిన యీకథ తీసిపోవుమాట నిజమే కాని యీకథ లెంతవిశ్వాసపాత్రములో చెప్పలేము.

ఈయుభయుల బలాబలములగూర్చి కొంతిబాహ్యవిమర్శనము జేసి, యిప్పుడు ఇందుక లోతుగ విమర్శించెదము. చాలస్థలముల రెండును సమానముగానే యున్నను, భేదములు గూడ పెక్కులు గలవు. ఈ భేదములు సూత్రార్థములందేకాక, సూత్రాది సంఖ్యయందుగూడ నున్నది. శంకరభాష్యమున 555 సూత్రములు గలవు. 192 అధికరణములు గలవు. రామానుజభాష్యమున "ప్రతిజ్ఞావిరోధాత్ 1-1-9" అనుకొన్ని సూత్రము లచ్చటచ్చట శంకరభాష్యమునలేనివి యధికముగ గనబడుచున్నవి. మరికొన్ని స్థలముల నొకేయధికరణము రెండు మూడుగా విభజింపబడినది రామానుజభాష్యమున 3 అ. 3 పా. 11 మొదలు 17 వ సూత్రమువరకు ఒకటే యధికరణముననుండగా శంకరభాష్యమును ఆనందాద్యధికరణము, అధ్యానాధికరణము, ఆత్మగృహీత్యధికరణము అను మూడుఅధికరణములుగాగనబడుచున్నవి. కొన్నిచోట్ల 3-3-4 సూత్రముల క్రమముగూడ భేదముగా నున్నది. ఈస్వల్ప భేదములమాట యటుండ, పూర్వపక్షసిద్ధాంత సూత్రనిర్ణయము గూర్చి కూడ భేదములు గలవు. ఉ. కార్యాధికరణమున 4-3-7 'కార్యంబాదరి రస్యగత్యుపపత్తేః' అను సూత్రము శంకరపక్షమున సిద్ధాంతసూత్రము. రామానుజపక్షమున బూర్వపక్షసూత్రము. సూత్రార్థములందు భేదము విశేషము గలదని వేఱుగ జెప్పనక్కరలేదు.

సంగతి సందర్భము లిట్లుండుటచేత బ్రహ్మసూత్రతాత్పర్య నిర్ణయము బహుకష్టసాధ్యమైనపనిగా నున్నది. సూత్రముల స్వతంత్రముగ జదివెదమన్నచో, నవి బొత్తుగా నగమ్యగోచరములు. భాష్యములసహాయము నపేక్షించెదమన్నచో నవి. యనేకములున్నా, బరస్పరవిరుద్ధములున్నా. ఇందుకొకయుపాయము నవలంబించిన, ఈచిక్కు కొంతవరకు దప్పగలదు. ఏదైన నొకభాష్యసహాయమున సూత్రములనొకసారి చదివి, పూర్వాపరసూత్రాధికరణాధ్యాయములకు గల హేతుహేతుమద్భావము సూత్రార్థము మొదలుగాగలవిషయముల మనంబునబట్టించుకొని తదనంతరము నింకొక భాష్యముదగ్గర నుంచుకొని యుభయములకుగల సమానవ్యతిరేకసంగతులపరిశీలించి, కుట్టకుదసూత్రముల స్వతంత్రరీతిని తరుచు బఠించవలెను. ఇట్లుచేసినచో భాష్యకారులవలలో బడనక్కరలేకుండ సూత్రముల యర్థము దెలియకయుండ నక్కరలేకుండ, గ్రంథతాత్పర్యము నిర్ణయించుటకు చాలవరకు సాధ్యమగును. ఈసందర్భమున గ్రంథతాత్పర్యనిర్ణయముకొరకు మీమాంసకు లేర్పరచిన,

శ్లో. ఉపక్రమోపసంహారా వభ్యాసో పూర్వతాఫలమ్,
అర్థవాదోపపత్తీచలింగం తాత్పర్యనిర్ణయే.

అనుశ్లోకమును గమనింపవలెను. ఈపద్ధతినే లోకమాన్యబాలగంగాధరతిలకు తనగీతారహస్యమున నవలంబించి కృతార్థుడయ్యెను. ఈపద్ధతినే బ్రహ్మసూత్రములయెడగూడ నుపయోగించిన బాగుండునని సూచించి, యుదాహరణార్థముగ తదుపయోగము చేసిచూచెదము.

బ్రహ్మవిచారము కర్తవ్యమనుటతో నీగ్రంథ ముపక్రమించినది. ఎట్టిలక్షణములుగల బ్రహ్మ జిజ్ఞాస్యమో, ఎట్టిబ్రహ్మను దెలిసికొనుటయే పరమపురుషార్థమో, ఆబ్రహ్మ "జన్మాద్యస్యయతః" అను రెండవసూత్రమునసే నిర్వచింపబడినది. వ్యాసుని 'బ్రహ్మ' సృష్టిస్థితిలయకారకుడు, అదియే మహాజ్ఞేయము. అదియే వ్యాసునికి బరబ్రహ్మము. సగుణబ్రహ్మమే సూత్రకారునిమతమున బరబ్రహ్మము. నిర్గుణమేపరమని యాతని యభిప్రాయమైనచో, సచ్చిదానందమని కాని, సత్యంజ్ఞానమనంతమ్మని కాని స్పష్టముగ దెలిపియుండును. కాని యట్లు అచ్చటనేకాక మరి యెచ్చటనుగూడ దెలుపలేదు. ఏబ్రహ్మను దెలిసికొననిశ్చయించవలెనని ప్రారంభమున నుపక్రమింపబడినదో, ఆబ్రహ్మను దెలిసికొనుటవలని ఫలము చతుర్థాధ్యాయమున నుపసంహరింపబడినది. ఆఫలము అనావృత్తియని "అనావృత్తిశ్శబ్దాత్" అను చిట్టచివర సూత్రమున స్పష్టీకరింపబడెను. చివరసూత్రములు సగుణబ్రహ్మవేత్తనుగూర్చియే యని శంకరరామానుజులయిరువుర యభిప్రాయమున్నా. సగుణబ్రహ్మకంటె నధికుడును బరుడును అగు వేరొకబ్రహ్మకలడని సూత్రకారుడు తలచినచో, అట్టి బ్రహ్మజ్ఞానఫలములోడనే గ్రంథమునకు స్వస్తి చెప్పియుండును; అట్టిబ్రహ్మమే జిజ్ఞాస్యమని గ్రంథము నుపక్రమించియుండును. కాని సూత్రకారుడట్లుచేయక, తనగ్రంథమును సగుణబ్రహ్మతో నుపక్రమించి, సగుణబ్రహ్మతో నుపసంహరించెను. ద్వివిధబ్రహ్మలున్నారని యెక్కడను వ్యాసుడు సూచించలేదు. ఈప్రకారముగ గ్రంథమును నిష్పక్షపాతబుద్ధితో విమర్శించునెడ, రామానుజవిశిష్టాద్వైతమే శంకరాద్వైతముకంటె సూత్రకారమతమునకు బ్రత్యాసన్నమని తోచుచున్నది. కానిచూపునకు విశిష్టాద్వైతపరముగ గన్పించునట్లుగ జేసి, రహస్యవేత్తలకుమాత్రమే గోచరించులాగున నద్వైతమును దనసూత్రములందు నిగూఢపరిచెనేమో చెప్పలేము.

అత్యంతసంగ్రహవిమర్శనయందు "నద్వైతవిశిష్టాద్వైతమతము లలో నేది శ్రేష్ఠము సత్యము అను ప్రశ్నను విచారింపబూనలేదు" అను సంగతిని చదువరులు బాగుగ గమనించెదరుగాక! వ్యాసప్రోక్తబ్రహ్మసూత్రములు ప్రతిపాదించినది యద్వైతమా? విశిష్టాద్వైతమా? లేక యీరెండునుగాక మఱియొకటా? యనునదియే యిందలి ప్రశ్న. ఈ రెండుప్రశ్నలకును జాలభేదము గలదు. ఈప్రశ్నద్వయమును విభజించి గ్రంథవిమర్శనమునల్పుచో, బ్రహ్మసూత్రరహస్యమును యథాస్థితిగ మన మెప్పటికిని కనిపెట్టలేకపోయినను, అది యెప్పటికిని రహస్యముగనే యుండినను, తద్రహస్యసమీపస్థులమగుటకు జాలయవకాశములు గలవు. ఇచ్చట సూచింపబడినపద్ధతి ననుసరించి దిగ్దర్శనన్యాయముగ గొన్ని పంక్తులలోమాత్రమే కొంత విమర్శింపబడినది. విషయమంతయు మిగిలియే యున్నది.ముందెప్పుడైన నాశేషము పూరించుటకు బ్రయత్నింపబడును. ఈలోపుగ నీశాస్త్రమునం దభిరుచిగల చదువరులు ఈపద్ధతియొక్క మంచిచెడుగులనుగూర్చి యాలోచించెదరుగాక!

# వరదుఁడు

ఏనుగు తమ్మిరాజు గారు

## గేయము

ధన్యాసి - త్రిపుట

పరాకు సేయుట పాడిగాదురా
పరమపురుష! వరదా! వరదా! పరా.

బిరాన బ్రోవక నిరాకరించుట
బిరుదునీకుఁ దగురా వరదా! పరా.

పతితులఁ బ్రోవఁగఁ బరమాత్ముఁడవని
భజనచేసెదమురా వరదా! — పతి.
పరాత్పరుండవు ప్రధానగురుఁడవు
పరంబుఁదెల్పుమురా వరదా! పరా.

మహాత్మ! నీదగుమహామహిమఁ గన
మహామోదమగురా వరదా! — మహా.
మహామోహ సంభరితాత్ములకిఁకఁ
మార్గముదెల్పుమురా వరదా! పరా.

స్వాతంత్ర్యంబన జన్మస్వత్వమన
నందియుపడితిమిరా వరదా! — స్వాతం.
స్వతంత్రజీవనమతంబ హితమని
సతంబుఁదెల్పుపుమురా వరదా! పరా.

స్వధర్మమెఱుఁగఁగఁజాలమయ్య యిఁక
క్షమింపుమందుమురా వరదా! — స్వధ.
స్వధర్మసూత్రము విధంబెఱుంగక
క్రుధాత్ములైతిమిరా వరదా! పరా.

భారతీయుఁడని బ్రతుకుటె మిక్కిలి
పాపమయ్యెగదరా వరదా! — భార.
పాపవిముక్తికి భరతమాత నిఁక
బ్రోదింతుము రారా వరదా! పరా.

నిదానమెఱుఁగని నీచులఁ గూడుట
నిక్కమయ్యెఁగదరా వరదా! — నిదా.
సదా పరాత్పరుపదాంబుజంబుల
స్మరింపమైతిమిరా వరదా! పరా.

భావదాస్యమను పంకమునంబడి
భంగమొందితిమిరా వరదా! — భావ.
భావదాస్య మడుగంటఁ జేసి మముఁ
బరిపాలింపుమురా వరదా! పరా.

నిరంకుశాత్ములు నిరాకరింపఁగఁ
భరింపఁజాలమురా వరదా! — నిరం.
నిరాటంకముగ స్వరాజ్యధర్మం
బెటింగింపరారా వరదా! పరా.

అఖిలలోకసౌఖ్యాధారుఁడవని
ఆశ్రయించితిమిరా వరదా! — అఖి.
ఆశ్రయించఁగనె అభయమొసఁగి మ
మ్మాదరింపరారా వరదా! పరా.

# శ్రీకృష్ణాశ్రమము - పెదపాలెము

నల్లపాటి హనుమంతరావు గారు

ఎవరు పోగొట్టుకొన్న హక్కులను తిరిగి వారు బలవంతులయి సంపాదించుకొనవలయునే కాని యితరులు మానవసమత్వమును ఆచరణయం దంగీకరించి వాటిని ప్రసాదించుట ప్రపంచానుభవమునకు విరుద్ధము. ఇది రాజకీయముగా బానిసలుగా నున్నవారియెడల ఎంత సత్యమో మతము పేరిట దౌర్జన్యమునకు పాత్రులయినవారియెడలకూడ అంతసత్యము.

అంటరానితనము, చెప్పరానితనము, చూడరానితనము, వీనిని అనుసరించుకొనియుండు యితర తనములను రూపుమాపి హిందూమతమున కతుకుకొన్న మయిలను ఉతికివేయుటకు, చెప్పరానివాళ్లు అంటరానివాళ్లే సమర్థులు. ఏకొద్దిమంది యితరులో జాలిపడువంతమాత్రమున కొనసాగునదికాదీకార్యము. తమ స్థితియొక్క నీచత్వమును గుర్తించి, బాగుపరుపవలెననెడి తహతహ పుట్టించుటకుమాత్రము అగ్రవర్ణముల లోని ఉదారపురుషుల ప్రయత్నములు సహాయము లగును.

కాని మనము గర్వముతో హిందువులమని చెప్పుకొనగలుగుటకు హిందూమతమును కళంకరాహిత్యముగ జేయుటకు, ఆ యదృష్టహీనులను మతాంతరములకు తరుమకుండుటకు, ప్రభుత్వమువారుమనపై సవారి చేయుటకు వారి నుపయోగించుకొనకుండుటకు, వారిలో జాతీయ భావము పెంపొందజేయుటకు, మన ఆత్మగౌరవము నిల్పుకొనుటకు, అంటరానివాళ్లు "మేము అంటరానివాళ్లము కాము" అని చెప్పుకోగల స్థితికి తెచ్చుట మనవిధియై యున్నది. మతప్రచారము కొరకై చేయు క్రైస్తవమిషనరీల ప్రయత్నములుగాని, వారి బోర్డింగుహౌసులుగాని ఇందుకు సహాయకారులు కాకుండుటయే కాక ముందుముందు దేశారిష్టకరములు గూడ నగును.

ఇట్టి ఊహలు నన్ను కలచుటచేత యీ మహాకార్యమునకు నేను అసమర్థుడ నని యెరింగియు శ్రీరామకార్యమున ఉడుతవలె పని ప్రారంభించితిని.

తెనాలితాలూకా పెదపాలెము గ్రామములో కృష్ణకాలువ యొడ్డున 1918 వ సంవత్సరం 10 వ జనవరి తారీఖున శ్రీకృష్ణాశ్రమము స్థాపింపబడినది. ఆశ్రమస్థాపన, దాని నిర్వహణము, క్రమాభివృద్ధి, తద్గ్రామకాపురస్థులగు పుతుంబాకవారి అమూల్యమయిన ధనవాక్సహాయములవలన సాధ్యమయ్యెను. ఆశ్రమనిలయమునకై వేయి రూపాయలు ఖరీదుచేయు ఒకయెకరము పొలమును పుతుంబాక కుటుంబమిచ్చినది. వారి సహాయముండుటయే ఆ గ్రామమువందున చుట్టుపట్ల గ్రామములయందును నాకు ఒకపెద్దసహాయ మయినది.

నేను దేశముమీదతిరిగి చందాలరూపమున దాదాపు అయిదు వేలరూపాయలు వసూలుచేసి ఆశ్రమమునకై ఒకభవనము నిర్మించితిని. ఆశ్రమపోషణార్థము కాంగ్రెసు దాదాపు రు. 6200 లవరకు సహాయము చేసినది. ఆశ్రమము 1923 సంవత్సరము నవంబరు వరకు పంచమ బాల బాలికలకు చదువుచెప్పుటయు, చదువుతోపాటు శుచిత్వము, ఆహారనియమములు, దైవభక్తి, స్వాతంత్ర్యప్రియత్వము నేర్పుటయు జరుపుచు వచ్చినది. సహాయనిరాకరణోద్యమము వచ్చిన పిమ్మట ఆశ్రమమందలి విద్యార్థులకు నూలువడుకుటకూడ నేర్పబడుచుండెను.

నిత్యము ఎవరిపొట్టకువారే చూచుకొనవలసిన దౌర్భాగ్యము చేత విద్యార్థులు సరిగ రానందున కొంతమందికయినను భోజనవసతియేర్పరచి ఆశ్రమమునందే నివాసము కల్పించినగాని ఆశ్రమోద్దేశములు నెరవేరవని 1923 సంవత్సరం నవంబరునుండి 30 మంది బాలురకు ఉచితముగా ఆశ్రమమునందే భోజననివాసాదులు యేర్పరిచితిమి. ప్రస్తుతము ఆశ్రమమునం దారుతరగతు లున్నవి. చదువుతోపాటు నూలువడుకుట నేర్పబడుచున్నది. నేతకుకూడా తగుయేర్పాటు లన్నియు జేయబడినవి. నేతగాళ్లు దొరకగనే పని ప్రారంభింపబడును.

ఆశ్రమవిద్యార్థులు ఉదయమున 4-30 గంటలకు నిద్రలేచి 5-30 లోపల కాలకృత్యములు నెరవేర్చుకొనవలయును. పిమ్మట నిత్య కార్యక్రమ మీరీతిని జరుగును.

| | ఘం. | ఘం. |
|---|---|---|
| ఆశ్రమమునకు సంబంధించిన పనులు | 5-30 మొదలు | 6-30 |
| స్నానము | 6-30 — | 7 |
| దైవప్రార్థన | 7 — | 7-30 |
| పాఠములు | 7-30 — | 10-30 |
| భోజనము | 10-30 — | 11 |
| విశ్రాంతి | 11 — | 1-30 |
| ఆశ్రమమునకు సంబంధించిన పనులు | 1-30 — | 2-30 |
| పాఠములు, నూలువడుకుట | 2-30 — | 5-15 |
| ఆటలు, తోటపనులు | 5-15 — | 6-15 |
| సాయంకాల స్నానము | 6-15 — | 6-45 |
| రాత్రిభోజనము | 7 — | 7-30 |
| భజన | 7-30 — | 7-45 |
| పాఠములు చదువుకొనుట | 7-45 — | 9-45 |

ఈవిధముగా కాలవిభజనచేయబడి పనిజరుగుచున్నది.

ఈపని చాలదని నేనెరుగుదును. కాని యేపనియైనను క్రమముగా గాని వృద్ధిగాంచనేరదు. మా ఆశ్రమమునందు తయారగు ఒక్కొక్క

విద్యార్థి ఒక్కొక్క సంస్థాపనగా నుండవలయునని నాఆశయము. జీవనోపాధికి ఉపయోగించు వడ్రంగము, కమ్మరము, నేత, నేర్పుటకు సంకల్పించితిని. త్వరలో ఇంకొక రెండుతరగతులు ఏర్పరుపబడును. నూరుమంది విద్యార్థులకు అన్నవసతి యేర్పాటు చేయవలెనని ప్రయత్నము చేయుచున్నాను. నూరుమంది పిల్లలకు రెండుపూటలు జొన్నన్నము ఒకపూట నూకలజావ పెట్టుటకు రోజుకు పన్నెండు రూపాయలు ఖర్చగును. మూడువందల అరువదిఆరు పన్నెండ్లు వసూలుచేయవలయునని పూనుకొని కొంతవరకు పనిచేసినాను. ఈ క్రొత్తయేర్పాటులు 1925 వ సంవత్సరం జనవరినుండి ప్రారంభించుటకు సంకల్పించితిని గాని సాగలేదు. క్రొత్తసంవత్సరాదినుండి సాగింపగలను.

ఆశ్రమమునందు చేర్చుకొనబడు 100 మందిలో 74 మంది పంచములు (మాల మాదిగలు), 10 మంది క్రైస్తవులు, తక్కిన 16 మంది ఎరుకల ఏనాది లంబాడీ దొమ్మరిమొదలగు నిమ్న జాతులును అయి యుందురు. వీరిలో సగము బాలురు సగము బాలికలు. ప్రతివిద్యార్థియు ఆశ్రమమునందు అయిదుసంవత్సరము లుండవలయును. ఆశ్రమములో మూడవతరగతికి పనికివచ్చువారినే చేర్చుకొందుము. ప్రతి విద్యార్థియు నేత, వడ్రంగము, కమ్మరము పనిలో ఏకొకవృత్తి నేర్చుకొనవలయును. ఆశ్రమమునందు విద్యపూర్తియయిన పిమ్మట విద్యార్థులలో మేధావంతులుగా నుండువారికి ఉన్నతవిద్య నేర్పించుట మా సంకల్పము.

ఈపని ఒకరు నిర్వహింపదగినది కాదు. తమ జీవితమును ఇందుకై అర్పణచేయగల కొంతమంది యువకులు కావలయును. జీవనార్థము నెలకు రు 40 లు, ఉండుటకు ఉచితముగా యిల్లు, ట్రిపుల్ బెనిఫిట్స్ స్కీముక్రింద 2000 లకు లైఫ్ యిన్ష్యూరుచేయుట, యీ యేర్పాట్లు ఏవిధముగాను అస్పృశ్యత పాటింపక ఆశ్రమమునందు పనిచేయదలచిన వారికి చేయదలచినాము.

సంకల్పించినపని చాల పెద్దది. లక్షరూపాయలుకూడ చాలునని చెప్పుటకు వీలులేదు. 100 యెకరముల పొలమున్నను చాలదు. కాని ఆంధ్రదేశము సంకల్పించుకొన్నయెడల యీభారమంతయు ఒక్కమహారాజు మోయగలడు. అనేకమంది మహారాజులు, రాజులు, జమీందారులు యితర ధనికులుకల ఆంధ్రదేశమునందు మహాత్మునకు ప్రియమై, దేశాభ్యుదయమునకు అవసరమై హిందూమతమునకు గౌరవము తెచ్చునదైన యీసంస్థాపనము సాగించుట అసాధ్యము కాగూడదు. దేశాభ్యుదయమునకు ఇట్టి ఆశ్రమమొక్కటి చాలదు. అనఘము జిల్లాకొక్క ఆశ్రమము చొప్పున బయలుదేరి ఏజిల్లాలోని ఆశ్రమము ఆజిల్లా భరింపవలసియుండును. అట్టిశుభదినములు వచ్చునరకు ఆంధ్రమహాజనులందరు ప్రారంభించి పనిచేయుచున్న యీఆశ్రమమునకైన సహాయము చేయ ప్రార్థితులు. మా ఆశ్రమమునకు విరాళములను ఈక్రింది చిరునామాకు పంపగోరెదను. నల్లపాటి హనుమంతరావు,

ధర్మకర్త, శ్రీకృష్ణాశ్రమం, పెదపాలెం, దుగ్గిరాలపోస్టు, గుంటూరుజిల్లా

# పంచమవిలాపము

పురిపండా అప్పలస్వామి గారు

భారతమాతృక గర్భ పాథోధి నుదయించి
    యార్యులైయొప్పు సోదర్యులార!
"జంతుకోటిని నెల్ల సమముగా వీక్షించి
    దయఁజూడ"మనెడు విద్వాంసులార!
"జగదుపకారమే సౌఖ్యంబు, పరలోక
    సాధనం"బను లసచ్చరితులార!
భువి"నాత్మవత్సర్వ భూతాని"యనుసూత్ర
    మనుసరించిచరించు నయ్యలార!
గీ. దుఃఖభారంబుచే గడుఁ దూలిపోయి
తెరువుఁగానకయున్న మా తెరఁగుఁజూచి
జాలి వహియింపఁగాఁ బూనఁ జాలరయ్య!
భరతవంశీయులార! సత్పురుషులార!
సీ. అవని, 'అ; ఆ' లైన అభ్యసించెదమన్న
    పాఠశాలలకుఁ బోవంగరాదు
పరమేశు నొక్కింత భక్తిఁ గొల్చెదమన్న
    గుడిలోన మే మడుగిడగరాదు
మతధర్మములయొక్క గతినెఱుంగుదమన్న
    వేదశాస్త్రచయంబు వినఁగరాదు
పెద్దల దర్శింప వీలగునాయన్న
    వీథులబడి మేము వెళ్లరాదు
గీ. హాళిఁగూర్చెడు దేశభక్తాళి యొసఁగు
భాసురాంచితమగు నుపన్యాసనరణి
సొంపునాలింప సభలఁ గూర్చుండరాదు
ధీరతను మమ్ముఁ బ్రోవంగరారె? మీరు.
సీ. శల్యావశిష్టమై, శక్తి విహీనమై,
    యల్లాడు శారీర వల్లితోడ,
తైలవిహీనమై, ధూళి సంయుతమునై
    పీడి భూషలఁ బడు వేణితోడ
దుర్గంధనిలయమై, దుఃఖజలార్ద్రమై
    జీర్ణించి, చినిఁగినచీరతోడ
దినచంద్రసదృశమై, తేజోవిహీనమై,
    డంబుబాసిన వదనంబుతోడ,
గీ. అకట! తలదాఁచుకొనఁగఁ దావైనలేక
నిచ్చలును దుఃఖవారాబ్ధి నీఁదలేక
పూతచారిత్ర పంచమమాత యదిగొ
కుందెడును, రారె! కాపాడ హిందుజనులు!

# అస్పృశ్యమహర్షి - హరిదాసు

జనమంచి సీతా రామస్వామి గారు

"Bhaktas of India! You are all very ready to take up the Sweetheart of Gopis and Chaitanya, but how many of you have the pure flaming passion of Gopikas and Gouranga? You will be the darling dear of that sweet Cowherd when you see him with divine love in the chandala, in the thief, in the sinner, in the stranger, and all and not confine him to mere stone images."

అని రామతీర్థస్వామి అనర్గళ గంగాప్రవాహోపమాన మనఁదగు నొకయుపన్యాస రాజములోఁ బలికిన వాక్యములు నిజమైనభక్తియన నెట్టిదో మనోహరముగఁ దేటపఱచుచు నిరంతర స్మరణీయములై యొప్పుచున్నవని నాయభిప్రాయము. వానిసారాంశ మేమి?

"గోపికాహృదయలోల! చైతన్యస్వామి! గౌరంగా! కృష్ణా" అని ఉచ్చైస్స్వరమున నుచ్చరించు వారందఱును భక్త్యమృతపానమత్తచిత్తులేయని మనము తలఁపరాదు. పై వేషభాషలచే భగవంతుని మెప్పింపలేము. ప్రేమసుధారసముప్పొంగ నిష్కపటహృదయముతో ఆయనను చండాలునియందును – తస్కరునియందును – పాపాత్ముని యందును-పరదేశీయునియందును - వారు వీ రననేల?– అందఱియందును కనుఁగొనుటయే భక్తికి నిదర్శనము. అప్పుడే ఆపరమపురుషుని పరిపూర్ణానుగ్రహము చేకూరును. కాని, కేవల శిలావిగ్రహస్థితునిఁగా మాత్రమే భావించు నంతకాలము ఈశ్వరతత్త్వమును ఎఱుఁగఁజాలము."

దగ్గఱకు వచ్చినాఁడని చండాలుని తిట్టిపోసి, పది సారులు చెఱువులో మునిఁగి, ఆపాదమస్తక పర్యంతము విభూతిరేఖలుతీర్చి రుద్రాక్షమావళము చేతఁ బట్టుకొని, సహస్రగాయత్రి జపియించి, పరమపవిత్రుఁడ నైతినని సంతసించు పరమఛాందసశిఖామణిభక్తుఁడా? లేక, జాతిమత భేదము పాటింపక, "తనయందు సకలభూతములందు నొకభంగి సమహితత్వంబున" వఱలుచు, "తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను దీనులఁగావఁ జింతించుచు," త్రికరణశుద్ధిగా జగదీశ్వరుని సేవించుచు జీవయాత్ర నెఱవేర్చెడి ఆడంబరశూన్యుఁడు భక్తుఁడా?

పదిమంది కొంపలుతీసి పండ్రెండుసారులు సత్యనారాయణవ్రత మాచరింపవచ్చు. రాత్రింబవళ్లు కష్టపడి పనిచేసి పంటలుపండించు పాలికాపును పాము కఱచినదని వినియు వెంటనే వానిఁ జూచుట కేగినచో మడిబట్టలు మైలపడునేమో యని శంకించి సంధ్యావందనము చేసికొనుచుండవచ్చు. వీథిలో మాలవాఁ డొకఁడు దప్పిగొని దుస్సహతాపముచే నొడలెఱుఁగక పడిపోయినప్పుడు, వానిచెంతకేగి నోటరెండు నీళ్లచుక్కలుపోయుటకైన నిష్టపడక "చస్తేచచ్చాడు గాని దగ్గరకువెళ్లి బ్రాహ్మణత్వము గంగలో కలపలే"నని నిశ్చయించుకొని సుందరకాండ పారాయణము యథాప్రకారము జరపుకొనుచుండవచ్చు. ఇంటికి ముష్టికి వచ్చు బ్రాహ్మణేతరదరిద్రు లందఱి మీఁదను మొదటితరగతి మేజస్ట్రీటుహోదా చలాయించి ఒకనాఁడు వేలకొలఁది బ్రాహ్మణులకు కాశీసంతర్పణము చేయింపవచ్చు. కాని హరిదాసువంటి "అస్పృశ్య మహర్షి"కున్న గుణప్రాశస్త్యములో - చిత్తశుద్ధిలో- భక్తిపారవశ్యములో - ఒక్క శతాంశమేనియుఁ గలిగి యుండు టెంతకష్టము! అయ్యో! అమ్మహనీయునిఁ గూడ "అస్పృశ్యమహర్షి" అనవలసివచ్చినదే! యోగి పుంగవుఁడుగూడ అంటరానివాఁడేనా? కాకేమి, ఔనని చెప్ప సాహసించు మహానుభావులు-భక్తవర్యులు - ధరామరతిలకులు-హిందూమతోద్ధారకులు-నూటికిఁ దొంబది చొప్పున వెలసియుండఁగా, "కాఁడు" అని జవాబు చెప్పువాఁడు దేశాపకారిగాఁడా? మతద్రోహిగాఁడా? బ్రాహ్మణబ్రువుఁడుగాఁడా? అకటా! దేశమున కెంతదుర్దశ సంభవించినది! అస్పృశ్యతాదోష మంతరించినఁగాని దేశము

నకు ముక్తిలేదని నొక్కి వక్కాణించు మహాత్ములనే నోటికి వచ్చినట్లు దూషణచేయు బ్రహ్మబంధువుల ముందఱ నేమి మాట్లాడఁగలము? వారి సిద్ధాంతమును బట్టి, పంచమకులములో జన్మించినవాఁడు పరమభక్తావతంసుఁడైనను అస్పృశ్యుఁడే. కాఁబట్టి, మన హరిదాసును గూడ "అస్పృశ్యమహర్షి"గాఁ బేర్కొనవలసినదే. కాని ఆమహనీయుఁ డెట్టివాఁడో యొకింత ముచ్చటింతము.

అతఁడు సుప్రసిద్ధ పంచమయోగి(Untouchabla saint)

అతని భక్తివిశ్వాసముల కచ్చెరువొంది, ఆనందమునొంది, పూర్వము శ్రీచైతన్యస్వామి నిజశిష్యకోటిలో నొకనిగాఁ జేసికొని, అపరిమిత వాత్సల్యాదరభావములతోఁ జూచుచుండినట్లు చైతన్యచరిత్ర తెలుపుచున్నది. వారిద్దఱకు సమావేశము కాకమునుపు హరిదాసు రోడ్డు ప్రక్క నిలుచుండి, దూరమునుండివచ్చుచున్న చైతన్యు నవలోకించి, సాష్టాంగదండప్రణామము లాచరించెనఁట! అంతట నతనిని దగ్గఱకుఁ దీసికొనిరండని స్వామి ఆజ్ఞాపింపఁగా, శిష్యు లట్లుచేయఁబూనిరి. కాని, హరిదాసుసహజ వినయ గరిమదీపింప, "అయ్యలారా, నేను హీనకులజుఁడను, చండాలుఁడను, అంటరానివాఁడను. నేను దేవాలయములోనికైనఁ బోఁగూడదు. కాఁబట్టియే, జగన్నాథ స్వామి భక్తులెవ్వరు నన్నంట నక్కఱలేకుండ దూరము నుండియే స్వామిని ఆరాధింతును. సమీపమునకు మీరు రావలదని నాప్రార్థన," అని పలుకుచు, "అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేషమత్తచిత్తుఁడై" విరాజిల్లెను. అప్పుడు చైతన్యస్వామి అతని దగ్గఱి హృదయపూర్వక స్వాగత మొసఁగె. హరిదాసు స్వామిపాదముల కెఱఁగె. స్వామి దాసునిఁ గౌఁగిలించుకొనెను. ఇద్దఱును ఆనందపారావారమునఁదేలలాడిరి.ఒకరినొకరు మెచ్చుకొనిమైమఱచిరి. "స్వామీ, నేనంటరానివాఁడను. నన్ను తగులకుఁడు" అనిహరిదాసు మొఱపెట్టకపోలేదు. కాని, చైతన్యుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చె. "ఓభక్తవర్యా, నేను పరిశుద్ధుఁడనగుటకే నిన్ను ముట్టుకొనుచున్నాను. ఏలయనఁగా, నీమతనైర్మల్యమునాకు లేదు. సమస్తపుణ్యతీర్థములందు స్నానమాచరించుటవల్లనో, తపమాచరించుటవల్లనో, మహాదానములు చేయుటవల్లనో, వేదపఠనమువల్లనో యెంతపుణ్యముచేకూరునని శాస్త్రములు చెప్పుచున్నవో అంతపుణ్యమును నీవు ప్రతిక్షణమున ఆర్జించుచునేయున్నావు. నిజముగానీవు బ్రాహ్మణునికంటెను పావనుఁడవు"

అట్లుపలికి శ్రీచైతన్యస్వామి ఆ "అస్పృశ్య మహర్షి" కిఁ దన ఆశ్రమములోబసయిచ్చి, అతని సహవాస మబ్బినందుకు బ్రహ్మానంద మొందుచుండెనఁట!

ఈసందర్భమున నాకు శ్రీమదాంధ్ర మహాభాగవత పద్యరత్న మొకటి స్మృతిగతమగుచున్నది. నాయనలారా, అది, అందఱును ఎల్లప్పుడును పఠింపవలెను.

"మ. అమలజ్ఞాన సుదానధర్మరతిస
  త్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపో ఽనసూయలఁగడున్
  దర్పించుధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థ
  ప్రాణవాక్కర్మముల్
సమతన్నిన్ను నయించెనేని నిజవంశ
  శ్రీకరుండౌఁదుదిన్."

ఆహా! అట్టి నిజవంశ శ్రీకరుండైన హరిదాసెంత ధన్యుఁడోగదా!



# మాలపిల్ల

శ్రీమదాంధ్రవిద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి, శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు

ఇంద్రనీలముడాలు నేలఁజాలెడిమేని
వన్నెకన్నులకుఁ బర్వంబుసేయ
చందమామ వెలుంగు నందంబు క్రిందుగాఁ
జిఱునవ్వు మొగమునఁ జెలువుగొలుప
వెలయించనట్టిదా వలువగట్టినరీతి
నిర్గర్వముగ్ధత్వ నియతిఁ దెల్ప
"ఘల్లుఘ"ల్లనిమ్రోయు కరకాచకంకణ
క్వణనంబు తారమొక్కరహిఁ బూన
గీ. "జుమ్ముజు"మ్మంచు నుద్యాన సుమవిహారి
మత్తపుష్పంధయధ్వని మధురిమాను
కారియగు రాటమును దనకరముచేతఁ
ద్రిప్పుచును దారమును వడిఁ దీయుచుండె
మంచికిని నెల్లయగు నొక్కమాలపిల్ల!!

సీ. ఏసూత్రము ధరించుటే భూషణంబను
చును మహాత్ములు నొక్కియనిరి నేడు?
ఏసూత్రమును దాల్చి యొసఁగించు నుష్ణత్వ
శైత్యాపనోదన శక్తి ప్రజకు
ఏసూత్రముహారంగు భాసిల్లు నలసుధా
కరమనోహరకర కాంతిఁ గేరి;
ఏసూత్రము జపించు టిప్పించుసన్మాన
మునముక్తి దేశీయజనత కెలమి
గీ. అట్టి ఖద్దరుసూత్రము నమలమయిన
రాటమను యంత్రమునఁదీసి రహిని భరత
మాతృకంఠవిభ్రాజకమాలఁ జేయు
మంచితనమునకెల్ల ఆమాలపిల్ల!!

మ. నలువాఱ్ఱ దోలి సోదరీమణిని
గృష్ణంబ్రోచెఁ గృష్ణుండు వ
ల్వలనీయందగు సూత్రమానియఁ బె
వల్వాల్ కొల్ప నేసూత్రమా
ని లలిస్నివును సోదరీమణుల నెం
తేఁ బ్రోవఁగా నెంచినా
వలకృష్ణత్వ మెసంగు నీమెయిని; న
ల్లౌటన్ నిన్ గృష్ణు చె
ల్లెలు తచ్ఛక్తివటంచు నన్నపిదపన్
లీలన్ దదంచత్కృతిన్
బలిమింబూనితివంచు నెంచెద నెదన్
జండాలకన్యామణీ!!

సీ. మాలయంచనఁ గసుమాలమా? కాంతిని
ర్మలమైన ముత్యాలమాలగాని
మాలయంచనఁ గసుమాలమా? బహువర్ణ
మంజులనవరత్నమాలగాని
మాలయంచనఁ గసుమాలమా? సౌరభా
మందమౌ మందారమాలగాని
మాలయంచనఁ గసుమాలమా? మానర
త్నాలీలఁ దగు నక్షమాలగాని
గీ. కడఁగి ధర్మార్థకామ మోక్షప్రదప్ర
భావమానితసూత్రమాలావిరచన
కుతుకమానసవై నాకుఁ గూర్చెముదము
మంచితనమునకెల్ల యీ మాలపిల్ల!!

క. జగతిన్ సుగతిన్ నీవలె
నగణితగతి సోదరతతి కతిసౌఖ్యదవై
తగ వెలయుత మంగళవతు
లు గుమానిను లెందఱో బుధులును మతిమెచ్చన్.

# దేశీయ రంగులు

వక్కలంక అచ్యుత రావు గారు

భారతదేశ మన్నివిధముల వృక్షజాతులు పెరుగుటకు స్వతస్సిద్ధముగా ననుకూలమైయున్నది. తరుగుల్మలతాదులన్నియును నేదోయొకవిధముగ మానవకోటి కత్యంతావశ్యకములైన ఆహారపదార్థములనేకాక, తదితరోపయోగమైన వస్తువులనుగూడ నిచ్చుచున్నవి.

ఇట్టి ప్రకృతిసంపదలతో తులతూగుచున్న మనదేశమిప్పు డధఃపతితమై ప్రతివస్తువునకును పైదేశముల కాధారపడియుండుట జూడ మనదౌర్భాగ్యదశయును, జ్ఞానశూన్యతయును, సోమరితనమును, వెల్లడిచేయుచున్నదని చెప్పుటయం దతిశయోక్తి లేదు.

భారతదేశ మిప్పుడు కొంచెము కొంచెముగా నూతనవికాసమును, స్వాతంత్రశక్తిని పొందుచున్నది. రాజకీయ, సాంఘిక ఆర్థికవిషయాభ్యుదయమును చేకూర్చుటకు మహనీయు లష్టకష్టములు పడుచున్నారు.

ఆర్థికస్వాతంత్ర్య మున్నానవున కితరములయందు స్వాతంత్రము పెంపొందించుటకు పునాదివంటిది. ఈ పునాదిని కడుజాగ్రత్తతో పరిశీలించి వేసిననేకాని లేనియెడల దానిమీద నిర్మించబోవు స్వాతంత్ర్యభవన మడుగంటును. అనేకసంవత్సరములనుండి కోల్పోయిన స్వాతంత్ర్యభవన నిర్మాణమునకు గాంధిమహాత్ముడు తగుపునాదిని వేసి భవననిర్మాణమునకు వలయు సామగ్రిని చేకూర్చుచున్నాడు.

మానవకోటి కత్యంతావశ్యకములైన అన్నవస్త్ర గేహాదులలో వస్త్రనిర్మాణమునే పునాదిగా నుంచెను. సనాతనమునుండియు భారతీయులు తరుగుల్మలతాదులనుండి లభించువాటినే ప్రాణమానములను కాపాడుటకుపయోగించుచుండెడివారు. వాటినే నేడు తిరిగి నెలకొల్పుట జూడ నెవరికానందము పొందకయుండగలదు?

భారతదేశము నేతపరిశ్రమ కెంత ప్రసిద్ధిజెందియుండెనో దేశీయరంగులను వేయుటయందుగూడ నంత నిపుణత గలిగియుండెను.

ప్రస్తుతము దేశీయరంగులవిషయమై నేను పరిశీలనచేసిన విషయములను ఆంధ్రసోదరీసోదరులకు విన్నవించుచున్నాడను.

"ప్రదర్శనగృహములం దుంచబడిన పురాతన వస్త్రములను, మిక్కిలి సొగసైనరంగులువేసిన తివాసీలు, శాలువలు బట్టలను, ప్రకృతియందు తిలకించు వివిధవర్ణములతో సమానమగు రంగులువేసి నేసిన బట్టలను పైదేశముల కెగుమతి సనాతనమునుండి చేయుటయును, వీటినన్నిటినిబట్టిచూడ మనదేశీయులు రంగులు వేయుటయందును తరుగుల్మలతాదులనుండి వాటిని దీసి యుపయోగించు విధములయందును, మిక్కిలి నేర్పరితనమును, జ్ఞానమును, కళాచాతుర్యమును, నాగరికతను గలవారని చెప్పుటకు వీలుగలుగుచున్నది."

జర్మనీదేశపురంగులు దిగకమునుపు మనదేశమునుండి రంగుల కుపయోగించు చెక్కలు, వేళ్లు, ఆకులుమొదలైనవి పైదేశముల కెగుమతియగుచుండెడివి. ప్రస్తుతమందుకూడ లక్క,నీలి, కాచు మొదలైనవి పాశ్చాత్యదేశములందలి బజారులకు బంపబడుచున్నవి. ఇప్పటికిని గూడ మనసీలి జర్మనీనీలిమందుకన్న మిక్కిలి ప్రశస్తమైనదనిన్ని, మంచిఖరీదైనదున్న తివాసీలు,బట్టలు మొదలైనవాటికి దేశీయరంగులే ప్రశస్తమైనవనిన్ని, చిరస్థాయిగా నుండుననిన్ని కనుగొనబడినది.మనరంగులువేయు పద్ధతులను, రంగులను పాశ్చాత్యవర్తకులును, పండితులును మిక్కిలి శ్లాఘించుచున్నారు. అనేకవందలసంవత్సరముల క్రిందట నేసిన రంగుల తివాసీలు, వాటికివేసినరంగులును ఏమా

త్రము చెదరక కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నవని పరిశోధనకారులు చెప్పుచున్నారు.

అయితే ప్రస్తుతాంశ మేమన మన మెట్లీపరిశ్రమను పునరుద్ధరించగలమో ఆలోచించవలసియున్నది. "మిక్కిలి కుతూహలముగల విద్యార్థులు మన దేశపు తరుగుల్మలతాదులను పరిశీలించి మిక్కిలి నాణ్యమగు రంగులను ఇచ్చువాటిని గురించి పరిశీలించుటకు తగు శ్రద్ధపూని శాస్త్రరీతిగా పరిశోధించి, వారు కనుగొనినవాటిని ప్రజలకు తెలియజేయుటచే నీపరిశ్రమను తిరిగి పునరుద్ధరించుటయేకాక, వెనుకటి ఔన్నత్యమును మన దేశము బడయగలదని" ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారు నుడివియున్నారు.

మొన్నటి ఐరోపాసంగ్రామము ప్రపంచమంతకును నొకపాఠమును బాగుగ బోధించినది. అత్యంతోపయోగమగు వస్తువులకు పై దేశములపై నాధారపడి స్వంతపరిశ్రమలను గోల్పోవుట యెప్పటికైన ముప్పువాటిల్లునని నిదర్శన పూర్వకముగా జూపినది.

మనధర్మములను, విద్యలను, దేశీయపరిశ్రమలయందును నశ్రద్ధచేయుటచే దానికి ఫలితమిప్పు డనుభవించుచున్నాము.

మనయైశ్వర్యాభివృద్ధిని గాంచు కుతూహలమున్నచో 'సేవకవృత్తిచే లభించు పాయసముకన్న, స్వచ్ఛందవృత్తిచే లభించు గంజియేమేల'ని తలంచినచో, మన దేశమునకు మాతృపరిశ్రమయైన వ్యవసాయమును, దానికి సంబంధించిన పరిశ్రమలను వృద్ధిచేయుటకు శాస్త్రముల నభ్యసించిన వేనకువేలు సోదరీసోదరుల మనంబీవైపునకు మరల్పవలెను. మన దేశములో మూడువంతులు స్వచ్ఛందవృత్తులచే జీవనము గడుపుటకు తగు నవకాశములు గలవు. తరువాత మన దేశమం దభిమానమును, దేశదారిద్ర్యమును లక్ష్యమునం దుంచుకొని, విదేశవస్తుబహిష్కారమును, స్వదేశవస్త్వభిమానమును నభివృద్ధిచేయుటకు ప్రతిసోదరియు సోదరుడును ఎవరికివీలగుమార్గమున వారు తోడ్పడవలెను. విదేశవస్తువు లెంతచౌకగా దొరికినను వాటియభిమానము తెగనాడవలెను. అందుచే విదేశశాస్త్రకారుల పరిశోధనలను గాని వారినిర్మాణకౌశల్యమునుగాని నిరసించుటకాదు. వారిబుద్ధికౌశల్యమును శ్లాఘించుచు వారెట్లు తమస్వాతంత్ర్యమును గాపాడుటకు పాటుపడుచున్నారో మనముకూడ నట్లే పాటుపడి మనపూర్వులఔన్నత్య మెట్లుజగద్విఖ్యాతమైనదో అట్లే మనముకూడ చేయగలిగినచో మనజన్మసాఫల్యమగును. మన దేశములో కూటికిని గుడ్డకును లేక వేనకువేలు మాడుచున్నపుడు పై దేశములవారి యభిమానమును, ఐశ్వర్యమును వృద్ధిగాంచుటకు పాటుపడుట స్వధర్మముగాదు. దేశహితముగాదు.

ఖద్దరు నిర్మాణకార్యక్రమమువల్ల ప్రజల కెట్లు వృత్తులేర్పడుట కవకాశమిచ్చెనో, దేశీయరంగులను గూడ పరిశీలించి తిరిగి యీసనాతన పరిశ్రమ నభివృద్ధిగాంచినచో ఎవరువడికి నేసినబట్టకు వారుకోరినరంగులను వేసుకొనుటయే కాక చాలమందికి వృత్తులు గలుగజేసినవారమగుదుము; కళాసారస్వతమును పెంపొందించినవారమును నగుదుము. 'జాతియొక్క అంతర్గతోత్సాహ నిర్వచనమే కళాసారస్వతము.'

నేను కొన్ని వృక్షములనుగురించి కృషిసల్పుటయం దభిప్రాయమేమన ప్రతిగృహమందును వారికికావలసిన రంగులను తయారుచేసికొని వారిచే స్వంతముగా వడికి నేసిన బట్టలకు వేసికొని సంపూర్ణ స్వాతంత్ర్యము పొందవలెననిన్ని; తరువాత (Aesthetic gardening) ఆరామకృషియం దభిరుచి జనింపచేయవలెననిన్ని తన్మూలమున ప్రతిగృహమును సంతోషదాయకముగా లాభకరముగా నుండుననిన్ని; మనసోదరీమణులు గృహపరిశ్రమ లభివృద్ధిగాంచి ఆరోగ్యవంతులై యుండగలరనుదురను తలంపుతో మొదలిడితిని.

రాట్నపరిశ్రమ, ఉద్యానకృషి, రంగులపరిశ్రమ మనసోదరీమణుల కత్యంతోపయోగముగా నుండి జ్ఞానవంతులుగాగూడ జేయును. పూర్వకాలమున మనసోదరీమణులు నేతయందును, నగిషీ పనియందును, రంగులపరిశ్రమయందును పాల్గొనిన ట్లుదాహరణము గలదు. (V. S. XXX of Cit.) వారు అనేకరకముల ఎరుపు, నీలి

మొదలగు రంగులబట్టలనే ధరించుచుండిరని ఋగ్వేదములో చెప్పబడియున్నది (R. V. VII. 33).

ఈసంగతులన్నియు నామనంబున నిడుకొని మన దేశములో నన్నిప్రాంతములందు పెరుగు వృక్షములను గురించి కొంత కృషిసల్పితిని. అవి సాధారణముగా నన్నిప్రాంతములందున్నను వాటివల్ల లభించు వస్తువులను వ్యాపారముచేయుచున్నాము. తరుగుల్మలతాదులనుండి లభించు ఆకులు, చెక్కలు, తొక్కలు మొదలైన వెన్నియో ఔషధములకును, రంగులకును, చముదీయ నుపయోగించుటకు వీలుగానున్న వెన్నిటినో వృథాగా వంటచెరకుగా నుపయోగించుచున్నాము. వీటినన్నిటిని పరిశీలించుటకు విద్యార్థులకు ఓపిక పట్టుదల ప్రకృతియందభిరుచి యున్నచో దేశమునకు చాల మేలు చేకూరునని నాతలంపు.

అమెరికాదేశ మిచ్చవిధీపరిశ్రమయందు ముందంజ వేసియున్నది. దేనియందైన నశ్రద్ధచేసినయెడల పాశ్చాత్యులు మనకు పోటీయని నమ్మవలెను. వారిదేశములో గల చెట్లుమొదలైనవాటిని పరిశీలించుట ప్రారంభించి అనేక రంగులను తయారుచేసి ఇంగ్లాండు, కెనడా, ప్రాంసు, రష్యా, ఇటలీ, ఆస్ట్రేలియా మున్నగు దేశముల కెగుమతిచేయుచున్నారు. అట్టి సమయమందు మన మేల నశ్రద్ధవహించవలెనో యూహించుటకష్టసాధ్యముగనున్నది. నేనుపరిశీలించిన వాటన్నిటిలో నీదిగువనుదహరించిన దానిమ్మచెట్టు మామిడిచెట్టు పైనివ్రాసినయుపయోగముల కన్నిటికి ననుకూలించుచున్నవి. దానిమ్మచెట్టును, మామిడిచెట్టును చూడని వినని యాంధ్రు లుండరని నాతలంపు.

(పత్రికలో నంతయు ముద్రించుటకు వీలుగానుండదుగాన ముఖ్యమైన సంగతులనే వ్రాయుచున్నాను. వాటిని పెంచువిషయము, రంగులను తయారుచేయుట, ఏయేవిధముగా నుపయోగించునో నే ప్రచురింపబోవు పుస్తకమందు వ్రాయుచున్నాడను.)

### i దానిమ్మచెట్టు

ఈచెట్టును సనాతనమునుండియు, ఔషధములకును, పండ్లకును, తదితరవిషయములకును మిక్కిలి ప్రసిద్ధికెందియుండెను. పూర్వచారిత్రలయందు విఖ్యాతిగాంచిన పెర్సిపాలిస్, అసీరియా, ఈజిప్టు మొదలగు దేశములందు స్మరణచిహ్నములందును (Monuments) గ్రంథములందును దీనిప్రసిద్ధగుణములు వర్ణించబడి యుండెను. మన సంస్కృత గ్రంథములందుగూడ దీనిగురించి వ్రాయబడియున్నది. ఔషధములకు దానిమ్మగింజలరసము చాల చలువజేయును.

వేరు, తొక్క, మహామ్మదీయ వైద్యులు (Tapeworm) నులిపురుగులను రూపుమాపుట కుపయోగించుచుండెడివారు. ఇంగ్లీషువైద్యులుకూడ దీనిని మీదచెప్పినదానికి 1805 దగ్గరనుంచి ఉపయోగించుచున్నారు. ఆముదమును పుచ్చుకొనినతరువాత ఈతొక్క కషాయముపెట్టి పుచ్చుకొన్నయెడల నులిపురుగులు తప్పక నాశనమగును. నోరుపూచినయెడల యీకషాయముతో గడిగిన త్వరలో నివారణయగును. యోనిసంబంధమైనజబ్బులకు దీనికషాయముతో గడుగుట చాలమంచిది. నులిగడుపుకట్టుటకు మిక్కిలిమంచిదని డాక్టరు కిర్కుపేట్రిక్ చెప్పుచున్నాడు. దీనియొక్కగుణమును అనేకమంది ప్రసిద్ధిచెందిన వైద్యులు ఆమోదించుచు ఆయాజబ్బులకు దీనినే వాడుచున్నారు. యన్. యల్. ఘోషు(N. L Ghose)గారు నులిపురుగులకు మిక్కిలి ప్రయోజనకారియని నిర్ధారణజేసిరి. 2 ఔన్సుల తొక్కను 24 ఘంటలకాలము నానవేసి వడబోసి బాగుగ మరగనియ్యవలెను. తెల్లవారుజామున మూడువంతులుచేసి యొక్కొకవంతు 2 ఘంటల కొకపర్యాయముచొప్పున పుచ్చుకొనిన నులిపురుగులు తప్పక నాశనమగును. సివిల్ సర్జన్ రాసుగారు దానిమ్మపువ్వులుగూడ చాలమంచివని చెప్పుచున్నారు.

#### రసవాద గుణము

దీనియందుగలఆమ్లము (Acid)టానిక్ ఆసిడ్ అయియున్నది. దీనియందు మధురపదార్థము, బంకపదార్థము కూడగలదు. 1000° వేడికి 5.9°/₀ సారము దిగుచున్నది. దీనియందు (Alkaloid substance) గలదు. దీనిని తయారుచేసి డాక్టరులు నులిపురుగులుపోవుట కుపయోగించుచున్నారు.

ఆహారపదార్థము

దానిమ్మపళ్లు రోగులకు అమృతమువంటిది. వారి జిహ్వకు మిక్కిలి రుచినిపుట్టించును. దానిమ్మపళ్లు చాల కాలమువరకు నిలవయుండును.

దానిమ్మషరబత్ రుచికరముగను, చలవజేయుటకు నుపయోగించును.

రంగులు (Dyes)

ఈచెట్టుయొక్క అన్నిభాగములు రంగులు వేయుటకు పనికివచ్చును. పూర్వమునుండికూడ మనదేశములో కొన్నిటిని వాడుటకలదు. దానిమ్మపువ్వులు దానిమ్మపండుతొక్కలు ఉత్తరహిందూస్థానమున బట్టల రంగుల కుపయోగించుచున్నారు. ఇంతవరకు నుపయోగించుచున్న వాటినిబట్టిచూడ రంగులకంత లాభకారిగా నున్నటుల గానుపించలేదు. కాని యీచెట్టునుండి విస్తారపుఆకును, కొమ్మలును లభించును. ఎందుచేతననగా యీచెట్టును ప్రతికాపు అయినవెంటనే ఛేదించుటవసరము. పండ్లకాలము రాకపోయినను ఛేదన (Pruning) వలన పలువలను నలువైపులకు విస్తరించి బాగుగ ఫలించును. ఆకును దూసివేసిన కొద్దిరోజులలోనే చిగుర్చుకొని వచ్చుచుండును. అందుచేత యీచెట్టునుండి లభించుచున్న ఆకు, కొమ్మలు మొదలైనవి వృథాపుచ్చుచున్నాము. వీటిని రంగులకుపయోగకారిగా మార్చుటకు వీలుగా నున్నది. దానిమ్మచెట్టును పెంచుటవల్ల ఫలసాయము ననుభవించుటయేకాక సామాన్యముగా ప్రతియింటవచ్చు వ్యాధులు నులిగడుపు, నురిపురుగులు- మొదలైనవాటికి దివ్యౌషధమని పైనజెప్పియున్నాను. రంగులకుకూడ నుపయోగించునుగాన యీచెట్టుయొక్క లాభ మెంతైనగలదని నాయభిప్రాయము. అందుచేత దానిమ్మతోటలు వేయువానికిని పరిశ్రమచేయువానికిని తగినలాభము చేకూర్చును. ప్రతిగృహమునను నీచెట్లును సుళువుగా పెంచవచ్చును. ఇది చూచుటకు మనోహరముగాను, ఎటువంటిస్థలమందైనను పెరుగు చెట్టైయున్నది. మనగృహములకు కొద్దిగనో గొప్పగనో పెరళ్లుండును గాన ఎవరిగృహమునకు కావలయు చెట్లనువారతిసులభముగా పెంచవచ్చును. ఈదిగువ కొంచెము క్లుప్తముగా రంగుల కెట్లుపయోగించునో వ్రాసెదను.

ఆకులు, కొమ్మలు, వేళ్లు నీక్రింద కనుపరచిన రంగుల కుపయోగించును.

(అ) ఆకులను, కొమ్మలను నీటిలో మరగబెట్టి దీసిన కషాయము నీదిగువ వివరించినరీతిగా నుపయోగించితిని. ఈకషాయమును నూలు, వున్ని పట్టుగుడ్డలకు వేయుట కుపయోగించితిని. ఈరంగు రసవాది లవణములతో జేర్చినగాని రంగుపట్టదు. అందుచే నీక్రిందివాటిని ఉపయోగించితిని: అన్నభేది;(Fenic Acetate ; Potassium-dicromate;) మైలతుత్తు (Copper sulphate) కాచు.

Straw color

1. పటిక (Alum) నీళ్లలో దడిపిన గుడ్డను 'అ' యందు చెప్పినకషాయములో ముంచినచో ఎండుగడ్డిరంగు బట్టకువచ్చును.

Ash and deep Black

2. అన్నభేదిలోవేసిన వేడినీటియందుగుడ్డను అరఘంటసేపు ముంచినతరువాత 'అ' కషాయములో ముంచి మొదల (Ash color) వచ్చును. ఇట్లు నాలుగైదుసారులు వేసినమొదల మిక్కిలి నల్లనిరంగు వచ్చును. అన్నభేదిలో ముంచినతరువాత చాలసేపు గాలిలో నారనిచ్చుచుండవలెను. అట్లు రంగువేసిన బట్టను రెండురోజులవరకు నారనిచ్చి తరువాత వుతకవలెను.

దట్టమైన కాకిరంగులు

3. 'అ' కషాయములో పైనిచెప్పినవిధముగా బట్టనునాన వేసినతరువాత;

మైలుతుత్తు (Copper sulphate) వేడి నీటిలో 15 నిమిషము లుంచి తీసిన తరువాత;

పొటాసియమ్‌బైక్రొమెట్ వేసిననీటియందు అరఘంటసేపు నుంచి తీసిన దట్టమైన కాకిరంగు వచ్చును.

Brown

4. 'అ' కషాయములో నానవేసినతరువాత కాచుగుండవేసిన నీటియందు అరఘంట నానవేసి, బైక్రొమేటులో నానవేసితీసినమొదల బ్రౌను రంగు వచ్చును.



శ్రీరాజా మాణిక్యారావు వెంకట గోపాలరాయణం బహద్దరు జమీందారువారు (1870-1883)



శ్రీరాజా మాణిక్యారావు వెంకట మార్కండేయరావు బహద్దర్ జమీందారుగారు (1902)



శ్రీరాజా మాణిక్యారావు జంగన్నారాయణం బహద్దర్ జమీందారువారు (1836-1870)



శ్రీరాజా మాణిక్యారావు వెంకటహయగ్రీవరావు బహద్దర్ జమీందారువారు



శ్రీ. శ్రీ. పైడా చలమయ్య జమీందారుగారు



శ్రీ ఆర్. యస్. శాస్త్రీగారు

శ్రీ చెలికాని వెంకటనరసింహారావుగారు



Sjt Chelikani Venkatanarasimha Rao garu

శ్రీ తాడిపర్తి శ్రీరామశ్రేష్ఠిగారు



Sjt Tadiparti Sreerama Sresti garu

శ్రీ మార్లపూడి పుల్రసత్యంశర్మగారు



Sjt· M· P· Satyam Sarma garu

శ్రీయుత అయ్యగారి తిరుపతిరాజుగారు



Sjt Ayyagari Tirupati Raju garu

శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు,
శ్రీ వ్యాసగ్రంథమాలా స్థాపకులు



Sjt A· Venkata Sastri garu
Founder of Vyasa Grandhamala

కీ. శే. మెండ దాలెన్నాయుడుగారు, భద్రి



Late Menda
Dalennayudu garu, Bhadri

శ్రీయుత సోంపల్లి వెంకటరమణయ్య
చౌదరిగారు



Sjt S· Venkataramanayya
Chowdari garu

నూతన ప్రచురణము.

## శ్రీమదాంధ్రమహాభాగవతము

పోతనామాత్యప్రణీతము. ఇదివరకు ముద్రితములైన ప్రతుల కన్న బాగుగా ముద్రించుచున్నాము.

గ్లేజుకాగితములు క్యాలికో బైండు గిల్టుపేరు గలది. వెల 6 0 0

సంపూర్ణప్రతి రెండుసంపుటములుగ క్యాలికో బైండుగిల్టుపేరుతో వెల రూ. 8 0 0

సంపూర్ణ ప్రతి 3 సంపుటములుగ ప్రథమ, ద్వితీయ, చతుర్థస్కంధములు క్యాలికో బైండు గిల్టు పేరు వెల 3 0 0

పంచమ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ, స్కంధములు గల సంపుటము క్యాలికో బైండు గిల్టుపేరు గలది. వెల రూ. 3 0 0

దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు క్యాలికో బైండు గిల్టుపేరు వెల రూ 3 0 0

నామలింగానుశాసనము అను నామాంతరము గల

## అమరకోశము

త్రికాండము – సటీకము

ఆంగ్లేయభాషాంతర పదములతోఁ గూడినది

20 రతుల డిమ్మి గ్లేజు కాగితములు క్యాలికో బైండు 1 12 0

## శ్రీమద్భగవద్గీత

ప్రతిపదటీకా భావ్యవిశేషార్థ సహితము

క్యాలికో బైండు గిల్టుపేరు గలది రూ 3 0 0

## శ్రీమదాంధ్రమహాభారతము

పద్యకావ్యము

| | | |
|---|---|---|
| I | ఆదిసభాపర్వములు గల సంపుటము | 2 4 0 |
| II | ఆరణ్యపర్వము | 2 4 0 |
| III | విరాటోద్యోగపర్వములు | 2 4 0 |
| IV | భీష్మద్రోణపర్వములు | 2 4 0 |
| V | కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 2 4 0 |
| VI | శాంతిపర్వము | 2 4 0 |
| VII | అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వముల సంపుటము | 2 4 0 |

గ్రంథములకు వ్రాయునపుడు వాని వెలయును తెలుపవలెను.

### ఎ కణక్ సెట్టి అండ్ కంపెనీ,

ఆంధ్రపబ్లిషర్సు, 286, చైనాబజారురోడ్డు, జి. టి. మద్రాస్.

ధనవంతులకు మాత్రమే?

### అనంగప్రభయాకూతి

ముసలితనము, ఇతరకారణములచే గలిగిననరముల బలహీనత, ముడుతలుబడిన దవుడలు, చిక్కిపట్లు కనబడుట అలసిపోవుట మొదలగువాటిని విశేషకష్టము, ఖర్చులేకయే బాగుచేసి శాశ్వతయవ్వనము నిచ్చును. శాస్త్రసమ్మతముగా తయారుచేసిన ఈదివ్యౌషధము నిరుపయోగమైనట్టి స్థితులలో కూడ క్రొత్తమరుపత నమును పుష్టినిచ్చుచు యింద్రజాలమువలె నూతనమార్పును కలిగించును. పూర్తి వివరములకు వ్రాసిన యినాముగా పంపబడును.

30 గుళికలు గల బుడ్డీ రూ. 10 మాత్రమే.

### కందర్పసంజీవని తైలము

ఈతైలమును పైకివాడుటచే నపుంసకత్వము తొలగుటయే గాక మంచిసంసారసౌఖ్యము తప్పక కలుగును. ఒకతులము బుడ్డీ 1-కి ధర ర్పు 10-0-0.

ఇతర వివరములకు వ్రాసిన మాక్యాటలాగు ఉచితముగా పంపబడును.

### ఏల వేదన? మదనమంజరి మాత్రలు

అజీర్ణము. మలబంధమువంటి సాధారణరోగములను నపుంసకత్వమువంటి గొప్పవ్యాధులను కుదుర్చుటయందు 30 సంవత్సరములుగా దేశసేవచేసి ప్రఖ్యాతి చెందియున్నందున దానిని సేవించక ఏల చింతించెదరు? ఒకడబ్బి రు. 1. 6 డబ్బీలు రు. 5. 12 డబ్బీలు రు. 9.

యథానామ తథాగుణము

### రమణవిలాసినీ వటికా

నిద్రించుటకు ఒకగంటకు పూర్వము ఈమాత్రలలో ఒకటి సేవించి వేడిపాలు త్రాగి అత్యంత ఆనందము కలుగును. ఒక డబ్బి రు. 1. 6 డబ్బీలు రు. 5. 12. డబ్బీలు రు. 9.

### రాజవైద్య నారాయణజీ కేశవజీ,

49, బందరువీధి, మద్రాసు.

### Deep Brown

5. 'అ' కషాయములో నానవేసినతరువాత 4 లో చెప్పినమాదిరిగా చేసినతరువాత మైలతుత్తు (Copper sulphate) వేసిన వేడినీటియందు కొంచెముసేపుంచి తీసిన యెడల దట్టమైన బ్రౌనురంగు వచ్చును. మిక్కిలిదట్టమైన రంగు కావలసినయెడల పైనచెప్పిన విధముగా రెండు మూడుపర్యాయములు తిరిగి చేయవలెను. ప్రతిమాటును మైలుతుత్తు, బైక్రొమేటు క్రొత్తగా నుపయోగించవలెను.

##### దట్టమైన కాకిరంగు

6. దట్టమైన కాకిరంగు (Fenic acetate) బైక్రొమేటు 'అ' కషాయమును నుపయోగించిన వచ్చును.

##### ఉపసంహారము

దీనిరంగుగుణమువల్ల తెలిసిన విషయ మేమన నూలు, పట్టు, ఉన్నిబట్టలకు నలుపురంగు సంతకంటె లేతరంగు (Ash)ను వేయుట కుపయోగించును. 4, 5 లో చెప్పినవిధముగా జేసినయెడల మంచి మేలైన బ్రౌను రంగు వచ్చును. ఇది నూలు, పట్టుబట్టలకు మిక్కిలి సొగసుగా వేయవచ్చును. లేతపసుపు పచ్చరంగును గూడ వేయుట కుపయోగించును. ఈరంగులు సూర్యకాంతివల్ల పోవు. ఉడికినరంగు బాగుగనిల్చును.

ఈరంగులకై పచ్చియాకులు, కొమ్మలునే కాక, ఎండబెట్టి చూర్ణము చేసి నిలవయుంచుకొనగును. పై రంగుల నింతకంటె సులువుగా వేయుమార్గమునకై కృషి సల్పుట పూర్తి గానందున నాసంగతులు వ్రాయజాలక పోతిని.

##### ii మామిడిచెట్టు

మామిడిచెట్టుయొక్క జన్మస్థానము మలయద్వీపములైయున్నను, సనాతనమునుండి మనదేశమందుండినటుల పూర్వగ్రంథములందు వ్రాయబడియున్నది. మహమ్మదీయులకాలమునను, పీష్వాలకాలమునను దీనికృషి బాగుగ వ్యాపించినటుల చరిత్రాధారములు గలవు. టోగ్లకుసాహేబు ఢిల్లీసింహాసనంబం దున్నపుడు(1325-1351 A. D.) టర్కోమన్ కవీశ్వరుడు అమీరురుకు పారశీకభాషలోనిటులువ్రాసెను."మామిడిచెట్టు ఫలారామములలో నగ్రగణ్యాతవహించుచున్నది. తక్కినజాతులలోపండుపండినపుడే నుపయోగించునుగాని మామిడిఫల మన్నియవస్థలయందుపయోగకారి.(Dymock K. Pharm 2nd 1. 382)." 3000 అడుగుల ఎత్తుగల స్థలములందును సమభూములందును పెంచుటకు వీలుగనున్నది. మామిడిచెట్టును, దానియొక్క చాలయుపయోగములును నందరకు తెలిసినవే యగుటచే నిక్కడ నంతగా చెప్పటగత్యములేదు.మామిడిచెట్టు భారతీయులకు శుభప్రదాయియై మిక్కిలి లాభకరమగు ఫలారామమై యున్నది. మామిడిగున్నలు కవీశ్వరుల హృదయము లాకర్షించియున్నవి.

ఇట్టి సకలోపకారియగు మామిడిచెట్టు రంగులకు కూడ నుపయోగించుటకు వీలుగానున్నది. దీనియాకులు, చెక్కలనుండి మంచిరంగు వచ్చుచున్నది. వీటినుండి వేడినీటితో యీరంగును దీయవచ్చును. దీని నుపయోగించుట కీక్రిందవిధముగా జేయవలెను. మొట్టమొదట గుడ్డను మైలతుత్తు వేడినీటియందువేసి దానియందు అరఘంటసేపు నాననిచ్చి తరువాత మామిడిచెక్క కషాయమునందు 15 నిమిషము లుండి తీసిన మంచి పసుపువర్ణము వచ్చును. ఈవిధముగా పట్టుబట్టలకు కూడ వేసిన మంచి సొగసైన రంగువచ్చును.

ఇప్పు డుత్తరహిందూస్థానములో దీనిని మరియొకలాగున తయారుచేయుచున్నారు. అది చాల విషాదకరమైనదిగా నున్నది. మామిడాకులను పశువులకు మేపెదరు. అట్లు మేపిన పశువుల ఉచ్చను జాగ్రత్తచేసెదరు. దానిలో నీపచ్చరంగు తేలుచున్నది. అదియే మనదేశమందువాడబడుచున్న పసపుపచ్చరంగు(Indian yellow). ఇట్లు మేసినపశువు లారునెలలు తిరుగకుండ మృతినొందుచున్నవి. నోరెరుగని పశువులను జంపియా మనశ్యంగారము? అట్లులేకుండ నతిసుళువుగా మీదచెప్పిన రీతిగా మనకు లభించుచున్నది. ఇది ఆకుపచ్చరంగును తయారుచేయుటకు గూడ నుపయోగించును.

ఇట్టి కృషియందు ముఖ్యముగ మనసోదరీమణులు శ్రద్ధవహించవలసియున్నది. మొగవారికంటె నాడువా

రికి శృంగారములయందు గడుబ్రీతి. అందుచేత శృంగారమునకును, ఆనందము చేకూర్చు వస్తువులను సమకూర్చుటయందు పరిశ్రమ సల్పుటకును వారుకడుసమర్థులు. అన్ని దేశముల పూర్వచారిత్రలందు నాడువారే మిక్కిలి శృంగారమైన పనులను చేయుటయందును, ఉద్యానకృషి మొదలైనవాటియందును పాల్గొనినట్లు నిదర్శనలుగలవు. కాళిదాసాదులచే వర్ణించినట్టి శాకుంతలవంటి స్త్రీ బృందముగాని కానరాదుగదా! ఇప్పటి నాగరికత కడు విచిత్రము. భారతదేశమందుగల ఫలారామములు, నందనోద్యానములు రూపుమాయుచున్నవి. అట్టిఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చు ప్రకృతివస్తువులను విసర్జించి నిర్జీవమైన వస్తువులు శృంగారస్థానము జొచ్చుచున్నవి. ప్రొఫెసరు కృష్ణప్పగారు చేయుచున్న శాస్త్ర పరిశోధనలవల్ల ఆ రామకృషియం దెంతటి నూతన పరిశోధనలైన చేయుటకు వీలుగలదని స్పష్టమగుచున్నది.

పాఠకమహాశయులంద రీవిషయములను గ్రహించి ఇట్టి సర్వోత్కృష్టములైన ఫలారామములను పెంచి వాటి లాభములను ప్రేమపూర్వకముగా బడయుదురు గాకయని కోరుచున్నాను.

## శ్రీ టెంకణాదిత్య కవన ప్రశంస

నిడుదవోలు వేంకటరమణ గారు, బి. ఏ.

మున్నెప్పుడో నన్నయ్యకు, మున్నుగఁబుట్టిన యపూర్వపుంగావ్యమటం
చెన్నఁగఁదెలిసితి; తదుపరి, నెన్నఁడు నది చూచుభాగ్య మేర్పడకుండెన్.

క. అంతట దైవికముగఁ బ్రత్యంతరము లభింప దాని నత్యాతురతన్
సంతసమునఁజదివితినే, సాంతముగా నూతనంపుఁ జవులెలయంగన్.

క. చదివినకొలందిహృదయము, ముదమునఁ దేలుకాడ కావ్యముఖ్యరసము నె
మ్మది నిముడకపొంగిపొరలఁ, గదియించితి నీవిధమున గైకొనుఁడార్యుల్!

ఉ. వన్నెలఁజిన్నెలం గమనవైఖరి, సద్రసపుష్టి నూహలన్
ప్రన్ననినీటుజానలరుపల్కుల, నవ్యకళాభిరామగా
మున్నె తెలుంగువాణిని అపూర్వముగా నొనరించినట్టి యా
నన్నియచోడదేవకవినాథుని పెంపు నుతింపఁ జెల్లదే!

క. రాజకవులఁ బ్రథముఁడు కవి, రాజులలో నగ్రగామి రమ్యాంధ్రవచో
రాజితకవనసమన్వితుఁ, డైజను శ్రీనన్నెచోడు నభినందితున్. (?)

ఉ. నన్నయనాఁడు శైశవమునం జరియించెఁ దెలుంగువాణి తి
క్కన్న మహాకవిప్రవరుకాలమునం గడుఁ బెద్దయయ్యెఁ బె
ద్దన్న మహాకవీంద్రుసమయంబునఁ బ్రోఢయటన్న మాటకున్
మన్నన లేల తావకసమంచితనూతన కావ్యసృష్టినిన్.

ఉ. కమ్మనిజానుదెన్గు నుడికారముసొంపు, మనోహరంపుభా
వమ్ములపెంపు, క్రొత్తలయిప్రౌఢిమ నించెడుకల్పనాళి, హృ
ద్యమ్మగువర్ణనాళియు, నుదారకథారచనాప్రశస్తి ని
త్యమ్మును తావకీనకవితాఘటి మన్నెలయింపనొల్లవే ?

ఉ. పుట్టినదాది కావ్యము సమూలముగాఁబఠియించి కాని, యే
పట్టుననైనఁ దీసి చదువందొరకొన్ననుగాని వీడఁగాఁ
బుట్టునె బుద్ధి యిట్టిది యపూర్వము; మున్ను తెలుంగు బాసలో
నిట్టియమోఘకావ్య ఘటనైకమహత్త్వముఁ గల్గు నేరికిఁ ?

చ. తెనుఁగుపదంబుపొందికకుఁ దిక్కనకంటెనునీవు, దివ్యని
స్వనమునుఁబోలు సత్కవితఁ బండితమల్లయ పాలకుర్కి సో
మనయునుఁ దొల్లి తెల్పి రసమానమహాంధ్రకవిత్వరీతులన్
ఘనులు విమర్శకాగ్రణులు గైకొనరేలొకొ? నేడు వారినిన్.

చ. చదువగ నింపునింపుటకుఁ జాలినశైలిని లేదటంచు నె
మ్మదినొకయూహసేయుచు విమర్శకులై తనరారువారె నీ
మృదుమధురోక్తిగుంభనల మెచ్చరు; దానసె యెప్పుడైన
నెయ్యదియునుఁగాదు నేడు వినుమా సుకవీంద్ర! రసజ్ఞశేఖరా !

ఉ. శ్రావ్యములైనకావ్యము లసంఖ్యముగారచియించి సద్యశో
దివ్యశరీరముల్ జగతిఁదేజరిలన్బొగడొందు తొంటి స
త్కావ్యులలోన పూజ్యపదగౌరవముం బరిపుల్లకీర్తి సం
భావ్యతఁదాల్పి దివ్యవిభవంబున వెల్గుము రాజశేఖరా !

క. నీకావ్యము శృంగారర, సాకరమై, సకలసత్కళాకరమై, మో
దాకరమై, లక్షణశో, భాకరమై వెలయుఁగాన నభినందింతున్.

క. లలితపదబంధురము ను, జ్జ్వలభావరసాభియుక్త పాండిత్యకళా
కలితంబౌనీకావ్యము, తలమానికమగుచు వెలయు ధరణీతలమునన్.

క. చెలువగుపలుకుల నలరుచు, సలలితభావములఁ గవనచాతురిమీఱన్
వెలయఁగఁ జెలఁగిన కబ్బము, పలుమారునుతింపఁదగదె పాండితిమీఱన్.

ఉ. జంగమమల్లికార్జునుని సత్కరుణామృత దోహదంబునన్
భంగముబొందకుండ కవనవ్రతతీఫలమై తెలుంగుబా
సం గయిసేయు నీవిమలషణ్ముఖజన్మకథా ప్రశంసఁ బె
ర్మింగొని చేయఁగావలదె శ్రీవిలసిల్ల సభాంతరంబులన్.

ఉ. జానుదెనుంగునన్ నవరసస్ఫురితమ్ముగఁ జిత్తపద్మ విం
పూనఁగఁజేయు సత్కవన యోగ్యతగల్గిన యట్టిసత్కళా
శ్రీనిధులైన శైవకవిశేఖరులం దొకరుండవౌటచే
నీనుతినస్నెహోడ! హావణించిన వేడుక నేనొర్చితిన్.

# అహింస

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

సనాతన ధర్మములన్నింటియందును నహింస యుత్తమోత్తమమైనదిగా పరిగణింపబడుచున్నది. పూర్వకాలమున భగవానుడు బుద్ధావతారమునెత్తినపు డీధర్మమునే స్థాపించి యున్నాడు. వర్తమానకాలమున నీధర్మమునే మరల మహాత్ముడు సుప్రతిష్ఠితము చేయుచున్నాడు. పురాణములయందును నితరధర్మనీతిగ్రంథములయందును నీధర్మమెక్కుడుగా ప్రశంసింపబడియున్నది. దీనిస్వరూపమును సరిగ జెప్పుటకాని, నిరూపించుటకాని యసాధ్యము. ఐనను "విబుధజనులవలన విన్నంత కన్నంత, తెలియవచ్చినంత తేటపరచు"టకే నాయీపూనిక.

హింసింపబడుట కేజీవియు నిష్టపడదు. ప్రతిజీవియు సుఖమునే పడయగోరుచున్నది. అహింసాధర్మముయొక్క ప్రాముఖ్యము యీసత్యముపైననే యాధారపడియున్నది. కాని ప్రతిజీవికినిగల యీసుఖేచ్ఛయే ప్రపంచమునందలి హింసకును దన్మూలముగా దుఃఖమునకును కారణమగుచుండుటయువింతగ తోపకమానదు. పరహింసారూపకముగాని సుఖము నేజీవియు జెందుటలేదు. ఇక పరహింసాభయమున స్వసుఖమును పరిత్యజించినచో హింస తనయందే కలుగుచున్నది. ఐనచో నహింసయనున దన్వయించుట యెట్లు? దానిస్థాన మెందున్నది? యని విచారించుటయే మనకు గావలసిన విషయము.

అహింసాధర్మమునుగూర్చి విచారించుటకుముందు ధర్మమన నేదియో హింసయన నెట్టిదియో యించుక విమర్శించి గ్రహించుట యావశ్యకముగ నున్నది.

## ధర్మము

ప్రపంచము నేదిధరించుచున్నదో, అనగా ప్రపంచవ్యాపారమున కేదియాధారభూతముగనుండి జగత్కల్యాణము గావింపనున్నదో యదియే ధర్మము. ఆధర్మపదార్థమే శాఖోపశాఖలుగ విస్తరిల్లి యనేకరూపములతో ననేకనామములతో విలసిల్లుచున్నది. అనేకములుగా వ్యక్తములైన ధర్మమూర్తులకన్నింటికి నదియే యాత్మస్వరూపము. ధర్మములన్నియు దానినాధారముగగైకొనియే వ్యాప్తిజెందితుదకందే లీనమైపోవుచున్నవి. ఒకేకేంద్రమునుజుట్టి గీయబడినవృత్తములవలె నీధర్మములు పోనుపోను వైరళ్యమును జెందినవియై మిగిలినధర్మముల గొన్నింటిని తమయం దిముడ్చుకొనుచున్నవి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, ఇత్యాది ధర్మములు దేశకాలవస్తుభేదములనుబట్టి మార్పుజెందుచుండును. ఇట్టివన్నియును మార్పులేని సనాతనధర్మములనే యాధారముచేసుకొని వృద్ధిజెందుచు వానియం దిమిడియుండును. సనాతనధర్మములకు వ్యతిరిక్తములై ప్రయుక్తములైనచో నవి వినాశమును జెందును.

## ధర్మసూక్ష్మత

అట్టిసనాతనధర్మములన్నింటియందును సత్యము, అహింస యనునవి రెండును మిగుల పొగడబడియున్నవి. మిగిలినధర్మములన్నింటిని యీరెండును, లోగొనియుండుటచే నారెండుధర్మములను నిర్వహించువాడు తక్కినవానినిగూడ నిర్వహించినవాడే యగుచున్నాడు. మరల నారెండింటియందును నహింస యగ్రగణ్యముగా జెప్పబడియున్నది. కారణమేమన నది సత్యమును తనయం దిముడ్చుకొనియున్నది. కనుకనే పరిస్థితులవైపరీత్యముచే నీయుభయధర్మములకును వైరుధ్యము సంఘటిల్లినట్లు తోచినప్పుడు అహింసకే ప్రాధాన్య మీయవలయునను ధర్మసూక్ష్మత జూపబడినది. సత్యమెప్పుడును సర్వభూతహితమైనదై యుండును. అదియే యహింసయొక్క స్వరూపమై యున్నది. కావున నీయుభయధర్మములకును వైరుధ్యము లేనేలేదు. అహింసావ్రతము నెవ్వడాచరించుచున్నాడో వాడితరములగు ధర్మముల నన్నింటిని యాచరించినవాడగుచున్నాడు. ఆర్యులధర్మసూక్ష్మనిరూపణము మహత్తరసత్యమును జూపుచున్నది. వారిధర్మములుగాని ధర్మసూక్ష్మములుగాని మానవజాతిని—ఒక్కమానవజాతిననేల—సమస్తవిశ్వమును, కల్యాణమునకే కొంపోవుచుండును:—

## అహింసా స్వరూపము

స్వసుఖమునపేక్షించిన నితరులకును, నితరులకు సుఖముగావింపబోయిన తనకును, హింస తప్పకున్నదను విషయము ముందే నిరూపించియుంటిని. ఇట్లు చూచినచో తనకు స్వపరభేదమెంతవరకునుండునో, అంతవరకును హింస జరుగుచునేయుండును. ఇక తన్నువిడిచి యన్యము లేక తనకుగావలసినది లేక యుండునట్టిస్థితియందే యహింసాస్వరూపము గోచరించుచున్నది. ఆస్థితి పరబ్రహ్మము, ఆనందస్వరూపము, సత్యస్వరూపము, యహింసాస్వరూపమునై యున్నది. సాధకు డాస్థితి నిబొందుటకే యహింసావ్రతము నాచరించుచున్నాడు. ఆస్థితియందే యీవ్రతము పరిసమాప్తిని జెందుచున్నది. ఆవ్రతమునందు మిగిలినవ్రతములన్నియు నిమిడియున్నవి. ఆవ్రతఫలము సిద్ధించినప్పుడు అన్నిఫలములును సిద్ధించును. కావుననే మహాభారతమున—

౧. "దంతియడుగులోన తక్కినజంతుచ
యంబు నడుగులెల్ల నడగియుండు

సత్యధర్మకోటులన్నియు లోనగు
నిర్గుణ యహింస కింత నిజము."

౨. "శ్రేయోత్తమధర్మములను నడివెలిగించుక"

౩. "అహింసశమదమములు హృదయమునకు నెప్పుడు
నలవడంగఁజేతురండ్రు బుధులు"

౪. "దానము ధర్మము తపము
జ్ఞానిష్ఠయనంగ గల్గుసత్క్రియలెల్లన్
మానవనాథ యహింసా
నూనాకృతులండ్రు శ్రుతుల నూనినపెద్దల్."

౫. "దానమున తపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచ మంత్ర తంత్రసత్యములును
బుధులహింసరూపములుగాఁగ జెప్పుట
నెల్లకలిమియమ్మహింసకలిమి."

నిత్యాదిపదములును, ప్రస్తుతము మహాత్మునిచే

Nonvoilence as perfect state it is a goal towards which all mankind moves naturally though unconscously

అహింసయనునదొక పరిపూర్ణమగుస్థితి. అదియొక గమ్యస్థానము. తనకు తెలియకుండగనే సమస్తమానవజాతియు నాగమ్యస్థానమునకై పునకు జరుగుచున్నది.

అని వ్రాయబడిన వాక్యరత్నములును నహింసాధర్మముయొక్క స్వరూపమును, సత్యమును విస్పష్టముగను నిరూపించుచున్నవి.

## సృష్టి- హింస

సృష్టి ఈశ్వరలీల. ఈశ్వరు డానందమయుడు. సృష్టియు నానందమయము గావలసియున్నది. కాని మానవదృష్టికి సృష్టియందు హింస గోచరించుచున్నది. ఆకారణముచే నాతడు యీశ్వరునియహింసాస్వరూపమును తనమ్ములమున నహింసాధర్మముయొక్క యావశ్యకతను గూర్చి శంకించుచున్నాడు. హింసాహింసలకు విపరీతములగునర్థములను కల్పించుచున్నాడు.

సృష్టిలో గనబడు హింసయని యనుకొనబడుదానియొక్క యాథార్థ్యము నిచ్చట కొంచెము విమర్శించవలసియున్నది.

సృష్టి యొక యానందలీలయని చెప్పుట విపరీతముగను సాహసముగను గన్పట్టుచున్నది. భూకంపములు, జలప్రళయములు, అగ్నిప్రమాదములు, ఉల్కాపాతములు, తుపానులు మున్నగునవన్నియు ప్రకృతికి భీకరరూపమును దెచ్చుచున్నవి. విశ్వమునంతను గందరగోళము చేయుచున్నవి. గగ్గోలుచేసి కలంచివైచుచున్నవి. జీవులనుబట్టి జీవులు మ్రింగుచున్నవి. ఇక మానవులచర్యలనుజూచితిమా చెప్పతరముకాకున్నది. ఈరీతిగా సృష్టి దుఃఖమయముగను, హింసాస్వరూపిణిగను గనబడుచున్నది.

ఇం దానందమేది ? అహింసాస్వరూప మెందున్నది ? ఇదియంతయు హింసకాదా ? కాకున్న నిక హింసయని దేనినందురు ? ఇత్యాదిప్రశ్నలు బయలువెడలుచుండును.

మానవదృష్టి వేరు. ఈశ్వరదృష్టి వేరు. సృష్టిలో మానవదృష్టికి గోచరించు హింస ఈశ్వరదృష్టిలో లేదు. మానవుడు తనయునికి నాధారముచేసికొనియే బాహ్యమును, సత్యమును, నని యనుకొనుదానిని విమర్శించుచుండును. పరహింసారూపకముగాని స్వసుఖమును స్వహింసారూపకముగాని పరసుఖమును నాతనికిగోచరించుటలేదు. ఆతని దృష్టి సాక్షికత్వమును వహించుచు ద్వంద్వములను జూచుచున్నది. సృష్టి యాతని కానందలీలగగాక సుఖదుఃఖమిశ్రితముగ నున్నది. కాని యీకష్టసుఖములు ఈశ్వరదృష్టియందు లేవు. ఆతనికిది కేవలము ఆనందమయము. ఇవన్నియు నాతనియందే జరుగుచున్నవి. మానవు డానందమును పొంది ఆరోగ్యవంతుడై యుండునప్పుడు ఆతనిశరీరమందు పనిచేయుచున్న యవయవములం దెన్నిజీవాణువులు లయమును జెందుచున్నవి ? తత్సంబంధమగు హింసను మానవు డనుభవించుటను జూడము.

## పరిణామము-హింస

ఉపాధులమూలమున ఈశ్వకపదార్థము వ్యక్తమగుచుండుటయే సృష్టియనబడుచున్నది. అది తనపరిపూర్ణతను వ్యక్తముచేసికొనుటకై యుపాధులనుండి, యుపాధులకు జరిగిపోవుచున్నది. ఉపాధులభేదమునుబట్టి యాపదార్థము భిన్నరీతులుగ వ్యక్తమగుచుండును. కొన్నికొన్నియుపాధులయం దాయనంతశక్తిమయమైనపదార్థమునందలి కొన్నిశక్తులు మాత్రమే బహిర్గతములై కొన్నియంతర్గతములుగ నుండును. మొత్తముమీద నన్నియుపాధులు నీశ్వరరూపములే; అన్నిసశక్తులే. కావుననే

"ఇందుఁగలఁడందు లేఁడని, సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందువెదకిచూచిన, నందందేకలఁడు దానవాగ్రణి! వించే"

యనియనుట. ఇట్టి యుపాధులనుగైకొనుచు, నొకదానినుండి యింకొకదానికిబోవునపుడు వెనుకటికంటె నెక్కువశక్తులను వ్యక్తముచేయుటకనువగువానిని గైకొనుచున్నది. పోనుపోను నాయాయుపాధు లుత్కృష్టములైన వగుచున్నవి. దీనికే సృష్టియందలిపరిణామమని పేర్కొనుచున్నారు. సృష్టిలో మానవునకు గోచరించుహింస యీపరిణామమునకు సంబంధించినదై యున్నది. అది హింసయని యనుకొనుటకు వలనుపడదు. అది ఈశ్వరేచ్ఛ. లోకకల్యాణమునకై యది జరిగిపోవుచున్నది. శిలలుమున్నగు ఖనిజపదార్థములు ఛిన్నములైపోయి, వానికన్న నుత్కృష్టోపాధులుకల వృక్షజాతుల కాహారముగ మారిపోవుటయు, నావృక్షములు జంతుసంతానమున కాహారమగుటయు నను నిత్యాదిసృష్టిలీలలీశ్వరప్రేరితములై లోకకల్యాణమును గావించువవియై యున్నవి. నికృష్టమైనదానిని బలిగాగైకొని యుత్కృష్టమైనది విజృంభించి వికసించుటయే యందలి రహస్యము. (Survival of the fittest). ఇది హింస కాదు. దీనినియజ్ఞమనియనెదరు. ఈన్యాయము ననుసరించియే మానవుని

యందును యజ్ఞము జరుగుచున్నది. అది పరహింసారూపకము గాదు. వానియందలి మానవత్వము వికసించుటకుగాను పశుత్వమును, దేవత్వము వికసించుటకుగాను, మానవత్వమును యజ్ఞము గావింపబడవలసియున్నది. ప్రాథమికదశయందు మానవుడు తనమానవత్వమును ప్రతిష్ఠించుకొనుటకే పశువిశసనమును గావించుచున్నాడు. ఇది స్వకీయమునకు గాక అన్యమునకుసంబంధించినది. (Not subjective but objective). మానవుడొనర్చు నరబలులు జంతుబలులు నీన్యాయమునకే విపరీతస్వరూపములుగ నున్నవి. ఇవి కామ్యకర్మలు. పైనజెప్పబడిన హింసారూపకముగ నోమచున్న యజ్ఞము మానవునియం దెట్టియాకృతిని దాల్చవలసియున్నదనుటయే ప్రశ్న

## యజ్ఞము

పూర్వోక్తమగు పరిణామక్రమము మానవునివద్దకు వచ్చుసరికి మార్పును జెందుచున్నది. ఆతనియొద్ద స్వతంత్రత కనుపించుచున్నది. ప్రకృతికతీతమై ప్రకృతిని వశపఱచుకొను నాత్మశక్తి యాతనియందు వికసించినది. కావుననే యంతవఱకును ప్రకృతిధర్మమై నిర్బంధముగ నుండిన యజ్ఞమాతని స్వేచ్ఛికవిషయమైపోయినది. అతనియందు నూతనముగ వికసించిన యాశక్తి యాతనిని స్వైరము యజ్ఞము చేయుటకు ప్రేరేపించుచున్నది. ఆయజ్ఞముయొక్క స్వరూపము వేరైపోయినది. ఆయజ్ఞనిర్వహణ మాతనికి ధర్మమైనది.

ఇదివరకు బ్రహ్మాండమున యజ్ఞము జరుగుచున్నది. బ్రహ్మాండమునకు సదృశమగు పిండాండమొకటి మానవునకు లభించినది. దాని కాతడునియంత. తాను గావించవలసిన యజ్ఞమందే జరుపవలసియున్నది. దానియందే కర్తయు, ఉపద్రష్టయు, ఋత్విక్కులు నున్నగువారు కలరు. ప్రారంభమున పశుత్వమును, పిమ్మట మానవత్వమును యజ్ఞపశువు లగుచున్నవి. మానవత్వ దేవత్వము లాయాయజ్ఞములకు వరుసగ ఫలములై యున్నవి. ఆ యజ్ఞములు నిర్వహింప బడినప్పుడే సరియగు పరిణామము మానవునియందు జరిగినదని తలంచవలెను. దీనినిబట్టిచూడగా మానవుడు చేయవలసినది స్వాత్మీయ (Subjective) మగు యజ్ఞమే కాని పరహింసా (Objective) రూపకమైనది కాదు. అదియే యుక్తము.

క. విను పశుయజ్ఞము హింసన, మనంతఫలదంబుకాదహింసకృతిసహితం
బనఘా! వాఙ్మనస నియమ,మునుత్యాగంబిమ్ము సన్యాసానందంబుల్.

అను మహాభారతమువందలి పద్యము నీసత్యమునే నిరూపించుచున్నది. స్వార్థత్యాగము(Self Sacrifice) దివ్యమైన యజ్ఞము. ఉభయతారకమైనది. అదిచేయువానికి నైతము హింసగలిగించుట లేదు. స్వార్థత్యాగి కట్టి త్యాగమే భోగముగ మారిపోవుచున్నది.

మనుజుడెవ్వడును స్వార్థపరుడై సంకుచితమగుదృష్టితో పరహింస గావించుట యీశ్వరసమ్మతముగాదు. మానవునియం దీశ్వరత్వము వికసించుటయే యాతనియందు జరుగవలసిన పరిణామమని తెలుపబడియున్నది. సంకుచితమగు నహంకార మాతనినుండి తొలగిననేకాని యీశ్వరత్వము వ్యక్తముగాదు. అంతవఱకును పరహింసారూపకమైన స్వసుఖమే యాతనిచే నభిలషింపబడును. ఆయహంకారము తొలగిన కొలదిని నాతనిశకత్వము గోచరించుచుండును. హింసయు తొలగిపోవుచుండును. అన్నింటియందును తనస్వరూపమును తనయందన్నింటి స్వరూపమును జూచును నాతనిదృష్టి ఈశ్వరదృష్టిగా మారిపోవును. 'ఆత్మవత్సర్వభూతాని' యనుసత్యము సార్థకమగును. ఇక నాపై హింస యనునది ఆతనిమూలమున జరుగుట కవకాశముండదు. అట్టి యద్వితీయస్థితి నాతనికి గలిగించుటకే వానిహృదయమున భూతదయ, సానుభూతి, మున్నగు దివ్యగుణము లంకురించి పనిచేయుచున్నవి. తదనుగుణముగ నాతడు వ్యవహరించవలసి యున్నది. అట్లుచేసెనా యహింసామార్గ మతనికి సుగమమగును.

సాధారణముగా మనుజుడాచరించు హింసలలో ననివార్యములు కొన్నియు నివార్యములుకొన్నియు గలవు.

చ. సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు కావునన్
గలుగు నవశ్యమున్ సకలకార్యములందును హింస, హింసకున్
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమైనటులుండు నింతయున్
దలఁపరు హింససేయమని తారు చరింతురు కొంద ఱిమ్మహిన్.

మ. హలికుండెంతయు నోజతో దున్నగ సీరాగ్రంబునం జొక్కి, ప్రాణులనేకంబులుసమ్మ; హింస యదియౌనో? కాదో? వేయేల, మర్త్యులు నేలం జరియించుచో పదములంద్రొక్కంబడున్ లెక్క, జంతులు హింసావిధి కాదనంగవశమే దోషజ్ఞ! యాహింప్రుమా?

ఈ పద్యములయందు చెప్పబడినదనివార్యమగుహింసయైయున్నది. మానవునకు హింసేచ్ఛ లేకుండనే నివి జరిగిపోవుచున్నవి. ఈ కర్మముయొక్క ఫలము లాతనికంటవు. ఆతడు బుద్ధిపూర్వకముగ జేయుహింసలనుండియే తొలగవలసియున్నది. అందతనికి స్వాతంత్ర్యముగలదు. ఐనను అహింసావిషయకమగు నాదర్శమునుమాత్రము మున్నతముగనే యుంచుకొనవలయును. ఎట్టి హింసయుగూడ దనమూలమున జరుగగూడదనునదియే యాదర్శము. సాధ్యమైనను గాకున్నను నదియట్లే యుంచవలెను. మానవునకు ప్రయత్నసాధ్యముగానిది లేదు. నివార్యములగునవి నివారించుచుపోయిన యనివార్యము లగువానినిగూడ క్రమక్రమముగ నివారణచేయుట సాధ్యమగుచుండును. బుద్ధిపూర్వకమును నధర్మమునైన హింసయే నిజముగుహింసయై యున్నది. అది మానుటకై ప్రయత్నము చేయుటయే సాధకుడు చేయవలసినపని. ఈ యత్నము గాఢమైనకొలదియు నహింసావ్రతమతనికి స్వభావమై పోవును. ఆతని దేహ మనోవృత్తులు సహజముగ నందుప్రవర్తించుచుండును. అప్రయత్నముగ హింసలకు దూరుడగుచు సిద్ధించును.

బుద్ధిపూర్వకములగు హింసలనుజేయుచు సాధారణముగా మానవులు కొన్ని విపరీతాభిప్రాయములను వెలిపుచ్చుచు, వానిని సమర్థించుకొనుటయు గలదు. అట్టి విపరీతములును విచిత్రములునైనయభిప్రాయములలో ముఖ్యములైనవాని గొన్నింటి నిచ్చట జేర్చి విమర్శించుట సందర్భోచితముగ నుండునని నాయూహ.

## కొన్ని విపరీతాభిప్రాయములు

(౧) ఈశ్వరుడే జంతువులకు జంతువుల నాహారముగ జేసియున్నాడు గనుక మానవుడు మాంసముదినుట దోషముకాదు.

ప్రకృతిలోనిట్టి సత్యముగలదు జీవులను జీవులు భక్షించుచుండుట నిజమే. ఆయాజంతువు లాయాజంతువులనే చంపి భక్షించుచున్నది గాని యన్యము దినవు. ఈశ్వరునిచే నిర్ణయింపబడిన యాహారము ప్రతిజాతిలోని జంతువునకును గలదు. ఆజాతిలోని జంతు వా యాహారమునే తినును కాని వేరువిధమగు నాహారమును దినదు. కాని యిట్టి యాహారనిర్ణయముకాని మరేనిర్ణయము గాని మానవునకై యీశ్వరునిచే జేయబడియున్నదా యనునదియే ప్రశ్న. మానవుడు కేవలము ప్రకృతి బద్ధమగు జంతువుకాదు. మాంసము దినినను గడ్డిదినడు. మాంసాహారము మానవున కీశ్వరునిచే నిర్ణయింపబడలేదు. కాని యతడు కొనవలసిన యాహారమును నిర్ణయించుకొనుశక్తిని భగవంతుడు ప్రసాదించి యున్నాడు. తత్సంబంధమగు బాధ్యతయు నాతనిపై కలదు. జంతుశాస్త్రజ్ఞులు సైతము మనుష్యుని దంతనిర్మాణమును జీర్ణకోశనిర్మాణమునుబట్టి యతనిని శాఖాహార జంతువులయందే చేర్చిరి. ఇది యట్లుండ మహాభారతమున మాంసాహార విసర్జనము విషయమై యెట్టినిషేధము గావింపబడియున్నదో యీక్రిందిపద్యముల వలన దెలియగలదు.

క. "తనునవమలినవానినమలు, నని మాంసము తెరగు జెప్పు నాగమములు

క. తపములు దానంబులు బ్రహ్మపురినివాసంబు, తప్పనరాదు జనా
ధిపమాంసమునవలని పుణ్యపురుషునకు సులభమందురా సెలవార్యుల్.

తే. వాజిమేధంబు కంటెను బూజమేధ
కర్మమందురు మాంసభక్షణము విడుపు
అన్యమాంసమున నిజాంగ మాంసంబు బో
షింతు ననుటకంటె ఱెట్టలేదు.
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలులేదు కర్మజాలకమున"

శ్రుతిచోదితములగు హింసలు యజ్ఞసమయములందును, శ్రాద్ధక్రియల యందును మాత్రమే కనబడుచున్నవి. అవియును సంస్కారమును బొందినవి. పిష్టపశువును యజ్ఞములయందును మినుములను శ్రాద్ధములయందును నుపయోగింపవలయునని చెప్పి యహింసాధర్మము నుద్ధరించియున్నారు. మహాభాగవతమున శ్రాద్ధక్రియలయందు సైతము నిషేధింపబడియున్నది.

"ధర్మతత్త్వవేదియైనవాడు శ్రాద్ధంబులయందు మాంసప్రధానంబు సేయక భక్షింపక చరింపవలయును"—భాగ. సప్త.

ఇక శాకాహారము గొనుటమాత్రము హింసారూపకము కాదా యనుప్రశ్న వచ్చును. నిజమే. కాదని యెవ్వరు ననరు. కాని యీశ్వరత్వ మెక్కుడుగ వ్యక్తమగుచున్న యుపాధికలిగిన జంతువును జంపుటకన్న నది తక్కువగ వ్యక్తమైన వృక్షముయొక్క యేఫలమునో పత్రమునో తీసికొనుట తక్కువహింసయై యున్నది. అందును నుచితానుచితములు కలవు. ఫలపత్రములనే గ్రహించవలసినచోటుల వృక్షములను నున్మూలించుట కేవలము హింసయు దోషమును నై యున్నది. కావున నావిషయమునను జాగరూకతతో మెలగ వలయును.

(౨) 'మునుతమచేసినకర్మం, బున నశియించుజీవ భూతంబులు చం
పినవాడు నిమిత్తమాత్ర మింతియె'

అను భారతపద్యము నాధారముగగైకొని కొందరు హింసల గావించుటయు, కావించినహింసలను సమర్థించుకొనుటయు జరుగుచున్నది. ఇందు సత్యము విస్పష్టముగ కనుపడుచునే యున్నది. హింసజేయుటకు దాను సంకల్పించకపోయినను తనమూలమున జరిగినహింసకే తాను నిమిత్తమాత్రుడై యున్నాడు, కాని తాను సంకల్పించి బుద్ధిపూర్వకముగ జేసిన హింసకు తాను ప్రధానకారణుడే యగును తత్కర్మఫలము ననుభవింప వలసియున్నాడు.

(౩) 'చంపెడువాడులేడు, చంపబడునదిలేదు' అను గీతావాక్యమును కొందరు విపరీతముగ నన్వయించుటయు గలదు. చావును, పుట్టుకయులేని యాత్మస్థితి తనకుగల్గినప్పుడు చెప్పవలసినదే కాని యీ మాట సామాన్యుడు చెప్పుట కధికారములేదు.

## అహింసావ్రతాచరణము

(౧) ఏహింసచేయుటవలన నుత్కృష్టమగుదానికి వృద్ధియు,నికృష్టమైన దానికి క్షయమును, సంభవించుచున్నదో యట్టిహింస యహింసయే యగుచున్నది.

(౨) ఏ యహింసవలన నుత్కృష్టమగుదానికి నాశనమును, నికృష్టమగు దానికి వికాసమును గలుగుచున్నదో యట్టియహింసయు హింసయే యగుచున్నది.

ఈ యుభయమునే యేకార్యములకైనను నన్వయింపవలసి యున్నది. ధర్మయుక్తములగు హింసల కన్నింటికిని యీ సూత్రములే యన్వయించుచున్నవి.

యుద్ధముచేయుమని ప్రబోధించునప్పుడును, ధర్మరాజును జంప నంకించునప్పుడును, కర్తవ్య ముపదేశించునప్పుడును నర్జునునకు శ్రీకృష్ణుండు దెలియజెప్పిన దీధర్మసారమునే. వేటాడుటకు మాంససంపాదనము లక్ష్యముగాదు. యుద్ధముచేయుటకు పరరాజ్యాక్రమణమును పరహింసయు నుద్దేశ్యములుకావు. అట్లు కాగూడదు. వేటవిషయమున మహాభారతమున

"కుతూహలంబు కోపంబువనివొడి భావంబుల బోరయక లోక
రక్షణార్థంబుగాఁ గ్రూరమృగవధంబును" అని యున్నది.

ఇట్లే యుద్ధమునకు అపరాధుల శిక్షించుటకు విషజంతు సంహారమునకు మున్నగువానికిగల భావములు గ్రహించవలసియున్నది. ఇట్లైనచో నహంకారములేదు. అవి యీశ్వరప్రేరితములై జరిగిపోవు చుండును. మొత్తముమీద నివియన్నియు ప్రేమమీదనే యాధారపడి జరుగుచుండవలెను. దాని నుద్ధరించుటకై చేయబడినప్పుడు ఆయాకృత్యములు హింసలుగ కనబడియు హింసలుకావు. అవి జరుగకున్న లోకనాశనము సంభవించును. ప్రేమపై నాధారపడియుండకపోయినను నట్లే జరుగును. అప్పుడవి రాక్షసకృత్యములుగ పరిగణింపబడును.

## మానవుని నిత్యవ్యవహారము

'అపకారికి నపకారము చేయుటయే మానవజాతి లక్షణమనియను కొనుట పొరపాటు. అది యజ్ఞానమే కాక పొగరుబోతు తనముకూడనై యున్నది. ఏవిధమగు దురుద్దేశమును లేక యపరాధరాహిత్య మాతని యందు మూర్తీభవించినపుడే సరియైన మానవుడగుచున్నాడు. ఇప్పు డాతడు సగము మృగముగను, సగము నరుడుగను నున్నాడు. అనిమహాత్ముడు వ్రాసినదానియందు మహత్తరమైన సత్యముగలదు'

'అపకారికి నపకారము చేయుమనువిధి యేమతగ్రంథములందును లేదు. కాని పాపరాధకునియెడల మనయందుబుట్టు చిత్తవికారమును మాత్రము మనము నిగ్రహించుకొనవలయునను విధిమాత్ర మన్నిటియందును కలదు. అనియు నామహానీయుడు తెలిపియున్నాడు.

ఈవ్రతము నాచరించుపట్ల సాధకునకు మహాభారతములోని

'ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.'

అనుపద్యముయొక్క భావము మార్గదర్శకమై యున్నది.

అహింసావ్రతము దివ్యమైన వ్రతము. ఇది హృదయప్రేరణకు సంబంధించినది కాని బుద్ధియొక్క తర్కమునకు సంబంధించినది కాదు. హృదయమే యీశ్వరునకు స్థానము. సాధనమునునై యున్నది. ఈవ్రతమునకు కారణము ప్రేమ, కార్యము, అహింస, ఫలము ఆనందమును నై యున్నది. దివ్యమగు హృదయప్రేరణయే దీనికి పౌరోహిత్యమును వహించుచున్నది. ఇది యన్నింటిని బవిత్రముచేసి దివ్యములైన వానిగ మార్చును. కలియుగమును సత్యయుగముగా జేయుశక్తి దీనికి గలదు. దీనికొక కాలనియమము లేదు. కార్యనియమము లేదు; స్థలనియమమును లేదు; సాంఘిక, రాజకీయ, ఆర్థికవిభాగము లిందు భేదమును కలిగింప జాలవు. సర్వకాల సర్వావస్థలయందును సర్వమానవులు నిది నిత్యవ్యవహారమున నాచరించుచుండవలెను.

"ఒక్కరొక్కరు తమ తమ రొరాపినటుల
హింసతెరువున కెగ్గి యేగవలయు
నదియనూనె యహింస నావతికయిల్లు."

అను దానిభావమును గ్రహించి నడచుచుండ యహింసామార్గము క్రమక్రమముగ సుగమమై గమ్యస్థానమును జేరబోవునప్పటి కా గమ్యస్థానమే తానగుచున్నాడు. తొందరపడవలసిన యవసరము లేదు. తొట్రుపాటుకూడదు. చేరవలసి బోవుచున్న కొలదిని గమ్యస్థానవం దూరమునకు బోవుచుండును. కాని నిస్పృహ చెందవలసినపని లేదు. మనకు విజయము మనముకావించుయత్నమునందే కలదు. సంపూర్ణప్రయత్నమే సంపూర్ణవిజయమని మహాత్ముడు చెప్పినవాక్యముయొక్క భావము సత్యపారమై యున్నది. ఈవ్రతము నాచరించి ప్రతిమానవుడును ఫలమును బడయవలెనని కోరుచున్నాను.

# విజయనగరసామ్రాజ్యపతనము

కానూరి వీరభద్రేశ్వరరావుగారు, బి. ఏ., యల్. టి.

శాతవాహనవంశజలధిరత్నంబవై
జగమెల్ల నుతియింప జననమొంది
త్రిభువనాంకుశులైన ధీరచాళుక్యుల
గారాబుబిడ్డవై కరము పెరిగి
ఖడ్గఖేలనులైన కాకతీయులయొద్ద,
వీరవిద్యాశిక్ష వేడ్కఁ గఱచి
కీర్తికెక్కినయట్టి కృష్ణరాయాదిన
రపతులపట్టంపురాణి వగుచు
యుద్ధభూముల విహరించి యుర్వినేలి
అతులితైశ్వర్యభోగంబు లనుభవించి
తుట్టతుద కిట్లు తలికోటఁ దొఱఁగితీవు
మాకుదిక్కెవ్వ రాంధ్రసామ్రాజ్యలక్ష్మి!

సీ. దక్షిణంబున మ్లేచ్ఛతండంబు నదలింప,
హరిహరుం డుదయమై మెరయునాఁడు
నలుదిశల్ జృంభించి నరసరాయవిభుండు,
బాలార్కతేజంబుఁ బరపునాఁడు
గిరిదుర్గముల గెల్చి కృష్ణరాయనృపుండు,
మధ్యాహ్నసూర్యుఁడై మండునాఁడు
రాజుల నోడించి రామరాయనిశౌర్య
వైభవారుణకాంతి వఱలునాఁడు
నిన్ను విడకుండ నీతోడునీడ యగుచు
వెంటనున్న యదృష్ట మేమంటఁ గలసె?
విరలు విజయనగరరాజ భాస్కరుండ
అస్తమించితె ఇంతలో నవుర యిటులు.

ఓవిజయనగరపురవతంసమా!

సీ. సర్వనాశకులైన చంద్రధ్వజులబారిఁ
బడకుండ నెవ్వారు పాపఁగలరు
దయ లేశమును లేని దారిదోపిడికాండ్ర
వడ్డిరక్షించెడి యధిపు లెవరు
గర్వశత్రువులైన గజపతీశులదాడి
మరలింపఁగల్గు సామంతు లెవరు
ఎఱుకల దేవాది హీనజాతులు నీయాతి
దోచున నెవ్వారు గాచువారు
కాల్చి మార్చించి నిను నేలఁ గలుపకుండ
పేరుఁగన్నులఁగాచెడి వీరులెవరు
రెక్కలూడిన పక్షివై దిక్కుమాలి
నడఁకు నీయార్తరవ మెవ్వ రడుగువారు?

# బ్రహ్మదేవుని వయఃపరిమాణము

మన్నవ వెంకటకృష్ణ శర్మగారు

కర్మభూమియగు ఈభరతఖండముయొక్క మహిమ ఇతరఖండములకు విలక్షణమయి యున్నది. ఖండాంతరములందు ప్రయత్నించినను పొందఁజాలని సౌకర్యములన్నియు మనభరతఖండమునందు పరమేశ్వరుఁడే దయాళువై మనకు సమకూర్చియున్నాఁడు. జన్మాంతరములయందెంతయోపుణ్యమాచరించినగాని మనుష్యుఁడు ఈభరతఖండమున జన్మింపలేఁడనియు, దేవతలుసైతము భరతఖండమునందు తాము జన్మించి శ్రౌతస్మార్తక్రియాకలాపముల నాచరించి చిత్తశుద్ధిగలవారలయి బ్రహ్మానందము ననుభవింప నభిలషించుచున్నారనియు పురాణములన్నియు నేకగ్రీవముగ పలుకుచున్నవి.

ఇట్టికర్మభూమియందు జన్మించునట్టి అదృష్టము కలిగినందులకు మనమందఱము సంతసించవలయును.

అతీంద్రియద్రష్టలును, పరమాత్మయొక్క అంశావతారులును అగు మహర్షులు లోకోపకారార్థము నిరంతరతపశ్శీలతచేత తాము కనుఁగొనిన యాథార్థ్యమును లోకమునకువెల్లడించి ఎంతయో లోకకల్యాణమునాచరించిరి. అట్టిమహర్షులు లోకమునకు తెలిపిన సృష్టివిషయకకాలాదినిర్ణయమునుగూర్చి యొకింత యీక్రింద వ్రాయుచున్నాఁడను:—

నిమేష, ఘటికా యామాదిపరిచ్ఛేదములచేత నొప్పుచు సాధారణముగ కొంచెముహెచ్చుతగ్గుగ పగలు ౩౦ ఘటికలు, రాత్రి ౩౦ ఘటికలనియు వ్యవహరింపఁబడుచున్న కాలమును "అహోరాత్ర"మని మనము వ్యవహరించుచున్నారము. ఇట్టియహోరాత్రములు, ౩౦ యయినయెడల, ఒకమాసము. ఇట్టిమాసములు ౧౨ అయినయెడల ఒకసంవత్సర మగును.

మనుష్యమానమునం దొకమాసము, పితరులకు ఒకదినమగుచున్నది. అందు శుక్లపక్షము పగలనియు, కృష్ణపక్షము రాత్రియనియు వ్యవహరింపఁబడును.

మనుష్యమానమునం దొకసంవత్సరము దేవతలకు ఒకయహోరాత్రము. అందు ఉత్తరాయణము దేవతలకు పగలుగను, దక్షిణాయనము రాత్రిగను వ్యవహారము. మనుష్యమానముచేత ౧౦౦౦ (వేయి) మహాయుగములకాలమగు నెడల బ్రహ్మదేవునకు ఒకపగలగుచున్నది.

ఆద్యంతములేని కాలప్రమాణమునందు వ్యవహారార్థము త్రుటి, లవ, నిమేషాదిపరిచ్ఛేదములను మనము కల్పించుకొని వ్యవహరించుకొనుచున్నారము. కావున అట్లే బ్రహ్మదేవునియొక్క ఒక్కపగలుకు వేయిమహాయుగములు కాలమగుటచేత తత్ప్రమాణముననుసరించి బ్రహ్మదేవునియొక్క త్రుటి, లవ నిమేషాది కాలవిశేషమునకు మనమనుష్యమానమునం దెంతకాలము అగుచున్నదో దానిని పత్రికాపాఠకుల కుత్సాహార్థ మీక్రిందక్రమముగ వ్రాయుచున్నాఁడను:—

మనుష్యమానముచేత బ్రహ్మదేవునియొక్క కాలపరిమాణముయొక్క వివరము నిచట వ్రాయుచున్నాడను:—

౧. త్రుటికాలము:—త్రుటియనఁగా లఘ్వక్షరము నుచ్చరించుకాలములో నాల్గవవంతుకాలము. లేకవాడిగలసూదిమొనతో తామరపుష్పముయొక్క దళమును గ్రుచ్చినయెడల ఆసూదిమొన ఆదళమున దిగుటకు పట్టునట్టి కాలము. బ్రహ్మదేవునియొక్క ఈకాలమునకు మన మనుష్యమానమునందు సంవ ౨ మాస ౧౧దిన ౧౬ గడి ౩౯ విగ ౩౬.

౨. లవము:— ౧౦౦ త్రుటికాలములు ౧ లవకాలము. ఆలవకాలప్రమాణమునకు మనుష్యమానమున సం ౨౯౬ మాస ౩ దిన ౧౬.

(ఈలవకాలమునకే 'పరాపర' మని నామాంతరము గలదు.)

౩. నిమేషము:— ౩౦ లవములు ౧ నిమేషము. ఈనిమేషకాలప్రమాణమునకు మనుష్యమానమున సం ౮౮౮౮ మాస ౧౦ దిన ౨౦.

౪. కాష్ఠ:— ౧౮ నిమేషములు ఒకకాష్ఠయగును. ఈకాష్ఠాకాలప్రమాణమునకు మనుష్యమానమున సం ౧౬౦౦౦౦ (లక్షాఅరువదివేల సంవత్సరములగును.)

౫. కల:— ౩౦ కాష్ఠలు ఒక కలయగును. ఈ కలాకాల ప్రమాణమునకు మనుష్య మానమున సం ౪౮౦౦౦౦౦(నలువదిఎనిమిదిలక్షలసంవత్సరములగును.)

మఱొకవిధమగు పరిగణనము

గుర్వక్షరోచ్చారణకాలము:— గుర్వక్షరోచ్చారణకాలమునకు మనుష్యమానమునందు నలుబదివేల సంవత్సరములు.

ప్రాణము:—౧౦ గుర్వక్షముల నుచ్చరించు కాలము. మనుష్యమానమునందు సంవ ౪౦౦౦౦౦. (నాల్గులక్షలసంవత్సరములు.)

వినాడి:—౬ ప్రాణములకాలము వినాడి. మనుష్య మానమునందు సంవ ౨౪౦౦౦౦౦ (ఇరువదినాల్గు లక్షల సంవత్సరములు.)

౬. ఘటిక:—౩౦ కలలుగాని లేక ౬౦ వినాడులు కాని ఘటికయగును. మనుష్యమానమునందు సంవ ౧౪౪౦౦౦౦౦౦ (పదునాలుగుకోట్ల నలుబదిలక్షల సంవత్సరములు).

౭. అహస్సు:—౩౦ ఘటికలు ఒకఅహస్సగును; అనగాపగలు. మనుష్యమానమునందు సంవ ౪౩౨౦౦౦౦౦౦౦ (నన్నూటముప్పదిరెండుకోట్లసంవత్సరములు).

౮. అహోరాత్రము:—రాత్రియు పగలునుచేరిన అహోరాత్రమగును. మనుష్యమానమునందు సంవ. ౮౬౪౦౦౦౦౦౦౦ (ఎనిమిదివందల అరువదినాల్గుకోట్ల సంవత్సరములు). మన నన్నూట ముప్పదిరెండుకోట్ల సంవత్సరములు బ్రహ్మదేవునకు ఒకపగలు, కనుక ఇంతకాలము ఈసృష్టి నిలిచియుండును. ఇంతకాలపరిమాణము రాత్రియగును, సృష్టిలేక ప్రళయముగ నుండును. బ్రహ్మదేవునియొక్క ఈయొక అహోరాత్రమునే కల్పమని చెప్పుదురు.

౯. మాసము:—౩౦ అహోరాత్రములు ఒక మాసమగును. మనుష్య మానమునందు సంవ. ౨౫౯౨౦౦౦౦౦౦౦౦ (ఇరువదిఅయిదు అర్బుదములు, తొమ్మిదినూరుల ఇరువదికోట్లసంవత్సరములు.)

౧౦. ఋతువు:— రెండుమాసములు ఒకఋతువగును. మనుష్యమానమున సం ౫౧౮౪౦౦౦౦౦౦౦౦ (ఏబదియొకఅర్బుదములును, ఎనిమిదినూర్ల నలుబది కోట్ల సంవత్సరములు).

౧౧. అయనము:—మూడుఋతువులుఒకఅయనమగును.మనుష్యమానమునసం.౧౫౫౫౨౦౦౦౦౦౦౦౦ (నూటఏబది అర్బుదములు, నూటఏబదిరెండుకోట్ల సంవత్సరములు).

౧౨. సంవత్సరము:—రెండుఅయనములు ఒక సంవత్సరమగును. మనుష్యమానమున సంవ ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦. (మున్నూటపదు నొకండుఅర్బుదములు, నలుబదికోట్ల సంవత్సరములు)

౧౩. బ్రహ్మదేవునిపరమాయువు. అతనిసంవత్సరములచేత ౧౦౦సంవత్సరములు. మనుష్యమానమందు, సం. ౩౧౧౪౦౦౦౦౦౦౦౦౦౦౦ మూడుపద్మములు ఒక మహాఖర్వము ఒకఖర్వము నాలుగుఅర్బుదాల సంవత్సరములు).

వర్తమానకాలమునందు సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు ఇప్పటిజన్మము ౭ వదియగుచున్నది. ఈయేడవజన్మమునందు ఇతఁడు భగవంతుఁడగు శ్రీమహావిష్ణువుయొక్క నాభిపద్మమునందుజన్మించుటచేత వర్తమానకాల సృష్టికర్తయగు నీబ్రహ్మదేవునకు పద్మజుఁడని నామము. ఇంతకుముందు ౧ మానసము, ౨ చాక్షుషము, ౩ వాచికము, ౪ శ్రావణము, ౫ నాసత్యము, ౬ అణ్డజము, అను ౬ జన్మములు ఇతనికిగతించినవి.

పద్మజుఁడనునామముగలసృష్టికర్తయగు నీబ్రహ్మదేవునియొక్క సంపూర్ణాయుస్సుఅగు ౧౦౦ సం. లలో ప్రథమార్థమగు ౫౦ సం.ఆయుష్కాలము ఇంతవఱకు గతించినది. దీనినే పరార్థమందురు.

దీనికి మనుష్యమానమునందు. సంవ. ౧౫౫౫౨ ౧౯౨౧౯౭౨౯౪౯౦౨౬. (ఒకపద్మము, ౫ అయిదు మహాఖర్వములు, అయిదుఖర్వములు, అయిదున్యర్బుదములు, రెండుఅర్బుదములు నూటతొంబది యేడుకోట్ల, యిరువదితొమ్మిదిలక్షలును, నలుబదితొమ్మిదివేల యిరువదియారుసంవత్సరములు). బ్రహ్మదేవునియొక్క అహోరాత్రమునకు కల్పమనునామమని ఇదివరకు సూచించియుయున్నాఁడను. ఇదియే సృష్ట్యాది యనబడుచున్నది. ౩౦ అహోరాత్రములు గలసి మాసమగును. కనుక ఒక్కొక యహోరాత్రమునకు ఒక్కొకనామము చొప్పున ౩౦ కల్పముల నామముల నిట పేర్కొనుచున్నాఁడను:—
౧. (శ్వేత) వరాహకల్పము, ౨. నీలలోహితము (కల్పమని అంతట గ్రహించునది), ౩. వామదేవ, ౪. రాథంతర, ౫. రౌరవ, ౬. దేవ, ౭. బృహత్, ౮. కందర్ప, ౯. సద్యస్, ౧౦. ఈశాన, ౧౧. తమస్, ౧౨. సారస్వత, ౧౩. ఉదాన, ౧౪. గారుడ, ౧౫. కౌర్మ, ౧౬. నారసింహ, ౧౭. సమాన, ౧౮. ఆగ్నేయ, ౧౯. సోమ, ౨౦. మానవ, ౨౧. తత్పురుష, ౨౨. వైకుంఠ, ౨౩. లక్ష్మి, ౨౪. సావిత్రి, ౨౫. ఘోర, ౨౬. వరాహ, ౨౭. వైరాజ, ౨౮. గౌరి, ౨౯. మాహేశ్వర, ౩౦. పితృ (కల్పములు) అని ముప్పది కల్పములు.

పగటికి శ్వేతవరాహకల్పమనియు, రాత్రికి శ్వేతవరాహ ప్రళయమనియు నామమగును. ఇట్లే మరునాఁడు నీలలోహిత కల్పమనియు, నీలలోహిత ప్రళయమనియు క్రమముగ ౩౦ కల్పములకు గ్రహించునది. బ్రహ్మదేవునియొక్క ప్రతికల్పమునందు ౧౪ మనువులును, ౧౪ ఇంద్రులును అధికారమును వహించెదరు.

సృష్టికర్తయగు పద్మజబ్రహ్మదేవునియొక్క ౫౧ వ సంవత్సరముయొక్క ప్రథమమాస ప్రథమతిథియగు ఈశ్వేతవరాహకల్పమునందు, వర్తమాన ఈకలియుగమునందు, ౮౪ వ పర్యాయమునందు వచ్చిన ఈక్రోధననామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమివఱకు బ్రహ్మదేవునకు గతించిన కాలమునుగూర్చి వివరించెదను:—

బ్రహ్మదేవునకు ౫౦ సం. గతించినవనియు, ౫౧ వ సం. యొక్క మొదటిమాసముయొక్క మొదటిదినము ప్రారంభించినదనియు, ఈప్రారంభదివసమును శ్వేతవరాహకల్ప మందురనియు ఇదివఱకు సూచించితిని. ఆమొదటి రోజునందు ఇంతవఱకు, ౧౩ ఘటికలు, ౨౧ కలలు, ౧౬ నిమేషములు, ౨౨ లవములు, ౯౬ త్రుటులు, ప్రకారాంతముగ ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు, ౩ గుర్వక్షరోచ్చారణ కాలములు గతించినవి.

బ్రహ్మదేవునకు ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు, ౧౬ నిమేషములు, ౧౬ లవములు, ౯౬ త్రుటులు గతించి ౯౭ వ త్రుటికాలమగుచున్నది. ౯౭ వ త్రుటికాలమునందు మనచైత్ర శు ౧ ఉగాదిపండుగనాఁటికి (25-3-25) దాదాపు మనుష్యమానమురీతిగ సం. ౨. మా. ౨. దిన ౪౨ గతించినవి.

ఏష్యము. దాదాపు సం. ౦. మా. ౯. ది. ౧౨. కల్పాదినుండి నేటివఱకుగతించిన సంవత్సరములు (అనగా మనవేదశాస్త్రముల ననుసరించి సృష్టిప్రారంభ మయిన కాలమునుండి నేటివఱకు గతించిన సంవత్సరములు)మనుష్యమానము చేత సంవ. ౧౯౭౨౯౪౯౦౨౬, (అనగా నూటతొంబదియేడుకోట్లు, ఇరువదితొమ్మిదిలక్షలు, నలుబదితొమ్మిదివేలు, ఇరువదియారు సంవత్సరములు.)

ఈకల్పమునందు నియమితులగు ౧౪ ఇంద్రులు, ౧౪ మనువులలో స్వర్గలోకమునందు, ౬ ఇంద్రులును, భూలోకమునందు ౬ మనువులును, గతించిరి.

గతించిన ఇంద్రులనామములు:—౧. విశ్వభుక్, ౨. విపశ్చిత్, ౩. సుశాన్తి, ౪. శిబి, ౫. విభు, ౬. మనోజవ.

వర్తమానుఁడగు ౭ వ ఇంద్రునినామము పురందరుఁడు.

గతించిన ౬ మనువులు:— ౧. స్వాయంభువ, ౨. స్వారోచిష, ౩. ఉత్తమ, ౪. తామస, ౫. రైవత, ౬. చాక్షుష. **వర్తమానుఁడగు ౭ మన్వంతరాధిపతి వైవస్వతుఁడు.**

ఒక్కొక ఇంద్రుఁడును, మన్వంతరాధిపతియు, ౭౧ మహాయుగముల కాలము అధికారమును వహించెదరు.

మహాయుగ మనగా:—సం. ౪౩౨౦౦౦౦, అందులో, కృతయుగము సం. ౧౭౨౮౦౦౦, త్రేతాయుగము సం. ౧౨౯౬౦౦౦, ద్వాపరయుగము సం. ౮౬౪౦౦౦ కలియుగము సం. ౪౩౨౦౦౦.

ఈనాల్గుయుగముల ప్రమాణమగు ౪౩౨౦౦౦౦ సం. చేరిన ఒకమహాయుగ మగును.

ఈ ౭ వదియగు వైవస్వతమన్వంతరము నందు గల ౭౧ మహాయుగములలో ౨౭ మహాయుగములు గతించినవి. ౨౮ వ మహాయుగము జరుగుచున్నది. ఈ ౨౮ వ మహాయుగమునందు కృత, త్రేతా, ద్వాపర యుగములు గతించినవి. కలియుగ ప్రమాణమగు ౪౩౨౦౦౦ సం. ములలో ప్రథమ పాదముయొక్క ౧౦౮౦౦౦ లలో ఇప్పటికి గతించినవి. ౫౦౨౬ అయిదు వేల ఇరువదియారు సంవత్సరములు. ప్రతిమహాయుగము నందున్నూ శ్రీమహావిష్ణువు వేదవ్యాసరూపమున అవతరించి వేదములను లోకమునందు వ్యాపింపఁ జేయుచున్నాఁడు. ఇంద్రత్వ, మన్వంతరాధి పతిత్వములవలె వేదవ్యాసత్వమున్నూ అధికారికపదవి. ఇదివఱకు ౨౭ మహాయుగములు గడచినవి. కావున ౨౭ వేదవ్యాసులు గతించిరి. వారినామముల నిట తెలుపుచున్నాఁడను:—

౧. స్వాయంభువుఁడు, ౨. ప్రజాపతి, 3. ఉశనసుఁడు, ౪. బృహస్పతి, ౫. సవిత, ౬. మృత్యువు, ౭. ఇంద్రుఁడు, ౮. వసిష్ఠుఁడు, ౯. సారస్వతుఁడు, ౧౦. త్రిధాముఁడు, ౧౧. త్రివృషుఁడు, ౧౨. భరద్వాజుఁడు, ౧౩. అంతరిక్షుఁడు, ౧౪. ధర్ముఁడు, ౧౫. త్రయ్యారుణి, ౧౬. ధనంజయుఁడు, ౧౭. కృతంజయుఁడు, ౧౮. సంజయుఁడు, ౧౯. భరద్వాజుఁడు, ౨౦. గౌతముఁడు, ౨౧. ఉత్తముఁడు (హర్యాత్ముఁడు), ౨౨. వేనుఁడు, (వాజశ్రవసుఁడు) ౨౩. సోమశుష్మాయణుఁడు, (తృణబిందువు) ౨౪. ఋక్షుఁడు, (వాల్మీకి) ౨౫. శక్తి, ౨౬. పరాశరుఁడు, ౨౭. జాతూకర్ణి యను ౨౭ వేదవ్యాసులు గత ౨౭ మహాయుగములందు వేదములను లోకమునందు శిష్యప్రశిష్యులకు బోధించి వ్యాపింపఁజేసిరి. ఈ ౨౮ వ మహాయుగమునందు వచ్చిన ద్వాపర యుగాంతమునందు కృష్ణద్వైపాయనుఁడను వేదవ్యాసుఁడు శిష్యప్రశిష్యమూలముగ లోకమునందు వేదవిద్యను వ్యాపింపఁ జేసెను. రాబోవు ౨౯ వ మహాయుగమునందు గల ద్వాపర యుగాంతమునందు "అశ్వత్థామ" వేదవ్యాసుఁడు కాగలఁడు. ఈమహాయుగములు స్వాయంభువ మహాయుగము, ప్రజాపతి మహాయుగము, ఉశనామహాయుగము అని ఆయా మహాయుగ వేదవ్యాసనామములతో వ్యవహరింపఁబడును. వర్తమానమగు ఈ ౨౮ వ మహాయుగమునకు కృష్ణద్వైపాయన మహాయుగమని నామము. లేక ప్రథమ మహాయుగము, ద్వితీయ మహాయుగము అని సంఖ్యాపూర్వకముగఁగాని వ్యవహరింపఁ బడును.

౨౮ మహాయుగాంతమున జరుగుచున్న ఈకలియుగమునందు ౬ శకపురుషులు గలరు.

| | |
|---|---|
| ౧. యుధిష్ఠిరశకము సంవత్సరములు | 3౦౪౪ |
| ౨. విక్రమార్కశకము సం॥ (ఈశకముమాత్రముఉత్తరదేశమునందే వ్యవహరింపఁ బడుచున్నది.) | ౧3౫ |
| 3. శాలివాహనశకము సం. | ౧౮౦౦౦ |
| ౪. విజయాభినందనశకము సం. | ౧౦౦౦౦ |
| ౫. నాగార్జునశకము సం. | ౪౦౦౦౦౦ |
| ౬. కలికిశకము సం. | ౮౨౧ |

---

౬ శకముల సంవత్సరములుచేరి మొత్తము ౪౩౨౦౦౦

ఈ సౌరసంవత్సరములు కలియుగప్రమాణము. కలియుగమునకు నిర్ణీతులగు శకపురుషులు ౬ గురిలో మొదటిముగ్గురు (అనఁగా యుధిష్ఠిర, విక్రమార్క, శాలివాహను)లను శకత్రయ పురుషులు గతించిరి. ఈకలియుగమునందు కలియుగాదినుండి నేఁటివరకు గతించిన సంవత్సరములు ౫౦౨౬. కలియుగమునందు సం. ౨౧౧౭౯ వఱకు ఈశాలివాహనశకము వ్యవహరింపఁ బడును. (అనగా

యింకను ౧౬౧౫౩ సంవత్సరములవఱకు) శాలివాహన శకమే వ్యవహరింపఁబడును. తరువాత క్రమముగ విజయాభినందన, నాగార్జున, కలికి శకములు వ్యవహారమునకు రాఁగలవు.

ఈవ్యాసము వ్రాయుటకు నాకు మత్స్య, లింగ, విష్ణు, మార్కండేయ పురాణములును, సూర్యసిద్ధాంతము చాల తోడ్పడినవి. మఱియు శ్రీయుత విక్రాల రామచంద్రాచార్యులవారి పంచాంగము, మఱికొన్ని గ్రంథములును తోడ్పడినవి. దీనివిషయమయి తెలుపవలసిన సూక్ష్మవిషయము లనేకము లున్నను వ్యాసవిస్తరభీతిచేత విరమించితిని.

# కవి బ్రహ్మ

## నవరత్నములు

కొణిదెన వెంకట నారాయణ గారు

తెలుఁగు దేశంపు పున్నెంపు కలిమితోడ
నాంధ్ర భూదేవసుతపోమహత్త్వమెనసి
నీవయి; తెల్గుసొబగుల నియతిఁదీర్ప
జనన మొందితివయ్య, తిక్కనమనీషి!

గీ. పిల్లలకుఁ బెద్దలకు వినఁ బ్రీతిపుట్ట
వింతరుచులను గల్పించి భ్రాంతి యుడుప
భారతము పదునేనుపర్వంబు లట్లు
తెలుఁగు సేయంగ నీకె యా ధీనమేత!

గీ. చదువుచున్నట్టులుండునే చదువుచున్న
గన్నులనుఁజూచినట్లును గాదె, తండ్రి!
ఎంతతపమును జేసితి, వెన్ని శ్రమలు
పడితివయ్య, యింతటిశక్తి పట్టువడఁగ?

గీ. చిత్రితము చేసి జీవంబు చెలఁగనిచ్చి
మృదుమధురవాక్కులను నిడి మెచ్చుపుట్ట
పనులుజరిపింతు; కథ కనుగుణముగాఁగ
పద్దెముల పాత్రలను సృష్టిపరచునపుడు.

గీ. ఎందఱేయే కవివరుల డెందమందు
నిల్పుకొని వారిపోల్కలు నిల్పఁజూచు
కొనినవనలవడు; నీకృతిననుకరించి
వ్రాయఁ దిరుగ నీవే పుట్టవలయు నార్య!

గీ. దైవకళలందు నొందు నీతనువునందు
నిలిచి యీరీతి నీపేర వెలసెఁగాని;
మానవుల కయ్య, యిట్టిసామర్థ్యమేది?
దివ్యకీర్తిప్రభాభాసి, తిక్కమూర్తి!

గీ. కొఱఁతవడనట్టి ధర్మముల్ జరిపి సురల
పితృలఁ దనిపితి; జనులకు విలువలేని
మేలుఁ జేసితి; దివికేఁగి చాలరోజు
లైనది; బుధేంద్ర! నీకీర్తి యచ్లెయుండె.

గీ. పుట్టువన నీదె కొత్తండ్రి పుడమిమీఁద;
భాగ్యమన నీదె కాదె మోపరమచరిత!
తల్లిదండ్రుల వెలయింపఁ దగుకొమరుఁడ
వీవ కాదయ నినుఁబోల్ప నెవరుసాటి.

గీ. సంస్మరించితి నిన్నొకసారి యేని
పద్దెముల; నంతియే చాలు; భావమందు
భక్తి చేనిచ్చు నొక్క పుష్పంబ యేని
కోటిమడుఁగులు ఫలమును గూర్పదెందు?



# స్వప్నములు

పారనంది జగన్నాథస్వామిగారు, యమ్. ఏ., యల్. టి.

స్వప్నములు సర్వజనానుభవములైనా ప్రాకృతజనులు చూపే ఆదరణ నాగరకజనులు చూపలేదు. స్వప్నములకు అర్థములను కల్పించి, వాటిప్రకారము ప్రవృత్తిని సరిపెట్టుకొనే సంప్రదాయముగల జాతులలో, స్వప్నఫలము చెప్పగలవాడు దైవజ్ఞుడు. ఆ తెగలలో జ్యోతిషము, వైద్యము, తంత్రము, స్వప్నశాస్త్రము ఒకదానితో ఒకటి సంబంధముగలిగి ఉండేవి. ప్రాచీనుల విజ్ఞానములోని విషయములు అనేకములు ఈనాటి శాస్త్రములకు పునాదులైనవి కాని, స్వప్నములుమాత్రము ఆతీరున పరిణమించలేదు. శరీరవ్యాపారములు పరీక్షించే శారీరకశాస్త్రజ్ఞుడుగాని, మానసికవృత్తులను విచారించే మనశ్శాస్త్రజ్ఞుడుగాని స్వప్నములగురించి మొన్న మొన్నటివరకు అంతగ శ్రద్ధతీసుకొనలేదు. అంతఎందుకు! ఇప్పటికికూడా నిద్రా స్వప్నముల స్వరూపము ఇదమిత్థమని తేలలేదు; అందుచేత స్వప్నములగురించి ఈ ఇరవై సంవత్సరములలో తత్వజ్ఞులు నిరూపించిన ముఖ్యసూత్రములను రెండింటిని సంగ్రహముగా నిరూపిస్తాను.

చైతన్యముఅనగా జాగ్రదవస్థలో వ్యక్తమవుతున్నదిమాత్రమే కాదనిన్నీ జాగ్రదవస్థలోనికి సాక్షాత్తుగారాని లీనచైతన్యము ఉన్నదనిన్నీ సిద్ధాంతము.* ఒకమారు స్మృతికిచేరినవి నశించిపోవు; అవి జాగ్రదవస్థలోనికి సాక్షాత్తుగారాగలిగే వ్యాపారములవలెగాక పరోక్షరీతిగా ఉంటవి. ఒకబరువుక్రింద ఉండేరబ్బరుబంతి ఎట్లు బరువు తగ్గగానే చప్పున పైకిరా ప్రయత్నిస్తుందో, అలాగా ఈలీనచైతన్యములోనివి కూడా వాటిని లీనముగాఉంచే నిరోధముతగ్గగానే బాహ్యజ్ఞప్తికిరా ప్రయత్నిస్తవి. అట్లువచ్చుటకు స్వప్నము ఒకసాధనము. అందుకు తగిన ఉత్తేజకము ఎక్కడిది? నిద్రలోఉన్న మనస్సుకు బాహ్యప్రపంచము ఉత్తేజకము కాకపోవుటచేత, మరొకవిధమైన ఉత్తేజకము ఆవశ్యకమని తోచవచ్చును. అదికొంతవరకు వాస్తవమైనా బాహ్యప్రపంచము కూడా నిద్రలోఉన్న ఇంద్రియములపై ప్రభవిస్తుందని చెప్పవచ్చును. బాహ్యమున ఉన్న వెలుతురు కండ్లపైపడి ఇంద్రియగోచరమవుతుంది; బాహ్యమున కలిగినధ్వని శ్రోత్రములకు గోచరమవుతుంది. ఎట్లంటే పగలు కళ్లుమూసుకొని అదేచూస్తూఉన్నప్పుడు వెలుతురువున్నదిలేనిది చెప్పగలము. రాత్రి దీపము పెట్టినదీ లేనిదీ కళ్లుమూసుకొని చెప్పవచ్చునన్నారు. ఆలాగే నిద్రలోవున్న నేత్రములపై వెలుతురుప్రసరించవచ్చును. అప్పుడుజరిగే గోచరములో భేదముఉన్నది. పగలు కళ్లుమూసుకొని చూస్తూవున్నప్పుడు కనబడే తేజఃపుంజములైన మచ్చలవంటివే నిద్రలోఉన్నకండ్లకుకూడా కనబడతవి. ఈమచ్చలు పెద్దవిగాను, చెదరుతూ, విస్తరిస్తూ, ఆకారములోను, రంగులోను మారుతూవుంటవి. కంటిరెప్పలనొక్కడుచేత నేత్రముల నాడీనిర్మాణము ఉద్రేకించి ఈ అనుభవము కలుగుతుంది. ఇట్టివృత్తులు అంతరేంద్రియవృత్తులని చెప్పవచ్చును. శరీరములోపలి అంగములనుండి ఇంద్రియవృత్తులు కలుగుతూ ఉంటవి. ఈ అంతరవృత్తులు జాగ్రదవస్థలోకంటె నిద్రలో ఎక్కువ తీవ్రముగ ప్రవర్తిస్తవి. జాగ్రదవస్థలో ఉన్న స్థూలప్రపంచసంబంధము, ఆప్రపంచమునకు సంబంధించిన సంస్కారములనే స్మృతినుండి గ్రహించవలెననే నిర్బంధము, ఈరెండునియమములు నిద్రలో లేకుండుట అందుచేతనే అనుభవము అవ్యక్తము, అస్పష్టము, సంకులముగాఉంటుంది. అంతేకాని స్వప్నములో క్రొత్తదేదీ సృజింపబడదు; జాగ్రదవస్థలో సంపాదించిన సామగ్రే ఆతీరునగాకుండా మరొకతీరున ఉపయుక్తమవుతుంది. ఈసామగ్రి చాలాకాలము క్రిందట సంపాదించినదికావచ్చును; ప్రథమ సంస్కారము చాలా అస్పష్టమైనది కావచ్చును. అందుచేత నిరోధములేనిస్థితిలో మనస్సుఉన్నప్పుడు ఇట్టి అస్పష్టసంస్కారములు పైకిరావచ్చును. ఏవివచ్చునంటే, వాటికిపైకి తీసుకొనివచ్చే ఉత్తేజకమునుపట్టి ఉంటుంది. ఉత్తేజకము దానికి అత్తినస్మృతి. ఈ రెండింటిపైస్త్రీ మనోవృత్తికి కారణము. ఈస్వరూపము జాగ్రచ్చైతన్యమునకు స్వప్నచైతన్యమునకున్నూ సమానమే. ఉన్న తారతమ్యము అంతా ఆరెండుస్థితులలోను మనస్సుకుగల క్లేశములో ఉన్నది. జాగ్రచ్చైతన్యములో బాహ్యప్రపంచజ్ఞానమునకు సరిపడే స్మృతిసంస్కారములు మనస్సుఎంచవలసిఉంది. ఆనిరోధము స్వప్నములో లేదు. నిద్రఅనగా ఆక్లేశములేనిమనఃస్థితి అని చెప్పవచ్చును. ఆప్రయత్నరహితమైన స్మృతిసామగ్రే స్వప్నమునకు ఉపకరించే సామగ్రి. ఈసూత్రములను అనుసరించి స్వప్నలక్షణములన్నింటిని సమన్వయించవచ్చును. ప్రపంచముతో అత్తిరయుండవలసిన అవసరములేనందున ఎట్టిస్మృతులైనా అత్తవట్లుఉండి స్వప్నములలో సంబంధము, కాలజ్ఞానము, స్మృతి సామగ్రి క్రమము లేకపోయినందుకు కారణముగున్నది.

ఇంతవరకు నిరూపించినది ఒకమతము; దీనిప్రతిపాదకులలో ముఖ్యుడు బెర్గ్సన్. ఇకరెండో మతమును నిరూపిస్తాను; దీనిని ప్రతిపాదించినవాడు ఫ్రాయిడ్. ఈరెండో మతమునకు బెర్గ్సన్ మతమునకు

* గతసంవత్సరముసంచికలో 'చైతన్యస్వరూపసిద్ధాంతములు' అనేవ్యాసమును చూడవలెను.

సామ్యములను కొన్నిమాత్రము ఉన్నవి. జాగ్రదవస్థలో కనపడే చైతన్యమే అంతేమనస్సు కాదనిన్నీ, ఒకమారు మనస్సునకు చేరినదంతా స్మృతిరూపముగా నిలిచిఉంటుందనిన్నీ, జాగ్రదవస్థలో ఉండేనిరోధముస్వప్నములో ఉండదనిన్నీ, స్మృతిగతమైన సంస్కారములేవైనా సరే స్వప్నములో ఉపయోగమునకు రావచ్చుననిన్నీ, మిక్కిలిసన్నిహితమైన అనుభవములలో ఒకటి ఏదైనా అనగా ముందురోజున జరిగినదిఏదైనా స్వప్నమునకు హేతువు కావచ్చుననిన్నీ, నిద్రలోఉన్నా ఇంద్రియములపై బాహ్యమైన ఉత్తేజకమునకు ప్రభావముఉండవచ్చుననిన్నీ అట్టి ఉత్తేజకములవలన స్వప్నములు ప్రవర్తిస్తూ ఉండుననిన్నీ ఉభయమతవాదులకు అంగీకారమే.

కాని బెర్గ్సన్ మత ప్రకారము స్వప్నములకు ఫలముప్రత్యేకముగా ఒకటిఉన్నట్లు కానరాదు. జాగ్రచ్చైతన్యమునకు ఫలమున్నది. బాహ్యప్రపంచమునకు అనుభవమునకు వస్తూవుంటుంది. స్వప్నచైతన్యమునకుఫలము లేకపోయినది. స్వప్నముల ఉత్తేజకములు సాధనసామగ్రివంటి వ్యాపారము బెర్గ్సన్ మతప్రకారము సాధించగలిగినా వాటి ప్రయోజనమేమిటో నిరూపించలేము. ఫ్రాయిడ్ మతప్రకారము ఒకప్రయోజనము కల్పించసాధ్యమైనది. స్వప్నము ఒక చిహ్నవంటిది. జాగ్రదవస్థలోఉన్నప్పుడుకలిగే ఇచ్ఛఏదైనా నిరోధింపబడినచో అది లీనచైతన్యములోనికిపోవును. నిరోధమువలన అణచివేయబడిన ఆయిచ్ఛతిరిగి ఆరూపమునరాలేదు. జాగ్రదవస్థలో ఆనిరోధము ఎక్కువబలముగా ఉండుటచేత ఆయిచ్ఛరానేరాలేదు. ఒకవేళ ఆయిచ్ఛమరీఎక్కువతీవ్రమైనదైనప్పుడు సంతృప్తికొరకు వ్యక్తమగునప్పుడు పూర్వరూపము దాల్చి బయలుపడ వీలుండదు. అది బాల్యరూపము మనోవికారముగా ఉండవచ్చును. నిద్రలో ఆనిరోధము అంతప్రౌఢముగా ఉండనందున ఆయిచ్ఛ సంతృప్తికొరకు మరొకరూపమును ప్రచ్ఛన్నరూపమునుదాల్చి బయలుపడును. అట్టిఇచ్ఛకూ, దాని సంతృప్తికీ స్వప్నము తగినచిహ్నం. అందుకుతగిన భావములు అభిప్రాయములు సమకూర్చుకొని స్వప్నము పూర్తియగును.

ప్రచ్ఛన్నరూపమును తొలచుటచేత స్వప్నముయొక్క అర్థమును గ్రహించుట అంత సులభమైన పనికాదు. కొంత ప్రయత్నముచేస్తే కాని అనగా ఏనిరోధముచేత ప్రచ్ఛన్నత ఆవశ్యకమైనదో దానిని తొలగిస్తేనేకాని, స్వప్నముయొక్క అర్థము ప్రయోజనము వ్యక్తము కావు. ఇందు కొరకు ఒకవిధమైన పద్ధతిని అవలంబించవలసి ఉన్నది. జాగ్రచ్చైతన్యములో ఉండే నిరోధము ఏదో దానిని లేకుండా చేయవలెను. స్మృతినుండివచ్చే సంస్కార ప్రవాహములో ఉత్తేజనమునకు బాహ్యప్రపంచమునకు కావలసినవాటినే ఎందుకొనే నిర్బంధము లేకుండా ఉండేటట్లు చేయవలసి ఉన్నది. ఇష్టమువచ్చినట్లు మనస్సు స్మృతిప్రపంచములో సంచరించవలెను. స్వప్నగతమైన వాటిలోని రూపమును వస్తువును, ఆలోచనను, భావమును గ్రహించి, దానివలన స్మృతినుండి జ్ఞప్తికివచ్చేదానినెల్ల గ్రహిస్తూ ఉండవలెను. జ్ఞప్తికివచ్చేది అసందర్భమైనదని తొలగించే అలవాటును మరచిపోతేనేకాని లీనచైతన్య స్మృతికి పైకివచ్చుటకు ద్వారముఉండదు. అట్లు జ్ఞప్తికివచ్చే దానినంతా గ్రహిస్తూ, మనస్సును స్మృతిని స్వేచ్ఛగా విహరించనిస్తే, ఎప్పటికైనా దాగియున్నది కొద్దిగనో స్పష్టముగనో వ్యక్తము కావచ్చును. ఈ పద్ధతికి సైకో ఎనాలిసిస్ (Psycho Analysis) అని పెట్టినారు. దీనిప్రకారము పరిశీలిస్తే స్వప్నముయొక్క ప్రయోజనము అనగా దేనికి స్వప్నము ప్రచ్ఛన్నరూపమో తెలుస్తుంది. ఏ నిరోధితేచ్ఛ ఈ రూపముగా సంతృప్తిపొంద ప్రయత్నించిందో స్పష్టమవుతుంది.

ఈ మతము చాలా నూతనమైనది. అనగా సుమారు పాతికసంవత్సరముల వయస్సుకలదు దీనికి. దీనిని పూర్తిగా ఫ్రాయిడ్ ప్రతిపాదించే తీరున అంగీకరించని విమర్శకులు ఉన్నారు. ముఖ్య సూత్రములను అంగీకరించినా, అన్ని స్వప్నములూ నిరోధితేచ్ఛా తృప్తికొరకైన చిహ్నాలే అని వారు అంగీకరించరు. జాగ్రచ్చైతన్య వృత్తులవలె స్వప్నములుకూడా చైతన్యఖండములే అగుటచేత స్వప్నములలో కొన్ని జాగ్రదవస్థలోని అనుభవముయొక్క ముక్కలా అని తోస్తుంది. జాగ్రదవస్థలో జరిగిన వ్యాపారములను గాఢముగా నిద్రలోకూడా ఎక్కువ తీవ్రముగాను, నిశ్చలముగాను నడిపించడములో స్వప్నములు కలుగవచ్చును. ఏ విధమైన భావసంపర్కమూ లేకుండా పగలుచూచిన వస్తువులను అలాగే చూచే స్వప్నములున్నవి; ఇట్టివి పిల్లలలో ఎక్కువగా కనబడతవి. ఈవిధములైన స్వప్నములు ఫ్రాయిడ్ మతమునకు అతీతమని విమర్శకుల అభిప్రాయము.

ఫ్రాయిడ్ సూత్రమునకు అతని కొన్ని సంగతులుఉంటే ఉండవచ్చును. అతని నిరోధితేచ్ఛా సూత్రమును కొంతవరకు మార్చవలసి ఉంటే ఉండవచ్చును. కానిమొత్తముమీద ఆసూత్రము సిద్ధాంతమే అని అంగీకరించుటకు బలమైన ఆధారములు ఉన్నవి. ఈమతము ప్రకారము స్వప్నములెట్లు నిరోధితేచ్ఛాచిహ్నములో అట్లే మనోవికారరోగములు కూడా నిరోధితేచ్ఛల సంతృప్తికొరకు ధరింపబడిన మారువేషములని అతనివాదము. ఏ ఇచ్ఛలు సాంఘికనీతికి బాహ్యములో ఏవి ఆకారణమున సంఘాభిప్రాయ నిరోధముచే బలవత్తరముగా అణచివేయబడునో, అవి అంతబలముతోనూ మారు రూపములుగా సంతృప్తికొరకు బయలుపడుతూ ఉండును. ఆ మారురూపములే మనోవికారములు. ఆ వికారములు పోవలెనంటే ఆరూపములకు కారణమైన నిరోధితేచ్ఛను వ్యక్తపరిచివేస్తే, నిరోధముపోవును; కాబట్టి ఆ వైకల్యము హరించిపోవును. ఈ వాదముప్రకారము మీద నుదహరించిన పద్ధతిని అవలంబించి, ఆ ఇచ్ఛను కనుగొన ప్రయత్నించి, అనేక రోగులకు రోగనివారణ చేయగలిగినారు. రోగనివారణమునట్టి పద్ధతి మతములు రెండూ తథ్యములని అంగీకరించవలసి ఉంటుంది. మనోవికారముల సమన్వయము కొరకు స్థిరపడిన సూత్రము, అట్టిరూపములైన స్వప్నములకుకూడా సరిపడునుగదా. చాలాచోట్ల రోగుల స్వప్నములను పరిశీలించి, రోగలక్షణములను విశదపరచగలిగినారు. ఈ మతప్రకారము స్వప్నపరీక్ష విపులముగాచేస్తున్న ఫ్రాయిడ్ శిష్యులు స్వప్నముల నిరూపణవిని నిరోధితేచ్ఛను ఊహిస్తూ రోగితో సంభాషించుటచేత వారి కార్యము

సులభమవుతున్నది. ఈ బలమైన నిదర్శనములు ఉండుటచేతనే, ఫ్రాయిడ్ యొక్క మతమును ఇన్నాళ్ళకైనా అంగీకరిస్తూ ఉన్నారు. ఈ మతము కేవలము ఊహావాదముమీదనే నిలిచిఉంటే, చాలామంది తత్వజ్ఞులుకూడా ఆలోచించక పోయి యుందురు.

స్వప్నములు రోగలక్షణములంత తీవ్రవికారములు కాకపోవుట చేతనూ, జాగ్రదవస్థలో ఉన్నంత నిరోధము స్వప్నములో ఉండక పోవుటచేతనూ, ఇచ్ఛదాల్చే దొంగరూపము తక్కువ గూఢముగా ఉండుటచేతనూ స్వప్నములు, ఈ మత విచారణలో ప్రాముఖ్యము పొందియున్నవి. స్వప్నముల పరీక్షవలన రోగనివారణకు ఉపయోగపడు సాధనము దొరుకుటకంటె ఎక్కువగా, మనస్సుయొక్క స్వరూపమును తెలుసుకొనుటకు ఆధారము ఒకటి సాధ్యమైనది. జీవచైతన్యము యొక్క స్వభావమూ ప్రవృత్తీ తెలుసుకొనుటకు స్వప్నముల పరీక్ష ఆవశ్యకము. స్వప్నములో మనస్సుయొక్క వృత్తిని వ్యాపారమును తెలుసుకొనుటకు ఇప్పుడు సాధ్య మవుతున్నది. మనశ్శాస్త్రము అందుచేత వృద్ధి అవుతున్నదిగదా.

ఈ వ్యాసములో నిరూపించిన సూత్రములను మతములను ఇంతకంటె విశేషముగా చర్చించుటకున్నూ, ఇంతకంటె చక్కగా బోధపరుచుటకున్నూ కావలసిన ఉదాహరణములను స్థలములేమిచే పొందుపరచలేక పోయినాను.

స్వప్నములకు మనదేశములో చాలా ప్రాముఖ్యము ఉండెను; ఇప్పటికీ ఉన్నదికూడా. కాని స్వప్నములను శాస్త్రములలో భ్రమాజ్ఞానముగానే పరిగణించి విడిచిపెట్టినారు. జ్యోతిషికులు, వైద్యులు, వీటిని భావిసూచకములుగా ఉపయోగించినట్లు పుస్తకములవలన కనిపిస్తూ ఉన్నది. వారు స్వప్నమువంతను ఏకముగా భావించి వాని భావిఫలమును నిరూపించినారు. ఇది మీదను చర్చించినదానికి సరిపడదు. ఆ మతముల ప్రకారము భావి సూచకత్వము స్వప్నములకు చెప్పలేదు. అంతే కాకుండా వారు స్వప్నమును విడపరిచి దానిలోవచ్చే ప్రతి సంగతికి సంబంధియైన అనుభవమును కనుగొన యత్నించినారు. మన దేశములో స్వప్నములను విచారించిన విషయము మరొకమారు చర్చించ ప్రయత్నిస్తాను.

# కోయిల

సంగనామాల రామచంద్రరావు గారు

ఆకుమఱుంగు సందుఁగొని యంబరవీథిఁ బ్రతిధ్వనింప లో
కైకమనశ్శ్రవోయుగళి కంతటఁ బండువు సేయుచుండి యు
స్తోకనిరూఢనిస్తుల విశుద్ధవికర్షకపంచమస్వర
శ్రీకమనీయగానమును జిప్పిలఁజేసితి విందుఁగోయిలా!

ఉ. తియ్యని నీదునోటినుడి తేనియలం జెవి దొప్పఁగొంటి నీ
దయ్యపుఁ గొంపయౌ భరతధాత్రి వసించియు నెంతపుణ్యమొ
రియ్యెడనైన స్వేచ్ఛ మెయి నిష్టకథామధురానులాపవా
క్చయ్యను జూపనేర్తువని సంతసమందెద లోనఁ గోయిలా!

గీ. అమెరికాంగ్లేయభూమి ఖండాంతరములఁ
జెవలీను స్వాతంత్ర్య వాతావరణము
పికమ! తగునమ్మ! నీకుఁ బాటిస్తి బ్రతుకు
నడపుచుండెడుమాకుఁ గాణాచి యిదియె.

శా. స్వాతంత్ర్యం బెదమైన బానిస లవాచ్యంబైన దౌర్భాగ్య మీ
జాతిన్ గన్నులఁ జూడరాదని పలాశం బోలముం గొంటివో
నీతిప్రాపకబోధవాంఛిత కళానిర్వ్యాహకోత్కృష్ట స
ద్గీతా! యొక్కనిరంకుశప్రభుత బందీభూతుఁగావించెనో.

శ్రీ వి. యస్. చిన్నస్వామిగారు, బి. ఏ.



Sjt. V. S. Chinnaswami garu, B. A.

శ్రీ గూడూరు సుబ్బయ్యగారు



Sjt. Gudur Subbayya garu

జొంతలకోడూరు ఖాదీఆశ్రమమువారు నూలువడుకుట, నేత నేయుట, ఆంధ్రరాష్ట్రీయసభ, చెన్నపురి



# అమృతాంజనము

గజేంద్రమోక్షణము




"శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే, వరద! సంరక్షింపు భద్రాత్మకా!"—భాగ. స్కం. ౮. ప. ౯౦.

# దక్షిణాది తెలుగు — కొన్ని పాతవుత్తరాలు

వేమూరు విశ్వనాథ శర్మగారు, యమ్. ఏ., యల్. టి.

చోళదేశము (తంజావూరు రాజ్యము) ఆంధ్రనాయకుల పరిపాలనక్రింద నున్న కాలమున తెలుగుభాష యీదేశాన చాలా ప్రచారంలో వుండేది. రాజులకు మాతృభాషవుటచేత రాజకీయవ్యవహారాలుకూడ తెలుగులోనే నడిచేవి. ఇతరభాషలు మాట్లాడేరాజులకు తంజావూరి నాయకరాజులు తెలుగులోనే వ్రాసేవారు. వారి ప్రత్యుత్తరాలుకూడ తెలుగులోనే వుండేవి. ఈపద్ధతి ఆంగ్లేయుల కంపినీవారి హయాములోకూడా జరుగుచుండెను. దీనినిబట్టి యీదేశంలో తెలుగుభాషకుండిన ప్రాముఖ్యము కొంతవర కూహించుటకు వీలగును.

తెలుగునాయకుల తరువాత మహారాష్ట్రులు రాజ్యానికి వచ్చిరి. మహారాష్ట్రరాజులుకూడ నాయకులపద్ధతినే అవలంబించిరి. ఇతర రాజులకేమి, కంపెనీదొరలకేమి వీరు వ్రాసినవుత్తర ప్రత్యుత్తరాలు తెలుగులోనే వుండేవి. వీరి కింకరులు వ్రాస్తుండిన వుత్తరాలుకూడ తెలుగుననే నడిచేవి. తంజావూరి మహారాష్ట్రరాజులలో ప్రసిద్ధికెక్కిన తుల్జాజీకిన్ని అతని తమ్ముడు అమరసింహ మహారాజుకున్ను వ్రాసిన తెలుగుత్తరాలు నలభైవరకు నాకు లభించినవి. ఇందు శృంగేరిస్వాముల వారు మొదలుకొని ఆర్కాటు నవాబువరకు గల అన్నిజాతులవారు వ్రాసిన వుత్తరాలు గలవు. మచ్చుకు కొన్నివుత్తరాలు యిచ్చట ప్రచురించుచున్నాను. ఈవుత్తరాలన్ని రమారమి నూటయేబది సంవత్సరాల నాటివి.

ఈవుత్తరాలు చదివినమీదట అప్పటి దక్షిణాది తెలుగు స్వచ్ఛముగా నుండేదని స్పష్టమగును. అరవమాటలే కానరావు. తురకల సంపర్కము సోకినతరువాత కృష్ణరాయలనాటికే వారిమాట లనేకము మనభాషలో జీర్ణించినవి. ఇట్టి వ్యత్యాసమునకు కారణ మేమై యుండును? తెలుగునకు అరవమునకును పొత్తు కుదురుట కష్టమని అనుకుంటాము. లాలిత్యమైన సరళస్వభావముగల తెలుగులో పిడిరాళ్లవంటి కటువు పదములుగల అరవమాటలకు యిమిడిక కుదురదు. ఇంతకంటె మరియొక కారణము కానరాదు. అరవంలోనుంచి తెలుగు పుట్టిందని భ్రమపడెడివారివాదమునకు ఈరెండుభాషలకు పొత్తిక లేకుండుటయే ప్రబల విరోధము.

అయితే యిప్పుడిక్కడి తెలుగువారు మాట్లాడేభాషలో ముప్పాతికవంతు అరవమాటలే. దీనికి కారణము వేరు. ఇది తెలుగు మరిచిపోవుటవల్ల పట్టిన దురవస్థ. మహారాష్ట్రరాజుల కాలములో తెలుగు కుండిన రాజకీయ ప్రాముఖ్యము వారితరువాత పూర్తిగపోయినది. అందుచేత నిక్కడి యాంధ్రులుకూడ తెలుగు మరిచిపోవుట తటస్థించినది. మనదేశములోకూడ యింగ్లీషు చదివినవారు తెలుగుమాటలు తోచక యింగ్లీషుతో తెలుగు మాట్లాడుదురు. అట్లే యిక్కడి తెలుగువారు అరవముకలిపి తెలుగు మాట్లాడుదురు. అంతమాత్రముచేత ఈభాషలకున్ను తెలుగుకున్ను ఒకదానిలో నొకటి జీర్ణించుటకు తగినంత పొత్తిక కలదని చెప్పుటకు వీలుపడదు. ఈసంగతిని భాషాపరిజ్ఞాతలు గమనించెదరను తలంపుతో ఈపాతఉత్తరాలను ప్రచురిస్తున్నాను.

## 1

### శృంగేరిస్వాములవారి శ్రీముఖం

ఆశీర్వచనానంతరము:—

"ఈ ధర్మసంస్థానము అనాదిశిద్ధమైన శ్రీ శంకరాచార్య శారదాగురుపీఠమనే టువంటి ఆసేతుహిమాచల పరియంత్రం ప్రశిద్ధమైవుండేదానివల్ల యీసంస్థాన విషయమందు తాము పూర్ణసాభిమానం వుంచ్చి నడిపించ్చే టటువంటిది. అనేక శ్రేయసుకు కారణమై వుండేది సరిగదా ॥సాంప్రతం॥ శ్రీసేతుయాత్రార్థం స్వారీ దిగ్విజయం చేశేటందుకు మార్గసంరక్షణార్థం కుంఫిణీ సరకారునుంచ్చీ కాతగ్గ సాహిత్యం చేయించ్చియిచ్చి రహదారి బిన్నవతీలమోదులుగా వ్రాయించ్చియిచ్చినదానివల్ల స్థళంనుంచ్చీ సంస్థాన సమేతంగ్గా వెడలివచ్చి వున్నారము గనుక పథ్యా అప్రాంత్యానకు విజయంచ్చాయడ మాతూ వున్నది. ఆవివరమంత్తా అరుణాచలశాస్త్రి కృతం చేసినదానివల్ల సవిస్థారం అంతఃకరణకు విదితమయ్యేనని వ్రాసు (పరాకు) శ్రీసేతుయాత్రార్థం అస్మత్పూర్వాచార్యులవారు దయచేశి వుండినపుడు అనేక సేవసత్కారాలుచేశి యీధర్మసంస్థాన విషయమందు బహుతరం సాభిమానంవుంచ్చి నడిపించ్చి ధర్మకీర్తి సంపాదన చేసుకొని వుండిన దానివల్ల యిపుడున్ను సంస్థాన మర్యాదానుసారంగా యాత్రపూర్తైతమైయ్యేటటుగా సకలాంశముల యందున్ను పూర్ణసాభిమానం వుంచ్చి నడిపించ్చి శాశ్వత ధర్మకీర్తి సంపాదించ్చుకొనేటటు చేపించ్చవలెను. సకల ధర్మసూక్ష్మములున్ను తెలిశినడిపించే టటువంటి ప్రజ్ఞాశాలి మహాప్రభూలకు పత్రికాముఖాంత్రం విశేషం వ్రాయించ్చి పంపిచ్చవలెశినది యేమివున్నది. యింతోధిక సాంమ్రాజ్య వైభవాభివృద్ధికి శయం కావలెనని శ్రీశారదా అమ్మవారు శ్రీచంద్రమౌళీశ్వరస్వామికి ప్రార్థనచేశి ప్రసాదమంత్రాక్షతలు పంపించ్చివున్నది. తీసుకొనేటటు చేపించ్చవలెను.

## 2

### ఒక శుభలేఖ

"శ్రీమత్సమస్త సద్గుణసంపంన్న అఖండితలక్ష్మిసేవాప్రసంన్న అవ్యాజపరోపకార అనేకధర్మపరిపాలక స్నేహిత పరిపూర్ణవాత్సల్య

మహాంమ్మేరు సమానధీరులయ్యిన్న మహారాజశ్రీ సంభాజీ శివరావు వారికి,—

శే॥ వైద్యలింగ్గం సాష్టాంగ్గదండ్డములుబెట్టి శాయంగ్గల విన్న పాలు. యిచ్చట ఆవణి నెల ౨౦ తేది వర్కు కుశేలం తమ నిరంత్తర సకల సంత్తోష సాంమ్రాజ్య అతిశేయములకు వ్రాయించ్చి పంపిస్తూ రావలెను. త॥ యీనెల ౨౮ తేది భానువారం దినమందు ధనుర్లగ్న మున చిరంజ్జీవి తంమ్ముడు శివచెదంబ్బరానికి వివాహముహూర్త్తం నిశ్చయమై వున్నది. గన్క తాము కటాక్షించ్చి యింత్తపరియంత్రం విజయంచేశి ముహూర్త్తం నెఱవేర్చి యిప్పించ్చేలాగ్న శాయవలెను. తాము అభిజ్ఞులుగన్క విశేషించ్చి వ్రాసుకోగలది లేదుగదా. కడను యిచ్చట నడ్వగల ప్రయోజ్నములకున్ను అచ్చటి సుభోదయముల కున్ను వ్రాయించ్చి పంపిస్తూ రావలెను. యింతే దండ్డములు.

## 3

## అమరసింహుడు శంకరాచార్యులకు

"తత్మ ముఖ్యశిష్యులైన శ్రీమదమరసింహ్మ భూపాలకులు అనేక్క దండవత్ప్రణామములుచేశి శాయంగ్గల విజ్ఞాపనములు:— త॥ శ్రీవారు చిన్నపట్నప్రదేశాన్కి తర్లి చాలాదినము లాయను. గన్క శ్రీవారి చర ణారవింద దర్శనాపేక్ష చాలావున్నది గన్క అచ్చటి ప్రదేశప సంచ్చారం శీఘ్రంగ్గా చేసుకోని ఆషాఢశుద్ధపౌర్ణమి యీవలో కుంభ కోణప్రదేశాన్కి వచ్చిచేరితె చాలా సంతోషంగ్గావుండ్డును. హరి భట్టు ధవళీకర్ అనేబ్రాహ్మణుడ్కి కొంచ్చం అపవాదం వచ్చింది. తమసముఖాన్కి విశదంగ్గా శ్రుతమై వుండ్డునుగద. ఆబ్రాంహ్మడు ధర్మ శాస్త్ర విధాయకుడుగన్క హవ్యకవ్యాది సమస్తమున్ను నిల్చిపోయి వున్నది. గన్క వారిబంధువులు మరిన్ని వుండ్డేబ్రాంహ్మణులు నగరి వారివద్దవచ్చి చాలా అర్జుచేశిరి గన్క మనకున్ను ఆబ్రాంహ్మణ్ని పునీ తుడు శాయవలెనని తోచి శ్రీవారి సముఖాన్కి విజ్ఞాపనము వ్రాసు కొన్నది. హరిభట్లు చెన్నపట్టణములో వున్నాడు. అతడు శ్రీవారి సముఖాన్కు వచ్చును. వాడియందు శ్రీవారు దయచేశి ప్రాయశ్చిత్త రూపంగ్గా యేమైనా చేయించ్చి వారిని పునీతుడుగా శాయతగ్గది. యీకార్యనిమిత్యం మనవక్కీలు త్రియంబక సంభాజీ బావావారు శ్రీవారి సన్నిధానమందు విజ్ఞాపనము చేస్తురు. అలాగున దయచేశి శాయతగ్గది."

## 4

## కంపెనీదొర వ్రాసినది

"శ్రీమత్సమస్త సద్గుణ సమ్పజన్యశిఖామణి శిరోమణిదేవ బ్రాంహ్మ ణవేదపాలకులైన శ్రీమదఖండ్డిత లక్ష్మీ అలంకృతులైన రాజమాన్య రాజపూజిత మహారాజరాజశ్రీ పంత్తులవార్కి:—

మెస్తర్ బెయిన్ దుబాసి శేనక్కపల్లి రంగ్గనాయకులు దణ్ణములు బెట్టి శాయంగ్గల విన్నపములు. మేమున్ను విళంబ్బినామసం॥ పంగ్గ నినెల 2 తేది స్థిరవాసరములవర్కు —తమయొక్క ఆశీర్వాదం వల్లను త్రిశిరపురము (తిరుచినాపల్లి)లో క్షేమం. తమయొక్క కుశాలీ నామా నిరంత్తరం దయవుంచ్చి నిరూపం వ్రాయించ్చి పంపింస్తూ రావలెను. త॥ తమవద్ద శెలవుపుచ్చ్కొని నిన్న వుదయాన త్రిశిరపురం చేరినాము. మాదొరవద్దవున్న అరకార సుబ్బయ్య తమయొక్క ప్రాపున జీవనం చాయవలెనని దొరచెంబ్బడిని పోక శెలవు పుచ్చ్కొ యిచ్చటనే నిలి చెను. దొరంన్ను యీయనినిమిత్యం చాలా చెప్పిపోయినాడు. కాబట్టి తమకు మనవి చేసుకుంన్నాను. యీయ్న మంచ్చివాడు. పనిపాటల యందు జాగ్రత కలిగివుండ్డును. నాయంద్దు చాలా దయవుంచ్చి యీయ్నకు తమప్రాపున అన్నవస్త్రచేసి సంరక్షణచేసేటట్టు దయచేసి నడిపించ్చవలసినది. నేను సార్వదాత్మయొక్క శ్రేయస్కరం కోరుతూ వున్నాను. తమకు మిక్కిలిన్ని వుపదలించ్చి వ్రాయ పనిలేదుగదా. అచ్చటి శుభోదయములకున్ను యిచ్చటనేనడుచుకొగలంద్దుల్కు నిరూపం వ్రాయించి పంప్పించే దయశాయవలెను. యిదేదండ్నములు విన్నపత్రంలో తప్పులు క్షమించ్చవలశినది. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ."

## 5

## ఇంకొక వుత్తరం

"శ్రీమతు సకలగుణసంపన్నులైన రా॥ రాజపూజితులగు రాజ శ్రీ బచ్చన్నపంత్తుల (మంత్రి) గార్కి,—

మెస్తర్ బోస్ సువారు సలాం. నేమున్ను చెన్నపట్నములోను సుఖం. మీయొక్క సకలశుభసంత్తోషాతి శయములకు వ్రాయించ్చి అంప్పించటం దయశాయవలె. త॥ మొన్నటిదినం మీపని నిమిత్యం వ్రాసి అంప్పించ్చిన జాబుకు బదులుకాబట్టి రా॥ రామానాయనివారిని పిల్వనంప్పించ్చి మాజాబులోని మతలపు అడ్గితెలుసుకుంట్టె ఆయ్న మీకు విశదపరుమను. మహారాజువార్కి నా అనేకసలాములు చెప్ప వలెను. మార్చినెల ౯ తేది ౧౭౭౯ సం॥."

## 6

## మిషనరీదొర వుత్తరం

"శ్రీమత్సమస్తసద్గుణ సౌజన్యమేరు ధైర్యసాగర గాంభీర్య నయవినయ వుదారదాక్షిణ్య స్నేహపరిపూర్ణాఖండలక్ష్మీ ప్రసన్న అవ్యాజపరోపకార నిరత బహుకుటుంబ్బాధార రాజమాన్యరాజ పూజిత మహారాజరాజశ్రీ నృశింహ్మరాజపంత్తుస్వామివారి సము ఖానకు,—

శే॥ దామోదర పద్మనాభయ కృతానేక్క నమస్కారములు. యీ ఆశ్వీజ బ॥ ౧౦ భానువాసరంవర్కు త్రిశిరపురంలో క్షేమం. తమ నిరంత్తర సాంమ్రాజ్య విభవాతిశేయముల్కు దయచేశి వ్రాయించ్చ తగ్గది. మాదొర మెస్తరుపొల్లువారు చిన్నవాంట్లను నాగూరిలో వుంచ్చి రావలెనని పైపైత్వరగా వచ్చినంద్ను మహారాజరాజశ్రీ మహారాజువారి భేటీకి వచ్చేటంద్కు యుక్తపడక వుండ్డెనని వ్రాయ మనిరి. ఆపైనం చిత్తగించ్చగలది. భాగవతపురం అనే గ్రామంలో మేము కొంత్తస్థితులు కుద్రక్రయాన్కి తీశినంద్దుల్లో ఆగ్రామంవారు

దురాగతాలు చేస్తున్నారు. అందుకు దయచేశి తాకీదు శేయించ్చ వలశినది. సర్వజ్ఞులుక్కు విశేషంగ్గా వ్రాసుకోవలశినది యేమివ్పున్నది. యిచ్చట కాగలంద్లుకున్న త్మ శుభోదయములుక్కున్ను వ్రాయించ్చి పంప్పించ్చేటట్టుగా దయశాయవలెను. యిదే అనేక్కనమస్కారములు.

## 7

### ఒకవేశ్య వ్రాసినది

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయ్ని మహారాజ ఛత్రపతి వారి పాదపద్మములకు పుష్పగంధ కస్తూరిపంన్నీరు పరిమళాదుల చాళ పూజ చాయబడినషువంట్టి పాదపద్మములకు,—

వింన్నపములు శేవకురాలు వెంక్కటరాఘువు నిరంత్తరమున్ను అనేక సాష్టాంగ్గదంణ్నములుబెట్టి శాయంగ్గల విజ్ఞాపనములు॥ తర్వా॥ సముఖానను శెలవుతీస్కుని కటాక్ష వీక్షణం చొప్పునను యిల్లు ప్రవేశించ్చినాము. సముఖమున శెలవుతీస్కుని బయలు శేరిన నాటనుంచ్చి దివ్యపాదార విండ్దములమీద అచంచ్చల ప్రతిభక్తి జ్ఞానమేకాని యితెరము శేదు. అది అట్లావుండ్డగా సముఖమునచేస్ని షువంటి మేలుంన్ను ఆదరణానున్ను యిది నాశెరీరం వుంన్నమట్టుకు మరవవలస్నిది శేదు. అది యెట్లాగంట్టె చంద్రుంణ్ని యడబాశ్ని కలువలు యేరీత్ను వుండ్డునో అటువలెనే సూర్యుంణ్ని యడబాశ్ని కమలములు యేరీతున వుండ్డునో అటుంవలెనే దీనత్వాంన్ని జెంద్ది వుంన్నాను. ఇంకటికింన్ని శేవు పాదారవింద్ద దర్శనంవల్లను నాకు స్కలపాపవిమోచనం అయినది. అక్కడనుంచ్చి వచ్చిననాటనుంచ్చి సముఖముంద్దున కొలువు కు వస్నును కోరుకుంన్నానుగాని మరియొకటి శేదు. యేదినాన్కు అయ్నా శీఘ్రముగ సముఖమంన్ను శావ చాయుగలంద్దులకు వచ్చి చేరుకుంన్నాను. పదివేలకోట్ల దండ్నములు.

సీ. వుండ్డుండ్డి యేమేమొ వూరక చింత్తింత్తు
　　చింత్తించ్చినాలోన చింన్నబోదు
చింన్నబోయి యెుకింత్త శేపు తెలివిగ నుండ్డు
　　తెలివివ్వాశను మింమ్మ్ను తలపువచ్చు
తలచినంత్తనె వచ్చి నిలచినట్లనె తోచు
　　తోచినే దిగ్గనలేచి జూతు
జూచినేగమె బారజాచి కౌంగిట గృత్తు
　　గృచ్చి కౌంగిటలేక వెచ్చనొత్తు
వెచ్చనొర్చియు తపియింత్తు వెతలనింత్తు
సఖుల గద్దింత్తు తెలుప యోచన తలంత్తు
నీదు మనసెంత్తు అంత్తె నంన్నియు శమింత్తు
ధన్యగుణహారి వేణగోపాల శౌరి.

## 8

### పుదుచేరీ నవాబుజాబు

"మహామహు అవాలిమర్త బకుమ వుక్తు మమాలీ మంజాలకు మలాజు మెహరుబాణ్ మెకర్రం మెకలీసాణ్ మహారాజ అమర శింహ్మరాజ్ శల్లమల్లాహులతాలా.

మేమున్నూ ఖుషీని వుంన్నాము. మీ ఖుశాలినామాహమేశా వ్రాయించ్చి పంప్పింస్తూ రావలెను. త॥ విలాయితీహుకుం ప్రకారం పుదుచేరి వగయిరా యీప్రదేశాలను ప్రాంసువారి తాలూకాలుక్కు మంత్కును గవ్రనరుహోదా మెకర్రరుచేశి రవాణా చేశినారు గన్కు యిక్కడ దాఖలు అయినాము. పూర్వాపూర్వంనుంచ్చి ప్రాంసు సర్కార్కు౦న్నూ త్మ సంస్థానానకున్ను వదుముకొని వస్తూవుంన్న దోస్తియు త్రిపాకు దినేదినే మాదినములయ్ంద్దు అధిక అభివృద్ధి కాగలంద్లుకు మావల్లనయ్ని ప్రయత్నములుచేసి మీ స్నేహం సంపాదించ్చవలెనని మామనస్సున పూర్తిగావుంన్నది. త్మ అంతఃకరణలోనున్ను అదే మేరకు వుంన్నదనే అభిప్రాయం మాకు ముందుగా వుంన్న గవునరు వారి వుత్తరప్రత్యుత్తరాల వల్లను మాకు బాగా తెలిశి అధిక సంతోషంగావుంన్న మొదలయ్ని అభిప్రాయములు శేతురాయలు త్మకు తెలిపింమ్చును గన్కు జ్యాదా వ్రాయగలది యేమి వుంన్నది. మామే హామీఖుయిరా క్షేమకు సమాచారంలు వినకోరివుంన్నాము. ఖాతీర్కు శేవలెను.

# జగత్తులోని భావపరిణామము

గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు

'యుగేష్వావర్తమానేషు ధర్మోప్యావర్తతే పునః' యను స్మృతివచన మొకటి ధారాళముగా మనపూర్వులచే నిర్వచింపఁబడినది. కాలము దొర్లుచు ధర్మమునుగూడ దొర్లించుననుట దీనిభావము. సృష్టినుండి నేఁటివఱకు మానవుఁడు కొన్ని హేతువాదముల మూలముననునమ్మకములవలనను జ్ఞానమలవఱచుకొనుచున్నాఁడు. ఒక్కొక్కవస్తుతత్త్వముయొక్క జ్ఞానములోఁదునకుఁ జొచ్చినకొలఁది నావస్తువుఁ గూర్చిన యభిప్రాయము మాఱవచ్చును. భూగోళాది సమస్తగోళములకు గ్రహములకు నక్షత్రములకు నిలయమగు నీబ్రహ్మాండభాండ మనుక్షణము సృష్టిస్థితిలయములకుఁ గారణమై నిత్యపరిణామ మందుచున్నదని తజ్జ్ఞులు నిర్వచించుచున్నారు. అట్లే మానవునిభావముకూడఁ బరిణామ మొందుచున్న దేమో విమర్శించిచూచెదము గాక!

మునుమున్న విజ్ఞానముగూర్చిన భావ మెట్టిపరిణామమున కాకరమైనదో యనిన:—ప్రకృతికంతకు మూలాధారమైన మొదటివ్యక్తి యేదియో యది జగత్తుసృష్టించునాఁడే సమస్తవిజ్ఞానము మొదటి మానవున కర్పించియుండె నను భావమొకటి దాదాపు ఇప్పటివఱకు విజృంభించియున్నది. కాని ఈభావ మట్లనేయుండలేక యనేకభౌతికశాస్త్రములయొత్తిడి మెత్తగిలి సాగి యిప్పటికిని విజ్ఞానమభివృద్ధినొందుట కవకాశమున్నదని కొన్నినాళ్లు, సృష్టిచూచిన నాఁటిమానవుఁడు జంతుసమానుఁడట, నేఁటివాఁడు నాఁటివానికంటె నెన్నోమడుంగులు జ్ఞానసంపాదన చేసియున్నాఁడని, కొన్నినాళ్లను ద్యోతకమగుచున్నది. మొత్తము మీఁద విజ్ఞానభావపరిణామము స్పష్టముగాఁ గనఁబడుచున్నది.

దేవునిగూర్చియు నిట్లేయభిప్రాయము. ఆదినుండి తుదివఱకు నొక్కవిధముగ నుండక కాలానుసరణముగఁ గలసుండువడుచున్నదనుట సూక్ష్మముగనే తెలిసికొనవచ్చును. కాలప్రవాహమున కాదినుండియు నంటికొని వెంటాడించుచున్న గ్రంథరాజము వేదముకదా! అందు మొదట మానవుఁడు తనకు దృష్టిగోచరమైన ప్రతివిచిత్రభూతము నొకదేవతగా భావించి యట్టివన్నిటిని తనయభ్యుదయమునకై సాయపడుమని ప్రాధేయపూర్వకముగ స్తుతించుటయే కనంబడును. అట్టిది క్రమముగ మారి యామానవాతీతభూతజాతమున కంతకు ప్రభూతమైన యొకమహాశక్తి వానినన్నిటిని సక్రమముగా నిగ్రహానుగ్రహసమర్థతతో నిర్వహింపఁగల్గి కలదియుండవలెననియు, నట్టిశక్తియే దేవుఁడు, వాని నారాధించిన చాలు చిల్లరచిన్న దేవతలకై తడవులాడ నవసరములేదను భావమొకటి ప్రబలినట్లు నిదర్శనములు కలవు. అదియు శాశ్వతముగ నిలిచియుండజాలక "దేవుఁడనువాఁడొకచోటనేయుండి యింతబ్రహ్మాండమును పాలించుట యసంభవము. అనంతవిశ్వవ్యాపకుఁడనంతుఁడై యుండవలెను. సర్వాంతర్యామి సర్వశక్తివంతుఁడై విజృంభింపవలెను" అను భావము రేకెత్తినంతనే యదియు నట్లే చాలకాలముండఁజాలక "దేవుఁడను పురుషశబ్దమవసరములేదు. శుద్ధ బుద్ధ ముక్తస్వరూపమగు బ్రహ్మపదార్థమే యనిర్వాచ్యముగ నింత విశ్వముగ బరిణమించి తాను సర్వాంతర్యామియై సర్వశక్తిమంతమై యనంతమై యున్నదనుటయే సిద్ధాంతము" అను భావముగాఁ బరిణమించినది. ఇదిమాత్రము నిలబడఁగల్గినదా? లేదులేదు. "ఆబ్రహ్మపదార్థమే నేను నేనే యీవిశ్వస్వరూపమును. నాకంటె భిన్నమైన వస్తు వీవిశ్వమున లేదు. నేనే అనిర్వాచ్యముగ నన్నావరించి, మాయయను నజ్ఞానవశమున నన్నుఁ గింపిజ్ఞుఁడనుగా భావించుకొనుచున్నాను గాని నేనే సర్వజ్ఞుఁడను. నేనిప్పుడే యజ్ఞానముఁబోఁగొట్టుకొని ముక్తినొంది యాబ్రహ్మపదార్థమైపోవుదును. నేనొకవ్యక్తికి చేమోడ్ప నవసరము లేదు. నాకు చేమోడ్చుట కింకొకవ్యక్తియే లేదు" అను భావము గాఢముగ నిప్పుడు విచ్చలవిడిగఁ జెలరేఁగుచున్నది. "దేవతలు, దేవుఁడు, సర్వజ్ఞుఁడు, బ్రహ్మపదార్థము క్రమంబుగా నేనై 'యెట్లు పరిణమించినవో చూచినతరువాత ధర్మముఁగూర్చియు, దత్తుల్యముగనే యూహింపవచ్చును. శత్రుసంహారము ధర్మము. దుష్టశిక్షణము ధర్మము. ఆహారమునకై జంతుసంహారము ధర్మము. దండోపాయము అంతిమోపాయమైనను ధర్మమే! అనునవి, క్రమముగా మాఱి హింసధర్మము కాదు, అహింసయే పరమధర్మము; శత్రువునైన క్షమించి యాతఁడొనర్చిన యకృత్యములకుఁ దానే శాంతియుతముగ బాధలందుట పరమధర్మము; దుష్టునైనను బ్రబోధించి పునీతునొనర్చుటయే పరమధర్మము; ఆహారమునకై యననేల! అజ్ఞానకృతముగనొనర్చిన జీవహింసయు బాపభూయిష్ఠమే. కావున దనవలెనే యందఱను అన్నిజీవములను బ్రేమించుట పరమధర్మము; అను భావములుగా స్పష్టముగా మారిపోయినవి. ధర్మము వెనువెంటనే నీతియు మాఱిపోవలసినదే. ధర్మమునకు నీతికి నట్టియవినాభావసంబంధమున్నది. కావున నైతికభావపరిణామమునకు వేఱ నిదర్శనము లవసరములేదు. నీతిధర్మములతోఁ బుణ్యపాపములు బరువెత్తవలసినవి. ధర్మాధర్మములకు బుణ్యపాపములు ఫలములే కావునఁ బ్రత్యేక వివరణము కోరవు. కావున నవి వదలి యితరసాంఘికభావము లెట్లు మారజొచ్చినవో కనుగొందము.

సృష్ట్యాదినున్న మొదటిమానవుఁడు ఒంటరియై స్వేచ్ఛగా నొకస్త్రీవ్యక్తినైన వెంట దగిలించుకొనక యవసరము వచ్చినప్పుడు సమీపించిన వ్యక్తులను వస్తువుల నుపయోగించుకొనుచు సుఖపడెనని మన మూహింపవచ్చును. అట్టివాఁ డెట్లో కొన్నినాళ్లకు ఒక్కస్త్రీనిమాత్రము తననిత్యసహచారిణిగా బరిగ్రహించియుండవలెను. అంతటితో సంతానము

కలిగి తనకుటుంబమను సాంఘిక భావ మేర్పడియుండవలెను. మానవ జాతి పెరిగినకొలది మానవకుటుంబములు గుమిగూడి గుంపులుగూడి కొన్నాళ్లు తిరిగి తిరిగి యిఁకఁ దిరుగలేక యొకవాసయోగ్యమగు నివాస స్థలమున బల్లెలు, గ్రామములు కట్టుకొని కొన్నాళ్లు జీవించుటలో సాంఘికధర్మము-తద్భావము విజృంభించియో సంకుచించియో పరిణామ మొంది యుండవలెను. పదేసికుటుంబములు గుమిగూడి కలసి మెలసి యుండుటలోకంటె లక్షలకొలఁది కుటుంబము లొక్కచో సఖ్యభావమున మెలఁగుటలో నెన్నోవిధముల సాంఘికభావము పెంపొందక తప్పదు. ఎంతో సహనగుణము స్వార్థత్యాగము ఒంటరిగా నున్నప్పటికంటె లక్షలకొలఁది గుమిగూడిన గొప్పజనసమూహమున నెల్లప్పుడు బ్రదుకునప్పుడు పొందియుండవలసియున్నది. విశాలమగు మైదానముండదు. స్వేచ్ఛ లేదు. స్వచ్ఛందవిహారము కూడదు. తనసౌఖ్యమే యగ్రగణ్యముగ నెంచరాదు. నలుగురితో సంతోషింపవలెను. సంతసించవలెను. సంచరింపవలెను. తుదకు చావవలెను. అప్పటికి నిప్పటికి మానవుడు తన సాంఘికజీవనమునం దెంతటి మార్పుచెందినాఁడో కనుగొనినచో నాశ్చర్యము కలుగక మానదు. ఇదియింతటితోఁ బోయినదా? పల్లె మీఁదనున్న యభిమానము తననాడంతయు బ్రసరింపవలసివచ్చినది. తుదకు తనదేశములోనివారెల్లరు తనవారని యభిమాన ముదయించినది. ఇతరదేశీయు డన్నతోడనే యీర్ష్యకలిగినది. ఒకరిదేశ మొకరాక్రమింపఁ జేరాశ పుట్టినది. ఘోరసంగ్రామములలో లక్షలకొలఁది ప్రజలు తోడిమానవులకొఱకు తమ దేశాభిమానముఁ బురస్కరించుకొని ప్రాణములు విడిచి జీవితములఁ దుదముట్టించుకొనునంతటి తీవ్రపరిణామము సాంఘిక భావమునఁ బొడసూపినది. ఇదిమాత్రము శాశ్వతముగ నుండఁగలదా!! అప్పుడే యొకమూలనుండి మానవుఁడు "ఓహో వలదు వలదు. క్రూరదేశాభిమానపురస్సరముగ నొండొరుల కుత్తుకలఁ గఱకుఱ నఱికికొని రక్తప్రవాహము వెల్లువలై పారించుట వలదు! వలదు; ఏదేశవాసులైన మానవులే. బ్రహ్మాండభాండములోని యణురూపములగు మీరందఱు సమానులే! సోదరులే! ఒక్కరే! వేఱుగారు! రండు, రండు. అన్యోన్యభ్రాతృభావమున బ్రదుకుఁడు. వలదీయుద్ధములు. వలదీభీషణభావనములు" అని విశ్వమానవ సౌభ్రాతృత్వ మాపాదించుమ నుద్ఘోషించుచున్నాఁడు. కావున సాంఘిక భావము సహితము దైవభావమువలెనే బ్రహ్మాండమంతయు వలముకొని సంపూర్ణప్రేమస్వరూపమై కొన్నినాళ్లకైన మానవకళ్యాణమునకుఁ దోడ్పడకమానదు.

ఇంకఁ గొన్ని యితరవిషయములందు మానవుఁడు భావపరిణామ మొందించుకొనక యూరకున్నాఁడా? భాషావిషయములోఁ గవిత్వాది కళలలో శాస్త్రములలో సమస్తవిషయములందును తన భావప్రణాళికల తారుమారొనర్చుకొని పూర్వమునకు నిప్పటికి నేమాత్రము పోలికలేకుండఁ జేసికొనియెను. వేదకాలమునాఁటిపూర్వమునకై మనము పోకుండ మనకు సప్తపురుషాంతరములకుఁ బూర్వమున్న మనవృద్ధప్రపితామహుని కడకు మన మేమాయచేతనో వర్తింపనేగఁగల్గినచో మనముముందువచ్చి చిక్కు,మాట వానికి మనవానిమాట మనకుఁ దెలియదు. అతఁడు కేవలము తుఱికి మమిశాపుచేసి సంస్కృతములో పాదిగి యచ్చతెనుఁగులో నదిమి యాంధ్రపుముక్కలు మనకందింపఁబోవును. మన మాయాంధ్రమునే యింగ్లీషులో గలిపి సంస్కృతముతో మెదాయించి తెనుఁగు తారుమారొనర్చి యాంధ్రమే మాయనుకొనునట్లు వానితోఁ బ్రసంగింపఁజాలుదుము. అంతటితో వానిమాట మనకు మనమాట వానికిఁ దెలియక కొట్టుమిట్టాడ వలసివచ్చును. పోనిండు; భావములైన సమీకరించుచేమో? మన వేషము,మనవైఖరి, మనమర్యాద వానికెంతమాత్రము నచ్చక యాతఁడొకవేళ కోపోద్రేకమున "ఛీ! ఛీ! నీవు నాకు మునిమనుమఁడవా! కావు, కావు; పో! పో!" యని తూలనాడనైన నాడఁగలఁడు. ఇఁక వేదకాలమునాఁటి మానవునిసమీపించెదమని యెట్లు సాహసింపగలము? వేదకాలమానవుఁడు మనల మనుజులఁగానైన నంగీకరింపఁడు. మనల నొక జాతిద్విపాత్తులనుచేమో యని శంకింప మొదలిడును. లేక భాషావ్యవహారములందు వానితనికి మనకెంతమాత్రము సమన్వయము లేదు. భారద్వాజసగోత్రీకుఁడను నేను మాయాలపురుషుఁడు కదు మన్నింపఁడాయని భారద్వాజమహర్షి యున్న పురాతనకాల ప్రవాహప్రారంభస్థాన మధిరోహించి దర్శించుచునంతనే యాతఁడు నన్ను "నీవేజాతిజంతువవు" అని సంస్కృతమునో ప్రాకృతమునో ప్రశ్నించును. "నేను నీమునిమనుమఁడను, నీవంశములోనివాఁడనే,నన్ను మఱచిపోతివా?" యని తెనుఁగులో జాగ్రతగా మఱియితరాన్యదేశీయసంసర్గము లేకుండ జవాబిచ్చినను అతఁడయ్యది దివ్యదృష్టిదివ్యజ్ఞానము లేనిదే గ్రహింపఁజాలఁడు. అపంచగడ్డములు, అప్పుడుగోచీ, ఆయాజానులంబితీర్ఘబాహువులు, ఆపాదుకవు, ఆటింకము,ఆపాంకము నాకుఁగన్నులకుమిఱుమిట్లు గొలుపును. నా హ్రస్వరూపము,నాగోగురుదు సెంగము, వదులునోడలు, చిడిముడినడలు అతనికసహ్యము గొలుపును. ఇట్టి యాశాభంగమునకు నాఁటినేఁటి భావపరిణామమే కారణమని నిర్విణ్ణుఁడనై చక్కరావలసినదే!

శాస్త్రీయములగు సంగతులు, నిట్టే పరిపూర్ణభావపరిణామము లందినవని చూపి చెప్పవచ్చును.

పూర్వ మచలమై తనచుట్టునే సమస్తగ్రహముల నక్షత్రములఁ బ్రదక్షిణ మొనర్పించుకొన్న భూమికి నేఁడు గిరగిర తనచుట్టు తానే ప్రదక్షిణ మొనర్పవలసిన దురవస్థలోనికి దిగినది. ప్రళయసమయమందైన పూర్వము ద్వాదశార్కులకంటె నెక్కుడు లేకుండనుండ నిప్పుడు "ప్రతినక్షత్రము బహుదూరమున నుండుటచే మినుకుమినుకు మనుచున్నది. కాని యదియు నొకసూర్యుఁడే. వేయివేల అనంతకోటిసూర్యులు నిశ్చయముగానున్నారని" మానవుడు స్వశక్తిచేత జూడఁగల్గుచున్నాఁడు.

పూర్వము స్థావరములై నిర్జీవములైన పర్వతాదికములు సహిత మిప్పుడు సజీవములై పెరుగుట, విరుగుట, తరుగుట,తిరుగుట,యెరుగుట మొదలగు సమస్తజీవైక్యగుణములఁ బొడసూపి మానవున కద్భుతముగొల్పుచున్నవి. శాఖాహారము జీవహింసగాదని పూర్వము, పాపము, మనఋషు లంగీకరింప నిప్పటి కావృక్షలతాదికము లన్నియు నవరసోల్బణములై కొట్టిన నేడ్చి, తిట్టినఁదిట్టి, పాడినపాడి, మేపిన, మెచ్చి, పెంచిన విశ్వసించి, యితర జంగమజంతువులతో నననేల? మానవులతో సమానముగా జీవకళఁ గులుకుచున్నవి.

మానవుఁడు క్రమముగాఁ బరిశ్రమయొనర్చి, వృక్ష లతా శిలాదికముల భావప్రపంచమంతయు గ్రహించి, వాటితో ధారాళముగా మాట్లాడి ప్రేమించి విశ్వసౌభ్రాతృత్వ పరమావధియొక్క కొట్టకొన కెక్కఁగలఁడను సూచన లిప్పుడే కనంబడుచున్నవి. జీవహింస, కాదని శాఖాహారమభ్యసించిన ఋషిపుంగవుడు నేఁడుగీరపోనమో,నాయంభక్షణమో, యంతకంటె నహింసామార్గము పట్టవలెనన్న హఠయోగములోని రేచకమాత్రమున జీవితాంతమునకు నిలిచిపోవలసినవాఁ డగుచున్నాఁడు. తేడి మాంసముతో పితృతర్పణమొనర్చిన వేదకాలపుబ్రాహ్మణులకును, మినుపగారెలతో తంత్రీశ్రాద్ధము శ్రోత్రియముగా సాగించుచున్న యిప్పటి బ్రాహ్మణులకును, తారుమారుగాడ నెల్లఁజాలని తేటతేటి యహింసావ్రత

దీక్షాపరతంత్రునకును, వ్యత్యాస మెంత యుండఁగలదో యిట భావపరిణామ మెంతగాఢముగనున్నదో సూక్ష్మముగనే గ్రహింపవచ్చును.

“ఈగ్రామములు నావి. నాసంస్థానమిది. ఇది నాయైశ్వర్యము. పదేసిరూప్యములిచ్చి నాస్వంతమనుజులుగాఁ జేసికొన్న యీ పదిలక్షల సైనికులు నాగ్రామసంపాదనకై నాసంపత్ప్రవృద్ధికై నా సంతోషము తీర్చుటకై యెదుటివారిప్రాణము లపహరించుచుఁ దమప్రాణము లర్పింపఁగలరు. నాకేమికొదువ” యనుకొని జీవింపఁగల్గిన రాజిప్పుడున్నాఁడు. ఈతఁ డిప్పుడు సమస్తప్రజలకు తనరాజ్య మర్పించి చేతులు ముడుచుకొని వినయపాత్రమువర్ణించుకొనుచు వారిచ్చిన మనోవృత్తిఁ గుడుచుచు నొకమూల నొదిగియున్నాఁడు. ఇప్పుడు రాజెవఁడు? ప్రజలచే నెన్నుకొనఁబడి ప్రజలయనుమతితో మాత్రమే పాలింతునని వాగ్దాన మొనర్చిన సభాపతియే కదా యిప్పటిరాజు? తన యిచ్చవచ్చినట్లు ఒక నిమిషమైన నీసభాపతి నడువఁగలఁడా? ఈతఁ డొకగ్రహస్థితినిబట్టి ప్రజానురాగమును సంపాదించిన సామాన్యమానవకోటిలోనివాఁడేనా? వీని పదవి యెన్నాళ్లు? అయిదుసంవత్సరములే కాదా యీలనివైభవము? ఈవిధముగ రాజు మనుజ రేణువులలో దాఁగి బ్రదుకవలసినవాఁ డైనాఁడు. కోటీశ్వరుని గతి యేమగుచున్నది? పేదవారల నోళ్లు మన్నుగొట్టి లిఖితమాత్రమునఁ బదికోట్లకుఁ బడగలెత్తిన లక్ష్మీపుత్రున కిప్పుడు అవస్థ యేమో చూచితిరా? ఆతఁడు స్వకుటుంబభరణమునకు వలసిన యొక పెద్ద మొత్తము ఖర్చుపెట్టుకొనుటకుమాత్రమే యర్హుఁడట. మిగతధనమంతయు దేశధనాగారమున జేరవలసినదేనట. వానికి ధర్మవడ్డీమాత్రము గిట్టునట. ధనము సంపాదింపుచుండవలెనట. కాని దమ్మిడీ తనయిచ్చవచ్చినట్లు ఖర్చుపెట్టుటకు హక్కు లేదట. ఇంతటితోఁ బోక దేశములోఁ గల ప్రజలెల్లరు నొక్కకుటుంబములోనివారే యట. సమిష్టికుటుంబముకూడనట. గ్రుడ్డి కుంటి మొదలగు ననాథులెల్లరు దేశపరిపాలకసంస్థవలన పోషింపఁబడవలసినవారేనట. కూర్చుండి తినుటకు ఎవ్వనికిని సాధ్యము కాదట. నేర్చుకొన్న విద్యలననో అలవర్చుకొన్న పరిశ్రమకౌశలముననో, దేవుఁడిచ్చిన బాహుబలము నుపయోగించియో యెల్లరు కష్టించి జీవింపవలసినదే నట. ఇంతకంటె చిత్రమేమన, దేశములో నవతరించిన చంటిబిడ్డలెల్లరు దేశపాలకసంస్థయొక్క పోషణాధీనము చెందవలెనట. ఏబిడ్డకు చనుబాలు తక్కువ కాగూడదట. తక్కువైన వెంటనే యాగ్రామపాలనాధికారితో మనవిచేసినచో వారేఁడే చచ్చినట్లు పాలు సప్లై చేయునట. ఇట్లు మానవుని భావమెంతటి పరిణామమెందుచున్నదో యింక నెంత నొందఁగలదో యొకించుక విలోకించినచో గుండె లఱచేత నిడుకొని నిర్భరాశ్చర్య మందవలసినదే!!.

ఓహో మానవశ్రేష్ఠా! ఏమి యెంతపనిచేయఁగల్గుచున్నావు. ప్రకృతి యొసంగిన చిన్నబుద్ధి కాలప్రవాహమున గడిగి కడిగి విచ్ఛిన్నశిలాఫలకముల నూరి నూరి, స్వభావస్నేహమున మెఱుఁగు పెట్టి పెట్టి యెంతటి భావపరిణామ మొందించుకొంటివి! దేవునిఁ దీసిపారవైచి నీవే దేవుఁడనను చున్నావు. బ్రహ్మాండమంతయుఁ బ్రాకుచున్నావు. భూమిని నిమిషమున నొక వేయిమైళ్లు పరుగెత్తఁగలవు. జలములోను జలముపైని జలచరముకంటె వేగముగ నిర్బాధకముగఁ బోగలవు. వాయుమండలము దాఁటి విహంగమమైనావు. పంచభూతములనుఁ బిడికిటఁబట్టి యిచ్చవచ్చినట్లు త్రిప్పుకొనుచున్నావు. భూగోళములో నామూలనుండి యీమూలకు లిప్తలో వినఁబడునట్లు బొబ్బపెట్టఁగలవు. సంగీతము వినిపింపఁగలవు. నీస్వస్వరూపము శాశ్వతముగ ఛాయారూపమున నుంచఁగలవు. కుజాదిగోళముల లోని జీవరాశులకు కబురంపఁగలవు. సృష్టికి ప్రతిసృష్టి యొనర్పఁగలిగి బ్రహ్మదేవునపహాస్య మొనర్చుచున్నావు. పూర్వముకంటె నిప్పుడెన్నిరెట్లు పెరిగినావు! ఓహో నీవే దేవుఁడననుచున్నావు. అనుటతో నూరకొనక విశ్వమంతయు నీప్రేమ నీశక్తి నీప్రభ ప్రసరింపజేయుటకు మొదలిడినావు. “భళీ! భళీ! నీకింక నీసమస్త బ్రహ్మాండభాండము నర్పించి నేను నీలో లీనముకాకతప్ప” దని భగవంతుఁడు సహితము అబ్బురపడవలసినవాఁడై యుండవలెను. అంతటిపరిణామము జగత్కల్యాణమున కవసరమా లేక యిదియంతయు ప్రళయకారణమాయని మాత్రము సందేహము పొడముచున్నది. పూర్వమానవుఁ డిందు నింకను భక్తిగల యనుమాయకుఁ డిట్టిసంతయు జగత్ప్రళయసూచనలని భయపడక మానఁడు. కాని పరిశీలనకౌశల్యమున్న తత్వవేత్తమాత్ర మిట్టి ప్రభూతపరిణామ మంతయు జగత్తుయొక్క ముఖ్యలక్షణమేయని గ్రహింపఁగలఁడు. “ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, సర్వంఖల్విదం బ్రహ్మ, సోహం బ్రహ్మ” మొదలగు ఘనవాక్యము లుచ్చరింపఁగల్గిన పూర్వమానవశ్రేష్ఠుఁ డిదియంతయుఁ దన మహాదూరదర్శిత్వబలమునఁ జూచియే యిట్టిసత్యములు నిర్వచించినాఁడని మన మూహింపవచ్చును. ఇంత మహాసంచలనము – ఇంతపరిపూర్ణ భావపరిణామము ప్రపంచము నెక్కడకు లాగుచున్నదో కనఁబడుట లేదా? ఇదియంతయుఁ దైవత్వముల సంపూర్ణానుభవ వేదికకై పరుగిడుచున్నది. ప్రతిశాస్త్రము, ప్రతిభావపరిణామము ప్రపంచక మంతయు ఒక్కటనియు సర్వశక్తులు సర్వవస్తువులు, వేయునేల! యణువుమొదలు మహాత్ముఁ డుసుఁగల యనంతవిశ్వమంతయు నొక్క మహావ్యక్తిస్వరూప మని తెలియఁబఱుచుచున్నది. ఈపరిణామము ప్రకృతిలక్షణము కావున జరుగక తప్పదు. విశ్వసామ్రాజ్యమునకై గుటిపడియుండిన భావపరిణామము జగత్కల్యాణమే యొనర్చును. ఇందు సంశయింపఁబని లేదు. ఈ పరిణామాంభోనిధి మహోత్తుంగతరంగడోలికలనుయ్యాలలూఁగుచు విలాసముగ మానవుఁడు ఆసకలకల్యాణగుణాకరుఁడైన విశ్వేశ్వరుని యాస్థానము నాక్రమింపఁబోవుచున్నాఁడు. వానితో జగమంతయు నాతనివెనకేపోక మానదు. వెనుకాడి, వెఱ్ఱిసందేహములను సుడిగుండములఁ జిక్కికొన్న వారు సహితము కాలప్రవాహవేగమున కెప్పుడో యాసుడిగుండముల పరిభ్రమణవలయముల దాటి కొంతయాలస్యమైనను ముందుఁబోవుచున్న మానవశ్రేణివెంటఁబడి గమ్యస్థానముఁ జేరితీరుదురు. ఈ పరిణామవ్యవస్థ కెదురీఁదుట దుస్తరము. అపాయముకూడను. కావున వివేకముగల భారతీయులును పరిణామడోలికల నధిరోహించి సర్వాంతర్యామియైన విశ్వేశ్వర దర్శనాభిలాష వలవఱుచుకొనుట, మేలుకొని, వెనుకాడి వెఱ్ఱులై శంకాపంకములఁ గ్రుంకుచుండుట, మంచిదికాదు. ఇంతకుఁ ప్రకృతిలక్షణమేయైన భావపరిణామాంతర్గత మహాశక్తి యెంతటి మందునైన నాదరించి దేవసత్తి యత్యుత్తుంగ తరంగముల కెక్కింపక మానదు.

# ఆంధ్రపత్రిక - ఉగాదిసంచికలు

సత్తెనపల్లి హనుమంతరావు గారు

తెలుగునాటియందుద్భవించి, అస్తమించి వ్యాప్తియందున్న పత్రికలన్నిటిలో నెన్నికగన్నది ఆంధ్రపత్రిక. ఆంధ్రపత్రిక కీలక నామసంవత్సర భాద్రపద శు ౧౪ బుధవారమునాడు బొంబయినగరమునం దవతరించినది. పత్రికాభివృద్ధికి పత్రికాధిపతుల యితర యోగ్యతలతో పాటు అమృతాంజనమును సాయమొనర్చినది. ఆంధ్రుల రాజకీయ, జాతీయ, సాంఘిక సారస్వతోన్నతుల గన్పరచిన ఆంధ్రపత్రిక కాధారభూతమగు నమృతాంజనము నిజముగ నాంధ్రుల యజ్ఞానధ్వంసమునకు అమృతాంజనమే. ఆంధ్రపత్రికాతత్త్వమును గ్రహించుటకుగాని, విశదీకరించుటకుగాని నేన సగ్గుడనైనను, ఆంధ్రపత్రికల యభివృద్ధిపై నాకుగల యభిలాషయే నన్నీ పత్రికాచరిత్రము స్థూలదృష్టిని వ్రాయ ప్రేరేచినది. ఆకృతిలోనేమి!- విషయబాహుళ్యములోనేమి!- ఔదార్యమునుజూపుటచేతనే, ఆంధ్రపత్రిక విరివిగ చదువరుల నారంభమునందే యాకర్షించినది. ఆంధ్రపత్రికాపఠనమునకై గ్రాహకులెక్కువగ నగుటకు స్వల్పచందాగూడ తోడైనది. ప్రథమమున ఆంధ్రవారపత్రికచందా రు ౨-౨-౦లు. ఈస్వల్పచందాకుతోడు చిత్రపటసంశోభితమును, వివిధవ్యాసవిరాజితమును, సర్వాంగసుందరమును, అద్భుతోపయోగప్రదమును, ఆకర్షణీయమును, అమూల్యమునునగు ఉగాదిసంచిక చందాదారులకు ఉచితము. ఇంతచౌకగ లభించిన, పత్రికను గొనువారి కేమిలెక్కువ? అప్పటికప్పుడే ఆంధ్రపత్రిక అందరకును పరిచయమైనది. పల్లెటూరిప్రజలు, పట్టణవాసులు, పండితులు, పామరులు, రైతులు, వర్తకులు, రాజకీయవేత్తలు వీరు వారననేల నందరును ఆంధ్రపత్రిక నాదరించినవారే. సామాన్యజనసౌకర్యమునకై అల్పమగు చందాను నిర్ణయించుటచేతను, చదువరుల స్వాంతము లలరించుటకై విశేష, విదేశవార్తలను, విపులవిషయములను విశదీకరించుటవలనను, విలువగల ఉగాదిసంచిక నుచితముగ చందాదారుల కొసగుటకు పత్రిక అధికవ్యయప్రయాసలకు లోనుగావలసివచ్చినది. అర్థికముగ ఆంధ్రపత్రిక కమృతాంజన మెంత యాధారముగుచున్నను, చందాను పత్రికాధిపతులు క్రమక్రమముగ హెచ్చుచేసినారు. అప్పటికేకాదు యిప్పటికైనను హెచ్చుచేసిన చందా యితరాంధ్రపత్రికల చందా లన్నిటికన్న తక్కువదే!

ఈస్థితియందే ఆంధ్రావనీసమీపమునకు పత్రికను జేర్చుటకును, స్వీయముద్రణాలయమును సంపాదించుటకును పత్రికాధిపతులు కృషిసలిపినారు. వారికృషి సఫలమైనది. మదరాసునగర మాంధ్రేతరప్రాధాన్యము గలదైనను, ఆంధ్రుల కతి సన్నిహితసంబంధము గలదు. ఆంధ్రపత్రిక ప్రమాదీచసంవత్సరాంతమున మదరాసునగరమునునివాస మొనర్చుకొనినది. స్వకీయముద్రణాలయమును సంపాదించినది.

## ఆంధ్రోద్యమము

తోడిదేశములగు వంగ మహారాష్ట్ర ఘూర్జర ద్రావిడములతో బోల్చుకొనిన మనయాంధ్రదేశస్థితి వెనుబడియున్నది. ఆంధ్రులు, ఆంధ్రభాష, ఆంధ్రదేశ గౌరవపోషణములకు మన యాంధ్రపత్రిక చాల సేవ యొనర్చినది. అందులకు ఫలముగ ప్రారంభింపబడినదే ఆంధ్రోద్యమము. ఆంధ్రోద్యమమున కీపత్రిక యొనర్చిన ప్రబోధ మమూల్యమైనది. ఆంధ్రపత్రికాజననమె, ఆంధ్రపత్రికాకృషియె, ఆంధ్రోద్యమము నారంభించినదనుట అతిశయోక్తిగాదు. ఆంధ్రపత్రికాధిపతుల బోధనలచే నేమి, దేశీయుల సంతతపరిశ్రమచే నేమి, ఆంధ్రత్వము భారతజాతీయమహాసభ గుర్తించినది. ప్రభుత్వపక్షమువారును క్రియలలో వెనుకాడినను, మాటలలో మన్నించినారు.

ఆంధ్రుల కనుదినమును ఆవశ్యకవిషయముల నవగాహ మొనర్పదగు ఆంధ్రదినపత్రిక లేనికొరతను ఆంధ్రపత్రికాధిపతులు గుర్తించినారు. ఇదివర కెందరో యత్నించి, ఆరంభించి, విఘ్నపరంపరలజిక్కినారు. అన్నిట అధోగతియందున్న దేశ ముద్ధరింపబడుటకు దినపత్రికావశ్యకతను గ్రహించిన వారెంతకాలమో యుపేక్షింపలేదు. తమ సంకల్పమును దేశీయులకు చాటినారు. వారి సాయసంపదలను సేకరించినారు. ఆనందసంవత్సర చైత్ర శు ౯ నాడు ఆనందప్రదముగ ఆంధ్రదినపత్రికా ప్రచురణమారంభించినారు. ఆంగ్లభాష నెరుగని యాంధ్రులకు దినపత్రికాపఠన ప్రాప్తి కలిగినది. ఆంధ్రుల ప్రత్యేకవ్యక్తిత్వమును వెలువడినది. దైనికపత్రికామూలమున నాంధ్రదేశమం దొక నూతన తేజ ముదయించినది. మతసభలు, సాంఘికసభలు, భాషాసభలు, రాజకీయసభలు, గ్రంథాగారసభలు, విదేశవార్తలు ప్రభుత్వ లోతుపాతులు సమస్తమును ఆంధ్రుల కవగాహము కాబడినది.

## ఐరోపా మహాసంగ్రామము

ఈసమయముననే ప్రశాంతశాంతిసముద్రము నల్లకల్లోల మొనర్చిన సంగ్రామఝంఝామారుతము ప్రచండతరముగ వీచినది. వీచికలు మనమదరాసురాజధానికిగూడ సోకినవి. ఆతరుణమున ఆంధ్రదినపత్రిక ప్రత్యక్షముగాని తపాలకు చేరి ఆంధ్రదేశమున లేదు. తపాలు సౌకర్యము గల ప్రతిపల్లెకును దినపత్రిక వ్యాపించినది. దినపత్రికా ప్రతులు వేనవేలు ముద్రించుటతో కార్యాలయము నిమగ్నమైనది. ఆదివారమున గూడ సంగ్రామవార్తల ప్రకటించినారు. ప్రత్యేక చందాదారులకే కాక ఆంధ్రపత్రికను కొనదలచువారికందరికిని రైలుస్టేషనులలోను, అంగళ్లలోను, ఆంగ్లపత్రికలతోపాటు విక్రయింపబడు నేర్పాటు లొనర్పబడినవి. యుద్ధకాలమున చౌకగ పత్రికను ముద్రించుట దుష్కరమైనది. పాఠకలోకతృప్తికొరకు విపుల విశేష లేఖనములను, యుద్ధవార్తలను

వ్యయప్రయాసలకులోనై క్రమముగ ప్రకటింపుచు సంపాదకులుపత్రిక చందాను హెచ్చించినారు. పెరిగినచందాను సంతోషముగ భరించి ద్విగుణీకృతోత్సాహముతో గ్రాహకు లెక్కువగ చేరి ఆంధ్రపత్రికను నాదరించిరి. నిత్యమును విరోధాహారణరంగమున కండ్లరెదుట జరిగించినట్లు వర్ణించు పత్రికాధిపతుల లేఖినీప్రభావ మెంతయు పొగడదగినది. ప్రారంభమున ఆంధ్రదినపత్రిక చందా రు ౧౨ లు. దైవానుగ్రహమున యుద్ధాగ్ని చల్లబడినది; అపత్సమయమున ప్రభుత్వమువారొసర్చిన వాగ్దానము లుత్సాహముతో నెరవేర్చుటకు మారుగ సంకుచితమొనర్ప యత్నించినారు. మరియు నిరంకుశపరిపాలనాస్త్రమును ప్రజలపై సంధింప బూనినారు.

## మహాత్మాగాంధి - సహాయనిరాకరణము

ఆసమయముననే లోకోత్తర పురుషులగు గాంధిమహాత్ములు భారత రాజకీయరంగమున ప్రవేశించినారు. పాలకజాతిస్వార్థమును, పాలితుల అమాయకత్వమును విధ్వంసమొనర్ప సత్యాగ్రహమంత్రమును జపించినారు. అంతటితో ప్రభుత్వముపై ప్రజలకుగల వ్యామోహాకిరణములన్నియు పటాపంచలైనవి. అందుకుఫలముగ పంజాబులో ప్రజలు పలుబాములకు లోనై ప్రఖ్యాతిని గనినారు. తరువాతనే ఆసహాయవాద మవతరించినది. ఆర్యావర్తము నట్టిట్టూగించిన యీయగాధగాథల నన్నిటిని ఆంధ్రదేశమున కతితీవ్రముగ వ్యాపింపజేసిన దాంధ్రపత్రికయొసుడీ! ఆంధ్రదినపత్రికాసందర్శనమహాభాగ్యమున ఆంగ్లభాషా పరిచయములేని చాలమంది ఆంధ్రులిప్పుడు భారతరాజకీయమున నేమి, ప్రభుత్వవిధానముల నేమి, ప్రపంచస్థితిగతుల నేమి, తాము శల్యపరీక్షరొనర్చి గ్రహించుటయేకాక యితరుల కతిసంబోధకముగ బోధించుటకు తీర్ణులైనారు. ఆసహాయవాదము నాంధ్రలోకమున వ్యాపింపచేయుటతోపాటు ఆంధ్రపత్రిక భారతజాతీయమహాసభావ్యవహారముల నన్నిటిని పూసగ్రుచ్చినట్లు విశదీకరించుచున్నది. ప్రత్యేకమొకదినపత్రికయే ఆంధ్రుల కింతటి విజ్ఞానము నను గ్రహించినప్పుడు పలుపత్రికలు ప్రచారముగల పాశ్చాత్యు లెంతటిధన్యులో? ఆంధ్రుల విజ్ఞానకోశమున ఆంధ్రపత్రిక చరాస్తి. చరాస్తి యెంతవిలగలదైనను స్థిరాస్థియు నవసరమేకద. అట్టివే ఉగాదిసంచికలు. ఈసంచిక లాంధ్రుల గ్రంథాగారముల, గృహముల, కరముల, నలంకరింపదగినవి. ఈసంచికలన్నిటి నొకపరిసింహావలోకన మొనర్చి యీవ్యాసమును ముగించుచున్నాను. ఆంధ్రవారపత్రిక నేటిచందా రు ౪-౮-౦ లు. దైనికపత్రిక చందా రు ౨౪ లు. ఆంధ్రపత్రికతోపాటు దేశాభివృద్ధి కమూల్యసేవ నొనర్చు పత్రికల కన్నిటికిని నాకృతజ్ఞతను యిందుమూలముగ దెలుపుచుటకు వ్యాసబాహుళ్యమున జంకితిని.

## ౧. సాధారణ సంవత్సరాది సంచిక

తెలుగుపత్రికలపక్షమున ప్రచురింపబడిన ప్రథమసంవత్సరాది సంచికయే యిది. ఈసంచికయందు బ్రిటిషు సామ్రాజ్యాధిపతులు, భారతస్వతంత్ర సంస్థానాధిపతులు, ఆంధ్రదేశమహారాజులు, రాజులు, రాష్ట్రీయగవర్నరులు, ప్రభుత్వోన్నతోద్యోగులు, భారతదేశ సేవాధురంధరులు, ఆంధ్రదేశాభిమానులు, కవులు, పండితులు, యోషిద్రత్నములు మున్నగువారు చిత్రింపబడినారు. మేలైన కాగితములపై ౧౨౫ చిత్రము లీసంచిక నలంకరించి తమ్ము దర్శించువారల తన్మయుల నొనర్చినది. ఆయుర్వేదమునుగూర్చియు, వాఙ్మయ మత సాంఘికములను గూర్చిన ౨౪౫ పుటల విద్వాంసుల వ్యాసములు గలవు.

## ౨. విరోధికృన్నామ సంవత్సరాదిసంచిక

గతసంచికలో ముద్రింపబడని స్వదేశ సంస్థానాధీశ్వరులు, ఆంధ్ర జమీందారులు, భారతదేశనాయకులు, పుణ్యక్షేత్రములు, దేవాలయములు, గోపురములు మున్నగు ౨౧౦ చిత్రపటములును వివిధవిషయములపై ౬౦ వ్యాసములును గలవు. పెక్కురు విద్యాధికు లీవ్యాసముల రచించి ఆంధ్రావబోధ మొనర్ప సాయపడుచున్నారు.

## 3. పరీధావి సంవత్సరాదిసంచిక

ఈ సంచికయందు ఏడవ ఎడ్వర్డు ప్రభువర్యుని కుటుంబముగలదు. ఢిల్లీదర్బారుప్రదర్శన మతిశ్లాఘనీయముగ ప్రదర్శింపబడెను. దర్బారునకు సంబంధించిన పటము లానందదాయకముగనున్నవి. దర్బారు దర్శనాగంతుకులగు మహారాజుల పటములు పెక్కులు గలవు. ఢిల్లీ పురాతనకట్టడములులు చూపబడెను. మొత్తమీసంచికలో ౧౬౨ చిత్రము లున్నవి. శ్రీపంచమజార్జి సార్వభౌముని రాజ్యాభిషేచనవర్ణనాదులనుగూర్చిన యనేకకవీశ్వరుల పద్యము లిందు గలవు. ఢిల్లీనగర వర్ణనమును, జార్జిచక్రవర్తి ఢిల్లీ పట్టాభిషేకోదంతమును, కొన్ని స్వదేశ సంస్థానాధీశుల చరిత్రములును వ్రాయబడినవి. ఈసంచికలోని గొన్నివ్యాసములకు పత్రికాధిపతులు బహుమతు లొసగినారు. మనరాజధాని లోని ముఖ్యపట్టణముల జనసంఖ్యయును, తెనుగుమండలముల జనాభాయు నిందు గలవు. దీనిని దర్బారుసంచిక యనవచ్చును.

## ౪. ప్రమాదీచ సంవత్సరాదిసంచిక

ఇందులో ఆంధ్రరాష్ట్రీయపట మొకటి వివిధవర్ణములతో చిత్రింపబడినది. ఆంధ్రోద్యమవ్యాప్తి కీపట మే పునాది. ఆంధ్రుల నుద్బోధించు దివ్యచిత్రము లెన్నియో కలవు. పుణ్యక్షేత్రముల దేవాలయముల గోపురముపటము లాంధ్రుల శిల్పవిద్యానైపుణ్యమును జాటుచున్నవి. హార్డింజిప్రభువర్యుని ఢిల్లీప్రవేశోత్సవపట మీసంచికముఖపత్రము నలంకరించినది. ఇన్నూరుపటము లీసంచికలో నున్నవి. ఇందులో వ్యాసములు తక్కువైనను రాజకీయసంబంధములు ౧౦ గలవనుటచే ఆంధ్రుల యభిరుచి మారుట తెలియగలదు. భాషావిషయికవ్యాసము లారుగలవు. మతసాంఘికసంబంధాదికవిం లిరువదియారుగలవు.

## ౫. ఆనంద సంవత్సరాదిసంచిక

ఇది ఆంధ్రపత్రికాస్వకీయ ముద్రణాలయమున మదరాసులో ముద్రింపబడినది. బొంబయి తత్వవివేచక ముద్రణాలయముయొక్క పనితనమునకిది యేమాత్రమును తీసిపోవుటలేదు. చెన్నపట్టణమున గల ముఖ్యభవనములును, ప్రభుత్వ మందిరములును, కళాశాలలును, దేవాలయములును, ఇందు ముద్రింపబడినవి. మదరాసు రాజధాని సంబంధించిన చిత్రములే యిందెక్కువగ నున్నవి. బొంబయి రాజ

కీ. శే. వడ్డాది తిమ్మరాజకవిగారు



Late V. Timmaraja Kavi Garu,

కీ. శే. వడ్డాది రంగరావు



Late V. Ranga Rao

కీ. శే. పేరాల లింగరాజుగారు



Late Perala Linga Raju Garu.

శ్రీ మిర్జా నల్లపరాజు అచ్యుతరామరాజుగారు



Sri Mirja Nallaparaju Atchyuta Rama Raju Garu

కీ. శే. తాళ్లూరి చంద్రశేఖరరావు గారు



T. Chandrasekhara Rao Garu.

శ్రీ మాచిరెడ్డి వెంకటస్వామి రెడ్డిగారు



M. Venkataswami Reddi Garu.

వ్యాసకర్త: శ్రీ వెలగపూడి దానయ్యాచారిగారు



వ్యాసము: "చంద్రప్రశంస"

వ్యాసకర్త: శ్రీ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు



వ్యాసము: "సంస్కృతసాహిత్యములో కామశాస్త్రమునకు స్థానము"

వ్యాసకర్త: శ్రీ సీరిపి ఆంజనేయులుగారు



వ్యాసము: "అతిదుఃఖితయగు సీత"

వ్యాసకర్త: శ్రీ మన్నవ వెంకటకృష్ణశర్మగారు



వ్యాసము: "బ్రహ్మదేవుని వయఃపరిమాణము"

1. వ్యాసకర్త: శ్రీ వై. కోటీశ్వరశర్మ శాస్త్రిగారు (పాదుకలు ధరించినవారు)

2. శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు



వ్యాసము: "అష్టాదశపురాణములు"

వ్యాసకర్త: శ్రీ కందూరు ఈశ్వరదత్తుగారు



వ్యాసము: "విజయనగరరాజుల మతము"

ధాని కేల్కారువంటియులును విద్యాధికులును నగు ఐదుగు రక్కసెల్లెం డ్రపటము లిందు గలవు. ఇందిరువురు వైద్యోద్యోగినులు; ఇరువురు బి. ఏ., లు; ఒక్కర్తె తన వల్లవిద్యా విశారదత్వమున భరతఖండమునే గాక ప్రపంచమునందును విఖ్యాంతిలో నుంచినది. పశ్చిమఖండ పరి పాలకుల పటములుగలవు. రవీంద్రకవిచంద్రుని రంగుల చిత్రపట మొకటి గలదు. ఆంధ్రోద్యమ వ్యాసములును, మహాపురుషుల చరిత్రములును ౧౬ గలవు. మిగిలినవి పరభాషా సాంఘికములు. విలువగల ౨౫౦ పుటల వ్యాసము లీసంచిక నలంకరించుచున్నది.

## ౬. రాక్షస సంవత్సరాదిసంచిక

దీనిని సంగ్రామసంచిక యనవచ్చును. యూరోపా మహాసంగ్రామ మునకు సంబంధించిన చక్రవర్తుల, సేనానుల, సైన్యనివహముల, రణ రంగముల, యుద్ధపరికరముల చిత్రము లత్యుత్తమరీతి జిత్రింపబడినవి. రణరంగములందున్న యుద్ధములో దగుల్కొన్న దేశపటములును, ఆంధ్ర భాషలో కొన్ని గలవు. చిత్రపట సంగ్రహణమత్యధికవ్యయ ప్రయాససాధ్యమేయైనను, స్వీయదేశీయజనప్రబోధమున కాంధ్ర పత్రికాధిపతుల ప్రయత్న మీరూపమున సాక్షాత్కరించినది. గోపాల కృష్ణగోఖ్లే రంగులచిత్రపట మిందుగలదు. నానాదేశ పతాకములరంగుల పటములును గలవు. ఈసంచికలోని ప్రథమవ్యాసములు యూరోపా మహా సంగ్రామ చరిత్రాత్మకములు. ఈవ్యాసములలో (యుద్ధకారణములు) రాజ్యముల బలాబలములు, మున్నగునవి విమర్శింపబడినవి. యుద్ధములో దగుల్కొన్న కొన్ని రాజ్యములచరిత్రలు గలవు.

## ౭. నలసంవత్సరాదిసంచిక

ఈసంచికలో భారతజాతీయ సభాధ్యక్షులు, పెక్కండ్రచిత్ర ములున్నవి. పౌరాణికగాథలను, ఆంధ్రుల కళాకౌశలమును దెల్పు పట ములుగూడ కొన్ని కల్పింపబడినవి. వ్యాయామప్రదర్శనములును, మల్లు రును చూపబడిరి. యూరోపారాణుల చిత్రములు, రంగుల దేశపటములు, యుద్ధసంబంధములగు చిత్రములు మెండుగను మున్నారున్నవి. ఈసంచిక లోని యేబదివ్యాసములలోను సగము ఆంధ్రులప్రత్యేకతను ఘరిగొల్పు నవై యున్నవి. యుద్ధచరిత్రముగూడ యిం దుద్ధరింపబడినది.

## ౮. పింగళ సంవత్సరాదిసంచిక

ఈసంచికలో ఆంధ్రపత్రికాధిపతులను, ముద్రణాలయమును, కార్యనిర్వాహకవర్గమును అలంకరింపబడినవి. జ్యోతిశ్శాస్త్ర సంబంధ మగు రంగులపట మొకటిగలదు. రాక్షససంవత్సరాది సంచికలోవలెనే యుద్ధవీరులు యుద్ధపరికరములు, యుద్ధదేశములు యీసంచికలో గలవు. ఈమూడుసంచికల పరిచయము ఆంగ్లవిద్యావాసన సెరుగని ఆంధ్రు లకు దేశచరిత్రజ్ఞాన మలవరచినది. ఇవిమూడు సాంగ్రామికాత్మకములే యైనను పత్రికాధిపతులు ఆంధ్రదేశమును, ఆంధ్ర దేశావశ్యకతను నీమరక అవకాశముకొలది ఆంధ్రోత్తేజకచిత్రములును వ్యాసములను బ్రకటించియే యున్నారు.

## ౯. కాళయుక్తి సంవత్సరాదిసంచిక

జాతీయవర్గములో పాటు చెన్నపురి బ్రాహ్మణేతరపక్షనాయ కులపటములు నిందు ప్రకటింపబడినవి. దేశాభిమానులగు వైశ్య కులా వతంసుల పటములుగూడ కొన్నిగలవు. యుద్ధసంఘటన చిత్రములిం దును చూపబడినవి. ఆంధ్రోద్యమస్వరాజ్యతత్త్వము లిందెక్కువగ ప్రస్తా వింపబడినవి. శేషించిన యుద్ధచరిత్రమును విశదీకరింపబడెను.

## ౧౦. సిద్ధార్థి సంవత్సరాదిసంచిక

సంగ్రామసంధి సభాప్రతినిధులును, రాయబారులును, భారత రాజకీయసంస్కరణ సభాధ్యక్షులును, సభ్యులును చిత్రింపబడినారు. భారతదేశ స్వాతంత్ర్యసంపాదనార్థులై ఆంగ్లదేశమునకు వెడలిన భార తీయవివిధరాజకీయ పక్షనాయకుల చిత్రములుగలవు. ఆంధ్రవాఙ్మయ సాంఘిక సంస్కారప్రియులును, ప్రేరకులును, ఆంధ్రదేశ పితామహు లును, మూలపురుషులు నగు వీరేశలింగముపంతులవారి చిత్రపటముగూడ నున్నది. రాజకీయవిషయకవ్యాసములే యీసంచికయం దధికముగ నున్నవి. మాంటుఫర్డు నివేదికమునుగూర్చిన చర్చ విశేషముగ గలదు. భరతఖండమై శాల్యమును జనసంఖ్యయు సామ్రాజ్య రాష్ట్రీయ శాసన సభా వివరములును, ఆంధ్రమండలముల రాజకీయజాతీయ స్థానికసభల వివరములు నిందుగలవు. ఆంధ్రదేశ గ్రంథాలయములపట్టికగూడ గలదు.

## ౧౧. రౌద్రి సంవత్సరాది సంచిక

దేశహితైషిణులగు స్వార్థత్యాగులగు కొందరుమహనీయులచిత్ర ములతో నీసంచిక ముఖపత్రి మలంకరింపబడినది. సప్తమాంధ్ర సభ లకు సంబంధించిన పటములును, అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శన పటములును, ప్రభుత్వోద్యోగుల దేశీయనాయకుల చిత్రములు నిందు గలవు. ౧౯౧౯ వ సంవత్సరమున మదరాసు యూనివర్సిటీలో పట్ట పరీక్షయందు నెగ్గిన యువతీమణుల చిత్రము లిందున్నవి. వాఙ్మయ రాజకీయవ్యాసములే పెక్కులుగలవు. గతసాలున ముద్రింపబడిన ఆంధ్ర గ్రంథముల వివరణపట్టికయు నిందుగలదు.

## ౧౨. దుర్మతిసంవత్సరాదిసంచిక

లోకకల్యాణసంధానికులగు గాంధిమహాత్ములును, ఆయనసాధన సామగ్రియగు రాట్నములు మగ్గములు మున్నగునవి ఈసంచికాముఖపత్ర చిత్రములు. పంజాబుదురంతములు యీసంచికలో ముద్రింపబడినవి. స్థానికరాష్ట్రప్రభుత్వవర్గపుపటములును గలవు. కీర్తిశేషులగు లోకమా న్యబాలగంగాధరునిపట మత్యంతాకర్షణీయముగ జిత్రింపబడినది. ఆయుర్వేదోద్ధారకులగు పండిత. డి. గోపాలాచార్యులవారి పట మిం దున్నది. లోకమాన్యుని నిర్యాణమును గూర్చిన పలువురి కవుల విషా దగీతము లిందు గలవు. వివిధవిషయములనుగూర్చిన పెక్కువ్యాసములు నిందు గలవు.

## ౧౩. దుందుభిసంవత్సరాదిసంచిక.

అహమ్మదాబాదులో జరిగిన జాతీయమహాసభామంటప, ఖాదీ నగరము లిందు చిత్రితములు. శాంతస్వరూపులగు గాంధిమహాత్ముని శీలము ననుసరించిన దేశారాధకుల చిత్రము లిందెక్కువగ రచింపబడినవి.

హిరంబరము ప్రభుత్వపుజయిల్ ఖానాల విందులు గుడిచినవారే! నిర్బంధములపాలై బందిఖానాల కేగుచున్న వారివేషములు త్యాగములుభరతవర్ష భావిభాగ్యోదయమునకు శుభచిహ్నములు. ఆంధ్రజాతీయకళాస్థాపకులును పోషకులు నగు. కీ. శే. కోపల్లె హనుమంతరావుగారి పటముగూడ నున్నది. తమపురుషులతోపాటు దేశస్వాతంత్ర్య సంపాదనార్థినులై దీక్షవహించిన మహిళామణులపటములును గలవు. స్వయంనిర్ణయమూ త్రముల నుపదేశించునట్టియు, నిరాకరణవాదోత్సాహప్రతిపాదకములై నట్టియు వ్యాసములుగలవు. అహమ్మదాబాదుసభలో సవరింపబడిన దేశీయమహాజన సభాసంవిధానవివరణ మిందున్నది.

## ౧౪. రుధిరోద్గారిసంవత్సరాదిసంచిక

సత్యాగ్రహమంత్రబద్ధులై, శాంతగుణోపేతులై స్వాతంత్ర్యసర్వ రక్షణ సాంకులైన అకాలీలు నిరంకుశోద్యోగులచే బడుచున్న కష్టపరంపర లిందు మున్ముందు చిత్రింపబడినవి. గయా క్షేత్రమునజరిగిన జాతీయమహాసభాభవనమంతయు విస్పష్టముగ చూపబడినది. సబర్మతీ ఆశ్రమపు పరిశ్రమ లిందున్నవి. భారతస్వరాజ్యవృక్షము, స్వరాజ్యసభలో మహాత్ముని ఉపదేశస్వరూపకల్పనపటము లత్యంత ముదావహములు. ఆదిమాంధ్రనాయకులపటములు కొన్ని యున్నవి. భారతీయుల వాందోళతరంగితుల నొనర్చు రాజకీయమే యిక్కాలమున ప్రధానముగ నున్నను, ఆంధ్రదేశాంతరణ వ్యాసప్రకటన మీసంచిక దేమర లేదు. మేధానిధులచే వ్రాయబడ్డగద్యవ్యాసము లేమి,మృదుమధురధోరణి గల పద్యప్రసంగము లేమి ౧౩౦ గలవు.

## ౧౫. రక్తాక్షిసంవత్సరాదిసంచిక

భారతస్వరాజ్యసంపాదన దీక్షచే ప్రభుత్వనిర్బంధములపాలై నవసి విముక్తులైన, దేశీయులచే పరివేష్టింపబడినట్టియు, మృత్యుగహ్వరమునుండియు, నిరంకుశపాలనానిర్బంధమునుండియు, వెలువడిన గాంధి మహాత్ముని కృశించిన ఉత్తేజకరూప మీసంచికాముఖపత్రమున శోభించుచున్నది. సర్వజనకారుణ్యవిలసన మూర్తియగు నాతని మూర్తి పేరోకరంగులపటమున చిత్రింపబడినది. కలియుగవైకుంఠమువలె ప్రత్యక్షమైన కాకినాడకాంగ్రెస్ వివరములన్నియు, యీసంచికలో చిత్రింపబడినవి. ఆంధ్రపత్రికాజననము నేటితో ధన్యతనందినది. పదేండ్లనుండి అర్థింపబడుచున్న మహాగౌరవము, దేశీయమహాసభ కాహ్వానమొసగు మహాద్భాగ్యము ఆంధ్రుల కబ్బినది. కనుకనే ౩౮–వ దేశీయమహాసభాదృశ్యముల నన్నిటిని వివరముగ యీసంచిక చిత్రించినది. మూన్నాళ్లముచ్చటతో ముగిసిన బ్రిటిష్ప్రభుత్వోద్యోగు లిందు గలరు. నాగపూరు స్వరాజ్యపతాకవిజృంభణము లిందున్న దగినచిత్రములు. అసహాయవాద విజయచిహ్నములందిది అతీతదృశ్యము. గాంధిమహాత్ముని విమోచనచరిత్రతో బాటు మామూలుధోరణిని కొన్ని ముఖ్యవ్యాసములేగాక ౩౮–దేశీయమహాసభాధ్యక్షుల, ఆహ్వానకర్తల, ఉపన్యాసములు తీర్మానముల వివరము లిందున్నవి. ఖిలాపత్ సభోపన్యాసములు తీర్మానములును గలవు. తదితరకాకినాడసభావృత్తాంతములు వర్ణనాతీతములు.

## ౧౬. క్రోధనసంవత్సరాదిసంచిక

ఇది ఆంధ్రపత్రికపదునారవఉగాదిసంచిక. ఇందులోని చిత్రపటములను దర్శించియు, వ్యాసములను పఠించియు ఆంధ్రు లిప్పుడిప్పుడే ఆనందించుచుందురు. ఈసంచికలన్నియు, ఆంధ్రసారస్వతమున, రాజకీయమున, చరిత్రమున, సాంఘికమున, అవి యివి యన నేల ఆంధ్రత్వనిరూపణమున కవసరమైన వనులలో అతిశయము లేదు. ఇట్టి ఆవశ్యకతను దీర్చిన ఆంధ్రదేశారాధకుని, ఆంధ్రదేశబాంధవుని, శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులవారు దేశోద్ధారకు లనుట సమంజసమే యగును. దేశోద్ధారక బిరుద మిట్టిత్యాగశీలుని, కార్యశూరుని నాశ్రయించుటచే శుద్ధినొందినది. ఈ బిరుదము నార్జించిన శ్రీపంతులవారి సునిశిత బుద్ధిని, కార్యనిర్వహణదీక్షను, శాంతస్వభావమును, ఔదార్యమూర్తిని, సంతత పరిశ్రమమును ఆదర్శముగ గైకొని ఆంధ్రులు కృతకృత్యు లయ్యెదరని నాయాశయము.

## నా యా శ

గాటపు గ్రీష్మతాపాన బీటవారి
కారుచినుకుల జివచేరి కండపట్టి
కళుకుతొలినిగ్గు లొడెదు కారుటడవి
వేల్పువినువాంకపాటల విరముం దెలుపు
చిన్ని సొన్నారిసెలయేటిమిన్నపొంత
బటువుటూడల కంబముల్ వాంతి పటము
చలువపందిరుల్ దీర్చెడుసలములందు
పచ్చపట్టుపచ్చికశయ్య వఱలుచోట
పార్శ్వములం బూలనివ్వాళిం బట్ట లతలు
లలితనిశ్శబ్దసౌధాగ్రములను నిలిచి
సృష్టివైచిత్ర్యములను వీక్షించి మించి
కలంక యెఱుంగని బుద్ధితోం దెలివి తెలిసి
మాట లెఱుంగనిముగ్ధతం బాటపాడి
యవ్యయానందమును బొంద నాశపడుదు.

—సుధానిధి

# చిత్రముల వివరణము

అచ్యుత రామరాజుగారు, మీర్జా, నల్లపరాజు, తుని:— వీరు సుప్రసిద్ధాంధ్ర క్షత్రియులు. వీరిపూర్వులు గొప్ప శౌర్యవంతులు, పండితులు, కవులును. ప్రాచీనుల తేజోయశస్సులు వీరియందు మూర్తీభవించినట్లుండును. వీరు కడుసుందరపురుషులు. వీరికి సంస్కృతాంధ్రాంగ్ల పారసీక భాషలందపార పాండిత్యముగలదు. అతివాద మితవాదిత్వములు, దేశోద్ధరణాభిలాష వీరికి మెండు. వీరొకప్పుడు గాంధిగారడుగగా హఠాత్తుగ తమ రత్నాంగుళీయకమును తిలకనిధి కొసంగిన యుదార స్వభావులు. మఱియు కవిపండితపోషకులు. వీరిపై కవీశ్వరులల్లిన పద్యములు వేలకువేలుగలవు. వైద్యశాస్త్రమున నపారపాండిత్యము వీరికి గలదు. ప్రజోపకార విషయములపట్ల నిరతము ముందంజ వేయుచుండువారు.

అప్పలనరసింహదేవుగారు, కోలా, రాజవైద్య:— వీరు రాజమహేంద్రవరనివాసులు; ఆదిక్షత్రియులు; సుప్రసిద్ధాయుర్వేద వైద్యులు. ఘనులగు నాంగ్లవైద్యులు కుదుర్పజాలని, అన్యాశయవ్రణములు ( ), అంత్రికవ్యాధులు, బొల్లి, కుష్ఠు, క్షయ మొదలయిన అసాధ్యరోగములను శస్త్రాది ప్రయోగము లేకుండ సులభముగా స్వస్థపరుపగల మేధావంతులు. 14 సంవత్సరములనుండి స్వసంఘ సంస్కర్తలై ఆదిక్షత్రియ పత్రికను నడుపుచున్నారు. ఆయుర్వేదమహాసభలు మున్నగు వానియందు పాల్గొనుచుందురు. బీదలయెడ దయగలిగి ఉచితముగ ఆరోగ్యవిద్యాదానములకై పాటుపడుచుందురు. వీరుజాతీయవాదులు.

ఆంధ్రసేవాసంఘము:— 88, ఫెయిర్‌వీధి, రంగూను. బీదవారలయందు విద్య, జ్ఞానము, దేశభక్తి, నీతి మున్నగువానిని వ్యాపింపజేయుటకుగాను ఈసంఘము 1923వ సంవత్సరమున స్థాపింపబడినది. సభ్యులును, సంఘాభిమానులును ఇచ్చుచందాలవలనను, దీపావళినూళ్లవలనను చేకూరుధనమున నీసంఘము బందరు ఆంధ్రజాతీయ కళాశాలకును, వరదల నిధులకును సహాయముగావించుచున్నది. దీనపోషక సమాజమువారి రాత్రి పాఠశాలయొకటి నడుచుచున్నది. దినపాఠశాలలును గలవు. గ్రంథాలయమున 800 తెలుగు ఇంగ్లీషుపుస్తకములు గలవు. ఇంగ్లీషు, తెలుగు, దినవార మాసపత్రికలు, సుప్రసిద్ధములైనవి, వచ్చుచున్నవి.

గాంధీ హిందీమందిరము, గుంటూరు:— ఈ మందిరము శ్రీకన్యకాపరమేశ్వరీ విద్యాలయమందలి హిందీ విద్యార్థులు స్థాపించిరి. ఆంధ్రదేశములో నిది మొట్టమొదటి హిందీ గ్రంథాలయము.

చలమయ్యగారు(కుడివైపు) ప్రసాదరావుగారు(ఎడమవైపు) త్రిపురనేని,(బాలసరస్వతులు).-కృష్ణాజిల్లా అంగలూరు గ్రామవాస్తవ్యులు. చిన్నవయసువారు. సహాయ నిరాకరణావలంబకులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషాపరిచయమును ఆంధ్రకవితాధోరణియు వీరికి కలదు.

చిట్టెయ్యగారు, భోడ:— వీరి నివాసస్థానము బర్మాదేశమునందలి రంగూనుపట్టణమున పిరియం అనుప్రదేశము. వీరు జాతీయవాదులు ఖద్దరుప్రచారకులు. గొప్ప ఆదిమాంధ్రనాయకులు. వీరియం రామమోహన గ్రంథాలయమునకు కార్యదర్శులు. వీరు కావించుచున్న దేశసేవ యెన్నదగినది.

చిదంబరశాస్త్రిగారు, పిసుపాటి:- వీరిస్వగ్రామము గుంటూరుజిల్లా వంగవోలు. వైదికకుటుంబమున కనకాంబా సీతారామ ఘనులకు జన్మించిన వీరి కుభయభాషా వైదుష్యముగలదు. అనేక సంస్థానములయందు శతాష్టావధానాశుకవిత్వముల గావించి బిరుదములను గాంచి ఖ్యాతినార్జించిరి. కాశీసనాతన ధర్మమహాసభలో కావ్యకలానిధి బిరుదమును, అనంతశయన మహారాజాస్థానములో స్వర్ణపీఠసింహకంకణ బహుమానమును బడసిరి. ప్రస్తుతము మైసూరు మహారాజాస్థాన విద్వత్పదవి నలంకరించియున్నారు. సహృదయ హృదయంగమముగా వీరిరువది గ్రంథములవఱకును రచియించియున్నారు.

జానకిరామయ్యగారు, దివాన్‌బహదర్, మల్లెపెద్ది:- వీరిజన్మస్థానము తెనాలితాలూకా పెదపూడియను గ్రామము. 1854వ సంవత్సరమున జన్మించి వీరు ఆంగ్లవిద్య నభ్యసించి 1874వ సంవత్సరమున బందరున న్యాయవాదివృత్తి నవలంబించి గొప్పకీర్తిని గాంచిరి. 1888లో డిస్ట్రిక్టుమునసిఫ్ పదవినిబడసి 1903వ సంవత్సరమున సబ్‌జడ్జిఅయి, తర్వాతమూడేండ్లకు జిల్లాజడ్జిపదవిని గుంటూరున గాంచిరి. ఆంధ్రులలో నీపదవిని పొందినవారిలో వీరు ప్రథములు. హిందూధర్మశాస్త్రమున వీరుమిగుల సమర్థులని పేరగ్గగాంచిరి. వీరు నిష్పక్షపాతబుద్ధితో న్యాయమును బరిశీలించుచుండిరి. 1909వ సంవత్సరమున నుద్యోగమునుండి విశ్రాంతిగైకొని బెజవాడ తమనివాసముగా నేర్పరుచుకొని పెక్కురు విద్యార్థులకు ధనసహాయమును గావించుచుండిరి. కాకివాడలో బీదలకొక వసతిగృహమును గట్టించిరి. వేదశాస్త్రములయందు వీరికి గలపరిచయము చేతను, అభిమానము చేతను ఏటేట దసరారోజులలో శాస్త్రవిద్యాసంపన్నుల ననేకులను బరీక్షించి బహూకరించుచుండెడివారు. ఆయుర్వేదమునను వీరికభిరుచికలదు. జీవితులైయున్నంతకాల ముదారులై శాశ్వతకీర్తినిగడించి 1921వ సంవత్సరమున కీర్తిశేషులైరి.

తిమ్మరాజు కవిగారు, వడ్డాది, కీ. శే.:— వీరు దుర్మతి సంవత్సరమున జనించి పింగళసంవత్సరమున కీర్తిశేషులయిరి. దాక్షారా

మను చెంతనున్న దొడ్డమపేటయను వేగాయమ్మపేట వీరినివాసస్థానము. వీ రుభయభాషాపాండిత్యముగల్గి ఆంధ్రమున శ్రీరామావతారము మొదలగు కొన్ని గ్రంథములను, పాటలను రచియించినారు. వీరు బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయకవీశ్వరుని తాతతో బుట్టినవారు.

దాలెం నాయుడు, మెండ:—గంజాం జిల్లా పర్లాకిమిడి తాలూకా సారవకోటము తాలూకా భద్రగిరి గ్రామము వీరినివాసము, 1839 సంవత్సరము జూన్ 15 తేది వెలమకులమున వీరుజన్మించిరి. స్వల్పభూస్థితిలో వీరు జీవయాత్రను ప్రారంభించిరి. ఆగ్రామమునకు తాను అధికారియై యేబదిసంవత్సరములు గడపిరి. 400 ఎకరములభూమిని గడించిరి. శివవిష్ణ్వాలయముల రెంటిని కట్టించిరి. తటాకములు త్రవ్వించిరి. అన్నవస్త్రదానములుచేసిరి. కడుధార్మికులు. తీర్థయాత్రలు పెక్కుగావించిరి. కడపట 15 సంవత్సరములు పండితగోష్ఠిని భగవన్నామస్మరణ కావించుచు 1924 సంవత్సరమున కీర్తిశేషులైరి.

నరసింహాచారిగారు, నూతులపాటి, శతశిల్పి:— వీరు శిల్పకళాప్రవీణులు. వీరినివాసస్థానము గుంటూరు. వీరుశిల్పాశ్రమము నొకదానిని స్థాపించిరి. భారతజాతీయవిజ్ఞానము ననుసరించి ప్రతిమలను నిర్మించుచుందురు. గుంటూరు పురవాసులు దేశభక్త శ్రీకొండావెంకటప్పయ్యగారు మొదలగు నాంధ్రప్రముఖులు వీరికళానైపుణ్యమును మెచ్చుకొనిరి.

నారాయణరావుగారు, బి.ఏ., బి.యల్., యఱ్ఱమిల్లి:- వీరు నరసాపూరు వండలి సుప్రసిద్ధన్యాయవాదులలో నొకరు. వీరు మిగులనుదారులు, పరోపకారపరాయణులు, భాషాభిమానులును. వీరు చెన్నపురి హిందూయువతీశరణాలయ పోషణమునకు ద్రవ్యరూపసాహాయ్యము నొసర్చిరి. వీరు గవర్నమెంటు అగ్రికల్చరల్ కంపెనీ లిమిటెడ్ (నరసాపురము) కొరకుగాను రాజాంగము వారియొద్దనుండి 1500 యకరముల భూమిని సంపాదించి ఆకంపెనీజయప్రదముగా నడుచుటకు మూలాధారభూతులైరి. వైలరుహైస్కూలు విషయమున మిగుల పాటుపడి ద్రవ్యమును స్వయముగనొసంగియు నితరులవలన ప్రోగుచేసియు నదిస్థిరముగ నెలకొనునట్లు చేసిరి. పెక్కురు విద్యార్థులవిద్యాభివృద్ధికి వీరి యౌదార్యము ప్రధానకారణమయ్యెను. ఈఛాయాచిత్రమును పి. జే. రావుగారు తీసిరి.

పుత్రసత్యం శర్మగారు, మారెళ్లపూడి:—గోదావరి జిల్లా పెదబ్రహ్మదేవము వీరినివాసస్థలము. వీరు అసహాయోద్యమ ప్రచారకులు; జాతీయపతాకాది గ్రంథకర్తలును వీరు శ్రీరాజేశ్వర పుస్తక భాండాగారమును స్థాపించి తామే దానికి కార్యదర్శులుగానున్నారు.

## మాణిక్యారావు సంస్థానాధీశులు

౧. శ్రీరాజామాణిక్యారావు జంగన్నారాయణంబహద్దరువారు: వీరు ప్రజానురంజకులగు ప్రభువులు, (1835-1870). వీరికాలమందు (1844) కప్పముకట్టలేదను కారణమున జమీందారిని ఆంగ్లులు తీసికొనిరి.

౨. శ్రీరాజామాణిక్యారావు వెంకటగోపాలరాయణం బహద్దరువారు(1870-83): మాణిక్యారావువంశమాణిక్యము. ధాతకఱవప్పుడు మూడేండ్లవఱకు నిరంతరాన్నదానమొనర్చి ఖ్యాతిగాంచిన మహోదాత. అఖండషాత్రగుణసంపన్నులు. మొసలిపేటయందును అశ్వారోహణమందును మిగులచతురులు.

౩. శ్రీరాజామాణిక్యారావు వెంకటమార్కండేయరావు బహద్దరువారు(1902): వీరుచిఱుతతనమందె గతించిరి.

౪. శ్రీరాజా మాణిక్యారావు వెంకట హయగ్రీవరావు బహద్దరు జమీందారువారు. వీరు ప్రస్తుతమాణిక్యారావు (రాచూరు) సంస్థానాధీశులు ఉదారాశయ సంపన్నులు. దేశాభిమానులు.

ఆర్. యం. (రామమూర్తిమణి) పాత్రో:—వీరు గంజాముజిల్లాలో ఇచ్ఛాపురమున డాక్టరుగానున్నారు. వీరువైద్యమున నీమండలమున మిగుల ప్రఖ్యాతినిగాంచిరి. ఉదారస్వభావముగలవారు. ఈమండలమున వీరమూల్యమైన దేశసేవకావించుచున్నారు. వీరునేత్ర చికిత్సయందును సమర్థులు.

రామయ్యశ్రేష్ఠిగారు, పసుమర్తి (కీ. శే.):—వీరు ఏలూరు పురనివాసులగు వైశ్యశిఖామణులు. ధర్మగుణముగలవారు. ఏలూరు గాంధిజాతీయ మహావిద్యాలయమునకు 1501-0-8 ఉచితముగానొసగిరి. అద్పటి అన్నవస్త్రవైద్యవిద్యాదానసమాజములకు 500-0-0ఇచ్చి, ధర్మకర్తలైరి. ఇంకను పెక్కుధర్మకార్యములొనరించిరి. ఇతరజాతీయోద్యమములకును ధనసహాయము పలుమారుగావించిరి. ఖద్దరు ప్రచారమునకు మిగుల తోడ్పడిరి. వీరు ౬౩ సంవత్సరములు జీవించి రక్తాక్షి మాఘ బ. ౧ నాడు కీర్తిశేషులైరి.

రామాబాయమ్మగారు, గుమ్మిడిదల:— ఈమె 1923-వ సంవత్సరము జూనునెల తే 8 దిన కాకినాడపురమున హిందీ బాలికాపాఠశాలను స్థాపించి తామే బాలికలకు పాధ్యాయినిగానున్నారు. ఈపాఠశాలకు సంబంధించిన చిత్రములుకొన్ని యీసంచికయందును, రక్తాక్షిసంచిక (200 పుట) యందునుగలవు.

లక్ష్మీదేవమ్మగారు, శాఖమూరి, (కీ. శే.):- ఈమె కీ. శే. శాఖమూరి వెంకటప్పయ్యగారి ధర్మపత్ని. గుంటూరు కమ్మవిద్యార్థులు నివసించుటకు ఇరువదివేల రూప్యములవెచ్చించి ఒకదివ్యభవనమును కట్టించి ఉచితముగ నొసగెను.

రాధాబాయమ్మగారు, చిలుమామిళ్ల:— ఈమె శ్రీశాఖమూరి లక్ష్మీదేవమ్మగారిపుత్రిక. చిలుమామిళ్ల భాన్ప్రసాదనాయుడుగారిసతీమణి. కడుధార్మికురాలు. గుంటూరు కమ్మవిద్యార్థి వసతిగృహమునకు 20 ఎకరములును, గుంటూరు అన్నదానసమాజమునకు 20

ఎకరములును తమ్ము అనాదినుండి కనిపెట్టుకొనియున్న సేవకులకు 20 ఎకరములును. భూదానమొసగిరి.

లక్ష్మీనారాయణగారు, పాలావర్ఝుల:—వీరిస్వగ్రామము నరసాపురము. వీరుతొలుత కొంతకాలము టైలర్ ఉన్నతపాఠశాలయందుపాధ్యాయులుగానుండిరి. పిదప కలకత్తాకువెళ్లి అచ్చట సాధనాశ్రమమున బ్రాహ్మధర్మమును స్వీకరించి రాజమహేంద్రవరమునను, బందరునను బ్రాహ్మమతప్రచారకులుగానుండిరి. ఇపుడునరసాపురమునను న్నారు. ఇచట బ్రహ్మజ్ఞానమునుగూర్చి ఉపన్యాసముల నిచ్చుచున్నారు. వీరివయస్సు 60 సంవత్సరములు. బ్రహ్మజిజ్ఞాస, బ్రహ్మధర్మవ్యాఖ్యానము, మహర్షిది జీవితము అను మూడుగ్రంథములను వంగభాషనుండి ఆంధ్రీకరించిరి.

లింగరాజకవిగారు, పేరాల:—వీరిజీవితకాలము 2-11-1863 మొదలు 18-8-24 వఱకు. వీరాంధ్రాంగ్లభాషావిదులు. వీరుపాధ్యాయవృత్తితో శరీరయాత్రచేయుచుండిరి. కొన్ని నాటకములను, శతకములను, చిల్లరపద్యములను తెలుగువరచియించి భాషాసేవకావించిరి. అవి యముద్రితములు.

విశ్వపతిశాస్త్రిగారు (పసుమర్తి):—వీరు కాకినాడపురవాసులు. దేశభక్తి దైవభక్తి పరాయణులు. శ్రీరామసప్తాహాదిపుణ్యకార్యకరణప్రియులు. భక్తిరసమొలుకునట్లు హరికథా కాలక్షేపమును గావించుటయందు గడునిపుణులు.

వెంకటకృష్ణారావుపంతులుగారు, పాలకోడేటి,యమ్. బి. బి. యస్:— వీరిజన్మస్థానము కృష్ణాజిల్లా ఎర్నగూడెముతాలూకాలోని దేవరపల్లెగ్రామము. వీరు 1889వ సంవత్సరమున జన్మించిరి. వీరువైద్యవిద్యా పట్టభద్రులై 6,7, సంవత్సరములు మెడికలుకాలేజి (చెన్నపురి)లో ఫీజియాలజీ ప్రధాన సహాయాధ్యాపకులుగానుండిరి. ప్రస్తుతము క్రొత్తగా గవర్నమెంటువారు స్థాపించిన ఆయుర్వేదకళాశాలయందు ఫిజియాలజీ, అనాటమి ప్రధానోపాధ్యాయులుగానున్నారు. వీరుమెడికల్ ఎగ్జామినేషన్ బోర్డులో మెంబరుగానుండిరి. గవర్నమెంటు టెక్నికల్ (వృక్ష,ఆరోగ్య, శారీరశాస్త్ర)పరీక్షల బోర్డుకు చేరుమెనుగానున్నారు. ఆంగ్లాయుర్వేద వైద్యములందు మిగుల సమర్థులు. వీరికి చిత్రవిద్యయందును నేర్పుగలదు. వీరిచిత్రములను గొనియాడుచు ఆర్ట్సు ఎగ్జిబిషన్ వారు యోగ్యతాపత్రము నొసగియున్నారు.

వెంకట నరసింహారావుగారు,. చెలికాని, ఆంధ్రసాహిత్య సరస్వతి, కావ్యనిధి, విద్యాభూషణ:—పిఠాపురమునకు చేరువనున్న లక్ష్మీనరసాపురము వీరినివాసస్థలము. వీరు పద్మనాయకవంశజులు.ఎర్నగూడెము, గొరిపట్టణము ఎస్టేటుకు జమీందారులు. శ్రీకావ్యనిధి, తత్త్వవిశారద, చెలికాని లచ్చారావుగారి యన్నకుమారులు. ఆంధ్రాంగ్లములయందు వీరికిమంచిప్రవేశముకలదు. ఆంధ్రకవితాధారకలదు. వీరుకొన్ని గద్యపద్యగ్రంథములను రచియించినారు. దైవభక్తిధర్మచింతగలవారు.

భావ్యకార్లురావుగారు, చేమకూర:—గొప్పచిత్రకారులు. ఈతని చిత్తరువులు గొప్పవ్యక్తిత్వమును కనుబరచును. ఈతని చిత్తరువులుకొన్నికగన్నవి. ఈతనివయస్సు 29వత్సరములు. ఈతనిచిత్తరువులు రెండు బ్రిటీషుసామ్రాజ్య ప్రదర్శనము(వెంబ్లీ) యందు ప్రదర్శింపబడెను. అందొకటి కనేడియన్ దేశీయ ప్రదర్శనమునకు నవీన భారతీయ చిత్రకళాచిహ్నముగ గొంపోబడెను. ఈతడు నిర్వివాదముగా రూపపటములు చిత్రించువాడు.

యాక్రిందివీతనిచే చిత్రింపబడినవాటియందు ముఖ్యమైనవి.

1. లోకమాన్య తిలకు మహనీయుని రూపపటము. (1921 రాజమండ్రి మ్యునిసిపల్ మ్యూజియం); 2. మహాత్మాగాంధిగారియొక్క రూపపటము (1922); 3. భగవదన్వేషణము (గోపికలు 1922), వెంబ్లీయందు ప్రదర్శింపబడెను; 4. సనారీశ్వరపటము (పార్వతీ, పరమేశ్వరులు), 1923 వెంబ్లీయందు ప్రదర్శింపబడెను; 5. శకుంతలాదుష్యంతులపునస్సమావేశము. (1924) క్రొత్తది. 6. అనంతునియందులీనము. (In Tune with the Infinite)

వెంకటరత్నంగారు వరదా:—వీరు చిత్రకారులువంశపారంపర్యముగానలవడినది వీరికీ చిత్రవిద్య. వీరుమదరాసు చిత్రకళాప్రదర్శనములయం దనేకమార్లు బహుమతుల బడసినవారు. వీరిచిత్రమొకటివెంబ్లీ ప్రదర్శనములో ప్రదర్శింపబడి కనేడియన్ జాతీయ ప్రదర్శనమునకు గొంపోబడినది. వీకరూపపటములందును చిత్రపుణ్యమునందును వీరు ప్రఖ్యాతిగాంచిరి. వీరి చిత్తరువులలో కొన్ని :

(1) విష్ణు (1923)-బహుమతి బడసినది. (2) నటరాజ (వెంబ్లీలో ప్రదర్శింపబడినది); (3) వారణాశిరాజు; (4) కైలాసనాథుడు.

వెంకటసుబ్బారావుగారు, పల్లె:— వీరు గుంటూరుపురవాసులు, మధ్వబ్రాహ్మణులు. సువర్ణముఖిమొదలైన వచనగ్రంథములను, దుర్యోధనపరాభవము మొదలైన నాటకములను రచించి యథాశక్తిని భాషాసేవ గావించిరి.

వేంకటరమణయ్యచౌదరి, సోంపల్లి:—వీరి నివాసస్థానము అనంతపురమండలమునందలి ఉరవకొండ ఫిర్కాలోని మోపిడిగ్రామము. వీరు కమ్మకులజులు; వయస్సు ౨౫ సంవత్సరములు. అసహాయోద్యమము నవలంబించి ప్రభుత్వోద్యోగమునుమానుకొని కాంగ్రెసు ఖాదీప్రచారము నత్యుత్సాహముతోఁ జేయుచున్నారు.

వేంకటరామశాస్త్రిగారు, వేదుల:— కృష్ణాజిల్లా, తణుకుతాలూకా మంచిలిగ్రామము వీరి నివాసస్థానము. వీరితండ్రిసుబ్రహ్మణ్యశాస్త్రి. వయస్సు 50 సంవత్సరములు. వీరికి గణితవిద్యయం

ద్భుతకౌశలముగలదు. గంటలకొలది లెక్కలేనికాగితములను చెరచియు సరిగఫలితములు తేలని రొట్టెచిక్కులెక్కలకైనను మనోగణితమున శీఘ్రకాలమున ఫలితమును జెప్పగలరు. గొప్పగొప్ప జ్యోతిశ్శాస్త్ర విద్వాంసులు, ఇతరప్రముఖులును వీరి సామర్థ్యమునకు మెచ్చుకొని యోగ్యతాపత్రికల నొసగియున్నారు.

**శర్మసోదరులు:**—విశాఖపట్టణంజిల్లా చీపురుపల్లితాలూకా గరుగుబిల్లిగ్రామము వీరి నివాసస్థానము. వీరి యింటిపేరుచిట్టూరువారు. కాశ్యపసగోత్రోద్భవులు. ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. కొండలరాయశర్మపుత్రులు. కడుచిన్నవయసువారలు. వీరిలో జ్యేష్ఠుడగు వేంకట వేణుగోపాలశర్మ ఫిడీలు వాద్యమునను, కనిష్ఠుడగు వేంకట కామేశ్వరశర్మ వీణాగాత్రగానములను గడుగుశలురు. వీరు ప్రస్తుతము చెన్నపురియందున్నారు. తమ నిరుపమాన మృదుమధుర గానసుధాలహరియం దిచటి పౌరుల పలుమారు నోలలాడించుచున్నారు. పెక్కుగాన సభలయందు సువర్ణపతకములు, బహుమతులు గాంచుచు వన్నెకెక్కుచున్నారు, గానవిద్య వీరికి వెన్నతో బెట్టినది.

**శాంత్యాశ్రమము:**—ఈ యాశ్రమము గోదావరీ మండలమునందలి పెద్దాపురముతాలూకా ప్రత్తిపాడు డివిజనులోని తోటపల్లి కొండలకు రెండుమైళ్లదూరమున నున్నది. దీని నెనిమిది సంవత్సరములకు బూర్వము శ్రీ. ఓంకారస్వాములవారు స్థాపించినారు. ఈయాశ్రమముయొక్క విలువ యిప్పుడిప్పు డాంధ్రమహాజనుల యాదరణకుపాత్రమగుచున్నది.

**శ్రీకన్యకాపరమేశ్వరీ జాతీయపాఠశాల:**— ఈ పాఠశాలను గుంటూరుపట్టణమందలి వియ్యపునర్తకులు రుధిరోద్గారి జ్యేష్ఠశుద్ధ ౧ ఆదివారమున గుంటూరు అగ్రహారమున స్థాపించిరి. ఇందు ౧౨౦ గురు బాలురు ౬ తరగతులుగా జాతీయవిద్యల నుచితముగ జదువుచున్నారు. పంచములుదక్క తక్కినజాతులవారందఱునిటజదువుచున్నారు. నూలువడుకుట, నేత, మొదలగువానిని నేర్పుచున్నారు. ఇందు తొమ్మండ్రుపాధ్యాయు లున్నారు. ఈపాఠశాల సక్రమాభివృద్ధి నిగాంచుటకు స్థాపకులింకను సొమ్ము వ్యయింపవలసియున్నారు.

**శ్రీకాంచీకామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్రసరస్వతీ శ్రీపాదులు, కుంభకోణము:-**

వీరు పూర్వాశ్రమమున కర్ణాటబ్రాహ్మణులు. వయస్సు 30 సంవత్సరములు. చిన్నవయసువారయినను వేదశాస్త్రాది దేశీయవిద్యలలో మంచిపాండిత్యము గలదు. బహుభాషా పరిచయముగల మఠాధిపతుల విద్యుక్తధర్మములను గుర్తెరిగి సనాతన ధర్మప్రచారమునందు బద్ధకంకణులైనవారు. సంపూర్ణ దేశాభిమానులు. ఖద్దరునందు గాఢాదరణము. మిల్లుగుడ్డలను ధరింపరు.

**శ్రీబాలగణపతిసమాజగ్రంథనిలయము, పాణంగిపల్లి, రామచంద్రపురముతాలూకా, గోదావరి జిల్లా:**— 1924 సం॥రం ఫిబ్రవరి నెలలో జరిగిన వార్షికోత్సవ సందర్భమున తీయబడినదీఛాయాచిత్రము. అయ్యల సోమయాజుల కామేశ్వరరావుగారీగ్రంథనిలయమునకు కార్యదర్శి.

**శ్రీబాలభక్తసమాజము, కంబాలచెరువు పేట, రాజమహేంద్రవరము:**— ఈసమాజమును 73 గురు పంచమబాలురు 9-10-20 నాడు స్థాపించిరి. ఇపుడు 76 గురు సభ్యులుగలరు. నిమ్నజాతులయందు దైవభక్తి నెలకొల్పుట, దురభ్యాసములను దొలగించుట, విద్యాభివృద్ధికిదోడ్పడుట మొదలయిన వీసమాజమువారి ముఖ్యోద్దేశములు. కార్యదర్శి యం. సూర్యనారాయణగారు.

**శ్రీరామ బాలభక్తభాండాగారము, రాజమహేంద్రవరము:**— ఈగ్రంథనిలయమున 150 గురు చందాదారులును, 3500 ఆంధ్రాంగ్లగ్రంథములున్నవి. 10 దినవారపక్షమాసపత్రికలు వచ్చుచున్నవి. ఈగ్రంథమాల 1920-వ సంవత్సరమున స్థాపింపబడినది.

**శ్రీరామ శ్రేష్ఠిగారు, తాడిపత్రి:**— వీరి కాపురస్థలము యలమఱ్ఱుగ్రామము, కృష్ణాజిల్లా. పద్మశాలి కులజులు. తమసంఘము యొక్క అభివృద్ధికై 'బహూత్తమగ్రంథమాలను' స్థాపించి 'పద్మశాలీయ కర్తవ్యము' మొదలగు గ్రంథములనువ్రాసి ప్రచురించుచున్నారు. 1924 సం. కాంచీపురమునజరిగినపద్మశాలి తృతీయమహాజనసభ, కగ్రాసనాధిపత్యమునువహించిరి. యలమఱ్ఱుపురపాలక సంఘమునకూడ వీరుసభ్యులుగా నున్నారు.

**శ్రీసీతారామభక్తసంఘ ప్రథమమహాజనసభ:**— ఎడమప్రక్కనుండి కుర్చీలమీదకూర్చున్నవారిలో 6 వవారు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. అధ్యక్షుడు; 5-వ వారు శ్రీ. సూర్యదేవర సంజీవరాయణంగారు; 4-వ వారు శ్రీ, బాలుదారినారాయణదేవుగారు; 3-వ వారు చెరువువేంకట సుబ్రహ్మణ్యంగారు, సంఘకార్యదర్శి.

**ఊ. వేం. శ్రేష్ఠిగారు:**— వీరు వైశ్యశిఖామణులు. వేటపాలెము వీరి నివాసస్థానము. వీరిదేశసేవ, యుదారస్వభావము, భాషాభిమానము పేర్కొనదగినవి. వీరు వేటపాలెమున సారస్వతనికేతన మను ఉచితగ్రంథపఠనాలయమునకు ప్రతిష్ఠాపకులు అధ్యక్షులునై యున్నారు. వీరు ఈగ్రంథాలయమునకై రు 2650 విలువగల 'సుబ్రాయమహాల్' అను భవనమును, రు 3000 ధనమును ఉచితముగనొసగుటయే వీరి భాషాభిమానమునకును ఉదారాశయమునకును దార్కాణము. వీరి సతీమణి శ్రీమతి కమలాంబగారు మిగుల దేశాభిమానము గలవారు. వీరు నూలువడుకుచున్న ఛాయాచిత్రమిందుఁ గలదు.

**సయ్యదు అహమ్మదు అలీషాఖాదర్ వలీయోగి గారు:**— వీరు గోదావరిజిల్లా అమలాపురముతాలూకా క్రొత్తలంక గ్రామమున ౧౨౦ ఏండ్లుండిరి. ఈగ్రామమునకు మూడుమైళ్లదూరమున

నున్న కుండలేశ్వరమను పుణ్య క్షేత్రమున గోదావరీతీరమున సంచరించు చుండిరి. ఇక్కడకు వీరిరాకయెట్లో, యెప్పుడో తెలియదు. ఆజాను గులపాదవు, చామనచాయగల శుష్కదేహముగలవారు. వీరుమిగుల మహిమగలవారని పేరుకెక్కియున్నారు. ఒక్కొకగడియ కొక్కొక చోట నగుపడుచుందురు. కాని రాకపోకలన్నైనను తెలియదు. వీరియొద్దకు పెక్కురేతెంచి శుశ్రూషచేసి తమ యిష్టార్థములను దీర్చుకొనుచుందురు. వీరిశిష్యులలో నన్ని జాతుల, మతముల, వారుగలరు. 1921–వ సం॥ర పుజవాభాకు వీరికి 123సం॥లు వయసట! శ్రీ త్రిలంకనివాసులగు గేదల వెంకటరత్నముగారు, గోవిందరాజులుగారు అను సోదరులు వీరికి ఎల్లపుడు శుశ్రూష కావించుచుందురు. యోగిగారిని దర్శించుటకు వచ్చువారెల్లరు వెంకటరత్నముగారి యతిథులగుచుందురు. చిత్రములో యోగికి రువైపులనున్నవారె శిష్యులగు నీసోదరులు.

సుబ్బయ్యగారు, గూడూరు, రాజవైద్య(కీ. శే.):— వీరినివాసస్థానము గుంటూరుజిల్లాలోని వేజెండ్లగ్రామము ఆయుర్వేదమునను, జ్యోతిషమునను, ఛాయాచిత్రగ్రహణవిద్య (Photography) యందును వీరుసమర్థులు. దానధర్మశీలురు. వీరు24-12-1924నాడు కీర్తిశేషులైరి.

స్వసంఘము, విశాఖపట్టణము, ద్వితీయవార్షికోత్సవము:—ఈసంఘమును రెండుసంవత్సరములకుపూర్వము కొందరు యువకులు స్థాపించిరి. దీనికి విశాఖపట్టణ పురపాలకసంఘమువారు ఎడ్వర్డుమార్కెట్టులో నొకభవనము నుచితముగా నొసగిరి. ఇందు 850 ఆంధ్రాంగ్లభాషా గ్రంథములుగలవు, కొన్నిదినవారమాస పత్రికలు (ఆంధ్రాంగ్లములు) వచ్చుచున్నవి.

సుబ్బారాయుడు నాయుడుగారు, ఆచంట,కీ. శే:— వీరు చెన్నపురిలోనున్న ఇంగ్లీషుసైకిలు అండుమోటారు ఇంపోర్టింగు కంపెనీ యజమానులు సుప్రసిద్ధాంధ్రులు. చెన్నపురాంధ్రసభను సాపించినవారిలలో నొకరు. దానశీలురు. మంచివ్యవహర్త.

తిరుపతిరాజుగారు, అయ్యగారి:—వీరు కృష్ణాజిల్లాభీమవరంతాలూకా మోగల్లుగ్రామకరణముగారు. వయసు 54 సంవత్సరములు. వీరు 1913 సం. లో తమ యుద్యోగమునుండి సెలవుతీసుకొని, ఆంధ్రరాష్ట్రీయ గ్రామోద్యోగులసంఘమునకు కార్యదర్శిగానుండి వారి యభివృద్ధికై మిక్కిలిశ్రమపడి పనిచేయుచున్నారు. ముఖ్యముగా గ్రామోద్యోగుల వేతనాభివృద్ధిని గుఱించియు,వారసత్వపుహక్కును గూర్చియు, ప్రభుత్వమువారితోడను, జమీందారులతోడను విని వేదించి ఆలాభము లను గ్రామోద్యోగులకు గలుగజేయుటకై వీరు చేయుచున్న పరిశ్రమయెంతయు కొనియాడదగినది.

చిన్నస్వామిగారు, వి.యస్.,బి.ఏ.:—వీరు 1896వ-సం.న జన్మించి 1918-వ సంవత్సరమున పట్టభద్రులై రాసాయనికపరిశ్రమల పరిశోధనములగావింపబూనుకొనిరి. వీరుపారిశ్రామికశాఖయందు గొప్పపదవినిబొంది, జాతీయపరిశ్రమయని పేరుగాంచిన గోదుపరిశ్రమ ప్రారంభించి, జరిపిరి. హిందూదేశమునందలి పెక్కుపరిశ్రమాలయములను దిలకించిరి. వీరికిగల రసాయన పరిశ్రమాభిమానమును, వీరి పరిశోధనల ఫలమును వ్యాసములరూపమున పెక్కుపత్రికలయందు ప్రకటితమగుచున్నది.

కోటీశ్వరశర్మగారు, (శ్రీ).పై:—నియోగి మహాజనసభాకార్యదర్శులు. ఆంధ్రదేశమునందు నియోగిబ్రాహ్మణశాఖయందు మతివిద్యావ్యాప్తికయి దాదాపు ౨౫ సం. నుండి ప్రయత్నించుచున్న వీరిని ఆంధ్రబ్రాహ్మణులంద రెఱింగియేయుందురు. స్వధర్మప్రకాశినీపత్రికా సంపాదకులు.

వేంకటకృష్ణశర్మగారు, మన్నవ:—వీరు సంస్కృతాంధ్రములయందు మంచిప్రవేశముగలవారు. ఆయుర్వేదము నభ్యసించి మందులను స్వయముగచేసి ఉచితముగ రోగుల కిచ్చుచుందురు. దాదాపు ౧౦వేల రూప్యముల వ్యయమును స్వయముగభరించి మన్నవగ్రామమునందుగల చెన్నకేశవాలయమునకు నక్కని ఏర్పాట్లు చేసియున్నారు,

సత్యనారాయణపంతులుగారు, బుఱ్ఱా. బి. ఏ.,బి. యల్.:—వీరిజన్మస్థానము శ్రీకాకుళము. వీరు సుప్రసిద్ధాంధ్రులు. న్యాయశాస్త్ర పట్టభద్రులై చెన్నపురి ఉన్నత న్యాయస్థానమున న్యాయవాదిపదము నలంకరించియున్నారు. ప్రజోపయోగకరములగు ననేకోద్యమములయందు మిక్కిలి శ్రద్ధతో పాల్గొనుచుందురు. మొన్న మొన్న నడిచిన ఇంపీరియల్ బ్యాంకుకేసులో అహమ్మదుబాచ్చాగారి పక్షమున మిగులశ్రద్ధతో పాటుపడి జయమును గాంచి కీర్తికెక్కిరి.

Printed and Publishd by K. Nageswara Row, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T., Madras




తళతళమని ప్రకాశించునది యం

తయు బంగారు ఎట్లు కాదో అట్లే పైన

పట్టుగుడ్డచే చుట్టబడిన దంతయు లైనుసబ్బులు కావు. మీకు నిజమైన లైనుసబ్బు కావలసి యుండిన పైన "లైనుసబ్బు" తయారుచేసినవారి పేరు జార్జి డ్రేలు అని వుండుటను చూచి తీయుడు.

2 బిళ్లలు గల పెట్టె 1-కి ధర రూ 1—8—0

లైను ఫేసుపౌడరు డబ్బి 1-కి ధర రూ 0—8—0

అన్నిచోట్లలో దొరకును. లేక ఈదిగువ విలాసమునకు వ్రాసిన పంపబడును.

ఏ. వి. ఆర్. ఏ. అడికప్ప చెట్టి

52, బందరువీధి, మద్రాసు.

# దియునైటెడ్ ఇండియా లైఫ్ అస్యూరన్సు కంపెనీ లిమిటెడ్

## హెడ్ఆఫీసు - మద్రాసు

చెన్నపురిలో మొట్టమొదట స్థాపించబడిన హిందూదేశీయ భీమాకంపెనీ యిదియే!! కడచిన 5 సం॥లనుండి పాలిసిహోల్డరులకు 1000 కి రు 75 లు చొప్పున బోనసు ఇయ్యబడినది. వాటాదారులు, పాలిసిహోల్డరులు ఈ రాజధానిలో నున్నవారే. సొమ్మును విదేశములకు పోనీయక ఈరాజధానియందే దాచబడియున్నది.

ప్రీమియములు మిక్కిలి న్యాయముగా వసూలుచేయబడును. హక్కులను త్వరలో తీర్మానము చేయుటకు కావలసిన అవకాశములన్నియు గలవు.

చెల్లదగని పాలిసీలకు ప్రత్యేకసదుపాయములు గలవు. దరఖాస్తుదారులు దయజేసి మాకంపెనీ షరతులను ఇతర కంపెనీలతో సరిపోల్చి చూడవచ్చును. వారికి ఈషరత్తులు లాభకారిగా నుండునట్లు తోచినవారు చెన్నపురియందుండు మాకంపెనీవారితో కలిసి, మాట్లాడవచ్చును. మిక్కిలి ధారాళమైన షరతులపై పనిచేయుటకు ఏజంట్లు కావలెను షరత్తులను ఈదిగువ విలాసమునకు వ్రాయవలెను.

కె. ఎస్. గోపాలయ్య, మేనేజరు.

# THE BEZWADA SPINNING AND WEAVING MILLS, LIMITED.

***Registered Office*** **:—Main Canal Road, Bezwada.**

***Mill Buildings*** **:—Adjacent to Kistna Canal Station.**

**Authorised and Issued Capital:—Rs. 20,00,000 Divided into 1,00,000 shares of Rs. 20/- each, to be paid in 4 equal instalments.**

**Subscribed Capital :—(1-3-25) Rs. 2,67,680.**

**Paid up Capital :—(1-3-25) Rs. 2,05,355.**

*Site* :—A. 10-83 cents – unrivalled in natural advantages-Centre of cotton area-adjacent to broad and meter guage Railway Stations-Plenty of subsoil fresh water-coal, building materials and labour very cheap, and ready market.

*Buildings* :—Building nearing completion-very strong and substantial at half the elsewhere-Designed for large future extensions at a trifling cost.

*Engine & Boiler* :—400 I. H. P. Engine and 30′ X 7′-6″ Lancashire boiler, purchased very cheap, now under erection.

*Machinery* :—100 Looms and Preparatory machinery being fitted up.

*Management* :—Most economical and efficient-Managing Director rendering honorary service. The Managing Agents have a large stake in the Mills.

*Working* :—Weaving will be started first in three months and spinning section will be established next year. For further particulars please apply to :—

**Gudur Lakshmana Rao B. A.,** *Managing Agent & Director.*

## ది బెజవాడ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్సు లిమిటెడ్, బెజవాడ.

రిజిస్టర్డు ఆఫీసు:- మెయిను కెనాల్ రోడ్డు, బెజవాడ. మిల్లుకట్టడములు:- కృష్ణా కెనాలు స్టేషనుకు సమీపమున

నియమింపబడిన మూలధనము:—20,00,000 రూపాయిలు వాటా 1-కి రు 20 లు చొప్పున 100,000 వాటాలు నాల్గు సమవాయిదాలలో చెల్లించవలెను.

(1-3-1925) చందా మూలధనము:— రు. 2,67,680 లు వసూలుఅయినది రు. 205,355 లు.

మిల్లుప్రదేశములు:—య. 10-83 సెంట్లు సౌకర్యములలో సాటిలేనిది- ప్రత్తిపంటకును, పెద్దరైలు చిన్నరైలుకును కూడలి- 10 అడుగుల లోతులో ప్రశస్తమైన మంచినీరు-శింగరేణిబొగ్గు, కూలి, కట్టడపు సామానులు మిగులచౌక-సరుకు విడుదలకు అనుకూలము.

కట్టడములు:—ముందు పెంచుటకు వీలగునట్లుగా మిల్లుకట్టడములు ప్రస్తుతపద్ధతుల ప్రకారము, ఇతర చోట్లకన్న సగముఖరీదుకే పూర్తికావచ్చినవి.

ఎంజిను బాయిలర్లు:—నాల్గువందల గుర్రముల పవరుగల ఎంజినుయు, మరియు 30′-7′-6″ పరిమాణముగల లాంకషైరు బాయిలరు, చౌకలో కొనబడి స్థాపించబడినవి.

మిల్లుసామానులు:—నూరు మరమగ్గములు, అందుకు కావలసిన ప్రిపరేటరీ సామానులు స్థాపన చేయబడుచున్నవి.

మేనేజిమెంటు:—మేనేజింగు యేజంట్ అండ్ డైరక్టర్ గారు యింతవరకు ఏవిధమైన ప్రతిఫలమును కోరకయే, అతి సమర్థతతో పనులను విశేషవ్యయము లేకుండ నెరవేర్చుచున్నారు. వారును మరీ వక డైరక్టరుగారును హెచ్చుషేర్లు వేసినారు.

పనులు:—మొదట సుమారు మూడునెలలో నేతపని ప్రారంభించబడును. ఒకసంవత్సరములోపుగా నూలువడుకుట కూడ సాగింపబడును. ఇతర వివరములు తెలిసికొనుటకు చిరునామా:—

**గూడూరి లక్ష్మణరావు, బి. ఏ.,** మేనేజింగ్ ఏజంట్ అండ్ డైరక్టర్, బెజవాడ.










**పవెల్ అండ్ కో వారు, చేసిన ప్రత్యేకశస్త్రచికిత్సలు**

అన్నిరకములలో ట్రస్సులను సరఫరా చేయుదురు. అవి ప్రత్యేకసమర్థత గలిగినవారి యాజమాన్యముక్రింద మంచి చతురత, అనుభవము గలిగినట్టి పనివారిచే తయారు చేయబడినవి. ఎవ రెవరికి ఏ కొలతలలో కావలెనో తెలిపిన అదే ప్రకారము తగినవి తయారు చేసి పూచీగా పంపబడును.

వాటి అబ్డామినల్ సపోర్టులు శారీర శాస్త్రసంబంధమైన నియముల ననుసరించి తయారు చేయబడును.

ఎలాస్టిక్ స్టాకింగులలో వారు చాలా వ్యాపారమును జరుపుచున్నారు. ప్రత్యేక కొలతలలో కావలసినవి మిక్కిలి శ్రద్ధతో తయారుచేసి పంపబడును. వైద్యశాస్త్రజ్ఞులచే గొప్పగా శిఫార్సు చేయబడునట్టి సస్పెన్ సరి బాండేజీలు, హైడ్రోసిలి (వరిబీజము) సస్పెన్డరులు, మిగ్రాసస్పెన్డరులు మొదలగునవి వీరిచే తయారుచేసి పంపబడును.

ఇతర వివరములకు ఈ విలాసమునకు వ్రాయవలెను:— **N. POWELL & Co., BOMBAY No. 4.**

# Krishna Brand Rose Water.




## శ్రీ కృష్ణ మార్కు గల పన్నీరు సీసాలు

**మేలిమి సువాసనగల పన్నీరు,సీసాలలో నింపబడి సప్లయిచేయబడుచున్నాము.**

పెండ్లిండ్లు ఆదిగాగల శుభ కార్యములకు వాడుకొనుటకు చాల చౌకగాను సప్లై చేయబడును.

టోకుగా ఆర్డరు యిచ్చినవారికి సరసమగు ధరలు.

వకమారు వాడిచూచిన వారికి దీని నిజానిజములు బోధపడగలవు.

| | | రు. | అ. | పై |
|---|---|---|---|---|
| సూరత్ పన్నీరు | పెద్ద సీసా | 1 | 10 | 0 |
| ,, | అర్ధ సీసా | 0 | 13 | 0 |
| శ్రీకృష్ణా బ్రాండ్ పన్నీరు | నిండు సీసా | 1 | 6 | 0 |
| ,, ,, | అర్ధ సీసా | 0 | 11 | 0 |
| ,, | కాలు సీసా | 0 | 6 | 0 |
| నెం 80 రు పన్నీరు | నిండు సీసా | 0 | 15 | 0 |
| 404 ,, | ½ సీసా | 0 | 7 | 0 |
| నెం 4 రు కొండకృష్ణుని గుర్తు పన్నీరు సీసా | | 0 | 5 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| Surat Rose water full Bottle | | Rs | 1 | 10 | 0 |
| ½ ,, ,, | | ,, | 0 | 13 | 0 |
| Krishna Brand full Bottle | | ,, | 1 | 6 | 0 |
| ½ ,, ,, | | ,, | 0 | 11 | 0 |
| ¼ ,, ,, | | ,, | 0 | 6 | 0 |
| No. 80 ,, ,, | | ,, | 0 | 15 | 0 |
| No. 404 ½ ,, ,, | | ,, | 0 | 7 | 0 |
| No. Mala Krishnan ½ ,, | | ,, | 0 | 5 | 0 |

వ్యాపారులకు మంచికమీషన్ యివ్వబడును.

మా పై విలాసము.

**యం. దొరస్వామిశెట్టి కంపెని,** రాసప్పశెట్టివీధి, మద్రాసు.

# Ground-Nut Decorticator or Opener

# గ్రౌండునట్ డెకార్టికేటరు లేక ఓపనర్లు

## అభివృద్ధిచేయబడిన ఎంజిను చేతితో త్రిప్పవచ్చును.




1922, 1923 సంవత్సరములందు డిశంబరు నెలలో జరిగి హిందూదేశీయ పరిశ్రామిక వస్తుప్రదర్శనమునందు బంగారు పతకములు బహుమతిగా నియ్యబడినవి.

యంత్రసహాయముచే నడుపబడు వేరుశెనగకాయనుండి పప్పును తీయు యంత్రములు లేక ఓపనరులు ఏ, బి. సి. అను మూడురకములు గలవు. అవి 5, 6, 7 బి. హెచ్. పి. ఎంజనులచేనడుపబడి 80 మూటలు, 100 మూటలు 120 మూటలు గింజనురోజు 1 కి 12 గంటల సేపుపనిచేసిన తయారగును.

1500 మెషినులు అంతకు పైననే మాచే తయారు చేయబడి చెన్నపురి, బొంబాయి రాజధానులలోనున్న మా కాతాదారులకు సరఫరా చేయబడినది. మిక్కిలి శ్రేష్ఠమైనదని, చాల ఉపయోగకరమయినదని మా కాతాదారులే అంగీకరించియున్నారు. మద్రాసు, కడప, హిందూపురం, కర్నూలు, నంద్యాల, బెజవాడ, విశాఖపట్టణము, కాకినాడ, అంబూరు, రాణిపేట, ఆర్కాడు, మైసూరు, దేవన్ గేరి, తుముకూరు, సేలం, తంజావూరు, పొల్లాచి, తిరుప్పూరు, మధుర, కోయంబుత్తూరు, బొంబాయి, సూరత్, పూనా, బెల్గామ్, కొల్హాపురము, సతార, గడగ్, శంగ్లి, ధూలియా, అమల్ నేరు, గేయాన్, పోర్బందరు, జామ్‌నగరు, చాలిస్, మొదలగు ముఖ్యస్థలములందు మాడెకార్టికేటరులు పనిచేయుచున్నది.

చేతితో నడుపబడు గ్రౌండ్ నట్ డెకార్టికేటరుగూడ పైన ముద్రింపబడిన ప్రతిమప్రకారమే యుండును. ఇద్దరు మనుష్యులపనిచేసిన ఒక గంటకు ఒక మూట గింజలు తయారగును. ఈయంత్రమును మేము నూతనముగా 6 నెలలకు మునుపే తయారుచేసితిమి. పైన తెలుపబడిన ప్రదర్శనమునందు దీనికి ఒక బంగారు పతకము బహుమతిగా నియ్యబడియున్నది. బొంబాయి షోలాపురము, హైదరాబాదు, దక్కను, ధూళియా, అకోల మున్నగు జాగాలకు సుమారు యీ నూతన యంత్రములను 50 సరఫరా చేసియున్నాము.

చిత్రవిచిత్రములతో వివరముగా తెలుపబడిన మా ఆంగ్ల క్యాటలాగునకు వ్రాసిన పంపబడును.

| BHIDE & SONS<br>Sangli, S. M. C. | భైడ్ అండుసన్సు, ఎంజినీర్లు,<br>శంగ్లి, ఎస్. ఎమ్. సి. |
|---|---|

